సమాజము, రాజనీతి

# ఉదారవాదము

ఒక పరిశీలన

## చెస్టర్ బౌల్స్

[వ్యాసాలూ, ఉపన్యాసాల
సంగ్రహాలు]

కూర్పు :

హెన్రీ స్టీలే కమ్మేజర్

తెలుగు :

'వాణీకుమార'

ప్రచురణ

యం. శేషాచలం & కో.

మద్రాసు

మచిలీపట్టణం : : సికిందరాబాదు

1965

రూ. 6

SAMAJAMU, RAJANEETI - UDARAVADAMU: Telugu Translation of Chester Bowles' 'The Conscience of a Liberal' by 'Vanikumara'. Published by M. Seshachalam & Co., Madras-1: Machilipatnam: Secunderabad. **Price: Rs. 6.**

*First Edition: July, '65.*

**Cover Design: Gangadhar.**



PRINTED AT
FREEDOM PRESS, MADRAS-21.

# విషయానుక్రమణిక

జీవకారుణ్య విప్లవాన్ని ఆశించే సాధనాలన్నీ ఐక్యతను ఉద్దేశించేవి కాగా, రాజకీయ విప్లవాన్ని వాంఛించే వత్తిడులన్నీ మానవులను విభజించేవిగా వున్నవి.

ఇప్పుడు మహావిప్లవవేదనలో తగుల్కొని వున్న యూరపేతరప్రపంచం ఒక్క పెద్ద అంగతో యూరోపియన్ ప్రపంచాన్ని అందుకొని దానికి సమఉజ్జీ కావాలని చూస్తున్నది. యూరోపియన్ ప్రపంచం ఇంతకాలంగా అనుభవిస్తూ వున్నట్టి ఉన్నతజీవనప్రమాణాలను స్వీకరించి ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికాలు ప్రగతివిషయంలో యూరపుకంటె కొన్ని శతాబ్దాలు వెనుకబడివున్నవి. ఈ లోపాన్ని ఒక్కతరంలో పూరించవలెనని యూరపేతరప్రపంచం ఆరాటపడుతున్నది.

ఈ కొత్తదేశాలు జాతిసంబంధమైన, మతసంబంధమైన, సిద్ధాంతసంబంధమైన స్పర్ధలూ, సంఘర్షణలూ, కోపతాపాలూ లేకుండా స్వాతంత్ర్యాన్నీ, సంస్కరణలనూ పొందగలవా? మనమంతా తెలిసో తెలియకో తెగించి ఒకానొక పోటీలో చిక్కుకున్నాము. ఈ పోటీ ఐక్యతనూ, ప్రగతినీ, సౌభాగ్యాన్నీ వాంఛించే దయాళుత్వ స్వభావం గల శిష్టశక్తులకూ, విచ్ఛిన్నతనూ, యుద్ధాన్నీ, సర్వనాశనాన్నీ అభిలషించే ద్వేషస్వభావం గల దుష్టశక్తులకూ మధ్య జరుగుతున్నది.

పాశ్చాత్యలోకపు బారినుండి తప్పించుకొని స్వాతంత్ర్యం పొందజూచే శక్తులు బలీయమవుతాయా, లేక పాశ్చాత్యలోకపు సహాయాన్ని పొందగోరే శక్తులు ప్రబలమవుతాయా? రాజకీయ వేరుపాటుధోరణి బలీయమైనదవుతుందా, లేక సహకారాన్నీ, సఖ్యతనూ వాంఛించే శక్తులు బలపడుతాయా? హింసాత్మకవిప్లవంద్వారా లక్ష్యాన్ని సాధింపజూచే శక్తులు నెగ్గుతాయా, లేక పరిణామంద్వారా పురోగతిని సాధింపప్రయత్నించే శక్తులు చివరకు జయిస్తాయా?

పీడకలలవంటి ఈ ప్రశ్నలు ఈనాడు ప్రపంచంలో ప్రతిదేశరాజకీయవేత్తలనూ వేధిస్తున్నవి.

ఈ సమస్యలలో చాలావాటికి పాశ్చాత్యలోకానిదే బాధ్యత. ఇవి పాశ్చాత్యలోకానికే బాగా తెలుసు. వీటిని తట్టుకోగల స్తోమత పాశ్చాత్యలోకానికే వుంది. చరిత్రలో ఇట్టి విపత్కరఘట్టంలో పాశ్చాత్యలోకం చూపే వివేకముపైనా, తెలివితేటలపైనా, ఔదార్యంపైనా భవిష్యత్తు స్వరూపం ఆధారపడివుంటుంది.

ఇదిగో ఇక్కడే అమెరికాకు మంచి స్థానబలం వుంది. యూరపులో చాలా దేశాలు ఆసియా ఆఫ్రికాఖండాలలో సామ్రాజ్యాలు సృష్టించుకొని అచటి ప్రజలను తమ స్వలాభం కోసం పీడించుకుతినగా అదృష్టవశాత్తూ అమెరికా సామ్రాజ్యవాదానికీ, వలసవాదానికీ దూరంగా వుంది. కనీసం అమెరికాఖండం వెలుపల అమెరికాసంయుక్తరాష్ట్రాలకు చెడ్డపేరేదీ లేదు.

కనుక ఈ 'చీకటి' ఖండాల ప్రజలవద్దకు అమెరికన్లు నిస్సంకోచంగా వెళ్ళవచ్చు.

వెనుకటి చెడ్డపేరువల్ల వా రే మనుకుంటారో అన్న భయం అమెరికనులకు అక్కరలేదు. పైగా స్వయంపాలన విషయంలో, స్వాతంత్ర్యం విషయంలో, ప్రజాచైతన్యం విషయంలో అమెరికాకు బహుకాలంనుంచీ వస్తూవున్న సంప్రదాయాలు కొన్ని వున్నవి. ఇవి ఆసియా ఆఫ్రికా ప్రజలకు ఆశలు కలిగిస్తాయి; వారికి ఉత్సాహోద్వేగాలు కలుగజేస్తాయి.

అమెరికన్లకు సంపద వుంది. తెలివితేటలున్నాయి. స్వపరిపాలనలో అనుభవం వుంది. అమెరికన్లంటే ప్రపంచంలో సుహృద్భావం వుంది. అది పెన్నిధివంటిది. చరిత్రలో విషాదకరసంఘటనలకు అమెరికన్లు అవకాశ మివ్వలేదు. కాబట్టి ఈ యోగ్యతలన్నింటితో పాశ్చాత్యలోకంలో తక్కిన అందరికన్న అమెరికన్లే ప్రపంచంలో కొత్తదేశాలకు సహాయపడగల స్థితిలో వున్నారు.

అయితే కొన్ని ఇబ్బందు లున్నమాట నిజమే. వాటిని విస్మరించరాదు. కొంతకాలంపాటు తక్కిన ప్రపంచంతో అమెరికన్లు వేరుపడివుండడంవల్ల బాధ్యత అనేది అమెరికన్లకు లేకుండాపోయింది. పాతకాలపు సామ్రాజ్యవాదమంటే అమెరికన్లకు గిట్టనందువల్ల కొంచెం సదవకాశాలు కలిగించే వలసపాలన అంటేకూడా అమెరికన్లకు సరిపడని దైంది. ఈ రెండిటితో అమెరికన్లకు ప్రమేయం లేకపోయేసరికి పాతప్రపంచ ప్రజల సమస్యలను అర్థంచేసుకోవాలంటే అమెరికన్లకు కష్టంగా వున్నది. దీనికి తోడు సామ్రాజ్యవాదాన్ని అమెరికన్లు ఖండించేసరికి ఇండియనులపట్ల, నీగ్రోలపట్ల అమెరికన్లు చూపే వైఖరిని గమనించిన పరులు అమెరికన్లకు కపటం అంటగట్టారు. అమెరికన్లు చెప్పే దొకటి, చేసే దొకటి అనుకున్నారు. తమకు సిరిసంపదలు వుండటంకూడా అమెరికన్లకొక ఇబ్బందే అయింది. పేదదేశాల ప్రజలు అమెరికా సంపత్సమృద్ధిని చూచి అసూయపడే అవకాశముంది. అనుమానించే వీలు కలిగింది. పైగా అమెరికన్లు తమ సంపదను చూచుకొని అధికారబలం సాధించలేనిదంటూ ఏదీ లేదనీ, డబ్బుపెట్టి కొనరాని దేదీ లేదనీ అనుకోవడం మొదలుపెట్టారు.

అయినా యుద్ధానంతరప్రపంచంలో అమెరికాకు కీలకస్థానం వుంది. కారణమేమంటే యుద్ధంతర్వాత ఒక్క అమెరికామాత్రమే సంపన్నదేశంగా, బలీయమైన రాజ్యంగా బైటపడింది. అమెరికాకు కావలసినంత సాధనసంపత్తి వుంది. ప్రవీణులైన పనివార లున్నారు. ఏమాత్రం మొక్కవోవని పరిపాలనాయంత్రాంగం వుంది. కనుక చరిత్రలో విషమస్థితిలో నాయకత్వాన్ని చేపట్టగల అర్హత, స్తోమత అమెరికాకు దక్కాయి.

నవప్రపంచమైన అమెరికాయే గనుక చర్చిల్ చెప్పినట్లు "రంగంలోకి దిగి పాత ప్రపంచాన్ని కాపాడి విముక్తం" చేయకపోయినట్లయితే పాశ్చాత్యప్రపంచం, యావత్ప్రపంచం ఏమై వుండేవో ఇప్పుడు ఊహించడం కష్టం. అమెరికా మార్షల్ పథకాన్ని సిద్ధం చేసి ఆ పథకాన్ననుసరించి సహాయం చేసివుండకపోతే, యుద్ధంవల్ల సర్వం పోగొట్టుకున్న పశ్చిమయూరపు ప్రజలు వారి కాళ్ళపై వారు నిలుచుకోగలిగేదాకా పునరావాసకార్యక్రమానికి అమెరికా సబ్సిడీలు ఇచ్చివుండకపోతే (ఇది ఇటీవలి చరిత్రలో మనస్తత్వరీత్యా చాలా

ముఖ్యమైంది), సమీపప్రాచ్యంలో బ్రిటన్ కలుగజేసిన శూన్యస్థితిలోకి అడుగిడి ఆ ఖాళీని పూరించి వుండకపోతే, కొరియాసమస్య విషయంలో కృతనిశ్చయంతో వ్యవహరించి వుండకపోతే, 1950 ప్రాంతాలలో ముట్టడికి గురికాగల ప్రజలను రక్షించడానికి సంసిద్ధులయి వుండకపోయిన ట్లుంటే చరిత్రగతి ఇప్పటివలె గాక మరొకవిధంగా వుండేది.

అమెరికా భవిష్యత్తు ఎలా వుండబోతుందో ఏమోగాని చరిత్రలో ఈ విషమదశాబ్దిలో అది లేచి నిలబడి అన్ని రకాల సవాళ్ళనూ ధైర్యంతో ఎదుర్కొంది. వివేకంతో, సాధనసంపత్తితో, సాహసంతో పాశ్చాత్యలోకం బ్రతికి బట్టకట్టేట్టు చేసింది. రానున్న బాధ్యతలను నిర్వర్తించేందుకు తగు బలాన్ని పుంజుకొనే అవకాశం పాశ్చాత్యులకు కలిగించింది.

ప్రపంచంలో బలీయమైన రాజ్యం కావడానికి బ్రిటనుకు నూరేండ్లు పట్టింది. పాత ప్రపంచంలో మరేరాజ్యమూ బలీయంకాగల కిటుకును నేర్చుకోలేకపోయింది. స్పెయినుగాని, ఫ్రాన్సుగాని, జర్మనీగాని, రష్యాగాని, ఆమాటకొస్తే జపానుసైతం ఆ కిటుకును నేర్చుకోలేకపోయాయి. మరి ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే, నిష్కాపట్యానికీ, విశాలహృదయానికీ, కార్యసాధనకూ తనకు తగు స్తోమత వుందన్న విషయాన్ని అమెరికా కనుగొన్నది. ఆత్మజ్ఞాన మంటే ఇదేనేమో!

ఇరవైయేండ్లలో అమెరికా ఎంత నేర్చుకున్నదో గమనించండి!

ఈ ప్రపంచం నిజంగా ఏకప్రపంచ మనీ, ఏ దేశాని కా దేశం ఒక దీవి కాదనీ, ప్రతిదేశప్రజల దురదృష్టాలకూ, వైఫల్యాలకూ, విపత్తులకూ, శ్రేయస్సుకూ మనకూ కొంత బాధ్యత కలదనీ అమెరికా గ్రహించింది.

ఈ జగత్తులో యూరోపియన్ ప్రపంచానికీ, శ్వేతప్రపంచానికీ, క్రైస్తవ ప్రపంచానికీ ప్రత్యేకంగా సానుకూలమైన స్థాన మేదీ లేదనీ, వారుమాత్రమే దైవానికి ముద్దుబిడ్డలు కారనీ అమెరికా తెలుసుకుంది.

ఈ ప్రపంచాన్ని అమెరికా ప్రపంచం, రష్యన్ ప్రపంచం అని విభజించడానికి వీలు లేదనీ, నిజానికి ఈప్రపంచం అనేకబలాలుగా విభజితమై వుందనీ, రెండు ప్రపంచా లనే భావనపై ఆధారపడ్డ ఏవ్యూహమైనా విఫలం కాకతప్పదనీ అమెరికాకు తెలియవచ్చింది.

ఇతరజాతులపై, చివరకు బలహీనజాతులపై సైతం తమ ఇష్టాయిష్టాలను రుద్దజాలమనీ, ఆర్థికవిషయాలలో రాజకీయాలలో ఇతరులు తమ భావాలను, తలంపులను అవలంబించాలనో, లేక ఆమోదించాలనో ఆశించడం సబబుకాదనీ అమెరికా తెలుసుకుంది.

తటస్థంగా వున్న వారిపై వత్తిడి వేసి వారు ఏదో ఒక పక్షంలో చేరిపోవా లని బలవంతం చేయ ప్రయత్నించరా దనీ, తటస్థవాదాన్ని అర్థంచేసుకొని ఆమోదించాలనీ అమెరికా గ్రహించింది.

మానవులకు అతిముఖ్యమైన సహాయం, పునరావాసం వంటి విషయాలలో ఇతర

దేశాలతో, చివరకు వైరిదేశాలతో సైతం సహకరించి అంతర్జాతీయ సంస్థలద్వారా కృషి చేయాలనీ అమెరికా తెలుసుకుంది.

దాదాపు ప్రతిపరిస్థితిలో సైనికసహాయం కన్న ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక సహాయం మిక్కిలి ప్రయోజనకరమైందని అమెరికాకు అవగతమైంది.

శక్తికి, చివరకు అణుశక్తికి కూడా పరిమితు లంటూ వున్నాయనీ, సైనికశక్తికి పరిమితు లనేకమనీ అమెరికాకు బోధపడింది.

విదేశాంగవిధానంలో అమెరికన్లంతా చిక్కుకొని వున్నారు. జాతి మొత్తమే చిక్కుకొని వుం దన్నమాట. వారి హయాంలో శాంతిలేదు. ఇబ్బందులు, విపత్తులు సహజమైపోయినవి. ఇంతకాలంగా ప్రపంచప్రజలను దాధిస్తూవున్న ఆపదలనుండి అమెరికా దూరంగా వుండ జాలదనీ అమెరికాకు తెలిసివచ్చింది.

ఇప్పుడంటే ఇవన్నీ వారికి అవగతమై మామూలు విషయాలవలె తోస్తున్నాయి. కాని వారి విదేశసంబంధాల మొత్తంచరిత్రలో, బహుశా వారి దేశచరిత్రమొత్తంలోనే వా రీస్థితికి రావడానికీ, ఇలా మెత్తబడి వాస్తవాన్ని బోధపరచుకోవడానికీ ఎన్నో అంచెలు దాటి, ఎంతో పురోగమించవలసివచ్చింది.

* * *

**ఈ పురోగమనంలో** ఒక మేలు కలిగింది. ఒక కొత్తరకం ప్రభుత్వోద్యోగి ఆవిర్భవించాడు—అతడు మామూలు ప్రభుత్వోద్యోగి కాడు: అంతర్జాతీయప్రభుత్వో ద్యోగి. అతడు ఒక ఖండంనుంచి మరొక ఖండానికి ప్రభుత్వం పనుపున పోతూ వుంటాడు. సమస్యలు చర్చిస్తూవుంటాడు. పూర్వపు రాజనీతిజ్ఞులకు మెసాచూసెట్స్, అల బామా, మిన్నెసోటా, ఓరెగాన్ సమస్యలు ఎంత బాగా తెలుసో అతనికి ఇండియా, బొలీ వియా, కాంగో, తైవాన్ దేశాల సమస్యలు అంత బాగా తెలుసు. తాను ఒక వర్గానికి, లేక ఒక ఆర్థికవ్యవస్థకు, లేదా ఒక రాజకీయవిధానానికి ప్రతినిధి నని అతను అనుకోడు. మానవశ్రేయస్సు తన ధ్యేయ మని అతని విశ్వాసం.

ఇంతకు పూర్వం—ముఖ్యంగా పద్దెనిమిదవ శతాబ్దిలో ఇట్టి దృష్టాంతాలు కొన్ని వున్నాయి. బెంజమిన్ థాంప్సన్ రాయల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లండన్ అధ్యక్షుడుగానూ సమర్థతతో పనిచేశాడు; బవేరియా ప్రధానమంత్రిగా కూడా బాగా పనిచేశాడు. ఆంద్రీస్ బెర్న్‌స్టార్ఫ్ జర్మన్ స్టేట్సుకోర్టులనుండి అతిసులభంగా డెన్మార్కు దర్బారుకు వెళ్ళగలి గాడు. ఇంకా వోల్టేర్, కండోర్సెట్, ఫ్రాంక్లిన్, థామస్‌పేన్‌వంటి మహనీయులు తాము మానవాళికి సేవకుల మని భావించారు. కాని ప్రపంచంలోని చాలా ప్రాంతాలలో ఆధునిక జాతీయతత్వం దీని నంతటినీ అంతం చేసింది.

ఇప్పుడు మళ్ళీ అంతర్జాతీయ విద్వాంసులు, అంతర్జాతీయశాస్త్రవేత్తలు, అంతర్జాతీయ రాజకీయవేత్తలు మళ్ళీ ఆవిర్భవిస్తున్నారు. వీరు ఇతరులకు సేవ చేయడంద్వారా తమ

తమ దేశాలకు సేవ చేస్తూ వుంటారు. నార్వేకు చెందిన నాన్సెన్, బెల్జియందేశీయుడు స్పాక్, ఫ్రాన్సుదేశపు ప్రముఖుడు జీన్ మాన్నెట్, బ్రిటన్ నాయకుడు చర్చిల్, ఇంకా హామర్స్కోల్డ్, మిర్డల్, బాయడ్ ఓర్, ఊ థాంట్, విజయలక్ష్మిపండిట్, చార్లెస్ మాలిక్, ఎలీనార్ రూజ్వెల్టు, స్టీవెన్సన్ మున్నగువారు కళ్ళముందే రూపొందుతూవున్న ఒక నవ ప్రపంచానికి నాయకత్వం సమకూరుస్తున్నారు.

ఇతన్ని ప్రభుత్వోద్యోగి అనడంకంటె ప్రజాసేవకుడు అని అనడం సబబేమో: ఇతని గుణవిశేషా లేమిటి?

మొదటిది—ఇతడు సంకుచిత జాతీయతత్వపు పరిమితులనుంచీ, తలంపులనుంచీ బైటపడి దూరదేశాల ప్రజల భావాలను సానుభూతితో అర్థంచేసుకోగలుగుతాడు. తెలివితో గాక తనకు గల సహజజ్ఞానంతోనే అన్నిజాతుల, అన్నిదేశాల సమానత్వాన్ని ఆమోదిస్తాడు. తాను ఏదేశంలో పెరిగాడో దానికి సంబంధించినవేగాక ఎక్కడో దూరదేశాల ప్రజల బాగోగులను, అలవాట్లను, ప్రయత్నాలను, సంస్కృతులను అవగాహన చేసుకోగలుగుతాడు.

రెండవది—అతడు తన గతంతో, తన వర్తమానంతో మాత్రమే సరిపెట్టుకొని వుండడు. కసితో ప్రపంచాన్ని పునర్నిర్మిస్తూ వున్న చరిత్రధోరణులను, విజ్ఞానశాస్త్రపు పోకడలను అర్థంచేసుకోగలుగుతాడు. సామ్రాజ్యవాద అవశేషాలనూ వలసవాదపు చిహ్నాలనూ, ఒకజాతి మరొక జాతిని పీడించడాన్నీ, ఒక ఖండం మరొక ఖండాన్ని అణచడాన్నీ తుడిచిపెడుతూ వున్నట్టి శక్తులతో కలిసి పనిచేయ సంసిద్ధు డవుతాడు. ప్రపంచమంతటా రూపొందుతూవున్న నూత్నవ్యవస్థలో తన దేశపుస్థాన మేదో చక్కగా గుర్తింపగలుగుతాడు.

మూడవది—చరిత్ర, రాజకీయాలు అనేవి ఒక పెద్ద అల్లికవంటివని, ఆ అల్లికలోని పోగులు ఒక శివారునుంచి మరొక శివారుకూ, ఒక గ్రామంనుంచి మరొక గ్రామానికీ, ఒక పట్టణంనుంచి మరొక పట్టణానికీ, ఒక దేశంనుంచి మరొకదేశానికీ, ఒక ఖండంనుంచి మరొక ఖండానికీ విస్తరించివుంటాయనీ అతనికి తెలుసు. వేరుపాటుధోరణి అనేది—అది విజ్ఞాన సంబంధమైనదైనా, నైతికమైనదైనా, ఆర్థికమైనదైనా, రాజకీయమైనదైనా—ప్రస్తుతం పనికిరాదనీ, అది వెనుక గాబట్టి సరిపోయిందనీకూడా అతనికి తెలుసు. ఈనాడు బర్మాలో, లేక కాంగోలో ఏమి జరిగినా అది కన్నెక్టికట్ పౌరునికీ, యార్క్షైర్ పౌరునికీకూడా సంబంధించినదే ననీ, లేని వారికి ఆహారం, మందులు, పనిముట్లు, యంత్ర సామగ్రి, స్కూళ్ళు, లైబ్రరీలు, ఆసుపత్రులు, విశ్వవిద్యాలయాలూ సమకూర్చే మహా ప్రయత్నంలో అమెరికన్లు నిమగ్నులైవున్నా రన్న సంగతి అత నెరుగును. స్వాతంత్ర్యం కూడా ఏకఖండికవంటి అల్లిక అనీ, ఎంతటి హీనులకు ఏమిచేసినా అది సర్వ మానవాళికీ చేసినవారవుతారనీ, స్వాతంత్ర్యానికీ, ప్రజాస్వామ్యానికి సరియైన గీటురాయి ఏమిటంటే—వాటిని వారు స్వదేశంలోనూ తు. చ. తప్పకుండా అమలుజరపాలి. విదేశాలలోకూడా వాటిని సమర్థించి వాటికోసం పోరాడాలి.

నాల్గవది—అతడు ఆదర్శవాది. వ్యవహారవేత్త. సాధ్యాసాధ్యాలు ఎరిగిన పాలకుడు. గట్టి బుర్ర గలవాడు. దృఢమనస్కుడు. అవసరమైతే మోటుమనిషి అవుతాడు. మొండి కేస్తాడు. పరిపాలనకు సంబంధించిన దైనందిన సమస్యలతో అతనికి అనుభవం కావాలి. తన కప్పగించిన పనులు చేసి ఫలితాలు చూపాలంటే వట్టికబుర్లు చెప్పి ప్రయోజనం లేదనీ, పైకి దొడ్డబుద్ధి కనపరచినంతమాత్రాన సరిపోదనీ అతను తెలుసుకోవాలి: తెలుసుకుంటాడు.

"ఇట్టి అంతర్జాతీయప్రజాసేవకుడు ఎవరు? ఒక నిదర్శనం చూపండి" అని ఎవరైనా ప్రశ్నిస్తే "చెస్టర్ బౌల్స్" అని సమాధానం చెప్పవలసివస్తుంది.

"1924 లో కాలేజిసీనియర్‌గా వున్నప్పుడే నేను నా జీవితాన్ని ప్రభుత్వంలో గడపా లని నిర్ణయించుకున్నాను" అని బౌల్స్ ఒక సందర్భంలో వ్రాశాడు. యేల్‌లో 1924 తరగతిలో చదివినవారిలో ప్రభుత్వోద్యోగం, తద్వారా ప్రజాసేవ అంటే ముగ్గురు నలుగురికి మాత్రమే శ్రద్ధాసక్తు లుండేవనీ, వారిలో తానొకడి ననీ ఆయనే చెప్పుకొన్నాడు. ఇందులో చాలా అర్థముంది. కాని తొలికాలపు ఈ కోర్కెను పరిస్థితులు భంగపుచ్చాయి. అయినా ఆ కోర్కె పూర్తిగా నిర్మూలింపబడలేదు. 1941 లో అమెరికాకు యుద్ధం రాగానే బౌల్స్ ప్రైవేటురంగంనుంచి ప్రభుత్వరంగానికి మారాడు. గత రెండు దశాబ్దాలుగా తన శక్తియుక్తుల నన్నిటినీ వినియోగించి ప్రభుత్వసేవ చేస్తున్నాడు.

శ్రీబౌల్స్ జీవితంలో నాలుగు ముఖ్యదశ లున్నాయి. మొదటి దశ యుద్ధకాలంలో పబ్లిక్ సర్వీసుకు పిలుపు రూపంలో వచ్చింది. మొదట అధ్యక్షుడు రూజ్వెల్టు క్రింద ప్రైస్ ఎడ్మినిస్ట్రేటర్‌గా, తర్వాత ఐక్యరాజ్యసమితిలో ట్రిగ్వీలీకి ప్రత్యేక సహాయకుడుగా పనిచేసి రాజకీయాలలో, పరిపాలనా విషయాలలో కొన్ని పెద్ద గుణపాఠాలు నేర్చుకున్నాడు. ఆపిమ్మట ప్రపంచపర్యటన చేసి ప్రతిఖండంలో, ప్రతిదేశంలో సుపరిచితుడయ్యాడు. ఆ పరిచయాలే అతను మార్షల్ పథకం ఆవిర్భవిస్తుందని చెప్పగల వ్యాసాన్ని 1947 లోనే వ్రాసేట్టు చేశాయి. ఆ రచనను నే నీ సంపుటంలో చేర్చాను.

రెండవ దశ—కన్నెక్టికట్ రాష్ట్రగవర్నరుగా ఆయన ఎన్నికకావడం. ఈ పదవిలో వుండడంవల్ల ఆయనకు అట్టడుగు ప్రజాస్వామ్యాన్నీ, ప్రాతిపదిక ఔదార్యవాద ప్రాముఖ్యాన్నీ తెలుసుకొనే అవకాశం కలిగింది. స్థానికవ్యవహారాలకూ దేశవ్యవహారాలకూ, ప్రపంచవ్యవహారాలకూ గల బీరకాయ పీచుసంబంధం ఆయనకు ఈ ఉద్యోగంవల్లనే తెలిసివచ్చింది. రైతాంగాన్నీ, గ్రామీణులనూ, ఫ్యాక్టరీకార్మికులనూ, ఆఫీసుపనివారలనూ సంబోధించే అలవాటుకూడా ఆయనకు అక్కడే కలిగింది. ఆ అనుభవమే ఆయన అనేక దేశాలలో, అనేకరకాల ప్రజల ముందట నిలబడి విభిన్న సమస్యలపై ప్రసంగించి ఒక సామరస్యాన్ని సాధించే అవకాశ మిచ్చింది.

మూడవ దశ—భారతదేశానికి అమెరికారాయబారిగా ఆయననియామకం. ఈ పదవి ఆయనను మరొక నాగరికతకు, మరొక ప్రపంచానికి పరిచయం చేసింది. అంతర్జా

తీయ ప్రభుత్వోద్యోగిగా, ప్రజాసేవకుడుగా ఆయనకు గల పరిజ్ఞానాన్ని వృద్ధిచేసింది. ఈ పదవిలో ఆయన ఇమిడిన తీరు, భారత వైజ్ఞానికవాతావరణానికీ, సాంఘికవాతావరణానికీ ఆయన అలవడిన వైనం, ఈపనిలో ఆయన చూపిన దక్షత, ప్రజ్ఞాప్రాభవాలు మిక్కిలి ప్రశంసనీయమైనవి. ఆయన భారతదేశంలో రాయబారిగా పనిచేసిన తర్వాత ఆయన చూపిన మార్గం ఆయనతరువాత కొత్త ఢిల్లీలో రాయబారు లైనవారికి ఆదర్శప్రాయ మవడమేగాక ఒక వాణీని సృజించింది. తక్కిన రాయబారులంతా ఆవాణీనే చక్కగా అను సరిస్తున్నారు.

ఆ పదవే అమెరికన్ ప్రజానాయకు లందరిలో ఆయనే భారతదేశాన్ని గూర్చి, దాని ఇరుగుపొరుగు దేశాలనుగూర్చి క్షుణ్ణంగా ఎరిగినవాడనీ, భారతదేశం ప్రపంచరాజ్యాలలో అగ్రశ్రేణిరాజ్య మవుతూవున్నప్పుడు, స్వేచ్ఛాయుత ఆసియారాజ్యాలలో అగ్రగణ్యమైన దిగా పైకివస్తున్నప్పుడు భారతదేశానికీ అమెరికాకూ. ఆయనే మధ్యవర్తిత్వం నెరపగల వాడనీ పేరువడనేట్టు చేసింది.

నాల్గవ దశ 1960 లో వచ్చింది. అప్పుడు శ్రీబౌల్స్ కన్నెక్టికట్‌నుంచి కాంగ్రెసుసభ్యుడుగా వున్నాడు. కాంగ్రెసుసభ్యుడుగా ఆయనపదవీకాలంలో రెండవ సంవత్సర మది. ఆ సంవత్సరమే ఆయన సెనేటర్ కెన్నెడీకి విదేశాంగవిధాన సలహా దారుగా నియమితు డయ్యాడు. వెంటనే డెమోక్రటిక్ పార్టీ నేషనల్ కన్వెన్షన్‌కు ప్లాటు ఫారంకమిటీ అధ్యక్షు డయ్యాడు. అంటే డెమోక్రటిక్ పార్టీ ఎన్నికల ప్రణాళిక ఆయన చేతిలో పడిందన్నమాట.

ఆ స్థానంలో వుండి శ్రీబౌల్స్ డెమోక్రటిక్ పార్టీ ఎన్నికల ప్రణాళికకు ప్రాతి పదికలైన విదేశాంగవిధానాన్నీ, పౌరహక్కుల విధానాన్నీ, ఆర్థికవిధానాలనూ రచించాడు. ఆ ఎన్నికల ప్రణాళికలో రెండు అంశాలు ముఖ్యమైనవి; అది చాలాధారాళమైన ప్రణాళిక. స్వదేశవిషయాలలో, ప్రపంచవిషయాలలో ఎంతో ఔదార్యం కనపరచిన ప్రణాళిక. డెమో క్రటిక్ పార్టీ అంతటి ఈవి, దాతృత్వం మరెన్నడూ కనబరచలేదు. రెండవది—ఆ ప్రణాళికను సదస్సువారు అమితోత్సాహంతో, వాదోపవాదాలు అంతగాలేకుండా ఆమో దించారు.

బౌల్స్ సాధించిన గొప్ప కార్యాలలో అదొకటి. ఆ ప్రణాళికను ఓటర్లు ఆమోదించ చడం, కొత్త ప్రభుత్వంవారు దానిని చాలావరకు అంగీకరించి అమలుజరపడం శ్రీబౌల్స్ అదృష్టవిశేషం. కొత్త ప్రభుత్వంలో ఆయన విదేశాంగశాఖ అండర్ సెక్రెటరీగా, ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికా వ్యవహారాలలో అధ్యక్షుని ప్రత్యేకప్రతినిధిగా పనిచేశాడు. ఆయన ఈ కార్యరంగం సువిశాలమైనది. దాన్ని ఆయన సంతోషంతో, సద్భావంతో, సత్ఫలితాలతో నిర్వహిస్తున్నాడు.

ఇరవైయేండ్ల ప్రభుత్వోద్యోగంలో శ్రీబౌల్స్ నిరంతరం విశిష్టంగా పనిచేశాడు. ఈకాలంలో స్వదేశవిషయాలలోనూ, విదేశాంగవిషయాలలోనూ తన దృక్పథాన్ని వివరిస్తూ

7 పుస్తకాలు వ్రాశాడు. గడచిన పదేండ్లుగా విదేశాంగవిధానాన్ని గూర్చి అమెరికన్ ప్రజలను సంబోధిస్తూ ప్రసంగాలు చేస్తూ, వ్యాసాలు వ్రాస్తూ బౌల్స్‌వలె పాటుపడ్డ వ్యక్తి అమెరికా ప్రజాజీవితంలో బహుశా మరొకరులేరేమో: అమెరికాలో 41 రాష్ట్రాలలో పర్యటించి అనేకవిశ్వవిద్యాలయాలలో డెమొక్రటిక్‌పార్టీ సదస్యులలో రిపబ్లికన్ పార్టీసభ్యుల సమావేశాలలో ఆయన చేసిన ప్రసంగాలు, వెల్లడించిన అభిప్రాయాలు ఆయన ప్రతిభకు తార్కాణలని చెప్పవచ్చు.

ఫలితంగా విరామమెరుగని ఆయనమేధనుండి అనేకవ్యాసాలు, ప్రసంగాలు వెలువడ్డవి. పేరుగల పత్రిక లెన్నిటిలోనో ఆయనరచనలు ప్రకటితమైనవి. వాటిని ఆయన కాంగ్రెసు సభ్యులనుద్దేశించి వ్రాశాడు. విదేశాంగవిధాననిర్ణేతలకు తన వాదాన్ని వినిపించి వారిని తన భావాలకు సుముఖులను చేసుకోవడానికై వాటిని ప్రకటించాడు. కొన్ని రచనలు అధికారనివేదికలవంటివి. కొన్ని అప్పుడప్పుడూ లాంఛనంకోసం చేసిన ఉపన్యాసాలు. మరికొన్ని ఇష్టాగోష్ఠి ప్రసంగాలు.

ఆయన చేసిన రచనలనుంచి, ప్రసంగాలనుంచి కొన్నిటిని ఏర్చి కూర్చి ఈ గ్రంథ రూపంగా సమర్పిస్తున్నాము. ఇవి ఇంతవరకూ పుస్తకరూపంలో రాలేదు.

ఈసంపుటిని బౌల్స్ ఫెడరల్ ప్రైస్ ఎడ్మినిస్ట్రేటర్‌గా 1943 లో ప్రభుత్వసర్వీసులో ప్రవేశించినప్పటినుంచి ఆరంభించవలెనని మొదట నాకు అనిపించింది. ఆ వ్యవస్థ బ్రహ్మాండమైనది. కాని అరాజకస్థితిలో అస్తవ్యస్తంగా వుంది. బౌల్స్ తన పరిపాలనా సామర్థ్యాన్ని ప్రదర్శించి ఇంద్రజాలంచేశాడు. ప్రైస్ ఎడ్మినిస్ట్రేషన్ ఆఫీసును పునర్వ్యవస్థీకరించి దాని కొక కొత్తరూపమిచ్చాడు. అంతటితో ధరల నిర్ణాయకవిధానం సమర్థవంతమైంది. ద్రవ్యోల్బణానికి కళ్ళెంపడింది.

యుద్ధకాలపు ఈ రచనాసామగ్రిని సమీక్షించేటప్పుడు ఇందులోని విషయాలు చాలావరకు ఆయాదశలకు సంబంధించిన వన్న అంశాన్ని గమనించి ఈ సంపుటిని శాంతి సాధింపబడినప్పటినుంచి ఆరంభించి, యుద్ధానంతరం శ్రీబౌల్స్ రచనలతో నింపాను.

ఈ రచనల నన్నిటినీ స్థూలంగా రెండు భాగాలుగా విభజించాను. ఒక భాగం విదేశాంగవిధానాలకు సంబంధించినది; రెండవది దేశీయవిషయాలకు చెందినది.

ఇటీవలి కాలంలో శ్రీబౌల్స్ విదేశాంగవిషయాలలో హెచ్చుగా కృషిచేసి ఎన్నో విశేషాలను సాధించాడు కాబట్టి ఈ సంపుటిలో అధికంగా ఆ రకంరచనలే వున్నవి. ఈ విదేశాంగవిధానరచనలుకూడా అనేక విభాగాలుగా విభజితమై వున్నవి. సాధారణాంశాలు, ఆర్థికాభివృద్ధివిషయాలు, ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికాలలోని కొత్త దేశాలసమస్యలు, ప్రపంచంలో ప్రతిమూలనుంచీ మనల్ని సూటిగా ఎదుర్కొనే కమ్యూనిస్టుసవాళ్ళకు ప్రతిగా అమెరికా పరిష్కరించుకోవలసిన రక్షణసమస్యలు—ఈవిధంగా విభాగాలుగా అమర్చబడ్డవి.

స్వదేశవిషయాలుకూడా తగు విభాగాలుగా ఉపవిభజన చేయడం జరిగింది. అమెరికన్ సమాజ ఆర్థికవిషయాలు, రాష్ట్రప్రభుత్వాల బాధ్యతలు, పౌరస్వత్వాలు, పౌర హక్కులువంటి శీర్షికలక్రింద అవి కూర్చుచేయబడ్డవి.

ఈ విభజన అంతా సౌకర్యంకోసం చేయబడిందేగాని విషయాల తారతమ్యాన్ని బట్టి కాదు. ఈ రచనలన్నిటినీ అవి ఏక్రమంప్రకారం అచ్చువేయబడ్డవో ఆ క్రమం అనుసరించి చదివితే శ్రీ బౌల్స్ ప్రజాజీవితంలో ప్రవేశించినదాదిగా ఆయనభావస్రవంతి ఎంత పొందికగా, వైరుధ్యరహితంగా వుందో, ఆయనతత్వం ఎటువంటి ఏకచిత్తత కలదో విశదమవుతుంది.

ఈ సామగ్రినంతటినీ కూర్పుచేయడంలో కొన్ని రచనలను సవరించడానికీ, కొన్నిటిని సంక్షిప్తంచేయడానికీ శ్రీ బౌల్స్ నాకు అనుమతి ఇచ్చారు. ఆ అనుమతిని నేను పూర్తిగా వినియోగించుకున్నాను. అయితే కొన్నేండ్లుగా శ్రీ బౌల్స్ ఏ యే అంశాలను నొక్కిచెబుతున్నాడో, అనేకసందర్భాలలో వాటిని ఎలా ప్రస్తావిస్తున్నాడో గ్రహించి వాటికి ప్రాముఖ్యం లభించేరీతిని ఈ సంపుటిని ఏర్పకూర్చానని మాత్రం చెప్పాలి.

గడచిన రెండుదశాబ్దాలనుంచీ శ్రీ బౌల్స్ తన దృష్టిని జాతీయవిధానాలపైన శాసనాలపైన కేంద్రీకరించాడు. అవే ఈనాడు అమెరికా జాతీయచర్చనీయాంశాలుగా వున్నవి. కొన్ని అంశాలు వారింకా చేయని నిర్ణయాలకు సంబంధించినవి. ఒక దేశంగా, ఒక జాతిగా వారి బాధ్యతలను నిర్వర్తించవలెనంటే ఆ నిర్ణయాలు గైకొనకతప్పదు.

ఈసంపుటిని ఏకంగా పరిశీలించినట్లయితే ఆలోచనకూ, కార్యాచరణకూ గల సంబంధం విదితమవుతుంది. విప్లవాత్మక ప్రపంచంలో అణచివేయరాని భావాల బలం ఎటువంటిదో వ్యక్తమవుతుంది.

కాలం గడచినకొద్దీ శ్రీ బౌల్స్ స్థానికనాయకుడుగా, తరువాత జాతీయనాయకుడుగా, ఆ పిమ్మట అంతర్జాతీయవ్యక్తిగా పెరుగుతూ వచ్చాడు. ఇన్నేండ్లూ ఆయన స్వార్థరహితంగా, జాతీయలక్ష్యాల సాధనకోసం, జాతీయ అంతరాత్మను రూపొందించడానికై తీవ్రకృషి చేశాడు. గొప్పతనం సాధించాలంటే ఇదే అదను అని దేశీయులకు పదేపదే జ్ఞాపకంచేశాడు. పెరికిల్స్ సుభాషితం ఈయనకు బాగా వర్తిస్తుంది: "జీవితానందరహస్యము స్వాతంత్ర్యమని తెలుసుకొని, స్వాతంత్ర్యరహస్యం గుండెదిటవులో వుందని గ్రహించిన అతడు శత్రువుధాటినుంచి తప్పుకొని ప్రక్కగా అప్రతిఘుడై నిల్చొనలేదు.''

హెన్రీ స్టీలె కమ్మెజర్

అమ్‌హర్‌స్ట్, మెసాచూసెట్స్,
జూన్ 15, 1962

# 1

# అమెరికా సంయుక్త రాష్ట్రాలు ప్రపంచ విప్లవం

# ప్రథమ భాగమును గూర్చి

యుద్ధానంతరం నేను చేసిన రచనలను, ఉపన్యాసాలను ఏర్చి కూర్చి ఈ గ్రంథరూపంగా ప్రకటింప తోడ్పడినందుకు నేను ప్రొఫెసర్ కమ్మేజర్‌కు కృతజ్ఞుడనై వున్నాను.

ప్రథమభాగంలో నేను వేటిని మన ప్రపంచలక్ష్యాలుగా భావిస్తున్నానో ఆ లక్ష్యాల సాధనకు ఏమి చేయవలయునో పొందుపరచబడి వుంది. విదేశాంగవిధానానికి సంబంధించిన అనేకముఖ్యాంశాలపై జాతీయంగా ఉభయపక్షాల అభిప్రాయాలు ఏ విధంగా క్రమేణా పెంపొందాయో ఈ రచనలలో వ్యక్తమవుతున్నది.

ఈ ప్రజాభిప్రాయంలో బహిరంగంగా, చాటుగా దురాక్రమణ జరిగినప్పుడు దానిని తిప్పికొట్టవలసిన ఆవశ్యకత విషయంలో, అంతర్జాతీయ భద్రతాచర్యలతో సహా తగు రక్షణకవచము నేర్పాటు చేయవలసిన అగత్యం విషయంలో, దానితోపాటే ఆయుధాల పోటీ రీత్యా చూపవలసిన ఆందోళనవిషయంలో ఒకానొక ఏకీభావం గోచరిస్తుంది. ఐక్యరాజ్యసమితి ప్రాముఖ్యాన్ని అంగీకరించవలెననీ, విస్తరిస్తూవున్న ప్రపంచవాణిజ్యాన్ని ప్రోత్సహించవలెననీ, మానవాళిలో అధికసంఖ్యాకులు నివసించే ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాల ప్రాముఖ్యాన్ని ఆలస్యంగానైనా ఇకనైనా గుర్తించవలెననీ చెప్పబడివుంది.

ఈ పుస్తకాన్ని మళ్ళీ ఇప్పుడు తిరగవేస్తూవుంటే అభివృద్ధి చెందుతూవున్న దేశాల విషయంలో అమెరికన్లకు ఏవి లక్ష్యాలుగా వుండాలి, వేటికి ప్రాధాన్యమివ్వాలి, ఇత్యాది అంశాలపై అమెరికన్లకు గల అభిప్రాయభేదాలు నాకు జ్ఞాపకమొస్తున్నాయి. కొత్త పరిస్థితు

లలో వారి జాతీయప్రజాభిప్రాయాన్ని వర్తింపజేయడంలో వారి సోమరితనం తలంపుకు వస్తున్నది.

వారి పొరుగువారైన లాటిన్ అమెరికనులపట్ల ఇరవైయేండ్లు వారు నిర్లక్ష్యభావం చూపారు. సరే, ఆలస్యంగానై తేనేమి, అభి వృద్ధికై వారితో పొత్తు కుదుర్చుకున్నారు.

ఆసియాలో వారి కార్య స్వాతంత్ర్యానికి స్వదేశంలోని భ్రమలూ, విదేశాలలో యథాస్థితిని నిలబెట్టడానికై వారుచేసిన వాగ్దా నాలూ ప్రతిబంధకాలుగా వున్నాయి.

''సోవియట్ ఉక్కుకోటను బ్రద్దలుకొట్టి, స్వాతంత్ర్య రంగా లను విస్తరింపజేయా లంటే స్వేచ్ఛాప్రియదేశాల ఆర్థిక సాంఘిక రాజకీయాభివృద్ధికి మనం ఇతోధికంగా తోడ్పడవలె''నని ప్రతి సంవ త్సరం కాంగ్రెసుసభలోని అధికసంఖ్యాకులకు నచ్చజెప్పడానికి భగీరథప్రయత్నం చేయవలసి వస్తున్నది.

ఒక శతాబ్దిపాటు తటస్థంగా, వేరుపాటుధోరణిలో వున్న అమెరికనులు ఇప్పుడు చాలా ముందంజ వేశారన్న విషయంలో సందేహం లేని మాట నిజమే. అయితే వేగంగా చాలాదూరం ముందుకువచ్చారా? అసాధారణమైన తమ జాతీయసంపదను పూర్తిగా సద్వినియోగం చేసుకుంటున్నారా?

అన్నిటికన్న ముఖ్యమైనది : వారి వంటి సంపత్సమృద్ధమైన దేశం సర్వప్రజలకు శాంతి, ఇతోధికన్యాయం ఉండే ఆదర్శ ప్రపంచం కోసం సాగే విప్లవసమరంలో భాగస్వామి కాగలదా?

ఈ ప్రశ్నలకు పందొమ్మిదివందలా అరవయ్యోపడి ఆఖరు వరకు వారు చెప్పగలిగిన సమాధానాలు ఈ శతాబ్ది శేషకాలానికి వారి ప్రపంచస్వరూప స్వభావాలు ఎలా వుండేదీ నిర్ణయిస్తాయి.

చెస్టర్ బౌల్స్

విభాగము—1

# మన ప్రపంచలక్ష్యాలు

మనలో పిరికితనం లేనివారి కనీస కర్తవ్యం ఈ తరంవారి మధ్యకు పోయి నేటికాలపు జీవిత సత్యాలకోసం వాదించడమే. ఏమి టా జీవితసత్యాలు? మొదటిది—ఈ భూప్రపంచంపై మానవుని భవిష్యత్తును గూర్చి నిరాశజెంది దానిని కొట్టి పారవేయ నక్కరలేదు. రెండవది—విపత్తుకు వారు లొంగిపో నవసరంలేదు. మూడవది—వారి రాజకీయ వివేకము వారిని వినాశమునుండి కాపాడగలదు. నాల్గవది—వారి నైతికప్రమాణాలు మృగ్యం కాలేదు; ఇంకా మిగిలివున్నవి. ఐదవది—యుద్ధం, అన్యాయం, అక్రమం అనేవి శాశ్వతమైనవిగా కనిపించినప్పటికీ అవి ఎల్లకాలాలకూ చెడ్డవేననీ, నిరంతరం వాటితో పోరాడి, ఒకరోజు మానవుడు వాటిపై దిగ్విజయం సాధించాలనీ కృతనిశ్చయులు కావడం.

జూలై 26, 1954

# 1

# చరిత్రగతిని మార్చడానికి అమెరికా కొక అవకాశం

న్యూయార్కులోగల విల్కీస్మారక భవనంలోని "స్వాతంత్ర్య మందిరం''లో 1947 జనవరి 17 తేదీన ప్రసంగిస్తూ శ్రీ బౌల్స్ అభివృద్ధి విషయంలో వెనుకబడివున్న దేశాలకు దీర్ఘ కాలిక ప్రాతిపదికపై ఆర్థిక, సాంకేతికసహాయం చేయవలసిన అగత్యం వుందనీ, నూత్నసమైక్యయూరపు నిర్మాణం జరగాలనీ ప్రతిపాదించారు.

అమెరికాకన్న తక్కువ అదృష్టానికి నోచుకొన్న పేద దేశాల అభివృద్ధి కొరకై వచ్చే ఇరవైయేండ్లలో ప్రతిసంవత్సరం అమెరికామొత్తం ఆదాయంలో నూటికి 2 వంతుల చొప్పున పెట్టుబడి పెట్టే ప్రతిపాదనను అమెరికాప్రజలు ఆమోదిస్తే చరిత్రగతినే మార్చగలరు.

విదేశాలలో అమెరికా ప్రైవేటు పెట్టుబడులకు తోడు పైన చెప్పిన మొత్తం ఖర్చుపెట్టారంటే ఈ భూప్రపంచంపై గల మహానదుల జలాలను సద్వినియోగానికి తేవచ్చు. వెల్లువలు, వరదలు రాకుండా చేయవచ్చు. గొప్ప గొప్ప విద్యుత్కర్మాగారాలను నెలకొల్పవచ్చు. కోట్లాది ప్రజల మేలుకొరకై నీటి వనరులను ఏర్పాటుచేయవచ్చు. దీనివల్ల తూర్పుదేశాలలో దక్షిణ అమెరికాలో, యూరపులో ఆధునిక రవాణా సదుపాయాలు కల్పించడానికి ఎంతైనా వీలు కలుగుతుంది.

అమెరికాప్రజలు ఈ పెట్టుబడితో ప్రపంచంలోని అనేకప్రాంతాలలో శాంతి కాలపు పరిశ్రమలను ఆధునికం చేయగలుగుతారు. ఇందువల్ల యూరపు, ఆసియా,

ఇండియా, దక్షిణఅమెరికా ఆఫ్రికాలలో ప్రజల జీవనప్రమాణం పెరుగుతుంది. అసంఖ్యాకులైన ప్రజలు ఒకరికొకరు ఖాతాదార్లు అవుతారు, ఒకరి సరుకులను మరొకరు కొని వాడుకుంటారు. పరస్పరవ్యాపారం పెరుగుతుంది. అమెరికా వ్యాపారమూ, పరిశ్రమలూ అనేకమందిని ఆకర్షిస్తాయి. ఈ విధంగా అమెరికా ప్రజలకూ, తక్కిన ప్రజలకూ సత్సంబంధాలు పెంపొందుతాయి.

అమెరికా జాతీయాదాయంలో నూటికి 2 వంతు అంటే - నాలుగుపందల కోట్ల **(4 billion)** డాలర్లు. అనగా ప్రస్తుతం రక్షణశాఖపద్దుపై పెడుతూ వున్న ఖర్చులో మూడవవంతు మాత్రమే. నాజీలపైన, ఫాసిస్టులపైన యుద్ధం చేయడానికై ప్రతినెలా పెట్టిన ఖర్చులో సగంమాత్రమే. దీనినే దుబారాఖర్చు అనీ, దుర్వ్యయమనీ అవహేళనచేసే పెద్దలున్నారు. బంగారుమామయ్య గుంజుడు మామయ్య కావడమంటే ఇదే అని వారు విమర్శిస్తారు.

ఈ విమర్శకుల దృక్పథం సరియైనది కాదు. అసలు ఇలాంటి దృష్టే దోష భూయిష్ఠమైంది. ఇటువంటి అభిప్రాయాలను లెక్కచేయకూడదని మనవి చేస్తు న్నాను. నిజంచెప్పాలంటే అమెరికా ప్రజలు పెట్టే పెట్టుబళ్ళలో ఇది మిక్కిలి తెలివితో పెట్టిన పెట్టుబడి అనిపించుకొంటుంది. ఇది ప్రపంచమంతటా కోట్లాది మానవులకు వర్ణించి చెప్పరాని ఆర్థికప్రయోజనాలను కలుగజేస్తుంది. అమెరికా విధానం అమెరికాప్రజలకు ఉన్నతజీవనప్రమాణం కల్పించడమేగాక తక్కిన ప్రాంతాల ప్రజలు ఆత్మగౌరవంతో సిరిసంపదలు బడయడానికి సహాయకారి కూడా కాగలదని అనిపించుకుంటుంది. అందుకు నాందీప్రస్తావన చేసిందంటే అమెరికా విధానం, శక్తిసామర్థ్యాలు అందరికీ విశదమవుతాయి. ప్రపంచశాంతి బీమాకు ఇంతకన్న చవుకపద్ధతి వేరొకటిలేదు.

అయితే ఇట్టి పెట్టుబడికి సంకుచితమైన రాజకీయప్రయోజనాలను షర తులుగా పెట్టకూడదు. బేషరతుగా పెట్టాలి. పోలెండు, జెకొస్లొవేకియా, యుగొ స్లావియా దేశాలకు కూడా అప్పులివ్వాలి. తూర్పుయూరపులో యుద్ధంవల్ల నాశనమైన దేశాలకూ, తక్కిన యూరపుకూ, ఆసియా, ఆఫ్రికా దక్షిణ అమెరికా దేశాలకూ ఋణాలివ్వాలి.

అయితే ఆ ఇచ్చేడబ్బు వీలైనంత హెచ్చు ప్రయోజనం కలిగేవిధంగా ఖర్చుపెట్టబడేట్టు చూడాలి. ఉదాహరణకు ప్రకృతిసంపద దేశాల సరిహద్దులకు అనుగుణంగా వుండదు. ఒకనది రెండుదేశాలగుండా ప్రవహించటం కద్దు. కనుక

ఉన్నత జీవనప్రమాణానికి ముఖ్యమైన ప్రకృతిసంపద సద్వినియోగానికి రావాలంటే ప్రపంచమంతటా ప్రాంతీయపథకరచన అధికారికంగా జరగాలి.

అక్కడ అమెరికాలో వారి అదృష్టంకొద్దీ విశాలభూభాగం వుంది. మహోన్నత పారిశ్రామికోత్పత్తికి అవసరమైన పెద్ద పెద్ద మార్కెట్లకు అది అవకాశమిస్తున్నది. ఇట్లాగే రష్యాకుకూడా విశాలభూభాగం వుంది. వారికికూడా మార్కెట్ల వెసులుబాటు వుంది. క్రమబద్ధమైన ఆర్థికాభివృద్ధిపైన, రాజకీయ అభ్యున్నతిపైన ఆధారపడ్డ శాంతి కావాలంటే తక్కిన ప్రపంచానికికూడా ఇలాంటి అవకాశాలు కల్పింపబడటం అవసరం.

ఇటువంటి ఆర్థిక ఏకీకరణకు యూరపు చక్కని అవకాశమిస్తుంది. ఈ ఏకీకరణకు దోహదమిచ్చేందుకూ, యూరపు ఆర్థిక, రాజకీయాభ్యున్నతిని త్వరితం చేసేందుకూ వారు పెట్టే ఖర్చు ఏదోఒక యూరపు ఆర్థికవ్యవస్థద్వారా పెట్టాలి. ఈ వ్యవస్థ యూరపుఖండం మొత్తానికి ఆర్థికప్రణాళికను స్థిరపరచి, సాధనసంపత్తులను కేటాయించి, ఆ ప్రణాళిక అమలుజరిగేట్టు చూడాలి.

ఆ వ్యవస్థలో యూరపువిద్యుత్తు, రవాణా, రాకపోకలువంటి సంస్థలుకూడా చేర్చుకోబడాలి. యూరపు వ్యవసాయం, ఉక్కు ఉత్పత్తి సమన్వయింపబడాలి.

యూరపు ఆర్థికవ్యవస్థకు అమెరికా ఉదారంగా సహాయపడాలి. అయితే యూరపుజాతులలో ఒకదాని కొకదానికి మధ్యవున్న సుంకాలనూ, అమెరికాజాతికీ యూరపుకూ మధ్యగల సుంకాలనూ తొలగించాలి; లేదా బాగా తగ్గించాలి. అప్పుడు సరుకులు స్వేచ్ఛగా రవాణా అవుతాయి, యూరపులోని 30 కోట్లా పైచిలుకు ప్రజల (వీరిలో వెనుక అమెరికన్లకు శత్రువులైనవారుకూడా చేరివుంటారు.) జీవనప్రమాణం క్రమేపీ వృద్ధిజెందేవిధంగా నిధులను వాడాలి. అయితే, పైన పేర్కొన్న యూరపువ్యవస్థను ఏర్పాటుచేసే సందర్భంలో జర్మనీదేశపు బలీయమైన సైనికశక్తి శాశ్వతంగా అణచివేయబడేట్టు చూడాలి. ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకొని సదరువ్యవస్థను నిర్మించాలి.

ఇట్లే దక్షిణ అమెరికా, ఆఫ్రికా, దక్షిణ ఆసియా, ఆగ్నేయాసియా, సమీప ప్రాచ్యదేశాలలో కొన్ని ప్రాంతాలకుకూడా ఉన్నత ఆర్థికవ్యవస్థలను ఏర్పాటుచేసేందుకు తగు ప్రణాళికలు సిద్ధంచేస్తే అమెరికా ఆర్థికసహాయానికి తగు ప్రాతిపదిక ఏర్పడుతుంది.

శాశ్వత ప్రపంచశాంతికై అమెరికన్లు చేసే కృషిలో మొదటిమెట్టుగా అమెరికా సాంకేతికవిజ్ఞానం, అమెరికా పారిశ్రామిక యంత్ర సామగ్రి ఒక ప్రాంతీయపథకం ప్రకారం ఎగుమతికావాలి. ఆ ఎగుమతి దండిగా జరగాలి. మంచిచెడ్డల వివక్షణతో జరగాలి. ఇతరదేశాలలో ఉన్నత జీవనప్రమాణంకొరకై జరగాలి,

వచ్చే పదేండ్లలోగాని, లేదా రాబొయ్యే తరంలోగాని ప్రపంచంలో వేయ్యేండ్ల సఖ్యత, ఒద్దిక ఏర్పడతాయని ఆశించడం తెలివితక్కువే అవుతుంది. కాని ప్రపంచశాంతినీ, మానవస్వాతంత్ర్యాన్నీ స్థాపించేందుకు అమెరికన్లు తమ ముందున్న ఒకేఒక మార్గంలో ధైర్యంతో పయనించడానికి తటపటాయించడం, జాగుచేయడం అంతకన్నా తెలివితక్కువ అవుతుంది.

# 2

## ఒక కార్యక్రమం కావాలి

గొప్ప గొప్ప మార్పులు వస్తూవున్న నవప్రపంచంలో అమెరికా విదేశాంగ విధానంలో నైతిక, ఆర్థిక, సాంఘిక అంశాలకు హెచ్చు ప్రాముఖ్యముండవలెనని శ్రీబౌల్స్ నొక్కి చెప్పారు.

న్యూయార్కు టైమ్సు మేగజైన్, ఏప్రిలు 18, 1948.

**అమెరికన్లు** 14 కోట్లా 50 లక్షలమంది మాత్రమే. ఇంతమంది రెండువందల కోట్లప్రజల మధ్య విప్లవాత్మకమైన మార్పులు వస్తూవున్న ప్రపంచంలో జీవిస్తున్నారు. ఈ పరిస్థితిలో చిరకాలం వుండే శాంతికి ప్రాతిపదికను కల్పించడానికై అమెరికన్లుచేసే కృషియొక్క జయాపజయాలు చాలావరకు అమెరికన్ల ఆలోచనలపైనా, తక్కిన స్వతంత్రప్రజలతో అమెరికన్లకు గల సంబంధబాంధవ్యాల పైనా ఆధారపడివుంటాయి.

ఒకవేళ అమెరికన్ల సైనికశక్తి నేటికన్న రెండింతలు పెరిగినప్పటికీ బలం చూపి బెదిరించి బలాత్కారంగా అమెరికన్లు తమ నాయకత్వాన్ని ఇతరులపై రుద్దలేరు. ప్రజలకు వారిపై నమ్మకముంటేనే రేపటి ప్రపంచంపై అమెరికన్ల ప్రభావం వేయగలరు. మరి అమెరికన్లని వారు నమ్మాలంటే అమెరికన్లు తమ ప్రాణమిత్రులనీ, ఆపదలో తమకు ఆదుకోగలరనీ వారికి మంచి నమ్మకం కలగాలి.

వారికి అమెరికన్లపై గౌరవభావం కలగాలంటే అమెరికన్లు మొదట వారిని అర్థంచేసుకోవాలి. అన్నిటికంటె ముఖ్యమైంది-తమ ఆర్థికభద్రతకు తగు రూపురేఖలు ఏర్పడాలి అని అవతలివారు ఆరాటపడతారు. ఆ ఆరాటాన్ని అమెరికన్లు గ్రహించి అర్థంచేసుకోవాలి.

వారిని ఒక ప్రజగా కాక, వారి ప్రభుత్వాన్ని దృష్టిలో వుంచుకొని అమెరికన్లు

ఆలోచించారంటే, ప్రజలను కదిలించే భావాలు, సిద్ధాంతాలు ఆధారంగా కాక ఎత్తులూ కీలకాలనూ బట్టి నిర్ణయాలు గైకొన్నారంటే గోతిలో పడ్డారన్నమాటే!

సాధారణ అమెరికా పౌరునికి రాజకీయప్రజాస్వామ్యం పైనేగాక ఆర్థిక ప్రజాస్వామ్యంపైనకూడా విశ్వాసం వుంది. సుదీర్ఘమైన అమెరికన్ చరిత్రలో అమెరికన్ ప్రజలు స్వార్థంతో కూడిన ఆర్థిక పెత్తందారుల ప్రాబల్యాన్ని ఎదిరించి పోరాడవలసి వచ్చింది.

ఈ పోరాటంలో అమెరికా పౌరుడు అమోఘవిజయం పొందాడు. భూములపై యాజమాన్యం, కనీసవేతనశాసనం, కార్మికసంఘాలు, సహకారసంస్థలు, సాంఘికభద్రత, ఆదాయపుపన్ను, బాలశ్రమశాసనాలు, ప్రజాపాఠశాలలు న్యాయవిహితమైన ఉద్యోగనియామకపద్ధతులు, ఇంకా అనేకమార్గాల ద్వారా అమెరికన్లు అధ్యక్షుడు రూజ్వెల్టు ప్రతిపాదించిన ఆర్థికహక్కుల పత్రంలో గల లక్ష్యాన్ని చేరుకోవడానికి పాటుపడ్డారు.

అయినప్పటికీ అంతర్జాతీయంగా ప్రజాస్వామ్యాన్నిగూర్చి అమెరికన్లు మాట్లాడేప్పుడు అమెరికన్ల దృష్టి రాజకీయప్రజాస్వామ్యంవరకు మాత్రమే పరిమితమైవుంటున్నది. ఆర్థికప్రజాస్వామ్యానికి అమెరికన్లు ప్రాముఖ్యమివ్వడమే లేదు. రైతుకు భూమిపై గల హక్కు, పట్టణంలో కార్మికునికి అవసరమైన ఆహారం, ఆవాసం, అతనికి న్యాయంగా రావలసిన వాటా, సకలదేశాల ప్రజలకు చక్కని విద్య, ఆరోగ్యం మొదలైన సదుపాయాలనుగూర్చి అమెరికన్లు గట్టిగా ఆలోచించడం లేదు.

ఇది అమెరికన్లలోపం. ఈ లోపాన్ని అవకాశంగా తీసుకొని కమ్యూనిస్టులు తామే కోట్లాది నిరుపేదలకు బంధువులమనీ, తమ శక్తి అపారమనీ చెప్పుకొంటూ ఛాతీలు విరుచుకుంటున్నారు. కమ్యూనిస్టు నాయకులు "ఆర్థికప్రజాస్వామ్యమే కమ్యూనిస్టుల ధ్యేయం. ఆర్థికప్రజాస్వామ్యమంటే ప్రభుత్వప్రణాళికా విధానం ద్వారా ప్రజల జీవనప్రమాణాన్ని అభివృద్ధిపరచడం. అమెరికావారికి రాజకీయప్రజాస్వామ్యమే పరమలక్ష్యం. దానివల్ల ఆకలిదప్పులు తీరుతాయా? వర్షం కురిస్తే తల దాచుకోవడానికి కొంప లభిస్తుందా?" అని ప్రశ్నిస్తారు. ఈ ప్రశ్నలో అసలు ప్రజాస్వామ్యంపట్లే నిరాశాధోరణి వుంది. అయితే ఇలాంటి ప్రశ్న వేసేసరికి పేదప్రజ లందరూ తాత్కాలికంగా ఆకర్షితులవుతారు.

కమ్యూనిస్టుల లక్ష్యాలలో నిజాయితీ లేకపోయినప్పటికీ ప్రభుత్వప్రణాళికా విధానం, ప్రభుత్వయాజమాన్యం, భూసంస్కరణలు మొదలగు పద్ధతుల ద్వారా ఆర్థికప్రజాస్వామ్యం సాధిస్తా మని కమ్యూనిస్టులు బల్లగుద్ది ఉపన్యాసా లిచ్చేసరికి పేదరికం, పరపీడన తప్ప మరేమీ ఎరుగని కోట్లాది నిరుపేదలకు ప్రాణం లేచి వస్తుంది. వారు ప్రభావితు లవుతారు.

కాని కమ్యూనిజంలో ఎంత పీడన వుందో, ఎంత నిరంకుశత్వం వుందో పాశ్చాత్యరాజకీయప్రజాస్వామ్య వ్యవస్థలలో పుట్టి పెరిగిన అమెరికన్లకు తెలుసు గాని ఆసియా, ఆఫ్రికా, తూర్పుయూరపు, దక్షిణ అమెరికాల ప్రజలకు సరిగా తెలియదు. కారణమేమంటే—వారి జీవితాలలో రాజకీయహింస, పీడన, క్రౌర్యం ఎప్పుడూ ఏదో ఒక రూపంలో వుంటూవచ్చాయి. ఇంతవరకూ వారు వాటికి తల ఒగ్గుతూ జీవయాత్రగడుపుతూ వస్తున్నారు.

గడచిన రెండేండ్లలో కమ్యూనిజం పలు విజయాలు సాధించింది. కనుక చరిత్ర కొక రూప మిస్తూవున్న ప్రజాశక్తుల దృష్టిని ఆకర్షించే విధంగా, వారికి సమ్మతంగా అమెరికన్ విధానాలను రూపొందించకపోయినట్లైతే భవిష్యత్తులో కమ్యూనిజం విజయపరంపరలను సాధించుకుంటూ ముందుకు పోతుంది. అమెరికన్లు వెనకేవుండిపోతారు.

యూరపు, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో ప్రపంచకమ్యూనిజం వ్యాప్తిని ఎదిరించే శక్తులు రెండు వున్నాయి. ఒకరు మధ్యయుగానికి చెందిన భూస్వాములు, ఫాసిస్టుధోరణిగల పారిశ్రామికులు, పూర్వకాలపు జమీందార్లు, శ్రీమంతులు. నియంతృత్వ మంటే తమకు అభ్యంతరం కాబట్టి వీరు కమ్యూనిజం పై పోరాటం సల్పుతున్నారా? లేదు. కమ్యూనిస్టు నియంతృత్వం వస్తే తమ హోదా, తమ బలం పోతాయన్న భయంతో కమ్యూనిజాన్ని ఎదిరిస్తున్నారు. ఇక పోతే రెండవవారు ఉదారబుద్ధి గల ప్రజాస్వామ్యవాదులు. వీరికి పోలీసురాజ్యం, హింస అంటే ససేమిరా గిట్టదు. కాబట్టి కమ్యూనిజాన్ని ఎదిరిస్తారు.

కనుక విదేశాలలో కమ్యూనిజానికి ప్రజావ్యతిరేకతను సాధించా లంటే మానవస్వాతంత్ర్య మనే అమెరికన్ సిద్ధాంతాన్ని ఆమోదించే ప్రజాస్వామ్యవర్గాలను విడువకుండా బలపరుస్తూవుండడ మొక్కటే సాధనం. కానీ అమెరికన్లు తరచు చేయడమేలేదు. ఆయా ప్రజాస్వామ్యవర్గాలు బలహీనంగా వున్నాయన్న కారణంచేతనో, లేక కొన్నివర్గాల ఆర్థికభావాలు సామ్యవాదానికి సన్నిహితంగా

వున్నాయని అభిప్రాయపడటంవల్లనో, ఒక్కొక్కప్పుడు సైనికవ్యూహం వత్తిళ్ళ వల్లనో అమెరికన్లు ప్రజాస్వామికశక్తులను సమర్థించలేకపోతున్నారు.

కొన్ని సందర్భాలలో అమెరికన్లు అభివృద్ధినిరోధకశక్తులను బలపరిచారు. ఎందుకని అడిగితే కమ్యూనిజమంటే అమెరికన్ల కెంత అయిష్టమో వారికీ అంతే కాబట్టి అని చెప్పుకున్నారు. పైగా దానిని వ్యతిరేకించడానికి బలప్రయోగం చేయదగ్గ స్థితిలో అమెరికన్లున్నారు. దీనిని కమ్యూనిస్టులు తమ ప్రచారానికి వినియోగించు కున్నారు. కోట్లకొలది ప్రజలు వారికీ, వారి భవిష్యత్తుకూ భద్రతకూ మధ్య ముఖ్య ప్రతిబంధకాలుగా వున్న ప్రతీప శక్తులతో అమెరికన్లు చేతులు కలిపారని అను కున్నారు,

మరి ఇందుకు ప్రత్యామ్నాయమార్గా లేమిటి? ఉత్తర అమెరికాలో నివసిం చని రెండు వందలకోట్ల ప్రజలతో అమెరికన్ల కీలకస్థితిని దృఢతరం చేయాలంటే మార్గ మేమిటి? యుద్ధాన్ని ఎలా నివారించగలరు? అమెరికన్లు ఎంత ప్రయత్నించి నప్పటికీ యుద్ధం తోసుకువస్తే అమెరికన్లకు అండగా వుండగలవారిని కూడగట్టు కొనే దెట్లా? అత్యధికబలం అమెరికన్లకే వుండేట్లు చేయడ మెలా? అమెరికన్లు చేయగల పనులెన్నో వున్నాయి.

మొదట అమెరికన్లు చేయవలసింది-ప్రపంచమంతటా అణచివేయబడి ఆకలితో అలమటించే ప్రజానీకం వారి ఆర్థికభద్రతకై చేస్తూవున్న కృషిని సమర్థిస్తూ సందిగ్ధం, సందేహం లేకుండా వారికి బాసటగా నిలవడం.

వారి కెన్నడో సంప్రాప్తించవలసిన ఆర్థిక, సాంఘికసంస్కరణలు వారికి లభ్యమయ్యేట్టు అమెరికన్లు వారిని సమర్థిస్తున్నారనీ, అమెరికన్ల సహాయంతో వారు ఉన్నతజీవనప్రమాణాలనూ, రాజకీయస్వాతంత్ర్యాన్నీ సాధించవచ్చుననీ వారికి నచ్చజెప్పాలి. అలాంటి నమ్మకం వారికి కలుగజెయ్యాలి,

టెన్నెసీవాలీ అథారిటీనమూనాప్రకారం టిగ్రిస్, యూఫ్రటీస్, జోర్డాన్ నదీలోయలను ఎలా అభివృద్ధిపరిచారో అలాగే తక్కిన ప్రాంతాలలోని నదీలోయల అభివృద్ధినికూడా అమెరికన్లు సాధించవచ్చు. ఈప్రాంతాల పరిపాలకులు వారి ప్రజల జీవనప్రమాణాన్నీ, విద్యా ఆరోగ్యసదుపాయాలనూ పెంపుజేసేందుకు అవసరమైన మార్పులను, సంస్కరణలను ప్రవేశపెట్టాలని అమెరికన్లు వత్తిడిచేయాలి.

యూరపు పునరుద్ధరణకార్యక్రమం ఆ ఖండంలో అమెరికన్లకు అసాధారణ

అవకాశాలు కలిగిస్తున్నది. అది నిజంగా సాహసోపేతమైన కార్యక్రమం. అందుకు మార్షల్ బాధ్యుడు. ఆ ఘనత అంతా ఆయనకే దక్కుతుంది.

అయితే ఇక్కడ ఒక ముఖ్యప్రశ్న ఉత్పన్నమవుతుంది. అమెరికన్లు డబ్బును ఎలా వినియోగిస్తారు? అమెరికన్లుచేసే కృషి అంతా సాంప్రదాయికమై పోయిన జాతీయవాదానికీ, తత్సంబంధమైన పోటీలకూ, స్పర్థలకూ దారితీస్తుందా? జాతీయవాదం విజృంభించి స్పర్థలు, కలహాలు ఏర్పడటంవల్ల నేకదా రోమనుల కాలంనుండి యూరపుఖండం యుద్ధాలకు తావలమైంది? అలా కాక అమెరికాతో స్నేహంగా వుండి శాంతియుత ప్రపంచస్థాపనలో అమెరికాకు అండగా వుండే యూరపుసంయుక్తరాజ్యాల అవతరణకు తగు ప్రాతిపదికను సృష్టించడానికి ఆచరణసాధ్యమైన పద్ధతులను అమెరికన్లు కనుగొనగలరా?

దక్షిణ అమెరికాలో అణచివుంచబడ్డ లక్షలాదిప్రజలకు తోడుగా పోయి వారికి ప్రత్యక్షసహాయం చేయవచ్చు. వారి జీవనప్రమాణాన్ని వృద్ధిపరచవచ్చు. అలా చేశారంటే దక్షిణ అమెరికాప్రజల దృష్టినేగాక సమస్తప్రజల దృష్టినికూడా ఆకర్షించి వారి నందరినీ అమెరికన్లవైపు తిప్పుకోగలరు.

భారతదేశం విషయంలోకూడా అమెరికన్లు ఈపద్ధతే అనుసరించాలి. అమెరికన్లు ఇలా చేయడం స్థావరమేర్పరచుకొంటూవున్న కమ్యూనిజంతో పోటీపడ టానికి కాదు. కమ్యూనిజ మనేది రాకముందే అమెరికన్ విధానం అమలుజరగాలి. భారతప్రజానీకాన్ని గాంధీనెహ్రూలు నిద్రనుండి లేపారు. కాబట్టి క్లిష్టమైన తొలి దశలో తగు భౌతికసహాయంతోపాటు అమెరికా సాంకేతికుల సహకారంకూడా లభ్యమైతే భారతప్రజల జీవనప్రమాణం పెరుగుతుంది.

కేవలం భౌతికసహాయం మాత్రమే చాలదు. దానితోపాటు సంగతిసందర్భా లను గమనించి మెలగగల నాయకత్వంకూడా అమెరికన్లకు కావాలి. కమ్యూనిజాన్ని ఎదిరించడంలో సాఫల్యం పొంది, చిరకాలశాంతికి ప్రాతిపదిక ఏర్పాటుచేయాలంటే అసమర్థత, లంచగొండితనం పనికిరావు. వాటిని తొలగించాలి. ప్రతీపశక్తులతో, ఫాసిజంతో రాజీపడకూడదు.

అవి ఏరూపంలో వున్నా సరే, పరపీడననూ హింసనూ ఎదుర్కొని నిలుస్తా మనీ, ఎన్నడో రావలసిన ఆర్థికసాంఘిక సంస్కరణలు వచ్చేట్టు చేస్తామనీ అమెరి కన్లు చేతలద్వారా నిరూపించాలి. అలాంటి సంస్కరణలు ప్రవేశపెట్టక పోబట్టే కదా కమ్యూనిస్టులకు సులభంగా అవకాశం లభించింది?

చారిత్రకంగా చూస్తే కొన్ని గొప్పజాతులు వాటి నాయకత్వాన్ని గోల్పోవడానికి ముఖ్యకారణం అవి సంపన్నమైనదే తడవుగా నిలువ నీరువలె నిలిచిపోవడమేనని తెలియవస్తుంది. అలా చలనం లేకుండా నిలిచిపోవడంవల్ల అహరహమూ పురోగమిస్తూవున్న తక్కినప్రపంచానికీ వాటికీ సంబంధం పోయింది. సంబంధం తొలగేసరికి తమ భద్రతవిషయంలో వాటి ఆదుర్దా హెచ్చింది. ఇట్లా భయాందోళనలు అధికంకావడంతో చాదస్తం, మితవాదం, పూర్వసంప్రదాయ పరాయణత్వం హెచ్చాయి. క్రమేపీ ఆ జాతులు అభివృద్ధినే నిరోధించడం మొదలెట్టాయి.

ఈనాడు చరిత్ర అనేదాని కాగడావెలుగు అమెరికనులపై పడుతూవుంది. వారి గొప్పను నిలబెట్టుకోవాలంటే ధైర్యంచేసి ప్రపంచవ్యాప్త ఆర్థిక, సాంఘిక, రాజకీయప్రజాస్వామ్య కార్యక్రమానికి అమెరికన్లు కంకణబద్ధులు కావాలి. అలాంటి కార్యక్రమాన్ని తెలివితేటలతో రూపొందించాలి. అది దూకుడుగా ధారాళంగా అమలు జరగాలి.

అలా చేస్తేనే "వెనక్కి పోము" అంటూ వజ్రసంకల్పంతో నిలబడ్డ రెండు వందలకోట్ల ప్రజల ప్రపంచానికి ఆ దేశం ఆశాజ్యోతి అవుతుంది.

# 3

# మరొక పెద్ద చర్చ జరగాలి

అమెరికా విదేశాంగమంత్రి జాన్‌ఫాస్టర్ డల్లెస్ తమ ప్రభుత్వం పెద్దపెట్టున ఎదురుదెబ్బతీయ సంకల్పించిందని సూత్రవిధా నాన్ని ప్రకటించగా ఆ విధానం సరియైనది కాదని ఉద్ఘాటిస్తూ శ్రీబౌల్స్ వ్రాసిన వ్యాసం ఇది. ఇది '1954 ఫిబ్రవరి 28 తేదీ న్యూ యార్కు టైమ్సు' మేగజైన్‌లో ప్రచురితమైంది.

రెండవ ప్రపంచయుద్ధానంతరం అమెరికన్ విదేశాంగవిధానంగూర్చి జరిగిన గొప్ప చర్చలను ఏకరువుపెట్టడమంటే తనపై మోపబడ్డ ప్రపంచబాధ్యతలను స్వీకరించడానికి అమెరికాగైకొన్న చారిత్రకచర్యలను మననం చేసుకోవడమే అవు తుంది. ట్రూమన్ సిద్ధాంతం, మార్షల్ పథకం, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక, యూరపుకు సైన్యాలను పంపడం, చైనాపై దాడిచేయడంద్వారా కొరియాలో యుద్ధాన్ని విస్తృతం చేయ నిరాకరించడం-ఇవన్నీ అతిముఖ్యమైన నిర్ణయాలు. బహిరంగంగా తీవ్రమైన వాదోపవాదాలు, చర్చలు జరిపినమీదటే ఈ నిర్ణయాలు గైకొనబడ్డవి.

ఇప్పుడు మరొక పెద్ద చర్చకు సమయ మాసన్నమైన దనుకుంటాను. డల్లెస్ సిద్ధాంతమని వ్యవహరింపబడుతూవున్న "తక్షణప్రతీకార" సిద్ధాంతాన్ని వెంటనే చర్చింపవలసిన అగత్యం వుంది.

అమెరికా విదేశాంగమంత్రి డల్లెస్ జనవరి 12 వ తేదీన విదేశసంబంధాల మండలి సమావేశంలో ప్రసంగిస్తూ, ప్రపంచవ్యూహంపై అమెరికన్ల "సూత్ర దృక్పథము"ను క్లుప్తంగా వివరించారు. అట్లా వివరిస్తూ అమెరికావిదేశ విధానంలో అనేకమార్పులు తేనున్నట్లు సూచించారు. అసలు డల్లెస్ ఉద్దేశ మేమిటి?

డల్లెస్ ఉపన్యాసంలో కొన్ని భాగాలను మరీ నొక్కివక్కాణించడం జరి గింది. వాటిని అమెరికన్లు పరిశీలించాలి. ఏ బెడదవచ్చినా దానిని స్థానికంగా ఎదు

ర్కొనే పద్ధతిని డల్లెస్ త్యజించ నున్నట్లు ఆయనప్రసంగంవల్ల వ్యక్తమవు తున్నది. అంటే పరిమితయుద్ధభావన పనికిరా దని ఆయన అంటున్నారు. "స్థానిక రక్షణశక్తిపై సాధ్యమైనంత తక్కువగా ఆధారపడుతూ, భారీప్రయత్నాలపైన, భారీ శక్తియుక్తులపైన దృష్టిని కేంద్రీకరించాలి" అని ఆయన అన్నారు.

డల్లెస్ ఇంకా ఇట్లా చెప్పారు: "పూర్వం మనం ఆర్కిటిక్ ప్రాంతంలో, ఉష్ణమండలములలో, ఆసియాలో, సమీపప్రాచ్యంలో, యూరపులో భూమిపైన, సముద్రంపైన, గాలిలో పాత ఆయుధాలతోను, కొత్త ఆయుధాలతోను పోరాడ వలసివచ్చేది." ఇప్పు డీ అవసరం కొత్తగా చేయబడ్డ "ముఖ్యనిర్ణయం" వల్ల తీరిపోయిం దని ఆయన చెబుతున్నారు. "అమెరికన్లు నిర్దేశించుకున్నచోట్ల అమెరి కన్ సాధనసంపత్తితో తక్షణమే ఎదురుదెబ్బ తీసే శక్తిస్తోమతలపై అమెరికన్లు ముఖ్యంగా ఆధారపడివుండాలి" ఇదీ ఆయన నూత్నవిధానం సారాంశం.

"తక్షణమే ఎదురుదెబ్బ తీయడ"మంటే కీలకాన్ని కనుగొని వ్యూహంతో ఆటంబాంబులు వేయడ మన్న మాట. "మనం నిర్దేశించుకున్న చోట్ల" అంటే శత్రువుదాడిచేసిన చోటనేగాక ఇంకా వేరేచోట్లకూడా దెబ్బతీయడ మన్నమాట.

కాగా తేలిన దేమిటంటే—ఇక ముందు రష్యాగాని, చైనాగాని ప్రపం చంలో ఎక్కడైనా కమ్యూనిస్టేతరప్రాంతంలో విజృంభించి దాడిచేస్తే అమెరికా ప్రభుత్వం కమ్యూనిస్టుదేశాలలోని పెద్ద నగరాలపై వ్యూహబద్ధమైన విమానదళం ద్వారా ఆటంబాంబులు వేయతలపెట్టిం దన్నమాట. నేను నా భాష్యం చెప్పడం లేదు. ప్రభుత్వవర్గాల ప్రకటనలు నాకు కలిగిన అభిప్రాయాన్ని బలపరిచేవిగా వున్నాయి. "డల్లెస్ పూర్వంచేసిన ప్రకటనలలో, ఇకముందు చేయబోయే ప్రకటన లలో కెల్లా ఈ ప్రసంగం అతిముఖ్యమైంది" అని ప్రభుత్వవర్గాలే వ్యాఖ్యా నించాయి.

ఒకవేళ ఇదే అమెరికా నూతనవిధానమైతే ఈ విధానం దురాక్రమణలు జరగకుండా నీళ్ళు చిలకరిస్తూ, దురాక్రమణే జరిగితే దాన్ని తిప్పికొట్టడంలో సాఫల్యం పొందగలదా? దీనివల్ల డల్లెస్ చెప్పినట్లు "తక్కువ ఖర్చుతో అమెరికన్లకు ఎక్కువ భద్రత" చేకూరుతుందా?

మొదట ఒక విషయం చెప్పాలి. పశ్చిమ యూరపులో ఈవిధానం కొత్త దేమీకాదు. ఒకప్పుడు ప్రయోగించి చూచినదే. యూరపుపై జరిగే దాడిని అమెరికన్ల పై జరిగిన దాడిగానే అమెరికన్లుఎంచుతారని రష్యాకు ఎన్నడో తెలుసు. అందుకు

సందేహ మక్కరలేదు. అలాంటి దాడే జరిగితే రష్యాపై ఆటంబాంబు ప్రయోగిస్తారనికూడా రష్యాకు తెలుసు. అలా ప్రయోగించడంవల్ల చెలరేగే మహాయుద్ధంలో అమెరికాదేశంలో ఆటంబాంబులవల్ల గొప్పవిధ్వంసం జరిగినప్పటికీ రష్యా యూరప్పై దాడిచేసిన పక్షంలో అమెరికన్లు రష్యాపై తప్పక ఆటంబాంబులు వేస్తారనేది సర్వులకూ బాగా తెలిసిన విషయం.

కాని ఆసియాలో—అంటే ఆఫ్ఘనిస్తాన్, బర్మా, ఇరాన్, లేక ఇండో చైనాలో స్థానికమైన దురాక్రమణలు జరిగినప్పుడు వాటిని ఎదుర్కోవడానికి ఘోర మారణహోమాన్ని, ఆటంబాంబుల ప్రమాదాన్ని కావాలని అమెరికా తెచ్చిపెట్టుకొన నిచ్చగిస్తుందా? కొరియా యుద్ధంపట్ల అమెరికన్లుచూపిన ఆవేగాన్ని, ఇండోచైనా గొడవలో అమెరికన్లు ఇరుక్కోగల అవకాశమునూ పరిశీలిస్తే ఏరికోరి అమెరికన్లు ఘోరవిపత్తును తెచ్చుకోదలచడంలేదని స్పష్టమవుతుంది.

ఏమైనప్పటికీ విశాలభూభాగం కలిగివుండి వికేంద్రీకృతమైవున్న చైనా అమెరికన్ ఆటంబాంబుల దాడికి సులభంగా భేద్యమవుతుందా? రష్యావలె చైనాలో భారీయెత్తున కేంద్రీకృత పరిశ్రమలు లేవు. ఉన్న కొద్ది పరిశ్రమలూ చెల్లా చెదురుగా వున్నవి. మంచూరియా మొత్తం ఉక్కు ఉత్పత్తి అమెరికాలో డెలవేర్ అను చోట కొత్తగా నెలకొల్పబడ్డ ఉక్కుకర్మాగారపు ఉత్పత్తికి సగానికి కూడా రాదు.

చైనా ఆర్థికవ్యవస్థ భారీయెత్తున నిర్మింపబడ్డ రవాణారాకపోకల వసతులపై ఆధారపడిలేదు. చైనాసేనలు ఒకచోట పాదుకొనివుండేవి కావు. ఎక్కడికి పడితే అక్కడికి అవలీలగా తరలిపోగలవు. వాటికి గెరిల్లాయుద్ధపద్ధతిలో మంచి శిక్షణ ఇవ్వబడింది. భూమిపై ఎంతకాలమైనా తట్టుకొని నిలబడతాయి. పశ్చిమరాజ్యాల సైన్యాలవలె వాటికి పెద్ద సరఫరాలు, స్తోమతలు, వత్తాసులు అక్కరలేదు.

అమెరికన్లు చైనానగరాలపై ఆటంబాంబులు వేసి ధ్వంసంచేసినందువల్ల కలిగే ఫలితమేమిటయ్యా అంటే సుదీర్ఘమైన పోరాటాన్ని అమెరికన్లు కొని తెచ్చుకుంటారు. అది అలా పాకుతూపోతుంది. తెగదు, ముడిపడదు. ఒకపట్టాన తేలదు. కాని ఆ యుద్ధంలో చైనా తనకు గల అపారమానవబలగంతో ఆసియాఖండంలోని అనేకప్రాంతాలను ఆక్రమించుకొంటుంది.

అవన్నీ అట్లా వుండగా—ఈనూత్న విధానంతో ఉత్పన్నమయ్యే సమస్యలు వేరే లేవా? వున్నాయి. ప్రాథమికమైన నైతికసమస్య వుంది. విశాలదృష్టితో ఆలో

చించవలసిన అంశా లున్నాయి. కళ్ళు తెరచి అంతరాత్మసాక్షిగా పారజూడవలసిన అగత్య ముంది. అమెరికన్లు నాస్తికులు కారు. వారికి మతముంది. మానవుడు దేవునికి పవిత్రమైనవా డని వారివిశ్వాసం. వారికి ప్రజాస్వామ్యంపైన, వ్యక్తి విలువపైన, వ్యక్తిగౌరవంపైన విశ్వాస మున్నదని అమెరికన్లు సగర్వంగా చెప్పుకొంటున్నారు. ఇట్టి విశ్వాసాలుండడంవల్ల నే అమెరికన్ జీవితానికీ కమ్యూనిస్టుల జీవితానికీ ఎంతో తేడా వుంది.

ఇదంతా వుండికూడా అమెరికన్లు చైనా నగరాలపై ఆటంబాంబులు వేస్తామని బెదిరిస్తే చైనాలోని లక్షలాది పురుషులను, స్త్రీలను, పిల్లలను నిర్మూలింప సంకల్పించారన్నమాట. పోనీ, వాళ్ళంతా నివసించే నగరాలలో రష్యాలోవలె సైనికస్థావరాలు, పారిశ్రామికకేంద్రాలు వుంటాయా అంటే అలాంటి వేవీ వుండవు. మరి వాళ్ళంతా చైనాపరిపాలకుల అజమాయిషీలో వున్నారుకాబట్టి పరిపాలకులను శిక్షించే ఉద్దేశంతో నిస్సహాయులైన ప్రజల ప్రాణాలను బలిగొనడమేనా?

ఆసియాప్రజలు హీనులని అమెరికన్లు భావించడంవల్ల నే జపానుపై అమెరికన్లు ఆటంబాంబు వేశారనీ, జర్మనీపై వెయ్యకుండా వదిలారనీ కమ్యూనిస్టులు చేస్తూవున్న ప్రచారాన్ని లక్షలాది ఆసియాప్రజలు నమ్మారు. అటువంటప్పుడు తగు రక్షణ లేని చైనానగరాలపై ఆటంబాంబులు వేసి ధ్వంసం చేసి రష్యాలోని నగరాల జోలికి పోకపోతే ఆసియాఖండమంతా అమెరికన్లకు బద్ధశత్రువుగా తయారవుతుంది.

యూరపుసంగతేమిటి? డల్లెస్ కొత్తవిధానంవల్ల కడు సున్నితమైన అమెరికన్ దౌత్యవ్యవహారసమస్య పరిష్కారమవుతుందా? ఆ సమస్య ఏమిటంటారా? యూరపుజాతుల సమైక్యతను చెదరకుండా ఉంచడం. ఆ సమైక్యతకు బలం చేకూర్చడం. డల్లెస్ కొత్తవిధానం మెరికన్ల యూరపుస్నేహితులు అమెరికన్లతో స్నేహంగా ఉండడానికి కుతూహలపడేట్టు చేస్తుందా?

"ఆటంబాంబులతో ప్రతీకారం" అనే నూత్నవిధానంవల్ల దాపురించే మూడవప్రపంచయుద్ధాన్నీ, దానివల్ల కలిగే ఘోరమైన అపాయాన్నీ ఔదలదాల్చడానికి అమెరికనులు సిద్ధంగా వుంటే వుండవచ్చుగాక. కాని యుద్ధమంటే మొహం మొత్తిన అమెరికన్ల యూరపుమిత్రులమాటేమిటి? సోవియట్ రష్యాసైనికస్థావరాలకు వాళ్ళు కొన్ని వందల మైళ్ళ దూరానమాత్రమే వున్నారే! ఆటంబాంబుల ఎదురుదెబ్బవల్ల అమెరికన్లకంటే వాళ్ళు అధికంగా నష్టపడతారే! అమెరికన్ల కొత్త

విధానం అనవసరమైన మూడవ ప్రపంచయుద్ధప్రమాదాన్ని తెచ్చిపెడుతుం దని వాళ్ళ కేమాత్రం అనుమానం కలిగినా వాళ్ళ ఉత్సాహం నీరుగారిపోయి యూరపు రక్షణ అనే ముఖ్యకర్తవ్యాన్ని విస్మరిస్తారే.

మరొక ముఖ్యప్రశ్న వుంది: అంతర్జాతీయంగా ఆటంబాంబుల అదుపు విషయంలో ప్రపంచప్రజలకు ఏమాత్రం విశ్వాస మున్నా ఠః కొత్తవిధానంవల్ల కలిగే ఫలిత మేమిటి?

అమెరికన్ల లక్ష్యాలపై ప్రజలకు విశ్వాసం కలుగజేయడానికి అమెరికన్లు గైకొన్న చర్యలలో ముఖ్యమైనది ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యాన ఆచరణసాధ్యమైన అణ్వాయుధాల అంతర్జాతీయ అదుపును మనస్ఫూర్తిగా బలపరచడం. మనం చేసిన తెలివికల పనులలో ఇదొకటి.

శాంతిని కాపాడడానికై అమెరికన్లు ఆటంబాంబులపై ఆధారపడుతూపోతే అణ్వాయుధాలు లేకుండాపోతే ప్రపంచం సుఖంగా శాంతియుతంగా వుంటుందన్న ప్రపంచ ప్రజల ఆశయాన్ని భంగపుచ్చుతారన్నమాట. అణుయుగంలోకి ప్రపంచం ప్రవేశించినప్పటినుంచి మానవాళి అట్టి ఆశయాన్ని అహోరాత్రాలూ మననం చేసుకుంటూవుంది. అది భంగపడితే అందుకు అమెరికన్లే పూర్తిబాధ్యత వహించవలసి వస్తుంది. ప్రపంచానికి సంజాయిషీ చెప్పుకోవలసివుంటుంది.

అమెరికన్లు ఆలోచించవలసిన మరొక విషయం వుంది. అది అమెరికా ప్రభుత్వస్వరూపం. అమెరికా రాజ్యాంగం ప్రకారం యుద్ధం ప్రకటించే అధికారం ఒక్క కాంగ్రెసు సభకుమాత్రమే వుంది.

మాటవరుసకు చైనాసైన్యాలు ఇండోచైనాపై దండెత్తా యనుకుందాము. అప్పుడు ప్రతీకారంగా చైనాభూభాగంపై అణ్వాయుధాలతో దాడిజరిపేముందు అమెరికా అధ్యక్షుడు కాంగ్రెసు సభవారి ఆమోదం అర్థిస్తాడా? అర్థిస్తే తక్షణమే ఎదురుదెబ్బ తీయడం ఎలా సాధ్యమవుతుంది? అధ్యక్షుని ప్రతిపాదనను కాంగ్రెసు సభవారు చర్చిస్తూ కూర్చుంటే రష్యావారు అమెరికానగరాలపై ఆటంబాంబుల వర్షం ముందుగానే కురిపించరా? ఇంతటి ఘోరప్రమాదాన్ని తెచ్చిపెట్టుకోవడానికి అమెరికన్లు సిద్ధంగా వున్నారా?

అలాంటి ఘోరప్రమాదం ఎదుర్కోవలసివస్తుం దని గ్రహించినవాడై అమెరికా అధ్యక్షుడు తన స్వంతబాధ్యతతో, స్వాధికారంతో వ్యూహాబద్ధమైన

విమానదళబాంబర్లను రంగానికి ఉరికించి, కాంగ్రెసుసభవారికి గల రాజ్యాంగవిహిత అధికారాన్ని వారు చెలాయించుకొనే అవకాశమివ్వకుండానే మూడవ ప్రపంచ యుద్ధాన్ని ఆహ్వానిస్తాడా? ఆరంభిస్తాడా?

మరొక విషయం: అమెరికన్ల ముందున్న పరిస్థితిని కేవలం సైనికశక్తి దృష్ట్యానే, ముఖ్యంగా ఒకేఒక రకమైన సైనికశక్తి దృష్ట్యానే ఆలోచిస్తే అమెరికన్ల కొత్తవిధానం వల్ల కమ్యూనిస్టుబెడద ఎంత తీవ్రమైనదో, ఎంత హానికరమో ప్రపంచం సరిగా గమనించకుండా చేసినవారవుతారా, కారా?

ఇప్పుడు జరుగుతూవున్న ముసుగులో గుద్దులాటవంటి ప్రచ్ఛన్నయుద్ధంలో అమెరికన్లు గమనించవలసిన ముఖ్యాంశం ఒకటి వుంది. ఏమిటంటే——కమ్యూనిస్టులు ఇంతవరకూ ఎక్కడా రష్యాసైన్యాలతో బాహాటంగా అమెరికన్లతో పోరుకు తలపడలేదు. నిజానికి ఒక్క కొరియాలో మాత్రమే బాహాటమైన సైనికదండ యాత్రవల్ల ఇనుపతెర సరిహద్దురేఖను మార్చే ప్రయత్నం జరిగింది.

అమెరికన్లు రష్యాసైన్యాలను ఎదుర్కోవడానికి బదులు శక్తివంతమైన వారి రాజకీయతంత్రాలను పలుతావుల పలువిధాలుగా ఎదుర్కోవలసిన వారయ్యారు. 1946 లో ఇరానులో ఉత్తరరాష్ట్రాలలో జరిగిన తిరుగుబాటుకు రష్యావారు మద్దతు ఇచ్చారు. ఆ తిరుగుబాటును ఇరాన్ కమ్యూనిస్టుపార్టీవారు క్రెమ్లిన్ (రష్యాపాలకుల) ఉత్తరువులతో లేపారు.

గ్రీసు, బర్మా, మలయా, ఇండోచైనా, ఇండొనీషియా, ఫిలిప్పీన్సు, చైనా దేశాలలో సుశిక్షితులు, సువ్యవస్థితులైన స్థానికసైనికులో, లేదా గెరిల్లా సైనికులో పోరాటం జరిపారు. ఆ పోరాటాలకు రష్యా ఆయుధాలు సరఫరా చేసింది. రష్యన్ యుద్ధప్రవీణులు తగు సలహాలిచ్చారు.

ఇటువంటి కమ్యూనిస్టుదండయాత్రలను అధికసంఖ్యాకప్రజల విశ్వాస విధేయతలను చూరగొన్నట్టి ప్రభుత్వాలు గల దేశాలు గట్టిగా ఎదిరించి తిప్పికొట్టాయి. కాని ఇండో-చైనావలె వలసరాజ్యాధికారంవున్న చోట్ల, కమ్యూనిజాన్ని వ్యతిరేకించేవా రున్నప్పటికీ అట్టి వారు స్థానికప్రజల అవిశ్వాసానికి పాత్రులైన సందర్భంలో పాశ్చాత్యదేశాలు భారీయెత్తున సైనిక ఆర్థికసహాయం చేసినప్పటికీ, పాశ్చాత్య సైన్యాలు ప్రత్యక్షంగా జోక్యం కల్పించుకున్నప్పటికీ ఆశించిన ఫలితాలు కలుగలేదు.

కాని ఇతరత్రా—ముఖ్యంగా జెకొస్లొవేకియాలో సోవియట్ యూనియన్ సువ్యవస్థితులైన స్థానిక కమ్యూనిస్టుల కృషిపై ఆధారపడింది. ఈవిధంగా ప్రపంచాధిపత్యం ధ్యేయంగా గల సోవియట్ పరిపాలకులు ఎల్లప్పుడూ పట్టువిడుపులు గల ఎత్తుగడతో తెలివిగా వ్యవహరించారు.

కమ్యూనిస్టుల బెడద ఇంత తరచుగా అమెరికన్లను ఎదుర్కొంటూవుంది కదా, పైగా అది బాహాటదురాక్రమణస్వరూపం దాల్చదుగదా, మన కొత్తవిధానం ఈ బెడదను ఎలా ప్రతిఘటించగలదు?

పైగా రష్యావారు మెల్లగా కొత్తరంగాలలోకి ప్రవేశిస్తున్నారు. రష్యాలో ఉత్పత్తి శీఘ్రగతిని హెచ్చుతూవుంది. ఆ ఉత్పత్తిని వినియోగించి వ్యాపారవాణిజ్యాదులలో అమెరికన్లతో పోటీపడాలని రష్యా చూస్తూవుంది. అలా చేస్తే అటు రష్యా ఆర్థికవ్యవస్థా పటిష్ఠమవుతుంది; ఇటు పాశ్చాత్యప్రపంచంలో చీలిక లేర్పడుతాయి. ఈవిధంగా రష్యా ఆసియా ఖండంలోని కొత్త ప్రభుత్వాలతో సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకుంటుంది.

రష్యావారు పాయింట్‌ఫోర్ కార్యక్రమాన్నికూడా చేపట్టేట్టున్నారు. ఆ సూచనలు కానవస్తున్నాయి. ఈ రీతిగా రష్యారాజకీయ, ఆర్థిక, సైనికసాధనాలతో అమెరికన్లపైకి విజృంభిస్తే అమెరికన్ గ్రుడ్లను అణ్వాయుధాల బుట్టలో పెట్టుకొని నిశ్చింతగా కూర్చోగలరా?

ఆసియాఖండంలో అమెరికన్లకోసంగాక వాళ్ళ స్వేచ్ఛాస్వాతంత్ర్యాల కోసమే పోరాడే స్వతంత్రజాతు లున్నాయన్న విశ్వాసం అమెరికన్లకు లేకుండాపోయిందా? అట్లా పోరాడజూచే స్వతంత్రజాతులకు ఓజస్సు, తేజస్సు ఇచ్చే సత్తా అమెరికన్లకు లేకుండాపోయిందా?

అమెరికన్ల పాయింట్‌ఫోర్ కార్యక్రమాల మాటేమిటి? వాటిని డల్లెస్ ప్రస్తావించడేం?

అమెరికన్ల రక్షణకృషినీ, రక్షణవ్యయాన్నీ బాగా తగ్గించాలంటే కమ్యూనిస్టుబెడదవున్న దేశాలలో స్థానికశక్తిని పెంపొందించి ఆ దేశాలే కమ్యూనిస్టుల దురాక్రమణ, లేదా చాటుమాటు ఎత్తులను ఎదుర్కొనే స్తోమత కలిగివుండేట్టు చేయాలి. అవి ఎంత బలపడితే అమెరికన్ల రక్షణవ్యయాన్ని అంత తగ్గించవచ్చు. మరి స్థానికమైన ఈ శక్తి పెంపొందాలంటే ఆ దేశాలలో వాస్తవమైన స్వతంత్ర

ప్రభుత్వాలుండాలి. అభిలషణీయమైన ఆర్థికవ్యవస్థలు ఏర్పడాలి. ఆ వ్యవస్థలు దిన దినాభివృద్ధి చెందేవి కావాలి.

అలాంటి ప్రభుత్వాలు అమెరికన్ల అభిప్రాయాలను బలపరుస్తాయని అమెరికన్లు ఆశించవచ్చుననుకోండి. అయితే ఎప్పటికప్పుడు అవి అమెరికన్లతో ఏకీభవించడం అంత ముఖ్యం కాదు. ముఖ్యమైంది వారిపై వారికి గల విశ్వాసం. అది చైతన్యంతో కూడిన విశ్వాసమై వుండాలి. తమపైకి వచ్చేవారందరితో పోరాడ గల ధైర్యం, సంకల్పం వారికి కావాలి.

అణ్వాయుధాలతో దెబ్బతీసే శక్తి జీవనాడివంటిది. జీవనాడి ఎంత ముఖ్యమైందో, ఎట్లా విరామం లేకుండా పని చేస్తూవుంటుందో అలాగే అణ్వస్త్రశక్తి కూడా నిరంతరసాధనం. కాని అణుశక్తి కమ్యూనిస్టుల దురాక్రమణ బారినుండి అమెరికన్లకు హామీ ఇవ్వజాలదు. అసలే ఆసియాఖండంలో ప్రజలు పరిస్థితులపట్ల ఏదో ఊత ఒకటి దొరికితే చాలు నన్న ధోరణిలో వున్నారు. అటువంటప్పుడు అక్కడి దేశాలలో కమ్యూనిస్టుల చాటుమాటు విధ్వంసకచర్యలను, వాళ్ళు స్థానికంగా లేవదీసే తిరుగుబాట్లను, విప్లవాలను అణ్వాయుధాలు బొత్తిగా అణచలేవు.

ఉదాహరణకు అమెరికన్లు ఎట్టి పరిస్థితులలోనూ ఇండో-చైనాలో ప్రత్యక్షంగా జోక్యం కల్పించుకోమని ప్రపంచానికి చాటినట్లయితే కొరియాలోకంటె మరింత పెద్ద విస్తీర్ణంలో కమ్యూనిస్టులకు స్వాగతం చెప్పడానికి రత్నకంబళి పరిచారన్నమాటే!

అణ్వస్త్రాలతో పెద్దపెట్టున ప్రతీకారం జరిపి బెదిరించడంకంటె, సులభంగా ఎక్కడికిపడితే అక్కడికి చేరవేయగల సైన్యాలను ప్రయోగిస్తే దురాక్రమణను ఆపగలరు. క్లిష్టపరిస్థితిలో మాత్రమే అమెరికన్లు అట్టి సైన్యాలను ప్రయోగిస్తారని ప్రపంచానికి తెలుసు. కాని చీటికీ మాటికీ అమెరికన్లు అణ్వస్త్రప్రయోగంచేస్తామంటే ఇనుపతెర అవతలవున్నవారూ, ఇవతల వున్నవారూ నమ్మరు. ఎందుచేతనంటే, యూరపుమిత్రమండలిపై ప్రత్యక్షంగా దాడి జరిపితే తప్ప లేకపోతే అమెరికన్లు ఆటంబాంబులను వాడరని అందరికీ బాగా తెలుసు.

ప్రపంచంలో విప్లవాత్మకశక్తులు భవిష్యత్తును తీర్చి దిద్దుతున్నాయి. కనుక అమెరికన్ల రాజకీయ నీతినియమాలు ఆ శక్తులకు ప్రతికూలధోరణిలో వుండ రాదు. వాటిని గమనిస్తూ అమెరికా తమపంథా నిర్ణయించుకోవాలి. అది స్థిర

మైనది కావాలి. ఊగిసలాట పనికిరాదు. సుదూరంలో వున్న కమ్యూనిస్టు ప్రపంచంలో గల ఆంతరంగికవైరుధ్యాలను గమనించి, వాటిని చక్కని అవకాశంగా వినియోగించుకొని పరిస్థితిని చేజిక్కించుకొనే చొరవ, జాగరూకత మన రాజకీయ నీతికి చాలా అవసరం.

కమ్యూనిస్టురాజ్యాల చర్యలకు దిగ్భ్రాంతి చెంది వారి మాయలో పడిపొయ్యే ప్రమాదంనుండి అమెరికన్ల రాజకీయనీతివారిని తప్పించాలి. సమస్తప్రజలు స్వేచ్ఛాయుతవాతావరణంలో జీవించవలెనని కోరుకుంటారు. వారి ఆశలను, ఆశయాలను ఆచరణసాధ్యమైనంత వరకు అమెరికన్లు బలపరచాలి.

అన్నిటికంటే ముఖ్యం అమెరికన్ల పూర్వీకులు వారి స్వాతంత్ర్య ప్రకటన పత్రంలో చెప్పిన "మానవాళి అభిప్రాయాలకు మన్నన" అన్నది వారి వైఖరిలో ద్యోతకం కావాలి.

ఇటువంటి ముఖ్యసమస్యల నన్నిటినీ ఒక గొప్ప చర్చలో అమెరికన్లు తర్జన భర్జన చేసినట్లయితే అమెకన్లముందున్న బెడదను ఎదుర్కొవడానికి తగిన పరిష్కారాలను సాధించగలరు. కాంగ్రెసుసభవారు, ప్రజలు పాల్గొన్న అట్టి చర్చ వల్లనే ప్రజాస్వామ్యంలో విదేశాంగవిధానాన్ని రూపొందించడానికి వీలవుతుంది.

# 4

# నిస్పృహతప్ప వేరే సాధనం లేదా?

హైడ్రోజన్ బాంబు పర్యవసానమేమిటో ప్రపంచం 1954 లో మొట్టమొదటిసారిగా గ్రహించింది. అప్పుడు శ్రీబౌల్స్ శక్తివంతమైన జాతీయనాయకత్వంక్రింద అమెరికాకు ప్రత్యామ్నాయ మార్గాలున్నాయని ఎలుగెత్తి చాటారు. "న్యూలీడర్" అనే పత్రికలో 1954 జులై 26 తేదీన వ్రాసిన వ్యాసంలో కొన్ని భాగాలివి:

గొప్ప వక్తయైన ఎడ్మండ్‌బర్క్ ఒక మారు ఇంగ్లండు పార్లమెంటులో తన సహచరులకు సలహా ఇస్తూ "దుష్టులంతా ఒకకూటమిగా ఏర్పడ్డప్పుడు శిష్టులు పరస్పరసహకారంతో పనిచేయడం అవసరం, లేకపోతే ఒకరి తరువాత ఒకరు నేల కొరుగుతారు. అది హేయమైన సంఘర్షణలో ఎవరి సానుభూతికీ పాత్రముకాని త్యాగం అవుతుంది" అన్నారు.

ఈనాడు అమెరికన్లని కళ్ళెర్రజేసి హడలగొట్టేది అణ్వస్త్రాల బెడద. ఈ బెడద ఒక సంఘర్షణరూపంలో తలయెత్తిందంటే అంతకన్న హేయమైన సంఘర్షణ మరొకటి వుండదు. దీనిని నివారించడానికి మంచివాళ్ళంతా ఎట్లా ఏకమవుతారు? అమెరికన్లముందున్న ప్రత్యామ్నాయమార్గా లేమిటి?

గడచిన పద్దెనిమిదినెలల్లో అమెరికన్లకు అగుపించిన ప్రత్యామ్నాయాలు అసాధ్యమైనవి, కొన్ని కేవలం నినాదాలుగామాత్రమే వున్నవి. లోపల సరుకేమీ లేదు. "నిరోధకయుద్ధం" "రాజీ"లలో ఏదో ఒకదాన్నిగాని, లేదా "ప్రత్యర్థిని నిలువరించడం" లేక "విముక్తంచేయడం"లో ఏదో ఒకటిగాని, "పంచిపెట్టే కార్యక్రమాలు" లేక సుంకాలతో కూడిన "వ్యాపారం, సహాయంకాదు" అన్న

వాటిలో ఏదేని ఒకదానినిగాని, "మన తాహతుకొద్దీ దేశీయ ఆర్థికవిధానమో" లేక "పూర్తిగా దివాలాతీయడమో" ఏదో ఒకదానిని ఎంపిక చేసుకోండని అమెరిక న్లకు సలహాలు చెబుతూవచ్చారు.

అసలు అమెరికన్లు చిటారుకొమ్మకు చేరుకున్నారనీ, ఇక అక్కడినుంచి ఎటూ పోలేరనీ, మార్గాంతర మేదీ లేదనీ అనడం నిరాశావాదధోరణి. ఇది సహించ దగింది కాదు, మంచి మనసు గలవారు దీనిని అంగీకరించరు. బాంబులు పడటం మొదలయ్యేరోజు వరకుకూడా నిష్కల్మషహృదయం గలవా రెవరూ అమెరికన్లు వెనక్కి తిరిగిపోలేని ఆచోటికి చేరుకున్నారని అంటే ఆమోదించరు.

భుజాలు ఎగరేసి, బాధ్యతను ఒకరికి అప్పగించినంతమాత్రాన చారిత్రకంగా అమెరికన్లకు సంక్రమించే వైయక్తిక, నైతికబాధ్యతలను తప్పించుకోలేరు. తప్పించుకున్నారా చరిత్రను మోసగించినవాళ్ళవుతారు. భవిష్యత్తు హైడ్రోజన్ బాంబేకదా అని బెంబే లెత్తనక్కర్లేదు. అందుకు ప్రత్యామ్నాయాలు కూడా వున్నాయి. పైగా ఆశాజనకమైన ప్రత్యామ్నాయాలు. అమెరికన్ సంప్రదాయాలకూ నడవడులకూ అనుగుణమైన ప్రత్యామ్నాయాలు.

ఇవి కొత్త వేమీ కావు. అమెరికన్లు చేయవలసిందల్లా పాతబడిపోయిన సార్వజనీన ఇతివృత్తాలలో మార్పు చేర్పులు చేయడమే. కొత్తగా వచ్చిన హైడ్రో జన్‌బాంబులు దీర్ఘకాలంగా వున్న మానవసమస్యలను, చిక్కులను రంగస్థలంపైని వెలుగులోకి తెచ్చాయి. వీటిలో ఇమిడివున్న నీతినీ, ధర్మాన్నీ మనం తప్పించుకో జాలము.

అమెరికన్ బడ్జెటు (ఆయవ్యయాలు)ను కత్తిరించే మహాశయులు పాయింట్ ఫోర్ కార్యక్రమం పీకనొక్కుతూ తమది ఆర్థికసంబంధమైన తీర్పు అని గొప్పలు చెప్పుకుంటారు. కాని అందులో నైతికాంశంకూడా వుందన్న సంగతి గ్రహించరు.

హుటాహుటిని అమలుజరుగవలసిన శరణార్థుల కార్యక్రమం అధికార్ల చేతిలోపడి, శాసనం ఏ ఉద్దేశంతోనైతే తేబడిందో ఆ ఉద్దేశాన్ని గమనించకుండా అధికార్లు నియమనిబంధనలు వల్లిస్తూ పోతే అప్పు డది పరిపాలనా సమస్యమాత్రమే గాక నైతికసమస్యగా కూడా తయారవుతుంది.

అల్పసంఖ్యాకవర్గాలపట్ల విచక్షణ చూపినట్లయితే అమెరికన్ ఆధిక్యతనూ, అమెరికన్ల విశేషాధికారాన్నీ చెలాయింపజూచేవారవడమేగాక సాటిమానవుని

హీనతను నైతికంగా అంచనాకట్టే వాళ్ళుకూడా అవుతున్నారు. వెనుక అలాంటి ఆధిక్యత చూపెట్టుకొంటే అప్పటి కది సరిపోయిందేమోకాని, నేటిపరిస్థితులలో అది అమెరికన్లకు తగని పని.

స్థానికశ్రేయస్సును కోరేవారు అంతటితో సరిపెట్టుకొని ఊరుకోక ఐక్య రాజ్యసమితిపై ఆవేశకావేషాలు చూపితే అది సంకుచితమైన రాష్ట్రీయతత్వ మని పించుకోవడమేగాక నైతికంగా సమచిత్తతను గోల్పోవడ మవుతుంది.

ఎండమావులు, మాయలు స్వాతంత్ర్యాన్నీ, భద్రతనూ కాపాడలేవు. కాబట్టి అమెరికన్లు వాటిని వెంటాడినందువల్ల ప్రయోజనం లేదు. దానికి బదులు ముఖ్యమైన మానవసమస్యలపై వారి కాలాన్నీ, తెలివితేటలనూ వెచ్చించినట్లయితే ఎన్నాళ్ళ నుంచో వారు వాయిదావేస్తూవచ్చిన సమస్యలను స్పృశించినవా ళ్ళవుతారు.

ప్రపంచంలో అధికభాగం యథాస్థితిని వ్యతిరేకిస్తూ వున్న సమయంలో హైడ్రోజన్‌బాంబు అమెరికన్లచేతికి వచ్చింది. ఈ వ్యతిరేకత అనేకరూపాలుగా వుంది. ఆసియా ఆఫ్రికాఖండాలలో వలసపాలనపై ద్వేషం రూపంలోనూ, జాతీయ తత్వవిజృంభణరూపంలోనూ ఇది వుంది. యూరపుఖండంలో ప్రచ్ఛన్నయుద్ధ సంఘర్షణవల్ల జనించిన నిరాశానిస్పృహల రూపంలో ఉంది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో, హీనమైన పౌరస్వత్వానికి వ్యతిరేకంగా నీగ్రోలు జరిపే పోరాటం రూపంలో వుంది. అభివృద్ధిచెందని ప్రాంతాలలో వ్యవసాయార్థికవ్యవస్థను సంస్కరించేందుకూ, పారిశ్రామికీకరణం చేసేందుకూ ఆయా ప్రాంతాల ప్రజలు లేవదీసే ఆందోళనల రూపంలో వుంది.

ఈసమస్యలు కమ్యూనిస్టులు సృష్టించినవి కావు. వాళ్ళు సృష్టించలేదని స్పష్టంగా చెప్పాలి. అయితే ఇలాంటి సమస్యలున్నచోట్ల వాళ్ళు వాటిని ఆసరాగా తీసుకొని గొడవలు లేపి తమ పార్టీప్రయోజనాలకై వాటిని ఉపయోగించుకొంటూ వుంటారు.

"బహిరంగదురాక్రమణ"ను సైనికచర్యలద్వారా ఎదుర్కొంటామని అమెరికన్లు ఉద్ఘాటిస్తున్నారు. ఇది సబబైన మాట. అత్యవసరంకూడా. కాని కమ్యూనిస్టులు లేవదీసే ప్రజాందోళనలనూ, వారి నాయకత్వాన జరిగే పోరాటాలనూ ఎదుర్కోవడానికి ఈ విధానం సరిపోదు. కారణమేమంటే, అట్టి ఆందోళనలకూ, పోరాటాలకూ మూలకందమైనవి పేదరికం, పీడన, దౌర్భాగ్యస్థితి వగైరాలు. ఇటీ వల అమెరికన్ విధానాలు ఆగ్నేయాసియాలో విఫలమైన వంటే అందుకు కారణం

పైన చెప్పిన అంశాలే. కాబట్టి ఈ అంశం ఎంత ముఖ్యమైందో అమెరికన్లు గమనించాలి.

రష్యాపాలకులు తమ లక్ష్యం ప్రపంచవిప్లవ మని చెబుతూ ఆ లక్ష్యసిద్ధికి పాటుపడుతూవున్నంతవరకూ సోవియట్ కూటమితో శాశ్వతమైన ఒప్పందం కుదుర్చుకోవడానికి తగిన ప్రాతిపదికే లేదు. అయితే పరిస్థితి ఇలాంటిది కదా అని చెప్పి అణ్వస్త్రాల అదుపు, ఆచరణసాధ్యమైన నిరాయుధీకరణ, ఐక్యరాజ్యసమితిని పటుతరం చేయడంవంటి సమస్యలకు పరిష్కారమార్గాలు వెతకకుండా వుండ కూడదు.

రష్యాపాలకులు అమెరికన్లకు బిగించిన మానసికబంధాన్ని సడలించే ప్రయత్నం చేయాలి. రష్యా ఏమంటున్నప్పటికీ, ఏమి చేస్తూవున్నప్పటికీ వాటినే పట్టుకు ఆలోచకుండా ప్రపంచదుస్థితికి హేతువులైన ముఖ్యసమస్యలను పరిష్క రించే పనిలో అమెరికన్లు వుండాలి.

జరగవలసిన నిర్మాణాత్మకకృషి ఎంతో వుంది. నిర్మాణాత్మకకార్యాలను రష్యా వారు ఆపలేరు. ఉదాహరణకు ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యాన అభివృద్ధి వ్యవస్థను నెలకొల్పే ప్రతిపాదనను రష్యావారు వీటోచేయలేరు. ఐక్యరాజ్యసమితితాలూకు సంస్థలైన ప్రపంచ ఆరోగ్యసంస్థ, ప్రపంచవ్యవసాయసంస్థ, ప్రపంచ విద్యా వైజ్ఞానిక సంస్థ, ప్రపంచబాలసంక్షేమనిధి, చివరకు సమితిసర్వసభ్యసమావేశం మున్నగునవి పెంపొందకుండా రష్యా వీటోచేసి అడ్డుపడలేదు.

రష్యా కలిసిరాకపోయినా తక్కిన రాజ్యాలన్నీ ఏకమై అణుశక్తికేంద్రీకృతవ్యవస్థను ఏర్పరచుకుంటా మంటే అందుకు రష్యా ప్రతిబంధకం కల్పించజాలదు.

అమెరికా రాజధానినగరమైన వాషింగ్టన్‌లో విజ్ఞత గల నాయకత్వం ఏర్పడటానికీ, అమెరికాప్రజల హృదయాలలో సద్భావం పొంగిపొరలడానికీ రష్యా అడ్డుపడలేదు.

ఒకప్పుడు చరిత్రకు ఆశాజ్యోతియైన అమెరికా ఇటీవల ప్రపంచంలోని రెండు వందల కోట్ల ప్రజల బుద్ధికీ, హృదయాలకూ తగు పని కల్పించడం లేదు. వారి

హృదయాలను అంతగా చూరగొనడంలేదు. వారిని సరిగా ఆకట్టుకోవడం లేదు. ఏయేవిషయాలను ఉద్ఘాటించడానికి అమెరికాప్రజలు పుట్టారో వాటి నెందుకు ఉద్ఘాటించడం లేదు? ఆసియాలో మొదటిసారిగా పెద్ద బాంబులు వేసిన అమెరికన్లు వారి కొత్త బాంబులను ప్రయోగించిచూచుకోవడానికి అక్కడికి ఎందుకు వెళ్ళారు? అమాయకంగా నిలబడి చోద్యం చూస్తూవున్న జపానుజాలర్లు అమెరికన్ల బాంబులకు ఆహుతి అయ్యారే! వారికి మానవాళితరఫున అమెరికన్లు క్షమాపణ చెప్పుకున్నారా? ఆపనిని ఇతరులకు ఎందుకు వదిలారు?

ఆమధ్య సింహళంలో జరిగిన మహాసభలో పండితనెహ్రూ ప్రసంగంలో "ఎవరిపైనా ఎట్టి ద్వేషభావం లేకుండా, అందరిపైనా సానుభూతి సద్భావాలతో" అన్న మాటలు వినిపించాయి. ఇవి ఎక్కడివి? అమెరికన్ ప్రజాస్వామ్యప్రారంభోత్సవంలో వెలువడ్డ వాక్యాలు. వీటిని నెహ్రూ ఎందుకు ఉద్ఘాటించారు? అమెరికన్లు విస్మరించారు కాబట్టి! ఈ వాక్యాలు లింకన్ దేశీయుల నోళ్ళనుండి వెలువడవలసినవి. అంటే అమెరికాప్రజలు వీటిని స్వదేశంలో, విదేశాలలో ఉద్ఘాటించాలి. కాని మనస్సులలో వుంటేనేగదా మాటలుగా వెలువడేది?

రష్యావారు కూడా పేదవారికీ, వారసత్వపు హక్కు గోల్పోయినవారికీ విజ్ఞప్తి చేస్తున్నారు. వాళ్ళు అమెరికన్ల నినాదాలను కొట్టేసి అమెరికన్ల సిద్ధాంతాలను ఎగతాళి చేస్తూవున్నారు. ఇది వారు ప్రజల్ని మభ్యపెట్టడానికి చేస్తూవున్న దుష్కార్యం. వెధవపని. అయితే ఇటువంటి మోసాలే కాలం గడచినకొద్దీ కార్యాన్ని సాధిస్తాయి. వారి ఉద్దేశాలను నెరవేరుస్తాయి. రష్యావారి కపటవిజ్ఞప్తులనూ, వారు వల్లించే వర్గరహితసమాజం అన్న కేకలనూ, సౌభ్రాత్ర మనే శుష్కనినాదాలనూ, న్యాయంపై ఆధారపడ్డ సమాజాన్ని నిర్మించి ఇస్తామని వారు పలికే ప్రగల్భాలనూ అమెరికన్లు లెక్కచేయకుండా వుండటానికి వీల్లేదు.

ఇది అమెరికన్లకొక సవాలు. దీనినుండి అమెరికన్లు తప్పించుకోలేరు. దీని నెదుర్కోవలసిరావడమే అమెరికన్లకొక గొప్ప అర్హత. కమ్యూనిస్టుల మాయోపాయాలను ప్రపంచానికి చాటాలి. ఎట్లా? మొదట అమెరికన్లు మాయోపాయాలను విడనాడాలి. అమెరికన్లలో వంచన లేకపోతే ఎదుటివాడి వంచనను బట్టబయలు చేయడం సులభం.

అమెరికన్లలో పిరికివాళ్ళు కానివారు చేయవలసిం దేమిటంటే—ఈతరం ప్రజలలోకి చొచ్చుకుపోయి సమకాలీనసత్యాలను ఎలుగెత్తి చాటి ఆ సత్యాలను సమర్థించడమే. ఏమి టాసత్యాలు? ఈ ప్రపంచంలో మానవుని భవిష్యత్తును మలకనగా కొట్టివేయవీలులేదు. ఘోరమైన విపత్తు దాపురించినప్పుడు లొంగి పోనక్కరలేదు. రాజకీయచతురతతో వినాశనంనుండి తప్పించుకోవచ్చు. మన నైతికప్రమాణాలు ఎక్కడికీ పోలేదు, ఇంకా వున్నాయి. కొన్ని అనర్థాలు, ముఖ్యంగా యుద్ధం, దురన్యాయంవంటివి శాశ్వతంగా వుండేటివిగా కనిపించవచ్చు. కాని అవి ఎప్పటికీ దుష్కృత్యాలే. గొప్ప తప్పిదాలే. వాటిని అమెరికన్లు నిరంతరం వ్యతిరేకిస్తూ ఎప్పుడో ఒకరోజు వాటిని ఓడించి విజయం సాధించాలి.

5

# ప్రజాశక్తి, భావసంపద

శ్రీ బౌల్స్ నౌకాయుద్ధకళాశాలలో ప్రసంగిస్తూ పూర్వంవలెనే ఇప్పుడుకూడా కేవలం సైనికశక్తిపై ఆధారపడివుండడం మంచిది కాదనీ, ప్రజాశక్తి, భావసంపద గొప్పవనీ, అవే మార్పులనూ, విప్లవాన్నీ తేగలవనీ నొక్కిచెప్పారు.

న్యూపోర్టు, రోడ్ఐలండ్, జూన్ 7, 1956.

వాషింగ్టన్‌లో ఒకరాత్రి విందుభోజనానికి వెళ్ళాను. నాచుట్టూ కూర్చున్న మిత్రులను "శక్తి" అంటే ఏమిటో నిర్వచించి చెప్పవలసిందిగా కోరాను. వారిలో సైనికాధికారులు, కాంగ్రెసుసభ్యులు, విదేశాంగశాఖోద్యోగులు వున్నారు.

"మనం తరచు శక్తి అని అంటూవుంటామే! అంటే అర్థమేమిటి? దేని నుద్దేశించి ఆమాట వాడుతాము?" అని ప్రశ్నించాను.

ఒక్కొక్కళ్ళు శక్తి అంటే తాము ఏమని భావిస్తున్నారో చెప్పారు. వారు చెప్పినవాటిలో నౌకావైమానిక పదాతిదళాలు, ఉక్కుపరిశ్రమ, పారిశ్రామికోత్పత్తి, భౌగోళికమైన వెసులుబాట్లు సముద్రాంతరసైనికస్థావరాలు వగైరా వున్నాయి.

ఈ నిర్వచనంలో నేటి కాలంలో అసలు ముఖ్యమైనదే లేదు. ఎనిమిదేండ్ల కాలంలో ప్రపంచజనాభాలో సగమైన, అంటే 120 కోట్ల ప్రజలు అమెరికన్లు ఏది 'శక్తి' అని నిర్వచించి చెబుతున్నారో అది లేకుండానే వారి ప్రభుత్వస్వరూపాలనే మార్చుకున్నారు.

పూర్వంనుంచి ఏది శక్తి అని భావిస్తున్నామో అది ప్రతిసందర్భంలోనూ చాలావరకు యథాస్థితివైపే వుంది. అట్టి శక్తి సమగ్రమైనది కాదని పలుమార్లు

రుజువయింది. అది సమగ్రమైనది కాదని ప్రపంచంలో వచ్చిన మార్పులే తెలియ పరిచాయి.

ఉదాహరణకు చైనాను తీసుకోండి. చైనాలో మావ్‌సే టుంగ్ రెండువందల తుపాకులతో, వెయ్యిమంది మనుష్యులతో, కమ్యూనిస్టునియంతృత్వ మనే సిద్ధాం తంతో ఆరంభించి ఇరవైయేండ్లలో జాతీయమహావిజయాన్ని సాధించగల బ్రహ్మాండమైన ప్రజోద్యమాన్ని నిర్మించగలిగాడు. కమ్యూనిస్టుసిద్ధాంతం ప్రాచీన చీనాసమాజం రీతికి అనుగుణంగా వుండటంచేత అక్కడి ప్రజల కది నచ్చింది. చైనాలోని సాంప్రదాయిక సైనికపారిశ్రామికశక్తులు బాలావరకు క్యూమింటాంగ్ వర్గాన్ని బలపరచినప్పటికీ మావో, అతని కమ్యూనిస్టు అనుచరులు చైనాదేశపాలకు లయ్యారు.

ఇండోచైనాలో భావశక్తిని చూచి వున్నాము. అక్కడ అది జాతీయోద్య మంతో ముడిపడివుంది. ఇండోచైనా స్వాతంత్ర్యం విషయంలో ఫ్రెంచివారు ఇదమిత్థంగా వ్యవహరించలేకపోవడంచేత కమ్యూనిజము, జాతీయవాదము ఏకమై బ్రహ్మాండమైన శక్తిగా రూపొందాయి. చైనాలో వలెనే ఆగ్నేయాసియాలో కూడా టాంకులు, విమానాలు, తదితర సాంప్రదాయకసైనికశక్తిమార్పు పద్దంటూ యథా స్థితినే బలపరిచాయి. ఫ్రెంచిసైన్యాలు సర్వసమర్థమైనవి. ప్రపంచంలోని సైన్యా లలో ఉత్తమమైన పని పేరెన్నిక గన్నవి. ఫ్రెంచివారికి తోడ్పడటానికి అమెరికన్లు మూడువందలకోట్ల డాలర్ల విలువ గల సైనికసామగ్రిని తీసుకు పోయి పడేశారు. అయినప్పటికీ ఫ్రెంచివారు ఆ ప్రాంతాన్ని గోల్పోయ్యారు. వారితోపాటు అమెరికన్లూ గోల్పోయారు.

భారతదేశంలో నిర్మాణాత్మక ప్రజాస్వామ్యభావం విజయం పొందడం అమెరికన్లు చూస్తున్నారు. అహింసాత్మకమైన ఉద్యమంద్వారా స్వాతంత్ర్యం సాధించాలని గాంధీ ప్రతిపాదించిన ఉద్యమం భారతప్రజల స్వభావానికీ, వారి ఆశయాలకూ సరిపోయింది. గాంధీజీసిద్ధాంతమూ, ఆయన కార్యవిధానమూ బహు సామాన్యమైనవి. కాని ఆయనలో గొప్ప రాజకీయచతురత వుంది. ఉద్యమాన్ని పెద్దపెట్టున నిర్మించగల సామర్థ్యం వుంది. కాబట్టే బ్రిటీషువారు ఇండియా, పాకిస్తాన్, సింహళం, బర్మాదేశాలను వదిలివెళ్ళవలసివచ్చింది.

మరి బ్రిటిషువారికికూడా సాంప్రదాయికమైన సైనికశక్తి అపారంగా వుంది.

సైనికశక్తి రీత్యా ప్రపంచంలో వారు మూడవ స్థానంలో వున్నారు. అయినా గాంధీజీభావశక్తిముందు, సిద్ధాంతబలంముందు నిలువలేకపొయ్యారు.

అలాగే ఇండోనీషియా విషయం తీసుకుంటే డచ్చివారికి షెర్మన్‌టాంకు లుండేవి, పి-38 రకం, ఆధునికమైన మెషీన్‌తుపాకులూ వుండేవి. అన్నీ వున్నా లాభంలేకపోయింది. ప్రజల స్వాతంత్ర్యేచ్ఛ నెగ్గింది.

కాబట్టి అమెరికన్లు నేర్చుకోవలసిన గుణపాఠం ఏమిటి? యథార్థవిషయా లను గమనించి 'శక్తి' అనే మాటకు అమెరికన్ నిర్వచనాన్ని కొంచెం విస్తృతం చేసుకోవాలి. ప్రజాశక్తినీ, సిద్ధాంతబలాన్నీ, భావసంపదనుకూడా అమెరికన్లు చెప్పుకునే నిర్వచనంలో చేర్చుకోవాలి. విప్లవాత్మకమైన నూత్నప్రపంచంలో మార్పులను నిర్ణయించేవి ఈ శక్తులే. వీటికే ఎక్కడ లేని బలం వుంది. స్వాతం త్ర్యాన్నీ, సదవకాశాలనూ కోరేకోట్లాదిప్రజలను ఈ శక్తులద్వారా మాత్రమే గొప్ప ఉద్యమాలవైపుకు ఆకర్షించి యథాస్థితిప్రభుత్వాలపై పెద్ద వత్తిడి తెచ్చి నవప్రపం చాన్ని నిర్మించగలరు.

కాని దురదృష్టకరమైన విషయ మేమిటంటే ఒకవేపు అశేషప్రజానీకం మార్పులకోసం ఎదురుతెన్నులు చూస్తూవుంటే అమెరికన్లు పాతను నిలబెట్టా లనే వారిని సమర్థించవలసిన స్థితిలో పడ్డారు.

సోవియట్ విధానంకూడా ఎన్నో వైఫల్యాలు పొందింది. అందుకు ముఖ్య కారణం ఆసియా ఆఫ్రికాఖండాల ప్రజలు ఏమికోరుతున్నారో స్టాలిన్ గ్రహించలేక పోవడమే. ఏయే ముఖ్యశక్తులు రంగంలో పనిచేస్తున్నాయో అమెరికన్లు తెలుసుకో లేకపోయినట్లే సోవియట్ యూనియన్‌కూడా అజ్ఞానంవల్ల వాస్తవ స్థితిగతులను అర్థంచేసుకోలేకపోయింది.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసినతర్వాత రష్యావారు చాటుమాటు ఎత్తులు ఎన్ని వేసినప్పటికీ, ఎంత ప్రచారం చేసినప్పటికీ ఎర్రసైన్యం యుద్ధంలో ఆక్ర మించుకున్న భూభాగంమినహా పైన ఒక్క అంగుళంమేరకూడా యూరపులో ఆక్రమించుకోలేకపొయ్యారు. ఆసియాలోకూడా రష్యావారు విఫలమనోరథు లయ్యారు. ఇది మరీ విడ్డూరం!

చైనా అధ్యక్షుడు సన్‌యత్‌సెన్ చిక్కులలో పడి, తన్నుకుచస్తూవున్న తన నూత్నప్రభుత్వానికి ఆర్థికసహాయం చేయవలసిం దని 1923 లో అమెరికా

వారిని అభ్యర్థించాడు. కాని ప్రయోజనం లేకపోయింది. చివరకు విసుగెత్తి రష్యా వారి సహాయ మర్థించాడు. రష్యావారిలో లీనమైపోనక్కరలేకుండానే లెనిన్ సిద్ధాంతాలనూ, భావాలనూ ఎరువుతీసుకొని సోవియెట్ పెట్టుబడినీ, సాంకేతిక విధానాలనూ వినియోగించుకొని గట్టెక్కవచ్చు ననుకున్నాడు.

కాని సన్‌యత్‌సెన్ తెలివితక్కువవల్ల చైనా చెడిపోకుండా అప్పటికి కాపాడింది స్టాలిన్ తప్పటడుగులే నని చెప్పాలి. చైనా ప్రభుత్వ ఆహ్వానంపై బొరోడిన్ ప్రతినిధివర్గం చైనాకు వెళ్ళింది. వెనుకబడివున్న దేశాన్ని చక్కగా వ్యవస్థీకరించి ఇరవయ్యో శతాబ్ది ఆధునికదేశంగా ఎట్లా రూపొందించవచ్చునో చూపడానికే ఈ ప్రతినిధివర్గం వెళ్ళింది. అప్పుడే నిలదొక్కుకొంటూవున్న సోవియట్ రష్యాకు ఇది ఎంత చక్కని అవకాశం!

అయినప్పటికీ ప్రతినిధివర్గం పూర్తిగా విఫలమైంది. ప్రతినిధివర్గం సభ్యులు విప్లవాలను నగరకార్మికులూ, విద్యార్థులే సృష్టిస్తారన్న మార్క్స్ పాత సిద్ధాంతాన్ని పట్టుకు ప్రేలాడారేతప్ప, వ్యావసాయికదేశంలో కీలకమంతా రైతుల చేతుల్లో వుంటుందన్న లెనిన్‌సూక్తిని పూర్తిగా విస్మరించారు.

సోవియట్‌రష్యా చేస్తూవున్న తెలివితక్కువ పనిని మావో గ్రహించి పట్టణాల పొంతకు పోక, గ్రామసీమలలోకి చొచ్చుకొనిపోయి తరతరాలుగా రైతులకు జరుగుతూవున్న అన్యాయాన్ని అర్థంచేసుకొని రైతాంగాన్ని సమీకరించడమే తాను చేయవలసిన పని అనుకున్నాడు.

మావోసూత్రం చాలామందికి నచ్చింది. అందులో బలముందని తేలిపోయింది. "భూస్వాములనూ వడ్డీవ్యాపారస్థులనూ సమూలంగా నాశనంచేయండి. అప్పుడు మీకు స్వేచ్ఛ లభిస్తుంది" అని మావో ప్రబోధించాడు. ఇరవైయేండ్లలో మావో, ఆయన అనుచరులు వారి సూత్రాన్ని చైనాఅంతటా వ్యాపింపజేయగలిగారు.

ఈలోగా చైనాలో కలిగిన వైఫల్యంవల్ల నేర్చుకోవలసిన గుణపాఠాలను స్టాలిన్ నేర్చుకోలేకపోయ్యాడు. విద్యార్థులనూ, ఎక్కడా లేనట్టి ప్రొలిటేరియేట్ అనబడే సామాన్యవర్గపు ప్రజనూ పునాదిగా పెట్టుకొని ప్రపంచవిప్లవాన్ని సాధించాలని చూచాడు. ప్రజానీకంలో నూటికి 80 వంతుల మందై వుండి రాజకీయంగా కీలకస్థానంలో వుండే కర్షకులను విస్మరించాడు.

ఇటువంటి తెలివితక్కువ విధానం ఫలితాలు 1949-50 ప్రాంతాలలో భారత

దేశంలో కమ్యూనిస్టుల కార్యకలాపాలలోనే కన్పట్టాయి. 1948 చివరన హైదరాబాదులో పెద్ద దుమారంలా రైతాంగవిప్లవం విజృంభించింది. స్టాలిన్ పంథాను వ్యతిరేకించిన పార్టీసభ్యుల ముఠా ఒకటి గ్రామసీమలలో పోగై ఈ విప్లవాన్ని లేవదీసింది. వీరికి "దారితప్పిన కమ్యూనిస్టులు" అన్న పేరుపెట్టారు. ఈ ముఠా కొన్నివేల గ్రామాలను తన వశం చేసుకుంది. చివరకు భారతప్రభుత్వసైన్యం ఎంతో కష్టంమీద ఎందరో సైనికులు బలికాగా ఈ విప్లవాన్ని అణచివేయ గలిగింది.

ఈ "దారితప్పిన ముఠా" వారు రష్యానుంచి వచ్చే ఉత్తరువులను ఉల్లంఘించడమే గాక భారతదేశంలోని తమ స్వంత కమ్యూనిస్టుపార్టీ అభిమతానికి వ్యతిరేకంగా నడచుకున్నారు. దాదాపు విజయాన్ని చేపట్టేటంతపనిచూ వచ్చారు. కాని ఆ ప్రమాదం కొద్దిలో తప్పిపోయింది. భారతదేశ కమ్యూనిస్టులంతా ఈ ముఠాను గట్టిగా సమర్థించివుంటే భారతదేశంలో వీరు శాశ్వతమైన స్థావరాన్ని నెలకొల్పుకొని అక్కడినుంచి తమ కార్యకలాపాలను సాగించేవారే. అదృష్టవశాత్తూ రష్యాపాలకులు రైతాంగపు రాజకీయశక్తిని గ్రహించనివారు కావడంచేత వారిని బలపరచ నిరాకరించారు.

స్టాలిన్ మరణానంతరం రష్యా ఎత్తుగడలలో చాలా మార్పువచ్చింది. ప్రపంచాధిపత్యమనే తమ అంతిమలక్ష్యాన్ని విడనాడకుండానే సోవియట్ రష్యా ఇప్పుడు యూరపు, ఆసియా ఖండాలలో ఆర్థికస్వార్థ మనే ప్రాతిపదికపై సంబంధాలు పెంపొందించుకొన ప్రయత్నిస్తున్నది.

వారి రాజకీయలక్ష్యాలలో పెద్దమార్పేమీ రాలేదు. అయితే ప్రస్తుతానికి వాటిని తెలివిగా వెనక్కినెట్టారు. ఇప్పుడు ప్రాథమిక సంస్కరణలు అవసరమని బయటికి అంటున్నారు. అటువంటి సంస్కరణలు ఏనాడో రావలసినవని అంతా అంగీకరిస్తూనేవున్నారు. ఈ మాట వారు చెప్పవలసిన పని లేదు. మరి ఎందుకు చెబుతున్నట్లు? ఎందుకంటే - క్రమంగా మెల్లగా ఆసియాఖండాన్ని సోవియెట్ వలయంలోకి లాగడం వారి ముఖ్యోద్దేశం.

సోవియట్‌పాలకుల కొత్త ఎత్తుగడలు అమెరికన్లకు ప్రమాదకరం కావచ్చు. ఈనాడు అమెరికన్లకు అవసరమైన పారిశ్రామిక ముడిసరుకులలో నూటికి 50 వంతుల సరుకును ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రాంతాల

నుంచి దిగుమతి చేసుకుంటున్నారు. ఇది 1965-70 వరకల్లా నూటికి 70 వంతులు కావచ్చునని పేలీనివేదిక సూచిస్తున్నది.

సోవియట్ రష్యా ఎత్తిన ఈ ఎత్తువల్ల అమెరికన్లకూ, పైన పేర్కొన్న ఖండాలకూ సంబంధాలే లేకుండాపోతే క్రమేణా అమెరికన్ సైనికశక్తి క్షీణి స్తుంది. అమెరికన్ జీవనప్రమాణానికి ఆఘాతం కలుగుతుంది.

ఇట్టి పర్యవసానాన్ని తెచ్చిపెట్టడమే రష్యావారి ముఖ్యాశయం. ఈనాడు వారి ఎత్తులు, జిత్తులు బలే నేర్పుతో కూడుకొనివున్నాయి.

అమెరికన్ విధాననిర్ణేతలకు ఒక విషయం ప్రత్యేకంగా ముఖ్యమైంది. అమెరికన్లకు అండగా నిలబడటానికి సిద్ధంగావున్న దేశాల విషయంలో అనుకూల పక్షంగా వుండి, అమెరికన్లను బలపరచటానికి నిరాకరించే దేశాలను తెగనాడడం సహజం. మానవుని నైజమే అంత.

అయితే అమెరికా సంయుక్త రాష్ట్రాలపట్ల ఇతరదేశాల విధేయతను అమెరికన్లు డబ్బిచ్చి కొనలేరు. అమెరికాప్రజల జీవనప్రమాణాన్ని నిలబెట్టి, వీలైతే మరికొంత పెంపొందింప జేయడానికి మీరంతా మీ ప్రాణాలైనా ఇవ్వ డానికి ఉద్యుక్తులుకావాలని అమెరికన్లు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాల ప్రజలను కోరలేరు. వారు అలా వ్యవహరించాలని అమెరికన్లు ఆశించలేరు. తదితర మానవజాతివలెనే వారుకూడా వారి దేశంకోసం, వారు ఏది తమకు శ్రేయ స్కరమైనదని భావిస్తారో దానికోసం త్యాగాలు చేస్తారుగాని ప్రతిదానికోసం ప్రాణా లర్పించరు.

కాబట్టి వారి శ్రేయస్సునే అమెరికా తన శ్రేయస్సుగా భావించుకోవాలి. వారి మేలే అమెరికా 'మేలని ఎంచాలి. ఈ పని కేకలు, నినాదాలువంటి వాటివల్లగాక క్రియద్వారా సాధించాలి. వారు ఏవి ముఖ్యమైన లక్ష్యాలుగా, ఉభయసాధార ణాశయాలుగా భావిస్తారో వాటిని పరిరక్షించి, వీలైతే వాటివిస్తృతికోసం పాటు పడాలి.

అమెరికనులకు ఇట్టి లక్ష్యాలను అవగాహన చేసుకొని ఆమోదించడం చాలా సులభం. ఏమి టాలక్ష్యాలు? వలసపాలననుండి విముక్తి: జాతిమతవర్ణ విచక్షణ లేకుండా సర్వమానవులకూ సమాన గౌరవమన్ననలు; ఇతోధికంగా ఆర్థికావకాశాలు. వీటిని సమర్థించేస్థితిలో ఉండడం అమెరికన్ల అదృష్టవిశేషం.

# 6

# యథార్థాలను వారు గమనించారా?

అమెరికా విధానాలలో గల "సిద్ధాంతసంబంధమైన శూన్యత''ను గట్టిగా వ్యతిరేకిస్తూ శ్రీ బౌల్స్ అమెరికన్లు ప్రాముఖ్యమిచ్చే అంశాలలో మార్పు రావలెననీ, అమెరికాగొప్పతనానికి తగిన నూత్నమార్గాలను అవలంబించవలెననీ ప్రబోధించారు.

న్యూయార్కు-టైమ్సు మేగజైన్ (1956 మే 20) నుంచి.

నేటి అమెరికావిదేశాంగవిధానాన్ని ముందుముందు విమర్శించేవారు ఒక విషయంపై ముఖ్యంగా దృష్టిని కేంద్రీకరిస్తారు. ఆవిషయంపై ఈనా డెవరూ వ్యాఖ్యానం చేయరనుకోండి. విషయ మేమిటీ అంటే—అధికసంఖ్యాకులు తమ లక్ష్యంగా స్వీకరించగల లక్ష్యం అమెరికన్లకు లేకపోవడం; వున్న లక్ష్యంలో సిద్ధాంత సంబంధమైన శూన్యత వుండడం.

అమెరికన్ల విదేశాంగవిధానాన్ని కూలంకషంగా పరిశీలించి కొత్త అంచనాలతో కొత్త లక్ష్యాలను చేర్చి నూత్నవిధానాన్ని రూపొందించవలె నని రిపబ్లికన్ పక్షంవారూ, డెమోక్రటిక్ పక్షంవారూ చాలామంది కోరుతున్నారు.

అయితే ఈ పరిశీలన కేవలం ఆయవ్యయాలను సమీక్షించడం, ఖర్చు పద్దులను నిర్ణయించడం, అమెరికన్ ఎత్తుగడలను వెనక్కి తిరిగి చూచుకోవడం వరకుమాత్రమే పరిమితమైతే అది చాలా సంకుచితమైఖరి అని చెప్పాలి. విదేశాంగ విధానమే పరమలక్ష్యంకాదు. ఒక జాతి, లేదా ఒక దేశం దాని సరిహద్దుల కావల దాని జాతీయాదర్శాలను అనుసరించాలంటే విదేశాంగవిధాన మనేది ఒక సాధనం.

దీనివల్ల ఒక ముఖ్యప్రశ్న ఉదయిస్తుంది. అమెరికాజాతీయాదర్శ మేమిటి? ప్రపంచంనుంచి దానికి కావలసిం దేమిటి? అది ఏమి చేయడానికి సిద్ధంగా వుంది?

అమెరికనులకు కావలసింది సైనికకార్యక్రమాల సమీక్షలు, కూటములు, మిత్రబృందాలు, విదేశీసహాయకార్యక్రమాల అంచనాలు మాత్రమే కాదు. వాటి కన్న ముఖ్యమైనవి వున్నాయి. ఏమి టవి? సాటిమానవులతో అమెరికన్ సంబంధాలు ఎలా వున్నాయి? ప్రపంచవ్యవహారాలలో అమెరికా సమంజసపాత్ర ఏమిటి? అమెరికా జాతీయాదర్శాలూ, లక్ష్యాలూ ఏమిటి? ఈ అంశాలను అమెరికన్లు పునరాలోచించి సక్రమ నిర్ణయాలు గైకొనాలి.

అమెరికా విదేశాంగవిధానంలో నీతినియమాలకు సముచితస్థాన మున్నదని అనేవారికి యథార్థాలు సరిగా తెలియవని కొందరు ఈసడించడం పరిపాటిగా వుంది. కాని ఇది ప్రపంచవ్యవహారాలలో సిద్ధాంతసంబంధమైన దివాలాకు చిహ్నమని అంతా తెలుసుకోవాలి.

వ్యక్తిగతలావాదేవీలలో నీతినియమాలు ముఖ్యమైనవని ఈ విమర్శకులు అంగీకరిస్తారు. కాని విదేశాంగవిధానం వాటికన్న క్లిష్టమైన వ్యవహారం. ఇందులో శక్తినిగూర్చి ఆలోచించేటప్పుడు చనువుకూ, సడలింపుకూ తావుండరాదనీ, కొంచెం కఠినంగా వుండాలనీ వా రంటారు.

మాజినోశ్రేణి శక్తిసిద్ధాంతం అంతర్జాతీయ వాస్తవికతలో పరాకాష్ఠ అని చాలామంది అంగీకరిస్తారు. ఆ సిద్ధాంతం ప్రస్తుతప్రపంచవ్యాప్త సందిగ్ధస్థితికి మూలమవునో కాదో నాకు సరిగా బోధపడడం లేదు. ఈసంకుచితవిధానం అమెరికన్లను ఎటువంటి అపాయకరమైన అంచులకు తీసుకుపోయిందో పరిశీలింతాము.

1940 మొదలు 1950 లోపల అమెరికన్లు ఎంతవరకు వాస్తవపరిస్థితిని గమనించి మెసులుకున్నారో ఆలోచిద్దాము. అప్పటి జాతీయచైనాప్రభుత్వం విశాల ప్రాతిపదికపై ఏర్పడినట్టిది కాదు. అది ఫ్యూడల్ భూస్వామివ్యవస్థపై ఆధారపడినట్టిది. దాని నాయకత్వం చూద్దామా చైనాప్రజలతో సంబంధం గోల్పోయినట్టిది. అటువంటి ప్రభుత్వం మావ్‌సేటుంగ్ రేపిన విప్లవశక్తులను అరికట్టగల దని అమెరికన్లు అనుకున్నా రే! అలాంటిది జరుగుతుందని ఆశించడం వాస్తవస్థితి ఎరిగి ప్రవర్తించడమేనా?

అలాగే ఇండోచైనాలో కమ్యూనిస్టులను నిలుపరించగలమని అనుకున్నా రే, అది అయ్యే పనేనా? అక్కడి కమ్యూనిస్టువ్యతిరేకప్రయత్నాలన్నీ చావుకు సిద్ధంగా వున్న ఫ్రెంచివలసవాదంపై ఆధారపడినట్టివి కదా! ఆ ఫ్రెంచివలసవాదం ఒకవంక

కాలదోషం పట్టిన భూస్వామ్యవ్యవస్థకూ, మరొకవంక స్థానిక అవినీతికీ, అన్యాయాలకూ ముడివేసుకొనివున్నట్టిది కదా! ఆపరిస్థితిలో ఎంత బాగా పోరాడగల సైన్యమున్నా అది కమ్యూనిస్టులను అణచివేయగలుగుతుందా?

కొరియా విషయంలో కమ్యూనిస్టుచైనా ప్రభుత్వం చేసిన హెచ్చరిక వట్టి బుకాయింపుమాత్రమే ననీ, కొరియాయుద్ధంలోకి దిగే దమ్ములు చైనాకు లేవనీ అనుకొని ఐక్యరాజ్యసమితిసైన్యాలను 38 వ అక్షాంశరేఖనుదాటించారే! తరువాత ఏమి జరిగింది? సరిగ్గా మూడేండ్లతర్వాత ఆ రేఖవద్ద యుద్ధవిరమణసంధి చేసుకున్నారుకదా! వాస్తవపరిస్థితి తెలిసే వ్యవహరించారా?

దక్షిణ ఆసియా విషయంలో ఏమిచేశారు? అమెరికన్లకు మంచినేస్తంగా వున్న పాకిస్తానుకు ఆయుధా లిచ్చారు. పాకిస్తానుకు ఆయుధా లివ్వడంతో ఆఫ్ఘనిస్తాన్‌ను హడలగొట్టినవాళ్ళయ్యారు. వాళ్ళు వెళ్ళి రష్యాసహాయం పొందారు. భారతదేశంకూడా ఆందోళనపడి తన సైనికపాటవం బాగా వృద్ధిచేసుకుంది. అమెరికన్ల సైనికసహాయకార్యక్రమంవల్ల కీలకమైన ఆ ప్రాంతంలో భద్రత హెచ్చుతుందని అనుకున్నారే! అది సబబేనా?

పాశ్చాత్యవలసపాలకులైన అమెరికా మిత్రులతో విభేదాలు రాకుండా చేసుకుందామన్న ఉద్దేశంతో ఆఫ్రికాలో విజృంభిస్తూవున్న జాతీయతత్వాన్ని తక్కువగా చూచారే! ఆఫ్రికన్ జాతీయతత్వం అనివార్యమైంది కదా. అత్యంతశక్తివంతమైనది కదా!

రాజకీయమైన పునాదిగాని, ఆర్థికమైన పునాదిగాని లేనట్టి ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికను కొత్త ఎత్తులతో బలహీనం చేయడం ఎవరి తరం కాదనీ, అమెరికన్లు చెప్పేషరతుల ప్రకారమే రెండుగా చీలివున్న జర్మనీని ఏకం చేయవచ్చుననీ అనుకున్నారే! అది సమంజసమేనా?

ఇవన్నీ అనుకోవడంలోనే అమెరికన్ల సంకుచితభావాలు వెల్లడి అయ్యాయి. ప్రపంచపరివ్యాప్త విప్లవం జరుగుతూవున్న ఒకానొక దశలో అమెరికా విధాననిర్ణేతలు సిద్ధాంతాలకూ భావాలకూ ఎంత శక్తి వున్నదో అర్థంచేసుకోలేకపొయ్యారనీ, ప్రజాశక్తిని తక్కువ అంచనా వేశారనీ విదితమవుతూవుంది.

భావాలు, సిద్ధాంతాలు మానవులను ప్రభావితం చేసినంతవరకూ, మానవులూ, వారి ఆశయాలూ శక్తికి ముఖ్యాంగమై వున్నంతవరకూ మంచి భావాలు,

చెడుభావాలు రెండూ జాతులను, దేశాలను తారుమారుచేస్తాయి; సైన్యాలను ఎదిరిస్తాయి. చరిత్రను సృష్టిస్తాయి. శక్తికి గల ఈ ముఖ్యపరిమాణాన్ని గ్రహించి పరిగణించామంటే అదే సవాస్తవికత అని నా అభిప్రాయం. విల్సన్, రూజ్వెల్టు దీనిని అవగాహనచేసుకున్నారు. కాని ఈతరం నాయకులు తరచు దీనిని లెక్కచెయ్యలేదు.

కనుక అమెరికన్లు సిద్ధాంతాలకూ, రక్షణకూ సమతూకాన్ని అన్వేషించాలి. అంటే ఆ రెండిటికీ తూకం సరిగ్గా వుండేట్టు చూడాలి. ఒకటి క్రిందికి మొగ్గి, మరొకటి పైనే వుంటే అది మంచి స్థితి కాదు. అమెరికన్లు స్వయంనిర్ణయం, మానవప్రతిపత్తి, విశేషావకాశాలు అనే లక్ష్యాలను అభిలషిస్తున్నారు. ఇవే లక్ష్యాలుగా గల ప్రజలు ఈనాడు ప్రపంచంలో అనేకమంది వున్నారు. అట్టివారి నందరినీ చైతన్యోద్దీపితమైన స్వాతంత్ర్య పతాకం క్రిందికి తీసుకురావాలి. మరొకవంక ఈ లక్ష్యాలను పట్టుదలతో అనుసరించేందుకై కవచంగా వుండగల సుదృఢరక్షణ శ్రేణిని నిర్మించాలి.

త్వరితగతిని మారుతూవున్న నేటి విప్లవాత్మకప్రపంచంలో అమెరికన్లు వేటిని స్వప్రయోజనాలుగా పెట్టుకొని వున్నారో అవే ఇతరులకుకూడా వారి ప్రయోజనాలుగా వున్నవి. ఇట్లా అమెరికన్లకూ, ఇతరులకూ ఏయే ప్రయోజనాలు ఉభయ సామాన్యంగా వున్నవో తెలుసుకుంటే ఆశ్చర్యం వేస్తుంది.

సంవత్సరంక్రిందట ఆసియా ఆఫ్రికాఖండాలకు చెందిన 28 దేశాలవారు బాండుంగ్‌లో సమావేశమై వారి నాలుగుప్రాథమికలక్ష్యాలనూ ఇట్లా వివరించారు: వలసాధిపత్యంనుంచి స్వేచ్ఛ, జాతిమతవర్ణవిచక్షణ లేకుండా వ్యక్తికి గౌరవమన్ననలు; విశేషంగా ఆర్థిక అవకాశాలు; శాంతి.

ఇవి మార్క్సిస్టుభావనలు కావు. ఇవి పాశ్చాత్యభావనలు. అమెరికనుల భావనలు. జెఫర్సన్, లింకన్, విల్సన్, రూజ్వెల్టు మొదలైన మహానుభావులు వాంఛించిన అమెరికన్ విప్లవప్రతిబింబాలే ఈ నాల్గుభావనలరూపంలో ఆ రెండు మహాఖండాలలో సాక్షాత్కరించాయి.

ఈప్రపంచంలో అమెరికన్లకు ఒక ప్రయోజనము, ఒక లక్ష్యము అనేవి వున్నట్లయితే-వున్నవనే నేను అనుకుంటాను. ప్రపంచమంతటా ఉదారప్రజాస్వామ్యభావనను ప్రపంచమంతటా పరిరక్షిస్తామనీ, వీలైతే విస్తృతం చేస్తామనీ

సర్వప్రజలకూ హామీ ఇవ్వడమే అమెరికన్ల లక్ష్యమై వుండాలి. అట్టి ఉదారప్రజాస్వామ్యంలో మానవుని గౌరవమన్ననలకూ, నీతినిజాయితీలకూ విశేషాదరణ వుంటుందని ఉద్ఘాటించాలి.

ఇదే అమెరికన్ల లక్ష్యమైతే ఇతరప్రజలపట్ల అమెరికాసంబంధాలలో ప్రాముఖ్య మివ్వవలసిన అంశం మారాలి. అమెరికాభద్రతకు, అభివృద్ధికి, పెంపుకు కొత్తవిధానాలు అనుసరించాలి.

నేను అమెరికాలో తూర్పుపడమర, ఉత్తరదక్షిణప్రాంతా లన్నింటిలోనూ పర్యటించాను. ఎక్కడికి వెళ్ళి చూచినా అమెరికాప్రజలు తమ నిరాశానిస్పృహలను విడనాడి ఒక కొత్త దిశగా పయనించవలెనన్న అభిలాష కలిగివుండడం చూచాను.

ఒకవేళ ఎక్కడైనా ప్రపంచంలో అమెరికా వహించవలసిన పాత్ర విషయమై అమెరికా ప్రజలలో సంకుచితదృక్పథం వున్నట్లు గోచరించిందంటే అందుకు కారణం అమెరికన్ మహాపురుషులు ఇంతకుముందు చరిత్రలోని క్లిష్ట దశలలో ఎటువంటి విశాలదృక్పథం వుండవలెనని ప్రబోధించారో అలాంటి దృక్పథాన్ని అమెరికాదేశ ఉభయరాజకీయపక్షాలవారూ ప్రబోధించలేకపోవడమే.

# 7

# యూరపులో అమెరికా లక్ష్యం-రష్యాలక్ష్యం

యూరపు ఖండం నట్టనడుమ సైనికదళాలను దళలవారీగా తగ్గించి వేసుకున్నట్లయితే ఉభయపక్షాలవారికీ మేలని శ్రీ బౌల్స్ సూచించారు. ఈ ప్రతిపాదనవిషయంలో శ్రీ కృశ్చేవ్ వ్యక్తం చేసిన వైఖరిని న్యూయార్కు టైమ్సుమేగజైన్ పత్రికలో 1957 మే 12 తేదీన వెలువడ్డ యీవ్యాసం చర్చించింది.

అమెరికన్లు యూరపులో దేనిని కోరుతున్నారు? యూరపుపారిశ్రామిక, సైనిక శక్తి అమెరికన్లకు వ్యతిరేకంగా వ్యవస్థీకరింపబడకుండా తగు జాగ్రత్త వహించడమే అమెరికా భద్రతకు ముఖ్యాంశం.

యూరపును పరేశక్తిగాని, లేదా శక్తుల బృందముగాని కబళించి ఆధిపత్యం వహించకుండా చేసేందుకై బ్రిటను అయిదు పెద్ద యుద్ధాలలో పాల్గొన్నది. రెండవ ప్రపంచయుద్ధానంతరం బ్రిటిషువారి సైనికపాటవం తడబడ్డప్పుడు దూరదృష్టి గల అమెరికన్ నాయకులు ఆ లోటును భర్తీచేయవలసిన అవసరాన్ని గుర్తించారు. లేకపోతే క్లిష్టస్థితి ఉత్పన్న మవుతుందని వారికి తెలుసు.

1947 లో మధ్యధరాసముద్రప్రాంతంపై సోవియట్ యూనియన్ వత్తిడి పడ్డప్పుడు సాహసించి ట్రూమన్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం జరిగింది. మధ్య యూరపునుంచి, తూర్పుయూరపునుంచి ఉపసంహరించుకోవడానికి రష్యా నిరాకరించినప్పుడు అమెరికన్లు జర్మనీలో తగు సైనికదళాలను దించి వాటిని అక్కడే కొంతకాలం వుంచారు. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక వ్యవస్థతాలూకు రక్షణ శ్రేణిని తగు ఆయుధాలతో బలపరిచారు.

యూరపుసౌభాగ్యానికీ, దాని రాజకీయస్థిరత్వానికీ గల సన్నిహితసంబంధాన్ని గ్రహించినవారు కాబట్టి యూరపులో యుద్ధంవల్ల కలిగిన నష్టాన్ని పూరించి కొత్తనిర్మాణాలు జరిపేందుకు, యుద్ధానంతరం యూరపు ఆర్థికవ్యవస్థ గమనీయంగా పెంపొందేటందుకూ తగు పునాదులు వేయడానికి కొన్ని వందల కోట్ల డాలర్లు ఖర్చుపెట్టారు.

చాలామంది అమెరికన్‌లు యూరపును ఒక భౌగోళికప్రదేశంగా మాత్రమే గాక అంతకు మించిన దానినిగా పరిగణిస్తారు. ఎందుకంటే యూరపుతో అమెరికన్లకు గల మత, చారిత్రక, సాంస్కృతిక, సిద్ధాంతసంబంధాలు కడు సన్నిహితమైనవి. అసలు అమెరికాప్రజలలో నూటికి 90 మంది యూరపుకు చెందినవారే కదా!

1944 నుంచి తూర్పుయూరపుజాతులు చాలావరకు సోవియెట్ పరిపాలనాధిపత్యంక్రింద వున్నప్పటికీ, ఆప్రాంతప్రజల బాగోగుల విషయమై అమెరికన్లు సదా ఆందోళనపడుతూనేవున్నారు. కారణ మేమంటే, వారి బంధువులు, మిత్రులు అమెరికాలో విశేషంగా ఉన్నారు. వారిపట్ల అమెరికన్ల ఆందోళన యథార్థమైనది.

ఐక్యతవల్ల, ఏకీకరణవల్ల, తూర్పుయూరపుదేశాలుకూడా చేరునట్టి సమాఖ్యవల్లనే అమెరికాలక్ష్యాలూ యూరపులక్ష్యాలూ నెరవేరగలవని అమెరికన్ల విశ్వాసం. యూరపుసన్నిహితమైనకొద్దీ యూరపుప్రజలలో నూత్నవిశ్వాసం పుట్టుకొస్తుంది. ఒకలక్ష్యం ఏర్పడుతుంది. అటువంటి యూరపులో ఒకప్పుడు కొన్ని శతాబ్దాలవరకూ ప్రపంచంలో అనేక ప్రాంతాలను వలసలుగా ఏలి ఆపిమ్మట వాటిని పోగొట్టుకున్న బ్రిటను, ఫ్రాన్సు, తదితరవలసాధిపత్యం గల రాజ్యాలు సైతం గతాన్ని మరచి కొత్త పరిస్థితికి అనుగుణంగా మారగలుగుతాయి.

కాని సోవియట్ పాలకులదృష్టిలో పరిస్థితి ఎలా వుంది? ఫిబ్రవరి 20 తేదీన నేను నికితాక్రుశ్చేవ్‌ను ఆయనమాస్కో-కార్యాలయంలో సందర్శించి రెండుగంటలసేపు చర్చించాను. సోవియట్ దృక్పథాన్ని ఆయన ఈక్రిందివిధంగా వివరించాడు.

1. మధ్యయూరపులోని ప్రస్తుతపరిస్థితి అసహజమైనది. ఇదిరష్యాకుగాని, అమెరికాకుగాని, యూరపుకుగాని శ్రేయోదాయక మైనది కాదు. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికలో చేరిన దేశాల సైన్యాలు, రష్యాసైన్యాలు ఎవరూ ఆశించనివిధంగా, ఎవరూ కోరుకోకుండా ఆకస్మికంగా సంఘర్షణకు దిగే అవకాశం ఉంది. ఇది మిక్కిలి ప్రమాదకరం.

2. జర్మనీదేశ ఆర్థికరాజకీయభవిష్యత్తును సోవియట్ యూనియన్‌గాని, అమెరికాగ్గాని నిర్ణయించలేవు. తూర్పుజర్మనీలో కొన్ని ఆర్థికవ్యవస్థలు సోవియట్ పద్ధతిపై రూపొందించబడ్డవి. వాటిని పరిరక్షించాలంటే దశలవారీగా ఏకీకరణ జరగాలి.

3. అమెరికా, బ్రిటిషుసైన్యాలు ఉపసంహరింపబడినట్లయితే సోవియట్ సైన్యాలు కూడా రష్యాసరిహద్దులకు ఉపసంహరింపబడుతాయి. అప్పుడు ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికవ్యవస్థకు చెందిన దేశాలకు, వార్సాసంధిదేశాలకు మధ్య ఒప్పందం కుదిరినట్లయితే అతిగా ఆయుధాలు సమీకరించకుండా హామీలు ఇచ్చి పుచ్చుకొని తద్వారా యూరపులో శాంతిని నెలకొల్పవచ్చు. ఆపిమ్మట ఈ రెండు సంధివ్యవస్థలూ రద్దు అయిపోవాలని రష్యా ఆశయం. వాటికి బదులు ఒక కొత్త సంస్థ ఏర్పడాలి. అందులో రష్యా అమెరికాలకు స్థానం ఉండాలి. అయితే రష్యాకు తప్పక స్థానం ఉండాలని తాము పట్టుబట్టమని కృశ్చేవ్ నాతో అన్నాడు.

4. సైన్యాల ఉపసంహరణవిషయమై ప్రధాని బుల్గానిన్ అధ్యక్షుడు ఐసెన్ హోవర్‌కు చేసిన ప్రతిపాదన నిజమైనదే అయినప్పటికీ అమెరికాప్రభుత్వం అందుకు అంగీకరిస్తుం దని తాము అనుకోవడం లేదని కృశ్చేవ్ అన్నాడు. ఎందుకు? ఎందుకంటే మందుగుండుసామగ్రి తయారుచేసి అమ్మే కోటీశ్వరుల వత్తిడివల్ల. ఆ కోటీశ్వరులకు ప్రచ్ఛన్నయుద్ధంలో ఏమాత్రం సడలింపు జరిగినా నేసమిరా ఇష్ట ముండదని కృశ్చేవ్ నమ్మకం.

వీటన్నిటికీ నేను సమాధానం చెబుతూ అమెరికాలోని రెండు రాజకీయ పక్షాలవారూ యూరపు దాని మార్గంలో అది అభివృద్ధిజెందితే చాలు అన్న ధోరణిలో వున్నారనీ, ఈమాట నేను రాజకీయవాదిగా కాక సాధారణ అమెరికన్ పౌరుని హోదాలో అంటున్నాననీ తెలిపాను. యుద్ధంతరువాత సోవియట్ రష్యా ఎర్రసైన్యాన్ని తన సరిహద్దులకు ఉపసంహరించుకోవడానికి నిరాకరించినందువల్లనే అమెరికాసైన్యాలు జర్మనీలో ఉన్నాయనీ, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక వ్యవస్థను అమలులోకి తేవడం జరిగిందనీ తెలియజేశాను.

ప్రస్తుతక్లిష్టస్థితిలో రష్యాసైన్యాలు మంచి రహదారులపై రష్యాసరిహద్దుల వరకూ కొన్నివందల మైళ్ళ మేరకు మాత్రమే ఉపసంహరించుకోబడుతాయి. కాని అమెరికాసైన్యాలు సముద్రంమీదుగా మూడువేల మైళ్ళ దూరం ఉపసంహరింపబడాలి. ఇది వాస్తవంగా జరిగేదికాదనీ, అసాధ్యమనీ రష్యాకు తెలుసు. పైగా

తనకూ అమెరికాకూ పోటాపోటీగా వున్న ఈస్థితిలో ఇది జరిగే పనికాదని రష్యా గ్రహించింది.

రష్యా పశ్చిమసరిహద్దుకు తూర్పున కొంతదూరాన సైన్యాలు, యుద్ధ సామగ్రి మున్నగు వాటిని వుంచడానికి రష్యా అంగీకరిస్తూ ఆప్రాంతమంతటా జరిగే సర్వవిధమైన సైనికసన్నాహాలనూ తనిఖీచేసే అధికారం ఐక్యరాజ్యసమితి పరిశీలకులకు ఇస్తేనే అమెరికన్లు తమ సైన్యాలను ఉపసంహరించుకోవడానికి ఒప్పుకోరని కృశ్చేవ్‌కు తెలుసు.

అలాగే సైనికసాంకేతిక పద్ధతుల్లో తీవ్రమైన మార్పు రావడమో, లేదా సార్వజనీననిరాయుధీకరణపై ఒప్పందం జరగడమో సంభవిస్తే తప్ప, లేకపోతే ప్రపంచంలోని ఇతరప్రాంతాల్లో అమెరికన్లకుగల విమానదళస్థావరాలను అమెరికన్లు విడనాడగలరని కృశ్చేవ్ ఆశించజాలడు.

కృశ్చేవ్, ఆయనసహచరులూ అందరి భవితవ్యాన్నీ తేల్చగల అంతిమ నిర్ణయాన్ని గైకొనవలసిన సమయం వచ్చినప్పుడు అమెరికాకూ, దాని ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికమిత్రులకూ అంగీకారయోగ్యమైన హామీలను ఇస్తూ, యూరపులో ప్రస్తుతం వారి ఆక్రమణక్రింద గల అగ్రశ్రేణులనుంచి సోవియట్ సైన్యాలను ఉపసంహరించుకోవడానికి రష్యా అంగీకరిస్తుందని అమెరికాప్రజలు నమ్మడం కష్టమని నేను కృశ్చేవ్‌కు స్పష్టంగా చెప్పాను.

తూర్పుయూరపునుంచి సోవియట్ సైన్యాల ఉపసంహరణ జరిగితే ఆవెంటనే ఆప్రాంతంలో రష్యా రాజకీయ ఆర్థికప్రాభవం తగ్గుతుం దని తూర్పుజర్మనీ, హంగరీ, పోలెండుదేశాలలో జరిగిన సంఘటనలు సూచిస్తున్నాయి.

ఉదాహరణకు పశ్చిమజర్మనీ ప్రజల జీవనప్రమాణంకంటె తూర్పుజర్మనీ ప్రజల జీవనప్రమాణం చాలాతక్కువగా వుంది. మరి పశ్చిమజర్మనీలోని స్వేచ్ఛా ఆర్థికవిధానంకన్న తమ ఆర్థికవిధానం తక్కువ ఉత్పత్తినిస్తుందని రుజువైనప్పుడు తూర్పుజర్మనీప్రజలు వారి ప్రస్తుత ఆర్థికవిధానానికి ఎందుకు అంటిపెట్టుకొని వుండాలి? ఒకమారు గనుక ఎర్రసైన్యం ఉపసంహరింపబడిం దంటే జర్మనీ ప్రజలు ఏకీకృతమైన వారి దేశాన్ని వారి పద్ధతిప్రకారం అభివృద్ధి పరచుకోకుండా కృశ్చేవ్ ఎలా ఆపగలడు?

పైగా సోవియట్ సైన్యం ఉపసంహరింపబడిం దంటే యూరపు ఏకీకర

ణకు మార్గం సుకరమవుతుంది. అది జరిగినప్పుడు ఆ ఖండం తూర్పుప్రాంతం పశ్చిమప్రాంతానికి సన్నిహితమవుతుంది.

ఇదంతా విన్న కృశ్చేవ్ నాకు సమాధానం చెబుతూ, రష్యాపాలకులు ఈ విషయా లన్నిటినీ శ్రద్ధగా పరిశీలించారని అన్నాడు. యూరపు ఏకీకరింపబడిందంటే అది అమెరికాకుగాని, బ్రిటనుకుగాని, ఫ్రాన్సుకుగాని దీర్ఘకాలంపై ప్రయోజనకరం కాదని వారి అభిప్రాయమట. ఏకీకృతయూరపు జర్మనీపలుకుబడికి లోనై జర్మనీ వారి చెప్పుచేతలలో వుంటుందనీ, యుద్ధకాలంలో సాధించజాలకపోయిన లక్ష్యాల నన్నిటినీ అది శాంతికాలంలో సాధించగలుగుతుందనీ కృశ్చేవ్ అన్నాడు.

ఒకవేళ తూర్పు, పశ్చిమ యూరపులు ఏకంకానున్న పక్షంలో అలా కాకుండా నివారించేందుకై సోవియట్ యూనియన్ యుద్ధానికి దిగుతుందా అని నేను కృశ్చేవ్‌ను ప్రశ్నించాను. అందు కాయన "లేదు, మేము యుద్ధానికి దిగం. అయితే యూరపులోని మా ఇరుగుపొరుగువారు జగడగొండులుగా తయారైతే అప్పుడు పరిస్థితిని ఆలోచించి అవసరమైతే యుద్ధానికి దిగవలసివస్తుందేమో!" అన్నాడు.

కృశ్చేవ్‌కూ, నాకూ జరిగిన ఈసంభాషణవిషయమై సోవియట్‌యూనియన్ వైఖరిని అనేకసంవత్సరాలుగా కనిపెట్టుతూవచ్చిన మిత్రులతో చర్చించాను. వీరిలో చాలామంది ప్రస్తుతసోవియట్ నాయకులను వ్యక్తిగతంగా బాగా ఎరుగుదురు. వీరిలో కొందరు మాస్కోలో తమతమదేశాల తరఫున దౌత్యప్రతినిధులుగా కూడా వున్నవారు. మరికొందరు పోలెండు, యుగోస్లావియాప్రభుత్వాధికార్లు. ఇంకా కొందరు మాస్కో, బెల్గ్రేడు, బెర్లిన్ మొదలైన నగరాలలో అమెరికా అధికార్లుగా పనిచేస్తున్నవారు. అమెరికాలో సోవియట్‌వ్యవహారాలను పరిశీలిస్తూ వుండే విద్యార్థికులతోకూడా ఈ అంశాలన్నీ మాట్లాడాను.

వీరంతా బుల్గానిన్, కృశ్చేవ్‌లు నిజంగానే పట్టుదలతో వున్నారని నమ్మడంలేదు. రష్యా అధినేతలు అస్నంతపని చేస్తారని వీరంతా అనుకోరు. అయితే ఈ విషయంలో ఏకాభిప్రాయం లేదు. ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క విధంగా భావిస్తున్నారు.

సోవియెట్ రష్యాపాలకులను ఎరిగే అవకాశం పొందిన విదేశీసైనికనాయకుడు ఒకాయన నాతో అన్న మాటలు గమనింపదగ్గవి. ఆయన ఇట్లా అన్నాడు:

క్రుశ్చేవ్ మనస్సులో ఏముందో నాకు తెలియదు. కాని ఝుకోవ్ మనస్సులో ఏముందో ఊహించగలను. ఆయన ఈవిధంగా అనుకుంటున్నాడని నాభావం:

"తూర్పు జర్మనీలో నాకు 22 సోవియట్ డివిజనుల సైన్యం వుంది. ఈ సైన్యం యూరపుబొడ్డులో బొటనవ్రేలుగుచ్చినట్లుగా వుంది. దీని రాకపోకలమార్గాలు పోలెండు, హంగరీదేశాలమీదుగా వున్నవి. మూడుదేశాలప్రజలు మాకు వ్యతిరేకంగా సమాయత్తమవడానికి సిద్ధంగా వున్నారని మాకు తెలుసు. తూర్పుయూరపులో మా విధానాలు విఫలమైన సంగతి ఎర్రసైన్యానికి చెందిన మాకు తగుహెచ్చరికతో చెప్పడం జరిగింది. తూర్పు యూరపును సోవియట్‌వలయంలోకి తేవడానికి. అచటి ప్రజలవిశ్వాసవిధేయతలను చూరగొనడానికి మా రాజకీయనాయకులు 13 ఏండ్లు అవిరళకృషి చేశారు. కాని పూర్తిగా విఫలమనోరథులయ్యారు. వారి వైఫల్యంవల్లనే వేలకొలది హంగరీదేశపౌరులను బుడాపెస్టునగరవీధులలో వధించవలసిందని సోవియట్ సైనికులకు నేను విధిగా ఉత్తరువులివ్వవలసిన అగత్యం కలిగింది. అయితే సైనికంగా మా కష్టాలు అంతటితో తీరలేదు. గడచిన 13 ఏండ్లలో తూర్పుయూరపుదేశాలలో మేము 60 డివిజనులా పైచిలుకు సైన్యాన్ని వ్యవస్థీకరించి ఆ సైన్యానికి ఆధునికమైన రష్యన్ తుపాకీలు, టాంకులు, విమానాలూ సమకూర్చాము. బుడాపెస్టులో మేము చూచినదాన్నిబట్టి, పోలెండు, తూర్పుజర్మనీలలో మేము పసికట్టగలిగినదాన్నిబట్టి యుద్ధమేగనుక వస్తే బలీయమైన ఈశక్తులు మాకు వ్యతిరేకంగా తిరగవచ్చునని గ్రహించాము. ఈ పరిస్థితిలో తూర్పుయూరపు, మధ్య యూరపుల సైనికశక్తిని పరిమితం చేయగల ఎట్టి ఒడంబడిక అయినా సోవియట్ యూనియన్‌కు లాభదాయకమైంది. ఈసమస్యలన్నీ గాక ఆర్థికసమస్యకూడా వుంది. యుద్ధానంతరం సోవియట్ యూనియన్‌ను శక్తిపంతం చేయడానికై తూర్పుయూరపునుంచి పెట్టుబడి, యంత్రసామగ్రి, ముడిసరుకుల రూపంలో కొన్ని వందలకోట్ల రూబుళ్ళను (రూబులు అనగా రష్యానాణెము) ప్రతిసంవత్సరం కాజేశాము. అక్కడ ఏ బెడదా రాకుండా చేసుకోవాలంటే ఇప్పుడు మా రష్యాడబ్బును ఆ దేశాలకొరకు ఖర్చుపెట్టవలసివుంటుంది. మా డబ్బును ఈ యూరపుదేశాలకు ఖర్చుపెట్టడంకంటె ఆసియా ఆఫ్రికాఖండాలలో ఖర్చుపెడితే మాకెంతో మేలే; ఆ ఖండాలలో మాకు ఏ చిక్కూ లేదు. మా పని అక్కడ నిరాటంకంగా సాగిపోతుంది కదా; జర్మనీనుంచి ఉపసంహరించుకొనే ప్రతిపాదనను రాజకీయంగా మాకు అనుకూలమయ్యేరీతిని మెలిబెట్టి చెప్పడంలో మా ప్రచారకులు తగు చాకచక్యంతో వ్యవహరించాలి. ఉద్రిక్తస్థితిని సడలించడానికి మేమే ప్రయత్నిస్తున్నట్లు మా ప్రచారకోద్యోగులు చెప్పలేకపోతే ఎలా? అమెరికావాళ్ళు కాదు కూడదు అంటే యూరపును చీలదీసి వుంచడానికి వాళ్ళే పట్టుబట్టుతున్నట్లు ప్రపంచానికి అనిపిస్తుంది."

మార్షల్‌ఝుకోవ్ మనస్సులో ఏముందో ఇట్లా ఊహించి చెప్పిన యూరపు సైనికవిజ్ఞుడు చివరకు నావంక వ్రేలుచూపుతూ "ఒక్కమాట. తుదినిర్ణయం చేసేది

కృశ్చేవ్, ఆతని అనుయాయులూ; ఝుకోవ్ కాదు. ఇది జ్ఞాపకముంచుకోండి'' అని హెచ్చరించాడు.

ఆసియా ఆఫ్రికాఖండాలను మొదట ఆర్థికరాజకీయసంబంధాలద్వారా మాస్కోకు సన్నిహితం చేస్తే చివరకు వాటిని సోవియట్ వలయంలోకి తేవచ్చు నన్న ఆశ రష్యాపాలకులలో వున్నంతవరకూ సోవియట్ యూనియన్ ప్రయోజనకరమైన దీర్ఘకాలికప్రపంచ ఒడంబడిక విషయంలో హృదయపూర్వకమైన గట్టిప్రయత్నం చేస్తుందని నేను అనుకోను. ఆనమ్మకం నాకు లేదు. అలాగే అటూ ఇటూ ఊగిన లాడే తటస్థజర్మనీకూడా అమెరికనులకు ప్రయోజనకరమైనది కాదు.

అయితే ఏదో ఒక ప్రమాదంవల్లో ప్రపంచాన్ని ఆకస్మికంగా అణ్వస్త్ర యుద్ధంలోకి లాగగలిగేపరిస్థితిని మధ్యయూరపులో అలాగే కొనసాగజేయడంవల్ల అటు రష్యాకుగాని, ఇటు అమెరికాకుగాని ఒరిగేదేమీలేదు. పైగా ఈ రెండు దేశాలూ సర్వనాశనకరమైన అట్టి అణ్వస్త్రయుద్ధాన్ని నివారించవలెనన్న ఆశ యంతో వున్నవయ్యె!

# 8

# యూరపుపట్ల కొత్తవిధానం

యూరపు నవశకప్రాంగణంలో వుందని శ్రీ బౌల్స్ అభిప్రాయం. అందువల్ల కలిగే పర్యవసానాలను ఎదుర్కొన సిద్ధంగా వుండవలెనంటే అమెరికా తన లక్ష్యాలనూ, తన పద్ధతులనూ పునర్విమర్శ చేసుకొని కొత్త అంచనాలు వేసుకోవాలి. శ్రీ బౌల్స్ వ్రాసిన ఈ దిగువవ్యాసం 1959 డిసెంబరు 20 తేదీనాటి న్యూయార్కు టైమ్సుమేగజైన్ పత్రికలో ప్రచురితమైంది.

అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్, బ్రిటనుప్రధానమంత్రి మాక్మిలన్, ఫ్రాన్సు అధ్యక్షుడు డీగోల్, జర్మనీఛాన్సలర్ అడెనోవర్ ప్యారిస్ నగరంలో చర్చలు జరుపుతున్నారు. ఇవి శిఖరాగ్రసమావేశానికి ముందు జరిగే చర్చలు. ఈ చర్చలు ఒకవిధమైన ఆందోళనకమ్మిన వాతావరణంలో జరుగుతున్నాయి. యూరపులో అమెరికా అనుసరించే విధానం ఈ చర్చల్లో ముఖ్యాంశంగా వుంది.

అమెరికా అధ్యక్షుని పర్యటన విజయవంతంగా జరిగిం దనే చెప్పాలి. అమెరికన్ల ఆశయాలేమిటో అవతలివారికి స్పష్టమయ్యాయి. వారి ఆందోళన కొంత తగ్గింది. అయితే యూరపువ్యవహారాలలో ఒక కొత్త దశగా ఎంచబడుతూవున్న ఈదశలో అమెరికన్లు పూర్తి విశ్వాసంతో సమర్థవంతంగా వ్యవహరించగలరా లేదా, వారి ఆలోచన లేమిటి, వారి తాహతు ఏమిటి, మున్నగు విషయాలలో ఇంకా అనుమానాలు కొందరికి వుండనే వున్నవి.

అందుచేత వెంటనే అమెరికన్లు దేనిని ఆశయంగా పెట్టుకొన్నారు? దీర్ఘకాలికంగా వారి లక్ష్య మేమిటి? ఈ అంశాలపై వారు ఏనాడో కచ్చితంగా సమీక్ష చేసుకోవలసింది. యూరపులో వారు అనుసరించే విధానం ఒక పునాదిపై

ఆధారపడివుండాలి. ఏమి టాపునాది? పశ్చిమయూరపుజాతులతో రాజకీయంగా, ఆర్థికంగా, సైనికంగా సన్నిహితసంబంధమే ఆ పునాది. అయితే త్వరితగతిని బహిర్గతమవుతూవున్న నూత్నపరిస్థితులను వారు ఎదుర్కొని నిలబడాలంటే వారి విధానాలకు ఒక కొత్త బాణీ ఏర్పడాలి. ఒక కొత్త బాట పడాలి. ఒక కొత్త చేవ రావాలి.

ప్రచ్ఛన్నయుద్ధం విషయంలో, ఆర్థికసంబంధమైన పోటీవిషయంలో, మంతనాల విషయంలో కృశ్చేవ్ వ్యక్తిగతంగా చాలావరకు పోయ్యాడు. ఆయన ఉద్దేశాలు ఎటువంటివైనప్పటికీ ఆయన చేసిన వాగ్దానాలు స్వదేశంలో, విదేశాలలో కొన్ని ఆశలను రేకెత్తించాయి. వాటిని కృశ్చేవ్‌గాని, మరెవ్వరుకాని త్వరగా, సులభంగా చెరిపివెయ్యలేరు.

రష్యాపాలకులు వేస్తూవున్న అంచనాలలో నానాటికీ పెచ్చుమీరుతూవున్న చైనాకలహధోరణి తప్పకుండా పరిగణనకు వచ్చివుంటుంది. చైనాధోరణి రష్యా వారిని కలతపరిచివుంటుంది. చైనా బాహాటంగా ఉద్రిక్తతను రెచ్చగొట్ట నిర్ణయిం చింది.ఇదిరష్యావారి నూతనవిధానానికి అనుగుణమైన వైఖరి కాదు; ప్రతికూలవైఖరి. అద్యతనభావిలో చైనారష్యాల పొత్తును నిలబెట్టడం ఒక ముఖ్యసమస్యగా తయారు కావచ్చు. కమ్యూనిస్టుకూటమిలో చైనా ఇప్పుడు 'చిన్నతమ్ముడు' కావచ్చు కాని చైనాజనాభా రష్యాజనాభాకు మూడురెట్లు. పైగా చైనా దుస్సాహసంతో పెచ్చు మీరి ప్రవర్తిస్తూవుంది. కయ్యానికి కాలుదువ్వుతోంది. అటువంటప్పుడు రష్యా పథకనిర్ణేతలు లోలోన ఆందోళన చెందకుండావుంటారా?

ఆయుధాల సాంకేతికశాస్త్రం త్వరితగతిని వృద్ధిజెందుతూవుంది. యుద్ధ వ్యూహాల విషయంలో ఒకరిని మించిన పరిశోధనలు ఒకరు సలుపుతున్నారు. ఈ కొత్త మార్పులన్నీ బాగా వ్యాప్తిజెందుతున్నాయి. వీటిపై అదుపూ ఆజ్ఞా ఏమీ లేదు. ఇది కొంతకాలం ఇలాగే సాగితే, వచ్చే కొన్ని సంవత్సరాలలోనే ప్రపంచం అగ్రరాజ్యాలన్నీ అధికవ్యయాలను, ఘోరప్రమాదాలను, లేనిపోని ఉద్రిక్తస్థితిని ఎదుర్కోవలసివుంటుంది. ఫ్రాన్సు, తదితరరాజ్యాలు అణ్వస్త్రరాజ్యా లయ్యేకొద్దీ నమ్మదగ్గ అదుపుపద్ధతిని ఆచరణలోకి తేవడం మరీ కష్టసాధ్యమవుతుంది. ఎన్నో చిక్కులు ఎదురవుతాయి.

యూరపులోనే ఆర్థిక, రాజకీయసంబంధాలు మారుతున్నాయి. యూరపు అమెరికాలమధ్య సంబంధాలుకూడా మారిపోతున్నాయి. 1953 నుంచి పశ్చిమయూర

పులో ఆర్థికాభివృద్ధి అమెరికన్ల సాలుసరి సగటు అభివృద్ధికన్న మూడురెట్లు హెచ్చుగావుంది. అనగా పశ్చిమయూరపులో పారిశ్రామికాభివృద్ధి జరుగుతూవుంటే అమెరికాలో క్రమేణా పారిశ్రామికమాంద్యం ఏర్పడుతూవుందన్నమాట.

ఈ మార్పుల దృష్ట్యా నేటి అమెరికన్ల వైఖరులు, ఎత్తుగడలు చాలావరకు పాతబడి పనికిరాకుండా అయిపొయ్యాయి. అమెరికన్లు యుద్ధానంతరదశలో తుది ఘట్టానికి చేరుకున్నారు. ఇక సర్దుబాటు, ప్రయోగం, ఆచరణసాధ్యమైన దృక్పథం, నిరంతరపరిణామం మున్నగువాటితో కూడిన నవశకప్రాంగణానికి వచ్చారు.

యూరపులో అమెరికావిధానానికి మూడు ముఖ్యలక్ష్యాలున్నాయి.

1. బెర్లిన్‌వంటి వత్తిడి గల తావులలో అమెరికన్ల సంకల్పబలం మొక్కవోవని దన్న విశ్వాసాన్ని పునరుద్ఘాటించాలి.

2. యూరపు ఒక స్వేచ్ఛాయుతవ్యవస్థగా రూపొంది పెంపొందడానికి అమెరికన్లు తగు ప్రోత్సాహమివ్వాలి. ఆవ్యవస్థ స్వయంపోషకమైనదై దాని కాళ్ళపై అది నిల్చే గలిగివుండాలి. యూరపువ్యవస్థ అమెరికన్లతో స్నేహంగా వుండాలి.

3. సర్వదేశాల ప్రజలు శాంతియుతమైన దీర్ఘకాలికపరిష్కారాన్ని కోరుతున్నారు. ఆ కోర్కెను అమెరికన్లు గమనించి, మన్నించి, ఆచరణసాధ్యమైన ప్రతిపాదనలను రూపొందించాలి. అవే శాశ్వతపరిష్కారానికి ఒకప్పుడు ప్రాతిపదిక కావచ్చు.

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక రాజ్యాల కూటమి అయోమయత్వంలో పడి దుర్బలమైపోకుండా మొదట అమెరికన్లు తగుచర్యలు తీసుకోవాలి. రష్యాసరిహద్దుకు పశ్చిమాన 30 సోవియట్ డివిజనుల సైన్యం తిష్ఠవేసివున్నంతవరకూ ఇప్పటికే హీనంగా వున్న అమెరికన్ల యూరపురక్షణశ్రేణులను మరింత బలహీనం చేయడం అవివేకమవుతుంది.

అద్యతనభావిలో యూరపులోని అమెరికన్ల భూతలసైన్యాన్నీ, విమానబలగాన్నీ వారికైవారే స్వచ్ఛందంగా తగ్గించుకోబోతున్నారన్న అర్థరహితమైన అవాకులను చెవాకులను అమెరికాసర్వసేనాని స్వయంగా ఖండించాలి. బెర్లిన్ విషయంలో వారిదృఢవైఖరిలో ఎట్టిమార్పు వుండబోదని ప్రపంచానికి చాటాలంటే ఇలాంటి విస్పష్టప్రకటన చాలా ముఖ్యం.

బెర్లిన్‌పరిస్థితిని ఎవరూ ఆమోదించడం లేదు. అది ఎవరికీ ఇష్టం లేదు. అది

అమెరికన్లకు ప్రమాదకరమైనది. రష్యావారికి దానివల్ల నిద్రే పట్టకుండా వుంది. సాహసోపేతులైన బెర్లిన్ నగరవాసులకూ, జర్మనులకూ నిస్పృహ కలుగజేస్తూ వుంది. అయినప్పటికీ మధ్యయూరపులో ఇప్పుడున్నపరిస్థితి ఇకముందుకూడా వున్నంతవరకూ పత్తిడులకు లొంగి బెర్లిన్ విషయంలో రష్యావారిని సంతృప్తి పరచడానికై అమెరికన్లు ఒక మెట్టు క్రిందికి దిగినా అమెరికన్లమిత్రులు భయ భ్రాంతులకు లోనవుతారు. రష్యావారి కోర్కెలు కూడా పెరుగుతూపోతాయి.

బెర్లిన్‌లో పదివేలమంది మిత్రమండలిసైనికులను ఉపసంహరిస్తామని నచ్చగా బేరమాడితే అందువల్ల అమెరికన్లకు ఒరిగేదేమీలేదు. సైనికంగా చూస్తే సంఖ్యతగ్గింపువల్ల ఇటు అమెరికన్లకుగాని, అటు రష్యావారికిగాని ఒరిగేదేమీ లేదు. అసలు అది అసంగతవిషయం. రష్యావారు దాడి జరిపితే ఆ పది వేలమంది సైనికులు బెర్లిన్‌నగరాన్ని రక్షించగలరా? మరి వాళ్ళను ఎందుకు వుంచారు అక్కడ? ఎందుకంటే ఆ సైన్యాలు వారి ఆక్రమణహక్కుకు చిహ్న ప్రాయంగా వున్నాయి. అవి లేని నాడు వారి ఆక్రమణహక్కు లేదు.

కాబట్టి సైన్యాన్ని తగ్గించమని రష్యాచేస్తూవున్న వత్తిడి మెల్లగా ఒకటి తర్వాత ఒకటి రాహితీలను పొందడానికే! అలాంటి రాహితీలు అమెరికన్లు ఇచ్చారా, అమెరికాదార్ఢ్యత క్షీణిస్తూవుందని బెర్లిన్‌వాసులూ, జర్మనీప్రజలూ అను కుంటారు.

పాశ్చాత్యదేశాలు ఇటువంటి దృఢవైఖరిని అవలంబించినప్పుడు అందుకు ప్రతిగా రష్యావారు బెర్లిన్‌లో, బెర్లిన్‌కు పొయ్యే మార్గాలలో వారికి గల విశేషాధి కారాలను, ప్రత్యేకహక్కులను వారి బంట్లు అయిన తూర్పుజర్మనులకు అప్పగించి నట్లయితే పశ్చిమబెర్లిన్‌లో అమెరికన్లకు గల ప్రత్యేకహక్కులను వారికి అను కూలురైన పశ్చిమజర్మనులకు వారు అప్పగించాలి. అయితే, అక్కడి అమెరికన్ సైన్యాలను తరలించరాదు. వాటిని అలాగే వుంచాలి. బెర్లిన్‌నగరంలో న్యాయ శాస్త్ర రీత్యా ప్రస్తుతం అమెరికన్లకు గల ఆక్రమణహక్కును వదులుకోకూడదు. దాన్ని అట్టిపెట్టుకోవాలి.

ముఖ్యవిషయాలలో లొంగిపోకుండా గట్టిగా నిలబడటమంటే చిన్నచిన్న విషయాలలో గుడ్డిగా జిడ్డుగా అంటిపెట్టుకువుండటం కాదు. బెర్లిన్‌లో అమెరికన్ల హక్కుల విషయమై దృఢవైఖరి అవలంబించటమంటే తూర్పుజర్మనీతో గాని; తక్కిన తూర్పుయూరపుతోగాని వ్యవహరించే విషయంలో నిర్లక్ష్యంగా తెగేదాకా

లాగడం కాదు. 1952 లో జరిగిన అమెరికా అధ్యక్షపదవి ఎన్నికలలో అమెరికాలో నివసించే పోలిష్, జెక్, హంగేరియన్ జాతియుల ఓట్లను రాబట్టేందుకై తూర్పుయూరపుదేశాలను "విముక్తం" చేస్తామని వాగ్దానంచేయడం జరిగింది. ఇది బాధ్యతారహితమైన చర్య. దగా. ఆత్మవంచన!

సోవియట్‌రష్యా ఏయే ప్రయోజనాల నుద్దేశించి వ్యవహరిస్తూవుందో యథార్థంగా గ్రహించి, అమెరికా శక్తిసామర్థ్యాల పరిమితు లేవో ఎరిగి, అమెరికా విధానం ఇవ్వగల అవకాశాలను సద్వినియోగం చేసుకొంటే ఇప్పటికంటే మంచి ఫలితాలు చేకూరే వీలుంది. క్రియాత్మకంగా మేలు జరుగుతుంది. అమెరికన్ల తూర్పుయూరపు విధానానికి ముఖ్యలక్ష్య మేమిటి? ఆ ప్రాంతంలో రాజకీయాలను, ఆర్థికవ్యవహారాలను మరొకదారి పట్టించడమే అమెరికన్ల లక్ష్యం. ఆ లక్ష్యానికి రాజనీతి, దౌత్యవైఖరి, పరటాయింపులు, ఇచ్చి పుచ్చుకోవడాలు, సంప్రదింపులు, ఆర్థికసహాయంవంటివి తోడ్పడతాయి.

అలాంటి దారి మార్పువల్ల ఒక పొంగు వచ్చి దౌర్భాగ్యదశలో వున్న ఆ ప్రాంతంలో స్వాతంత్ర్యవాయువులు వీచే అవకాశం కలుగవచ్చు. అమెరికన్ల గమ్యం హంగరీలో వచ్చినటువంటి అల్లకల్లోలం, అయోమయస్థితీ కాదు. పోలెండులో రక్తపాతరహితంగా సంభవించిన విప్లవంనుండి పుట్టుకొచ్చిన జాతీయపునరుజ్జీవనమే అమెరికన్ల గమ్యం. అక్కడ ఇటీవల ప్రభుత్వౌకోక్యం, వత్తిడి అధికమైనప్పటికీ స్టాలిన్ హయాములోకన్న ఇప్పుడే పోలెండు ప్రజలకు హెచ్చు స్వాతంత్ర్యం వుంది.

ఇక రెండవది: యూరోపియన్ వ్యవస్థ అనే భావన పెంపొందడానికై వీలైనప్పుడల్లా అమెరికా ప్రభావాన్ని వినియోగిస్తూపోవాలి. ఐక్యయూరపు అనే భావన ఆచరణలోకి రావడానికి పెద్ద ప్రతిబంధకా లెన్నో వున్నప్పటికీ యూరపు వాసులమని అనుకొనేవారి కందరికీ ఐక్యయూరపు ఏర్పడవలసిన అగత్యాన్ని అదేపనిగా నొక్కి చెబుతూపోయినట్లయితే అది అమెరికా స్వప్రయోజనాలకు ఎంతైనా మంచిది.

దీనివల్ల బొగ్గు, ఉక్కువ్యవస్థలు, యురేటం, సమష్టివిపణి మున్నగువాటి ప్రాముఖ్యం విశదమవుతున్నది. యూరపు సమష్టివిపణిలో ఇప్పుడు ఫ్రాన్సు, పశ్చిమజర్మనీ, ఇటలీ, బెల్జియం, నెదర్లెండ్సు, లక్సెంబర్గుదేశాలు చేరివున్నవి. ఇలాంటి కొత్త వ్యవస్థలన్నీ వాటి పనులను క్రమేణా ఒకదానితో ఒకటి కలిపి

ఏకంచేసుకొంటూ వున్నవి. చాలామంది అమెరికనులు అనుకుంటూ వున్నదాని కంటె అధికవేగంగా రాజకీయ ఆర్థిక ఏకీకరణ జరుగుతూవుంది. ఈ విషయంలో సందేహ మక్కరలేదు.

పైన పేర్కొన్న ఆరుదేశాలూ, ఇంగ్లండూ వాటికి గల పారిశ్రామిక శక్తితో ఒకదానికొకటి జతగూడి వ్యవహరించాయంటే అవే రక్తమాంసాదులను సమకూర్చుకొని యూరపు సంయుక్తరాష్ట్రాలుగా ఏర్పడే అవకాశం వుంది. ఇందువల్ల నిర్మాణాత్మకమైన, చైతన్యవంతమైన రాజకీయజీవం వ్యాపించి, యూరపు శాశ్వతంగా విభజితమై వుండే ప్రమాదం నివారింపబడుతుంది.

అమెరికా సైనికవిధానం ఉత్తర అట్లాంటిక్ రాజ్యాల ఒడంబడికవ్యవస్థకు అనుగుణంగా వుందిగనుకనూ, అలా వుండవలసిన అగత్యం వున్నదిగనుకనూ యూరపులో అమెరికన్లకు గోచరించే ఏకీకరణోద్యమం బాల్టిక్ సముద్రంనుండి నల్లసముద్రంవరకు ప్రస్తుతంగల విభజనరేఖను మరింత కఠినతరం చేయడానికి గాక, సడలించడానికై క్రియాశీలము గల ఆర్థికరాజకీయపాత్రను నిర్వహించవలసి వున్నది. ఈ ఉద్యమం దినదినాభివృద్ధి జెంది ఉపగ్రహరాజ్యాలతోసహా తక్కిన యూరపునంతటినీ తమకేసి నిరంతరం ఆహ్వానిస్తూ యూరపు ఏకీకరణకు చేతులు కలుపవలసిందని ఉద్బోధిస్తూపోవాలి. మొదట ఈ ఉద్యమం ఎంత అల్పంగా వున్నాసరే వెనుదీయకూడదు. యూరపు సమష్టివిపణిలో గ్రీసు, టర్కీలకు సహసభ్యత్వ మిస్తే ముందు ముందు అదేరీతిని యుగోస్లావియానుకూడా కలుపుకు పొయ్యే వీలుకలుగవచ్చు.

అంటే కొత్తవ్యవస్థ తలుపులుమూసేసిన ఇల్లుగా వుండకూడదు. తలుపులు తెరిచిన ఇల్లుగా వుండి లోపలికి రాదలచుకున్నవారికి సుస్వాగతం చెప్పేదిగా వుండాలి. ఒక్క యుగోస్లావియావారికేగాక పోలెండువారికి, జెకొస్లొవేకియావారికి, రుమేనియావారికి, బల్గేరియనులకుకూడా ప్రవేశమిచ్చేదిగా వుండాలి. అంతే కాదు, ఆ కొత్తవ్యవస్థ బెర్లిన్, తూర్పుజర్మనీ సమస్యలను అంతిమంగా పరిష్క రించేం దుకు తగు చట్టాన్నికూడా నిర్మించగలగాలి.

అమెరికన్ స్వల్పకాలిక ప్రయోజనాల నిమిత్తం, సోవియట్ యూనియన్ యొక్క స్వల్పకాలిక ప్రయోజనాలనిమిత్తం జర్మనీని విభజించివుంచడ మొక్కటే మార్గమని కొందరు వాదించవచ్చు. నిజమే, జర్మనీని ఇప్పుడు ఏకంచేయడం

అసాధ్యమైన పని. ఇప్పుడున్నట్లు అది చీలివుండవలసిందే. కాని, దీర్ఘకాలంమీద చూస్తే చీలివున్న జర్మనీ యూరపు చీలికలను మరింత్రవిగా చేసి ఆ సమస్యను మరీ జటిలంచేస్తుంది. అలాగే విభాగాలుగా చీలివున్న బెర్లిన్‌నగరం జర్మనీ చీలికలను అలాగేవుంచి ఆ సమస్య పరిష్కారం కాకుండా చేస్తుంది. ఈ చీలికలన్నీ తత్సంబంధీకులకు ఆందోళన కలిగించేవే.

యూరపు ఏకంగావుంటే అది సమైక్యజర్మనీని అదుపులో పెట్టగలుగుతుంది. అటువంటి జర్మనీలోమాత్రమే, అటువంటి యూరపులోమాత్రమే బెర్లిన్ ఒక ముఖ్య రాజధానీనగరంగా తనపాత్రను నిర్వర్తించగలుగుతుంది. కనుక ఐక్య యూరపు నిర్మాణం క్రమేణా జరుగుతూవుం దనడానికి క్రియారూపంలో తగు దృష్టాంతం కన్పించిందంటే దానిప్రభావం తూర్పుజర్మనీపైన, పోలెండుపైన, తక్కిన తూర్పుయూరపుదేశాలపైన పడి వాటినికూడా ఆకట్టుకొనే ఆస్కారం కలుగుతుంది.

దీనికితోడుగా పరిమితులులేని యూరపువిపణిని విస్తృతప్రాతిపదికపై నిర్మించవలెనన్న ప్రతిపాదనను అమెరికా బలపరిచిందంటే వారిమాటకు యూరపులో మన్నన కలుగుతుంది. యూరపులో స్వేచ్ఛాయుతమైన విపణి ఏర్పడుతూ వుంటే దానినిచూచి అమెరికన్లు బెదిరిపోకూడదు. అదికూడా వారికొక సదవకాశమేనని భావించాలి. ఉదాహరణకు సమష్టివిపణి ఏర్పాటువల్ల ఆరుదేశాలతో వేర్వేరుగా మంతనాలుజరిపి ఆరు ఒప్పందాలు చేసుకోనక్కరలేకుండా ఒకే ఒక ఒప్పందంతో అమెరికా సరుకులపై విధింపబడే సుంకాలు, కోటాలు, దిగుమతి నిర్బంధాలు మున్నగువాటిని సడలించేఅవకాశం కలుగుతూ వుంది. ఇది వారికొక సదవకాశం కాదా? వ్యాపారంవిషయంలో అమెరికన్లకు అనుకూలంగా బేరమాడి లావాదేవీలు జరిపే శక్తి వారికున్నది కాబట్టి ఈ అవకాశాన్ని ఆ లక్ష్యసాధనకై గట్టిగా వినియోగించుకోవాలి.

అల్లే వెనుకబడివున్న దేశాలకు సహాయంచేయడానికై జరుగుతున్న ఉమ్మడి కృషిలో సిరిసంపదలతో తులదూగే పశ్చిమ యూరపుదేశాలుకూడా భాగస్వాములు కావాలని అమెరికన్లు ప్రోత్సహించాలి. ఏ కొంచెం అవకాశందొరికినా ఇలా ప్రోత్సహిస్తూపోవాలి. అట్టిసహాయం యూరోపియన్ ప్రభుత్వాలతో సంబంధం కల ఆఫ్రికాదేశాలకే గాక అవసరం, వాడకం రెండూ సమ్మిళితంచెందే వీలున్న

ఆసియా. ఆఫ్రికా, లాటిన్ అమెరికాదేశాలకుకూడా అందేట్టుచూడాలి. ముఖ్యంగా జర్మనీ విషయంలో ఇది చాలా అవసరం.

యూరపుఖండంలోపల ఆర్థిక ఏకీకరణ జరిగిందంటే పేదరికం, ఆర్థిక అసమానత్వంవంటి తీవ్రసమస్యలు పరిష్కారం కావడానికి వీలేర్పడుతుంది. ఈ ఆర్థిక అన్యాయాలను - ముఖ్యంగా దక్షిణయూరపులో - ఎప్పుడో తుదముట్టించ వలసింది.

యూరపుఖండంలోని పడమటి, దక్షిణదేశాలన్నింటిలో 'ఆర్థికంగా కోలు కోవడమనేది' జరగడంవల్ల సుఖకరమైన నివాసగృహాలు, చక్కని అంగళ్ళు నిర్మితమై చూడటానికి చాలా ఆకర్షణీయంగావున్నాయి. వీటికితోడు ఉత్పత్తి అభివృద్ధి సూచికలను ప్రచురంగా ప్రకటిస్తున్నారు, కాని ఆ దేశాలలో పంపిణీ, వాటాలు, న్యాయం మున్నగు అంశాలకు సంబంధించిన సూచికలు అంత ఆకర్ష వంతంగా వుండటంలేదు. ఎందుచేతనంటే ధనికులకూ, పేదవారికీ మధ్యగల వ్యత్యాసం అలాగేవుంది. రాజకీయవిభేదాలు ప్రగాఢంగా వున్నాయి.

యుద్ధంముగిసిన పధ్నాలుగేండ్ల తరువాతకూడా ఇటలీప్రజలలో నూటికి 37 వంతులమంది కమ్యూనిస్టులకూ, తత్సంబంధీకులకూ ఓటువేశారు. ఫ్రాన్సులో కమ్యూనిస్టులకుపడ్డ ఓట్లు నూటికి 21 వంతులవరకు వున్నాయి. గ్రీసులో ఒక అంతర్యుద్ధంజరిగి అక్కడి కమ్యూనిస్టుపార్టీని చట్టవిరుద్ధమైన పార్టీగా ప్రక టించడం జరిగినప్పటికీ పోయినపర్యాయం జరిగిన ఎన్నికలలో అక్కడి యూనియన్ ఆఫ్ ది డెమోక్రటిక్ లెఫ్ట్అనే పార్టీ నూటికి 25 వంతుల ఓట్లు సంపా దించ గలిగింది.

అయితే దీనినిబట్టి ఇటలీ, ఫ్రాన్సు, గ్రీసుదేశాల ప్రజలలో నాలుగోవంతు ప్రజలకు కమ్యూనిజంపై విశ్వాసంవుందని అనుకోరాదు. ఆ దేశాల ప్రభుత్వాలు ప్రజలకు ఏమీచేయకుండా ధనికులకూ, పలుకుబడిగల వారికీ ఆసరాగా వున్నాయన్న విమర్శ ప్రబలి అట్టివిధానం తమకు సమ్మతంకాదని తెలియజేయడానికే వామ పక్షాల అభ్యర్థులకు ప్రజలు ఓట్లువేశారు. అట్లా కమ్యూనిస్టులకు అన్నిఓట్లు రాగలి గాయి. వారికిపడ్డ ఓట్లనుబట్టి చూస్తే ఆ దేశాలలో సాంఘిక ఆర్థికసంస్కరణలు ఎన్నడో ప్రవేశపెట్టబడి వుండవలసిందన్న విషయం అవగతమవుతుంది.

ఇక మూడవది: యూరపు ఖండవాసులు, ఇతరఖండాలప్రజలు రష్యా పాలకులు ఆమోదించగల నూత్న ప్రతిపాదనలకోసం ఎదురుచూస్తున్నారు. ఆ

ప్రతిపాదనలు శాంతియుత భవిష్యత్తుకు దారితీసేవై వుండాలి. సహేతుకమైనవి కావాలి. ఎదుటివారు నమ్మదగ్గవి కావాలి. యూరపులో సైనికవ్యూహరీత్యా, రాజకీయపుటెత్తులరీత్యా అమెరికన్లు ఇచ్చినమాటకు చేసుకున్న ఒప్పందాలకు భంగం కలుగకుండానే సోవియట్ యూనియన్ ఆమోదించి సంప్రదింపులుజరిపే ప్రాతిపదికగా ఆ ప్రతిపాదన ఉపకరించాలి.

ఇట్టి ఆశయానికి అనుగుణంగావుండి, విశాలయూరపుకు ప్రత్యేకంగా వర్తించేదై, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికకు అమెరికన్లుఇచ్చినమాటను నిలబెట్టేదై, పాత యుద్ధవిరమణ సూత్రాలలోగల లోపాలను తొలగించేదై, కొత్త సంప్రదింపులకు నిర్మాణాత్మకకృషి జరిగేవిధంగా తోడ్పడగల నిర్దిష్ట ప్రతిపాదన ఏమైనా వుందా? ఉందని ఎవరూ స్పష్టంగా చెప్పలేకుండా వున్నారు. ఒకవేళ వున్నా దాని స్వరూపమిది అని విశదంగా చెప్పలేకపోతున్నారు. అయితే గడచిన వసంత ఋతువులో ఆమోదయోగ్యమైన నూతనాంశాలను అధ్యక్షుడు డీగోల్, ఛాన్సలర్ అడెనోవర్ సూచించివుంటారనే నేను అనుకుంటున్నాను.

మార్చి 25 తేదీన డీగోల్ ఇలాఅన్నారు: "అట్లాంటిక్‌కు ఎంత సమీపంగా వుందో ఉరాల్సుకుకూడా అంతే సమీపంగా వుండే ప్రాంతం యుద్ధవిరమణ ప్రదేశంలో చేరకపోతే దురాక్రమణదారుడు జర్మనీలో ఎవరికీ చెందని భూభాగం మీదుగా విమానాలద్వారాగాని, లేక భూమార్గంగా గాని ఒక్కఉదుటులో దాడి జరుపకుండా మన మెట్లా ఆపగలం? యుద్ధంలో ప్రయోగింపబడే అన్నిరకాల ఆయుధాలపై అదుపులు, పరిమితులు విధింపబడవలెనన్న ప్రతిపాదనను బలపరుస్తున్నాము. అయితే మనమవలంబించే ఎట్టి చర్యలైనా యుద్ధప్రమాదానికి ఫ్రాన్సు సులభంగా గురికాకుండా ఫ్రాన్సుచుట్టూ చాలా మేర ప్రాంతం తగురక్షకశ్రేణిలో వుండేట్టు చేయాలి."

ఈ ప్రకటన జరిగిన రెండువారాల తర్వాత బాన్‌లో ఏర్పాటుచేయబడ్డ పత్రికావిలేఖరుల గోష్ఠిలో ఛాన్సలర్ అడెనోవర్ ఇట్లాచెప్పారు: "ఉద్రిక్తత సడలింపబడే ప్రాంతంయొక్క పరిమాణం, వైశాల్యం, వైనం విషయంలో జనరల్ డీగోల్ అభిప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. బాధ్యతయెరిగిన సైనిక వ్యవస్థలతో చర్చలు జరిపినమీదటే నేనీమాట అంటున్నాను. అట్లాంటిక్ మొదలు ఉరాల్సువరకు నిరాయుధీకరణ జరిగితేనే అట్టిప్రాంతంవల్ల ప్రయోజనముంటుంది."

ఆ ప్రాంతంలో పరిమిత సైనికసన్నాహాలు కన్పించే ప్రదేశంగనుక

ఏర్పడితే అది విశాల యూరపుభద్రతకు హామీగావుంటుంది. అంతేగాక సమస్యా పరిష్కారాన్ని అన్వేషించడానికి వీలుకలిగిస్తుంది. జాగ్రత్తగా ఆలోచించి అంచెలవారీగా అణ్వస్త్రాలను ప్రయోగించే స్థావరాలను, రాకెట్ కేంద్రాలను, మిస్సిల్‌స్థలాలను, సాంప్రదాయికమైన సైనికబలగాలను తగ్గిస్తూపోయి, తనిఖీలూ అదుపులూచేస్తూపోతే దురాక్రమణకూ రక్షణకూ మధ్యగల తేడాను తెలుసుకొనే అవకాశం కలుగుతుంది. దీనిని ప్రపంచవ్యాప్త ఆయుధాలఖాయిదా పరిష్కారప్రతిపాదనగాగాని, లేదా పరిమితమండల ప్రతిపాదనగాగాని పెట్టుకొని ఉద్రిక్తతను సడలించే ప్రయత్నం చేయవచ్చు.

యూరపులో ఈవిధంగా యుద్ధశక్తులను తగ్గించే ప్రయత్నం ఆరంభమైందంటే నానాటికీ సైనికబలాన్ని సమీకరించుకుంటూ వున్న చైనాను అమెరికాగాని రష్యాగాని ఖాతరుచేయనక్కరలేదు. చైనాసైనికశక్తి ప్రస్తుతానికి ప్రపంచవ్యాప్త ఆయుధాల అదుపు ఒడంబడిక జరిగే అవకాశాలను కుంచించివేస్తూవుంది. ఈప్రతిపాదనలో మరొక వెసులుబాటుకూడావుంది. ఏమిటంటే—యూరపుఖండంనుంచి విదేశీసైన్యాలనన్నిటినీ ఉపసంహరింపవలసిన పనిలేదు. ఒకదేశాన్నిగాని లేక కొన్నిదేశాలనుగాని నిస్సైనికం చేయవలసిన అగత్యం కూడాలేదు. ప్రస్తుతపరిస్థితులలో ఈరెండు పనులూ జరగాలంటే కొత్తసమస్యలు పుట్టుకొచ్చి పరిష్కారం అలవిగాకుండా అవుతుంది.

సోవియట్ రష్యా సుముఖతకనపరచినా కనపరచకపోయినా ఇట్టి ప్రతిపాదనను అమెరికన్లు విడువకుండా ప్రపంచంముందుంచుతూ పోయ్యారంటే ప్రపంచ ప్రజల నావరించిన భయం అంతరించి వారిలో ఆశలు చివుళ్ళెత్తగలవు. అమెరికా రాజనీతి సుషుప్తావస్థలో పడిపోక జాగృతమై వుందనీ, సృజనాత్మకంగా వుందనీ, శాంతిపథంపైపు పురోగమించడానికి వాస్తవికమైన ఎట్టి అవకాశాన్నయినా వినియోగించుకొన అమెరికా సిద్ధంగావుందనీ ప్రపంచానికి పునఃవిశ్వాసం కలుగుతుంది.

# 9

# చొరవతీసుకోవలసిన సమయం

రష్యాపాలకులు ఎప్పుడేమిచేస్తారోనని బెంబేలెత్తిపోవడం అమెరికాసంప్రదాయాలకే విరుద్ధమనీ, అమెరికా ఎల్లప్పుడూ ధైర్యంగా చైతన్యవంతంగా ప్రవర్తిస్తూ వచ్చిందనీ శ్రీ బౌల్స్ అంటారు. 1960 అక్టోబరులో మిన్నెసోటా విదేశాంగవిధాన సమితివారిముందు ప్రసంగిస్తూ అమెరికా విదేశాంగవిధానానికి పటిష్ఠమైన నూత్న దృక్పథం అవసరమని శ్రీ బౌల్స్ అన్నారు.

## ఇక కృశ్చేవ్ ఏంచేస్తాడు?

నెలనెలా అతగాడి బెదిరింపులు, లాలనలు, ఎత్తుతూవున్న ఎత్తులు, మాట్లాడుతూవున్న మాటలు అమెరికాపత్రికలలో ప్రముఖస్థానమాక్రమిస్తున్నాయి. టెలివిజనులలో, అమెరికారాజకీయనాయకుల బుర్రలలో అమెరికావిదేశాంగవిధానాన్ని రూపొందించడంలో—ఎక్కడచూచినా కృశ్చేవ్ ఆకారమూ, అతని మాటలే అమెరికన్లకు ప్రత్యక్షమవుతున్నాయి.

ఎదురుగుండా మోటారుకారు వస్తూవుంటే దానిముందరి లైట్ల వెలుగు కళ్ళల్లో పడి మరి దేనినీ చూడక ఆవెలుగుకేసే గుడ్లప్పగించిచూసే సీమకుందేళ్ళవలె అమెరికన్లు కూడా సోవియట్ ప్రధానమంత్రి వేసే ప్రతి అడుగునూ బెదురుగొడ్డువలె చూస్తున్నారు.

చరిత్రకారులు దీనిని వింతగా భావించవచ్చు. బలశాలులైనప్రజలు, అమోఘమైన పారిశ్రామికశక్తి, అనంతమైన ప్రకృతిసంపద, మానవస్వాతంత్ర్యం విషయంలో మహోదారభావాలు, సంప్రదాయాలుగలఅమెరికావంటి సుసంపన్నదేశం

ఈ ఇరవయ్యోశతాబ్దిలో రష్యాపాలకులమాటలకూ, చేతలకూ గ్రుడ్డిగా ఇంతగా ఎందుకు భయపడాలి అని చరిత్రకారులు ప్రశ్నించవచ్చు.

ఈపరిస్థితిలో రావలసింది కొత్తముఖాలు, కొత్తభావాలు. అమెరికా జాతి దృష్టిని రష్యాపాలకసౌధం మీదినుంచి మరలించి, 'చేయవలసింది ఎంతో వుంది. రండి, ఈ అవకాశాన్ని వినియోగించుకోండి' అనిపిలుస్తూవున్న సువిశాల అవకాశాల వైపు అమెరికన్లను నడిపించుకుపొయ్యే నాయకత్వం అమెరికన్లకు రావాలి.

క్రుశ్చేవ్ ఏమని అన్నా, ఏంచేసినా అది అంతా పట్టించుకోకుండా వచ్చే జనవరిలో నూత్నప్రభుత్వం ఏయేరంగాలలో తగుచర్యలు తీసుకోవచ్చో వాటిని ఇక్కడ పేర్కొంటాను.

1. అమెరికారక్షణశ్రేణులను మరింత మంచి స్థితిలో వుంచవచ్చు. హఠాత్తుగా దాడిజరిగినప్పుడు అమెరికన్లు నిర్విణ్ణులై అశక్తులై పోనక్కరలేకుండా, అణ్వస్త్రాలతో తిరిగి ఎదురుదెబ్బ తీసి శత్రువును మట్టుపెట్టగల విధంగా అమెరికా సైనికశక్తిని సన్నద్ధంచేసుకోవాలి. దానికితోడు గతంలోవలె ఇకముందుకూడా స్థానికసంఘర్షణలు అమెరికన్లు నెదుర్కొన్నట్లయితే వాటిలో నెగ్గగలుగుటకై ఎప్పుడుపడితే అప్పుడు, ఎక్కడికిపడితే అక్కడికి సులభంగా తరలి దూకుడుగా యుద్ధంచేయగల ఘాతలసైన్యాలను సమాయత్తం చేసుకోవాలి.

ప్రస్తుతం అమెరికారక్షణవిధానాలు అమెరికన్లు ఏయుద్ధాన్నయితే ఎన్నటికీ చేయమని అంటున్నారో ఆయుద్ధాన్నే గత్యంతరంలేక చేయవలసినస్థితిలో అమెరికన్లను ఇరకాటానపెట్టాయి. అంటే అమెరికన్లు ఆరంభించగల అణ్వస్త్రయుద్ధం.

2. తోడ్తోడనే నిరాయుధీకరణ, ఆయుధాల అదుపువిషయాలలో అమెరికన్ కృషిని తీవ్రతరంచెయ్యాలి. నూత్నపాలకవ్యవస్థలో రక్షణను, నిరాయుధీకరణను ఒకదానికొకటి విరుద్ధమైనవిగా భావించక వాటిని వున్నవివున్నట్లుగా—అంటే రాగల కొద్దినెల్లల్లో ప్రపంచసుస్థిరతకు అత్యావశ్యకమైన జంటగా చూచి రెంటినీ సాధించప్రయత్నించాలి.

జీవన్మరణాల నూత్నయథార్థాలు అమెరికన్లకు తెలుసుననీ, అణ్వస్త్రభయంపై ఆధారపడ్డశాంతికి ఏక్షణంలోనైనా భంగంకలుగవచ్చునన్న సత్యాన్ని అమెరికన్లు గ్రహించారనీ, నిరాయుధీకరణ విషయంలో ప్రస్తుతమేర్పడ్డ ప్రతిష్టంభనను పూర్తిగా తుదముట్టించకపోయినా దాన్ని కొంత సడలించేందుకు నూత్నమార్గాల

అన్వేషణకు అమెరికన్లు కృతనిశ్చయులై వున్నారనీ నూతనప్రభుత్వం తనప్రకటనల ద్వారా, చర్యలద్వారా నిరూపించవచ్చు.

ఈనూత్నమార్గాలలో కొత్త ప్రతిపాదనలుచేరివుండాలి. చక్కని పరిశోధన ఆధారంగా, ఓర్పుతో నేర్పుతో జరిపినసంప్రదింపులు ఆధారంగా వాస్తవమైన హామీలు, పూచీలు పుచ్చుకొని ఆయుధాల అదుపును సాధించగల ప్రతిపాదనలు అమెరికన్లకు అవసరం.

3. అట్లాంటిక్‌వ్యవస్థ తాలూకు ప్రజలకూ, అమెరికన్లకూ ఉభయసామాన్య మైన సాంస్కృతిక రాజకీయవారసత్వంవుంది. ఆవ్యవస్థలో పారిశ్రామికంగా నేర్పరులైన ప్రజలు 40 కోట్లమందివున్నారు. వారితో కలిసి అమెరికన్లు సమర్థ వంతమైన భాగస్వామ్యాన్ని నిర్మించవచ్చు.

కృశ్చేవ్ అంటే అమెరికన్లకూ, వారి అట్లాంటిక్ మిత్రులకూ భయంగా ఉంది. కాబట్టే ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థ అమెరికన్లను ఐక్యంగా వుంచుతున్నదనుకుంటాను. కృశ్చేవ్ కళ్ళెర్రజెయ్యడాన్నిబట్టి, చిరునవ్వుచిందించ డాన్నిబట్టి ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థ పెరుగుతూ, లేదా తరుగుతూవుంటుంది.

అమెరికన్ల యూరపుమిత్రులతో దీర్ఘకాలిక సంబంధాలు వర్ధిల్లాలంటే ఈ పరస్పరభయంచాలదు. ఆసంబంధాల మూలమేమిటో ఎరిగి, వారినీ అమెరికన్లనూ ఏకంగావుంచే రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక బంధనాలను విస్తృతంచేయాలి.

అట్లాంటిక్‌వ్యవస్థలో పరస్పర సహకారాన్ని పెంపొందించగల సాధనాలను బలపరచడం నూత్నప్రభుత్వంయొక్క ప్రథమకర్తవ్యంకావాలి.

4. అమెరికన్ల ఆర్థికసహాయకార్యక్రమాలను తిరిగి సమీక్షించుకొని పునర్వ్యవస్థీకరించవచ్చు.

ఈకార్యక్రమాలకు నూత్నప్రమాణాలుకావాలి. అమెరికన్లిచ్చే సహాయాన్ని మిక్కిలి ప్రయోజనకరంగా ఉపయోగించుకొని, వాటిసత్వరాభివృద్ధి నిమిత్తంఅవసర మైన త్యాగాలుచేయ సిద్ధంగావున్న దేశాలకు హెచ్చుసహాయం నమ్మకంగా లభించాలి.

ఎక్కడ అమెరికన్ల దీర్ఘకాలికసహాయం అవసరమో అక్కడ అది లభింప జేస్తారని మాటయిచ్చినట్లయితే మరింతక్రమబద్ధమైన విధంగా, మరింతలాభకరంగా ఆర్థికకార్యక్రమాలు అమలుజరపవచ్చు.

అన్వేషణకు అమెరికన్లు కృతనిశ్చయులై వున్నారనీ నూతనప్రభుత్వం తనప్రకటనల ద్వారా, చర్యలద్వారా నిరూపించవచ్చు.

ఈనూత్నమార్గాలలో కొత్త ప్రతిపాదనలుచేరివుండాలి. చక్కని పరిశోధన ఆధారంగా, ఓర్పుతో నేర్పుతో జరిపినసంప్రదింపులు ఆధారంగా వాస్తవమైన హామీలు, పూచీలు పుచ్చుకొని ఆయుధాల అదుపును సాధించగల ప్రతిపాదనలు అమెరికన్లకు అవసరం.

3. అట్లాంటిక్‌వ్యవస్థ తాలూకు ప్రజలకూ, అమెరికన్లకూ ఉభయసామాన్యమైన సాంస్కృతిక రాజకీయవారసత్వంవుంది. ఆవ్యవస్థలో పారిశ్రామికంగా నేర్పరులైన ప్రజలు 40 కోట్లమందివున్నారు. వారితో కలిసి అమెరికన్లు సమర్థవంతమైన భాగస్వామ్యాన్ని నిర్మించవచ్చు.

కృశ్చేవ్ అంటే అమెరికన్లకూ, వారి అట్లాంటిక్ మిత్రులకూ భయంగా ఉంది. కాబట్టే ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థ అమెరికన్లను ఐక్యంగా వుంచుతున్నదనుకుంటాను. కృశ్చేవ్ కశ్మేరజెయ్యడాన్నిబట్టి, చిరునవ్వుచిందించడాన్నిబట్టి ఉత్తర అట్లాంటిక్ వ్యవస్థ పెరుగుతూ, లేదా తరుగుతూవుంటుంది.

అమెరికన్ల యూరపుమిత్రులతో దీర్ఘకాలిక సంబంధాలు వర్ధిల్లాలంటే ఈ పరస్పరభయంచాలదు. ఆసంబంధాల మూలమేమిటో ఎరిగి, వారినీ అమెరికన్లనూ ఏకంగావుంచే రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక బంధనాలను విస్తృతంచేయాలి.

అట్లాంటిక్‌వ్యవస్థలో పరస్పర సహకారాన్ని పెంపొందించగల సాధనాలను బలపరచడం నూత్నప్రభుత్వంయొక్క ప్రథమకర్తవ్యంకావాలి.

4. అమెరికన్ల ఆర్థికసహాయకార్యక్రమాలను తిరిగి సమీక్షించుకొని పునర్వ్యవస్థీకరించవచ్చు.

ఈకార్యక్రమాలకు నూత్నప్రమాణాలుకావాలి. అమెరికన్లిచ్చే సహాయాన్ని మిక్కిలి ప్రయోజనకరంగా ఉపయోగించుకొని, వాటిసత్వరాభివృద్ధి నిమిత్తంఅవసరమైన త్యాగాలుచేయ సిద్ధంగావున్న దేశాలకు హెచ్చుసహాయం నమ్మకంగా లభించాలి.

ఎక్కడ అమెరికన్ల దీర్ఘకాలికసహాయం అవసరమో అక్కడ అది లభింపజేస్తారని మాటయిచ్చినట్లయితే మరింతక్రమబద్ధమైన విధంగా, మరింతలాభకరంగా ఆర్థికకార్యక్రమాలు అమలుజరపవచ్చు.

చైనాకు తన ప్రాబల్యవిస్తరణకాంక్ష అధికంగావుంది. ఈకాంక్ష చైనా కమ్యూనిజంవల్ల పుట్టుకొచ్చింది. అంతేకాదు. చైనాకు సాంప్రదాయికంగా కొన్ని శతాబ్దాలనుంచి రాజ్యవిస్తరణకాంక్షవుంది. సామ్రాజ్యవాద ధోరణివుంది. పైగా చైనా జనాభాకు అవసరమైన భూభాగంలేదు. నూనె, ఇతర సహజసంపదలు లేవు. ఈకారణాలన్నింటివల్ల దానికి ప్రాబల్యవిస్తరణకాంక్ష కలిగిందని అమెరికన్లు తెలుసుకున్నారంటే ఆవిస్తరణను అమెరికన్లు అరికట్టవచ్చు.

తూర్పు ఆసియాలో ఆర్థికంగా, రాజకీయంగా, సైనికంగా యథార్థంగా స్థానబలం అమెరికన్లకు చేకూర్చగల పరిస్థితిని అమెరికన్లు సృష్టించుకున్నారంటే చైనా ప్రధాన భూభాగంపై నివసించే 65 కోట్లప్రజలు వారి ఇరుగుపొరుగువారితో వ్యవహరించే వైఖరిలో తప్పక మార్పువస్తుంది.

జపాను, ఫార్మోజాలుమొదలు. ఆగ్నేయాసియాను చుట్టుతూ భారతదేశం పాకిస్తానులవరకూ రాజకీయస్వాతంత్ర్యానికి గట్టి పునాదులువేసి, క్రమబద్ధమైన ఆర్థికాభివృద్ధికి కృషిచేయడంలో అమెరికన్లు చూపే శ్రద్ధాసక్తులపై స్వతంత్ర ఆసియాభవిష్యత్తు ఆధారపడివుంటుంది. అమెరికన్లు శ్రద్ధవహించారా స్వతంత్ర ఆసియా నిలబడుతుంది. అమెరికన్లు తమకర్తవ్యం విస్మరించారా ఆసియాస్వాతంత్ర్యానికి విఘాతం కలుగుతుంది.

8. ఇక చివరకు అమెరికన్లస్వవిషయంలో చేయవలసినవన్నీ చేసి,పడవలసిన పాట్లు అన్నీ పడితే ప్రపంచనాయకత్వానికి అమెరికాయోగ్యత సంపాదించుకోవడమేగాక తగు అంగబలం, అర్థబలం కలిగివుంటుంది.

అమెరికా ఆర్థికాభివృద్ధిని తీవ్రతరం చేసినట్లయితే అమెరికన్లకు చక్కని మానవబలగం, హెచ్చు ఉత్పత్తి, ఆధునికమైన యంత్రసామగ్రి సమకూరుతాయి. వీటితో ఎట్టి అవాంతరాలనైనా ఎదుర్కోవచ్చు.

అమెరికన్లు ఆధునికమైన పాఠశాలలూ, విశ్వవిద్యాలయాలూ నిర్మించాలి. సమర్థులైన ఉపాధ్యాయులకు తగు శిక్షణ ఇస్తే అమెరికాలోని బాలబాలికలు, యువతీయువకులు వారి తెలివితేటలనుబట్టి ఉన్నతవిద్య సముపార్జించుకోగలుగుతారు.

అమెరికాదేశంలోవున్న మురికిపేటలను నిర్మూలించి, పట్టణాలను పునర్నిర్మించాలి.

చైనాకు తన ప్రాబల్యవిస్తరణకాంక్ష అధికంగావుంది. ఈకాంక్ష చైనా కమ్యూనిజంవల్ల పుట్టుకొచ్చింది. అంతేకాదు. చైనాకు సాంప్రదాయికంగా కొన్ని శతాబ్దాలనుంచి రాజ్యవిస్తరణకాంక్షవుంది. సామ్రాజ్యవాద ధోరణివుంది. పైగా చైనా జనాభాకు అవసరమైన భూభాగంలేదు. నూనె, ఇతర సహజసంపదలు లేవు. ఈకారణాలన్నింటివల్ల దానికి ప్రాబల్యవిస్తరణకాంక్ష కలిగిందని అమెరికన్లు తెలుసు కున్నారంటే అవిస్తరణను అమెరికన్లు అరికట్టవచ్చు.

తూర్పు ఆసియాలో ఆర్థికంగా, రాజకీయంగా, సైనికంగా యథార్థంగా స్థాన బలం అమెరికన్లకు చేకూర్చగల పరిస్థితిని అమెరికన్లు సృష్టించుకున్నారంటే చైనా ప్రధాన భూభాగంపై నివసించే 65 కోట్లప్రజలు వారి ఇరుగుపొరుగువారితో వ్యవ హరించే వైఖరిలో తప్పక మార్పువస్తుంది.

జపాను, ఫార్మోజాలుమొదలు. ఆగ్నేయాసియాను చుట్టుతూ భారతదేశం పాకిస్తానులవరకూ రాజకీయస్వాతంత్ర్యానికి గట్టి పునాదులువేసి, క్రమబద్ధమైన ఆర్థికాభివృద్ధికి కృషిచేయడంలో అమెరికన్లు చూపే శ్రద్ధాసక్తులపై స్వతంత్ర ఆసియాభవిష్యత్తు ఆధారపడివుంటుంది. అమెరికన్లు శ్రద్ధవహించారా స్వతంత్ర ఆసియా నిలబడుతుంది. అమెరికన్లు తమకర్తవ్యం విస్మరించారా ఆసియాస్వాతం త్ర్యానికి విఘాతం కలుగుతుంది.

8. ఇక చివరకు అమెరికన్లస్వవిషయంలో చేయవలపినవన్నీ చేపి,పడవలసిన పాట్లు అన్నీ పడితే ప్రపంచనాయకత్వానికి అమెరికాయోగ్యత సంపాదించుకోవడమే గాక తగు అంగబలం, అర్థబలం కలిగివుంటుంది.

అమెరికా ఆర్థికాభివృద్ధిని తీవ్రతరం చేసినట్లయితే అమెరికన్లకు చక్కని మానవబలగం, హెచ్చు ఉత్పత్తి, ఆధునికమైన యంత్రసామగ్రి సమకూరుతాయి. వీటితో ఎట్టి అవాంతరాలనైనా ఎదుర్కోవచ్చు.

అమెరికన్లు ఆధునికమైన పాఠశాలలూ, విశ్వవిద్యాలయాలూ నిర్మించాలి. సమర్థులైన ఉపాధ్యాయులకు తగు శిక్షణ ఇస్తే అమెరికాలోని బాలిబాలికలు, యువతీయువకులు వారి తెలివితేటలనుబట్టి ఉన్నతవిద్య సముపార్జించుకోగలుగుతారు.

అమెరికాదేశంలోవున్న మురికిపేటలను నిర్మూలించి, పట్టణాలను పునర్ని ర్మించాలి.

# 10

# అమెరికా శతాబ్దికొక రూపమిచ్చే అయిదు నిర్ణయాలు

ఈ అయిదు నిర్ణయాలలో రెండింటి విషయంలో అమెరికన్లు కృతార్థులైనారనీ, మరిరెండింటి విషయంలో విఫలులయ్యారనీ, ఐదవది ఎటూ తేలకుండా వుందనీ శ్రీ బౌల్స్ నమ్మకం. 1961 జూన్ 12 తేదీన వాషింగ్టన్‌లో జరిగన అమెరికా పుస్తక విక్రేతల సంఘం వార్షికమహాసభలో ఇచ్చిన ఉపన్యాసంనుంచి.

ఈ రాత్రి చాలాదూరం పారజూడవలెనని బుద్ధిపుడుతోంది. ఇప్పటినుంచి ఒక తరంతర్వాత అమెరికాజాతి విషయమై విస్పష్టాభిప్రాయాన్ని ప్రకటిస్తూ వ్రాసే చరిత్రకారులు తక్కిన ప్రపంచంతో ఈజాతికిగల సంబంధాలనుగూర్చి, ప్రపంచసుస్థిరతకు అమెరికాచేసిన కృషినిగూర్చి ఏమని వ్రాస్తారు?

ఇరవయ్యోశతాబ్ది అర్ధభాగంలో ప్రపంచసంఘటనలపై అమెరికాకుగల ప్రభావాన్నిగూర్చి ఈచరిత్రకారులు ఏమంటారో!

అసాధారణమైన అమెరికన్ల నూతనపారిశ్రామికశక్తిని ప్రపంచశాంతికోసం, ధనధాన్య సమృద్ధికోసం వినియోగించడంలో అమెరికన్ల జయాపజయాలనుగూర్చి ఏమని వ్రాస్తారు?

ఇరవయ్యోశతాబ్ది మొదటి ఏడు దశాబ్దాలనుగూర్చి ఆలోచించేటప్పుడు ఐదు నిర్ణయాలను వారు శ్రద్ధగా పరికిస్తారని నానమ్మకం. రెండింటివిషయంలో అమెరికన్లు

విఫలులయ్యారని అంటారు. మరిరెండిటివిషయంలో కృతార్థులమయ్యారన్న అభిప్రాయం ప్రకటిస్తారు. ఐదవది ఎటూ తేలకుండా వుందని అంటారు,

ఈ ఐదునిర్ణయాలేమిటి?

మొదటిది: 1919 లో అమెరికన్లు నానాజాతిసమితిలో చేరకపోవడం. అందులోచేరి యూరపులో కొత్తగా సాధించినశాంతిని పరిరక్షించేందుకై అమెరికా స్తోమతను, పేరుప్రతిష్ఠలను వినియోగించవలసింది. ఆపని అమెరికన్లు చేయలేదు.

రెండవది: 1911 లో మంచూ సామ్రాజ్యం పతనమైనప్పుడు చైనాలో విప్లవాత్మక విజృంభణనూ, ఆ విజృంభణకూ భవిష్యత్తులో అమెరికా భద్రతకూ గల సంబంధాన్నీ అన్వయాన్నీ గ్రహించలేకపోవడం.

మూడవది: పశ్చిమయూరపుకు దాపురించిన నాజీబెడదను విజయవంతంగా ఎదుర్కోవడం.

నాల్గవది: యుద్ధానంతరం యూరపులో సంభవించిన ఆర్థికరాజకీయ సంక్షోభాన్ని గమనించి తగునిర్ణయంచేసి ధైర్యంగా ఆవిపత్తును ఎదుర్కోవడం,సహాయపడటం. ఈపనిచేశారు.

ఇక చివరిది-అయిదవది: ఆసియా, ఆఫ్రికా, మధ్యప్రాచ్యం, లాటిన్ అమెరికా ప్రాంతాలలో ప్రపంచజనాభాలో మూడింట రెండువంతులమంది నివసిస్తున్నారు. వీరు నేటికంటె ఉత్తమజీవనంకోసం ఆశలుపెట్టుకొని వున్నారు. వీరిఆశలు, కోర్కెలు మానవజాతి సుదీర్ఘచరిత్రలో అతిశక్తివంతమైన, అతిప్రమాదభరితమైన, అత్యంతపురోభివృద్ధి సూచకమైన విప్లవాన్ని సృష్టించాయి. వీరితో అమెరికా కెటువంటి సంబంధాలువుండాలన్న విషయంలో 1960 మొదలు 1970 వరకు అమెరికన్లు అనేక సమస్యలెదుర్కొంటాయి. వాటిని ఎట్లా నిర్ణయిస్తారన్నదే ఐదవనిర్ణయం.

ఈ ఐదవదాని విషయంలో అమెరికా ప్రభుత్వమేగాక అమెరికాప్రజలు కూడా అపూర్వమైన, ప్రగాఢమైన, దీర్ఘకాల ఫలితాలనిచ్చే మాటలకూ, చేతలకూ బాధ్యులు కావలసివుంటుంది.

మొదటినాలుగు నిర్ణయాలవిషయంలో అమెరికా అభిప్రాయాలేమిటో తేల్చుకుంటే ఐదవదానిపట్ల కొత్తవైఖరిని అవలంబించగలరేమో?

1. నానాజాతిసమితిలో చేరకపోవడం.

1919 లో నానాజాతిసమితిలో అమెరికన్లు చేరకపోవడంవల్ల కలిగిన పర్యవసానాన్ని ప్రస్తావి స్తేచాలు ననుకుంటాను.

విల్సన్ అమెరికన్లకు అనేకపర్యాయాలు తగుహెచ్చరిక చేయనే చేశాడు. ఆయన దృక్పథాన్ని తిరస్కరించి కొత్తగా అవతరిస్తూవున్న ప్రపంచప్రజావ్యవస్థకు దూరంగావుంటే అమెరికన్లు ప్రపంచహృదయాన్ని భగ్నంచేసిన వారవడమేగాక అమెరికన్ల ఈవైఫల్యానికి రక్తంతో పరిహారం చెల్లించుకోవలసివుంటుందని ఆయన హెచ్చరించాడు.

అయినా విడిగావుందామన్న బుద్ధి తప్ప వేరొకటిలేకపోయ్యె! విడిగా వుందామనేవారు తెలివికలవారయ్యె! ఎవరేమిచెప్పినా ససేమిరా విన్నారుకారు. ఎక్కడో వున్న యూరపుసమస్యలను పరిష్కరించేందుకు అమెరికాకుర్రాళ్ళను సముద్రం దాటించిపంపి, అమెరికాడాలర్లు వెచ్చించి లేనిపోని ఔదార్యానికి పొయ్యారని అన్నారు వారు.

ఇలా వుడ్రోవిల్సన్ మాటను అమెరికన్లు ఖాతరుచెయ్యలేదు. ఆయన అభిమానించిన నానాజాతిసమితి అమెరికన్లకు వద్దు అనుకున్నారు. ఈవిధంగా అమెరికా తంత్రుల తరంవారు అమెరికాభవిష్యత్తు సంగతి ఆలోచించలేదు. ప్రపంచవ్యవస్థకు నాందీప్రస్తావన చేయవలసినవారు ముందుచూపులేకుండా వ్యవహరించారు. 1919 లో అమెరికా ప్రపంచబాధ్యతను స్వీకరించకుండా తప్పించుకోవడం తప్పిదమేనని క్రీ॥శ॥ 2000 లో చరిత్ర తీర్పుచెబుతుంది.

2. చైనా విప్లవంబెడద.

రెండవ నిర్ణయం చైనా విప్లవంబెడదవల్ల ఉత్పన్నమైంది. చైనారిపబ్లికు అవతరణసమయంలో నవచైనాయొక్క భౌతికమానసిక అవసరాలేమిటో తెలుసుకోగల స్థితిలో అమెరికావున్నది. అక్కడవస్తూవున్న ఆర్థికరాజకీయమార్పులను ప్రభావితంచేయగల సావకాశం అప్పుడు అమెరికన్లకుంది.

అయినా 1920, 1921 లో చైనాలో ఏకీకరణసాధించడానికీ, చైనాను ఆర్థికంగా వృద్ధిపరచడానికీ పెద్దమొత్తాలు అప్పులుగా ఇవ్వమని సన్‌యత్‌సెన్ పదేపదే అడిగినప్పుడు వెంటనే అది వల్లకాదు పొమ్మన్నారు. ముందుచూపుగల కొద్దిమంది అమెరికనులకు కూడా చైనా తమకొక సమస్య అవుతుందన్న గ్రహింపే అప్పుడు లేకపోయింది.

అమెరికాలాగే పశ్చిమయూరపు రాజ్యాలుగూడా చైనాకోర్కెను తిరస్కరించాయి. నిరాశోపహతుడైన సన్‌యత్‌సెన్ అట్లాంటిక్ రాజ్యాలు ఇవ్వమని చెప్పిన సహాయాన్నిమీరైనా ఇవ్వండిమహాప్రభో అని మాస్కోలో కొత్తగా ఏర్పడ్డ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని కోరాడు, విధిలేక.

1922 లో వాషింగ్టన్‌లో జరిగిన నిరాయుధీకరణ మహాసభలో హార్డింగ్ ప్రభుత్వం అమెరికావైఫల్యాన్ని వెనకేసుకువచ్చి మాట్లాడి అదీ ఒకవైఫల్యమేనా అన్నధోరణిలో వ్యవహరించింది. జపానుదేశం తనసైన్యాలపై కొన్ని పరిమితులు విధించుకోవడానికి ఆమోదించినట్లయితే అందుకు బదులుగా అమెరికాకొత్త నౌకాదళంలో అధికభాగాన్ని వదులుకుంటారని అంగీకరించడంద్వారా పశ్చిమపసిఫిక్‌లో అమెరికన్లకు గల స్థానబలాన్ని చేజేతులా వోగొట్టుకొని జపానుదురాక్రమణలకు అవకాశమిచ్చారు. చిలికి చిలికి గాలివాన అయిందన్నట్లు ఆదురాక్రమణలే పంధొమ్మిది సంవత్సరాలతర్వాత జరిగిన పెరల్‌హార్బర్ ఉదంతానికి దారితీశాయి.

అంతటితో అయిపోయిందా! ఆతర్వాత ఎన్నో అవకాశాలు వచ్చాయి. ఎన్నో ఘోరమైన తప్పిదాలుచేశారు. 1927 లో చైనాలో సన్‌యత్‌సెన్ తర్వాత అధికారానికి వచ్చిన చాంగ్‌కైషేక్ కమ్యూనిస్టుల కెదురు తిరిగి ఆధునికప్రాతిపదికపై కమ్యూనిస్టేతర ప్రభుత్వాన్ని స్థాపించడానికి అయన పథకమేమిటో అమెరికా ముందుంచాడు. అమెరికా పాత తప్పులను సరిదిద్దుకోవడానికి అది తగిన అవకాశం. కాని సర్వసమృద్ధితో, సంతృప్తితో బొజ్జపెంచి దూరంగా భద్రంగావున్న అమెరికా నిజస్థితిని అర్థంచేసుకోలేకపోయింది.

1931 లో జపానుసైన్యం మంచూరియాలోకి ప్రవేశించింది. వెంటనే అమెరికా గట్టి చర్యతీసుకున్నట్లయితే జపానుదురాక్రమణను నిలుపరించినట్లయ్యేది. చైనాస్వతంత్రదేశంగా, రాజకీయంగా సుస్థిరతగలరాజ్యంగా పైకివచ్చేది. కాని 1930 లగాయతు 1940 వరకు అమెరికన్లసమస్యలతో అమెరికన్లు సతమతమయ్యారు. జపాన్‌నౌకాదళశక్తిని రెచ్చగొట్టడం అమెరికా కిష్టం లేకపోయింది. బలంలేక అటూ ఇటూ ఊగిసలాడుతూవున్న చైనాకు అత్యవసరంగా కావలసిన సహాయ అందించలేకపోయ్యారు.

చైనాలో జరుగుతూవచ్చిన సంఘటనలను ప్రభావితంచేయగ అమెరికన్లు ఎప్పుడుకోల్పొయ్యారో ఎవరికీ సరిగా అంతుపట్టకుం

1941 ప్రాంతంలోనే గనుక అమెరికన్లు సైనికంగా, రాజకీయంగా, ఆర్థికంగా సర్వసమగ్ర కృషి చేసివుంటే కమ్యూనిజానికి ప్రత్యామ్నాయంగా తగిన ప్రజాస్వామ్యశక్తిని రూపొందించగలిగివుండేవారని కొందరు పరిశీలకులు అంటారు. యుద్ధం ముగియవచ్చేసరికి అమెరికన్లకు తెలిసింది—ఏమని? పెద్దపెట్టున అమెరికా సైన్యంతో జోక్యం కలిగించుకుంటేతప్ప లేకపోతే చరిత్రగతిని, జరుగుతూవున్న సంఘటనలను మార్చలేరని!

అప్పటికే ప్రజలు యుద్ధంవల్ల విసిగిపోయ్యారు. ఎటుచూచినా సంక్షోభం, ఉభయపక్షాల రాజకీయనాయకులు గూడా ప్రజల మనఃస్థితిని గమనించి యుద్ధం సమాప్తంకావడానికి పాటుపడ్డారు. ఈస్థితిలో ఎట్టిచర్యతీసుకోవడం అవసరమో చర్చించే సావకాశంగూడా లేకపోయింది.

ఈవిధంగా తమశతాబ్దిలో అమెరికన్లువారి విదేశాంగవిధానాన్ని ఎదుర్కొన్న రెండవ సవాలును ఉపేక్షించి విఫలులయ్యారు. ఈవైఫల్యంయొక్క ఫలితాలను ప్రపంచం కొన్ని తరాలవరకూ అనుభవించవలసివుంటుంది.

3. నాజీ జర్మనీకి వ్యతిరేకత.

మూడవసవాలును అమెరికన్లు ఆలస్యంగా ఎదుర్కొన్నప్పటికీ సమర్థవంతంగా ఎదుర్కొన్నారు.

రూజ్వెల్టు మహాశయుడు గొప్ప చారిత్రకపరిజ్ఞానంకలవాడు గనుక యూరపుఖండం నాజీల ఆధిపత్యంక్రిందికి పోయిందంటే అమెరికాస్వాతంత్ర్యానికే ముప్పు వస్తుందని గ్రహించాడు. 1937 లో ఆయన క్రమేణా అమెరికా ప్రజలకు ఈసత్యం బోధపరచడం మొదలెట్టాడు.

కాని అమెరికన్లు మొదట రూజ్వెల్టు విజ్ఞప్తిని తిరస్కరించి ఒంటికాయశొంటికొమ్ముధోరణిలో ప్రవర్తించారు. పశ్చిమయూరపురాజ్యాలకు ఓడలద్వారా సరుకుల రవాణాను నిలుపుదలచేస్తూ అమెరికన్లు ఆమోదించిన తటస్థవిధానచట్టం అమెరికాజాతీయ చిత్తవృత్తిని వ్యక్తంచేసింది.

అయినప్పటికీ స్వయంసమృద్ధి విషయంలో పాతకబుర్ల విలువ తగ్గిపోవడం మొదలైంది. విల్సన్ చెప్పిన నీతి అమెరికన్లకు బోధపడజొచ్చింది. దేశాలు ఒకదానిపై ఒకటి ఆధారపడివుండవలసిన అగత్యంవుందని ఆయన హితబోధచేశాడు.

చివర కెలాగో అర్థంచేసుకున్నారు. బ్రిటను అత్యంతదుర్దశలో వున్నప్పుడు అమెరికన్లు ఆదుకున్నారు.

4. యుద్ధానంతరపునర్నిర్మాణం.

యూరపులో యుద్ధం ముగియడంతోటే నాల్గవసవాలు ఎదురైంది.

కొన్నేండ్లపాటు బాంబులుపడడంవల్ల, వీధివీధిలో భీషణసమరం జరగడంవల్ల పశ్చిమయూరపులోని నగరాలు ధ్వంసమై శిథిలాలుగా మారాయి. ఆహారం, వంటచెరకు, ఇంధనం, భవననిర్మాణసామగ్రి కరువు ఏర్పడింది. ద్రవ్యోల్బణం హెచ్చి యూరపు ఆర్థికవ్యవస్థయావత్తూ కూలిపొయ్యే స్థితికివచ్చింది.

ఈలోపల కొన్నిపందలమైళ్ళదూరాన తూర్పుజర్మనీలో పోలెండులో రెండు వందల సోవియట్ సైనికపటాలాలు ఎట్టి నిలువరింపూలేకుండా ఇంగ్లీషు ఛానల్ వరకూ దూసుకుపోవడానికి సిద్ధంగా నిలబడివున్నాయి.

రష్యావారు మొదట్లో గ్రీసు, టర్కీలను స్వాహాచేసుకోవాలని ఉద్దేశించారు. బ్రిటిషువారు వారి రాజనీతిచతురతతో, సైనికశక్తితో రెండు శతాబ్దాలపాటు రష్యా మధ్యధరాసముద్రప్రాంతంలోకి ప్రవేశించకుండా అడ్డగలిగారు. కాని ఇప్పుడు రష్యాసవాలును ఎదుర్కొనే స్థితిలో లేరు.

ఈస్థితికి తోడు నాజీలకు వ్యతిరేకంగా ప్రచ్ఛన్నంగా ఉద్యమంసాగిస్తూవున్న పశ్చిమయూరపు కమ్యూనిస్టుపార్టీలు బలంపుంజుకొని అయోమయత్వాన్ని కల్పించి, ఐక్యసంఘటనలను నిర్మించి అధికారం కైవసం చేసుకోవడానికి సమాయత్తమవుతున్నాయి.

ఇట్టివిపత్కరస్థితిలో అమెరికావిదేశాంగమంత్రిగా జనరల్ జార్జిమార్షల్ వుండడం అమెరికా అదృష్టవిశేషమని చెప్పాలి. ఆయన మేరుగంభీరుడు. ధీరోదాత్తుడు. నిజాయతీగలవాడు. బుద్ధికుశలుడు. పైగా ట్రూమన్ అప్పుడు అధ్యక్షుడుగా వున్నాడు. ఆయన మొరటుధైర్యం గల మనిషి. ఒక కార్యాన్ని సాధించాలంటే మొండిపట్టుదలతో సాధించగలవాడు. నిజంగా సమకాలికచరిత్రలో ట్రూమన్‌కు విశేషస్థానం వుంటుందని నానమ్మకం.

విపత్తుతోపాటు దానికి తగ్గ గుండెబలం గల మనుష్యులుకూడా పదవులలోకి వచ్చారు. బ్రహ్మాండమైన జాతీయకృషి ఆరంభమైంది. రష్యా సైనిక, రాజకీయ;

ఆర్థికబెడదలను నిలువరించగలిగారు. స్వతంత్రమైన నవయూరపు పునాదులను పునర్నిర్మించారు. అమెరికన్లను అమెరికన్లే మూడవప్రపంచయుద్ధంనుండి రక్షించు కున్నారు.

గ్రీసు, టర్కీ దేశాల రక్షణకు ట్రూమన్ సిద్ధాంతంతోపాటు వెంటనే పశ్చిమ యూరపు ఆర్థికంగా, రాజకీయంగా కోలుకోవడానికై మార్షల్‌పథకం ఆరంభించారు. ఆవెంటనే పశ్చిమయూరపును సైనికంగా కాపాడడానికి ఉత్తర అట్లాంటిక్ ఒడం బడికవ్యవస్థ నిర్మింపబడింది. ధైర్యంచేసి బెర్లిన్‌నగరంలో అమెరికా ఆక్రమణ క్రిందగల భాగానికి విమానాలద్వారా సప్లయిలు అందజేశారు. ఇది నిజంగా అద్భుత కార్యం. దీనితో అమెరికన్లు, అమెరికామిత్రమండలీ సంకల్పబలం గలవారమనీ, సాధనసంపత్తిగలవారమనీ అమెరికాప్రత్యర్థులకు చాటారు.

1949 లో మరొకసమస్య అమెరికన్లనుఎదుర్కొంది. కొత్తగా స్వాతంత్ర్యం పొందినదేశాలు పేదదేశాలు. అభివృద్ధికి నోచుకోనిదేశాలు. వాటి ఉద్ధరణకై అమెరికన్లు సాహసించి చతుస్సూత్రప్రతిపాదనను (పాయింట్ ఫోర్‌కార్యక్రమం) అమలులోకితెచ్చి ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలతో నిర్మాణాత్మక భాగ స్వామం నెరిపారు.

అపూర్వమైనసవాలు ఎదుర్కొన్నప్పుడు అమెరికన్లు చొరవతో, తెలివి తేటలతో అరమరలులేకుండా కర్తవ్యపరాయణులైనరోజులవి. అమెరికానాయకులు అమెరికన్లను నడిపించారు. సంగతి సందర్భాలెరిగిన చైతన్యవంతులైన అమెరికా ప్రజలు ఒకగొప్ప జాతినడచుకొనే విధంగా దీక్షతో, సూక్ష్మబుద్ధితో సవాలును ఎదుర్కొన్నారు.

5. 1960 నుంచి 1970 వరకు అమెరికానాయకత్వం.

ఇక అమెరికన్ల చివరిసవాలుకు వద్దాం. ఇది అన్నిటికన్న గొప్పసవాలు. ఈశతాబ్ది మొదటి అరవైసంవత్సరాలలో అమెరికన్లను విపరీత విపత్కర పరిస్థితు లనేకం ఎదుర్కొన్నాయి. వాటన్నిటిలో ఇది అత్యంతక్లిష్టస్థితి.

పంధొమ్మిదవశతాబ్దిలో, ఇరవయ్యోశతాబ్ది తొలిదశాబ్దాలలో ప్రపంచశాంతి కేవలం యూరపులో అధికారసమతూకంపై ఆధారపడివుంది. రెండవప్రపంచయుద్ధా నంతరం ఈపరిస్థితి మారింది.

ఒకప్పుడు లండను, పారిస్, హేగ్‌నగరాలనుండి వచ్చే ఉత్తర్వులకు

బద్ధులుకావలసిన కోట్లాది ఆసియావాసులు, ఆఫ్రికనులూ స్వాతంత్ర్యం పొందారు. అభివృద్ధిచెందని ఈదేశాలు స్వతంత్రరాజ్యాలుగా అవతరించడంతో అమెరికాప్రభుత్వాన్నీ, అమెరికాప్రజలనూ ఒకకొత్తసవాలు ఎదుర్కొంది.

ఇది సరికొత్తపరిస్థితి. దీని పరిమాణాలే వేరు. ఇది ఒక విప్లవాత్మకమైన మార్పు. అల్పసంఖ్యాకులూ, శ్రీమంతులూ అయిన తెల్ల జాతివారికీ, అధికసంఖ్యాకులూ పేదవారూ అయిన నల్ల జాతులవారికీ మధ్యవున్న అఖాతాన్ని ఆధునికసాంకేతిక శాస్త్రం మరింత వెడల్పుచేస్తూవున్న సమయంలో అమెరికా ఈసవాలునెదుర్కొంది. తెల్ల జాతివారిలో హెచ్చుమంది ఉత్తర అట్లాంటిక్ ప్రాంతంలో ఉన్నారు. నల్లజాతులవారు విశేషంగా దక్షిణార్ధగోళంలో నివసిస్తున్నారు.

ఈలోపల చైనారాక్షసి ప్రపంచవ్యవహారాలలో ముందుకు చొచ్చుకు రాజొచ్చింది. చైనా 65 కోట్ల జనాభా గల దేశం. యుక్తిపరులైన ప్రజలు, చప్పున పరిశ్రమలు నెలకొల్పాలన్న సంకల్పం గల నాయకులు ఆ దేశానికి వున్నారు. ఒక సిద్ధాంతం వుంది. పరులమీదికి కయ్యానికి కాలుదువ్వే నాయకత్వం వుంది. కాని చైనాకు ప్రకృతిసంపదతగినంత లేదు. ఆగ్నేయాసియాలో ప్రాబల్యశూన్యస్థితి ఏర్పడి వుంది. అది చైనాను నోరూరజేస్తూవుంది. ఆగ్నేయాసియాలో పెట్రోలియం సమృద్ధిగా వుంది. పంటలు దండిగా పండే సారవంతమైన భూము లున్నాయి. ఇవన్నీ చైనాకు కావాలి. వెంటనే కావాలి.

మరొకవైపు సోవియట్ యూనియన్ వుంది. దాని ఉక్కు ఉత్పత్తి 6 కోట్ల టన్నులు. అమెరికాకు సాటీనా ఎంత పారిశ్రామికాభివృద్ధి వుందో దానికి మూడురెట్ల అభివృద్ధిగల దేశం రష్యా. అమెరికాలో తయారయ్యే ఇంజనీర్లకన్న, శాస్త్రజ్ఞులకన్న రెట్టింపుమంది రష్యాలో తయారవుతున్నారు. రష్యాకు అణ్వస్త్రబలం, సాంప్రదాయికమైన సైనికబలగం అపారంగా వున్నాయి.

ఇటీవల సోవియట్ నాయకులు వెనుకబడివున్న దేశాల ప్రాముఖ్యాన్ని సరికొత్తగా అర్థంచేసుకుంటున్నారు. వాటితో వ్యవహరించే విషయంలో కొంత సడలింపుధోరణిని, కొంత కొత్త చాకచక్యాన్ని, ఆర్థికరాజకీయప్రావీణ్యాన్ని కనపరుస్తున్నారు.

ఇటువంటి మార్పులన్నీ ఇదివర కెన్నడూలేని సవాలును అమెరికన్లముందుంచుతున్నాయి. అమెరికన్లు పెట్టుకొన్న సూత్రాలను పరీక్షిస్తున్నాయి. అమెరికన్ల

గుండెదిటవును, అమెరికన్ల తెలివితేటలను అగ్నిపరీక్షకు లోనుగావిస్తున్నాయి. ఇతరులకు తోడ్పడగల అమెరికన్ల సత్తాను, స్వేచ్ఛాసమాజంగా వర్ధిల్లగల అమెరికన్ల సామర్థ్యాన్ని తేల్చుకొనజూచే ఈపరీక్షను అమెరికన్లు ఎలా తట్టుకొని నిలుస్తారు? అసలు ఈవిషయమై అమెరికన్ జాతి అభిప్రాయమేమిటి?

అమెరికన్ల కర్తవ్యమేమిటో పరిశీలిద్దాము.

మొదట అమెరికన్లు పాతవ్యవస్థను తారుమారుచేసి, పాతసమాజాలను ఛిన్నాభిన్నంచేసి, ప్రగాఢమైన కొత్త ఆశలను కలుగజేస్తూ, తరచు శాంతికి ముప్పు తెస్తూ కోట్లకొలది ప్రజలకు ఉత్తమ భవిష్యత్తు కలదని ఆశచూపే నూత్నశక్తుల స్వభావాన్ని అర్థంచేసుకోవాలి.

అసలు ఈవిప్లవానికి పునాదులు మానవప్రతిపత్తి, ప్రతివ్యక్తికీ సదవకాశాలు, ఇతోధికన్యాయం అని అమెరికన్లు తెలుసుకోవాలి. దీని పద్ధతులు తరచు హింసాత్మకమైనవిగా, హేతుబద్ధంకానివిగా, విధ్వంసకరమైనవిగా వున్నప్పటికీ, దీని ఆశయాలు మానవవిలువలపై ఆధారపడివున్నవి. ఆవిలువలు ఈప్రపంచంలో ప్రతి ప్రాంతంలో ప్రజలు ఆకాంక్షించేవే.

ఈవిప్లవం అలలను సోవియట్ యూనియన్ సృష్టించకపోయినప్పటికీ వాటిని తన ప్రయోజనాలకు అనుకూలంగా మళ్ళింపజూస్తున్నది. ఈప్రయత్నంలో సోవియట్ యూనియన్‌కు కొన్ని మంచి వెసులుబాట్లే వున్నాయి.

ఈవిప్లవాత్మకశక్తులను రష్యాపాలకులు అర్థంచేసుకున్నారు. వర్ణవిచక్షణ, నల్లజాతులవారికీ తెల్లజాతివారికీ మధ్య చెలరేగే సంఘర్షణలు సోవియట్ దృక్పథాన్ని గజిబిజి పరచలేకపోతున్నవి. రష్యాలో నియంతృత్వ పరిపాలనవుంది గనుక రష్యా తన విద్యా, పారిశ్రామిక, ఆర్థిక, రాజకీయసాధనసంపత్తిని ఇష్టమొచ్చినట్లు వినియోగించగలదు. ఆసంపత్తిని ఎక్కడ వినియోగిస్తే రష్యా పప్పులుడుకుతాయో దానికి తెలుసు. సాధారణంగా కొత్తగా స్వతంత్రమై బలహీనదశలో వున్న దేశాలలో సాధనసంపత్తి ఎరచూపితే పిట్టలు దగ్గరికి వస్తాయి.

అయితే ఈవిషయంలో రష్యా కృతకృత్యురాలు కావడానికి చాలాగొప్ప ఆటంకాలున్నాయి. సోవియట్ యూనియన్ ప్రకటించుకున్న జాతీయలక్ష్యాలు, సిద్ధాంతలక్ష్యాలూ జాగృతమవుతూవున్న ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల లక్ష్యాలకు భిన్నంగా వున్నాయి. ఈదేశాలు నవజాతీయవాదం లక్ష్యంగా

గలవి. మరి సోవియట్ యూనియన్‌కు జాతీయవాదమంటే సరిపడదు. సరిపడదు కాబట్టే రష్యాకు ఐక్యరాజ్యసమితి బలపడాలని లేదు. సమితి సమర్థవంతమైన సంస్థ కావాలని లేదు. ఎందుచేతనంటే-కొత్తగా స్వతంత్రమైన దేశాలకన్నిటికీ వాటి అభిప్రాయాలను వ్యక్తీకరించడానికి ఐక్యరాజ్యసమితి ప్రపంచ వేదికగా ఉపయోగపడుతుంది.

సోవియట్ యూనియన్‌కు మతమంటేకూడా ఇష్టంలేదు. మతమనేది ప్రజలకు నల్లమందువంటిదని దాని అభిప్రాయం. సర్వప్రపంచమూ అభిలషించే విస్తృతవిశాల వ్యక్తిస్వాతంత్ర్యం రష్యాకుగిట్టదు. సాధ్యమైనంతమేరకు వ్యక్తి స్వాతంత్ర్యాన్ని కుంచించివేసి వ్యక్తిని ప్రభుత్వసేవకు వినియోగించుకొనడం రష్యా విధానమై వున్నది.

ఇక అమెరికా శక్తిసామర్థ్యాలు, బలహీనతలు ఏమిటో సమీక్షిద్దాము.

1960 నుంచి ఆరంభమైన దశాబ్దంలో అమెరికన్లు ఎదుర్కొంటున్న ప్రతికూలతలు పెద్దవే. అన్నిటికన్న గొప్ప ప్రతికూలత అమెరికా ప్రజలు,అమెరికన్ కాంగ్రెసు తమకర్తవ్యాన్ని గుర్తించలేకపోవడం. ఇది పెద్ద అనర్థం. అసలు సమస్య స్వభావమెటువంటిదో వారికి బాగా తెలియదు. దీనివల్ల వారి భవిష్యత్తుకు కలిగేముప్పేమిటో వారెరుగరు.

దీనికితోడు అమెరికన్లకు జాతివివక్షణ చరిత్ర ఒకటివుంది. ఇది అమెరికన్ల కొక పెద్దపీడ. పెద్దకాలంగా వున్న మచ్చ.

ఇక అమెరికన్ల ఆర్థికవ్యవస్థ వెనుకటి స్తబ్ధతనుంచి బైటపడుతున్నప్పటికీ అమెరికన్ల కెంత ఉత్పత్తి సామర్థ్యం గలదో దాన్ని పూర్తిగా అమలులో పెట్టలేకపోతున్నారు.

ఇట్టి ప్రతికూలత యున్నప్పటికీ అమెరికన్ల బలాన్ని తక్కువ అంచనా కట్టడం ఘోరతప్పిదమే అవుతుంది. అమెరికన్లు విప్లవనేతృత్వంక్రింద విప్లవాత్మక జాతిగా ఆవిర్భవించారు. ఇది అమెరికన్ల కొక పెద్దబలం. పైగా అమెరికావిప్లవం ఒకచోటితో ఆగిపోలేదు. అది ధారావాహికంగా అమెరికన్లను నడిపించుకు వస్తూవుంది.

అన్నిటికన్న గొప్పబలం అమెరికన్లకొకటి వుంది. అది వారికున్నట్లు వారికే సరిగా తెలియదు. కొత్తగా ఆవిర్భవిస్తూవున్న దేశాల ప్రజలకు ఏమి

కావాలని అమెరికన్లు అభిలషిస్తున్నారో సరిగ్గా అదే ఆ దేశాలవారు కూడా కోరుతున్నారు.

అమెరికన్లకు ఉపగ్రహరాజ్యాలు కావాలన్న వాంఛలేదు. అమెరికా ఇష్టాయిష్టాలకు అనుగుణంగా మెసులుకొనే దేశాలు కావలెనన్న కోర్కె అమెరికన్లకు లేదు. టాంగనీకా, బొలీవియా, బర్మా, కొరియా తదితరదేశాలకు - అవి కొత్త రాజ్యాలైనా సరే, పాతరాజ్యాలైనాసరే, అన్నిటికీ-విస్తృత ఆర్థికావకాశాలు, హెచ్చుగౌరవం, హెచ్చుగా న్యాయం, రోగులకు చికిత్సచేసే డాక్టర్లు, ఆకలిగొన్న ప్రజలకు ఆహారం, అవిద్యను రూపుమాపేందుకు మంచిపాఠశాలలు, ఒకరికొకరు బాగా పరిచయం కావడానికి రాకపోకలు, వార్తాసౌకర్యాలు, ఇతరప్రాంతాలకు ప్రయాణంచేసే హక్కు, ఇతరదేశాలతో వ్యాపారంచేసే హక్కు, స్వేచ్ఛగా తిరిగే హక్కు, స్వేచ్ఛగా ఆలోచించి మాట్లాడేహక్కు, ఇష్టమైనమతాన్ని అవలంబించే హక్కు ఆరాధనా స్వాతంత్ర్యం వుండవలెనని అమెరికన్లు కోరుతున్నారు.

కనుక కొత్తగా ఆవిర్భవించేస్వతంత్రరాజ్యాలకూ అమెరికన్లకూ లక్ష్యాలలో, ఆశయాలలో గల ఈ సామ్యం అమెరికాకుగల గొప్ప వెసులుబాట్లలో ఒకటి. శాంతియుతమైన, సుసంపన్నమైన కమ్యూనిస్టేతరప్రపంచ భాగస్వామ్యవ్యవస్థను నిర్మించడానికై అమెరికన్లు చేసే ప్రయత్నానికి ఈ వెసులుబాటు ఎంతగానో ఉపకరిస్తుంది. నవరాజ్యాల ప్రజలకు సోవియట్ యూనియన్ వాంఛించేలక్ష్యాలు వారి స్వంతలక్ష్యాలకు వ్యతిరేకమైనవి కావడమే రష్యా బలహీనతల్లో అతి ముఖ్యమైంది.

అయినా ముఖ్యప్రశ్న ఇది. అమెరికన్లు సంగతి సందర్భాలను గ్రహించి, సవాలు నెదుర్కోవడానికై వారి శక్తియుక్తులనన్నిటినీ కూడగట్టగలరా?

అమెరికన్లు వారి గొప్పజాతికి వారసులే అయితే, తమ సంప్రదాయాన్ని అర్థంచేసుకొన్నవారైతే ఇందుకొక్కటే సమాధానం రావాలి.

ఈ శతాబ్దపు అయిదు గొప్ప నిర్ణయాలలో ఐదవదీ, గొప్పదీ అయిన నిర్ణయం విషయంలో అమెరికా వైఖరి ఆత్మవిశ్వాసంతో కూడుకున్నదనీ, సాహసోపేతమైనదనీ, కనికరంగలదనీ, శాశ్వతంగా సరియైనదీ సక్రమమైనదీ అనీ 2000-వ సంవత్సరంలో చరిత్రకారులువ్రాయగల విధంగా అమెరికన్లు ప్రవర్తించాలి.

# 11

# ఐక్యరాజ్యసమితి ఎక్కడ కృతకృత్యురాలైంది?

వాషింగ్టన్‌లో 1961 అక్టోబర్ 24 తేదీన ఐక్యరాజ్యసమితి వార్షికోత్సవం సందర్భంగా జరిగిన విందు సమావేశసందర్భంలో ప్రసంగిస్తూ శ్రీ బౌల్స్ అంతర్జాతీయ సహకారానికై ప్రపంచం చేసిన గొప్ప ప్రయోగాన్ని సమీక్షచేశారు.

అమెరికన్లు రెండు గొప్ప ప్రవాహాలకు ఎదురీదుతున్నారు. ఇవి రెండూ ఒకదానికొకటి పోటీపడుతున్నట్టివి. ఒక్కొక్కప్పుడివి రెండూ ఎంత పరస్పర వ్యతిరేకంగా వుంటాయంటే వారు వీటిలో ఒకటి నిజమైందని, రెండవది మిథ్య అని అనుకొంటూ వుంటారు.

ఒకపంక ప్రచ్ఛన్నయుద్ధ సంఘర్షణ అనే ప్రవాహం వుంది. ఇది ముండ్ల తీగెతో, రాతిగోడలతో, ఆటవికమైన దాడులతో, అణ్వాస్త్రాలవిధ్వంసపు బెదిరింపులతో, హింసతో, అపనమ్మకంతో, భయంతో కూడుకున్నది. స్టాలిన్ 1946 లో గ్రీసు, టర్కీలను బెదిరించినప్పటినుంచి ఈ ప్రచ్ఛన్నయుద్ధం వ్యాప్తిలోకి వచ్చింది.

ఆయుధాలపోటీ, ఉద్రిక్తస్థితిలోనే సహజీవనం, ఎవరికీ అర్థంకాని ముసుగులో గుద్దులాట ఒకవైపువుండగా మరొక ప్రవాహం స్వాతంత్ర్యంవైపు, ఆశలవైపు, అవగాహనవైపు, న్యాయంవైపు పోతున్నది. ఈ రెండు ప్రవాహాలూ సమాంతరమైనవి. రెండవ ప్రవాహం సడీ చప్పుడూ లేనిది. కాని అదే మానవ కృషిభవితవ్యాన్ని నిర్ణయించగలది.

మొదటిది జాతీయ స్వాతంత్ర్యోద్యమం. వ్యాపారులుగా వచ్చి తమ దేశాల నాక్రమించుకొని పరిపాలింప మొదలిడిన యూరపు వలసపాలకుల ఆధిపత్యాన్ని త్రోసిపుచ్చి 90 కోట్ల ఆసియా ఆఫ్రికా ప్రజలు పదిహేనేండ్లలో 40 స్వతంత్ర రాజ్యాలను సృష్టించుకున్నారు. అమెరికన్ల సమకాలీనచరిత్రలో ప్రచ్ఛన్నయుద్ధాని కంటె ఈ స్వాతంత్ర్యోద్యమమే ఎక్కువపుటలు ఆక్రమించుకొంటుంది.

ఆశాజనకమైన ఈప్రవాహం రెండవ అధ్యాయమే వెనుకబడివున్న దేశాల ప్రజలను శతాబ్దాలుగా వేధిస్తూవున్న ఆకలి, రోగాలు, నిరాశనిస్పృహలను నిర్మూలించడానికై యావత్ప్రపంచమూ కృతనిశ్చయం కావడం.

ఈసమస్యల విషయంలో కొత్త జాతులకృషి సత్ప్రారంభమేనని చెప్పాలి. కొన్నిచోట్ల అభివృద్ధి తాబేటినడకవలె వున్నప్పటికీ, ఇతరచోట్ల ప్రణాళికలు వేయడంలోనైతేనేమి, సంస్కరణలు అమలుజరపడంలోనైతేనేమి, దేశసాధనసంపత్తిని సమీకరించడంలోనైతేనేమి అసాధారణ సామర్థ్యం వ్యక్తమపడం అమెరికన్లు చూస్తున్నారు.

ఇటీవలివరకూ అమెరికా వలసలులేని కొద్దిరాజ్యాలలో ఒకటిగా వుండి కావలసినదేశాలకు పెట్టుబడిద్రవ్యం, సాంకేతికసహాయం అందజేసేదిగా వుంటూ వచ్చింది. ఇప్పుడు పారిశ్రామికంగా అభివృద్ధిజెందిన 15 దేశాలు వెనుకబడ్డ దేశాలలో త్వరితగతిని ఆర్థిక, సాంఘికాభివృద్ధిని సాధించడానికై డబ్బుపెట్టుబడిపెడుతూ వున్నవి. సాంకేతిక సహాయంచేస్తున్నవి. ఈసహాయం ఇప్పుడు ప్రాంతీయ, అంతర్జాతీయవ్యవస్థలద్వారా సమన్వయింపబడుతున్నది.

కనుక ఆశ అనే ఎదురుప్రవాహం ప్రపంచవ్యవహారాలలో బలీయంగా వుందని చెప్పడానికి గట్టిసాక్ష్యంవుంది.

ఇది ఇట్లావుండగా మూడవ విశేషం ఒకటి ఆశాజనకంగా అమెరికన్లకు తటస్థపడింది. సర్వస్వతంత్ర ప్రతిపత్తిగల రాజ్యాలతో కూడిన అంతర్జాతీయ వ్యవస్థలు ఆవిర్భవించి ఇతరులతో స్వేచ్ఛగా చేతులుకలిపి ప్రపంచభద్రతకూ, అభివృద్ధికీ కృషిచేస్తున్నాయి. రెండవప్రపంచయుద్ధం ముగిసినప్పటినుంచీ దేశ సరిహద్దులనుదాటి దూరానవున్న విదేశాలకుపోవడం, క్రొత్తరకాల అంతర్జాతీయ సహకారానికి పాటుపడడం, పథకాలూ ప్రణాళికలూ లేకుండా ఇంకా గర్భమందలి పిండరూపంలోనే వున్న ప్రపంచసమాజంలో క్రొత్తవ్యవస్థలు ఆకస్మికంగా ప్రత్యక్షంకావడం జరుగుతూవుంది.

ఈ మూడు అంశాలూ కలిపి ఆశాజ్యోతిగా వెలుగొందుతున్నాయి.

కొత్తగా వచ్చే ఈమార్పులతో ఐక్యరాజ్యసమితికిగల సంబంధమేమిటి? సమితికి వీటితో ఎట్లా సంబంధం కనపరుస్తారు?

అమెరికన్లచుట్టూ వున్న ప్రపంచం వారికి బాగాపరిచితమైందికాదు. పైగా ఎన్నో చిక్కులూ, చీకాకులూ కనిపిస్తున్నాయి. ఇవన్నీ చూచి నిరాశచెంది దేనినైనా నల్ల, తెల్ల జాతుల దృష్టితో మాత్రమే చూస్తూవుంటారు. ఈరెండూగాక బూడిద వర్ణంలోనే పలుచాయలున్నాయే, వాటిసంగతేమిటి అన్న పరిశీలనచేయడం అమెరికనులకు తెలియనిసంగతి. తెలిసినా అసౌఖ్యకరమైన విషయం!

అమెరికన్ల ఈ మహా జాతినిర్మాణంలో అమెరికన్లకు కలిగిన అనుభవాలు ఏసమస్యకైనా రెండుపైపులు మాత్రమే వుంటాయన్న అభిప్రాయానికి తీసుకొచ్చాయి. ఒకటి ఒప్పు, ఇంకొకటి తప్పు అనే అమెరికన్లు అనుకుంటారు. సమస్యలుంటే వాటికి పరిష్కారమార్గాలుకూడా వుంటాయని భావిస్తారు. బహిరంగంగా సంఘర్షణ సంభవిస్తే ఒక పక్షంవారికి సంపూర్ణ విజయం, రెండవపక్షం వారికి సంపూర్ణపరాజయం లభిస్తాయని అనుకుంటారు. అమెరికన్ల భావాలు ఈగాడిలో పడివున్నాయి.

కాని వారెదుర్కొనే ఈ నూత్న ప్రపంచంలో చిక్కులూ చీకాకులూ అనంతంగా వుంటాయి. వీటికి గోసాయిచిట్కాలవంటి మామూలుపరిష్కారాలు వుండవు. మానవాళిలో అమెరికాజనాభా ఎంత? నూటికి 6 పవంతుమాత్రమే. అమెరికన్లకు గొప్ప పరిశ్రమపలనేరం వున్నప్పటికీ, పెద్దసైనికశక్తి వున్నప్పటికీ వారు చేయగల దానికికూడా కొన్ని నిచ్చితమైన పరిమితులున్నాయి.

ఐక్యరాజ్యసమితి ఎన్నిచిక్కుల నెదుర్కొవలసివుందో తెలుసుకోలేని అమెరికనులు ఏపనులకోసం ఈ ప్రపంచ మహావ్యవస్థ నిర్మింపబడిందో వాటిని చేయలేకపోయిందని ఆరోపించడం సహజం.

సమితి సభ్యులలో బలీయమైన రాజ్యాలలో ఒకటి ఉద్దేశపూర్వకంగా ఎంతగా ప్రతికూలవైఖరి అవలంబించినప్పటికీ, ఐక్యరాజ్యసమితి, ప్రత్యేక వ్యవస్థలుగల దాని కుటుంబం ఎన్నోరంగాలలో జవసత్వాలతో మంచిచెడ్డల గ్రహింపుతో కృషిచేశాయి.

ఉదాహరణకు ప్రపంచ ఆరోగ్యసంస్థ ఇప్పుడు మలేరియా వ్యాధినిర్మూలనకై

ప్రపంచవ్యాప్త ఉద్యమం నడుపుతూ వుంది. ప్రపంచచరిత్రలో మలేరియావల్ల కలిగిన మరణాలు, పనినష్టం మరి యేవ్యాధివల్లా కలుగలేదు. ప్రపంచంలో ప్రతి గ్రామానికీ పరిశుభ్రమైన నీటిసౌకర్యం కలిగించడానికి కూడా ఈసంస్థ కృషి చేస్తోంది.

ఐక్యరాజ్యసమితి బాలలనిధిలో 98 ప్రభుత్వాలు సభ్యత్వం కలిగివున్నాయి. ఈనిధి 5 కోట్లా 50 లక్షల స్త్రీలకు (వీరిలో గర్భిణీస్త్రీలు, కనిపెంచే స్త్రీలుకూడా వున్నారు.) సేవచేయగలిగింది. ఈనిధి తలకు సగటున 15 సెంట్లు వెచ్చించి 7 కోట్లా 50 లక్షల పిల్లలను యాస్‌వ్యాధి (ఒకరకం ఉష్ణమండలవ్యాధి. చర్మంపై ఎర్రనికురుపులులేచి వ్యాధిగా పరిణమిస్తుంది) నుండి కాపాడడానికి కృషిచేసింది.

ప్రపంచవాతావరణసంస్థ ప్రపంచవ్యాప్తంగా కాలమానపరిస్థితిని తెలియ పరచప్రయత్నిస్తూవుంది; అంతర్జాతీయ టెలీకమ్యూనికేషన్ యూనియన్ ప్రపంచం మొత్తానికీ రేడియో ఫ్రీక్వెన్సీలను కేటాయిస్తోంది.

ప్రతిరంగంలో నే నింతకుమునుపు చెప్పిన ప్రాంతీయ ఆర్థికసాంఘిక సహ కారం నిమిత్తమై రెండు దేశాలమధ్యనో, లేక కొన్ని దేశాలమధ్యనో ఒడంబడికలు జరుగుతున్నాయి. ఆసియా, దూరప్రాచ్యదేశాల 'ఇకేఫే' (ECAFE), లాటిన్ అమెరికా ఆర్థికాభివృద్ధికి 'ఎక్లా' (ECLA) వంటి ప్రాంతీయవ్యవస్థలు అవిరళ కృషి చేస్తూ వున్నవి.

రాజకీయ ఆర్థికచర్యలను గైకొనే విషయంలో సమితి సర్వసభ్య సమా వేశాని కెటువంటి సామర్థ్యం గలదో గత సంవత్సరం కాంగోలో రుజువైంది.

శాంతికీ, భద్రతకూ సమితి దృఢమైనపునాదులు వేయగలదని కాంగో సమస్య రుజువుచేసింది. అత్యంత క్లిష్టపరిస్థితిలో అత్యవసరంగా 28 దేశాలనుంచి 20 వేల ఆత్యయిక సేనను ప్రోగుచేసి కాంగోలో శాంతి భద్రతల స్థాపనకు పంపడం సమితి ఇటీవలచేసిన ఘనకార్యాలలో ఒకటి. కొద్ది వ్యవధితో ఇంత పెద్ద సేనను ప్రోగుచేసి,కాంగోకు చేరవేసి, ఆసేనలకు రవాణాసదుపాయాలూ,సరఫరాలూ ఏర్పాటుచేయడం అందరికీ ఆశ్చర్యం కలిగించింది. సమితికి ఇంతటి సామర్థ్యం వుందని ఎవరూ అనుకోలేదు. ఇరాన్, గ్రీసు, పాలస్తీనా, సూయజ్, కొరియా ప్రాంతాలలో శాంతిని కాపాడటానికై సమితిచేసి వున్న కృషిని అమెరికన్లు విస్మ రించరాదు.

ఐక్యరాజ్యసమితి ఆర్థిక సాంఘికాభివృద్ధికి పాటుపడడమేగాక, శాంతిని పరిరక్షించ కృషిచేయడమేగాక, వివిధ దేశాలు తమకు ఇతరదేశాలతో గల వివాదాలను, తగాదాలను చెప్పుకొనేందుకు మిక్కిలి ఉపయుక్తమైన అంతర్జాతీయ వేదికగా కూడా అక్కరకొచ్చింది. సమితిని విమర్శించేవారు అది కేవలం వక్తృత్వ సంఘంగా వుందనీ, ఉపన్యాసాలు తప్ప అక్కడ జరిగే పనేమీ లేదనీ విమర్శించడం పరిపాటి అయినప్పటికీ, అక్కడ జరిగే చర్చలలో, వాగ్వాదాలలో అక్కసు, ద్వేషం వ్యక్తమైనప్పటికీ, ఆచర్చలే చాలా ముఖ్యమైనవి.

సమితిముందుకు వచ్చే సమస్యలు చాలాపాతవి. చరిత్రద్వారా సంక్రమించినవి. ఒకపట్టాన దారికిరానివి. అయితే వాటిని చెప్పుకొనేందుకు, గొడవలను వెళ్ళబోసుకునేందుకూ మరొకవేదిక ఏదీ? వున్నా అంతబాగా ప్రయోజనకరంగా చెప్పుకోదగ్గ చోటు వుందా?

కాబట్టి 1961 సంవత్సరపు వాస్తవప్రపంచంలో ఐక్యరాజ్యసమితి కృషిని ఎలా అంచనా కట్టడం?

ఐక్యరాజ్యసమితి యుద్ధభీతిని తొలగించిందనిగాని, ప్రపంచంలో గొప్ప రాజ్యాల సేనలు ఒండొరులతో పోరుకు తలపడే అవకాశాలను తగ్గించిందనిగాని చెప్పలేరు. అయినా సమితి చేసినకృషి అనల్పమైనది.

ప్రపంచంలో జరుగుతూవున్న సిద్ధాంతసంబంధమైన వాదోపవాదాలు స్వేచ్ఛా భావుకులను తికమకపెడుతూ వారి సమయాన్నీ శక్తినీ వెచ్చిస్తున్నప్పటికీ, ఇందువల్ల సమితికి కొంత ప్రతిబంధకంగా వున్నప్పటికీ సమితి ఆశాజ్యోతిని నిలబెడుతూ, దినదిన ప్రవర్ధమానమవుతూ వచ్చింది.

న్యాయానికి సంబంధించిన సమస్యలు ఉత్పన్నమైనప్పుడు సమితి సర్వమానవ అభిప్రాయవేదికగా ఉపకరించింది.

హింసచెలరేగే ప్రమాదం దాపురించినప్పుడు సమితి అన్నిరకాల వత్తిడులనూ నిలువరించి శాంతిని కాపాడింది.

పేదరికం, దారిద్ర్యాల పీడను నిర్మూలించడానికి ప్రజలు సతమతమవుతున్న చోట సమితి సహకారమార్గాలను వెదకి వినూత్నకృషికి నాందీప్రస్తావనచేసింది.

అమెరికన్లు ఆందోళనాపూరిత ప్రపంచంలో నివసిస్తున్నారు.ఈప్రపంచంలో ఒకవంక ఆశలు, ఆశయాలూ వుంటే, మరొకవంక భయం, ఆందోళన వుంది.

ఒకవైపు ప్రచ్ఛన్నయుద్ధం జరుగుతూవుండగా, వేరొకవైపు అమెరికామధ్య, ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికాప్రజల మధ్య భాగస్వామ్యం వృద్ధి అవుతూ వుంది. ఇట్లా పరిణామం చెందుతూవున్న ప్రపంచమే ఐక్యరాజ్యసమితికి రూపు రేఖలుదిద్ది, సమితివల్ల తానూ ప్రభావితమై నూతనాకారం దాలుస్తుంది.

ఈ సందర్భంలో అమెరికన్ల తరంవారిలో అందరికన్న అధికంగా ఐక్య రాజ్యసమితి వృద్ధికి తోడ్పడి తాను అనుకున్న విధంగా దానిని రూపొందించడానికి శ్రమించిన ఒక మహామహునికి జోహార్లు అర్పించకుండా వుండలేను.

ఆయన పేరు డాగ్‌హామర్స్‌జోల్డు. సమితికి వాణి, ఆత్మ, అంతరాత్మ ఆయనే. తన అంతిమ నివేదికలో ఆయన ప్రపంచానికి మెల్లగా ఈ హెచ్చరిక చేశాడు:

"ప్రపంచప్రజలు సమితి ధర్మసూత్ర ప్రణాళికకు లోబడి క్రమక్రమంగా సమితి కృషిద్వారా అంతర్జాతీయ సహకారానికి చేరుకొనే ప్రయత్నం అవిశ్రాం తంగా సాగాలి. లేదా నిలిచిపోవాలి. సమితికృషి పట్ల ఏవో అభిప్రాయాలు వెలి బుచ్చుతూ దాని పెరుగుదలనూ, దాని శక్తి సామర్థ్యాలనూ కుంటువడ జేసేవారు మొదటి ప్రపంచయుద్ధం తర్వాత ప్రపంచం ఎట్టి ప్రమాదకరస్థితిలో వుందని దేశ దేశాల ప్రభుత్వాలు గుర్తించాయో అట్టి ప్రమాదకరస్థితికి ప్రపంచాన్ని గురిచేసిన బాధ్యతవహించవలసి వుంటుంది."

డాగ్‌హామర్స్‌జోల్డు మహానుభావుడు. ఆయనలో ఒకవంక సమకాలీనులకు ఉత్తేజమిచ్చే ఆదర్శవాదము, మరొకవంక ఆచరణసాధ్యమైన రాజనీతి, పరిపక్వ మైన లోకజ్ఞానము వున్నాయి. 1961 సంవత్సరపు వాస్తవికప్రపంచం ఆయనకు సంబంధించిన ప్రపంచం. ఆయన ఆశించిన ప్రపంచం. ఆప్రపంచంలో ఆయన ఐక్యరాజ్యసమితి ఇతోధికసామర్థ్యంతో వ్యవహరించే విధంగా పాటుపడ్డాడు.

ఆయన కృషిని కొనసాగిస్తూ వున్న అమెరికన్లు ఆయనచూపిన మార్గాన్ని అనుసరించడం తప్ప వేరే ఏమీచేయనక్కరలేదు. సమితి ఎట్టి సదాశయంతో ముందంజవేసిందో ఆ ఆశయాన్ని అమెరికన్లు నిలబెట్టాలి. అలా చేస్తేనే సమితి స్థాపకులు ప్రపంచ ప్రజలకు ఆశాజ్యోతిగా సమితి నిలబడవలెనని చేసిన కృషి సార్థ కమై ఈ ప్రపంచవ్యవస్థ నిజంగా మానవాళికి ఆశాసౌధమై అలరారగలుగుతుంది.

# 12

## కొత్తరకం వేరుపాటువాదులు

వాషింగ్టన్‌లో 1961 నవంబరు 5 వ తేదీన జరిగిన జాతీయవయోజన విద్యామహాసభలో ప్రసంగిస్తూ శ్రీ బౌల్స్ విదేశవ్యవహారాల విషయంలో అధికప్రచారం పొందిన మితవాద అభిప్రాయాలనూ, వాటివల్ల జాతీయప్రయోజనాలకు వాటిల్లే ప్రమాదాన్నీ విశ్లేషించారు.

ఈనాడు ఆవిర్భవిస్తూవున్న నవప్రపంచం చిక్కులతో కూడుకొన్నది మాత్రమే కాక విశాలమైనది కూడా। మానవాళిమొత్తంలో అమెరికనులు అల్పసంఖ్యాక వర్గంవారుమాత్రమే. అమెరికన్లు వివేకవంతమైన, సాహసోపేతమైన విధానాలను అనుసరిస్తే ప్రపంచ వ్యవహారాలను ప్రభావితం చేయగలుగుతారు. కాని నేడు అమెరికన్లు అర్భకులుగా వున్నారు. ప్రపంచవ్యవహారాలను అదుపుచేయలేని స్థితిలో అమెరికన్లున్నారు. ఇదొక కొత్త అనుభవం వారికి।

ఇటువంటప్పుడు కొత్త సమస్యలను, కొత్తశక్తులను చూచి అమెరికన్లలో గౌరవనీయులైన పెద్దలు కొందరు నిరాశోపహతులై ఆగ్రహోదగ్రులై అడ్డదారులను అన్వేషిస్తున్నారంటే ఆశ్చర్యపడనక్కరలేదు.

అమెరికాలో ఈనాడు పైన చెప్పిననిరాశకు లోనైనవారు మూడు రకాలుగా వున్నారు. ఈ మూడు రకాలవారూ వేరుపాటుధోరణిలో ఆలోచించేవారే. నన్ను ముట్టబోకు నామాలకాకి అన్న తత్వంవీరిది. వీరి ఆలోచనాప్రపంచమే వేరు।

ఒకరకంవారు ఇప్పుడో, లేక ఇంకా కొన్నేండ్ల తర్వాతనో యుద్ధం తప్పనిసరిగా వచ్చేదే అనీ, దానిని ఆపడం ఎవరితరంకాదనీ విశ్వసిస్తారు. ఇది చాలా ప్రమాదకరమైన పరాజయవాదం.

యుద్ధాన్ని తలచుకొని బెదిరిపోయి పరుగెత్తితే శాంతిని సాధించగలరా? లేదు. నిరాయుధీకరణజరిగి, న్యాయసూత్రాల ప్రకారం అంతర్జాతీయ న్యాయం విషయంలో ఒప్పందం జరిగేవరకూ అమెరికన్ల సైనికశక్తి అమెరికన్ల జాతీయ భద్రతకేగాక కమ్యూనిస్టు ప్రపంచంలో నివసించే ఇచ్ఛలేని అధికసంఖ్యాక మానవుల శ్రేయస్సుకు అత్యవసరంగా కావలసిందే.

కనుక ప్రస్తుతం అమెరికన్లు అమెరికారక్షణ శక్తిని పెంపొందించుకుంటున్నారంటే దాని అర్థం యుద్ధం అనివార్యమైందని కాదు. అది అమెరికాకొక కవచంగా ఉపకరిస్తుంది. ఆ కవచం రక్షణతో హేతుబద్ధ ప్రపంచ సమాజస్థాపనకు సృజనాత్మకశక్తులు తగుపునాదివేయవచ్చు.

పోతే ఇక రెండవరకం వారు 'ఎక్కడో విదేశాలలోని కమ్యూనిస్టు బెడద మనకెందుకు? మన అమెరికాలో వున్న అల్పసంఖ్యాక కమ్యూనిస్టుల కార్యకలాపాలను కనిపెట్టివుండి వారిని అణచివేస్తే చాలు' అని వాదిస్తారు.

ప్రపంచవ్యాప్తంగా కమ్యూనిస్టులు కుట్రపన్ని వ్యవహరిస్తున్నారన్న సంగతి మతిమంతులైన వారికందరికీ తెలుసు. సోవియట్ సామ్రాజ్యపు ఏజెంట్లు అమెరికాతోసహా సర్వదేశాలలోనూ వున్న సంగతి అంతా ఎరిగిందే.

అయితే స్వదేశంలో కమ్యూనిస్టు విద్రోహంపట్ల మిక్కిలి ఆందోళనజెంది తమ దృష్టి అంతా దానిమీదనే నిల్పి అమెరికన్లు ఒకదానిని కొట్టబోయి గురి తప్పి మరొకదానిని కొట్టకూడదు. నిస్పృహజెందిన అమెరికన్లు కొందరు కమ్యూనిజమనేది సోషలిజంవల్ల పుట్టుకొస్తుందనీ, సోషలిజం పుట్టుకకు కారణం ఔదార్యవాద (liberalism)మనీ, ఆ ఔదార్యవాదం అమెరికన్ల స్వాతంత్ర్య ప్రకటనపత్రంలో థామస్ జెఫర్సన్ రచించిన ప్రజాస్వామ్య భావాలవల్ల ఉద్భవించిందనీ అంటారు. ఇది నిలబడే వాదం కాదు. వట్టి ఊహ.

కమ్యూనిస్టు సవాలుకు వాస్తవికదృష్టితో అమెరికన్లు చెప్పగల సమాధానమేమిటంటే—తక్కువగా కాక హెచ్చుగా ప్రజాస్వామ్యం కావాలి. హెచ్చుగా అభ్యుదయదృక్పథం కావాలి. ఇవి ఇక్కడ అమెరికాలోనేకాక ప్రపంచంలో ప్రతిచోటా కావాలి. ఇదే తగిన జవాబు.

ఇక మూడవరకంవారు మరీ ఉసురోమన్నట్లు వుంటారు. "ఈ ప్రపంచాన్ని ఆపండి, మేము వెళ్లిపోతాము" అని అంటున్నట్లు వుంటారు. అంతా

వారనుకున్న ప్రకారమే జరిగేట్టయితే అమెరికన్లు ప్రపంచ వ్యవహారాలనుంచి వైదొలగి, ఏదో ఒకవిధంగా అమెరికన్లు ప్రపంచ సంఘటనలకు దూరంగా వుండ గలరులే అన్న భావంతో భవిష్యత్తును ఇతరులకు వదలివేస్తారు.

ఇట్టి విధానంవల్ల తుదకెటువంటి ఫలితం కలుగుతుందో తెలుసా? మొదటి ప్రపంచయుద్ధానంతరం అమెరికన్లు ఇట్టి విధానాన్ని అనుసరించబట్టే కదా ఆపత్కరమైన ఫలితాల నెదుర్కొన్నది అమెరికన్లు? అన్నిటికన్న నన్ను కలచివేసేది "దీనివల్ల అమెరికన్లు గుణపాఠ మేమైనా నేర్చుకున్నారా?" అన్న ప్రశ్న.

వీరుగాక మరికొందరున్నారు. మనుషులు నిజాయతీపరులే. కాని పెడదారి పట్టింపబడ్డవారు. చరిత్రనేర్పిన పాఠాలను అమెరికన్లు సరకు గొననక్కరలేదనీ, ఐక్యరాజ్యసమితి ప్రాముఖ్యాన్ని త్రోసి రాజనవచ్చుననీ, ఇష్టమొచ్చినట్లు సుంకాలు పెంచి, విదేశీసహాయాన్ని తగ్గించి, మిత్రులను వదులుకొని అమెరికన్లకిష్టంగాని దేశంపై దాడిచేసి దాని పర్యవసానాలను ఏదో ఒకవిధంగా తప్పించుకుందామని అంటూ వుంటారు వీరు!

వీరి నిజాయతీని గౌరవిస్తాను. డొంకతిరుగుడులేని సమాధానాలు కావలె నన్న వీరి ఆరాటాన్ని నేను అర్థం చేసుకోగలను. కాని వీరి పిచ్చి సలహానే గనుక అమెరికన్లు పాటిస్తే కలిగే విపత్తును సందేహింపనక్కరలేని వీరిదేశభక్తి, వీరి సదుద్దేశాలూ అణుమాత్రమైనా తగ్గించగలవా?

మున్నెన్నడూలేని ఈ సవాలు విదేశీ సహాయంవల్లగాని, అంతర్జాతీయ వ్యాపారంవల్లగాని, సమితిచర్చల్లో కలిగే ఒడుదుడుకులవల్లగాని, అమెరికా ఇరుగు పొరుగుతో కొన్ని విషయాలలో అమెరికన్లు ఏకీభవించనంతమాత్రాన వారు ఏర్ప రచుకొనే అభిప్రాయాలవల్లగాని ఉద్భవించలేదు. నేటిప్రపంచంలో అపూర్వంగా తలయెత్తుతూ వున్న విప్లవాత్మక శక్తులవల్ల ఈ సవాలు పుట్టుకొచ్చింది.

బలీయమైన ఈశక్తులతో వ్యవహరించడానికి దార్ఢ్యత, ఓర్పు, వివేకం కావాలి. అమెరికన్ల అనేకస్వామ్యసమాజం అందివ్వగల బహువిధ పరికరాలన్నీ అవసరమవుతాయి. అంటే—రాజనీతి, ఒకవ్యక్తికీ మరొకవ్యక్తికీ మధ్యవుండే ఆప్యాయత, ఆర్థికసాంకేతిక సహాయం, సైనికశక్తి అనే రక్షాకవచం మొదలైన వన్నీ ఉపయోగింపబడాలి.

ఈ సవాలును అమెరికన్లు విజయవంతంగా ఎదుర్కోగలరనే నా విశ్వాసం.

అయితే ఒక్కమాట: ఈపోరాటం స్వభావాన్ని అమెరికన్లు సరిగా అర్థంచేసు కుంటున్నారా? చరిత్రలో అత్యంతక్లిష్టదశ అని చెప్పదగ్గ ఈ సమయంలో అమెరికన్లు కోరుతున్నదేమిటి?

అమెరికన్ల జాతీయోద్దేశం స్వయం విదితమని కొందరు సమాధానం చెబుతారు. అమెరికా జీవన విధానాన్ని పరిరక్షించడమే అమెరికన్ల ముఖ్యలక్ష్యమని అంటారు. కాని పరస్పర సన్నిహితమైన నేటి ప్రపంచంలో ఈ సమాధానం సరిపోతుందా?

మోహన్‌చౌధురీ అనే అతను భారతదేశంలో బ్రహ్మపుత్రా నదిప్రాంతంలో నివసిస్తాడు. అతను ఉపాధ్యాయుడు; యువకుడు. అతనితో మీరు మాట్లాడుతున్నారని ఊహించుకోండి. అతను మిమ్మల్ని "కమ్యూనిజానికి వ్యతిరేకంగా మీ అమెరికావారు సాగించే పోరాటంలో భారతీయులమైన మేమెందుకు మీతో కలవాలి?" అని ప్రశ్నిస్తాడనుకోండి.

మీరు "ఎందుకంటే, అమెరికా జీవనవిధానాన్ని పరిరక్షించడంలో మాకు మీ సహాయం అవసరం" అని సమాధానంచెబితే అతను ఆశ్చర్యార్థకంగా ముఖం పెడతాడే తప్ప మీరు చెప్పినదానికి సంతృప్తిపడి వూరుకుంటాడా?

మోహన్‌చౌధురీ మామూలు ఉపాధ్యాయుడు. పేదవాడు. ఎక్కడో పన్నెండువేల మైళ్ళదూరానవున్న ప్రపంచంలో అందరికంటే ధనికులైన అమెరికన్ల సుఖభోగాలను నిలబెట్టడానికి అతను తన ప్రాణాన్ని ఎందుకు తెగించాలి?

మరికొందరు అమెరికా జాతీయలక్ష్యాన్ని విశాలప్రాతిపదికపై వ్యక్తీకరించాలని అంటారు: "అమెరికన్లు ఇచ్చే ఆర్థికసహాయంతో, అమెరికన్ల రాజనీతి చతురతతో ఇతరదేశాల ప్రజలను అమెరికా నాయకత్వంక్రిందికి తీసుకురావద్దా?" అని వారడుగుతారు.

ఇది మరీ విపరీతం. అయితే ఆమెరికన్ ప్రభుత్వం డబ్బుతో పరదేశ ప్రజల విధేయతను కొనవలెనన్నమాట! అలా ఎవరైనా అమ్ముడుపోతారా?

ప్రపంచంలో ఎవరైనా ఈమాటవింటే అమెరికన్లను గూర్చి ఏమనుకుంటారు? ఇది అమెరికావంటి స్వేచ్ఛాకాముకదేశానికి తగునా అని అనుకోరా? మరి ఇక అమెరికాయథార్థఉద్దేశమేమిటి? దాన్ని ప్రపంచప్రజలు సరిగా అర్థంచేసుకొనే విధంగా చెప్పడమెట్లా?

అయితే ఒక్క మాట: ఈపోరాటం స్వభావాన్ని అమెరికన్లు సరిగా అర్థంచేసు కుంటున్నారా? చరిత్రలో అత్యంతక్లిష్టదశ అని చెప్పదగ్గ ఈ సమయంలో అమెరి కన్లు కోరుతున్నదేమిటి?

అమెరికన్ల జాతీయోద్దేశం స్వయం విదితమని కొందరు సమాధానం చెబు తారు. అమెరికా జీవన విధానాన్ని పరిరక్షించడమే అమెరికన్ల ముఖ్యలక్ష్యమని అంటారు. కాని పరస్పర సన్నిహితమైన నేటి ప్రపంచంలో ఈ సమాధానం సరిపోతుందా?

మోహన్‌చౌధురీ అనే అతను భారతదేశంలో బ్రహ్మపుత్రా నదిప్రాంతంలో నివసిస్తాడు. అతను ఉపాధ్యాయుడు; యువకుడు. అతనితో మీరు మాట్లాడుతున్నా రని ఊహించుకోండి. అతను మిమ్మల్ని "కమ్యూనిజానికి వ్యతిరేకంగా మీ అమెరికావారు సాగించే పోరాటంలో భారతీయులమైన మేమెందుకు మీతో కల వాలి?" అని ప్రశ్నిస్తాడనుకోండి.

మీరు "ఎందుకంటే, అమెరికా జీవనవిధానాన్ని పరిరక్షించడంలో మాకు మీ సహాయం అవసరం" అని సమాధానంచెబితే అతను ఆశ్చర్యార్థకంగా ముఖం పెడతాడే తప్ప మీరు చెప్పినదానికి సంతృప్తిపడి వూరుకుంటాడా?

మోహన్‌చౌధురీ మామూలు ఉపాధ్యాయుడు. పేదవాడు. ఎక్కడో పన్నెండువేల మైళ్ళదూరానవున్న ప్రపంచంలో అందరికంటే ధనికులైన అమెరి కన్ల సుఖభోగాలను నిలబెట్టడానికి అతను తన ప్రాణాన్ని ఎందుకు తెగించాలి?

మరికొందరు అమెరికా జాతీయలక్ష్యాన్ని విశాలప్రాతిపదికపై వ్యక్తీకరిం చాలని అంటారు: "అమెరికన్లు ఇచ్చే ఆర్థికసహాయంతో, అమెరికన్ల రాజనీతి చతురతతో ఇతరదేశాల ప్రజలను అమెరికా నాయకత్వంక్రిందికి తీసుకురావద్దా?" అని వారడుగుతారు.

ఇది మరీ విపరీతం. అయితే అమెరికన్ ప్రభుత్వం డబ్బుతో పరదేశ ప్రజల విధేయతను కొనవలెనన్నమాట! అలా ఎవరైనా అమ్ముడుపోతారా?

ప్రపంచంలో ఎవరైనా ఈమాటవింటే అమెరికన్లను గూర్చి ఏమనుకుంటారు? ఇది అమెరికావంటి స్వేచ్ఛాకాముకదేశానికి తగునా అని అనుకోరా? మరి ఇక అమెరికాయథార్థఉద్దేశమేమిటి? దాన్ని ప్రపంచప్రజలు సరిగా అర్థంచేసుకొనే విధంగా చెప్పడమెట్లా?

# 13

# సర్వమానవాళికీ ఒక విప్లవం

తిన తిండి, కట్ట బట్ట పుష్కలంగా వుండి సుసంపన్నమైన అమెరికావంటి దేశం ఇప్పుడే అభివృద్ధిజెందనారంభించిన దేశాలలో శాంతియుతమైన మార్పులతో ప్రపంచవ్యాప్త విప్లవం తేవడానికి నాయకత్వం వహించగలదా? తేగలదనే శ్రీ బౌల్స్ నమ్మకం. అయితే అమెరికా దాని విప్లవాత్మక సంప్రదాయాలకు కట్టుబడి వుండాలి.

1961 డిసెంబరు 10 నాటి 'న్యూయార్కు టైమ్సు' మేగజైన్ పత్రికలో వ్రాసిన వ్యాసంనుండి.

సుభిక్షము, సుసంపన్నము అయిన అమెరికా దేశంవంటి దేశం శాంతియుతంగా మార్పులను తెచ్చే ప్రపంచవ్యాప్త విప్లవానికి భాగస్వామి, నేత కాగలదా? లేకపోతే తనకున్న భయాలతో, విధి నిషేధాలతో ప్రతిష్టంభనకు అవకాశమిస్తుందా? లేదా ఒక ప్రక్కగా నిల్చొని అయ్యో అని వాపోతూ కళ్ళప్పగించి చూస్తుందా?

అమెరికా విదేశాంగ విధాన మెదుర్కొంటున్న సవాలుకు ఈప్రశ్నలు ముఖ్యాంశాలై వున్నవి. నేను ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాదేశాలలో ఎక్కడ పర్యటించినా ఒకటే చిక్కువున్నట్లు కన్పించింది. అవగాహనతో, పరిస్థితికి సరిపెట్టుకొని, సమర్థవంతమైన చర్యలు తీసుకోగలరా?

గడచిన నాలుగునెలల్లో విదేశాలలోని అమెరికన్ దౌత్యకార్యాలయాలను పునర్వ్యవస్థీకరించడం నిమిత్తం, మలయాలో జరిగిన కొలంబో ప్రణాళిక వార్షిక సమావేశంలో పాల్గొనే నిమిత్తం నేను యూరపుతప్ప తక్కిన ఖండాలన్నీ పర్య

టించాను. ప్రతిచోటా ఈప్రశ్నలే. కొత్త ఆఫ్రికాదేశాల విషయంలో అమెరికా రాయబారులు ప్రస్తావించిన సమస్యలలో, లాటిన్ అమెరికాలో అమెరికన్లు చేసే ఆర్థికసహాయాన్ని అమలుజరిపే అధికారులు ఎదుర్కొనే ప్రతిబంధకాలలో, అమెరికన్లను విమర్శించేవారు వెలిబుచ్చే సంశయాలలో, దక్షిణాసియాలో, ఆగ్నేయాసియాలో వున్న ప్రభుత్వాలలో అమెరికన్ శ్రేయోభిలాషులు వ్యక్తపరిచే ఆశలలో ఈప్రశ్నలే ఉదయించాయి.

అమెరికన్లు ప్రపంచవిప్లవం మధ్యలో వున్నారన్న సంగతి యథార్థం. దీన్ని ప్రశ్నించనక్కరలేదు. ఇట్టి విప్లవంలో సిరిసంపదలు, భోగభాగ్యాలు గల దేశం కోటువిడిచి చొక్కా చేతులు పైకి మడిచి ఒకభాగస్వామియై పాటుపడి పని చేయగలుగుతుందా? చరిత్రను నేనెరిగినంతవరకూ నాకిట్టి ఉదాహరణ కనిపించడంలేదు.

అటువంటప్పుడు అమెరికా చరిత్రకు అపవాదంకాగలదా? ఈ ప్రశ్నకు అమెరికన్లిచ్చే సమాధానం అమెరికన్ల భవిష్యత్తును మాత్రమేగాక కొన్ని తరాల వరకూ నాగరికపథాన్ని కూడా రూపొందజేస్తుంది.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాదేశాలలో ఓర్పు నశించిన కోట్లాది ప్రజలు పాతవ్యవస్థతో పోరాడుతున్నారు. భూస్వామి-కౌలుదారు వుండే పాతవ్యవస్థనూ, యజమాని-సేవకుడు వుండే పాతసాంఘిక వ్యవస్థనూ, పాలకులూ- పాలితులూ వుండే రాజకీయవ్యవస్థనూ వ్యతిరేకిస్తున్నారు.

అభివృద్ధిపథంలో పడుతూవున్న ఈఖండాలలో మరీ ధనవంతులైన వారికీ, మరీ పేదవారికీ మధ్యగల పెద్దవ్యత్యాసమే ప్రమాదకరమైన అఖాతంలా వుంది. ఈ రంగస్థలానికి వెనుకతట్టున అమెరికావుంది. ప్రపంచంలోనే అమెరికన్లది సంపన్నదేశం కదా! దానికితోడు మూడింట రెండువంతులమంది నల్లజాతుల వారున్న ఈప్రపంచంలో సంపన్నులైన అమెరికనులు తెల్లజాతివారు. ఒకవేళ అమెరికాదేశంలో నల్లవారున్నా వారు చాలా కొద్దిమంది. ఈస్థితిలో అమెరికన్ల బాధ్యత క్లిష్టతరంగా వుంది.

ఇట్టిదేశం ప్రపంచవిప్లవానికి మార్గదర్శకత్వం వహించేమాట అటుండనిచ్చి, ఇది ఆవిప్లవంలో తానూ ఒక భాగస్వామినే అని ఎలా భావించగలుగుతుంది? తన గ్యారేజీలో రెండు కార్లున్నమనిషి సైకిలు కొనుక్కోడానికి తాపత్రయ పడుతున్న మనిషితో మాట్లాడతాడా? ఆహారంలో కలోరీల సంగతి చర్చించే

ఇల్లాలు ఆకలిగొన్న తనపిల్లలకు తిండిపెట్టలేని స్థితిలో వున్న స్త్రీతో ఏమని మాట్లాడుతుంది?

అమెరికన్ల విజయానికి పెద్ద ప్రతిబంధకాలెన్నో వున్నప్పటికీ సవాలు నెదుర్కొనడానికి అమెరికన్లకు కొన్ని వెసులుబాట్లున్నాయి. మొదటిది అమెరికన్ విప్లవాత్మక సంప్రదాయం. మొదట దేశస్వాతంత్ర్యాన్ని సాధించే సంకల్పంతో, ఆపిమ్మట ప్రజలందరికీ ఇతోధికన్యాయం, సాంఘికఆర్థికావకాశాలూ చేకూర్చే ఉద్దేశంతో అమెరికన్లు ఒకజాతిగా ఆవిర్భవించారు.

అమెరికన్ల విప్లవాభినివేశం ఒక్క ఖండానికి మాత్రమే పరిమితమైంది కాదు. ఆదినుండీ అమెరికా నిర్మాతలు విశాలదృష్టితో వ్యవహరించారు. "అమెరికన్ విప్లవం సర్వమానవాళికీ ఉద్దేశింపబడింది" అని జెఫర్సన్ అన్నాడు. అంతే కాదు, "మానవాళిలో అధికసంఖ్యాకప్రజలు అల్పసంఖ్యాకులు బూట్లతో తమపై ఎక్కి స్వారీచేయడానికి అనువుగా వీపులపై జీనులతో పుట్టలేదు" అని కూడా ఆయన అన్నాడు.

జెఫర్సన్ ప్రజాస్వామిక విప్లవాన్ని అభిలషించాడు. ఆ విప్లవంవల్ల కలిగే సత్ఫలితాలను సకలమానవులూ పంచుకోవాలని కోరాడు. ఆయన ఆశయం అమెరికా చరిత్రమొత్తంలో అమెరికన్లవెంట వుంది. ఒక అధ్యక్షుడి తర్వాత మరొక అధ్యక్షుడు చెప్పిన మాటలలో, చేసిన పనులలో గొప్ప ఉద్బోధవుంది. అది మానవుల నెంతో ఉత్తేజపరిచింది.

"అన్నిటికన్న విప్లవంహక్కు పవిత్రమైనది. ప్రపంచాన్ని విముక్తం చేయడానికి అది తగినహక్కు అని అమెరికన్ల విశ్వాసం" అన్నాడు లింకన్.

1917 లో విల్సన్ ప్రతిపాదించిన పధ్నాలుగు సూత్రాలు ప్రపంచంలో పరాధీనప్రజలకు స్వయంనిర్ణయ హక్కును ఉద్ఘాటించాయి. ఆసూత్రాలు అమెరికన్ సంప్రదాయంలో బాగా వేళ్ళు తొక్కుకొన్నాయి.

అలాగే రూజ్వెల్టు ప్రబోధించిన నాలుగుస్వాతంత్ర్యాలు—వాక్స్వాతంత్ర్యం, ఆరాధనాస్వాతంత్ర్యం, లేమినుండి విమోచనం, భయంనుండి విముక్తి—ప్రపంచ ప్రజలందరికీ ఉద్దేశింపబడినట్టివి.

కాబట్టి అమెరికన్లకుగల నైతిక, సిద్ధాంతసంబంధ సంపత్తిలో అమెరికన్ల విప్లవాత్మక సంప్రదాయభావం మొట్టమొదటిది. రెండవది ఆ సంప్రదాయంలోగల

ఆర్థిక, రాజకీయ, సాంఘిక విషయం. అమెరికన్లు పై మాటలతో మాత్రమే విప్లవాన్ని సమర్థించలేదు. విప్లవాన్ని చట్టబద్ధం చేశారు. నేటిప్రపంచంలో అమెరికన్ల ఆర్థిక, సాంఘికశాసనాలు, అమెరికన్ల కార్యక్రమాలు భావనలో తీవ్రమైన మార్పులు పొంచించేవి. ఫలితాలనుబట్టి చూస్తే మిక్కిలి విప్లవాత్మకమైనవి.

అమెరికాలో క్రమానుగతమైన ఆదాయపు పన్నును 50 ఏళ్ళ క్రితం ఆమోదించారు. కాని దానినే ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికన్ దేశాల నాయకులు ఇప్పటికీ తీవ్రమైనదాన్నిగా భావిస్తారు. అమెరికాలో అన్నిపక్షాల నాయకులూ ఇది ప్రభుత్వ ఆదాయాన్ని పెంచడమేగాక సంపదను తిరిగి పంపిణీచేసి ధనికులకూ పేదలకూ మధ్యగల వ్యత్యాసాన్ని తగ్గిస్తుందని అభిప్రాయపడతారు.

అల్లే సాంఘికభద్రత, ప్రజలకు గృహవసతి, రవాణా, కార్మికులకూ యజమానులకూ మధ్య చర్చలు-ఒప్పందాలు, కార్పొరేషన్ పన్నులూ అమెరికా ఆర్థికవ్యవస్థలో ముఖ్యాంశాలుగా వున్నాయి. కాని ఇతరచోట్ల వీటిని తీవ్రమైన మార్పులుగా ఇంకా పరిగణిస్తున్నారు.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో ఇప్పటి విప్లవాలు ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచడానికీ, జాతీయసంపదను పంపిణీచేయడానికీ, స్త్రీ పురుషులకు పిల్లలకు కనీసభద్రతను చేకూర్చడానికీ ప్రయత్నిస్తున్నాయి. ఇవి అమెరికన్ల లక్ష్యాలుకూడా.

గ్రామంలో ప్రతికుటుంబానికీ సొంతభూమి వుండవలెనని అమెరికన్లు కోరుతున్నారు. పై మూడు ఖండాలలో భూమిలేనివారూ, కౌలుదార్లూ కూడా ఇలాగే సొంతభూమి కావాలంటున్నారు. విప్లవం గమనం ఇలా వుంది. ఇది సామ్యం కాదా?

అమెరికన్ల వలసదశలో అమెరికన్ యువకులు రైతులుగా, సైనికులుగా వున్నప్పటినుంచి పల్లెలలో జమీందారీ వ్యవస్థను వ్యతిరేకించి గొప్పమార్పులు తేగల శాసనాలను చేసుకున్నారు. నూరేండ్లక్రితం అమెరికన్ల అభిమతాన్ని హోమ్ స్టీడ్ చట్టంలో పొందుపరచుకొని దాన్ని అమలుజరుపుతున్నారు. ఆచట్టం సేద్యం చేసుకోవలెనని అభిలషించే, సేద్యం చేసుకోగలిగే ప్రతి కుటుంబానికీ 160 ఎకరాల భూమి ఇచ్చింది. ఆతర్వాత పరపతి, సహకారం, వ్యవసాయాభివృద్ధి సంస్థల నేర్పాటుచేసి స్వతంత్ర భూయాజమాన్య విధానాన్ని సుస్థిరంచేశారు.

వలసవాదానికి వ్యతిరేకంగా అమెరికన్ల విప్లవసంప్రదాయం, ఆర్థికసాంఘిక సంస్కరణలకు అమెరికన్లు ఒడబడటం, భూమిపై ప్రైవేటు యాజమాన్యానికి అమెరికన్లు బద్ధులుకావడం-ఇవి మూడూ అమెరికాకు గొప్ప సాధనములని చెప్పాలి. నేటి విప్లవప్రపంచం అమెరికన్లకు పెట్టే పరీక్షలో అమెరికన్లు కృతార్థులు కావాలంటే పై మూడు సాధనాలూ అమెరికన్లకెంతో ఉపకరిస్తాయి.

అయితే అమెరికన్ సంప్రదాయాలతో అమెరికన్లకే సంబంధం లేకుండా పోయిందని చాలామంది ఆసియావాసులు, ఆఫ్రికనులు, లాటిన్ అమెరికనులు భావిస్తున్నారు. కనుక నేటివిప్లవాత్మక ప్రపంచాన్ని దృష్టిలో పెట్టుకొని అమెరికన్ల జాతీయోద్దేశాలను, ప్రయోజనాలను శ్రద్ధగా నిర్వచించడం చాలా అవసరం. ప్రపంచంతో అమెరికన్లకుండవలసిన సంబంధాలలో అమెరికన్లు కోరేదేమిటి? అమెరికన్ల లక్ష్యాలు నెరవేరాలంటే ఏయేచర్యలు అవసరం? ఇతరప్రజలు అమెరికన్లను అవగాహనచేసుకొని అమెరికన్ల వైఖరిని సమర్థించాలని ఎందుకు ప్రయత్నిస్తున్నారు?

పౌరులుగా, ఓటర్లుగా ఈప్రశ్నలను తరచు అమెరికన్లు తమకు తామే వేసుకోవాలి. అమెరికన్ విధాననిర్ణేతలు, అమెరికన్ల రాయబారులు కూడా ఈ ప్రశ్నలనే పరిశీలిస్తున్నారు. విదేశాలలో అమెరికన్ల చర్యలకు ప్రాతిపదికలు ఇవే.

కమ్యూనిజంపై ఎదురుదెబ్బ తీయడమొక్కటేనా అమెరికన్ల జాతీయ లక్ష్యం? స్వేచ్ఛను వాంఛించే దేశాలకన్నిటికీ కమ్యూనిజం ఒక సవాలుగా వుంది. ప్రజాపీడన ఏరూపంలో వున్నాసరే దానిని తుదముట్టింపజేసే అమెరికన్ల పోరాటంలో ఒకభాగమే కమ్యూనిజంపట్ల అమెరికన్ల వ్యతిరేకత.

అయితే జెఫర్సన్, లింకన్‌వంటి మహానాయకులకు చెందిన అమెరికన్ జాతికి కమ్యూనిజంపై వ్యతిరేకభావమే ఏకైక జాతీయప్రయోజనం కావడం బాగుండదు. అలాంటి భావాన్నే అమెరికన్లు ఆమోదించకూడదు. ఒకదేశంలో కమ్యూనిజం బెడద వుందా లేదా అన్నదాన్నిబట్టి అమెరికన్లు తమ చర్యలను నిర్ణయించుకున్నారా ఆదేశంలోగల కమ్యూనిజాన్ని యురేనియం లేదా పెట్రోలియంవంటి ప్రకృతి సంపదగా జమకడుతున్నారన్నమాట. ఆరెండిటినీ అమెరికా ఖజానా కార్యాలయంలో డాలర్లుగా మార్చుకోవచ్చు కదా!

మరి ప్రజల మనస్సులను చూరగొనడం అమెరికన్ల లక్ష్యమా? పరిశీలిస్తే ఈలక్ష్యంలో కూడా కొంతలోపమే కన్పిస్తుంది. ఇందులో ఆచరణసాధ్యమైన

వాస్తవికత. అమెరికన్ల ప్రజాస్వామ్య విశ్వాసం లుప్తమైనట్లు తేలుతుంది. అమెరికన్ల కృషి అంతా ప్రజల మనస్సులను స్వేచ్ఛతో నింపడానికే అని కదా జెఫర్సన్ చెప్పింది. అంటే ప్రజల మనస్సులను, బుద్ధిని అమెరికన్లవశం చేసుకోక వారు స్వేచ్ఛతో ఆలోచించుకునేట్లు చేయాలి. అమెరికన్ల చరిత్రయావత్తూ ఈ లక్ష్యంతోనే నిండివుంది.

మరికొందరు ప్రభుత్వ యాజమాన్యంకంటె ప్రైవేటు యాజమాన్యంమేలని చూపడమే అమెరికన్ల లక్ష్యమని అంటారు. కాని బాగా ఆలోచిస్తే ఈలక్ష్యం కూడా సంకుచితమైనదే. పెట్టుబడిదారీ విధానం అమెరికాదేశంలో గొప్ప అద్భుత కార్యాలను సాధించింది. ఇతర ప్రాంతాలలోగూడ అది గొప్ప ఫలితాలను సాధించగలదు. అయితే ప్రపంచంలోని దేశాలన్నీ పెట్టుబడిదారీ విధానాన్ని ఆమోదించడమే అమెరికన్ల జాతీయలక్ష్యం కాదు. అమెరికన్ల లక్ష్యాన్ని సాధించడానికి పెట్టుబడిదారీ విధానం ఒక సాధనం మాత్రమే. కాని అదే లక్ష్యంకాదు.

అసలైన అమెరికన్ జాతీయలక్ష్యం నిరాడంబరమైనది, సార్వజనీనమైనది, సమ్మోహనాస్త్రంవంటిది. కమ్యూనిస్టేతర ప్రజలతో అమెరికన్లూ చేతులు కలిపి దేనినైనా ఎంపిక చేసుకునే స్వేచ్ఛ, ఆర్థికావకాశాలతో, సాంఘికన్యాయంతో, ప్రజలు ఎవరి జీవితాలను వారు స్వతంత్రంగా గడపుకునేవీలు, వివిధజాతులు ఎవరి సంస్కృతి సంప్రదాయాలకు వారు కట్టుబడివుంటూనే తమ అభీష్టంకొద్దీ నడచుకొనే అవకాశం లభించే ప్రపంచవ్యవస్థను నిర్మించడమే అమెరికన్ల ముఖ్యలక్ష్యం.

అమెరికన్ల పెన్నిధులను అవగాహనచేసుకొని అమెరికన్ల లక్ష్యాలను విశదీకరించడమొక ఎత్తు. అమెరికన్ల నవజాగృతిని నిర్దిష్ట కార్యక్రమాలకూ విధానాలకూ వర్తింపజేయడం మరొక ఎత్తు.

దురాక్రమించేసే ఉద్దేశం, తాహతు గల వారున్నంతవరకూ అమెరికన్లు ఏపని చేయడానికైనా మొదట అమెరికన్ల సైనికశక్తిని తగుదిట్టంగా వుంచుకోవాలి. దానితోపాటే అమెరికన్ సైనికశక్తి అమెరికన్లనీ, అవతలి వారినీ నిగ్రహింపజేసి అదుపులో వుంచేదిగా వుండవలె కాని రెచ్చగొట్టేదిగా వుండరాదు. ఇది ఒక అంశం.

రెండవ అంశమేమిటంటే—అణ్వస్త్రాల పోటీ నానాటికీ అధికం కావడం

వల్ల ప్రమాదం జాస్తి అన్న సంగతి అమెరికన్లు మరవకూడదు. తగు రక్షణలతో నిరాయుధీకరణను సాధించే కృషిలో అమెరికన్లకు తరగని ఓర్పు వుండాలి.

ఇక మూడవదేమిటంటే—అమెరికన్లు నిస్పృహను విడనాడాలి. పొగరు మోతుతనం వదులుకోవాలి. అమెరికన్లని పూర్తిగా బలపరచనట్టి వారు అమెరికన్లకు వ్యతిరేకులే అయివుంటారని అనుకోవడం మానాలి.

జార్జి వాషింగ్టన్ మొదలుకొని వుడ్రోవిల్సన్ హయాంవరకూ యూరపు నిరంతరకలహాలపట్ల తటస్థవిధానమే అమెరికా విదేశాంగవిధానానికి ముఖ్యప్రాతిపదికగా వుందన్నసంగతి అమెరికన్లు మరచిపోకూడదు. అంతేగాక ఇటీవల యూరపువలసరాజ్యాల ఆధిపత్యంనుండి విముక్తమైన కొత్తదేశాలు ఒకప్పుడు నేడంతగా అభివృద్ధి జెందకమునుపు అమెరికన్లు ఏస్థితిలో వున్నారో అదేస్థితిలో అవి వున్నాయనీ, అత్యవసర సమస్యలతో అవి సతమతమవుతున్నాయనీ, ఈనాడు అమెరికన్లకు కమ్యూనిజం పెద్దబెడదగా వుండగా కొత్తగా స్వతంత్రమైన దేశాలు కమ్యూనిజం బెడదను సరిగా గ్రహించక తక్కువ అంచనా కట్టుతున్నాయనీ కూడా అమెరికన్లు తెలుసుకోవాలి.

అమెరికన్ల జాతీయలక్ష్యాన్ని అన్వయింపజేయడంలో నాల్గవ ముఖ్యాంశం విదేశాలలో అమెరికన్ల ఆర్థికసాంకేతిక సహాయ కార్యక్రమమని అమెరికన్లు గ్రహించాలి.

విదేశాలలో అమెరికన్లు చేసే కృషిలో ఐదవ ముఖ్యాంశం అమెరికన్ల సమాచారకార్యక్రమం. ఈ కార్యక్రమాలన్నీ అమెరికన్ల వాస్తవస్థితిని అభివర్ణించి చెప్పాలి. అమెరికన్లు భాగ్యవంతులే. అదృష్టవంతులే. కాని ఆత్మసంతోషం, ఆత్మసంతృప్తిగలవారు కాదు. విద్య, గృహవసతి, నల్లతెల్ల జాతిభేదాలు మున్నగు సమస్యలు అమెరికన్లకింకా అపరిష్కృతంగానే వున్నాయి. వాటితో అమెరికన్లు సతమతమవుతున్నారు. ఇతోధికంగా న్యాయబద్ధమైన ప్రజాస్వామిక సమాజంవైపు ఇంకా పురోగమిస్తూనే ఉన్నారు. కనుక వారు వేటిని సాధించవలెనని ఇంకా పాటుపడుతున్నారో, విదేశాలలో అచటివారితో భాగస్వాములై ఏమి సాధింప సంకల్పించారో వాటిని గూర్చి అమెరికన్లు ప్రపంచప్రజలకు చెప్పాలి.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాదేశాలలో మానవస్వాతంత్ర్యం

కోసం ప్రస్తుతం సాగుతున్న ఉద్యమంలో కొంత అతి, కొంత అయోమయత్వం, తికమక వున్నప్పటికీ అది అమెరికన్ల పూర్వీకులు స్వాతంత్ర్య ప్రకటన పత్రంలో ప్రకటించినట్టి సార్వజనీనలక్ష్యాలకోసం జరిగే పోరాటమేననీ, ఆ పోరాటం కొత్తదికాదనీ, మొదట అమెరికన్లు జరిపిన పోరాటానికి తరువాయిగా జరుగుతూవున్న పోరాటమనీ అమెరికన్లు తెలుసుకోవాలి.

కనుక ఈ సవాలును అమెరికనులలో నేటితరంవారు సరిగా అర్థంచేసుకొని తగురీతిగా దీనిని ఎదుర్కొన్నట్లయితే కొత్తదేశాలు కమ్యూనిస్టుల ప్రతివిప్లవంలోగల కృత్రిమ విలువలనూ, వైషమ్యాన్నీ, ద్వేషాన్నీ, నిష్ఫలత్వాన్నీ గ్రహిస్తాయి. కొత్తగా స్వతంత్రమయ్యేదేశాలు కమ్యూనిస్టుల విద్రోహపువలలో పడిపోతాయని ఎవరూ భయపడనక్కరలేదు.

# 14

## నవ రాజనీతి

విదేశీసహాయం, శాంతిదళం, శాంతిని వర్ధిల్ల జేయడానికి ఆహార సరఫరా, తదితర విదేశ సహాయ కార్యక్రమాలూ ఇరవయ్యో శతాబ్ది అర్ధభాగపు రాజనీతికి విస్తృతావకాశాలను లభింపజేశాయి. ఈ సవాలు నెదుర్కొవడానికి కొత్త ప్రభుత్వం విదేశాలలో వున్న తన దౌత్యకార్యాలయాలను ఎట్లా వ్యవస్థీకరించిందీ 1962 లో 'ఫారిన్ ఎఫేర్స్' పత్రికలో వ్రాసిన ఈవ్యాసంలో, శ్రీ బౌల్స్ వివరించారు.

గత యుద్ధానికి ముందు అమెరికావిదేశాంగవిధానం చేయవలసిన పనులు ఇప్పటి కంటె మరింత బాగా నిర్వచింపబడివుండేవి. అప్పుడు అమెరికా విదేశాంగ మంత్రిగా కార్డెల్‌హల్ వుండేవాడు. ఆయనక్రింద వాషింగ్టన్‌లో వెయ్యిరితక్కువ మంది ఉద్యోగులు వుండేవారు. వారి సహాయంతో ప్రపంచంలో వివిధదేశాలలో గల అమెరికన్ దౌత్యకార్యాలయాలపై అజమాయిషీ చేస్తూ వుండేవాడు. ఒకే భవనంలో విదేశాంగశాఖకార్యాలయం, యుద్ధశాఖ, నౌకాశాఖకూడా వుండేవి.

విదేశాలలో మొత్తం 78 మంది రాయబారులు వుండేవారు. వారు ఆయా దేశాలలో అమెరికా అధ్యక్షుని ప్రతినిధులుగా వ్యవహరిస్తూ, సంప్రదింపులలో సమావేశాలలో ఉత్సవాల్లో పాల్గొంటూ అక్కడి సంఘటనలను వ్యవహారాలను అమెరికా ప్రభుత్వానికి నివేదిస్తూ, వాటిపై తమ సమీక్షలను వ్రాసి పంపుతూ వుండేవారు.

ఒక సంప్రదాయమైపోయిన ఈపద్ధతిని విషమమైన, క్లిష్టతరమైన ఇరవై యేండ్లకాలం అనుకోని విధంగా మార్చివేసింది. ప్రపంచవ్యవహారాలలో అమెరి కన్ల బాధ్యతలు పెరిగేకొద్దీ అమెరికన్ దౌత్యకార్యాలయాల కర్తవ్యం, అమెరికన్

రాజనీతిపై ఖరికూడా బీరకాయపీచు అయిపోయింది. మొదలెక్కడో, తుది ఎక్కడో అంతుపట్టకుండా అయింది. దాని సాధనాలు కూడా ఎన్నోరెట్లు అయ్యాయి.

ఈ మార్పుతో రాయబారి విధులుకూడా మారాయి. ఒకప్పుడు తాను వున్న చోటి వ్యవహారాలను విచక్షణతో పరిశీలన చేయవలసిన వ్యక్తి స్వయంగా కర్తవ్య పరాయణుడు కావలసివచ్చింది. అనేక కార్యకలాపాలలో చేయిపెట్టవలసిన అగత్య మేర్పడింది. ఈమార్పువల్ల విదేశాంగశాఖ కార్యాలయంలోనూ, విదేశాలలోని దౌత్యకార్యాలయాలలోనూ, అంతర్జాతీయ అభివృద్ధి వ్యవస్థలోనూ సిబ్బంది సంఖ్య 3800 అయింది. ఒక్క అంతర్జాతీయ అభివృద్ధి వ్యవస్థలోనే 17,000 మంది ఉద్యోగులున్నారు.

ఇవికాక శాంతిదళం, శాంతిని వర్ధిల్లజేయడానికి ఆహారసరఫరా, అమెరికా సమాచారశాఖ, కేంద్రరహస్య పరిశోధకశాఖ, ఇంకా అనేకరకాల సైనికసహాయ కార్యక్రమాలు, విదేశాలలో కార్మికవాణిజ్య వ్యవసాయ ఖజానాశాఖల విస్తృత కార్యకలాపాలు కూడా ఎన్నో వున్నాయి.

పైగా ఇప్పుడు అమెరికన్లకు నూటికిమించిన దేశాలలో దౌత్యకార్యాలయాలు వున్నాయి. ఇవిగాక 166 కాన్సలేట్ కార్యాలయాలుకూడ ఉన్నాయి. దౌత్య కార్యాలయం అధిపతి తన సిబ్బందికి పెద్దగా వుంటూ కార్యకలాపాలు నడిపిస్తూ వుంటాడు. ఉదాహరణకు రెండవ ప్రపంచయుద్ధం ఆరంభమయ్యే సమయంలో ప్యారిస్‌లోని అమెరికన్ రాయబారి కార్యాలయంలో సిబ్బంది సంఖ్య 78. వీరిలో నాలుగు ఇతరసంస్థల సిబ్బంది కూడా చేరివున్నారనుకోండి. ఇప్పుడు అదే కార్యాలయంలో ఇరవైమూడు ఇతరసంస్థల సిబ్బందికూడా కలుపుకొని మొత్తం 700 మంది ఉద్యోగు లున్నారు.

ఈవిధంగా అమెరికన్ కార్యకలాపాలూ, అమెరికన్ సంస్థలూ విపరీతంగా పెరగడాన్నిబట్టి ఆధునికప్రపంచం ఎంతగా పరస్పరాధారమయం అయిందో, ఎంత చిక్కుగా అల్లుకుపోయిందో అమెరికన్లు గ్రహించవచ్చు. సోవియట్ రష్యా సవాలు లేకపోయినప్పటికీ ఈ పెరుగుదల కొంతవరకు సంభవించేదే. అయితే అమెరికా రష్యా సమాజాలమధ్య నానాటికీ అధికమవుతూవున్న పోటీ, మానవాళి పురోగమనంలో ఎలాంటివైఖరి అవలంబించవలెనన్న విషయంపై సోవియట్ దృక్పథానికీ అమెరికా ఔదార్యవాద సహితప్రజాస్వామిక దృక్పథానికీ మధ్యగల

వ్యత్యాసం ఈపెరుగుదలను త్వరితం చేసింది. ఈపోటీ భవిష్యత్తులో చాలాకాలం వరకూ వుంటుందని అమెరికన్లకు తెలుసు.

ఈ నవదశ అమెరికన్లముందు వుంచుతూవున్న సవాలును అమెరికన్ల ప్రభుత్వ కార్యనిర్వాహక, శాసనవిషయకశాఖలు మొదట నిర్వచిస్తూ ఇది ప్రాథమికంగా విధాన నిర్ణయాన్ని ఎదుర్కొనే సవాలు అని చెప్పాయి. అయితే దిట్టమైన విదేశాంగవిధానాన్ని రూపొందించడం మొదటి చర్యమాత్రమే. దాన్ని అమలు జరిపేందుకు తగు సాధనాలను కూడా అమెరికన్లు కల్పించాలి. అమెరికన్ల విధాన సాధనాలకూ, వ్యవస్థకూ; ప్రభుత్వానికీ, ఇంటా బైటా అమెరికన్లు చేస్తూవున్న కృషికీ ఏర్పడ్డ ఈసవాలును ఇటీవలే సరిగా అవగాహనచేసుకొని ఆప్రకారం తగు చర్యలు తీసుకోవడం జరుగుతున్నది.

ఈ సవాలు, ఈపెరుగుదలవంటి పూర్వస్థితిగతులను దృష్టియం దుంచుకొని ప్రభుత్వం విదేశాలలో తన కార్యకలాపాలను సమన్వయించడానికీ, వాటివల్ల కలిగే ప్రయోజనాన్ని ఇతోధికం చేయడానికీ ప్రయత్నిస్తూ వుంది. ఈకృషి మూడు రూపాలుదాల్చింది. 1. అమెరికన్ రాయబారులలో ఎటువంటి ప్రత్యేకగుణాలు అవసరమో వాటిని గుణదోషసహితంగా గట్టి విమర్శచేసుకోవడం; 2. ఒకదేశంలో వున్న రాయబారి కర్తవ్యం, ఆదేశపరిస్థితుల దృష్ట్యా అతని విధి బాధ్యతల పెరుగుదలను అధ్యక్షుడు విశదీకరించడం; 3. అమెరికన్ రాయబారి కార్యాలయాలు, కాన్సలేట్ దౌత్యకార్యాలయాలు ఎక్కడెక్కడ వున్నాయో అక్కడల్లా అమెరికన్ల వివిధ కార్యకలాపాలను సమన్వయించే కార్యక్రమాన్ని నిర్ణయించడం.

దౌత్యకార్యాలయాలు ఇవన్నీ చేయవలసివచ్చేసరికి అమెరికన్ రాయబారులలో వుండవలసిన గుణయోగ్యతలలో కూడా మార్పు అవసరమైంది. వ్యక్తిగతమైన ఇంపుసొంపులు, నలుగురినీ ఆకర్షించే భార్య, రాజకీయ అభిజ్ఞత, సంఘటనలను విశ్లేషించి ఏదియేమిటో తేల్చగల సామర్థ్యం ఈనాటికీ ప్రయోజనకరమైన యోగ్యతలే. కాని ఒకరాయబారికి అవిమాత్రమే చాలవు.

ఆధునికరాయబారి ఎన్నోరకాల కార్యకలాపాలను అజమాయిషీచేసే దక్షతగల పరిపాలకుడు కూడా అయివుండాలి. చొరవ తీసుకోగల సృజనాత్మక నాయకుడై వుండాలి. తన క్రింది ఉద్యోగులకు ఉత్తేజమిస్తూ వారికి తన అధికారాలను కొన్నిటిని దత్తంచేస్తూ, వివరాలన్నిటినీ ఆకళింపుచేసుకొంటూ పోవాలి. రాజకీయ చతురతవుండాలి. యుక్తిపరుడుకావాలి. ఎదుటివారికి ఒకవిషయాన్ని నచ్చజెప్ప

గల చాతుర్యం వుండాలి. అతనిలో గట్టిదనమూ వుండాలి; పట్టువిడుపులూ వుండాలి; ఆత్మ నిగ్రహమూ కావాలి.

ఇట్టి పరిస్థితులలో ఎన్నికల ప్రచారానికి తోడ్పడగల ధనికులకు అనేక రాయబారి పదవులనిచ్చే సంప్రదాయికమైపోయిన అమెరికన్ల పద్ధతిని ఇక అనుసరింపలేమని ప్రభుత్వం తీర్మానించింది. ఈ నిర్ణయానికి అనుగుణంగా 1961 లో రాయబారి పదవులకు నియమింపబడ్డ విదేశాంగ సర్వీసుదౌత్యోద్యోగులసంఖ్య చరిత్రలోనే అత్యధికమని చెప్పాలి. దీనికితోడు పట్టువిడుపులు తెలిసి, కొత్తగా స్వతంత్రమైన దేశాల ప్రత్యేకసమస్యలను ఎదుర్కోవడంలో దూరదృష్టి, నేర్పరితనం, పరిజ్ఞానం ప్రదర్శించగల యువకులు సర్వీసులో ఇదివరకే వున్నట్లయితే వారికి చకచకా ప్రమోషనులిచ్చి పైకి తేవలెనని ప్రత్యేకకృషి చేయబడింది. ఈ విధంగా కొత్తగా నియమింపబడ్డ రాయబారులు విస్తృతమైన విదేశాంగవిధాన అనుభవం గలవారు. వీరిలో చాలామంది విశ్వవిద్యాలయాలకూ, ప్రజాసేవక ఫౌండేషనులకూ చెందినవారు. ఎవరో కొందరు మినహా తక్కిన రాయబారులంతా వారు ఏదేశంలో పదవిలో వున్నారో ఆదేశం అధికారిక చర్చల భాష మాట్లాడగలవారే.

ప్రతిరాయబారికీ తాను ఎట్టి పనిచేయగల యోగ్యతగలవాడినని అతడు భావిస్తాడో ఆపనే అప్పగించే ప్రయత్నం జరిగింది. తన 'శీలమును, నడవడిని' బలపరచుకునే ఉద్దేశంతో ఒక దేశానికి పోవనిష్టపడని విదేశాంగసర్వీసు అధికారులను సరిగ్గా ఆ దేశానికే పంపించే నిర్బంధవిధానం విడనాడబడింది. ఒక రాయబారిని, అతని సహచరులను ఒకచోట నాలుగేళ్ళపాటు వుంచవలెనని నిర్ణయించడమైంది. అంతకు ముందు ఇంకా తక్కువకాలంపాటు వుంచేవారు. రాయబారినీ, ఆయన సతీమణినీ ఒక జట్టుగా, ఒకజంటగా ఎంచారు. తన సహాయకులను, సహచరులను ఎంపిక చేసుకొనే విషయంలో రాయబారికి అధికారమివ్వబడింది.

మంచి యోగ్యతలుగల సిబ్బందిని ఎంపిక చేయడం మొదటిచర్య. రెండవ చర్య రాయబారిఅధికారాన్ని విశదీకరించడం.

ఈవిధంగా అధ్యక్షుడు కెనెడీ 1961 మే 29 తేదీన ప్రతి అమెరికన్ రాయబారికీ ఒక లేఖ పంపుతూ, అందులో అధ్యక్షుని ప్రతినిధియైన రాయబారి పాత్రను పునరుద్ఘాటిస్తూ, అతను ఏదేశానికి నియమితుడైనాడో ఆ దేశంలో వున్న అమెరికన్ సిబ్బందిపైన, అమెరికాప్రభుత్వ కార్యకలాపాలపైన అతనికి స్పష్టమైన అధికారాన్ని ఇచ్చాడు. అధ్యక్షుని లేఖలో ఇలా వ్రాసివుంది: "అమెరికా ప్రభుత్వ

కార్యకలాపాలన్నిటిపై అజమాయిషీ వహించి సమన్వయించే విషయంలో నేను మీకృషిపై ఆధారపడివుంటాను. అమెరికా దౌత్యకార్యాలయం మొత్తంపై మీరు ఆధిపత్యం వహిస్తున్నారు. దాని పనులన్నిటినీ మీరు పర్యవేక్షించాలని నా ఆశయం."

అధ్యక్షుని లేఖ బాధ్యతల విషయంలో పలువురి పరస్పర విభిన్న ధోరణులకు స్వస్తి చెప్పింది. రాయబారి అగ్రాసనాధిపతి అయ్యాడు. అధ్యక్షునికి ఉన్నత ప్రతి నిధిగా ఆయనపదవి సుస్థిరమైంది.

ఆతర్వాత అమెరికన్ దౌత్యశాఖను ఆధునికంచేసి, దాని సామర్థ్యాన్ని హెచ్చించడానికై ఆరు ప్రాంతీయ సమావేశాలు జరిగాయి. వాటికి రాయబారులనే గాక వారి భార్యలను, పాలకాధికార్లను, వారి ప్రధాన సహాయకులను, సమాచార సైనిక సలహాదార్లనూ ఆహ్వానించడం జరిగింది.

ఇట్లా రాయబారులకు అధికారమివ్వబడ్డప్పటికీ కొత్త ఆదేశాలలో చెప్పబడ్డ వాటిని నిజంగా అమలుపరచడం జరుగుతుందా అని కొందరు సందేహాలు వెలి బుచ్చారు. పైగా పరిపాలనా సంబంధమైన కార్యపద్ధతులను స్పృశించకుండా వదిలిపెట్టారు. వాటి విషయం కొత్తగా ఏమీ చెప్పారు కారు. వాషింగ్టనుకూ, దౌత్య ప్రదేశానికీ జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలలో కార్యాచరణ సంబంధమైన సమస్యలకు పరిష్కారాలే చూపలేదు. రక్షణశాఖ ప్రతినిధులు, అంతర్జాతీయ అభి వృద్ధిసంస్థ, సమాచారసంస్థ, శాంతిదళం, ఆహారసరఫరావ్యవస్థ, కేంద్రరహస్య పరిశోధకశాఖ, బడ్జెట్ బ్యూరో, వాణిజ్య కార్మిక తదితరశాఖల ప్రతినిధులకు వారి వారి పనులు, బాధ్యతలు, సహకారం మున్నగు విషయాలకు సంబంధించిన వివరా లను రాయబారులతోనూ, వారి సిబ్బందితోనూ చర్చించే అవకాశమే కలగలేదు. ఆ అవకాశాన్ని ఈప్రాంతీయ సమావేశాలు కలిగించాయి. అంతకు ముందు గూళ్ళల్లో పెట్టిన సమస్యలను చర్చించి అక్కడికక్కడే నిర్ణయాలు గైకొనడం జరిగింది.

ఈప్రాంతీయ సమావేశాలలో రాయబారుల భార్యలు పాల్గొనడం కొత్త విశేషం. స్థానికసమస్యలను ఎరుగగలిగి, అమెరికన్ల జాతీయలక్ష్యాలేవో తెలిసి వుండి ఆలక్ష్యాలను నెరవేర్చుకొనేందుకు తానూ తోడ్పడవలెనన్న ఆకాంక్షగల భార్య రాయబారకార్యాలయానికి గొప్ప సహాయకారి అవుతుందన్న సంగతి విదే శాంగసర్వీసు ఉద్యోగులకు తెలిసిందే. అట్లే అట్టి యోగ్యతలు లేని భార్య ఒక పెద్ద

బరువు. విందులలో, అధికార ఉత్సవాలలో అత్యంత ఉన్నతులైన ప్రభుత్వాధిపతుల సరసన కూర్చునేది రాయబారి భార్యేకదా! మంచి చెడ్డలు రెండిటిలో ఆమెకు కూడా భాగం వుంటుంది.

ప్రతి ప్రాంతీయసమావేశానికీ రాయబారులవెంట వారి భార్యలుకూడా వచ్చారు. ఇందువల్ల వారి విషయపరిజ్ఞానం, అవగాహనాశక్తి విశాలమవుతాయి. మరీ ప్రత్యేకమైన సమావేశాలకు మాత్రం భార్యలు రారు.

ఈ సమావేశాలవల్ల ఒక్క విదేశాంగశాఖల్లో పరిపాలనకు సంబంధించిన మంచి మార్పులను ప్రవేశపెట్టడానికే రెండువందల ప్రతిపాదనలు చేయబడ్డాయి. వాటిలో సగం అప్పుడే అమలుపరచబడ్డవి. అధికార్లకు చిన్న కార్లు ఇవ్వడం మంచిదన్న సూచన మొదలుకొని గుమాస్తాలకూ, ఆఫీసర్లకూ భాషలో శిక్షణ ఇవ్వడంవరకు రకరకాల సూచనలు చేయబడ్డవి. కార్యపద్ధతికి సంబంధించిన జాప్యాలను తొలగించి వాషింగ్టన్‌తో జరిగే ఉత్తరప్రత్యుత్తరాలను త్వరితపరచడానికీ, అంతర్జాతీయసంస్థలతో చక్కని సమన్వయానికీ ఎన్నో నిర్మాణాత్మక సూచనలు చేయబడ్డాయి.

సమగ్రరాజనీతి అవసరమైన నేటికాలంలో అమెరికావిదేశాంగవిధానం దిట్టమగుటకు అవసరమైన సాధనాలను సమకూర్చడానికి నాంధీప్రస్తావన జరిగిందని చెప్పాలి. కార్మిక సంక్షేమం, పౌరహక్కులు, మిగులు ఆహారం సరఫరా, వ్యాపారం, విజ్ఞానశాస్త్రం, విలాసయాత్రలు మొదలగు విషయాలలో అమెరికన్లు ఏంచేస్తారో దాదాపు ప్రతిదీ అమెరికావిదేశాంగ విధానంపై కొంత ప్రభావం పడవేస్తుందన్న సత్యాన్ని అమెరికా ప్రజలకూ, ఉద్యోగులకూ తెలియజెప్పాలి. విదేశ వ్యవహారాల విషయంలో ఈ అంశాలన్నీ పరస్పరం ఆధారపడి వుంటాయని తెలుసుకొన్న మీదట వాటినన్నిటినీ అధికప్రావీణ్యంతో, సమర్థతతో ఎట్లా నిర్వహించవలెనన్నదే ముఖ్యసమస్య అవుతుంది.

ఈ తరుణంలో, అధ్యక్షుని మంత్రులు విశాల ప్రపంచదృష్టి గలవారై, విదేశాంగవ్యవహారాలను అర్థంచేసుకోగలవారై, తమశాఖల పాత్రను ఎరిగినవారై వుండడం అమెరికన్ల అదృష్టమే. విదేశాలలో అమెరికన్ రాయబారకార్యకలాపాలను రాయబారి నాయకత్వం క్రిందికి తెచ్చి సమన్వయించినప్పుడు, దానికితోడు

వాషింగ్టన్‌లో విదేశవిధానంపై చక్కని అదుపు, సమన్వయం వుండేట్టు చేస్తే అంతా కట్టుదిట్టంగా వుంటుంది. ప్రగతి కన్పిస్తుంది.

ఈ సమన్వయాన్ని కల్పించగలవారు విదేశాంగశాఖలో ప్రాంతీయ సహాయ కార్యదర్శులు. వారి అధికారాలను హెచ్చించారంటే వారి పర్యవేక్షణక్రింద వున్న ప్రాంతాలలో పనులసమన్వయం సాధ్యమవుతుంది. నా ఈ ప్రతిపాదన కొత్తది కాబట్టి కొందరు దీనిని వ్యతిరేకించవచ్చు. కాని ఇది చాలా అవసరం.

కాని అమెరికన్ల ముందున్న కర్తవ్య నిర్వహణకు కొత్త వైఖరి, తెలివి, కొత్త పద్ధతులు, గుండెదిటవు గలపాలక సిబ్బంది చాలాముఖ్యం. అవన్నీ వుంటేనే అమెరికన్ విదేశాంగ విధానసాధనాలు ఆవిధాన అవసరాలకు తగినట్లుంటాయి. ఇంతవరకూ సత్ప్రారంభమే జరిగింది. అయితే జరగవలసిన పని చాలావుంది.

విభాగము–2

# ఆర్థికసహాయం మోస్తర్లు

అమెరికన్ సహాయకార్యక్రమం విస్పష్టమైంది. అత్యవసరంగా జరగవలసింది. శ్రేష్ఠమైంది. స్వేచ్ఛాప్రపంచంలోని దేశాలలో ఆయాదేశాలకు సహజమైన, స్వకీయమైన రాజకీయ ఆర్థిక స్తోమత పెంపొందునట్లుచేసి తద్వారా ఆ దేశాలు అమెరికా ప్రయోజనాల కోసంగాక, వాటి ప్రయోజనం నిమిత్తమే నిలబడేట్లు చేయడమే ఈ కార్యక్రమం లక్ష్యం.

అమెరికన్ కార్యక్రమాలు ఆ ప్రజల అవసరాలను తీర్చగలిగితే వారికి ప్రజాస్వామిక పద్ధతులపై విశ్వాసం మెండు అవుతుంది. ఇంటా బైటా ఎందరు విరోధులున్నా, తాము సాధించిన వాటిని పరిరక్షించుకోవలెనన్న దృఢసంకల్పం వారికి కలుగుతుంది.

అటువంటి దేశాలతో అమెరికా జీవవిలసితమైన స్వేచ్ఛా భాగస్వామ్యాన్ని ఏర్పాటుచేసుకోవచ్చు. అది పోను పోను కమ్యూనిస్టు దురాక్రమణ ప్రమాదాన్ని తగ్గించి దీర్ఘకాల శాంతికి ప్రాతిపదిక నిర్మిస్తుంది.

డిసెంబరు 1954.

# 15

# ఆకలిగొన్న ప్రపంచానికి అమెరికా ఆహారం

యుద్ధకాలంలో వ్యవసాయోత్పత్తి విషయంలో అమెరికా సాధించిన అద్భుతఫలితాలను చూచిన శ్రీబౌల్స్‌కు ఆకలిని పోగొట్టడానికై జరిగే ప్రపంచవ్యాప్త వ్యవసాయ విప్లవానికి అమెరికా నాయకత్వం వహిస్తే మంచిదన్న భావం కలిగింది. 1947 మే 25 తేదీన చికాగో సూపర్‌మార్కెట్ ఇన్‌స్టిట్యూట్ 11 వ వార్షిక మహాసభలో శ్రీ బౌల్స్ చేసిన ప్రసంగం ఇది:

సుదూర భవిష్యత్తులో తన ప్రజలకేగాక ప్రపంచమంతటా ఆకలితో అల్లమటించే కోట్లాది ప్రజలకు ఆహారోత్పత్తి పంపిణీల విషయంలో అమెరికా నిర్వర్తించవలసిన గొప్పపాత్ర ఒకటివుంది.

1939 లో ప్రపంచప్రజలలో నాలుగింట మూడువంతులమంది ఆహారోత్పత్తి, తయారీ, పంపిణీ పనులలో వున్నారు. అయినప్పటికీ మానవాళిలో మూడింట రెండువంతులమందికి తినడానికి తగినంత తిండి లేదు. యుద్ధంలేనప్పుడే ఇలావుంటే ఇక యుద్ధకాలంలో ఎలా వుంటుంది!

ఆకలితోఅలమటించే ప్రజలమధ్య పంచభక్ష్య పరమాన్నాలతో భుజించి సుఖించే వ్యక్తి వుండడం ఎంతదుస్సహంగా వుంటుంది! కాని ఈనాడు అమెరికన్లు ఆస్థితిలో వున్నారు. ప్రపంచమనే మురికివాడలో అమెరికా అనే రమ్యహర్మ్యాన్ని నిర్మించుకొని అందులో అమెరికన్లు సుఖజీవనం గడుపుతున్నారు.

ప్రపంచంలో తక్కిన ప్రజలకు ఉత్తమ జీవనావకాశం కలిగేటంతవరకూ

అమెరికన్లకూ, అమెరికన్ల సంతతికీ శాంతి వుండదు; భద్రత వుండదు. అట్టి ఉత్తమ జీవితానికి ప్రాతిపదిక ఆహారం.

అధికాహారోత్పత్తిద్వారా ప్రపంచ జీవనప్రమాణాలను పెంచుతామని సిద్ధాంతాలు చెప్పడం సులభమే. కాని అమలులో పెట్టడమే దుస్తరం. రాబొయ్యే తరంలో ప్రపంచ ప్రాతిపదికపై అమెరికన్లు చేయవలసినపని ఏమిటో గడచిన 150 ఏండ్లలో అక్కడ అమెరికాలో ఆహారోత్పత్తి విషయంలో అమెరికన్లు సాధించిన ప్రగతియే అమెరికన్లకు చెబుతూవుంది.

1795 సంవత్సరంలో అమెరికాలో నూటికి 90 వంతులమంది ప్రజలు తమకు కావలసిన ఆహారాన్ని మాత్రమేగాక సేద్యంపై జీవించని 10 శాతం ప్రజలకు సరిపడే అదనపు ఆహారాన్ని కూడా ఉత్పత్తిచేసెడివారు.

ఆధునిక యంత్రాలుండడంవల్ల నైతేనేమి, మేలైన వ్యవసాయ పద్ధతులను అవలంబించడంవల్లనైతేనేమి ఈనాడు అమెరికా ప్రజలలో నూటికి 20 వంతుల మంది వారికొరకేగాక పట్టణాలలో నివసించే తక్కిన 80 శాతం ప్రజలకు కూడా సరిపోను ఆహారధాన్యాలు పండిస్తున్నారు. ఇంకా మిగిలిన ధాన్యం విదేశాలకు ఎగుమతి అవుతూవున్నది.

ఈవిధమైన వ్యవసాయాభివృద్ధివల్లనే అమెరికాదేశంలో లక్షలాది నేర్పరులైన పనివారలను పరిశ్రమలలో పనిచేయడానికి కేటాయించగలుగుతున్నారు. ఇందువల్ల అమెరికాప్రజల జీవనప్రమాణం ప్రపంచంలో తక్కిన వారందరికంటె అత్యున్నతంగా వుంది.

ఇక అమెరికన్లు చేయవలసిందల్లా ప్రపంచంలో తక్కిన ప్రాంతాల ప్రజలు కూడా ఇదే విధంగా అభివృద్ధిచెందుటకు తోడ్పడటం. ప్రపంచ ఆహారోత్పత్తిని అధికంచేసే సాధనాలను కనుగొనాలి. వచ్చే తరానికల్లా ఆహారోత్పత్తిని రెట్టింపు చేయవలసివుంటుందని ప్రవీణులు చెబుతున్నారు. ఈలోపల కొరతలను భర్తీచేయడానికి అమెరికన్ల మిగులుధాన్యం ఉపయోగపడాలి.

ప్రపంచవ్యవసాయంలో గొప్ప విప్లవం రావాలి. టెన్నెసీలోయ వ్యవస్థ పద్ధతిపై ఆసియా, దక్షిణ అమెరికా, ఆఫ్రికా ఖండాల నదీలోయలను అభివృద్ధి పరచుటకు పెద్ద పథకాలు అవసరమవుతాయి.

వ్యవసాయానికి ఆధునికయంత్రసామగ్రిని అధికంగా తయారుచేయాలి.

పెద్ద పెద్ద నీటువనరు ప్రాజెక్టులు, రసాయనిక ఎరువుల కర్మాగారాలు ముఖ్యంగా అవసరం.

అన్నిటికన్న చాలాదేశాలలో భూసంస్కరణల కార్యక్రమాన్ని ప్రోత్స హించి, పరోక్ష భూస్వామ్యపద్ధతికి బదులు సాగుచేసేవారే భూమికి యజమాను లయ్యేట్టు చూడాలి.

ఇదంతా జరగాలంటే విశాలదృష్టితో, బాగోగులను ఆలోచించి పథకాలను సిద్ధపరచాలి. గ్రామ సీమలలో పాతకాలపు విధి నిషేధాలను, అయిష్టాలను, ఆచారాలను తుదముట్టించాలి. ఇందుకు ఐక్యరాజ్యసమితిని బలపరచాలి. నేరుగా, ఏకపక్షధోరణిలోగాక ఐక్యరాజ్యసమితిద్వారా సమస్తదేశాలూ కృషిచేయాలి. దీనికి చేయవలసిం దెంతో వుంది.

ఐక్యరాజ్యసమితి తాలూకు ఆహారవ్యవసాయసంస్థలో, సమితి సర్వసభ్య సమావేశంలో, ఆర్థిక భద్రతాసంఘంలో అమెరికన్లు చొరవతీసుకొని మార్గదర్శ కత్వం వహించాలి.

ప్రపంచమంతటా వ్యవసాయాన్ని పునర్వ్యవస్థీకరించడానికి అమలుజరిగే కార్యక్రమాలలో అమెరికన్లకు అపరిమితమైన ఉత్తేజం కలుగుతుంది. అమెరికన్ల పనితనాన్ని, అమెరికన్ల వనరులను వినియోగించే అవకాశం కలుగుతుంది. మానవ సభ్యతదృష్ట్యా ఇలాంటి వైఖరి సక్రమమైంది. అమెరికన్ ఆర్థికవ్యవస్థదృష్ట్యా, అమెరికన్ల భద్రతదృష్ట్యాకూడా ఇది సబబైన వైఖరే.

ప్రపంచశాంతికి భంగంవాటిల్లే అవకాశమున్నంతవరకూ అమెరికన్ల ఆయుధాలు పదును మీద వుండవలసిందే. అయితే భవిష్యత్తును అమెరికన్లు రాకెట్లతో, టాంకులతో, దూరంనుంచి బాంబులువేయగల విమానాలతో గెలుచుకో లేరన్న సంగతి మాత్రం మరువకూడదు.

నాగరకత అన్నమాటకొక అర్థం పర్థం వుండాలంటే దానిని ప్రోదిచేయాలి. పరిరక్షించాలి. ఉత్తేజకరమైన భావాలు కలిగివుండి, ప్రజాస్వామ్యంపై విశ్వాసం గలవారే నాగరికతను నిలబెట్టగలరు. తమ భావాలను ఆచరణలో పెట్టగల సాహసం, నేర్పుకూడా ప్రజాస్వామ్యవాదులకు అవసరం. ఆకలిగొని అల్లకల్లో లంగా వున్న ప్రపంచం అమెరికన్లముందుంచే సవాలును ఎదుర్కోగల ఇచ్ఛ పైననే మానవాళి భవిష్యత్తు ఆధారపడివుంటుంది.

# 16

## ఆశలువీడిన బాలలకు ఆశలు చిగిర్చజేయాలి

బాలలకొరకు ఐక్యరాజ్యసమితి విజ్ఞప్తి అన్న సంస్థయొక్క అధ్యక్షుని హోదాలో శ్రీ బౌల్స్ యుద్ధంవల్ల నాశనమైన యూరపును సందర్శించి యూరపు కొత్తతరం పౌరులకు ఆహారం, ఆశ్రయం లభింపజేయవలసిందిగా విజ్ఞప్తిచేశారు.

—1948 ఫిబ్రవరి 1వ తేదీనాటి 'న్యూయార్కు టైమ్సు' మేగజైన్‌లో ప్రచురితమైన వ్యాసంనుండి.

యుద్ధంవల్ల బాలలకు సంప్రాప్తించిన దురవస్థను పరిశీలించి, వారికుపయోగపడే కార్యక్రమాలను సూచించవలసిందని ఆదేశిస్తూ ఐక్యరాజ్యసమితి ప్రధాన కార్యదర్శి ట్రిగ్వీలీ నన్ను యూరపుపర్యటనకు పంపారు. ఐదువారాలపాటు పర్యటించి నేనిప్పుడే తిరిగి వచ్చాను.

చాలామంది అమెరికనులకు తెలిసినట్లే నాకు కూడా యూరపులో యుద్ధానంతర పునర్నిర్మాణానికి అడ్డుపడే చిక్కులూ, స్వయంసహాయానికై యూరపు వాసులు చేస్తూ వున్న పనులూ, బైటినుండి వారికందుతున్న సహాయమూ తెలుసు.

కాని అక్కడ అన్ని దురవస్థలు చూస్తానని నేననుకోలేదు. వార్సానగరం ధ్వంసమైంది. లిడిస్‌లో ప్రజలను హత్యచేసినందుకు జెకోస్లావేకియా మండిపడుతూ వుంది. ఫ్రాన్సు హంగరీదేశాల పిల్లలకు క్షయవ్యాధి పట్టుకుంది. ఇంగ్లీషువారు పండ్లబిగువుతో ఓరిమివహిస్తున్నారు.

వీరంతా తమ తమ సమస్యలను ఎదుర్కొంటున్నవైనను, పురుషులు స్త్రీలు

పిల్లలూ పుష్టికరమైన ఆహారంలేనివారైకూడా కష్టించి పనిచేస్తూవున్న తీరూ చూచి ముగ్ధుడనయ్యాను.

బాలలకొరకు ఐక్యరాజ్యసమితి విజ్ఞప్తి సంస్థకు దారుణంగా దెబ్బతిన్న ప్రజలుసైతం సుస్వాగతం చెప్పారు. యూరపుప్రజలకు ఈసంస్థ తిండిమాత్రమే గాక, శాంతినీ అంతర్జాతీయ సహకారమునుకూడా లభింపజేస్తుంది. ఈవిషయంలో యూరపుప్రజలు వారి ప్రభుత్వాలకన్న అగ్రగాములై వున్నారు.

ఈపర్యటనలో నాకు కలిగిన అనుభవాలను చెప్పాలంటే మాటలూ, అంకెలూ చాలవు. నాకు మరువరానివైన కొన్ని యథార్థాలను ఉదాహరిస్తాను.

పారిస్‌కు దగ్గరగా ఒక పారిశ్రామికపట్టణమది. ఒకే ఒక గది ఇల్లు. దానికి కిటికీలులేవు. అందులో పదకొండేండ్ల ఒక బాలిక ముగ్గురు చిన్న పిల్లలనూ, తండ్రినీ కనిపెట్టుకొనివుండి వారికి సపర్యలు చేస్తూవుంది. తండ్రికి కాళ్ళులేవు. యుద్ధ కాలంలో క్షతగాత్రుడైనందువల్ల అతని కాళ్ళను తెగగొట్టివేయవలసివచ్చింది. పెట్టుడు కాళ్ళు అమరాలంటే మరికొన్ని వారాలు అతడు అలాగే వేచివుండాలి.

ఆ బాలికతల్లి ఎక్కడో పనిచేసి వారానికి పది డాలర్లు సంపాదిస్తూ కుటుంబాన్ని పోషిస్తూవుంది. అదీ లేకపోతే ఆకుటుంబం చెట్టుకొకరు, పుట్టకొకరు అయ్యే వారే! ఇల్లు శుభ్రంగావుంది. ఇల్లు కాదది. ఒక అర. పిల్లలూ శుభ్రంగా వున్నారు. అన్నిటికన్న ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే, పదకొండేండ్ల బాలిక పాట పాడుతూవుంది!

వార్సా నగరంలో ఒక ఇల్లు ప్రేలుళ్ళకు ధ్వంసంకాగా దాని నేలమాళిగ మాత్రం మిగిలివుంది. అది 14 అడుగులపొడవు, 10 అడుగుల వెడల్పు వుంటుంది. అందులో ఏడేండ్ల పిల్లవాడు, పదేండ్లవయస్సుగల బాలిక, వాళ్ళ నాన్నమ్మా వుంటున్నారు. ఆపిల్లల తల్లి, తండ్రి, ఒకపిల్లవాడు, మరొకబాలిక (ఈ బాలిక బ్రతికివుంటే ఇప్పుడు పదిహేనేండ్ల పిల్ల అయ్యేది) 1944 లో జరిగిన వార్సా తిరుగుబాటులో హతులైనారు.

పిల్లలు వీధుల్లో తిరుగుతూవుంటే చూచిన నాన్నమ్మ వాళ్ళను నేలమాళిగలోకి తీసుకెళ్ళింది. వాళ్ళను పోషించడానికై ఆమె రాళ్ళుపోగుచేసి గంటకు కొన్ని సెంట్లు సంపాదిస్తుంది. అవిగాక, సంక్షేమశాఖవారు ఆమెకు ప్రతినెలా రెండు డాలర్లు భృతికోసం ఇస్తున్నారు. బ్రతికివున్న పిల్లలిద్దరికీ దుస్తులు సరిపోను లేనందువల్ల ఒకరు వెళ్ళివచ్చిన తర్వాత ఒకరు బడికివెడుతున్నారు.

వీళ్ళింకా అదృష్టవంతులు. ప్రభుత్వం వీళ్ళకి తినడానికి రొట్టె ఇస్తూంది. ఐక్యరాజ్యసమితి బాలలనిధివారు పాలు సప్లయిచేస్తున్నారు.

నేను పర్యటించిన దేశాలలో ఇలాంటి పిల్లలు లక్షలకొద్దీ వున్నారు. నాకు వారి ఆకలి, దౌర్భాగ్యం, దురవస్థమాత్రమే జ్ఞాపకంలేవు. ఇతరవిషయాలు కూడా గుర్తువున్నాయి. వార్సా, బుడాపెస్టు నగరాలలోని అనాధశరణాలయాలలో వుండే పాపల తలలకు చక్కని రిబ్బన్లు కట్టబడివున్నాయి. ఇటలీ, జెకొస్లొవేకియాలలో రైతుల పూరిగుడిసెలలో సైతం అలంకరణలు చూచాను. పోలెండులో పాఠశాలలు చాలావరకు ధ్వంసమైనప్పటికీ చిన్నపిల్లలు నవ్వులొలకబోస్తూ ఆడుతూ పాడుతూ వున్నారు. అప్పుడే స్విట్జర్లెండునుండి తమకు అందిన కొత్త ఆసుపత్రి పరికరాలనూ, తదితరసామగ్రినీ చూచుకొని హంగరీవారు, ఫ్రెంచి డాక్టర్లూ సంతోషపడుతున్నారు. ప్రతిదేశంలో యుద్ధకాలంలో పుట్టిన కొత్తతరంవారి సమస్యలను పరిష్కరించేందుకు తమకుగల కొద్దిపాటి సాధనసంపత్తితోనే ఉపాధ్యాయులు, సంఘసేవకులు, నర్సులు, వైద్యులు స్థితప్రజ్ఞులై నవ్వుముఖాలతో తమ కర్తవ్యం నిర్వహిస్తున్నారు.

ఈతరం సృష్టించినట్టి దురవస్థలో యూరపు ఆసియాఖండాల బాలలు జీవిస్తూ పెరుగుతున్నారు. వారి తల్లిదండ్రులతరంవారు నాశనంచేసిన దానికంటె ఉత్తమమైన నవప్రపంచాన్ని వీరు నిర్మించే అవకాశాన్ని కలుగజేయడం అమెరికన్లు అందరి బాధ్యత.

# 17

## పాయింట్ ఫోర్‌తో ఆసియా విప్లవానికి నాంది

అమెరికా కొత్తగా తలపెట్టిన పాయింట్‌ఫోర్ కార్యక్రమాలు భారతదేశంలో 1951-52 లో ఆరంభింపబడ్డవి. అమెరికారాయబారిగా వున్న శ్రీ బౌల్స్ చేసిన కృషిఫలితంగా అమెరికాకూ, భారతదేశానికీ ఒక ఒడంబడిక జరిగి దానిననుసరించి భారతదేశానికి ఆర్థిక, సాంకేతిక సహాయకార్యక్రమాలు ఈపేరుతో ఆరంభమయ్యాయి. వీటివల్లకలిగే ప్రయోజనాన్ని శ్రీ బౌల్స్ 1952 నవంబరు 16 తేదీనాటి 'న్యూయార్కు-టైమ్సు' మేగజైన్‌లో ఈ విధంగా వివరించారు:

పాయింట్‌ఫోర్ కార్యక్రమం అమలుజరుగుతూవున్న పైనాన్ని ఆసియా ఖండంలోవారెవరైనా పరిశీలించారంటే ఒక కొత్త సత్యాన్ని అనుభవానికి తెచ్చుకుంటారు. అది ఒక కార్యక్రమం మాత్రమే కాదు; గొప్ప విప్లవాత్మక భావన.

దీనిని సరిగా అర్థంచేసుకొని దోహదంచేశారంటే ఈ కార్యక్రమం అమెరికన్ల తరానికల్లా గొప్ప ఆలోచనగా చరిత్రలో నిలిచిపోతుంది. కమ్యూనిస్టుల విప్లవానికి ఇది పైయెత్తు. ప్రపంచకమ్యూనిజం దీనిని తట్టుకోలేకపోయింది.

ప్రపంచ విఖ్యాతచరిత్రకారుడు ఆర్నాల్డ్‌టాయన్‌బీ ఒక సందర్భంలో "ఈ యుగాన్ని భయోత్పాతం కలిగించే నేరాలు జరిగినందులకో, గొప్ప విషయాలు కనిపెట్టబడినందుకో స్మరించడం జరగదు. మానవచరిత్ర ఆరంభమైన దాదిగా ఈయుగంలో మాత్రమే నాగరికతవల్ల కలిగిన మేళ్ళను సర్వమానవాళికీ లభింప

జేయడం ఆచరణసాధ్యమేనని మానవులకు తొలిసారిగా విశ్వాసం కలిగింది. కాబట్టి అందుకు ఈయుగాన్ని జ్ఞాపకం పెట్టుకుంటారు'' అన్నాడు.

ఆసియాఖండంలో నివసించి అక్కడ పనిచేసిన ప్రాజ్ఞులు టాయన్‌బీ అభిప్రాయంతో తప్పక ఏకీభవిస్తారు. ఈఖండంలోని కోట్లాదిప్రజలు ఉత్తమ జీవనాన్ని సాధించడం సాధ్యమేనని తెలుసుకున్నారు. దీనికి విప్లవాత్మక ప్రాముఖ్యం వుంది. ఇదే ఆసియా స్వరూపాన్ని మారుస్తూవుంది. ముందు ముందు ఇంకా ఎన్నో మార్పులు తెస్తుంది.

సమర్థమైన, అభ్యుదయకాముకమైన ప్రభుత్వాలతో సహకారం నెరపి, పాయింట్‌ఫోర్ కార్యక్రమం వెనుకబడివున్న ప్రజలకు ఉత్తమ జీవనంపై నమ్మకం కలిగిస్తుంది. ప్రోత్సాహమిస్తుంది. అందుకవసరమైన సాధనాలు సమకూరుస్తుంది. వారు నిస్పృహజెంది ప్రమాదకారులుగా తయారుకానివ్వదు. వారి శక్తియుక్తులను సత్పథాలకు మళ్ళించి వారిచే చక్కని పంట పండింపజేస్తుంది. ఎన్నో పాఠశాలలు పెట్టిస్తుంది. మంచి నాగళ్ళు, గొట్టపుబావులు అమరేట్టు చేస్తుంది. పిల్లల్ని ఆరోగ్యవంతులుగా వుంచుతుంది. మశూచి, మలేరియాలనుండి విమోచనం కలిగిస్తుంది.

ఈ కార్యక్రమాన్ని తెలివితో అమలుపరచి దీనికి తగు నిధులను సమకూరిస్తే రక్తపాతరహితమైన విప్లవం ఆవిర్భవిస్తుంది. అదే కమ్యూనిస్టేతర విప్లవం. దారిద్ర్యం, పేదరికం, జాడ్యాలు, అజ్ఞానం అంతరిస్తాయి. ఇంత ప్రయోజనకరమైనది కాబట్టే ఈ పాయింట్‌ఫోర్ కార్యక్రమాన్ని కమ్యూనిస్టులు దుయ్యబట్టుతున్నారు. ఎందుకంటే ఇది వాస్తవదృష్టితో తలపెట్టబడ్డ కార్యక్రమమనీ, మానవసమస్యలకు చక్కని పరిష్కారమార్గాలు దీనివల్ల లభిస్తాయనీ కమ్యూనిస్టులకు బాగాతెలుసు. అప్పుడు వారి పప్పులుడకవు.

ఈ కార్యక్రమం ఒక గొప్పసవాలు. ఇదొక గొప్ప బాధ్యతకూడా.

ఇలాంటి చైతన్యోద్దీపితభావన దేశీయశక్తులతో చేతులుకలిపి, వారిని మేల్కొల్పి వారిలో అభ్యుదయకాంక్ష రేకెత్తించాలి. ఇప్పటికప్పుడే వెనుకబడివున్న ప్రాంతాలలో నివసించే నూరుకోట్ల ప్రజలు మేల్కొన్నారు.

పునరుద్ఘాటించవలసిన అంశాలు అనేకమున్నాయి.

పాయింట్‌ఫోర్ కార్యక్రమం రెడీమేడ్ దుస్తులవంటిదికాదు. వెనుక బడి

వున్న దేశాల ఆర్థిక సాంఘిక దొసగులను ఇది క్షణంలో నివారిస్తుందను కోవడం పొరపాటు. స్థూలంగా చెప్పాలంటే పాయింట్‌ఫోర్ కార్యక్రమం లక్ష్యాలు ఇవి: ఆధునిక సాధనాలనూ, సాంకేతిక సహాయాన్నీ ప్రజాస్వామిక పద్ధతిద్వారా వినియోగించి దారిద్ర్యాన్ని, జాడ్యాలను, అజ్ఞానాన్నీ పోగొట్టడం.

ఈ లక్ష్యాలను సాధించడానికి అన్ని దేశాలలో ఒకే పద్ధతి పనికిరాదు. ఏదేశానికి ఎటువంటి కార్యక్రమం తగిందో ఆలోచించి నిర్ణయించాలి. ఒక్కొక్క దేశ ఆర్థికవ్యవస్థను, దాని ఆచారవ్యవహారాలను, సంస్కృతిని, ప్రభుత్వాన్నీ ముఖ్యంగా దృష్టియందుంచుకోవాలి. ఇది మొదటి అంశం.

రెండవ అంశం—పాయింట్‌ఫోర్ కార్యక్రమం దానధర్మాలు చేయడం వంటిదికాదు. సంఘసేవకు ఆధునిక సూత్రమైన స్వయంసహాయంతో మానవులను ఉన్నతికి గొనిపోవడ మది. ఈమార్గంలో నడక ఒక్కొక్కప్పుడు తాబేటి నడకవలె అనిపించినప్పటికీ ఇదే నాలుగు కాలాలపాటు వర్ధిల్లడానికి అనువైనమార్గం.

అయితే ప్రజలు స్వయంగా పాల్గొని బైటినుండి డబ్బురూపంలో, వస్తు రూపంలో సహాయం పొందడంతోపాటు స్వంతకృషికూడా చేస్తేనే భవిష్యత్తును నిర్మించుకోగలుగుతారు. లేకపోతే సాధించిన కొద్దిగొప్పా అభివృద్ధికూడా పునాది లేనిదై ఉదాసీనతవల్ల అదికూడా అదృశ్యమవుతుంది.

మూడవ అంశం—పాయింట్‌ఫోర్ కార్యక్రమం ప్రతిదేశంలో అచటి ప్రజల సమస్యలను ఎదుర్కోవాలి. ఏవో కొన్నిటిని బాగా సాధించి తక్కిన చాలా వాటిని వదిలేస్తే లాభంలేదు. ఎక్కువసమస్యలను స్పృశిస్తేనే ప్రజలలో కదలిక ఏర్పడి అభివృద్ధి కృషికి మంచి ఊత లభిస్తుంది.

ఆదర్శప్రాయంగా వుండే ఆసుపత్రులను, పాఠశాలలను, వ్యవసాయ క్షేత్రాలను కొన్నిటిని పెట్టుకున్నందువల్ల ప్రజారోగ్యం, విద్య, వ్యవసాయం, పరిశ్రమలు అంతగా వృద్ధిచెందవు. ఇవన్నీ దేశమంతటా ప్రజల స్వయంకృషివల్ల పరిష్కరింపబడవలసిన సమస్యలు.

నాల్గవ అంశం—పాయింట్‌ఫోర్ కార్యక్రమం ఏదేశంలో అమలు జరుగుతుందో ఆ దేశం అమెరికన్లకు అనుకూలంగా ప్రవర్తిస్తుందన్న భావంతోగాని, అమెరికన్లకు సదా కృతజ్ఞులై వుంటుందన్న ఉద్దేశంతోగాని ఈ కార్యక్రమాన్ని అమలు పరచకూడదు. అసలు కొన్ని వెనుకబడివున్న దేశాలు అమెరికా సహా

యాన్ని స్వీకరించడానికి ఎందుకు సంకోచిస్తాయంటే-అసహాయాన్ని ఆసరాగా పెట్టుకొని కొత్తగా వారు పొందిన స్వాతంత్ర్యాన్ని అమెరికన్లు హరిస్తారనో, లేదా వారి జాతీయవిధానాలపై అమెరికన్ల ప్రభావం పడుతుందనో వారి భయం. అందుకే అమెరికన్లు ఇస్తామన్నా కొందరు పుచ్చుకోరు.

వెనుకబడివున్న దేశాలూ, అమెరికా సన్నిహితం కావడానికి ఒకే ఒక ప్రాతిపదిక వుంది. ఇతోధికమైన భద్రత, స్వేచ్ఛ వుండే ప్రపంచాన్ని నిర్మిద్దామన్న ఆశయం ఉభయులకూ వుండడమే ఆ ప్రాతిపదిక. ప్రజాస్వామ్యం గనుక ఇండియా, పాకిస్తాన్, జపాను, ఇండోనీషియా, ఎథియోపియా, లైబీరియా, ఈజిప్టు, బ్రెజిలు, వెనిజులా, తదితర ఆసియా ఆఫ్రికా దక్షిణ అమెరికాదేశాలలో విజయవంతమైందంటే ప్రతి అమెరికనూ తనకూ, తనసంతతికీ భద్రత వుండగలదని గుండెపై చెయ్యివేసుకొని, నిశ్చింతగా నిద్రపోవచ్చు.

ఈ లక్ష్యంతో మాత్రమే అమెరికన్లు సంతృప్తిజెందకపోతే అమెరికన్లు చేసే కృషి విఫలం కాకతప్పదు. అమెరికన్లతో స్నేహంచేయగోరిన కోట్లాది ఆసియా ఆఫ్రికాప్రజలతో భాగస్వామ్యం నెరపే అవకాశాన్ని అమెరికన్లు పోగొట్టుకున్న వారవడమేగాక రక్తపాతరహితమైన ప్రజాస్వామ్య విప్లవంపై ఆశలు వదులుకోవలసిన వారుకూడా అవుతారు. అలాంటి విప్లవమే ప్రపంచశాంతికీ, ఇతోధిక మానవప్రతిపత్తికీ ఆధారం కాగలుగుతుంది.

# 18

## ఆర్థికాభివృద్ధి కృషిలో ప్రపంచ భాగస్వాములు

ప్రజాస్వామ్య విప్లవం ఆవిర్భవించకుండా కమ్యూనిస్టులు చాటుగా విద్రోహచర్యలకు దిగుతారనీ, వారి ఎత్తులను నిలువరించాలంటే సైనికసహాయం మాత్రమే చాలదనీ శ్రీ బౌల్స్ వాదం. అభివృద్ధి చెందుతూవున్న దేశాలు వాటి స్వాతంత్ర్యాన్ని కాపాడుకునేందుకు అమెరికన్లు చేయగల సహాయమేమిటో శ్రీ బౌల్స్ 1954 డిసెంబరు 'అట్లాంటిక్' మాసపత్రికలో ఇట్లా వ్రాశారు:

స్టాలిన్ మరణానంతరంనుంచీ సోవియట్ యూనియన్ రాజనీతిజ్ఞతలో చొరవ చూపి అమెరికన్లకంటె ముందడుగు వేయడానికీ, స్వేచ్ఛా ప్రపంచాన్ని విభజించడానికీ చేయవలసినవన్నీ చేస్తూ ఉరుకులు పరుగులుగా నడకసాగిస్తోంది. కమ్యూనిస్టు దేశాలుమాత్రమే నిజంగా శాంతినికోరుతాయనీ, 1945 లో ప్రపంచ ప్రజలు అమెరికాకేసి అంత ఆశగా చూచారు కాని అసలు విషయం చెప్పాలంటే అమెరికా అధికారంకోసం ఆకలిగొని దురాక్రమణదారుగా తయారైందనీ రష్యా యూరపు, ఆసియా, దక్షిణ అమెరికా ప్రజలకు నచ్చచెప్ప ప్రయత్నిస్తూవుంది.

కమ్యూనిస్టుల ఈప్రచారం నమ్మదగింది కాకపోయినప్పటికీ అమెరికన్లని వారు ప్రపంచంలో ఇలా చిత్రిస్తూవున్న మాట నిజం. కాబట్టి ఇది అమెరికన్లకొక సమస్యగా తయారైంది. ఈ చిత్రణను చెరిపివేయాలంటే తక్కిన స్వేచ్ఛా ప్రపంచంతో అమెరికన్లకు గల సంబంధాలను ఒకకొత్త దృక్పథంతో బలపరచుకోవాలి.

విప్లవాత్మక ప్రపంచంలో శక్తి అధికారాలను విశాలదృష్టితో అవగాహన చేసుకొని అందుకు తగ్గవైఖరిని ధైర్యంగా అవలంబించాలి.

యూరపులో అమెరికన్లు ఏమిచేస్తారు, ఏమిచేయలేకపోతారు అన్నది చాలా ముఖ్య విషయం. ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో అమెరికన్లు ఏమిచేస్తారో అది కూడా అంతే ముఖ్యం. వెనుకబడివున్న ఈ ప్రాంతాలలో అమెరికన్లు సైనిక సహాయంపై మాత్రమే దృష్టిని కేంద్రీకరించి, ఆర్థిక రాజకీయ విషయాలపై ఉపేక్షచేయడంవల్ల ఎంతో నష్టం వాటిల్లింది.

ఒకవేళ ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమం రేపే తన బిచాణా ఎత్తివేసినప్పటికీ వెనుకబడివున్న ప్రాంతాలు అమెరికాకు చాలా ముఖ్యమైనవి. ప్రపంచంలో ఉత్పత్తి అయ్యే పారిశ్రామిక సరుకులలో నూటికి 40 వంతులవరకు అమెరికన్లే ఉత్పత్తిచేస్తూ వున్నప్పటికీ ప్రపంచజనాభామొత్తంలో అమెరికన్ల జనాభా నూటికి 6 వంతులు మాత్రమే. అమెరికన్ల ఆర్థికవ్యవస్థ అవసరాలనుబట్టి వారి ప్రకృతి సంపద తరిగిపోతూ వుంటుంది కాబట్టి అమెరికన్లు ఆయేటికాయేటికి ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలతో వ్యాపారంపై అధికంగా ఆధారపడుతున్నారు. ప్రపంచం మొత్తంపై అమెరికన్లు చేసే వ్యాపారంలో నూటికి 50 వంతులు ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలతో జరుగుతూవుంది.

ఈనాడు వెనుకబడివున్న దేశాలు ఒక విప్లవదశగుండా రోజులు వెళ్ళబుచ్చుతూ వున్నవి. ఈదశవల్ల ప్రచ్ఛన్న యుద్ధంతో నిమిత్తం లేకుండానే అమెరికన్ల జీవితాలపై ప్రభావం పడుతుంది. విజ్ఞానశాస్త్రం తమ దారిద్ర్యాన్నీ, దుస్థితినీ త్వరగా నిర్మూలించగలదన్న విశ్వాసంతో ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాల ప్రజలు ఉత్తమజీవనాన్ని సాధించేందుకు కృతనిశ్చయులై వున్నారు.

ఈ అలజడినీ, సంచలనాన్నీ కమ్యూనిస్టులు సృష్టించలేదు. మార్క్సు, లెనిన్, స్టాలిన్, మావోలు చరిత్రలో లేకపోయినా అమెరికన్లు ఈ అలజడిని ఎదుర్కోవలసిన అగత్యం కలిగేదే. కమ్యూనిస్టులు విప్లవం అనే అలపై నురగలా వచ్చేసి తమనేర్పునూ సిద్ధాంత సంబంధమైన ఉగ్రమునూ ప్రయోగించి సాధ్యమైనంత త్వరలో పాతవ్యవస్థను కూలదోసి ఆవిధంగా ఏర్పడ్డఖాళీలో తాము ప్రవేశించజూస్తారు.

అందుచేత వెనుకబడివున్న ప్రతిదేశ ప్రభుత్వం ఇప్పుడు పరీక్షకు గురి అవుతున్నది. ఈదేశాల ప్రభుత్వాలు ప్రజాస్వామ్యంవల్ల వ్యక్తికి రాజకీయ

స్వాతంత్ర్యమేగాక స్తిమితంగా ఆర్థికాభివృద్ధి కూడా చేకూరగలదని తమ ప్రజలకు నిరూపించాలి.

అధికాహారం, రోగాల నివారణ, పాఠశాలలు, రోడ్లు, నదులకు ఆనకట్టలు కట్టి సాగునీరు జలవిద్యుచ్ఛక్తి సరఫరాచేయడం, రవాణారాకపోకలు, వార్తా సౌకర్యాలు మొదలైనవన్నీ సమకూరాలని ప్రజలు కోరుతున్నారు. ఈకోర్కెలను నెరవేర్చలేక పోయినట్లయితే ఎంత నిజాయతీగల ప్రభుత్వమైనా పతనంకాక తప్పదు.

అభివృద్ధి కృషికి అనేక ఆటంకాలు వున్నాయి. వాటిలో పెద్ద ఆటంకము పెట్టుబడిసొమ్ము లభించకపోవడం.

ధనికదేశమైనా పేదదేశమైనా, పెట్టుబడిదారీవ్యవస్థ గలదేశమైనా లేక కమ్యూనిస్టు, సోషలిస్టుదేశమైనా అది మిగిలించి కూడబెట్టిన సొమ్మే దేనినైనా పట్టుదలతో సాధించడానికి ప్రేరణ కలిగిస్తుంది. అట్టి ప్రేరణవల్ల పరిశ్రమలు త్వరగా విస్తరించి ప్రజల జీవనప్రమాణం వృద్ధిజెందుతుంది.

ఈనాడు వెనుకబడివున్న ప్రతిదేశం ఒకే ఒక ప్రశ్నతో సతమవుతూవుంది. అదేమిటంటే—ఇప్పటికే ఆత్రపడుతూవున్న ప్రజలను సంతృప్తిపరచగల అభివృద్ధిని సాధించడానికి డబ్బుమిగిల్చి కూడబెట్టడ మెట్లా?

ప్రజాస్వామిక ప్రభుత్వం ప్రజలపై పన్నులు హెచ్చుగా విధించిందంటే మళ్ళీవచ్చే ఎన్నికలలో ఓడిపోవడం ఖాయం. అట్లే కమ్యూనిస్టు దేశాలకు సరిదీటైన అభివృద్ధిని సాధించలేకపోతే విప్లవం చెలరేగి ప్రజాస్వామ్యమే అంతమవుతుంది.

ఇప్పటికే అమెరికన్లకు ఆటంబాంబులు చాలావున్నవి. వాటికితోడు ఇంకా కొన్నిటిని చేర్చినంతమాత్రాన కమ్యూనిస్టు సవాలును అమెరికన్లు ఎదుర్కోలేరు. విప్లవాత్మకదశలోవున్న ఆసియాలో పాశ్చాత్యసైనిక శక్తికి ఒక పరిమితివుందన్న సంగతి ఇండో-చైనా వ్యవహారం అమెరికన్లకు ఏనాడో నేర్పివుండవలసింది. అట్లే ఉపన్యాసాలతో, బెదిరింపులతో ఆసియాను దక్కించుకోవడం అమెరికా తరంకాదు.

ప్రజాస్వామిక ప్రభుత్వాలవల్ల వ్యక్తి స్వాతంత్ర్యం, ఆర్థికాభివృద్ధి సాధించవచ్చునని ఆసియావాసులకు స్వీయానుభవంవల్ల విశ్వాసం కలిగిందంటే ఆసియాఖండం కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని తిరస్కరిస్తుంది. మరి దేనివల్లా ఈపని జరగదు.

కాబట్టి ఈస్థితిలో ఆచరణసాధ్యమైనరీతిని, అమెరికా తాహతుకు తగినట్లు, అవతలివారికి ఆమోదకరమయ్యేట్టు విదేశ ఆర్థికసహాయం జరగాలి.

కేవలం కమ్యూనిజాన్ని నిలువరించడమే అమెరికా పనిగా పెట్టుకొంటే కమ్యూనిజంబెడద ఏయేదేశాలలో వుందో అక్కడమాత్రమే అమెరికన్లు దృష్టిని కేంద్రీకరించి కృషిచేస్తారు. అప్పుడు ఇతరులు అమెరికన్లు చేసే ప్రతిపనికి ఏదో రాజకీయోద్దేశం అంటగట్టుతూ వుంటారు.

ఉదాహరణకు అమెరికా సహాయకార్యక్రమాన్ని కమ్యూనిస్టుబెడద గల దక్షిణ ఆసియాలో కేంద్రీకరించి, ఆఫ్రికా దక్షిణ అమెరికాల సంగతి అసలు పట్టించుకోకపోతే అమెరికన్లకు ఆసియావాసుల సంక్షేమం ముఖ్యంకాదనీ, కమ్యూనిస్టులను అడ్డగించడమే వారి అసలు ధ్యేయమనీ ఆసియావారు అనుకుంటారు. డబ్బు ఖర్చుపెట్టి అమెరికన్లు వారి భక్తివిశ్వాసాలను కొనుగోలుచేయ ప్రయత్నిస్తున్నారనీ, 'పాశ్చాత్యుల శిబిరం'లోకి వారిని లాగజూస్తున్నారనీ అనుకుంటారు. ఆసియా నాయకులు చాలామంది సహాయంకోసం ఎదురుతెన్నులు చూచేవారే. కాని అమెరికాసహాయమనేసరికి వెనుకంజవేస్తారు. అసలు వొద్దనడం కూడా కద్దు.

సహాయంకోసమని సహాయం చేయాలిగాని ప్రచ్ఛన్నయుద్ధం రీత్యా సహాయం చేయడమేమిటి? అమెరికన్లకంటె హీనస్థితిలో వున్నవారికి చేయూత నిచ్చి పైకితేవడం అమెరికా మతధర్మంకదా, అమెరికన్ల సంప్రదాయం కదా! మాస్కో-పీకింగుల కలయిక ఏర్పడకమునుపు ఎన్నోయేండ్లుగా వున్న సంప్రదాయం కదా!

అమెరికన్ సహాయకార్యక్రమాల అంతిమలక్ష్యం ఒక్కటే - స్వేచ్ఛా ప్రపంచంలోని దేశాల స్వీయరాజకీయ ఆర్థికశక్తిని పెంపొందించడం. అప్పుడు వారు స్వేచ్ఛాజీవులుగా నిలబడి అమెరికా ప్రయోజనాలకుగాక స్వంతప్రయోజనాల కొరకు స్వేచ్ఛగా పాటుపడతారు.

ప్రభుత్వాలు ప్రజల అవసరాలను తీర్చగలిగేకొద్దీ ప్రజాస్వామిక పద్ధతులపై ప్రజల విశ్వాసం పెరుగుతుంది. తాము సాధించినవాటికి దేశంలోపలినుండిగాని, వెలుపలినుండిగాని విరోధులేర్పడితే వారినుండి దానిని కాపాడుకుంటారు.

అలాంటిదేశాలతో అమెరికా స్వేచ్ఛా స్వభావంగల భాగస్వామ్యాన్ని

కుదుర్చుకోవచ్చు. అది కాలంగడిచేకొద్దీ కమ్యూనిస్టు దురాక్రమణను వారించి శాశ్వతశాంతికి ప్రాతిపదిక వేస్తుంది.

ఇందుకొరకే దిట్టమైన కార్యక్రమమేదైనా కేవలం పేదరికాన్ని పోగొట్టేదే కాకూడదు. అంతకన్నా విశాలలక్ష్యం దానికి వుండాలి. లోతుపాతులు తెలియని వారు "కడుపునిండితే కమ్యూనిస్టు అయ్యేదెవ్వడు?" అని అంటూ వుంటారు. కాని చరిత్ర ఇందుకు భిన్నంగావుంది. విప్లవాలను లేవదీసేది ఆకలితో అలమటించే రైతులు కాదు; నిరుత్సాహులై నిస్పృహజెంది తినా కుడువా వున్న మధ్య తరగతి మేధావులే విప్లవాలకు కారకులు.

*　　　　*　　　　*

కమ్యూనిస్టేతరదేశాలకు అమెరికా సహాయకార్యక్రమాలు రాజకీయమైన తగులములు లేనట్టివి కావాలి. అంటే, వారు రాజకీయంగా అమెరికన్ల చెప్పుచేతులలో వుంటేనే సహాయం చేస్తామనడం, షరతులు పెట్టడం మంచిదికాదు. అయితే దీర్ఘకాలిక ఆర్థికప్రణాళికలకు, భూసంస్కరణలకు, పన్నులసంస్కరణకు అవసరమైన ప్రాతిపదికలు ఏర్పాటుచేసుకోవాలి. శ్రీమంతులకు భోగవిలాసాలను కొనేటందుకు విదేశీ మారకద్రవ్యమును వినియోగించడంపై విధినిషేధాలు వుండాలి.

ఈనాడు ఎన్నో వెనుకబడివున్న దేశాలలో అమెరికా సహాయం ఫలితమేమిటంటే-అటువంటి సంస్కరణలను త్వరితంచేయడం కాదు; వాయిదావేయడమే! ఈ సమస్యను అమెరికన్లు దాటవేశారంటే అమెరికన్లు చేసే సహాయంలో చాలాడబ్బు వ్యర్థమవుతుంది. పైగా చాలామందికిగాక కొద్దిమందికి అనువుగా వుండే మధ్యయుగాల ఆర్థికవ్యవస్థను అమెరికన్లు బలపరుస్తున్నారని లోకం అమెరికన్లని నిందిస్తుంది.

చివరకు అమెరికన్లు అతిసాధారణసూత్రాన్నే వదులుకోవలసివస్తుంది. ఆర్థికాభివృద్ధి సమస్యలు ఎన్నో చిక్కులతో కూడుకున్నవి. వాటిపరిష్కారాలలో కూడా ఆచిక్కు ప్రతిబింబించాలి.

ఉదాహరణకు సుంకాలు తక్కువగా వేసి వ్యాపారం అధికంగా జరిపితే అమెరికన్లు చేయవలసినసహాయం మొత్తం తగ్గుతుంది. సాధ్యమైనంతవరకు వెనుకబడివున్న దేశాలు వాటి అభివృద్ధికయ్యే ఖర్చును చెల్లించవలెనన్న ఉద్దేశం

తోనే వుంటాయి. కాని ఆ దేశాలకు డాలర్లు దొరికే మార్గాలు రెండేవున్నవి. ఒకటి-అమెరికన్లకు అవసరమైన ముడిసరుకులను, వస్తుసామగ్రిని అమ్మి డాలర్లు సంపాదించుకోవడం. లేదా అమెరికన్ గ్రాంటులద్వారా, అప్పులద్వారా డబ్బు పొందడం.

అందుచేత ఈదేశాలు వాటి ఉత్పత్తిని అమెరికాకు అమ్మేపనిని అమెరికన్లు ఎంత సులభతరంచేస్తే అమెరికానుండి వారికి అంత తక్కువ సహాయం అవసరమవుతుంది. అంతేగాక ఆ దేశాల జీవనప్రమాణం ఎంతగా అభివృద్ధి చెందుతుందో అంతగా వారు అమెరికా ఉత్పత్తిదారులనుండి సరుకులను కొనుగోలు చేయగలుగుతారు.

వెనుకబడివున్న ప్రాంతాలలో అమెరికన్లు ఖరీదుచేసే ముడిసరుకుల ధరలను స్థిరీకరించే విషయంలో కూడా అమెరికన్లు చేయవలసిం దెంతో వున్నది. మలయాలో నివసించే కుటుంబాలలో నాలుగింట మూడువంతుల కుటుంబాల ఆదాయాలు రబ్బరుకు అమెరికాలో పలికే ధరపై ఆధారపడివున్నాయి. అట్లాగే తేయాకు, కాఫీ, కోకో, తగరము, నూనె ఉత్పత్తి అయ్యే దేశాలు ఆసరుకులకు అమెరికాపెట్టే ధరలపై ఆధారపడి వుంటున్నాయి.

కనిష్ఠధరలు, గరిష్ఠధరల విధానాన్ని అములులోకి తెచ్చారంటే అమెరికన్లు సూక్ష్మబుద్ధిగల వారనే అనుకోవాలి. ఇందువల్ల మార్కెట్లో ధరవరలు మరీ హెచ్చడమో, లేక మరీ తగ్గడమో జరిగి ఆమూలకంగా ప్రజలకు ఇబ్బంది కలగడం తప్పుతుంది. ధరలు క్రిందికీ మీదికీ పోతూవుంటే లాభపడేది స్పెక్యులేషన్ వ్యాపారం చేసేవారే. మామూలు హెచ్చుతగ్గులకు గరిష్ఠకనిష్ఠ పరిమితులను నిర్ణయించారంటే ధరలను తేలికగా అదుపులో పెట్టవచ్చు.

ఒకవేళ మార్కెటు తీసుకోగలిగిన దానికన్న అధికంగా ఉత్పత్తి జరుగుతూ వున్నట్లయితే పథకాలువేసి మరో రంగంలో ఉత్పత్తి ఆరంభించవచ్చు. అయితే ఇది మాటలు చెప్పినంత తేలికపనికాదు. కొత్తపథకాన్ని అములుజరపడం, ఒడంబడికలు చేసుకోవడం—ఇవి సులభంగా జరిగే పనులు కావు. అయినా ఇందుకు ప్రయత్నం ఇప్పటినుంచే జరగాలి.

స్వేచ్ఛా వ్యాపారం, ముడిసరుకులకు స్థిరమైన ధరలు గల మార్కెటు వుందంటే వెనుకబడివున్న దేశాల ఆర్థికవ్యవస్థలు బలపడుతాయి. స్వయం సహా

యంతో అవి పైకి రాగలవు. అయితే నేరుగా సహాయంచేసే కార్యక్రమం కూడా వెంటనే అవసరం. అట్టి కార్యక్రమం మార్షల్ పథకంవలెనే వివేకసాహసాలతో కూడుకొన్నట్టిదై వుండాలి. మార్షల్ పథకంవల్ల 1947-1951 మధ్య కాలంలో పశ్చిమయూరపు ఆర్థికవ్యవస్థలు వాటికాళ్ళపై అవి నిల్చునే వెసులుబాటు కలిగింది.

అయితే అమెరికానుండి, ఇతర పశ్చిమదేశాలనుండీ ప్రైవేటు పెట్టుబడుల ద్వారా పెట్టుబడి అవసరాలను తీర్చడమనేది ఒక పరిమితికి లోబడి మాత్రమే జరుగుతుంది. యుద్ధానంతరంనుంచి అమెరికాలో ప్రైవేటు పెట్టుబడి సాలీనా సగటున 4000 కోట్ల డాలర్లు కాగా విదేశాలలో అమెరికన్ పెట్టుబడిమొత్తం వెయ్యికోట్ల డాలర్లు మాత్రమే. ఇందులో అధికభాగం యూరపుకెనడాలలో పెట్టుబడి పెట్టబడింది. ఈ డబ్బులో అధికభాగం ఆ దేశాలలో అమెరికన్ కార్పొరేషనులు సంపాదించిన లాభాలనుంచి లభ్యమైంది. దక్షిణ అమెరికాలో అమెరికా నూనెవిస్తరణ కార్యక్రమాన్ని మినహాయిస్తే, యుద్ధానంతరంనుంచి వెనుకబడివున్న దేశాలలో అమెరికన్ ప్రైవేటు పెట్టుబడి నూరుకోట్ల డాలర్లు కూడా వుంటుందో లేదో! ఈకాలంలోనే ఇండియాలో అమెరికా పెట్టుబడి 10 కోట్ల డాలర్లకన్న తక్కువే!

ఈ తగ్గుదలకు తగుకారణాలున్నాయి. వెనుకబడివున్న దేశాలు చాలా వాటిలో పరిస్థితులు అనిశ్చయంగా వున్నాయి. వలసాధిపత్యంవల్ల కలిగిన అనుభవాలను పురస్కరించుకొని ఆ దేశాల వారిలో విదేశీ పెట్టుబడిపై అకారణవ్యతిరేకభావం ప్రబలివుంది. కొన్ని సందర్భాలలో ఆయాదేశాలలో అమలులో వున్న పన్నులచట్టాలు పెట్టిన పెట్టుబడివల్ల వచ్చేలాభాలను పంచుకోవడంపై ఎన్నో నిర్బంధాలను విధించేవిగా వున్నవి. ఇవిగాక ప్రభుత్వజాప్యాలు, అలక్ష్యాలుకూడా అమెరికా పెట్టుబడికి ప్రతిబంధకాలైనవి.

అయితే ఈ ఇబ్బందులేవీ లేకుండా పరిస్థితులు ఆ దేశాలలో చాలా అనుకూలంగా, సవ్యంగా వున్నప్పటికీ వెనుకబడివున్న దేశాల ఆర్థికాభివృద్ధి పునాదులను ప్రైవేటు పెట్టుబడిద్వారా నిర్మిస్తారని అనుకోవడం అవివేకం. కారణమేమంటే కావలసిన పెట్టుబడి చూద్దామా, పెద్దగంపెడు. లాభాలువచ్చే అవకాశాలా, పరిమితం. అసలు లాభాలు నిశ్చయంగా వస్తాయని చెప్పలేరు!

విద్యుచ్ఛక్తి, రేవుసౌకర్యాలు, రైళ్ళసౌకర్యం, రోడ్లు, రహదార్లు, వార్తాసౌకర్యాలు మొదలగు ప్రాథమిక సౌకర్యాలను ప్రభుత్వనిధులతోనే ఏర్పాటు చేయాలి. ఈ పునాదులన్నీ వేయబడిన తర్వాతే, వలసపాలనపట్లగల భయం

పూర్తిగా అంతరించిన పిమ్మటే ప్రైవేటు పెట్టుబడికి అవకాశాలు ఏర్పడగలవు. కనుక వెనుకబడినదేశాలు చాలావాటిలో తగు అభివృద్ధి జరగాలంటే నేరుగా ప్రభుత్వఋణాలు, గ్రాంట్లు పెద్ద మొత్తాలుగా ఇవ్వడం అవసరం.

ఆసియా, ఆఫ్రికా, దక్షిణఅమెరికా దేశాలలో వున్న పేదరికం, దారిద్ర్యం అక్కడ కమ్యూనిజం వ్యాప్తికి అవకాశమిచ్చేవిగా వున్నవి. అందుచేత ఆర్థికాభి వృద్ధికీ, రక్షణావసరాలకూ రెంటికీ ఏకకాలంలో అమెరికన్లు సహాయపడలేరన్న కారణంతో వెనుకబడివున్నదేశాలకు సహాయపడటంలో అమెరికన్లు వెనుకంజ వేశారంటే రష్యావారు ప్రస్తుత ఆయుధపోటీని కొనసాగించేందుకు మరొక కార ణాన్ని అమెరికన్లు అందిస్తున్నారన్నమాట.

అసలు రష్యావారంటే అమెరికన్లు తమ మనస్సులలో ఏదో ఎందుకు పెట్టు కొని వుండాలి? వారి అమెరికా సంప్రదాయానికి అనుగుణమైన చర్యలు ఎందుకు గైకొనరాదు? అట్టిచర్యలు తీసుకొంటే సోదరమానవుల అవసరాలు తీరు తాయి కదా!

అమెరికాదేశంలో ఉభయరాజకీయ పక్షాలవారూ అమెరికన్ల భవిష్యత్తు కోసం నూత్నచర్యలకు గడగవలసిన సమయం ఆసన్నమైంది. అమెరికా తన సంకోచాన్ని వీడి, స్వేచ్ఛాకాముకులూ, వెనుకబడివున్నవారూ, ఎటూ బద్ధులు కాని వారూ అయిన ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాల ప్రజలకు వారి ఆర్థికాభివృద్ధిని త్వరితంచేయడానికి ధైర్యంచేసి భాగస్వామ్యాన్ని ఇవ్వజూపడం ఎంతైనా అవసరం,

# 19

# విదేశీ సహాయానికి కొత్తబాట అనుసరించాలి

ఆర్థికాభివృద్ధిని త్వరితంచేస్తూనే జీవనప్రమాణాలను సాధించడ మెట్లా అనేది వెనుకబడిన దేశాలకు తేలని సమస్యగా వుంది. ఈయథార్థాన్ని దృష్టిలో వుంచుకొని విదేశీసహాయం చేయాలంటూ 1956 నవంబరులో విదేశీవ్యవహారాల సంఘంముందు వాజ్మూల మిస్తూ శ్రీ బౌల్స్ ఉద్ఘాటించారు.

గడచిన కొన్నేండ్లలో వెనుకబడివున్న దేశాలలోనూ, ఏవైపూ మొగ్గని ప్రాంతాలలోనూ అమెరికాప్రాబల్యం తగ్గిపోవడానికి అమెరికావారు అనేకకారణాలు చెబుతూ వచ్చారు. వాటిలో సోవియట్ రష్యా ఆరంభించిన కొత్త ఎత్తుగడల మూలంగా ప్రపంచ ఆర్థికవ్యవహారాలలో అత్యంత క్లిష్టస్థితి ఏర్పడిందనీ, దాని అంతు వారు తేల్చుకోలేకపోవడం ఒక కారణమనీ అంటున్నారు.

కమ్యూనిస్టేతరమైన ఆసియా, ఆఫ్రికా దేశాల నాయకులలో చాలామంది పాశ్చాత్యదేశాలలో చదువుకున్నవారు. ప్రజాస్వామ్య లక్ష్యాలను ఆమోదించినవారు. కొద్ది వ్యత్యాసాలతో ప్రజాస్వామిక పద్ధతులను అనుసరించేవారు. అయితే వారి వారి దేశాలలో ప్రజల జీవనప్రమాణాలు హీనంగా వుండడంచేత ఆంతరంగికంగా ఎన్నడూ లేనంతగా వత్తిడులకు లోనవుతున్నారు. పైగా ప్రజలు ఆధునికసాంకేతిక శాస్త్రం ఏమేమి సాధించగలదో తెలుసుకున్నారయ్యె!

ఈస్థితిలో వారు ఏమీ పాలుపోని అయోమయత్వంలో వున్నారు. ఏమి చేయడం? ఏమి చేయకపోవడం?

జాతీయశక్తి స్తోమతలంటే దేశం పరిశ్రమలమయం అయివుండడమేనని అంతా అనుకుంటూ వుండడంవల్లా, నూత్న సాంకేతికశాస్త్ర పరిజ్ఞానం ప్రజలలో వ్యాప్తిజెందుతుండడంవల్లా ఆసియా ఆఫ్రికాలలో వేగంగా అభివృద్ధికృషి జరగవలెనన్న రాజకీయమైనవత్తిడి ఇప్పుడు అధికంగా వుంది. అమెరికాలో పారిశ్రామికాభివృద్ధి జరిగే తొలిదశలో సైతం ఇంతవత్తిడిలేదు.

దీనికితోడు ప్రజాస్వామ్యమంటే ఇష్టమున్న దేశాలలో ప్రజలదృష్టి అత్యవసరంగా కావలసిన భారీపరిశ్రమల పునాది నిర్మాణంపై లేదు. వారిదృష్టి అంతా చప్పున ప్రజల జీవనప్రమాణాలను పెంపొందించడంపై కేంద్రీకృతమై వుంది. పైగా ప్రజలను ఆకర్షించేవి ఎన్నో వున్నాయి. దేశంలో రాజకీయపక్షాలు ఒకదానితో ఒకటి పోటీపడుతూ, అవి చేస్తాం, ఇవి సాధిస్తాం అని ప్రజలకు ఆశలు పెడుతూ వుంటాయి. ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యం క్రింది సహాయక సంస్థలున్నాయి. పాయింట్‌ఫోర్ కార్యక్రమాలున్నవి. మరొకవంక కమ్యూనిస్టులు ప్రభుత్వ ప్రయోజకత్వాన్ని తిండి, బట్ట, ఆవాసం, విద్యావైద్య సదుపాయాలు, సంక్షేమ సేవలనుబట్టి తేల్చుకోండని ప్రజలకు చెబుతూ ప్రచారం కొనసాగిస్తూవున్నారు.

కనుక ప్రజాస్వామిక పద్ధతులద్వారా తన సాధనసంపత్తులను నిర్మింపదలచుకున్న దేశం ప్రజలపై విధించే పన్నులను ఒక పరిమితికిలోబడి వుంచాలి. ప్రజలు నిత్యజీవితంలో వాడేసరుకులను అధికంగా ఉత్పత్తిచేయిస్తూ ప్రజలుకోరే ఉన్నత జీవనప్రమాణాలను సాధించప్రయత్నించాలి. ఇవన్నీచేస్తూనే కమ్యూనిస్టు దేశాలలో సాధింపబడ్డ పారిశ్రామికాభివృద్ధికి సరిదీటైన అభివృద్ధిని తమదేశంలో సాధించిచూపాలి. పైగా కమ్యూనిస్టు దేశాలు తాము ఏమి సాధించినా గొప్పగా ప్రచారంచేస్తూ అలాంటిది మరి ఎక్కడ సాధ్యమైందో చెప్పండి అంటూ సవాలు చేస్తూ వుంటాయి.

కమ్యూనిస్టుదేశ ప్రభుత్వం పోలీసురాజ్యదమననీతిని అవలంబించి ప్రజల వద్దనుండి అధికంగా పన్నులు రాబట్టుతుంది. ఇవ్వకపోతే చెవులుపిండి తీసుకుంటుంది. నిర్బంధ విధానాలద్వారా దేశంలో మిగిల్చి కూడబెట్టించిన సొమ్మును భారీ పరిశ్రమలకూ, సైనికవ్యవస్థకూ పెట్టి జీవనప్రమాణాల అభివృద్ధిని కాల నిర్ణయం లేకుండా వాయిదావేయగలదు.

ప్రజాస్వామ్య విధానమూ, కమ్యూనిస్టు విధానమూ ఆచరణలో ఎలా వుండేదీ చూడాలంటే నియంతృత్వం క్రింద వున్న చైనా, ప్రజాస్వామికం క్రింద

వున్న భారతదేశమూ రెండు ఉదాహరణలుగా వున్నవి. చైనా ఇప్పుడు దాని సాలుసరి జాతీయోత్పత్తిలో నూటికి 22 వంతులను భారీపరిశ్రమలపైనా, రవాణా పైనా, విద్యుచ్ఛక్తి అభివృద్ధిపైనా కేంద్రీకరిస్తూవుంది. భారతదేశాన్ని రాజకీయ సాహసం గలవారూ, సమర్థులూ పరిపాలిస్తున్నప్పటికీ సాలుసరిమిగుళ్ళను నూటికి 8 మొదలు 9 వంతులవరకు మాత్రమే నెట్టగలుగుతున్నది.

దీనినిబట్టి నియంతృత్వాన్ని నివారించదలచుకున్న ఆసియా ఆఫ్రికాదేశాలకు అమెరికా ఆర్థిక సహాయకార్యక్రమం ఎంతముఖ్యమైందో అమెరికన్లు గ్రహించ వచ్చు. సత్వర ఆర్థికాభివృద్ధికి పూనుకున్నప్పుడు కొన్ని త్యాగాలు, ఇబ్బందులు అనివార్యమవుతాయి. వాటిని స్వతంత్రప్రజలు భరించగలిగినంతమేరకు ఒక పరిమితిలో వుంచాలి. ప్రజాస్వామిక ప్రభుత్వాలు పోలీసు రాజ్యపద్ధతులను అవలం బించకుండానే కమ్యూనిస్టుదేశాలు సాధిస్తూవున్న ఆర్థికాభివృద్ధికి తుల్యముకాక పోయినా అటువంటి అభివృద్ధినే సాధించే మార్గంలో వుండాలి.

ప్రజాస్వామ్యమంటే ఇష్టమున్న వెనుకబడ్డ దేశాలకు సాంకేతిక సహాయం మాత్రమేగాక, పరిశ్రమలు, రవాణాసౌకర్యాలు, విద్యుచ్ఛక్తి పెంపొందించుకోవ డానికి పెట్టుబడిధనం రావాలి. వీటితోపాటు వినిమయసరుకుల ఉత్పత్తి, వినిమయ దారులకు సేవలు అధికంకావాలి. ఇవన్నీ దేశంలో ప్రజలపై విధింపబడే పన్నును మోయలేని భారంగా చేయకూడదు. ప్రజలు భరించగలిగేటంతవరకే పన్నులు విధిం చాలి. పై సౌకర్యాలన్నీ ఒనగూడాలి.

అభివృద్ధిచెందిన దేశాలు వెనుకబడ్డదేశాలకు ధనసహాయం చేయడమనేది ఇంతవరకూ ప్రైవేటు పెట్టుబళ్ళద్వారా జరగడం సంప్రదాయంగా వుంది. అయితే ప్రైవేటు పెట్టుబడి భారీయెత్తున లభ్యంకావడం నేడు దుస్తరంగావుంది.

రాజకీయమైన అశాంతిగల దేశాలలో అమెరికన్ ప్రైవేటు పెట్టుబడి పెట్ట బడటమనేది కూడా పరిమితంగానే జరుగుతుంది. ఎందుచేతనంటే, ప్రైవేటు పెట్టు బడిదారులకు కావలసింది అధికలాభాలు. మరి పరాయిదేశంవాళ్ళు అధికలాభాలు పొందడం వెనుకబడ్డ దేశాలవారికి రాజకీయంగా ఆమోదకరం కాని పక్షంలో లభించే పెట్టుబడి పరిమితంగానే వుంటుంది. పెట్రోలియం, గనులపరిశ్రమలూ మినహాయిస్తే అమెరికన్ ప్రైవేటు పెట్టుబడిలో 20 కోట్లడాలర్లకు లోపు మొత్తం 1948 నుంచి ఆసియా ఆఫ్రికాదేశాలలో పెట్టుబడి పెట్టబడింది.

విదేశాలలో అమెరికన్ల ప్రైవేటు పెట్టుబడిని ఇప్పటికంటె మరింత తెలివి తేటలతో పెట్టవలసివుంటుంది. పరిశ్రమలకు పునాదియైన ఆధునికరవాణా సౌకర్యాలు, విద్యుచ్ఛక్తి భారీపరిశ్రమలు పెరిగేకొద్దీ ఆసియా ఆఫ్రికాలలో రాజకీయ స్థిరత్వం కూడా పెంపొందుతుంది. అప్పుడు ప్రైవేటు పెట్టుబడిదారుల పాత్రకు ప్రాముఖ్యం లభిస్తుంది.

ఈలోపల అమెరికా ప్రభుత్వమే కమ్యూనిస్టేతర ఆసియా ఆఫ్రికాదేశాలలో పెద్దమొత్తాలు పెట్టుబడిపెట్టవలసివుంటుంది. నేటి ఆసియా ఆఫ్రికాలలో స్థిరమైన ప్రజాస్వామిక ప్రభుత్వాలకు అనుగుణమైన అభివృద్ధి లక్ష్యాలకూ, ఆ దేశాలలో స్థానికంగా లభ్యంకాగల ఆర్థికవనరులకూ మధ్యగల వ్యత్యాసాన్ని పూరించవలెనంటే ప్రభుత్వం ప్రత్యక్షచర్య తీసుకొంటేనే అమెరికా పెట్టుబడి, అమెరికా సాంకేతిక పరిజ్ఞానం లభ్యం కాగలుగుతాయి.

ముందుముందు పరిస్థితుల వత్తిడినిబట్టి ఆర్థికవిషయాలలో ప్రపంచం మొత్తంలోనే ఒకకొత్త విధానాన్ని అమెరికన్లు అనుసరించవలసివస్తుంది. కొత్త విధానం అమెరికా ప్రస్తుతవిధానానికి భిన్నంగా వుండకతప్పదు. మరి రూజ్వెల్టు తలపెట్టిన దేశీయ ఆర్థికకార్యక్రమానికీ, కాల్విన్ కూలిడ్జ్ కార్యక్రమానికీ తేడా వుందికదా!

వెనుకబడ్డ దేశాలకు అమెరికన్లు చేసే సైనికేతర ఆర్థికసహాయం అమెరికా భావిభద్రతకు ఎంతముఖ్యమైనదో అమెరికాదేశీయులకు సరిగా విశదీకరించి చెప్పని కారణంచేత ఈసహాయం స్వల్పకాలికమైనదనీ, దయతలచి చేసేదనీ, దీనివల్ల కలిగే మేలు సందేహాస్పదమేనన్న భావం అమెరికన్లలో ప్రబలింది.

కాబట్టే సైన్యానికీ రక్షణకూ అమెరికన్లు పెట్టిన ఖర్చులో నూటికి ఒకవంతుకు తక్కువగానే సైనికేతర ఆర్థికసహాయ కార్యక్రమానికి అమెరికన్లు ఖర్చుపెట్టారు. పైగా కాంగ్రెసు సభవారు ఈకార్యక్రమానికై ఇచ్చిన డబ్బును అయుక్త పథకాలకు, తగని తావులలో అనుచిత కారణాలకోసం వ్యయపరిచారు.

కొన్ని ఆసియాదేశాలలో అమెరికాసహాయంవల్ల ఉత్పత్తి పెరిగింది కాని అందుకు తగ్గ రాజకీయ స్థిరత్వం రాలేదు. ఇది అమెరికన్లు తరచు చూస్తూ వున్నదే. ఇందుకు కారణమేమంటే అమెరికా సహాయకార్యక్రమాలు పాత జీవనవిధానా

లనూ, వాటిలోగల అస్త్రవ్యస్త్రాలనూ తరచు కాపాడుతూ వచ్చాయి. ఇది పైస్థాయి లోనే జరిగిందనుకోండి.

అమెరికా సహాయకార్యక్రమం అధికసంపదను సృష్టించడమేగాక కార్మికులలో, కర్షకులలో వారి జాతీయప్రభుత్వంపట్ల, వారి ప్రజలపట్ల కపటరహితమైన సహకారదృక్పథాన్ని పెంపొందించగలగాలి.

ఇందుకై మూడు ముఖ్యలక్ష్యాలవైపు పురోగమనం వుండాలి. ఈమూడు లక్ష్యాలూ లేకపోతే ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికాదేశాలలో రాజకీయ స్థిరత్వం పెంపొందజాలదు:

1. పరిగణింపగలిగినంత ఇతోధిక ఆర్థికోత్పత్తి.

2. అట్టి ఉత్పత్తిలో తామూ భాగస్వాములమేనన్న వ్యక్తిగత సంతుష్టి ప్రజలకు కలగడం.

3. అట్టి అధికోత్పత్తి ఫలితాలను తామూ పంచుకుంటున్నామన్న సంతృప్తి. అన్యాయాలు క్రమేణా తగ్గుతున్నాయన్న నమ్మకం.

మొదటి లక్ష్యంపై అమెరికన్లు తమకృషిని ఆసియా ఆఫ్రికాలలో కేంద్రీకరించారు కాబట్టి, చాలాప్రాంతాలలో అమెరికాసహాయంతో సృష్టింపబడ్డ కొత్త-సంపదలో హెచ్చుశాతం అచటి పాలకవర్గం చేతులలోకి పోతున్నది కాబట్టీ ప్రపంచంలో అనేకప్రాంతాలలో అమెరికన్లను ప్రజలుమెచ్చని వారుగా, యథాస్థితికి హంగుదారులుగా పరిగణించడం జరుగుతూవుంది.

మధ్య ప్రాచ్యంనుంచీ, దక్షిణాసియా దేశాలనుంచీ వచ్చి అమెరికాలో శిక్షణపొందిన విద్యార్థులు ఒక విషాదగాథ చెబుతూవుంటారు. అమెరికాలో ఉన్నత విద్యముగించుకొని స్వదేశానికి తిరిగి వెళ్ళినతర్వాత అక్కడ ప్రజాస్వామ్యాభివృద్ధికీ, ఆర్థికాభివృద్ధికీ వారెంతో కృషిచేయగలరని వీరు ఉత్సాహపడుతూ వుంటారు. కాని తీరా స్వదేశంవెళ్ళి చూస్తే అమెరికాసహాయం మధ్యయుగాల పాలకవ్యవస్థను నిలబెట్టి అధికారంలో వుంచుతున్నట్లు గమనించి విస్తుపోయి నిరుత్సాహులవుతారు.

అమెరికాలో ధనికులపై అనేకరకాల పన్నులు విధింపబడుతూవుండగా స్వదేశంలో ప్రభుత్వం ధనికులపై కొద్దిపాటి పన్నులుమాత్రమే విధిస్తూవుండడం గమనించి వీరు అసంతృప్తిజెందుతారు. సంస్థలపై, సంఘాలపై విధింపబడే

పన్నులు కూడా తక్కువే. అంతేగాక స్వదేశంలో విదేశీమారకద్రవ్యాన్ని ప్రజల అవసరాలకుగాక ధనికులకవసరమైన విలాసవస్తువుల దిగుమతికి వ్యయపరచ బడుతూవుండడం చూచి ఆగ్రహావేశులవుతారు.

అంటే అమెరికన్లు చేసే ఆర్థికసహాయం సంస్కరణలను సత్వరపరిచేదిగా కాక వాటిని వాయిదావేసేదిగా, ప్రజాస్వామికానికి వ్యతిరేకులూ, గతాన్నీ పాతనూ పట్టుకువ్రేలాడే మితవాదులూ అయినవారి అధికార ప్రతిష్ఠలను నిలబెట్టేదిగా పరిణమించడం గమనిస్తారు.

కమ్యూనిజాన్ని నిలువరించే సంకుచిత ఉద్దేశంతో ఇచ్చే ఆర్థికసహాయ గ్రాంట్లు విఫలంకాకతప్పదు. తన స్వీయబలంతో నిలబడలేనట్టి, ప్రజలు ఏవగించు కొనునట్టి మధ్యయుగ యథాస్థితికి మద్దతుహామీ ఇవ్వడంద్వారా అమెరికా సహాయ కార్యక్రమాలు అచటిప్రజలను అమెరికన్లకు వ్యతిరేకులుగా తయారుచేయడమేగాక చివరకు వారు తమదుర్భరస్థితిని మార్చాలంటే కమ్యూనిజమే శరణ్యమని నమ్మే దశకు తీసుకుపోవచ్చు.

* * *

అంతర్జాతీయ ఆర్థికసహాయరంగంలో అమెరికన్లు తీసుకోవలసిన చర్యలను సంక్షిప్తంగా వివరిస్తాను.

1. ఆర్థికసహాయం ఉద్దేశాన్ని అమెరికన్లు స్పష్టంగా నిర్వచించాలి. అది ఏమిసాధించగలదో, ఏమిసాధించలేదో అమెరికన్లు తెలుసుకోవాలి.

అమెరికావారూ మానవులే కాబట్టి ఇతర ప్రజలు అమెరికావారంటే ఇష్టం చూపుతారనీ, అమెరికా అభిప్రాయాలను బలపరుస్తారనీ అమెరికన్లు అనుకోవచ్చు. అయితే స్నేహితులకోసం, ఇతరుల ఆమోదంకోసం సహాయంచేస్తామనడం మంచిది కాదు.

సోవియట్ సవాలులో గర్భితమై వున్న అంశాలు అమెరికన్లకు తెలిసినవే. కాని కమ్యూనిస్టు బెడద వున్నంతకాలంవరకు మాత్రమే ఆర్థికసహాయం చేస్తామని వాదించడం ప్రమాదకరం. ఎందుకంటే అందువల్ల అమెరికా ఎదుర్కొనే జటిల సమస్యలను తక్కువ అంచనా కడుతున్నారన్నమాట. అలాగే ఒక్కొక్కదేశంలో కమ్యూనిస్టుబెడద ఎంతమేరకుగలదో అంతమేరకే సహాయం చేస్తామనడమూ అవివేకమే అవుతుంది.

అమెరికన్ల లక్ష్యం ప్రపంచంలో జరిగే పేరుప్రతిష్ఠలపోటీలో అల్పకాలికమైన పేరు తెచ్చుకోవడం కాదు. ఇతరదేశాలు ఆంతరంగిక స్థిరత్వాన్ని పొందునట్లు చేసి తద్వారా అవి స్వతంత్రంగా వుండేట్లు చేయడం అమెరికన్ల ఆదర్శం. అప్పుడా దేశాలు విదేశీ ఆగంతుకులనుండి తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలుగుతాయి.

2. విదేశ ఆర్థికసహాయం దీర్ఘకాల కార్యక్రమం. దీనివల్ల వెంటనే ఫలితాలు కన్పించవు. అమెరికన్లు ఏవో గొప్ప ఆశలు పెట్టుకొంటే నిరాశకు పాల్పడి లేనిపోని అపోహలకు గురిఅవుతారు.

అంతర్జాతీయాభివృద్ధిలో అమెరికన్లు ఒక ముఖ్యఘట్టంలోకి ప్రవేశిస్తున్నారు. సాంకేతికవిషయాలలో, రాకపోకల విషయంలో ఎన్నో కొత్త మార్పులు వచ్చి వేగంగా అభివృద్ధి సాధ్యమవుతున్న ఘట్టమిది. అయితే ఆర్థికాభివృద్ధితోపాటు మానవహక్కుల విషయమై శ్రద్ధహెచ్చేసమాజాలలో రాజకీయస్థిరత్వానికి అత్యవసరమైన సమతూకమును తేలికగా, చవుకగా సృష్టించలేరు.

ఇకపోతే కాలనిర్ణయమనేది ఒకటివుంది. ఆచరణలో ఇది శాసననిర్ణయ సమస్యను తెచ్చిపెడుతుంది. కాంగ్రెసుసభ ఊరికే ఐదేండ్ల కార్యక్రమాన్ని నిర్దేశించి ముందుగానే మాటజారలేదు. అయినా ఆచరణరీత్యా పూర్వసంఘటనలను కొన్నిటిని అమెరికన్లు ప్రమాణాలుగా తీసుకోవచ్చు. మార్షల్‌పథకం, ఐక్యరాజ్యసమితి, ఎగుమతి-దిగుమతులబ్యాంకు, క్షేత్రసహాయమూల్య కార్యక్రమం, సరుకుల పరపతి సంస్థ, సాంఘిక భద్రతకార్యక్రమంవంటివాటిని దీర్ఘకాలం ఆదుకుంటూ వచ్చారు.

ఒక్కొక్క సంవత్సరం కాంగ్రెసుసభ అమెరికన్లు చేయతలపెట్టిన వ్యయాలను ఆమోదింప నిరాకరించవచ్చు. కాని దీర్ఘకాల కార్యక్రమ పరిధులను ఆమోదించిన తర్వాత అలానిరాకరించడం జరగదు. అంతర్జాతీయ సంబంధాలలో గొప్ప మార్పులువస్తేనే నిరాకరించడం జరుగుతుంది.

3. అమెరికన్లుచేసే సహాయం పరిమాణం నూత్నప్రపంచం స్థితికి సరిపోను వుండాలి. తప్పనిసరిగా తక్షణమే జరుగవలసిన పనులకు అవసరమైన మొత్తాలను తగ్గించి అమెరికన్ల బాధ్యతను తప్పించుకోవడం తెలివి తక్కువ అనిపించుకొంటుంది.

ప్రజాస్వామ్యమంటే ఇష్టమున్న కొత్తదేశాలు డబ్బుమిగిల్చి దేశాభివృద్ధికి ఖర్చుపెట్టగలిగినదానికీ, కమ్యూనిస్టు దేశాలు మిగిల్చి ఖర్చుపెట్టగలిగేదానికీ ఎంతో

వ్యత్యాసముంది. ఇకముందు వుండబోతుందన్న సత్యాన్ని ఎవరూ విస్మరించ కూడదు.

అమెరికన్లుచేసే సహాయం కొంత సాంకేతికసహాయం రూపంలో వుంటుంది. కొంత సరుకులగ్రాంట్ల రూపంలో వుంటుంది. కొంత సరుకుల ఋణాలుగా వుంటుంది. అది అంతా ఆయాదేశాలనుబట్టి వుండగలదు. అన్నమో, వస్త్రమో రామచంద్రా అని అలమటించే ప్రపంచంలో అమెరికా మిగులువ్యవసాయోత్పత్తి పెన్నిధివంటిది. చివర కొక ప్రపంచవ్యవసాయోత్పత్తి బ్యాంకు అమెరికన్ల ఉత్పత్తులను సద్వినియోగం చేయగలదేమో !

4. అప్పులు తీసుకొనే దేశాలను తీసుకొనే అప్పులలో కొంతభాగాన్ని మేనేజిమెంటు శిక్షణకు ఖర్చుపెట్టవలసిందిగా ప్రోత్సహించాలి. కంట్రాక్టు తీసుకొనే సంస్థయే ఫ్యాక్టరీ పథకాన్ని వేసి దానిని నిర్మించి దానిలో పనిచేసేవారికి శిక్షణయిచ్చి దేశవాళీ మేనేజర్లు దాని నిర్వహణభారాన్ని వహించేవరకూ ఫ్యాక్టరీని నడపాలి.

ఇట్టివిదేశ అభివృద్ధికార్యక్రమంలో అమెరికా వ్యాపారరంగం వహించదగ్గ ప్రముఖపాత్రను వెంటనే పరిశీలించాలి. అమెరికన్లుచేసే ఆర్థికసహాయంలో ఆసియా ఆఫ్రికా దక్షిణ అమెరికాదేశాలకు ప్రథమశ్రేణికి చెందిన అమెరికన్ పశ్చిమయూరోపియన్ సాంకేతికవిజ్ఞానం,మేనేజిమెంటు పరిజ్ఞానముల ఎగుమతి ప్రధానమైనది కావాలి. ఈవిషయంలో అమెరికావ్యాపారరంగం బాధ్యత చాలా వుంది.

అయితే వెనుకబడ్డదేశాలు ఇవ్వగల షరతులపై అమెరికా వ్యాపారసంస్థలు ఈబాధ్యతను స్వీకరించేట్లు ప్రోత్సహించడం అంతసులభంకాదు. అయినా నేడు రాగల లాభాలకన్న రేపుబ్రతికివుండటం చాలా ముఖ్యమన్న సంగతిని బాగా గుర్తించగలవారు అమెరికా పారిశ్రామికులలో చాలామంది వున్నారు.

5. ప్రజాస్వామ్య రాజకీయవిధానం వృద్ధిజెందగలచోట్ల స్వేచ్ఛాసమాజాన్ని నిర్మించడానికి ప్రాథమికమైన ఆర్థికసంస్కరణలు అత్యవసరమవుతాయి. అలాంటి సంస్కరణలతో అమెరికన్లు ప్రమేయం పెట్టుకోవాలి. వాటిని ప్రోత్సహించాలి. స్వేచ్ఛా సమాజనిర్మాణానికి ముందు ఆసంస్కరణలు అమలుజరగాలి. అవి జరిపించగలిగారంటే వెనుకబడివున్న దేశాలలో అమెరికన్ల ప్రతిష్ఠ, పలుకుబడి క్రమేణా పెరుగుతాయి.

అభివృద్ధికి ఒక నియమమంటూ గీత గీసి ఆప్రకారం పనిజరగాలంటే కుదరదు. అయినా అమెరికాసహాయం పొందే దేశాలలో న్యాయబద్ధమైన భూమి

పంపిణీ, ఆర్థిక అన్యాయాల నిర్మూలన, ప్రజాస్వామ్య బద్ధమైన పన్నులవిధానం అమలులోకి వచ్చేట్టు చేయాలంటే చాకచక్యంతో అవతలివారిని ప్రోత్సహించవలసి వుంటుంది. ఇవన్నీ జరగనిదే ఏదీ సాధ్యంకాదు. కేవలం ఉత్పత్తినిపెంచి కూర్చున్నంతమాత్రాన రాజకీయమైన బెడదలు వస్తాయిగాని సాంఘిక సమస్యల పరిష్కారం జరగదు. మొదట మానవప్రగతి ముఖ్యం. తరువాత భౌతికపురోగమనం.

6. ఇక చివరకు ఐక్యరాజ్యసమితిద్వారా జరిపించవలసిన ఆర్థికసహాయ కార్యక్రమం వుంది. అమెరికన్ల ఆర్థికసహాయాన్ని సమితిద్వారా జరిపించవలెనని చాలామంది చాలా సందర్భాలలో అంటూ వున్నారు.

నిజమే. అభివృద్ధినిధుల పంపిణీకి సమితి వాటంగానే వుంటుంది. ఇందుకై ప్రపంచబ్యాంకుకు ఉపసంస్థగా అంతర్జాతీయ ఋణప్రదానసంస్థను నెలకొల్పాలి. కొలంబో ప్రణాళిక వ్యవస్థకూడా సహాయంపంపిణీకి చాలా అనువైన సంస్థయే.

ఆసియా, ఆఫ్రికా, దక్షిణాఫ్రికాలకు సువ్యవస్థితమైన, సమగ్రమైన ఆర్థికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలులోకి తెచ్చారంటే నవభావవీధులలోకి, నవకార్యరంగాలలోకి అడుగుపెట్టారన్నమాటే. దీనికి అమెరికా ప్రభుత్వస్థాయిలో చొరవగల చురుకైన నాయకత్వం అవసరం. ప్రజలకు సంగతి సందర్భాలను తెలియజెప్పడానికి సమగ్రకార్యక్రమం అవసరం. ఈపనులను కాంగ్రెసుసభలోని ఉభయ రాజకీయపక్షాల ఆమోదంతో అమెరికా అధ్యక్షుడు మాత్రమే చేయగలడు.

# 20

# విదేశీసహాయం పంపిణీ: ప్రమాణాల ఆవశ్యకత

**త్ర**రాద్పు కనెక్టికట్ నుండి కాంగ్రెసుసభ నూతన సభ్యుడుగా శ్రీ బౌల్స్ 1959 ఏప్రిల్ 20 తేదీన ప్రజాప్రతినిధుల సభలో మాట్లాడుతూ అమెరికాచేసే సైనిక సహాయకార్యక్రమాలను పునర్విమర్శచేయాలని కోరుతూ, ఆర్థికసహాయమివ్వడంలో నూత్న ప్రమాణాలను అనుసరించవలెనన్నారు.

**అధ్యక్షా,** అమెరికా ప్రజల మనస్సులలోను, కాంగ్రెసుసభ చర్చనీయాంశాలలోను విదేశీసహాయం నేడు ప్రధానాంశంగా వుంది. దీనిపై వున్నన్ని భిన్నాభిప్రాయాలు, ఆపోహాలు మరి యే అంశం విషయంలోనూ లేవు.

విదేశీ సహాయం చేయడానికై తగు నిధులను సమకూర్చుకోవడంలో అమెరికన్లు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవడానికి ముఖ్యకారణం అట్టి సహాయం తక్షణావశ్యకతను ప్రభుత్వం నిష్కపటంగా, నిజాయతీతో విశదీకరించి చెప్పలేకపోవడమే.

విదేశీసహాయం దీర్ఘకాలిక లక్ష్యాలను ప్రభుత్వం వివరించి చెప్పలేకపోయినప్పటికీ అమెరికాజనాభాలో నూటికి 70 వంతులమంది విదేశీసహాయ కార్యక్రమాన్ని బలపరుస్తున్నారు. ఇందుకు ప్రజాభిప్రాయ సేకరణలో తేలిన ఫలితాలే నిదర్శనం. అమెరికన్ జాతివివేకానికి అంతకన్న మంచి ప్రశంస వేరొకటి వుండదు.

విదేశీ సహాయం చేయడం కోసం ప్రభుత్వం చెప్పే కారణాలు, దానివలన కలిగే ప్రయోజనాలు తగురీతిలో వుండడంలేదు.

ప్రపంచవ్యవహారాలలో అమెరికా నిజలక్ష్యాలేమిటో స్పష్టీకరించలేకుండా వున్నారు.

మానవప్రతిపత్తి, గౌరవాలవిషయంలో కమ్యూనిస్టేతర ప్రపంచానికి ఎంత శ్రద్ధవుందో అమెరికన్లకూ అంతే శ్రద్ధవుంది. ఈవిషయం జనసామాన్యం హృదయాలకు హత్తుకొనేట్టు చెప్పరు అమెరికా వాళ్ళు.

అసలు అమెరికాప్రభుత్వం అమెరికాప్రజల వివేకమునూ, వినయమునూ లెక్కలోకే తీసుకోవడంలేదు.

పరస్పర భద్రతాచట్టం ఉపోద్ఘాతంలో "కమ్యూనిస్టులవల్ల ప్రమాదం వున్నంతవరకే సహాయకార్యక్రమాలను అమలుపరచడం అమెరికా విధానం" అని వుంది.

ప్రచ్ఛన్న యుద్ధ మనే విపణివీధిలో అల్పసంఖ్యాకులైన కమ్యూనిస్టులకు ఎత్తుకు ఎత్తు డాలర్ల విలువ లభ్యమైంది. ఎందుచేతనంటే వారికి నోరువుంది. రణగొణధ్వని చేస్తారు. పైగా కాంగ్రెసుసభ నిర్వచనంకూడా వారికి తోడ్పడింది.

విదేశీ సహాయంవల్ల ఐక్యరాజ్యసమితి సర్వసభ్యసమావేశంలో అమెరికా విధానాలకు అల్పసంఖ్యాకుల మద్దతును కొనవచ్చునని ప్రభుత్వవర్గాలవారు నోటి మాటగా చెబుతూ వుంటారు. వ్రాతలో ఎక్కడా ఈవాదం కనపడదు.

కాని, అధ్యక్షా, ఈవాదం సబబైనదేనా? ఒకగొప్ప శ్రీమంతుడు వచ్చి అమెరికా ప్రజలతో నివసిస్తూ ప్రజాభ్యుదయ పథకాలకు బాగా డబ్బు ఖర్చుపెట్టి అందుకు ప్రతిఫలంగా తన రాజకీయ అభిప్రాయాలను ఆమోదించండని అమెరికనులను కోరుతాడనుకోండి. పౌరబాధ్యతలు తెలిసిన అభిమానధనులైన ప్రజలు వెంటనే ఆ పెద్దమనిషితో "అయ్యా, అక్కరలేదు. మీడబ్బూ దస్కమూ తీసుకొని మరెక్కడికైనా వెళ్ళి మకాంపెట్టండి" అని ముఖంమీదే అనరా?

అమెరికన్లే అలా అన్నప్పుడు, ఆసియా ఆఫ్రికాదేశాలు, యూరపుఖండ దేశాలు, లాటిన్ అమెరికాదేశాలూ అనకుండా వుంటాయా? వారికీ చరిత్రవుంది కదా. వారూ ఆత్మాభిమానం గలవారే కదా.

విదేశీ సహాయంచేయడానికి మరొకకారణం ఇలా చెబుతారు: "కమ్యూనిజ మనేది ఆకలితో అలమటించే ప్రజలనే ఆకర్షిస్తుంది, కాబట్టి వరి అన్నంతో వారి

కడుపులు నింపితేసరి. అంతటితో అభివృద్ధిచెందని దేశాలలో కమ్యూనిజం మటు మాయమవుతుంది."

ఈ అభిప్రాయంతో వున్నవారికి మానవస్వభావంగానీ, కమ్యూనిస్టులలో గల ఆకర్షణగానీ తెలియవని చెప్పాలి. ప్రజలను కమ్యూనిజం వైపు లాగేది ఒక్క ఆకలిమాత్రమేకాదు. అన్యాయంవల్ల జనించే నిరాశానిస్పృహలు, తాము ఎవరికీ పట్టకుండాపోయామన్న భావంకూడా ప్రజలను కమ్యూనిజంకేసి లాగుతాయి.

అయితే అమెరికాసహాయం లక్ష్యాలను ఎల్లప్పుడూ పైనచెప్పిన విధంగా వివరించడం జరగలేదు. ఉదాహరణకు 1948 సంవత్సరపు విదేశీసహాయచట్టం మార్షల్ పథకానికి ప్రాతిపదికవేసింది. ఆచట్టంలో "వ్యక్తి స్వాతంత్ర్యసూత్రాలను, స్వతంత్రవ్యవస్థలను గట్టి ఉత్పత్తి కృషిపై, విదేశీవ్యాపారవిస్తరణపై, అంతరంగిక ఆర్థికస్థిరత్వంపై, ఆర్థికసహకార విస్తృతిపై ఆధారపడ్డ నిజమైన స్వాతంత్ర్యాన్ని పటిష్ఠంచేయుటకు" తగుచర్యలు తీసుకోవలసిందిగా 80 వ కాంగ్రెసుసభ విజ్ఞప్తిచేసింది.

పూర్వ వృత్తాంత మిలా వుండగా ఈసంవత్సరపు ముసాయిదా శాసనంలో తిరిగి పేర్కొనబడ్డ 1954 సంవత్సరపు లక్ష్యప్రకటన అమెరికా ప్రతిపత్తికి తగినట్టుగాలేదు. అందులో తెల్పబడ్డ ఉద్దేశాలు వ్యతిరేకార్థమిచ్చేవిగా వున్నవి. వాటిలో సామంజస్యంకంటె స్వార్థం ఎక్కువ. ఒక్కమాటలో చెప్పాలంటే అవి కేవలం అవాస్తవికమైనవి.

చరిత్రలో ఇటువంటి క్లిష్టదశలో అమెరికాప్రజలను తక్కువ అంచనా కట్టడం అమెరికన్లు మానుకోవాలి. వ్యాపారతంతులన్నీ కట్టిపెట్టి సబబైన కారణాల దృష్ట్యాచేయవలసిన పనిఏమిటో చేయాలి.

అసలు అమెరికా నిజంగా కోరేదేమిటి? పరదేశాలనుగాని, ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికాల సహజసంపదలనుగాని తమ అదుపులో పెట్టుకోవడం అమెరికన్ల ఉద్దేశం ఎంతమాత్రం కాదు. అమెరికన్ల పద్ధతులను ఇతరులమీద రుద్దేకోర్కె అమెరికన్లకు లేదు.

నిజానికి అమెరికాజాతికూడా విప్లవంలో ఆవిర్భవించిందే. తొలికాలం నుండి అమెరికన్లు ఎక్కడైనా సరే ప్రజలు స్వాతంత్ర్య సముపార్జనకుగానీ, దాన్ని పరిరక్షించుకోవడానికిగానీ కృషిచేస్తూవుంటే ఆకృషిని బలపరిచారు. వారికి తోచిన రీతిని వారి భవిష్యత్తును వారు నిర్మించుకొంటూవుంటే చేయూత ఇచ్చారు.

జెఫర్సన్ కాలంలో అమెరికా ప్రపంచలక్ష్యమేమిటో ఈనాడూ అదే: ప్రపంచశాంతి. అట్టిశాంతిలో సకలప్రజలు వారి వారి మతాలకు సంస్కృతులకు, జాతీయయోగ్యతలకూ తగినట్లుగా స్వేచ్ఛతో స్వతంత్రంగా అభివృద్ధిజెందే అవకాశం వుండాలి అని అమెరికన్ల ఆశయం.

అమెరికన్ల పరస్పరభద్రతాకార్యక్రమం లక్ష్యాలు అమెరికన్ల చారిత్రక రాజకీయాదర్శాలకూ, అమెరికా ప్రజాస్వామ్య విశ్వాసాలకూ అనుగుణంగానే వున్నాయనీ, తేడా ఏమీ రాలేదనీ అమెరికాప్రజలకూ, యావత్ప్రపంచానికీ చెప్ప వలసిన సమయ మాసన్నమైంది.

అధ్యక్షా, ఈలక్ష్యాలను అమెరికన్లు విశదంగా చెప్పాలని నా మొదటి ప్రతిపాదన.

ఇక అమెరికా సైనికసహాయం కేటాయింపు విషయం మరీ దుర్భరం. బహుశా ఇతరులకు కూడా అలాగే అనిపిస్తున్నదేమో! ఎంత దుబారా! ఎంత అసమర్థత! చాలా సందర్భాలలో అమెరికన్లు అజాగ్రత్తగా వ్యవహరించడంవల్ల పరిస్థితులు అమెరికాచేయి జారిపోయి కమ్యూనిస్టులకు అనుకూలంగా తిరిగాయి. వారి ప్రభావం హెచ్చింది.

కమ్యూనిస్టు దురాక్రమణ బెడద వున్న సందర్భాలలో సైనికవ్యవహారాలకు ప్రాధాన్యమివ్వవలెనన్న సంగతి నేనూ అంగీకరిస్తాను. స్వల్పకాలం వరకైనా అలా జరగాలి. పశ్చిమయూరపు, గ్రీసు, టర్కీ, యుగోస్లావియా, కొరియా, ఫార్మోజా, వియత్‌నాం ముఖ్యస్థానాలు. ఈచోట్ల అమెరికాసైనికసహాయం చాలా అత్యవసరం.

కాని రెండు ఖండాల మొత్తంలో - దక్షిణ అమెరికాలో, ఆఫ్రికాలో, లెబనాన్ మొదలు మనిలావరకుగల విశాల ఆసియాప్రాంతంలో ప్రపంచశాంతికి సోవియట్ టాంకులవల్లా, జెట్ విమానాలవల్లా ముప్పురాదు. ఆర్థిక సంక్షోభంవల్లా, దురన్యాయంవల్లా, మానవదైన్యంవల్లా ఉపద్రవం వస్తుంది.

ఈప్రాంతాలకు అమెరికా సైనికసామగ్రిని హుటాహుటి ఓడలపై పంపడం వల్ల అమెరికా దీర్ఘకాలిక భద్రతకు ఏమాత్రం ప్రయోజనం కలుగదు. అలాగే ఆ సామగ్రిని తీసుకొనే దేశాలకు కూడా కలిగే మేలేమీ వుండదు.

అలా ఆదరాబాదరాగా చేసిన సహాయం ఆత్మపరాజయానికే దారితీస్తుంది,

దానివల్ల దేశంలో ఆంతరంగికంగా ఆర్థికభారం ఎక్కువవుతుంది. నిర్మాణాత్మక అభివృద్ధికై దేశంలో జరుగవలసిన కృషి కుంటుపడుతుంది. ప్రజలదృష్టి వేరొక వైపు మళ్ళుతుంది. రాజప్రాసాదాలలో విప్లవాలకు బాటయేర్పడుతుంది. కొన్ని సందర్భాలలో అమెరికన్ల ప్రతిష్ఠ, పలుకుబడి నిజమైన బలంలేని నియంతృత్వాలతో ముడివడిపోతుంది. ప్రజోద్యమం వచ్చి ఆ నియంతృత్వాలు అంతరించాయంటే అమెరికన్ల పని ఏమవుతుంది?

ఇప్పుడే జాగృతమవుతూవున్న ఈఖండాలకు ప్రాంతీయరాజకీయాలను గమనించకుండా సైనికసహాయం చేశారంటే మరీ అపాయకరమవుతుంది. అమెరికా సహాయం తీసుకొనే దేశానికీ, దానికి పొరుగునవున్న కమ్యూనిస్టేతర దేశానికీ మధ్యగల సమతూకపుశక్తిని కదిల్చి చెడగొట్టడంద్వారా అమెరికన్లు ఓడలలో పంపే ఆయుధసామగ్రి ఆప్రాంతం మొత్తంలో సైనిక, రాజకీయ స్థిరత్వాన్ని భంగ పరుస్తుంది.

ఈ కారణాలను పురస్కరించుకొని అమెరికా సైనికసహాయం ప్రయోజ నాన్ని ఒక్కొక్కదేశం ప్రాతిపదికగా పునఃపరిశీలించడం మంచిదని నేను ప్రతి పాదిస్తున్నాను.

పూర్వం చేసుకున్న ఒడంబడికలను, ఏర్పాట్లను ముందూవెనుకా ఆలోచించ కుండా రద్దుచేయమని నేను కోరడంలేదు. పాత ఏర్పాట్లను అమెరికన్ల కొత్త లక్ష్యాలకు అనుగుణంగా మలచాలి. కొత్తగా చేయబోయే ఏర్పాట్లు ఈప్రమాణాల ననుసరించి వుండకపోయేట్టయితే వాటిని త్రోసిపుచ్చాలి.

* * *

అధ్యక్షా, ఆర్థికసహాయం పంపిణీ విషయంలో అమెరికన్లకు మరింత వాస్తవికదృష్టి అవసరమని చెప్పదలచుకున్నాను.

ఒకదేశంలో సులభంగా నదికి ఆనకట్టకట్టి నీటిని చక్కగా పంపిణీ చేయగలం. కాని అదే మరొకదేశంలో సాధ్యపడదు. ప్రయత్నం విఫలమవుతుంది. ఎందుకని? కొన్నిదేశాలలో ఆధునిక యంత్రసామగ్రివల్ల వ్యవసాయ పారిశ్రామిక ఉత్పత్తి బాగాపెరుగుతుంది. ఆసామగ్రినే మరొకదేశానికి పంపితే అది రేవులోనే పడివుండి తుప్పుపట్టిపోతుంది. కారణమేమిటి?

అంటే ఆదేశాలకూ వాటిప్రభుత్వాలకూ మధ్యగల భేదాభిప్రాయాలు ఈ

వైఫల్యం రూపంలో వ్యక్తమవుతున్నాయన్నమాట. ఆ విభేదాలను అమెరికన్లు గమనించి లెక్కచేసి తీసుకోవడం లేదన్నమాట!

అమెరికిన్లిచ్చే దీర్ఘకాలికసహాయాన్ని వినియోగించుకొనే స్తోమత ప్రతి దేశానికీ ఎంతవున్నదీ తెలుసుకోవాలంటే ఈక్రింది ఐదుప్రమాణాలను అమెరికన్లు అనుసరించాలని నేను సూచిస్తున్నాను, ఇవి ఆచరణసాధ్యమైనవి. అత్యవసరంగా కావలసినవి.

1. అమెరికా ఆర్థికఋణాలను మంజూరుచేయడానికి అన్నిటికన్న ముఖ్యమైన ప్రమాణం స్వార్థత్యాగం.

అమెరికాయిచ్చే దీర్ఘకాలిక సహాయానికి ఒకదేశం యోగ్యతపొందాలంటే మొదట ఆ దేశం తన జాతీయాభివృద్ధిని తన సాధనసంపత్తితోనే సాధించేందుకు పెద్ద కృషి చేస్తూ వుండాలి.

అందుకు సాక్ష్యంగా ఆ దేశంలో వ్యక్తి చెల్లించగలతాహతుపై ఆధారపడి సట్టి పన్నుల కార్యక్రమం ఒకటివుండాలి. అంతగా అవసరంలేని సరుకులను, విలాసవస్తువులను దిగుమతిచేయడంపై అక్కడ తగువిధినిషేధాలు వుండాలి. ఎందుకంటే అటువంటి దిగుమతులవల్ల విదేశీమారకద్రవ్యం తరిగిపోతుంది. సాధ్యమైనంతవరకు ఎక్కువ రైతు కుటుంబాలకు వారు సాగుచేసుకొనే భూమిపై వారికి యాజమాన్యహక్కునిచ్చే కృషిజరగాలి.

2. అమెరికా సహాయం పొందే వెనుకబడ్డ దేశానికి ఆచరణసాధ్యమైన సమగ్ర ఆర్థికలక్ష్యాలు వుండాలి. ఆలక్ష్యాలను సాధించడానికి తన సాధనసంపత్తిని ఒక్కొక్క పద్దువారీగా కేటాయింపులు చేసుకొని వుండాలి.

ఇందువల్ల ముఖ్యమైన పనులకే ప్రాధాన్యమివ్వడం జరుగుతుంది. అభివృద్ధి కార్యక్రమానికీ ప్రైవేటు-ప్రభుత్వ ఆదాయాలకూ పొత్తువుంటుంది. అవి దేనికవిగా వుండవు. అంతర్జాతీయసహాయ ఆవశ్యకతను కచ్చితంగా అంచనా కట్టవచ్చు.

ఒకదేశంలో చెప్పుకోదగ్గ ప్రైవేటు వ్యాపారరంగం ఇదివరకే వున్నట్లయితే జాతీయాభివృద్ధి పథకాన్ని రూపొందించే సందర్భంలో ప్రభుత్వం తలపెట్టే వ్యవసాయరవాణా విద్యుచ్ఛక్తి కార్యక్రమాలతోపాటు ప్రైవేటు వ్యాపారరంగాన్ని కూడా గమనించాలి.

3. మంచి సమర్థమైన పరిపాలనాయంత్రాంగం వుండాలి. అవినీతి, లంచ

గ్రొండితనం వుండకూడదు. సమర్థులైన సాంకేతికులు, పన్నువసూలుచేసేవారు, పాలకోద్యోగులు లేకపోతే పెద్దమొత్తం పెట్టుబడి సొమ్మును లాభదాయకంగా వినియోగించడం పడదు.

4. దీర్ఘకాలిక పెట్టుబడిసొమ్మును పొందే దేశానికి స్థిరమైన ప్రభుత్వం వుండాలి. దానికి ప్రజల అండదండ లుండాలి.

అధ్యక్షా, అమెరికన్లది ప్రజాస్వామిక సంప్రదాయం. అందుచేతనే నియంతృత్వ ప్రభుత్వాలంటే చాలామంది అమెరికనులకు సానుభూతిలేదు. అయితే అలాగని చెప్పి పాశ్చాత్యనమూనాలో వున్న పార్లమెంటరీ ప్రజాస్వామికదేశాలకు మాత్రమే అమెరికన్లు సహాయంచేయాలనీ, తక్కినవాటికి చేయకూడదనీ నేను అనడంలేదు.

నిజం చెప్పాలంటే ఆసియా, ఆఫ్రికాఖండాలలో కొత్తగా స్వతంత్రమవుతూవున్న దేశాలలో చాలాదేశాలకు కాలం గడిచేకొద్దీ అమెరికన్ల వ్యవస్థలు, విధానాలు తగినవి కాకపోవచ్చు. ఒకవిషయం మాత్రం నిశ్చయం. భూస్వాములపై, వడ్డీ వ్యాపారస్థులపై ఆధారపడ్డ ప్రభుత్వాలు అభివృద్ధి విషయంలో విజయం సాధించలేవు.

అట్టి ప్రభుత్వాలకు మధ్యతరగతి ప్రజల మద్దతు వుండదు. కమ్యూనిస్టేతరులైన వామపక్షీయుల వత్తాసు వుండదు. అట్టి ప్రభుత్వాలు కమ్యూనిస్టులకు మార్గం సుకరంచేస్తాయి. వారు సంస్కరణవాదులుగా చెలామణీ అవుతూ అవకాశాన్ని బట్టి ఐక్యసంఘటనలు ఏర్పాటుచేస్తూ వుంటారు. అట్టి ప్రభుత్వాలను అమెరికా బలపరచి, చివరకు అవి పతనంకావడం సంభవిస్తే వాటితోపాటు అమెరికా ప్రతిష్ఠ, పలుకుబడికూడా దొర్లిపడిపోతాయి.

టర్కీదేశాన్ని ఒక తరంపాటు యేలిన అతాతుర్క్ ఒకనియంత. అయితే అతను కమ్యూనిస్టేతరవామపక్షానికి చెందినవాడు. అతనిపద్ధతులు కొన్ని అమెరికన్లకు సరిపడనివి. అయితే అతని ప్రభుత్వానికి ప్రజల అండదండలుండేవి. అందుచేత అవసరమైన సంస్కరణలను ప్రవేశపెట్టగలిగాడు. వాటిలో ప్రజలు పాల్గొనేట్టు ప్రోత్సాహమిచ్చాడు. ఇతోధిక ప్రజాస్వామికానికి పునాదులు వేయగలిగాడు. అటువంటి ప్రభుత్వం అమెరికాసహాయం పొందుటకు అర్హమైనది.

5. ఆర్థికసహాయం చేసేటప్పుడు ఆ దేశంయొక్క రాజకీయ ప్రాముఖ్యాన్ని

కూడా పరిగణనకు తీసుకోవాలి. దేశజనాభా, వైశాల్యం, సహజసంపదలు, ఇతర దేశాలపై దాని ప్రభావం, భౌగోళికంగా దాని ఉనికి—ఇవన్నీ దాని రాజకీయ ప్రాముఖ్యాన్ని నిర్ణయిస్తాయి.

ఈ కనీసప్రమాణాలనందుకోలేని దేశాలకు అమెరికన్ల ఆర్థికసహాయం లభించదని మర్యాదగా చెప్పాలి. అవి ఆంతరంగికంగా అభివృద్ధికి తగుప్రాతిపదిక యేర్పరచుకొంటేనే అమెరికాసహాయం పొందే యోగ్యత వాటికి వుంటుందని స్పష్టంచేయాలి.

అయితే దీని అర్థం వాటికి ఉ_త్తచెయ్యి చూపుదామని కాదు. వాటివిషయంలో కూడా అమెరికన్లు చేయవలసింది ఎంతో కొంత వుంది.

మొదట ఆ దేశాలకు సమగ్రమైన ఆర్థికాభివృద్ధి ప్రణాళికను సిద్ధంచేసే విషయంలో అమెరికన్లు తోడ్పడవచ్చు. ఆప్రణాళిక ఆ దేశాలు తమ సాధనసంప_త్తులను చక్కని వినియోగానికి తెచ్చుకొనేట్టు చేయగలదై వుండాలి.

ధనికుల కవసరమైన విలాసవ_స్తువుల దిగుమతిపై అదుపుపెట్టమని ఆ దేశాలకు అమెరికన్లు చెప్పాలి. అందువల్ల వాటికిగల కొద్దిపాటి విదేశీమారకద్రవ్యమును ప్రజలకవసరమైన వాటికి వినియోగించవచ్చు.

భూసంస్కరణలు ప్రవేశపెట్టమని ఆ దేశాలకు చెప్పాలి. ప్రవీణులపేర్లను సూచించాలి. జపాను, ఫార్మోజాలలో ప్రైవేటు భూమి యాజమాన్య కార్యక్రమమును అమలుపరచడంలో అమెరికా ప్రభుత్వప్రవీణులు ఎంతో కృషిచేశారు. అందువల్ల అక్కడి రైతులకు స్థిరత్వం లభించి వ్యవసాయోత్ప_త్తి బాగా అధికమైంది. గ్రామసీమలో ప్రజాస్వామ్యం వేళ్ళు తన్నుకుంది.

ప్రజలకు మేలుచేకూర్చే చిడిప్రాజెక్టులకు పెట్టుబడి పెట్టగలస్తోమతను అమెరికన్లు ఈదేశాలకు లభింపజేయాలి. అయితే ఆప్రాజెక్టులు దేశంమొ_త్తం ఆర్థిక వ్యవస్థపై ఆధారపడినట్టివి కాకూడదు.

ఉదాహరణకు దేశరాజధానిలో ఆధునిక ఆసుపత్రి నిర్మాణం. అందులో డాక్టర్లకు, నర్సులకు శిక్షణసౌకర్యాలు వుండాలి. గ్రామాలవారికి మందులిచ్చి కట్లు కట్టిపంపే ఔట్ పేషెంట్ విభాగం వుండాలి. అలాగే వి_స్తృతమైన విశ్వవిద్యాలయమో, వ్యవసాయ ప్రయోగ కళాశాలయో నిర్మింపజేయాలి.

కొన్ని రాజకీయప్రయోజనాలకుగానూ, పరిహారపూర్వకమైన ఆర్థికకారణా లకుగానూ, నిలిచిపోయిన సైనికసహాయానికి ఎంతో కొంత మద్దతుగానూ, ఒకా నొక సైనికస్థావరాన్ని అమెరికన్లు ఉపయోగించుకొంటున్నందుకు బాడుగగానూ ఏదో ఒకరూపంలో ఆర్థిక సహాయం చేయవలసిన అగత్యాన్ని నేనూ అంగీకరిస్తాను. ఇటీవల ఇట్టి సహాయం అతిగా పెరిగింది.

పరస్పరభద్రత అన్నమాటలో ఉభయుల భాగస్వామ్యం అనే అర్థంకూడా వుంది. దానివల్ల ప్రయోజనం చేకూరాలంటే అది రెండువైపులా పోయేదారిగల వీధికావాలి. సైనికరంగంలో పరస్పరభద్రతా కృషిని నిజమైన భాగస్వామ్య ప్రాతి పదికపై నిలిపేందుకు విదేశాలలోని అమెరికా ప్రతినిధులు దీక్షతో పనిచేయాలి.

* * *

అమెరికా విదేశీకార్యక్రమాల పథకరచనను, వాటిపాలనను నేను విమర్శిం చాను. నా విమర్శలో సైనికసహాయం, ఆర్థికసహాయం రెండూ చేరివున్నాయి. ఈ సందర్భంలో ఇరాక్ విషయం గమనించదగింది. అక్కడ జరిగిన సంఘటన లఘు క్లుప్తంగా సమీక్షించుకుంటే అమెరికన్ల దృక్పథం సైనికంగా కొంచెం తగ్గు స్థాయిలో వుండి, తక్కిన విషయాలలో వాస్తవికంగా వుండవలసిన అవసరం బోధపడగలదు.

1953, 1954 సంవత్సరాలలో అనేక సందర్భాలలో ఈజిప్టు వారు ఆయుధాలివ్వమని అమెరికాను అర్థించారు. అలా ఇచ్చినట్లయితే బలం విషయంలో ఈజిప్టు, ఇజ్రేల్ దేశాలమధ్యగల సమతూకానికి భంగంవాటిల్లి ఇరుగుపొరుగున వున్న ఆరెండు దేశాలమధ్య సంఘర్షణలు హెచ్చగల ప్రమాదముందన్న కారణంతో అమెరికన్లు ఈజిప్టుకు ఆయుధాలివ్వనిరాకరించారు.

అయితే 1954 వసంతఋతువులో ఇరాక్‌కు సైనికసహాయం పంపడానికి అమెరికా ప్రభుత్వం అంగీకరించింది. మరి ఇరాక్‌దేశం ఇజ్రేల్‌ను సర్వనాశనం చేస్తానని బెదిరించడమేగాక అరబ్‌దేశాలకు నాయకత్వం వహించే విషయంలో ఈజిప్టుతో పోటీపడుతూ స్పర్ధతెచ్చుకుంది.

ఇరాక్‌కు అమెరికాచేసే సైనికసహాయం అరబ్బుదేశాలలో బుద్ధిపూర్వకంగా చీలికలు తేవడానికి ఉద్దేశింపబడిందనీ, అలా సహాయంచేయడం ఈజిప్టు యోగ్య క్షేమాలను అలక్ష్యం చేయడమేననీ ఈజిప్టువారు వెంటనే నిరసనతెలిపారు. కాని వారి నిరసనలను త్రోసిపుచ్చారు.

ఇరాక్, ఇరాన్, పాకిస్తాన్ దేశాల సైనికశక్తిని టర్కీ-సైనికశక్తితో జోడించవలెనన్న ఉద్దేశంతో 1955 ఫిబ్రవరిలో బాగ్దాద్ ఒడంబడిక చేసుకోవడం జరిగింది. పర్షియన్ సింధుశాఖ వైపుగా సోవియట్ సైనికవిజృంభణ జరుగకుండా నిరోధించడమే ఆ ఒడంబడిక ఉద్దేశమని అన్నారు.

కాని బాగ్దాద్ ఒడంబడికవల్ల ఇరాక్‌కు అమెరికా ఆయుధాలు మరింతగా ఓడలలో రవాణాకాగలవని కైరోలో అరబ్ నాయకులు గ్రహించారు. వెంటనే మళ్ళీ తమ నిరసన తెలిపారు. దానిని కూడా తిరస్కరించడం జరిగింది. అప్పుడు ఈజిప్టు నాయకుడు నాసర్ తాను సోవియట్ యూనియన్‌తో సైనిక ఒడంబడిక చేసుకున్నట్లు నవంబరులో ప్రకటించాడు.

ఇట్టి కార్యకారణసంబంధంలో ఇవే ముఖ్యాంశాలు కావు. చిలికి చిలికి గాలివాన అయిందన్నట్లు వీటికితోడు మరికొన్ని అంశాలు,సంఘటనలు చేరి చివరకు బ్రిటన్, ఫ్రాన్సు, ఇజ్రేల్ దేశాలుకలిసి ఈజిప్టుపై దాడిచేశాయి. అదీ పర్యవసానం!

ఈకాలంలో ఇరాక్‌కు అమెరికా ఆర్థికసైనికసహాయం కుప్పతిప్పలుగా వచ్చిపడుతూ పోయింది. ఈసహాయానికితోడు ఇరాక్ ప్రభుత్వంనుండి లభించే నూనె ఆదాయంతో ఇరాక్ ఆర్థికంగా బాగుపడుతుందని ఈకార్యక్రమం అమలుకు బాధ్యులైనవారు కాంగ్రెసు సభకు నివేదిస్తూ వచ్చారు.

అయితే ఆ సహాయంవల్ల ఇరాక్ ప్రజలు ప్రత్యక్షంగా ఎంతమేలు పొందగలరో తెలుసుకొనే ప్రయత్నమేదీ జరగలేదు. క్రొత్తగా అమలుజరుపబడ్డ సాగునీటివనరుల కార్యక్రమాలవల్ల భూస్వాముల ఆదాయం బాగాపెరిగింది. కాని సేద్యదారులకు దక్కింది చాలా తక్కువ.

ఇరాక్ జాతీయోత్పత్తి త్వరితంగా పెరిగింది. కాని విలాస వస్తువుల దిగుమతిని అదుపులో పెట్టకపోవడంవల్లా, అభ్యుదయకరమైన పన్నుల విధానాన్ని ప్రవేశపెట్టకపోవడంవల్లా, భూసంస్కరణలను వాయిదావేస్తూ వచ్చినందువల్లా ఒక వైపు కొందరి ఆదాయాలు పెరిగి,మరొకవైపు పేదలకూ,ధనికులకూ గల వ్యత్యాసం మరింత అయింది. అమెరికన్లలో చాలామంది అనుకున్నట్లుగానే పరిస్థితి విషమించి అగ్నిపర్వతం బ్రద్దలై 1958 వేసవిలో కర్నల్‌కాశిం ప్రభుత్వం అధికారానికి వచ్చింది. ఇరాక్‌లో కమ్యూనిస్టుల పలుకుబడి హెచ్చింది.

ఇరాక్ ఉదాహరణనుబట్టి అగోచరమైన సైనికభద్రతను అన్వేషించడం

కోసం రాజకీయ ఆర్థిక స్థానికయథార్థాలను విస్మరించడంవల్ల అమెరికన్ల మంచి, అమెరికన్ల బాగోగులు ఏమయ్యేదీ గ్రహించవచ్చు.

ఇరాక్ వ్యవహారం, తదితర ఉదాహరణలు ఒక ప్రశ్నను అమెరికన్ల ముందుంచుతున్నవి. మరినేను ఇంతకు పూర్వం ప్రమాణాలసంగతి ప్రస్తావించి వున్నాను కదా. ఎవరి సదభిప్రాయం అమెరికన్లకు అత్యవసరంగా కావలసివున్నదో అట్టి దేశాల నాయకులపై ఆ ప్రమాణాల ఫలితమేమిటి? ఆప్రమాణాలు అందుకోలేని దేశాలు నాప్రతిపాదనను రాజకీయ జోక్యంగా ఎంచి ఆగ్రహం వెలిబుచ్చుతాయా?

అమెరికన్లు సహాయం చేస్తున్నారు కాబట్టి అమెరికాసహాయం పొందే దేశాలు ప్రచ్ఛన్నయుద్ధంలో అమెరికా నాయకత్వాన్ని అంగీకరించవలెనని ఒత్తిడి చేశారంటే అవి అమెరికన్లపై ఆగ్రహిచడం తథ్యం. కాని మోపెడు పన్నులు చెల్లించే అమెరికన్ ప్రజలు తమదేశం చేసే సహాయాన్ని తీసుకునే దేశం ప్రయోజనకరంగా, నీతి సమ్మతంగా వినియోగించబడవలెనని కోరడం అసమంజసమా?

ఆసియా ఆఫ్రికాలలో నాకుగల ప్రత్యక్ష అనుభవమునుబట్టి నాప్రతిపాదనను ఆ దేశాలు ఆమోదిస్తాయన్న నమ్మకం నాకుంది. అయితే ఈ ప్రతిపాదనను చతురులైన అమెరికన్ సంధానకర్తలు ఆయాదేశాల నాయకుల ముందుంచి వారికి నచ్చ జెప్పాలి. దీనికి కాంగ్రెసు సభ వారి గట్టి ఆదేశం వుండాలి.

నేను పెట్టిన ప్రమాణాలు దీర్ఘకాలం మీద చూస్తే తమకే ప్రయోజనకరమైనవని చాలా ప్రభుత్వాలు అంగీకరిస్తాయి. అలా వాటికి నచ్చచెప్పవచ్చు. ఈ ప్రమాణాలు ఆ దేశాలలోని అభివృద్ధి నిరోధకులు నిర్మాణాత్మక సంస్కరణలకు అడ్డు తగులకుండా తగుసాధనంగా ఉపకరిస్తాయి.

కాబట్టి ఏ ప్రాతిపదికపై అమెరికన్లు సాంకేతికసహాయాన్నీ, అభివృద్ధి ఋణాలనూ పంపిణీచేయాలని ఉద్దేశిస్తున్నారో ఆ ప్రాతిపదికను పరస్పరభద్రత బిల్లు స్పష్టంగా నిర్వచించాలని కోరుతున్నాను.

నేను చెప్పిన ఈమార్గం కాంగ్రెసు సభవారు ఆమోదించేట్టయితే అమెరికన్ల పరస్పర భద్రతా కార్యక్రమం తాత్కాలికమైన ప్రచ్ఛన్న యుద్ధంకన్న విశేష ప్రాముఖ్యం కలదనీ, అన్నిదేశాల ప్రజలూ వారు ఎన్నుకున్న ప్రభుత్వాల క్రింద శాంతి సౌభాగ్యాలు విలసిల్లునట్టి ప్రపంచంలో నివసించే అవకాశాన్నిచ్చే దీర్ఘకాలిక కార్యక్రమం అమలుకు అమెరికన్లు కృతనిశ్చయులై పురోగమిస్తున్నారనీ లోకానికి చాటగలుగుతారు.

# 21

# విదేశాలలో ఆహారకోశములు ఏర్పడాలి

అమెరికా వ్యవసాయోత్పత్తిలో మిగులు ఉత్పత్తులను ప్రపంచంలో ఆకలితో అలమటించే ప్రజలకు ఎలా వినియోగించవచ్చు అన్న విషయమై సెనేటు విదేశసంబంధాలసంఘం ప్రముఖుల వాఙ్మూలాలు తీసుకుంది. శ్రీ బౌల్స్ 1959 జులై 8 తేదీన వాఙ్మూలమిస్తూ అభివృద్ధిచెందుతూ వున్న దేశాలలో ఆహారకోశములను ఏర్పాటుచేయాలని సూచించారు.

భవిష్యత్తులో చరిత్రకారులు వెనక్కు తిరిగి అమెరికాతరాన్ని పరిశీలించినట్లయితే ఆశ్చర్యకరమైన అనేక అంశాలను గమనిస్తారు. కాని అన్నిటికన్న విపరీతమేమిటంటే—ఒకవంక ప్రపంచంలో ఆకలిబాధ, రాజకీయసంక్షోభం, శాంతికి ముప్పు వుండగా మరొకవంక అమెరికా దాదాపు పదిలక్షలకోట్ల డాలర్ల విలువచేసే మిగులు వ్యవసాయోత్పత్తులను దగ్గిరపెట్టుకొని తమాషా చూస్తూ వుండడం.

ఇరవయ్యోశతాబ్ది అర్ధభాగమైన ఈదశలో భగవంతుడు అమెరికన్లకు ప్రసాదించిన వ్యవసాయోత్పత్తి అమెరికన్లకు భారంగా తోస్తూవుంది. తక్కిన ప్రపంచంలో ఆహారం కొరత వుంది. దాదాపు ప్రతిదేశమూ ఆహారాన్ని దిగుమతి చేసుకొంటున్నది. లేకపోతే తిండికి కటకటే!

సోవియట్ రష్యా ఎదుర్కొనే పెద్ద ఆర్థికసమస్య ఏమిటీ అంటే— ఆహారం, నార. ఈనాడు కమ్యూనిస్టు చైనా ప్రభుత్వాన్ని పడగొట్టగలిగింది ఆహారసమస్యే. చైనావాళ్ళు ఒక్కొక్క కుటుంబానికి 1.7 ఎకరాలచొప్పున తమ ప్రజ

లందరికీ తిండిపెట్టాలని ప్రయత్నిస్తున్నారు. కాని అపారమైన ఉత్పత్తిగల అమెరికన్లు వారికి పండేపంటను ఏమిచేయడమా అని ఆలోచిస్తున్నారు.

1933 లో అమెరికాలో జనం పనులులేక నిరుద్యోగులై తగినంత తిండి లేక బలహీనులై, 1 కోటి 60 లక్షలమంది కార్మికులు స్టోర్సులకేసి దీనంగా చూస్తూ వీధులంట పడిపోతూవుండేవారు. స్టోర్సులలో ఆహారము, ధాన్యాలు నిలువ వుండివుండి చెడిపోతూ వుండేవిగాని వాళ్ళకు పిసరంతకూడా ఇచ్చేవారు కాదు. కనుక ఆనాడు అమలులో వున్నవి "ఇనుప ఆర్థికసూత్రాలు" అని అర్థశాస్త్రవేత్తలన్నారు. సరిగ్గా అట్టి పరిస్థితే ఈనాడు ప్రపంచమంతటా వుంది. దీనినే అమెరికన్లు ఎదుర్కొంటున్నారు.

అమెరికన్లు ఎన్నుకున్న ప్రభుత్వం ఈదుర్నీతినీ, ఈవైపరీత్యాన్నీ గమనించింది. దీన్ని ఎలా నివారించడమో తెలియకుండా ఏవో ప్రయోగాలు చేస్తూ వచ్చారు. పరిష్కారాలను ఊహించుకున్నారు. చివరకు "ఇనుప ఆర్థికసూత్రాల"ను తిరిగివ్రాయడం నేర్చుకున్నారు. సమృద్ధికీ అక్కరకూ పొత్తుకుదర్చడం అలవాటు చేసుకున్నారు.

ఇప్పుడు మానవాళిలో మూడింట రెండువంతులమందికి కడుపునిండా తిండి లేదు. అమెరికన్లు ఆహారధాన్యాల నిలువలుపెట్టుకొని కులుకుతున్నారు. వాటికి మార్కెట్ లేదు. 1933 లో సంపత్సమృద్ధులమధ్య అమెరికా ప్రజలు ఆకలితో అలమటించిన సంఘటనను తలచుకొని ఇప్పు డెలా విస్తుపోతున్నారో అలాగే కొన్నేండ్ల తర్వాత నేటిపరిస్థితిని జ్ఞప్తికి తెచ్చుకొని నివ్వెరపోతారు.

ఏమైనప్పటికీ నేటి అమెరికన్ల భారాన్ని ఇకనైనా పెట్టుబడిసొమ్ముగా మార్చుకోవాలి. ఇప్పటికే కాలాతీతమైంది. ఇప్పుడు మీ సంఘంవారి ముందున్న బిల్లు దాన్ని సాధించడానికే ఉద్దేశింపబడింది. ఈ బిల్లులోని 5 వ స్వత్వము నిర్మాణాత్మకమైంది. (దీనినే శాంతికొరకు అంతర్జాతీయ ఆహారబిల్లు-1959 అని వ్యవహరించారు.) జాతీయ ఆహారకోశములను నెలకొల్ప సంకల్పించిన ఈ ఆశయం చాలా ముఖ్యమైంది.

వివిధదేశాలలో ఏర్పాటుచేసిన ఆహారనిలువల విషయాన్ని అమెరికా ప్రభుత్వంవారూ, ఐక్యరాజ్యసమితివారూ చర్చించి వున్నారు. అయితే దీన్ని తగు రీతిగా అమెరికన్లు తేల్చవలసివున్నది.

ఇది కేవలం నైతికసమస్యమాత్రమే కాదు. ఆర్థిక ప్రతిష్టంభనకూడా. అమెరికన్లు నిలువచేసిన ఆహారపదార్థాలను వాడకానికి తేకపోతే వ్యర్థమవుతాయి. అంటే ఉపయోగపడగల సొమ్మును వృథాచేస్తున్నారన్నమాట. అవిచెడిపోకుండా నిరోధించడం అదొక పెద్దసమస్య. ఆయేటికాయేడు కొత్త పంట వచ్చేకొద్దీ నిలుపచేయడమెలా అన్న సమస్య అమెరికన్లని ఎదుర్కొంటుంది.

మంచి రసపట్టులో వున్న స్థితికి రసపట్టువుండగల పరిష్కారమే కావాలి. ఇప్పుడు కావలసింది మాటలుకావు; క్రియ.

కనుక అమెరికన్ల మిగులుధాన్యాలలో సగభాగాన్ని విదేశాలలోని గిడ్డంగులకు చేర్చి అక్కడవాటిని నిలవచేసి వుంచాలి. అవి కరువుకాటకాలనెదుర్కోగలుగుతవి. అంతేగాక అమెరికన్లవద్ద ఆహారం వున్నంతవరకూ ఎవరూ ఆకలితో అలమటించనక్కరలేదని అమెరికన్లు స్పష్టపరచినట్లు కూడా అవుతుంది.

ఒక్క భారతదేశంలోనే 30 లేదా 40 గిడ్డంగులు పెట్టవచ్చు. పాకిస్తాన్‌లో పదిచాలు. తక్కినవి మధ్యప్రాచ్యం, ఉత్తర ఆఫ్రికా, ఇండోనీషియా, లాటిన్ అమెరికా ప్రాంతాలలో పెట్టవచ్చు.

ఇట్టి నిర్మాణాత్మక కృషివల్ల అమెరికన్లకు డబ్బుఖర్చు తప్పుతుంది. అమెరికాదేశంలో మూడేళ్ళపాటు నిలువచేయడానికయ్యే ఖర్చుకన్న మిగులు ధాన్యాలను ఓడలలో అక్కరపడ్డ దేశాలకు రవాణాచేయడానికయ్యే ఖర్చు చాలా తక్కువ. ఈ లెక్కలన్నీ నేను పరిశీలించాను. దీనివల్ల రెండవ యేటినుంచీ అమెరికన్లకు డబ్బు పొదుపుకాగలదు.

కనుక అమెరికన్ల మిగులుధాన్యంలో సగాన్ని విదేశీ ఆహారకోశములలో నిలువచేయాలి. ఈకోశములను తగుజాగ్రత్తతో నిర్మించినట్లయితే అవి చెడకుండా వుంటాయి. అమెరికాదేశంలో నిలువచేసుకున్నా చెడకుండా వాటిని కాపాడవలసిన భారం అమెరికామీదే వుంటుంది కదా! అలా నిలువచేసిన తర్వాత ఆయాప్రభుత్వాలతో తగు ఒప్పందాలు చేసుకొని వాటిప్రకారం ఆధాన్యాన్ని స్థానికావసరాలకు వాడుకోనివ్వాలి.

అట్టి ఒప్పందంలో ఆదేశంలో నిజంగా పంటలు దెబ్బతిని ఉత్పత్తి తగ్గితే అప్పుడు నిలువధాన్యాన్ని వినియోగించే అవకాశం ముఖ్యమైంది. ఆహారకొరతయేర్పడి ధరలుమిన్నంటి క్లిష్టమైన ద్రవ్యోల్బణసమస్య ఏర్పడేట్టు వుంటే వెంటవే

అమెరికా నిలవలను వాడుకోనివ్వాలి. దేశంలో పుష్టికరమైన ఆహారం లభించక జనం ఆరోగ్యం చెడేట్టుంటే కూడా అమెరికానిలవలను వాడాలి.

ప్రపంచమంతటా అమెరికా ఇట్టి ఆహారకోశములు ఏర్పాటుచేసిందంటే అవి అమెరికాలోని ఆహారసమృద్ధికీ, వాటివల్ల మేలుపొందే క్షుధార్తులకూ మధ్య సరఫరా శ్రేణులుగా వుంటాయి. ఇట్టి సరఫరాకు అమెరికన్ నౌకలు అవసరమైతే వాడవలసిందేగాని వెనుదీయరాదు.

ఈ బిల్లులోని 5 వ స్వత్వమును నేను సూచించినరీతిగా విస్తృతపరచి అమలుపరిస్తే కోట్లాది ప్రజలకూ, వారి సంతతికీ ఆకలివల్ల, కరువుకాటకాలవల్లా పీడనకు గురికాకుండా అభయమిచ్చినవారవుతారు. ఈ అరిష్టాలు చరిత్ర ఆది నుంచీ మానవజాతిని పీడిస్తున్నాయి.

ఇంతకన్న అమెరికన్లు చేయగల ప్రయోజనకరమైన కార్యం మరొకటి లేదు. ఈపని జరిగితే అమెరికా విదేశాంగ విధానానికి నూతన జవసత్వాలు చేకూరుతాయి.

# 22

# గ్రామాభివృద్ధి : ప్రజాస్వామ్యానికి ఆయువుపట్టు

అమెరికా చేసే ఆర్థికాభివృద్ధి సహాయానికి ప్రధానలక్ష్యం ఇరవయ్యో శతాబ్దిలో మానవాళికి కలిగిన మేళ్ళను గ్రామసీమలలో నివసించే అధిక సంఖ్యాకులైన పేద ప్రజలకు అందుబాటులోకి తేవడమై వుండాలని శ్రీ బౌల్స్ 1962 మే 24 తేదీన వాషింగ్టన్‌లో పరిరక్షణ విషయమై ఏర్పాటుచేయబడ్డ వైట్‌హౌస్ సమావేశంలో ప్రబోధించారు.

అమెరికా చరిత్రలో రెండు శాసనాలు అత్యంత ప్రధానమైనవి. ఒకటి—హోమ్‌స్టీడ్ చట్టం (1862 మే 20): రెండవది—మోర్రిల్ ల్యాండ్ గ్రాంట్ కాలేజీచట్టం (1862 జులై 2). ఈ రెండు చట్టాలు అమలులోకి వచ్చి నూరేండ్ల కాలమైంది. ఈ సంవత్సరం వాటి నూరవ వార్షికోత్సవం జరుపుకుంటున్నారు. ఈ శాసనాలు అమెరికా చరిత్ర గతినే మార్చివేశాయి.

భౌతికాభివృద్ధిరీత్యా చూస్తే ఈ శాసనాలు అమెరికన్ల జాతీయప్రగతికి చాలా ముఖ్యమైనవి. కాని వీటి అసలుప్రాముఖ్యం మరొకటి వుంది. ఇవి అమెరికన్ల జాతి స్వభావాన్ని రూపొందించినవైనను, వ్యక్తిపట్ల అమెరికన్లకు గల గౌరవ భావాన్ని ఇవి ఇనుమడింపజేసినతీరు గమనింపదగ్గవి.

తాను సేద్యంచేసుకొనే భూమిపై రైతుకు హక్కువుండడము, ప్రభుత్వం

పౌరులకు-విద్యాసౌకర్యం కలిగించి వారిని ప్రయోజకులుగా తీర్చిదిద్దడము—ఇవి రెండూ అమెరికా సంప్రదాయంలో ఎప్పటినుంచో ముఖ్యాంశాలుగా వున్నాయి.

కుటుంబ వ్యవసాయక్షేత్రం, కౌంటీ ఏజెంటు, గ్రామపాఠశాల, ప్రజల స్వయంసహాయకవ్యవస్థ, అధికసంఖ్యాకులకు అధికశ్రేయస్సును సమకూర్చే విధంగా సాధనసంపత్తులను వినియోగించడం, ప్రజాసేవకుద్దేశింపబడ్డ విశ్వవిద్యాలయం—ఇవన్నీ ప్రజాస్వామ్యభావాలు బాగా వేళ్ళుతన్నుకొంటేనే ఏర్పడేవి. ఆ భావాలు ఈనాటివా? వలసకాలపునాటివి!

అమెరికారైతులు ఒక ఆశయం ధర్మబద్ధమైనదని విశ్వసించారంటే దాని కోసం పోరాడుటకెన్నడూ వెనుదీయలేదు. ప్రభుత్వం తలపెట్టిన అన్యాయాన్నీ, బ్యాంకర్ల పీడననూ, రవాణాసంస్థల అక్రమాలనూ నిరసించి ఎదిరించడం అమెరికా గ్రామసీమల-సంప్రదాయం.

నూరేండ్ల క్రితం శాసనాల రూపంలో వ్యక్తమైన నీతిసూత్రాలూ, అన్యాయానికి వ్యతిరేకంగా గొంతెత్తగల అమెరికారైతుల అభీష్టమూ నేడు అభివృద్ధి కోసం అర్రులు చాస్తూవున్న ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాదేశాలకు అన్వయిస్తాయా?

అన్వయిస్తాయనే నేను అనుకుంటున్నాను. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో అమెరికావిధానం విజయవంతం కావడానికి అవి కీలకాలుగా వుంటాయని నా నమ్మకం. దీన్ని పూర్వకథగా పెట్టుకొని అమెరికన్లని ఎదుర్కొనే సవాలును పరిశీలించాలి.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్, అమెరికాలలో అలజడి అంటే అమెరికావాసులు చాలామందికి చప్పునస్ఫురించేవి నిబంధనలను ఉల్లంఘిస్తూ నినాదాలుచేస్తూ విద్యార్థులు తీసే ఊరేగింపులూ, కార్మికుల నిరసన ప్రదర్శనలూ మాత్రమే. అయితే ఈఖండాల భవిష్యత్తును నిర్ణయించే వారు దూరంగా గ్రామసీమలలో నివసించే ప్రజలు. జనాభాలో నూటికి 80 మంది వారే!

ఈమూడు ఖండాలలో అధికసంఖ్యాకులుగా వున్న రైతులు రెండు కారణాలచేత చాలా ముఖ్యులని చెప్పాలి. ఒకటి: రాజకీయాధికారం ఎన్నటికైనా వీరిదే. రెండవది: వీరే ఉత్పత్తిదార్లూ, వినిమయదార్లూ కాబట్టి ఆర్థికవ్యవహారాల్లో వీరి పాత్ర ముఖ్యమైంది.

అభివృద్ధిపథంలో వున్న దేశజనాభాలో నాలుగింట మూడువంతులమందికి రాజకీయ భాగస్వామ్యమూ, వ్యక్తిగతగౌరవమూ ఇవ్వనంతవరకూ వారు విద్రోహానికీ, వ్యాకులమునకూ ఆస్కారమిస్తారు. ముఖ్యమైన నిత్యజీవితావసరవస్తువులు తప్ప అంతకుమించి కొనగల తాహతు వారికి లేకపోతే పట్టణకేంద్రాలలోని పారిశ్రామిక ఉత్పత్తి అంతా అణగివుంటుంది.

ఈదేశాలలోని గ్రామసీమలు కొన్ని శతాబ్దాలనుంచీ ఆర్థికంగా, రాజకీయంగా భూస్వాముల అధికారంక్రింద, వడ్డీ వ్యాపారస్థుల చెప్పుచేతల్లో వున్నవి. వారిదే రాజ్యం. ఇప్పటికీ సేద్యదారు తాను పండించినపంటలో అయిదింట మూడువంతులు కౌలుక్రింద భూస్వామికి ఇచ్చుకోవలసినవాడవుతున్నాడు. ఇక వడ్డీ వ్యాపారస్థులు రైతులకిచ్చే అప్పులపై ఏటా నూటికి 30 వరకు వడ్డీలున్నాయి!

అయితే ఈస్థితిగతులు అక్రమమైనవని అంతటా ప్రజలు భావిస్తున్నారు. ఎదిరిస్తున్నారు. దారిద్ర్యం, అవిద్య దేవుడిచ్చినవికావనీ, మానవుడు తెచ్చిపెట్టిన దొసగులేననీ, మానవప్రయత్నంతో వాటిని జయించాలనీ ఇప్పుడిప్పుడే ప్రజలు తెలుసుకొంటున్నారు.

అభివృద్ధికృషి తాబేటినడకగా వుండటానికీ, కొత్తప్రభుత్వాలు ఈసవాలును సరిగా ఎదుర్కోలేకపోవడానికీ అనేకకారణాలున్నాయి. త్వరగా పరిశ్రమలు ఏర్పరచుకోవాలని అతిగా వేకారడం. ప్రజలసంగతీ విధులసంగతీ సరిగా పట్టించుకోకపోవడం ఒక ముఖ్యకారణమని చెప్పాలి.

ఆధునిక సమాజాలకు పరిశ్రమలు అవసరమే. అట్టి పారిశ్రామికాభివృద్ధిని ప్రోత్సహించడం అమెరికన్లుచేసే ఆర్థికసహాయం ముఖ్యలక్ష్యాలలో ఒకటై వుండాలి. కాని అమెరికాచరిత్రనే అమెరికన్లు ఒకమారు పరికిస్తే పారిశ్రామికాభివృద్ధి మాత్రమే చాలదని విశదమవుతుంది. సమాజం రాజకీయంగా స్థిరత్వంగలది కావాలంటే గ్రామసీమల పునాది గట్టిదై వుండాలి. అట్టి పునాదే జాతీయాభివృద్ధి అనే పెద్దపాయలోకి అధికసంఖ్యాకులైన రైతాంగం అనేపాయను తీసుకొస్తుంది.

అందుచేత అమెరికా సహాయకార్యక్రమంలో పట్టణాభివృద్ధికీ, గ్రామాభివృద్ధికీ సమతూకం ముఖ్యాంశం కావాలి. లేకపోతే పరిశ్రమలపై, విద్యుచ్ఛక్తిపై, రేవులపై, రవాణాపై ఎన్నికోట్లు ఖర్చుపెట్టినా అమెరికాలక్ష్యం నెరవేరదు.

ఒక్కొక్కదేశం ఒక్కొక్క అభివృద్ధిదశలో వుంది. వాటి వాటి ప్రత్యేక

సమస్యలువేరు. కనుక కలిపికొట్టరా కావేటిరంగా అని అన్నిటినీ కలిపి చెప్పడం ప్రమాదకరమే. అయినా అమెరికా అనుభవాన్నిబట్టీ, జపాను తదితరదేశాల అనుభవాన్నిబట్టీ సమతూకంవుండే గ్రామాభివృద్ధి విషయంలో నేర్చుకోవలసిన గుణపాఠాలు కొన్ని ఉన్నాయి. ఈ గుణపాఠాలను ఏడు శీర్షికల క్రింద పర్గీకరించవచ్చు.

1. పాతసమాజాన్ని ఆధునికం చేయడమంటే అది కొంత విచ్ఛిన్నకర కార్యమే. కనుక పారిశ్రామికాభివృద్ధికి సమతూకంలేని ప్రాముఖ్యమిస్తే పట్టణాలలోనూ, గ్రామసీమలలోనూ రాజకీయ అశాంతి హెచ్చుతుందేగాని తగ్గదు.

అసలు జాతీయాదాయం పెరిగినందువల్లనే రాజకీయస్థిరత్వం హెచ్చుతుందనడానికి తగు సాక్ష్యాధారంలేదు. ఉదాహరణకు లాటిన్ అమెరికాను తీసుకోండి. అక్కడ వెనిజులాదేశంలో తలసరి సగటునవెరపి మొత్తం జాతీయోత్పత్తి 1,000 డాలర్లకుమించే వుంటుంది. కాని బొలీవియాదేశంలో 55 డాలర్లుమాత్రమే. అంటే ఒకటి మరీహెచ్చు; రెండవది మరీతగ్గు. మరి ఈరెండు దేశాల రాజకీయస్థిరత్వాన్ని జాతీయాదాయాన్నిబట్టి పోల్చడానికి వీలేలేదు. లాటిన్ అమెరికా ప్రాంతంలోనే క్యూబాదేశం బతిస్తాపాలన క్రింద వున్నప్పుడు అక్కడి తలసరి సగటు ఆదాయం ఆప్రాంతదేశాలలో రెండవ స్థానమాక్రమించి వుండేది.

ఈ అంశాలనుబట్టి ఒకవిషయం స్పష్టమవుతూ వుంది. ఏమిటంటే క్రమబద్ధమైన రాజకీయ పురోగతికి ఆర్థిక ప్రగతిమాత్రమేగాక సాంఘిక పురోగమనం, రాజకీయసంస్కరణలు కూడా అవసరమే.

2. అందుచేత సమగ్రమైన భూసంస్కరణల కార్యక్రమం రాజకీయంగా, ఆర్థికంగా అత్యవసరమైనది. తాను సాగుచేసే భూమిపై యాజమాన్య హక్కులేని రైతు ఉత్పత్తిని పెంచుటకు కష్టించి పనిచేయడు. పొలంలో ఎక్కువసేపు వుండనే వుండడు. మంచి పెద్దర లాలోచించడు. కౌలుదారుకు ఏమి శ్రద్ధవుంటుంది? ఉదాసీనంగా వుంటాడు.

కనుక జమీందారీలు, జాగీర్దారీలు, ఇతర భూస్వాముల ఎస్టేట్లను రద్దు చేయాలి. ఆభూములను సాగుచేసే వారికి పంపిణీచేయాలి. అయితే వాటిపూర్వపు యజమానులకు న్యాయబద్ధమైన పరిహారమివ్వాలి.

3. గ్రామీణ సమాజస్థిరత్వానికి దేశమంతటా రైతులకు భూయాజమాన్య హక్కు అవసరమైనప్పటికీ అది ఒక అంశం మాత్రమే. దానికితోడు సామాజికాభి

వృద్ధి కార్యక్రమానికి హెచ్చుప్రాధాన్యమివ్వాలి. అందులో వ్యవసాయవిస్తరణసేవ ముఖ్యమైనది. మేలురకం విత్తనాలు, సేద్యపుపనిముట్లు, రసాయనిక ఎరువులు, క్రిమిసంహారకద్రవ్యాలు రైతులకు లభింపజేయాలి. సాగునీటిని రైతులు మరింత ప్రయోజనకరంగా వాడేట్టుచేయాలి.

భూసంస్కరణలతోపాటు ఇటువంటి సామాజికవిస్తరణ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టకపోతే ఉత్పత్తిపెరగదు. తగ్గుతుందేమో కూడా! అట్టి కార్యక్రమమే వుంటే జపాను దేశంలోలాగా ఎకరాసగటుదిగుబడి తప్పకుండా హెచ్చుతుంది.

సామాజికాభివృద్ధి కృషిలో ఒకభాగంగా స్థానికులు చొరవతీసుకొని పాఠశాలలు పెట్టుకోవాలి. తలా ఇంత కాయకష్టంచేసి రోడ్లువేసుకోవాలి. ఆరోగ్య ప్రమాణాలను పెంచుకోవాలి. గ్రామ స్వపరిపాలనను అమలులోకి తెచ్చుకోవాలి.

ఈవిషయంలో ప్రత్యక్షంగా సాధించిన అభివృద్ధికన్న దాన్ని సాధించడానికి అవలంబింపబడే విధానాలు ముఖ్యమైనవి. ఉదాహరణకు మట్టిగోడలతోనే ఒక పాఠశాలను గ్రామస్థులు నిర్మించుకున్నారనుకోండి. లేదా, గ్రామంనుంచి పెద్ద రోడ్డును కలిపే రహదారి వేసుకున్నారనుకోండి. మనం కూడా గ్రామాభివృద్ధిని సాధించాం కదా! ఇలా సాధించడంవల్ల సమాజాభివృద్ధి కృషిలో తామూ భాగస్వాములయ్యామన్న భావం పల్లె ప్రజలకు కలుగుతుంది. రేపు మరోక పనిని చేపట్టుతారు. అలా దేశం బాగుపడుతుంది.

అలా కాకుండా ప్రభుత్వం తన డబ్బుతో ఒక పక్కా పాఠశాలను నిర్మించిందనుకోండి. లేదా గ్రామస్థుల ప్రమేయం లేకుండానే ఒకరోడ్డు వేయించిందనుకోండి. అందువల్ల గ్రామంలో కదలికరాదు. గ్రామస్థులు స్వయంగా పాల్గొని ఇలాంటివి నిర్మించుకుంటే గ్రామం ఒక క్రమబద్ధమైన రాజకీయ ధోరణిలో పురోగమిస్తుంది.

4. గ్రామీణ సామాజికాభివృద్ధిలో గ్రామీణపరపతి విధానం ముఖ్యమైంది. తక్కువ వడ్డీలతో గ్రామస్థులకు అప్పులు లభించేట్టు చేయాలి. ఈ విధానంవల్ల రైతులు వడ్డీవ్యాపారస్థులను ప్రాధేయపడవలసిన అవసరంవుండదు. సరసమైన వడ్డీకి సులభంగా అప్పులు తీసుకొని తమకు కావలసిన రసాయనిక ఎరువులను, పనిముట్లను కొనుక్కోగలుగుతారు.

5. వ్యవసాయోత్పత్తులను విక్రయించే సహకార సంఘాలను ప్రజాస్వామిక పద్ధతిపై ఏర్పాటుచేయాలి. ఈ సంఘాలవల్ల మధ్యదళారీల లాభాలు అంతరిస్తాయి. వాడకందార్లు చెల్లించే ధరలో ఉత్పత్తిదారైన రైతుకు హెచ్చు వాటా ముట్టుతుంది. జపానుదేశంలో ఇట్టి మార్కెటింగ్ సహకార సంఘాలు 19000 వున్నాయి.

6. అభివృద్ధిజెందే దేశాలు వాటిమిలిటరీ బడ్జెట్లలో కొంతభాగాన్ని ఇంజనీరింగ్ దళాలను ఏర్పాటుచేయడానికి వినియోగించేట్టు ప్రోత్సహించాలి. ఆదళాలు అమెరికాసైనిక ఇంజనీర్లదళం నమూనాలో వుంటే మంచిది. ఇట్టిదళాలు వంతెనలు, రోడ్లు, పాఠశాలలు, వైద్యాలయాలు నిర్మించడంలో ముఖ్యపాత్ర వహించడంతోపాటు గ్రామీణులతో సన్నిహిత సంబంధాలు నెలకొల్పుకోగలుగుతాయి. గ్రామీణుల స్వాతంత్ర్యాన్ని పరిరక్షించడానికే కదా వారు కృషిచేసేది!

7. ఇక అభివృద్ధి చెందుతూవున్న దేశాలు ఎట్టిదొసగులూలేని గ్రామాలనూ, గ్రామజీవితాన్నీ సృష్టించుకునేందుకు అమెరికన్లు సహాయం చేసేటప్పుడు అమెరికన్ల వ్యవసాయానుభవాన్ని ఆదేశాలపై రుద్దప్రయత్నించకూడదు. అది అమెరికన్లకు లాభం చేకూర్చివుండవచ్చు. కాని ఇతరులకు కూడా లాభకరమవుతుందని నమ్మకమేమిటి? ఎవరి అనుభవం వారిదే! అమెరికన్లు ఈవిషయం బాగా గుర్తు పెట్టుకోవాలి.

ఉదాహరణకు అమెరికా వ్యవసాయక్షేత్రాలలో ఖరీదైన ఆధునిక యంత్ర సామగ్రి వాడబడుతూవుంది. కూలీ జనానికిచ్చే డబ్బును తగ్గించడానికే ఆయంత్రాలు వాడబడుతూ వున్నవి. కాని ఎకరాపంట దిగుబడిని హెచ్చించే ఉద్దేశంతో వాడబడటం లేదు. అసలు అమెరికాలో కూలీలు దొరకడం సులభమా?

ఆఫ్ఘనిస్తాన్‌లో, ఆఫ్రికాలోని కొన్ని క్రొత్తదేశాలలో జనాభాతక్కువ. వాటిలో వ్యవసాయ యంత్రసామగ్రి ఉపయోగం హెచ్చు. కాని భారతదేశం, పాకిస్తాన్, సింహళము, తక్కిన ఇతరదేశాలలో గ్రామాలలో వ్యవసాయ కూలీలు హెచ్చుగా వున్నారు. వారిలో చాలామందికి ఏడాది పొడుగునా చేతినిండా పనే వుండదు. అట్టిదేశాలలో మామూలు పనిముట్లతో, ఎద్దులతో, దున్నలతో సేద్యపు పనులను చాలా తక్కువ ఖర్చుతో చేయవచ్చు.

నిజానికి ప్రపంచం మొత్తంలో వరి, గోధుమ, కాయగూరల అత్యధిక దిగుబడి జపాను ఈజిప్టుదేశాలలోని మూడెకరాలలో, లేదా నాలుగెకరాలలో వుండే

వృద్ధి కార్యక్రమానికి హెచ్చుప్రాధాన్యమివ్వాలి. అందులో వ్యవసాయవిస్తరణసేవ ముఖ్యమైనది. మేలురకం విత్తనాలు, సేద్యపుపనిముట్లు, రసాయనిక ఎరువులు, క్రిమిసంహారకద్రవ్యాలు రైతులకు లభింపజేయాలి. సాగునీటిని రైతులు మరింత ప్రయోజనకరంగా వాడేట్టుచేయాలి.

భూసంస్కరణలతోపాటు ఇటువంటి సామాజికవిస్తరణ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టకపోతే ఉత్పత్తిపెరగదు. తగ్గుతుందేమో కూడా! అట్టి కార్యక్రమమే వుంటే జపాను దేశంలోలాగా ఎకరాసగటుదిగుబడి తప్పకుండా హెచ్చుతుంది.

సామాజికాభివృద్ధి కృషిలో ఒకభాగంగా స్థానికులు చొరవతీసుకొని పాఠశాలలు పెట్టుకోవాలి. తలా ఇంత కాయకష్టంచేసి రోడ్లువేసుకోవాలి. ఆరోగ్య ప్రమాణాలను పెంచుకోవాలి. గ్రామ స్వపరిపాలనను అమలులోకి తెచ్చుకోవాలి.

ఈవిషయంలో ప్రత్యక్షంగా సాధించిన అభివృద్ధికన్న దాన్ని సాధించడానికి అవలంబింపబడే విధానాలు ముఖ్యమైనవి. ఉదాహరణకు మట్టిగోడలతోనే ఒక పాఠశాలను గ్రామస్థులు నిర్మించుకున్నారనుకోండి. లేదా, గ్రామంనుంచి పెద్ద రోడ్డును కలిపే రహదారి వేసుకున్నారనుకోండి. మనం కూడా గ్రామాభివృద్ధిని సాధించాం కదా! ఇలా సాధించడంవల్ల సమాజాభివృద్ధి కృషిలో తామూ భాగస్వాములయ్యామన్న భావం పల్లె ప్రజలకు కలుగుతుంది. రేపు మరొక పనిని చేపట్టుతారు. అలా దేశం బాగుపడుతుంది.

అలా కాకుండా ప్రభుత్వం తన డబ్బుతో ఒక పక్కా పాఠశాలను నిర్మించిందనుకోండి. లేదా గ్రామస్థుల ప్రమేయం లేకుండానే ఒకరోడ్డు వేయించిందనుకోండి. అందువల్ల గ్రామంలో కదలికరాదు. గ్రామస్థులు స్వయంగా పాల్గొని ఇలాంటివి నిర్మించుకుంటే గ్రామం ఒక క్రమబద్ధమైన రాజకీయ ధోరణిలో పురోగమిస్తుంది.

4. గ్రామీణ సామాజికాభివృద్ధిలో గ్రామీణపరపతి విధానం ముఖ్యమైంది. తక్కువ వడ్డీలతో గ్రామస్థులకు అప్పులు లభించేట్టు చేయాలి. ఈ విధానంవల్ల రైతులు వడ్డీవ్యాపారస్థులను ప్రాధేయపడవలసిన అవసరంవుండదు. సరసమైన వడ్డీకి సులభంగా అప్పులు తీసుకొని తమకు కావలసిన రసాయనిక ఎరువులను, పనిముట్లను. కొనుక్కోగలుగుతారు.

ఆశలుడిగి అలా జీవచ్ఛవంలా వున్నాడే
అతనిలో ఏడ్పుకూడా నశించిందే!
స్వాములారా, బాబులారా,
దేశదేశాల పాలకులారా,
భవిష్యత్తు ఈ అబ్బిని
ఏమని భావిస్తుంది?
విప్లవపు సుడిగాలులు
తీరాలనన్నిటినీ ఊపినప్పుడు
అతను అడిగే మూర్ఖపుప్రశ్నకు
ఏమని సమాధానం చెబుతారు?
రాజులూ రాజ్యాలూ ఎలా?
అతన్ని ఆస్థితికి తెచ్చిన వారి
సంగతి ఏమిటంటారు?
శతాబ్దాల నిశ్శబ్దం తర్వాత
మూగవడివున్న ఈపులి లేచి
ప్రపంచంలో న్యాయ విచారణ చేస్తే
తీర్పులంటూ చెబితే
ఏమిగాను! ఏమిగాను!!

మృష్టాన్నంతినే అమెరికనులు ఈ మనిషినిగూర్చి ఏమంటారు? అతన్ని అర్థంచేసుకొనే సామర్థ్యం అమెరికన్లకుందా? అతను విసిరిన సవాలును అందుకొని బదులు చెప్పగలశక్తి అమెరికన్లకుందా? ఈ ప్రశ్నలకు అమెరికన్లు చెప్పే సమాధానాలనుబట్టి ఈ శతాబ్దిలో వచ్చేదశాబ్దం రూపొందగలదు.

విభాగం-3

# అభివృద్ధి చెందుతూ వున్న ఖండాలు

ఆసియా, ఆఫ్రికా ఖండాలలో వలెనే లాటిన్ అమెరికాలో కూడా ప్రజలు పౌరస్వత్వం కావాలా లేక దాస్యంకావాలా, ఆశలుపెట్టుకొని వుండాలా లేక నిరాశోపహతులుకావాలా, దేశంలో క్రమబద్ధమైన రాజకీయ పురోగతి కావాలా లేక రక్తపాతంతోకూడిన తిరుగుబాటు కావాలా ఏదో ఒకటి ఎంపిక చేసుకోవలసి వున్నది. ఈ ఎంపికను అమెరికన్లు అర్థం చేసుకోలేకపోతే, తమనాయకత్వాన్ని రూఢిపరచుకొనప్రయత్నించే నూత్నశక్తులను అమెరికన్లు ఆదుకొనకపోతే మహా విపత్తు తప్పదు.

నవంబరు 22, 1959.

# 23

## సహచరునికి చెప్పిన సమాధానాలు

భారతదేశంలో వామపక్షవారపత్రిక 'బ్లిట్జ్'కు 1952 జులైలో ఇచ్చిన ఇంటర్వ్యూలో రాయబారి శ్రీ బౌల్స్ కొన్ని ప్రశ్నలకు సమాధానాలు చెప్పారు. వీటిలో అమెరికా 'ప్రమేయం'వల్ల ముందుముందు ఏమిజరుగుతుందో అన్న ఆసియావాసుల సంకోచానికి సమాధానం వుంది.

బ్లిట్జ్ విలేఖరి: భారతదేశానికి అమెరికాచేసే ఆర్థికసహాయానికి మీరే నాందీప్రస్తావనచేశారు కదా. ఆ సహాయంచేయడంలో మీ ఉద్దేశమేమిటి? అమెరికా విదేశాంగవిధానం లక్ష్యాన్ని సాధించడంకోసమా? లేక కేవలం దయాళుత్వమా?

శ్రీ బౌల్స్: మీప్రశ్నకు జవాబు చెప్పేముందు ఒక విషయం చెబుతాను. భారతదేశంలో వున్న ప్రతికమ్యూనిస్టూ కమ్యూనిస్టుపార్టీకి రాజీనామా ఇచ్చినప్పటికీ భారతదేశ సమస్యలు అలాగేవుంటాయి కాని ఎక్కడికీపోవు. ఈసమస్యలను అవకాశంగా తీసుకోవడానికి కమ్యూనిస్టులు సర్వప్రయత్నాలూ చేస్తున్నప్పటికీ ఇవి వారు సృష్టించినవి మాత్రం కావు.

ఇక్కడగాని, లేక మరెక్కడైనాగాని కమ్యూనిజం వుందే అన్న సంగతి ఆలోచనకు రాకపూర్వంనుంచే అమెరికావారు చర్చిలనుండి, ఫౌండేషనులనుండి, ప్రైవేటు వ్యక్తులనుండి, సంస్థలనుండి భారతదేశానికి సహాయం పంపారు. కొందరు

వ్యక్తులే ఇక్కడి ప్రజలకు ఆసుపత్రులు, పాఠశాలలు నిర్మింపజేయడానికీ, ఆహారం, మందులు లభింపజేయడానికీ కొన్నికోట్ల డాలర్లు విరాళాలుగా ఇచ్చారు.

ఈ సంవత్సరం ఆహారం, మందులు మొత్తం పదిలక్షల డాలర్ల విలువ చేసేవి అమెరికానుంచి భారతదేశానికి ఉచితంగా వచ్చాయి. ప్రైవేటు సంస్థలు భారతదేశంలోని ఆసుపత్రులకు 17 అంబులెన్సులు కాన్కగా పంపాయి. వాటిని గూర్చిన ప్రచారమే వారు చేసుకోలేదు. వాటిని ఇవ్వడంలో వేరే ఉద్దేశమూలేదు. తోచినంతవరకు సహాయపడదామన్న కాంక్షతప్ప మరేమీలేదు.

ఇక అమెరికా ప్రభుత్వంచేసే సాయం విషయంలో—భారతదేశం ఇదివర కెన్నడూ చూపని దక్షతను ప్రపంచానికి చూపగలదని మాఆశ. ఒక వెనుకబడ్డ దేశపు ప్రజాస్వామ్యప్రభుత్వం వ్యక్తి స్వాతంత్ర్యమునకు, స్వేచ్ఛగా ఓటువేసే హక్కుకు, వాక్‌స్వాతంత్ర్యానికీ మతస్వాతంత్ర్యానికీ పూర్తిహామీనివ్వడమేగాక ప్రజలకుఉన్నత జీవనప్రమాణాన్నీ, అధికవ్యవసాయోత్పత్తినీ, ఉక్కు, విద్యుచ్ఛక్తి, రసాయన ద్రవ్యములు, తదితర పరిశ్రమల విస్తృతినీ చేకూర్చగలదని మేము విశ్వ సిస్తున్నాము.

ఆసియాలో ప్రజాస్వామ్యం ఈపరీక్షలో నెగ్గలేకపోయినట్లయితే ఈ ఖండంలో ప్రజాస్వామ్యం విఫలమవుతుందన్నమాట. అసలు ముఖ్యపరీక్షా కేంద్రం భారతదేశము. కనుక భారతప్రజలు వారికృషిలో కృతార్థులయ్యేందుకు మేము అమెరికనులం ఏమైనా తోడ్పడగలిగితే తోడ్పడతాము. అదే మాఉద్దేశం.

బ్లి-వి: సాంకేతిక సహకారపాలకసంస్థద్వారా, పాయింట్‌ఫోర్ కార్యక్రమం క్రిందా చేసిన చిల్లర సహాయంవల్ల భారతదేశ ఆర్థికాభి వృద్ధి సాధ్యపడుతుందని మీరు నమ్మతున్నారా? ఈ కొద్ది సహాయం అమెరికావారు తమ ప్రచారంకోసం పెడుతూన్న ఖర్చు అని అనడం తప్పా?

బౌల్స్: ఈసంవత్సరం జనవరిమొదలు జూన్ ఆఖరువరకు ఖర్చుపెట్టడం కోసమని మేము పోయిన జనవరిలో మంజూరుచేసిన మొత్తం 'చిల్లర సహాయం' అనడానికి వీల్లేదు. అది మొత్తం 5 కోట్లా 40 లక్షలడాలర్లు. ఆడబ్బువల్ల ఒకలక్ష టన్నుల రసాయనిక ఎరువులు, 2200 గొట్టపుబావులు లభ్యం కానున్నవి. ఈ గొట్టపుబావులవల్ల 8 లక్షల ఎకరాలకు సాగునీరు లభిస్తుంది. చరిత్రలో గొట్టపు

బావులకార్యక్రమం ఇంత పెద్దది మరొకటిలేదు.అంతేగాక భారతదేశంలో మలేరియా నిర్మూలనకై డి. డి. టి. పౌడరుకూడా లభింపజేయబడుతున్నది.

అమెరికా 40 లేదా 50 వేలటన్నుల ఉక్కుకూడా ఇస్తోంది. చిన్నరకం పనిముట్ల తయారీకి ఇది ఉపయోగపడుతుంది. ఆ పనిముట్లతో భారత మత్స్యపరిశ్రమను ఆధునికం చేయవచ్చు. భారత నదీలోయ ప్రాజెక్టులకవసరమైన బుల్‌డోజర్లు, మట్టిత్రవ్వే యంత్రాలుకూడా లభింపజేయబడుతవి.

రసాయనిక ఎరువు కొంతవచ్చేపింది. డి. డి. టి. ఇక్కడేవుంది. ఈ ఆకురాలు కాలంలో భారత గ్రామసేవకులకవసరమైన జీపులు వస్తాయి. వీటికన్నిటికీ మేము ఇచ్చిన డబ్బుకుతోడు భారతదేశం కూడా తనవంతుగా తననాణెం (రూపాయలు) ఖర్చుపెడుతుంది. విదేశాలలో కొన్నవాటికి మేము డాలర్లు చెల్లిస్తాము. మీరు స్థానికంగా లభించగల సామగ్రిని, కాయకష్టమును చేకూరుస్తారు.

క్షమించాలి, ఇది 'చిల్లర' సహాయం ఏమాత్రం కాదు. భారతదేశం శక్తితో, చైతన్యంతో ప్రజాసమస్యలను పరిష్కరింప బూనుకుందన్న వార్తను ప్రచారమని అనడం సబబుకాదు. అది యథార్థం. సత్యం. అట్టి యథార్థాన్ని కమ్యూనిస్టులు మరుగుపరచలేరు.

బ్లి-వి: అమెరికా సహాయకార్యక్రమంలో భారతదేశాన్ని వ్యవసాయదేశంగా అభివృద్ధిచేయాలన్న అంశానికే ప్రాముఖ్యమిస్తున్నారే! భారతదేశ పారిశ్రామికాభివృద్ధికి ప్రాముఖ్యమివ్వరేమి?

బౌల్స్: అడగవలసిన ప్రశ్న అడిగారు. న్యాయమైన ప్రశ్న. అమెరికాలోని కొందరు మిత్రులుకూడా నన్ను ఇదే అడిగారు. అసలు స్థితి ఇది:

1947 లో జరిగిన దేశవిభజనవల్ల ఆహారధాన్యాలు, ప్రత్తి బాగాపండే భూములను భారతదేశం కోల్పోయింది. ఫలితమేమిటంటే ప్రతియేటా 30 లక్షలు మొదలు 50 లక్షలటన్నుల ఆహారధాన్యాలను, 15 లక్షలటన్నుల బేళ్ళ ప్రత్తిని ఇండియా కొనవలసి వస్తున్నది. లేకపోతే ప్రజలకు ఆహారంకొరత, బట్టలమిల్లులకు ప్రత్తికొరత వుంటుంది.

భారత పంచవర్షప్రణాళికలను సిద్ధపరిచేది: ప్రణాళికాసంఘం. ఆసంఘం వారూ, భారత ఆర్థికవ్యవస్థనెరిగిన ప్రవీణులూ భారతదేశం మొదట గోధుమలు,

ఇతర ఆహారధాన్యాలు, ప్రత్తి ఉత్పత్తి విషయకంగా స్వయంసమృద్ధం కావాలన్నారు.

పోయిన సంవత్సరం ఒక్క అమెరికానుంచే 30 లక్షలటన్నుల ధాన్యాలు దిగుమతి అయ్యాయి. వీటికి ఖరీదు చెల్లించాలంటే భారతదేశం 60 కోట్ల డాలర్ల విదేశమారకద్రవ్యాన్ని ఖర్చుపెట్టాలి. ఇంతమొత్తంలోనుంచి మూడవ పంతును భారతదేశం అమెరికానుంచి అరువుగా తీసుకుంది. ఆ అరువును 1957 నుంచి మొదలుపెట్టి 30 ఏండ్లలో తిరిగి చెల్లించాలి.

కనుక భారతదేశానికిగల విదేశమారకద్రవ్యంలో అధికభాగం రవాణా సౌకర్యాలు, ఉక్కుమిల్లులు, రసాయన పరిశ్రమలకుగాక ప్రజలు బ్రతికి వుండాలంటే అవసరమైన ఆహారాన్ని దిగుమతిచేసుకోవడానికి వినియోగించవలసివస్తున్నది. అప్పటికీ ప్రజల జీవనప్రమాణం తచ్చే: వచ్చేకొన్నేండ్లలో భారతదేశం తనకు సరిపడేధాన్యం, ప్రత్తి పండించుకుందంటే అప్పుడు ఈ విదేశమారకద్రవ్యంతో ఉక్కుమిల్లులు, మోటారుపరిశ్రమలు, కొత్తరవాణా సదుపాయాలు వగైరా ఏర్పాటు చేసుకోవచ్చు.

కాబట్టే మీ భారత ఆర్థికప్రణాళికా నిర్ణేతలు వ్యవసాయానికి మొదటిస్థానమిచ్చి, పరిశ్రమలకు రెండవ స్థానమిచ్చారు. వారి నిర్ణయం సబబైనదని నా విశ్వాసం.

బ్లి-వి: భారతదేశానికి పెద్ద మొత్తాలు సహాయంగా ఇవ్వడానికి ముందు భారతదేశం అమెరికా విదేశాంగవిధానానికి అనుగుణంగా వుంటుందో లేదో, వుండేట్టయితే అందుకు తగుసాక్ష్యాధారాలు కావాలని అమెరికన్ కాంగ్రెసు సభవారు అనుకుంటున్నారా?

బౌల్స్: ఒకవేళ మేము ప్రయత్నంచేసినా భారతదేశంవంటి ప్రజాస్వామిక దేశాన్ని కొని బుట్టలో వేసుకోలేము. ఆప్రయత్నం మేముచెయ్యము. స్వతంత్ర ప్రజలవలె భారతీయులు వారి ప్రజాస్వామిక లక్ష్యాలను సాధించుకోవలెనని మా ఆకాంక్ష. మేము చేసే సహాయానికి బదులుగా భారతదేశం మాకు ఓటువేయవలెనని కాని, మేము చెప్పిన దానికి ఊకొట్టవలెననిగాని, మమ్మల్నే సమర్థించవలెననిగాని మేముకోరము. ఒకప్పుడు ఇండియా మమ్మల్ని బలపరుస్తుంది; వేరొకప్పుడు బలపరచదు-అంతే.

అభిప్రాయభేదాలుంటాయి. కొన్నివిభేదాలు ఉభయులకూ మేలుచేయవచ్చు. మాకు కావలసిందల్లా వ్యక్తి స్వాతంత్ర్యం, మానవస్వేచ్ఛలకు పరిపూర్ణ రక్షణ వుండేటువంటి సమాజంలో భారతీయులు సుఖంగా జీవిస్తూ భోగభాగ్యాలు పొందడమే. ఈవిషయంలో భారతదేశం కృతార్థురాలు కాగలదనే మా నమ్మిక.

బ్లి-వి: ఇటీవల మీరు ఆసియాలో కొన్నివందల కోట్లు ఖర్చు పెట్టారు. అయినా ఆసియాఖండంలో మచ్చుకు ఒక్కదేశమైనా అమెరికాకు కృతజ్ఞురాలై లేదు. ఈవైరుధ్యానికి కారణమేమిటంటారు?

బౌల్స్: మీకు మరొకమారు చెబుతున్నాను - భారతదేశంగాని, మరొక దేశంగాని మాకు కృతజ్ఞురాలై వుండవలెనని మేముకోరము. అలా ఆశించము. ఆసియాప్రజలు సాధారణంగా అమెరికా అంటే అంతగా స్నేహంగా వుండరని చెప్పడం మీప్రశ్నలోని భావమైతే మీకు సంగతిసందర్భాలు బాగా తెలియవని నేను అనవలసివుంటుంది, భారతప్రజలు స్నేహశీలురు. మేమంటే ఆప్యాయత చూపుతున్నారు. ఈసంగతి నాకు తెలుసు. ఎక్కడికి వెళ్ళినా స్నేహభావమే నాకు కన్పించింది. నేను ముప్పయి భారతవిశ్వవిద్యాలయాలలో ప్రసంగించివున్నాను.

నేను భారతదేశంలో మారుమూల గ్రామాలకుకూడా వెళ్ళి గ్రామీణులను స్వయంగా కలుసుకొని మాట్లాడాను. వారి ఇండ్లలోకి వెళ్ళి వారెంతో ప్రేమ భావంతో తేనీరు ఇవ్వగా పుచ్చుకున్నాను. విదేశీయులెవరూ నామాదిరిగా భారత గ్రామాలను చూచి వుంటారనుకోను. నేను పల్లెలలో ఎక్కడికి వెళ్ళినా ప్రజలు నాకు హృదయపూర్వక స్వాగతమిచ్చారు. వారిలో కొందరు చదువుకున్న వారు ఉన్నారు. కొందరికి చదువురాదు.

అమెరికాలో మేము ఏదికావాలని కోరుకుంటున్నామో భారతీయులుకూడా అదేకోరుతున్నారు. అంటే-హేతుబద్ధమైన, శాంతియుతమైన ప్రపంచం కావాలంటున్నారు. అట్టి ప్రపంచంలో ప్రజలు మర్యాదతో కలిసిమెలసి పనిచేయాలని వారు అభిలషిస్తున్నారు.

వలసపాలనక్రింద వున్నప్పుడు ఆసియాను పాశ్చాత్యులు న్యాయంగా చూడలేదన్న సంగతి మాకుతెలుసు. నేనేగనుక ఆసియా వాసినైవుంటే వలసపరిపాలనను వ్యతిరేకించి ప్రతిఘటించి వుండేవాడిని. కాని ప్రస్తుత సంబంధబాంధవ్యాల రీత్యా అట్టివైఖరికి ఆస్కారంలేదు. నేను పర్యటనకు వెళ్ళేటప్పుడు నాతో ఒకమారు రండి. అప్పుడు వాస్తవం మీకే తెలుస్తుంది.

బ్లి-వి: ప్రజల అభిమానం చూరగొననట్టి బావోదాయ్‌లాంటి అభివృద్ధినిరోధకులను అమెరికా తన మిత్రులుగా ఎందుకు పరిగ్రహిస్తూవుంటుందో చెప్పగలరా? అటువంటి వాళ్ళను వెనకేసుకురావడంవల్లనే అమెరికా ఆసియాలో అప్రతిష్ఠపాలవుతున్నదని మీకు తెలియదా?

బౌల్స్; ఇతరదేశాలలో ఎవరు నాయకులుగా వుండాలో మేము ఎంపిక చేయము. నాయకులు అనేక పద్ధతులద్వారా ఎంపిక చేయబడుతూవుంటారు. కొన్ని మంచి పద్ధతులు కావచ్చు; కొన్ని చెడ్డవికావచ్చు. కొన్ని ప్రజాస్వామిక పద్ధతులై వుండవచ్చు; కొన్ని కాకపోవచ్చు.

కాని ఒకమాట చెబుతాను. నేడు మనం విప్లవాత్మక ప్రపంచంలో జీవిస్తున్నాము. ఈ ప్రపంచంలో మితవాదఫాసిస్టులు, అతివాదకమ్యూనిస్టులవంటి అభివృద్ధినిరోధకులకు తావులేదు. మితవాద అభివృద్ధి నిరోదకతత్వం ఎన్నడో ఒకప్పుడు నేలకరచకతప్పదు. అలాగే వామపక్ష కమ్యూనిస్టు తీవ్రవాదులు వారి విధానాలను సవరించుకోవలసిన అగత్యం రాకపోదు. లేదా 'అతి'కి పోయి అంతర్గతమైన ఖండనమండనలతో భ్రష్టమైపోతారు.

ఒక్కొక్కప్పుడు ఇటువంటి దౌర్భాగ్యకరమైన ప్రచ్ఛన్నయుద్ధంలో మేము క్లిష్టస్థితిలో పడిపోతాము. మాకు ఇష్టం లేకపోయినా కొందరితో సమాధానానికి రావలసివస్తుంది. కాని నిడివిమీద చూస్తే చైతన్యవంతమగు ఔదార్యవాదమే మంచిది. అదే మానవులు నాలుగు కాలాలపాటు చల్లగా జీవించేట్టు చేస్తుంది. అది మితవాద అతివాద అభివృద్ధి నిరోధకులను తిరస్కరిస్తుంది. అట్టి ఔదార్యవాదం భూసంస్కరణలను, కనీసవేతనాలను, ఉన్నత జీవనప్రమాణాలను, విస్తృత సాంఘిక భద్రతను తన లక్ష్యంగా పెట్టుకొని దాని సాధనకై కృషిచేస్తుంది. జాతి, మత, కుల, వర్ణవిచక్షణలేకుండా సర్వప్రజలకు విశేషావకాశాలను కలుగజేస్తుంది,

అట్టి ఔదార్యంగల రాజకీయోద్యమంపై అమెరికనులమైన మాకు సంపూర్ణ విశ్వాసముంది. అట్టి ఉద్యమాన్నే మేము భారతదేశంలో, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో బలపరుస్తాము. చివరకు ఆ ఉద్యమమే విజయం సాధిస్తుంది.

# 24

## ఆసియా-అమెరికా స్వప్నం

శ్రీ బౌల్స్ భారతదేశంలో రాయబారిగా పనిచేసి 1953లో స్వదేశానికి తిరిగివెళ్ళిన పిమ్మట జాగృతమవుతూవున్న నవ ఆసియా నూతనావసరాలకు అనుగుణంగా అమెరికావిధానం రూపొందవలెనని చెబుతూ 41 రాష్ట్రాలలో ప్రసంగాలుచేశారు. 1953 మే నెలలో న్యూయార్కులోని కమ్యూనిటీ చర్చిలో ప్రసంగిస్తూ మరింత నిర్మాణాత్మకమైన ఆసియా విధానానికి ఆయన ఎనిమిది ముఖ్యాంశాలు చెప్పారు.

గడచిన దశాబ్దంలో అమెరికన్లు ప్రయాసపడి యూరపుపట్ల అమెరికా విధానాన్ని నిర్ణయించారు. ఈ విధానం సహేతుకమైనది. ఆచరణసాధ్యమైనది. వాస్తవస్థితికి అనుగుణమైనది. కనుకనే అమెరికన్లంతా దీనిని సమర్థిస్తున్నారు. ఉత్తర అట్లాంటిక్ ప్రాంతంలో వున్న దేశాల మధ్యగల సన్నిహితసంబంధాలను గమనించే అమెరికన్లు ఆ విధానం రూపొందించారు. యూరపును పరులు ఆక్రమించుకోవడంగానీ, అదుపుచేయడంగానీ అమెరికన్లకు సమ్మతం కాదని ఆవిధానం స్పష్టపరచింది.

కాని యుద్ధం ముగిసి ఎనిమిదేండ్లయినా ఆసియాపట్ల అమెరికాకు ఒక నిర్దిష్టవిధానం లేకపోవడం శోచనీయం. ఇందుకు తప్పెవరిది అని వాదోపవాదాలకు దిగి ప్రయోజనంలేదు. ఉభయరాజకీయపక్షాలవారూ దీనికి బాధ్యులే. అమెరికన్ల ముందున్న ముఖ్యప్రశ్న ఇది: ఈవిషయంలో అమెరికన్లు చేయబోయేదేమిటి ?

ఆసియాపట్ల అమెరికా విధానం ఎనిమిది ప్రాథమికాంశాలపై ఆధారపడి వుండాలి.

మొదటిది—ఆసియావారి దృక్పథమంటూ ఒకటి వుందన్న సంగతి అమెరికన్లు గ్రహించాలి.

ఈ ఆసియాదృక్పథాన్ని నేను లెబనాన్, సింహళం, ఇండియా, బర్మా, ఇండోనీషియా, వియత్‌నామ్, ఫిలిపీన్స్, జపానుదేశాలలో విన్నాను. ఈ దేశాల వారు ఒకరికొకరుకొన్ని వేలమైళ్ళదూరంలో వున్నప్పటికీ, వీరిభాషలువేరైనప్పటికీ ఆసియాదృక్పథం విషయంలో ఏకాభిప్రాయులై వున్నారు.

ఇందులో అర్థంకాని గూఢవిషయమేమీలేదు. బహుస్వల్పాంశము, విస్పష్ట మైంది. దీనిని ఆసియా దృష్టితో చూడాలి.

రెండవది—ఆసియా భవిష్యత్తును తుదకు నిర్ణయించవలసింది ఆసియా వాసులే.

ఈ విషయంలో అమెరికన్లు నిర్మాణాత్మకశక్తులను బలపరచి విచ్ఛిన్నకర శక్తులను నిరుత్సాహపరచాలి. మంచోచెడో, ఆసియా భవిష్యత్తు టోకియో, జకార్తా, రంగూను, కొత్తఢిల్లీ, తదితర ఆసియా రాజధానులలో ఆసియా నాయకులచే నిర్ణయించబడాలి కాని వాషింగ్టన్ నగరంలో అమెరికనులు నిర్ణయించరాదు.

మూడవది—ఆసియా విప్లవమనేది సిద్ధాంతప్రాయమైంది కాదు, అది వాస్తవం.

ఈ విప్లవం మూడు లక్ష్యాలపై ఆధారపడివుంది; పరాధీనతనుండి విముక్తులై వుండవలెనన్న సంకల్పం; భూస్వామ్యవిధానాన్నీ, వడ్డీవ్యాపారాన్నీ, పీడననూ అంతరింపజేయవలెనన్న పట్టుదల; ప్రపంచంలో వున్న రంగుజాతుల ప్రజలు పాశ్చాత్యదేశాలలోని తెల్లజాతులవారితో సమానంగా చూడబడవలెన్న ఆకాంక్ష. మానవునికి తగ్గవిలువ చూపబడవలెనన్న ఆసియావాసుల ఆకాంక్ష ప్రగాఢమైంది. చైతన్యంవల్ల పుట్టుకొచ్చింది.

నాల్గవది—కమ్యూనిజం విషయంలో అమెరికన్ల అభిప్రాయాలకూ ఆసియా వాసుల అభిప్రాయాలకూ తేడావుంది. ఆసియావారి దృక్పథం అమెరికా దానికంటె భిన్నమైంది.

ఈనాడు ఆసియా నాయకులు కమ్యూనిజాన్ని కొంత పొరపాటుగానే అర్థం చేసుకొంటున్నారని చెప్పాలి. అమెరికావారు కూడా 1930 ప్రాంతాలలో నాజీ వాదాన్ని సరిగా అర్థంచేసుకోలేదు కదా! అప్పుడు అమెరికన్లు - అమెరికావాసులు నాజీజం అంటే అయిష్టత చూపారు కాని దానివల్ల రాబొయ్యే ప్రమాదాలను గుర్తించారా? అది ఎక్కడో దూరానవుందిలే, దానివల్ల అమెరికన్లకు ముప్పు రాబోయిందా, అమెరికన్లు గొడవపడనక్కరలేదు, ఎవరో పడతారు అని ఉపేక్షించారు.

అయిదవది—స్వాతంత్ర్యంపొందిన ఆసియాదేశాలు జటిలమైన ఆర్థిక సమస్యలతో తన్నుకులాడుతూ వున్నవి. ఆ సమస్యలు తాము తెచ్చిపెట్టుకొన్నవి కావనీ, ఇతరులు తెచ్చిపెట్టినవనీ వాటివిశ్వాసం.

ఇట్టి తరుణంలో ఆసియాలో ప్రజాస్వామిక ప్రభుత్వాలు విజయవంతంగా పనిచేయునట్లు చేయడమా, లేక అక్కడ అయోమయత్వం, అరాజకం ప్రబలి తుదకు కమ్యూనిస్టుల ప్రాబల్యం ఏర్పడుతూవుంటే చూస్తూ చేతులు ముడుచుకు కూర్చోవడమా? ఈ రెంటికీ గల తేడాయే అమెరికా ఆర్థికసహాయం.

టర్కీ గ్రీసులకు ఎలా ధైర్యంగా అభయమిచ్చారో, ఆతదుపరి 1947 లో పశ్చిమ యూరపుదేశాలకు ఎటువంటి హామీ ఇచ్చారో, భారత పాకిస్తాన్ దేశాలకు కూడా అటువంటి హామీయే అమెరికన్‌లు ఇవ్వాలి. అంటే ధనలోపంవల్ల ఈ రెండుదేశాల ఆర్థికవ్యవస్థలను విఫలం కానివ్వమని నమ్మకంచెప్పాలి.

భారతదేశం సాహసంచేసి పంచవర్షప్రణాళిక అమలు జరుపుకుంటోంది. ప్రపంచంలో మరెక్కడా ఒక ప్రజాస్వామికదేశం ఇంత పెద్ద ప్రణాళికను ఇలా ధైర్యంచేసి అమలు జరుపుకోవడంలేదు. ఇప్పటికే భారతదేశం స్వయంకృషితో, విదేశీసహాయం లేకుండానే ఎంతో సాధించింది. స్వతంత్రప్రజ లెవరైనా అమెరికా సహాయానికి అర్హులైనవారున్నారా అన్న ప్రశ్నవస్తే భారతప్రజలేనని సమాధానం చెప్పవలసివస్తుంది.

కాని నేడు భారత పంచవర్షప్రణాళిక క్లిష్టమైన ధనాభావాన్ని ఎదుర్కొంటోంది. కనుక ఈ లోపాన్ని ఎట్టి రాజకీయషరతులూ లేకుండా అమెరికా పూరించి తోడ్పడాలి.

ఆరవది—ఆసియా విషయంలో అమెరికన్లు సిద్ధాంతాలను పట్టుకు వేళ్ళాడ కూడదు.

గడచిన పదేండ్లలో భవిష్యత్తులో జరుగబోయే సంఘటనలను గూర్చి జోస్యంచెప్పడంలో అమెరికాలో దాదాపు ప్రతివ్యక్తీ ఎన్నోమార్లు పప్పులో కాలు వేశాడు. నేటినుండి పదేండ్లలోపల ఆసియాలో గాని, మరెక్కడైనా గాని వ్యవహారాలు ఎలావుంటాయో చెప్పడం సాధ్యంకాదు. ఒకవేళ ఎవరైనా చెప్పినా ప్రగల్భాలే అవుతాయి.

అయినా కొన్నిఅంశాలు స్పష్టమవుతున్నాయి. ఉదాహరణకు సోవియట్ యూనియన్ ఎదుర్కొనవలసివచ్చే విపత్తులలో చైనా స్వతంత్రవిధానం గొప్ప విపత్తు అవుతుంది. ఈనాడు చైనా సోవియట్ యూనియన్‌తో కలసి మెలసి వుంటున్నది. కాని, ఈ బాంధవ్యం శాశ్వతమైందన్న భావంతో అమెరికా విధానాన్ని రూపొందించుకోవడం పొరపాటే కాగలదు.

ఏడవది—ఐక్యరాజ్యసమితి వివిధదేశాలు ఒక ఒప్పందానికి రావడానికీ, లేదా అభిప్రాయభేదాలతో ఎవరిదృక్పథం వారిదిగా వుండడానికీ వేదికగా వుంటూ వుండాలి.

అందుచేత సమితిని తెల్లజాతులవారి క్లబ్బుగానో, లేక పాశ్చాత్యదేశాల క్లబ్బుగానో తయారుచేద్దామన్న కోర్కెను అణచుకోవాలి. జెఫర్సన్ సంప్రదాయం అడుగుజాడలలో అమెరికన్లు నడుచుకోవాలి. వలసవిధానానికీ, ఆర్థికపీడనకూ, జాతి మతవర్ణ భేదాలపై ఆధారపడ్డ విచక్షణవిధానానికీ అమెరికా వ్యతిరేకమని స్పష్టీకరించే ప్రకటనలు సమితి సభామందిరంలో మార్మోగాలి.

ఎనిమిదవది—అమెరికన్‌లు అమెరికాదేశంలో ప్రజాస్వామిక విధానాన్ని ఆచరించి చూపితేనే, ఇతరదేశాలలో ప్రజాస్వామ్యాన్ని వృద్ధి జేయగలుగుతారు.

చరిత్రలో నేటి క్లిష్టస్థితిలో అమెరికన్ సైనికరక్షణ వ్యవస్థను బలహీన పరచుకోవడం తెలివితక్కువే అవుతుంది. అమెరికా బలహీనమైందంటే మూడవ ప్రపంచయుద్ధానికి ఆస్కారం కలుగుతుంది.

కాని అమెరికా ఎదుర్కొనేది సైనికమైన ప్రమాదాలను మాత్రమే కాదు. కొందరు వ్యక్తులను అమెరికన్లు ఎదుర్కొంటున్నారు. వారికి మంచీచెడ్డా, దయా దాక్షిణ్యాలూ లేవు. ఎలాగైనా లక్ష్యాన్ని సాధించడమే వారి ఆశయం. పైగా వారొక సిద్ధాంతంతో ప్రపంచాన్ని వశపరచుకోవాలని చూస్తున్నారు. అగ్నిపర్వతం ఎన్నడైనా బ్రద్దలు కావచ్చు. ఈ భావాలను అమెరికన్లు బాంబులతో తుదముట్టించలేరు. అంతర్జాతీయ కమ్యూనిజపుభావాలను అమెరికన్లు వ్యక్తిస్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, మానవప్రతిపత్తి అన్న ఆదర్శాలతో జయించాలి.

అమెరికా స్వాతంత్ర్య ప్రకటనపత్రం వెలువడి 177 ఏండ్లు గడచినతర్వాత కూడా అమెరికా కన్న స్వప్నం ప్రపంచంలో బలీయమైన ఆదర్శంగా వుంది. ఆ ఆదర్శాన్ని నాశనంచేసినా అమెరికన్లే చేయాలి. లేదా వర్ధిల్లజేసి ప్రపంచ వ్యాప్తంచేసినా అమెరికన్లవల్లే కావాలి.

## 25

# ఆసియాకు మార్షల్ పథకమా?

*విదేశాలకు చేసే సహాయాన్ని సరిగ్గా చేయడం ఎలా అన్న ప్రశ్న వచ్చినప్పుడు ఆసియాకొక మార్షల్ పథకం గురించి శ్రీ బౌల్స్ 1953 అక్టోబరులో బ్రూక్లిన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్ సభలో ప్రసంగిస్తూ సూచించినవి.*

ఆసియా వాసులు పట్టెడన్నం కోసం తమ హక్కులను అమ్ముకొంటారని అనడం వారిని దూషించి అపకీర్తిపాలు చేయడమే అవుతుంది. స్వాతంత్ర్యం కోసం ఆసియావారు ధైర్యంగా పోరాడారు. ఆ స్వాతంత్ర్యాన్ని సోవియట్ కమ్యూనిస్టులు హరించకుండా కాపాడుకుంటూ వస్తున్నారు.

ఇప్పుడు వారు తిండి, స్వేచ్ఛ కావాలంటున్నారు. ఆసియాలో ప్రజాస్వామ్యం ఈ రెంటినీ ఇస్తానని హామీ ఇవ్వాలి. అలాంటి శక్తి తనకున్నదని రుజువుపరచుకోవాలి. లేకపోతే ప్రజాస్వామ్యమే అంతరిస్తుంది.

ఈ కృషికి అవసరమైన నాయకత్వం, సాధనసంపత్తులు ఆసియా వాసుల నుంచే రావాలి. స్వతంత్ర ఆసియా ప్రభుత్వాలు భూసంస్కరణలను అమలుజరపాలి. న్యాయబద్ధంగా పన్నులు వసూలుచేయాలి. దేశసంపదను వినియోగించుకొనుటకు ప్రణాళికలు వేసుకోవాలి. ఇవన్నీ ఇప్పుడు ఎక్కడ అమలు జరుగుతున్నాయో అక్కడ ప్రజలు ఉత్సాహంతో ముందుకొస్తున్నారు.

ప్రజాస్వామ్య ఆసియాఖండం తన ప్రజలను నియంతృత్వ విధానాలతో

గొంతువిప్పి చెప్పలేదు. కనుక సహాయంకోసం పాశ్చాత్యదేశాలకేసి చూడాలి. పాయింట్‌ఫోర్ కార్యక్రమం సరియైనదే. అయితే అమెరికన్లుచేసే సహాయంలో పెట్టుబడిడబ్బు, సాంకేతికసహాయం - ఇవి రెండూ సమకూరాలి. యూరపులో వలెనే ఆసియాలో కూడా ఈసమస్య చిల్లరగా కాక ప్రాంతీయ ప్రాతిపదికపై పరిష్కరింపబడాలి. ఇవి జరగాలంటే ఆసియాలో స్వతంత్రప్రాంతపు సాధన సంపత్తులను ఒక ఉమ్మడిపథకం ద్వారా వినియోగానికి తేవాలి.

ఆసియాఖండంలోని స్వేచ్ఛాప్రియదేశాలు ఒకదానికొకటి సహాయపడటానికి అనేకమార్గాలున్నాయి. జపానులో ఎకరా వరిపంటదిగుబడి అమెరికాలో కంటె ఎక్కువగా వుంది: భారతదేశపు దిగుబడికి నాలుగురెట్లువుంది. అట్టి జపానుదేశం ఇతరదేశాలకు సాంకేతికవిజ్ఞానసాయం విషయంలో సాంకేతిక సహాయం చేయగలదు.

ఇండొనీషియాలో వరిపంటకు ఉపయోగింపబడే సాగునీటిలో చేపలు అధికంగా ఉత్పత్తిచేస్తారు. వారి పద్ధతి లాభకరమైందని రుజువైంది. కాబట్టి ఆ దేశం ఆసియాలో వరిపండించేటి దేశాలకు సహాయకారి కాగలుగుతుంది. మలేరియా వ్యాధిని అదుపులో పెట్టే విషయంలో భారతదేశానికి మంచి అనుభవం వుంది. మలేరియా తీవ్రంగా వున్న ఇండొనీషియావంటి దేశాలకు భారతదేశం తోడ్పడవచ్చు. గ్రామాభివృద్ధి పథకాలకు రూపం ఇచ్చే విషయంలో కూడా భారతదేశం విజయవంతంగా కృషిచేసి అపారమైన అనుభవం సంపాదించింది గనుక ఇతర దేశాలకు అది ఎంతైనా సహాయంచేయవచ్చు.

అట్లే ఆసియాదేశాలు ఇచ్చిపుచ్చుకొనే పద్ధతిలో పరస్పరం వ్యాపారం జరుపుతుంటే, విదేశీమారక ద్రవ్యసమస్యలను పరిష్కరించుకోవచ్చు. జపాను తయారు చేసిన సరుకులకు దక్షిణ ఆసియా మంచి మార్కెటు అవుతుంది. అలాగే జపాను ఇప్పుడు చైనానుంచి దిగుమతి చేసుకొన్న ముడిసరుకులను ఇప్పుడు దక్షిణ ఆసియానుంచి దిగుమతి చేసుకోవచ్చు. జపాను చిన్న పరిశ్రమలు దక్షిణ ఆసియాలో వికేంద్రీకృత పరిశ్రమలకు ఆదర్శప్రాయమైనవి.

అమెరికా సహాయకార్యక్రమాలను ఏకీకృత ప్రాంతీయ కార్యక్రమం ద్వారా అందజేస్తే, మరింత ప్రయోజనకరంగా వుంటుంది. ప్రస్తుతం అమెరికాప్రభుత్వపు పాయింట్‌ఫోర్ కార్యక్రమాలు, బ్రిటిషు కామన్వెల్తు కొలంబో ప్రణాళిక కార్యకలాపాలు, ఐక్యరాజ్యసమితి సాంకేతిక సహాయకార్యక్రమం,

ఇంకా సమితితాలూకు ప్రపంచ ఆరోగ్యసంస్థ, ఆహార వ్యవసాయసంస్థ, బాలల నిధివంటి వ్యవస్థలు, నార్వే స్విట్జర్లెండు స్వీడన్ దేశాల సహాయవ్యవస్థలు, ఇతర ఫౌండేషనుల మతధార్మిక సంస్థల సహాయ కార్యక్రమాలూ అమలులో వున్నాయి. ఇవన్నీ అమూల్యమైన సేవ చేస్తున్నాయి. అయితే ఇతోధిక సమన్వయంవల్ల అందరికీ ప్రయోజనం సిద్ధిస్తుంది.

అట్టి ప్రాంతీయకృషికి ఆసియా దూరప్రాచ్య దేశాలకొరకై, ఐక్యరాజ్య సమితి ఆధ్వర్యాన గల ఆర్థికసంఘం (ఇకేఫే) కేంద్రవ్యవస్థగా ఉపయోగ పడ వచ్చు. ఆచరణయోగ్యమైన సమగ్రపథకమొకటి రూపొందితే అమెరికన్లు దాన్ని పరిగణించి సహాయంచేయాలి.

ఈ విషయంలో చొరవతీసుకొని కృషిచేయవలసిందిగా, స్వతంత్ర ఆసియాదేశాలను అమెరికా ఆహ్వానించి ప్రోత్సాహించవలసిన సమయంకాదా ఇది? 1947 లో అమెరికా విదేశాంగమంత్రి యూరపువాసులను ఇదేవిధంగా ప్రోత్సాహించ లేదా? ఆసియాలో తక్కిన ప్రాంతంకూడా కమ్యూనిస్టుచైనా పట్టిన మార్గాన పోకుండా ఆపాలంటే ఇదొకమార్గం.

అమెరికన్లు సకాలంలో అమెరికా ఊహాపోహల నుపయోగించి తగు చర్య తీసుకోకపోతే, చైనావిషయంలో అమెరికన్ల వైఫల్యంపై రేగిన దుమారం కన్న, దక్షిణాసియాలో అమెరికన్లు పొందే వైఫల్యంపై రేగే దుమారం కడు ఉధృతంగా వుంటుంది. ఇండియా, పాకిస్తాను, ఇండోనీషియా, బర్మాదేశాలు కలిసి మొత్తం మానవజాతిలో నాల్గవవంతుగా వున్నాయి. ఇంత పెద్ద ప్రాంతానికి అమెరికన్లు చేసిన సహాయం ఎంతయ్యా అంటే ఒక్క చాంగ్‌కైషేక్ చైనాకు అమెరికన్లు చేసిన సహాయానికంటె తక్కువే! గ్రీసుకుచేసిన సహాయంకన్న కూడా పై ఆసియాదేశాలకు అమెరికన్లు చేసిన సహాయం తక్కువగానే వుంది!!

కొన్ని శతాబ్దాలపాటు పాశ్చాత్య ప్రపంచం ఆసియానుండి లాభాలు గడించు కొంది. యూరపురాజ్యాలు ఆసియా, ఆఫ్రికాలలో తమ ఏలుబడిక్రిందగల వలస దేశాలనుంచి సంపదను పొందడంవల్లనే, వాటి పారిశ్రామికీకరణ సులభ సాధ్య మైంది.

కాని అమెరికా ఆసియావలసదేశాలపై ఆధారపడలేదు. అయితే మొదటి ప్రపంచయుద్ధానికి పూర్వం అమెరికాకు బ్రిటిషువారి పెట్టుబడిసొమ్ము అవసరమైంది.

దాన్ని అమెరికన్లు ఆసియా, ఆఫ్రికాపలసలలో పెట్టిన పెట్టుబళ్ళద్వారా సంపాదించారు.

నేను యేల్ విశ్వవిద్యాలయ పట్టభద్రుడను. ఆ విశ్వవిద్యాలయానికి మొట్టమొదటి భూరివిరాళ మిచ్చిందెవరు? ఎలీహూ యేల్ అనునాతడు. ఆయన బ్రిటిషు ఇండియాలో మద్రాసురాష్ట్రానికి గవర్నర్‌గా పనిచేశాడు. అయిదు ఓడలనిండా ముల్లువస్త్రాలను పంపాడు. అదే ఆయనవిరాళం. మంచి నాణ్యమైన వస్త్రా లవి. మరి వాటిని తయారుచేసిన నిస్సహాయ భారత స్త్రీపురుషులు సంపన్నులైన అమెరికన్ పౌరుల పిల్లలు ఉన్నతవిద్యాభ్యాసం చేసేందుకు ఇష్టపూర్వకంగానే తమ శ్రమనూ, కాలాన్నీ వెచ్చించారంటారా? నేను నమ్మను. బ్రిటిషు గవర్నర్ పాలకుడు. భారతీయులు అప్పుడు పాలితప్రజలు. పాలకుల ఆదేశాలను శిరసా వహించారు. అంతే!

అందుచేత పాశ్చాత్యలోకం తాను లోగడ ఆసియానుండి పొందిన సంపదను వడ్డీతోసహా ఇప్పుడు తిరిగి ఇచ్చివేసి తద్వారా ఆసియాఅభివృద్ధిని సులభతరం చేసి, ఆసియా స్వాతంత్ర్యానికి భద్రతకలిగిస్తే ఎంతటి అద్భుతవిశేష మవుతుంది! చరిత్రలోనే ఆశ్చర్యకరమైన మలుపుకాదా? క్రొత్తరకం ప్రపంచంలో అమెరికనులు తెలివితేటల నుపయోగించి ముందుచూపుతో తగుచర్యలు తీసుకోవలెనని చరిత్ర ఉపదేశిస్తున్నది.

# 26

# బర్మా, వియత్నాం: తేడాలు, గుణపాఠాలు

సంపూర్తిగా స్వతంత్రమైనవేళలో వాటి [illegible] కృతార్థతపొందగలవని అంటూ 1954 జూన్ 13 తేదీ నాటి 'న్యూయార్క్ టైమ్సు మేగజైన్' పత్రికలో వ్రాశాడు. ఆగ్నేయాసియావిషయంలో సరియైన జోస్యంపలికిన [illegible].

ఆసియాలో వలసవిధానం విషయమై నేను చేసిన ప్రశ్నలకు సమాధానంగా 1946 డిసెంబరులో బ్రిటిషు పార్లమెంటు సభ్యుడొకాయన ఈవిధంగా జోస్యం చెప్పాడు: "మీ అమెరికనులు ఫిలిప్పీన్సును స్వతంత్ర్యమున్నది [illegible] చేశారు. మరొక సంవత్సరంలో ఇండియా, పాకిస్తాన్, సింహళం, బర్మా, ఇండో చైనా, మలయా, ఇండోనీషియాదేశాలు స్వతంత్రమవుతాయి.

"కాని ఈ కొత్త స్వాతంత్ర్యం ఎక్కువకాలం వుండదు. కొత్త ప్రభుత్వాలు బలహీనంగా, అసమర్థంగా వుంటాయి. వాటి ప్రజలకు శక్తి చాలదు. వాటి సివిల్ సర్వీసు పాశ్చాత్యుల మార్గదర్శకత్వం గనుక లేకపోతే [illegible] పోతుంది. అందుచేత మరి రెండు మూడేండ్లలో కమ్యూనిస్టులు ప్రభుత్వాలను పట్టుకొంటారు. అంతటితో ఆసియాలో స్వాతంత్ర్యం అంతరించి, పాశ్చాత్యదేశాలు ఆసియాతో సంబంధం గోల్పోయి [illegible] వుంటాయి."

ఈ జోస్యంలో మొదటిభాగం అక్షరాలా జరిగింది. 1949 లో కమ్యూ

నిస్టులు చైనా అంతటా అధికారాన్ని కైవసం చేసుకున్నారు. కాని తక్కిన విషయాలలో బ్రిటిషు పార్లమెంటు సభ్యుడు పొరపడ్డాడనే చెప్పాలి. 1947,1948 లలో బ్రిటిషువారు ఇండియా, పాకిస్తాన్, సింహళం దేశాలపై తమ ఆధిపత్యం వదులుకున్నారు. డచ్చివారు కూడా ఇండోనీషియా నుండి ఉపసంహరించుకొననారంభించారు.

ఏమైనా సంశయాస్పస్థలో పడతాయనుకున్న నూతన స్వతంత్రదేశాలు కమ్యూనిస్టుల బారిని పడలేదు. దూరంగానే వున్నాయి.

చైనా తప్ప మరెక్కడ కమ్యూనిజం కొంతముందుకు చొచ్చుకుపోగలిగిందయ్యా? అంటే విదేశీయ శ్వేతజాతులవారు పాలించిన వలసదేశాలు అని చెప్పవలసివస్తుంది. ఆ దేశాలలో కమ్యూనిస్టులు "పాశ్చాత్యసామ్రాజ్యవాదులను సముద్రంలోకి పడద్రోయండి" అన్న నినాదంతో ప్రజలను తమవైపు తిప్పుకొని సమీకరించగలిగారు.

ఇది కేవలం కాకతాళీయమా? ఆగ్నేయాసియాలో యుద్ధానంతర సంఘటనలను శ్రద్ధగా పరిశీలిస్తే కాకతాళీయం కాదనే విశదమవుతుంది. ముఖ్యంగా బర్మా, వియత్నామ్ దేశాల ఇటీవలిచరిత్రలు కొన్ని గుణపాఠాలనివ్వగలవు.

పైకి చూస్తే ఆగ్నేయాసియాలోని ఈ రెండు దేశాలలో సామ్యం కన్పిస్తుంది. రెంటికీ మంచి ప్రకృతిసంపద వుంది. మంచి సాగుభూములున్నాయి. వర్షం బాగా కురుస్తుంది. వరిపంట బాగాపండుతుంది. బియ్యంమిగిలి ఎగుమతి అవుతాయి. ఈ రెంటిలో ఏదేశంలో కూడా జనాభా అతిగాలేదు. ఫ్రాన్సు, బెల్జియం, హాలెండు దేశాలు మూడూ కలిస్తే ఎంత ప్రాంతముంటుందో అంతకన్నా బర్మా పెద్దది. దాని జనాభా ఒకకోటి తొంభైలక్షలు. వియత్నామ్ వైశాల్యాన్నిబట్టి చూస్తే ఇటలీఅంత వుంటుంది. దాని జనాభా 2 కోట్లా 40 లక్షలు.

కాని ఈసామ్యాలు కేవలం భౌతికమైనవే కావు. ఈ రెండు దేశాలూ వలస పాలనక్రింద వుండేవి. వలసచరిత్ర వీటికి చాలావుంది. 19 వ శతాబ్ది అర్ధభాగంలో వియత్నామ్‌పై ఫ్రెంచివారి అధికారం పటిష్ఠంగా వుండేది. బ్రిటిషువారు 1886 లో బర్మాకుగల కొద్దీ గొప్ప స్వాతంత్ర్యాన్ని కూడా హరించి తమయేలుబడి క్రిందికి తెచ్చుకున్నారు. రెండవ ప్రపంచయుద్ధంలో ఈ రెండు దేశాలూ జపాన్‌వారి ఆక్రమణ క్రింద వున్నవి.

ఆయుద్ధంలోనే ఈరెండు దేశాలలో అమెరికన్. బ్రిటిషు సహాయంతో జపాన్‌వారికి వ్యతిరేకంగా గెరిల్లా ఉద్యమాలు సాగినవి. ఈ గెరిల్లాలలో కమ్యూనిస్టులు ప్రబలంగా వుండేవారు. వీరు అడవులలో ప్రచ్ఛన్నంగా వుంటూ జపాన్ వారిపై దాడులుచేస్తూ వుండేవారు. చివరకు జపాన్ వారిని ఈ దేశాలనుండి వెళ్ళగొట్టగానే సంపూర్ణ స్వాతంత్ర్యం కావాలన్న ఉద్యమం రెండు దేశాలలో ఆరంభమైంది. 1946 లో బ్రిటిషువైస్రాయి భారతస్వాతంత్ర్యం విషయంపై గాంధీ నెహ్రూలతో సంప్రదింపులు జరుపుతూ వుండగా నేడు బర్మా ప్రధానమంత్రిగా వున్న ఊనూ బ్రిటిషువారితో అలాంటి సంప్రదింపులే జరుపుతున్నాడు. వియత్నామ్ నాయకులుకూడా తమ స్వాతంత్ర్యం విషయంలో ఫ్రెంచివారితో సంప్రదింపులు జరుపుతున్నారు.

కాని ఇక్కడే ఈరెండు దేశాల సామ్యాలు సమాప్తమయ్యాయి. ముందే వేసినట్లుగా: బర్మా, ఇండియా, పాకిస్తాన్, సింహళదేశాలకు సంపూర్ణ స్వాతంత్ర్యమివ్వడానికి బ్రిటిషువారు అంగీకరించారు. కాని వియత్నాములో, కాంబోడియా లావోస్ అనే రెండు సహరాజ్యాలలో ఫ్రెంచివారు తిష్ఠవేసుకు కూర్చున్నారు. స్వాతంత్ర్యం ఇవ్వాలా వద్దా అని సంకోచించారు. తత్ఫలితంగా ఎనిమిదేళ్లపాటు అంతర్యుద్ధం జరిగింది. ఉభయపక్షాలకశ్తీ ఉడిగిపోయింది.

ఈనాడు 140,000 మంది ఫ్రెంచి యూనియన్ సైనికులు ఫ్రెంచివారి శిక్షణపొంది ఆయుధాలతో వారినాయకత్వంక్రిందవున్న 160,000 మంది వియత్నామ్ సైనికులు అంతర్యుద్ధంలో పాల్గొంటున్నారు. 38,000 మంది ఫ్రెంచి యూనియన్ సైనికులు నిహతులైనారు. వీరిలో 11,000 మంది ఫ్రెంచి సైనికులు కూడా కలరు. చాలామంది అనుభవజ్ఞులైన సైనికాధికార్లు హతమయ్యారు.

ఫ్రెంచివారి ఈ యత్నానికి అమెరికాచేసిన సైనికసహాయం పందొమ్మిదివందల కోట్ల డాలర్లు! అంటే గడచిన ఐదేండ్లలో ప్రపంచవ్యాప్త పాయింట్ ఫోర్ అభివృద్ధి కార్యక్రమానికి పెట్టబడ్డ మొత్తం ఖర్చుకు రెండురెట్లు. వేరే మాటలలో ఇది: ఫ్రాన్సుకూడా మార్షల్ పథకంక్రింద అమెరికానుండి తనకు ముట్టిన దానికంటె అధికంగానే ఇండోచైనా యుద్ధానికి వ్యయపరిచింది. అయినప్పటికీ నేను ఈ వ్యాసం వ్రాస్తూవున్న సమయాన ఉత్తర వియత్నామ్‌కు చెందిన సారవంతమైన డెల్టాభూమిపై ఫ్రెంచిసేనలు పెట్టిన అడుగును నిల్పుకోగలవా, లేక తోకముడుచుకొని వెనక్కి రావలసివస్తుందా అన్న సందిగ్ధస్థితి యేర్పడింది.

"ఇలాంటి యుద్ధంలో మేము కమ్యూనిస్టులను ఎట్లా జయించేము?" అన్నా డా ప్రధానమంత్రి బెంగగా।

ఇది జరిగిన మరి ఏడు నెలలకు నేను వాస్‌తామును ప్రెగ్‌స్‌లోని ఆయన కార్యాలయంలో కలుసుకున్నాను. అప్పు డాయన పరిస్థితి చాలా మెరుగైందని అన్నాడు. "ఇప్పుడు ఫ్రెంచివారు ఒక గ్రామాన్ని తిరిగి స్వాధీనపరచుకుంటే భూమిని రైతులకే వుండనిస్తున్నారు. కమ్యూనిస్టులు మళ్ళీ వశపరచుకొంటే తనకు భూమి ఇస్తారని రైతు నమ్మడం. ఆతర్వాత మళ్ళీ ఫ్రెంచివారే వశపరచుకోవాలనీ, అప్పుడు భూమిని తన క్రిందే వుంచుకోవచ్చనీ భూస్వామి ఆశ. ఇలావుంది పరిస్థితి" అన్నా డాయన వ్యంగ్యంగా.

వియత్నాములో ఇలా అమెరికన్లు తప్పుడు అంచనాలు వేసుకొని, అపోర్థాలు చేసుకొని ఆసియావాసుల స్వాతంత్ర్యకాంక్షను సరిగా చేయని పరిస్థితిని కొని తెచ్చుకున్నారు. మరి యుద్ధానంతర బర్మాగాథ ఇందుకు భిన్నంగా వుంది.

1946 లో ఇండోచైనాలో ఫ్రెంచివారిని తీవ్రంగా ఎదిరించడం ఇలా ఆరంభమవుతూ వుండగా బర్మాలోనూ అంతర్యుద్ధస్థితి ఏర్పడింది. బ్రిటిషువారిని ఆయుధాలతో ఎదిరించడం మొదలైంది. కాని బర్మా 1947 లో స్వాతంత్ర్యం పొందింది. ఇండోచైనా విషయం అందుకు భిన్నంగా వుంది.

బ్రిటిషువారు ఉపసంహరించుకునేసరికి "వలసవాదం అంతరించుగాక" అని కేకలువేయగల అవకాశం బర్మా కమ్యూనిస్టులకు లేకుండాపోయింది. మరి వియత్నాములో ఇట్టి అవకాశాన్ని అచటి కమ్యూనిస్టులకు ఫ్రెంచివారు వుంచారు కదా. అందుచేత ఆశాభంగంపొందిన బర్మా కమ్యూనిస్టులు 1948 లో కొత్త ప్రభుత్వానికి వ్యతిరేకంగా బాహాటంగా సాయుధపోరాటం చేసిరి. 1949 లో వారికి కరెన్ తెగవారు తోడయ్యారు. కరెన్ తెగవారు తూర్పుబర్మాలో వున్నారు. వీరు యుద్ధమంటే ఉత్సాహం గలవారు. తమ తెగ కొక ప్రత్యేక స్వతంత్ర రాజ్యాన్ని నెలకొల్పాలని వీరిదీక్ష. 1951 కల్లా బర్మా అంతటా పోరువ్యాపించింది. సర్వస్వతంత్ర బర్మా ప్రజారాజ్య భవిష్యత్తు అంధకారబంధురంగా కన్పించింది.

బర్మాకొత్తప్రభుత్వం పతనంకానున్నదని 1951 లో అమెరికా ప్రభుత్వం గ్రహించింది. సరిగ్గా ఆసమయానికే ఆసియాలో అధికారాసక్తి మూలం ఏది, దానికి ఆధారా లేవి అన్న అంశాన్ని శ్రద్ధగా పరికించే చైనా కమ్యూనిస్టు ప్రభుత్వం బర్మా

కమ్యూనిస్టులను తన చిట్టా పుస్తకాలలో నుంచి కొట్టి పారవేసింది. వారు దేనికీ కొరగానివారని తేల్చుకొంది.

అలా తేల్చుకున్న కమ్యూనిస్టు చైనా వియత్నాములో కమ్యూనిస్టుల నాయకత్వాన గల శక్తులకు అధికంగా సహాయం చేయ మొదలెట్టింది. బర్మా కొత్తప్రభుత్వం అటూఇటూ అని వున్నస్థితిలో సైతం కమ్యూనిస్టు చైనావారి ఆయుధాలూ, యుద్ధసామగ్రీ బర్మాలోని కమ్యూనిస్టులకు సహాయంగా, అమెరికన్లకు తెలిసినంతవరకు, అందలేదు. తాము అలా జోక్యంచేసుకొంటే స్వతంత్ర బర్మా ప్రభుత్వం తమదేశంలోని కమ్యూనిస్టు తిరుగుబాటుదార్లకు చైనా సహాయం చేస్తున్నదని ఆరోపిస్తుందనీ, అమూలకంగా విదేశ ప్రాబల్యాన్నిగూర్చిన పాత భయాలు తిరిగి తలెత్తుతాయనీ పీకింగ్ ప్రభుత్వానికి తెలుసు.

క్రమేణా ప్రధానమంత్రి ఊనూ, అతని సహచరులూ బర్మా అంతటా స్థిరమైన ప్రభుత్వాన్ని నెలకొల్పగలిగారు. సకాలంలో చిత్తశుద్ధితో ఆర్థిక రాజకీయ సంస్కరణలు ప్రవేశపెట్టి కమ్యూనిస్టులకు ఆస్కారం లేకుండాచేశారు. ఈ సంవత్సరం ఏప్రియల్లో తనంతట తానే ప్రభుత్వానికి లొంగిపోయిన చిట్టచివరి బర్మా కమ్యూనిస్టు నాయకుడు "మేము ప్రజలకు వాగ్దానం చేస్తూవచ్చిన గ్రామ సంస్కరణల కార్యక్రమాన్ని ఊనూ అమలుపరిచాడు. ఇక మాకు ప్రజలమద్దతు పొందడానికి ఆస్కారమే లేకపోయింది." అని స్పష్టంగా చెప్పాడు.

బర్మాదేశం ప్రజాస్వామిక సూత్రాలకు అంకితమైనప్పటికీ ఇండియావలెనే అది కూడా ప్రపంచవ్యవహారాలలో ఎటూమొగ్గని తటస్థవిధానం అవలంబించింది. దీనినే విబంధవిధాన మంటున్నారు. 1950 జనవరిలో బర్మా కమ్యూనిస్టు చైనా ప్రభుత్వాన్ని పరిగణించింది. అంటే కమ్యూనిస్టు చైనాను పరిగణించిన కమ్యూనిస్టేతర రాజ్యాలలో బర్మా మొట్టమొదటిదన్నమాట. ఉత్తరబర్మాలోని జాతీయచైనా సైన్యాలకు ఆయుధాలు ఫార్మోజానుంచి సరఫరా అవుతున్నాయనీ, ఇది అమెరికా సమ్మతితోనే జరుగుతూవుందనీ నమ్మకం కలిగిన బర్మా ప్రభుత్వం 1953 లో అమెరికానుంచి ఇక తాను ఎట్టి ఆర్థికసహాయం స్వీకరించనని మర్యాదగానే గట్టిగా చెప్పింది.

ఆగ్నేయాసియాలో పరిమాణంలో, సాధనసంపత్తిలో సామ్యంగల రెండు ఆగ్నేయాసియాదేశాల వృత్తాంతాలు పైవిధంగా వున్నవి. మళ్ళీ వాటి రాజకీయ

వైఖరులలో ఎంతతేడా వుందో చూచారు కదా! నేటి సంకీర్ణ, సంశ్లిష్ట, విభజిత ప్రపంచంలో అమెరికన్ల మనుగడకూ, భద్రతకూ అక్కరకొచ్చే ఆచరణసాధ్యమైన విధానాన్ని రూపొందించుకొనే ప్రయత్నించే అమెరికన్లకు ఈ రెండు దేశాల గాథలూ నేర్పే గుణపాఠాలేమిటి?

ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలో వలసవాదం చావుకు దగ్గరలో వుందనీ, అమెరికా ఇక ఏమాత్రం దానిని బలపరచకూడదనీ ఇండోచైనా విషాద గాథ అమెరికన్లకు తెలుపడంలేదా?

ఫ్రెంచివారు నిజాయతీతోనే "ఇండోచైనాలో మేము మా బలహీనతను కనపరిచామంటే మొరాకోలో, టునీసియాలో, ఫ్రెంచి ఆఫ్రికా అంతటా స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రోత్సహించినట్లవుతుంది'' అని అన్నారు.

కాని 38,000 ఫ్రెంచి ప్రాణాలూ, వియత్నాములో పెట్టిన కోట్లకొద్దీ ఫ్రెంచి అమెరికన్ డబ్బూ ఆఫ్రికాలో ఫ్రెంచి అమెరికన్ బలం వృద్ధికావడానికి తోడ్పడ్డాయా? పైగా వియత్నామ్ పరిస్థితిని గమనించిన టునీసియా మొరాకో అల్జీరియా దేశాల యువక విప్లవవాదులు రక్తపాతంవల్లనే, కమ్యూనిస్టుల ముట్టడివల్లనే తమకు స్వాతంత్ర్యం లభించగలదనీ, మరోవిధంగా రాదనీ అనుకోరా?

ఈ విప్లవాత్మకప్రపంచంలో అధికార స్వభావమెటువంటిదో కూడా అమెరికన్లకు దీనివల్ల తెలుస్తున్నది. ఇది రెండవ గుణపాఠం. అమెరికన్లకు బాసటగా నిలుస్తామని చెబుతూవున్న దేశాల సంఖ్యను అమెరికన్లకు వ్యతిరేకమైన దేశాల సంఖ్యతో పోల్చి స్వేచ్ఛా ప్రపంచపుబలాన్ని అంచనావేయడం తగునా? అమెరికా అడుగులకు మడుగులొత్తుతూ ఎట్టివైనా మనమాటలను బొదలదాల్చేవారే నమ్మదగ్గవారని షరతుపెట్టడం సబబా? రాజకీయంగా నమ్మదగ్గవారు సైనికంగా కూడా ఆధారపడదగ్గవారవుతారా? వాస్తవ బలాబలాలను గమనించనక్కరలేదా?

విస్తృతమవుతూవున్న ప్రపంచ కమ్యూనిజంపై ప్రజాస్వామ్యం జరిపే పోరాటంలో డబ్బు విలువ నశించి చెడ్డరోజులు వచ్చినప్పుడు ఐక్యరాజ్యసమితిలో ఈనాడు అమెరికా తరఫున ఓటువేస్తూ వున్న దేశాలపై ఆధారపడి అమెరికన్లు మనగలరా?

మరి బర్మావారు తటస్థులే. స్వాతంత్ర్యంకోసం పోరాడినవారే. అయినా కమ్యూనిస్టు చైనాను పరిగణించడంలో ప్రథములు। వారి సంగతేమిటి? కారణ

దేశజనాభా 30 కోట్లకుపైగా వుంచే. భారతీయులు చైతన్యపూరిత ప్రజాస్వామ్యం కోసం పాటుపడుతున్నారు కదా! అమెరికా నాయకత్వం విషయంలో వారికి నమ్మకం లేదే! ఇట్టి భారతీయుల మాటేమిటి? మరి తటస్థులైన స్వీడ్స్, స్విస్సుల సంగతేమిటి? వీరందరినీ మన చిత్రాలోనుంచి కొట్టిపారవేసే ముందు, తటస్థులైన 40 లక్షల ఫిన్లెండు దేశీయులు ఒకప్పుడు యావత్తు ఎర్రసైన్యాన్ని ఎదుర్కొనిలిచా రన్న విషయం మనం జ్ఞాపకం తెచ్చుకోవాలి.

నేటి విప్లవాత్మక ప్రపంచంలో అధికారం, బలం అనేవి అనేక చిక్కులతో కూడుకొనివున్నవనీ, తూటాలకన్నా బాంబులకన్నా ఐక్యరాజ్యసమితిలోని ఓట్లకన్నా అధికారబలం సంక్లిష్టమైనదనీ అమెరికా విధానం మొదట పరిగణించాలి. ఈ విషయాన్ని గ్రహించినవారు ఇండో చైనాలో దెబ్బతిని గ్రహించారు. రష్యావారు దీనిని తూర్పుజర్మనీలో, పోలెండులో, బాల్కన్ దేశాలలో తెలుసుకున్నారు. చైనావారు కొరియాలో గ్రహించారు.

అధికారబలాన్ని అనేక అంశాలతో కొలవవలసివుంటుంది. కాని అసలు లెక్కకు వచ్చేది ప్రజలూ, వారిని కార్యోన్ముఖులనుచేసే భావాలూ అని అమెరికన్లు తెలుసుకోవాలి.

## 27

# "రంగు మనిషి భారం" అంటే?

కొత్తగా స్వాతంత్ర్యంపొందిన దేశాలూ, పాశ్చాత్యదేశాలూ పరస్పరం అవగాహన చేసుకోవలసిన ఆవశ్యకత పెరగడంతో ఆసియావారూ, ఆఫ్రికావారూ పాశ్చాత్యదేశాలనుగూర్చి తమ మనస్సులలో గల అపోహలను, అనుమానాలను దూరంచేసుకోవాలని శ్రీబౌల్స్ విజ్ఞప్తిచేశారు. ఇది 1964 సెప్టెంబరు 6 తేదీనాటి 'న్యూయార్కు టైమ్సు మేగజైన్' పత్రికలో వ్రాసిన వ్యాసం.

పూర్వం "తెల్లవాడి భారం" అన్న ప్రయోగం వాడుకలో వుండేది. ఆమాటలో వున్న కపటం ఆసియావాసులకూ, పాశ్చాత్యదేశాలలోని పెద్దలకూ తెలిసినదే. అయితే ఆలస్యంగానైనా ఇప్పుడు పాశ్చాత్యదేశాలు సహకారానికి కొత్త ప్రాతిపదికను అన్వేషిస్తున్నవిగాన అవి మరొక ఆటంకాన్ని ఎదుర్కొంటున్నవి. ఆ ఆటంకమేమిటంటే—ఆసియా వారి మనస్థితి. దీనినే "రంగుమనిషి భారం" అనవచ్చు.

ఆసియాలో కొత్తదేశాలు సాధించిన విశేషాలు నన్ను గాఢంగా ఆకర్షించినవి. ఆసియా విషయంలో పాశ్చాత్యుల తొలిదృక్పథం నాకు గిట్టనిదన్న సంగతి జగమెరిగినదే. అయితే ఆసియావాసులలో కొందరు, కావాలనుకున్నా లేకపోయినా, అదేపనిగా పాశ్చాత్యదేశాలపై రాళ్ళు విసురుతూ వుంటారు. అలాంటి వారు వాస్తవాలకు దూరంగా ఒంటిస్తంభం మేడలో నివసిస్తున్నారని నేను చెప్పవలసివుంది.

బహుశా ఆసియా ఒంటిస్తంభంమేడను శత్రుభావంతో గాక మిత్రభావంతో పరికిస్తే అమెరికన్లకు అత్యవసరమైన దృక్పథం ఏర్పడుతుందేమో.

మొదట వలసవాదంతో ఆరంభిద్దాము. పాశ్చాత్యుల వలసపాలనను ఆసియావాసులు ఇటీవలే అనుభవించి కోపతాపాలతో వున్నారు కాబట్టి పాశ్చాత్యేతరమైన సామ్రాజ్యవాద స్మృతులు వారికిప్పుడు లేవు. అవి చెరిగిపోయినవి. పూర్వం ఆసియావారు ఆసియా ప్రాంతాలనే వలసలుగా చేసుకొని పాలించిన సందర్భము లున్నవికదా! ఇందుకు ఉదాహరణగా 1931-1945 మధ్యకాలంలో జపానువారి ఆక్రమణను పేర్కొనవచ్చు.

ఆసియావారు తమ చరిత్రను తామే మరొకమారు చదువుకుంటే వలసవాదమనేది కేవలం పాశ్చాత్యవ్యాధిమాత్రమే కాదనీ, ఏ సమాజంలోనైనా అట్టి దశ రావచ్చుననీ, దానికి గురిఅయినవారు ఎంతగా క్లేశపడ్డా పరిణామం తప్పనిసరి అనీ విశదంకాగలదు.

ఉదాహరణకు భారతదేశాన్ని తీసుకుందాము. భారతదేశం తన పూర్వ చరిత్రను గర్వకారణంగా భావిస్తుంది. అంతేగాక ఆగ్నేయాసియాలో పూర్వపు తన వలసలనుగూర్చి గొప్పగా చెప్పుకుంటుంది. అశోకుని కాలము లగాయతు పాశ్చాత్యులు అన్వేషకులై తూర్పు సముద్రముల మీదికి వచ్చునంతవరకూ భారత దేశం సంస్కృతికీ, వ్యాపారవాణిజ్యాలకూ, జయించి ఆక్రమించుకోవడాలకూ ఉజ్జ్వలకేంద్రంగా వుండేది.

నాపిల్లలు క్రొత్త ఢిల్లీ పబ్లిక్ స్కూళ్ళలో చదువుకొనేటప్పుడు వారి చరిత్ర పుస్తకంలో 'విశాల మహాభారతము' అన్న శీర్షికతో ఒకపాఠం వుండేది. అందులో వున్నపటాలలో సింహళము, బర్మా, మలయా, జావా, సుమత్రా, బోర్నియో, బాలి, కాంబోడియాలు హిందువుల వలసప్రాంతాలుగా చూపబడివున్నాయి. గ్రంథకర్త "ఈవలసలను ఏర్పరచుకోవడంలో భారతీయుల ఉద్దేశం పరపీడనకా"దనీ, "నానాటికీ విస్తృతమవుతూవున్న భారతీయుల వాణిజ్యానికి క్రొత్త విపణులు సమకూర్చు కోవడంకూడా కాదు'' అనీ చెప్పాడు.

భారతదేశంలో పాఠశాలల్లో చదువుకొనే పిల్లలకు "హైందవ వలసవాదులు నాగరికత అనే జ్యోతిని ఆగ్నేయాసియా ప్రాంతానికి గొనిపొయ్యారనీ, అట్టి నాగరికతవల్ల వెనుకబడివున్న ప్రాంతాలకు మేలేకలిగిందనీ" చెబుతూ వుంటారు. ఇదంతా నిజమే కావచ్చు. కాని యూరపు వలసవాదమునకు క్షమాపణ చెప్పుతున్న

రుడ్‌యార్డుకిప్లింగ్ మహాశయుడు దీన్నిగూర్చి ఏమంటాడు? యూరపు వలసవాదం కంటె ఇది మేలైనదని అంటాడా?

చారిత్రకమైన భారతదేశపు ఈ పాత్రను శ్రీ నెహ్రూ తమ 'భారత సందర్శనం' అన్న గ్రంథంలో దాచకుండా, యథార్థమైన వలసవాద సందర్భమే నని అన్నారు. దక్షిణభారతమునకు చెందిన చోళసామ్రాజ్యాధీశులు సింహళమును, దక్షిణబర్మాను, ఇండోనేషియాలోని కొన్ని ప్రాంతాలను జయించి స్వాధీన పరచుకున్నారని ఆయన వ్రాశారు. అప్పుడుకూడా మలయాలో భారతీయుల దృష్టి తగిరమును త్రవ్వి తీయడంపైనే వుండేదని ఆయన అన్నారు.

ఈనాటికికూడా ఇరుగుపొరుగున వున్న ఆసియా రాజధానులలో-ముఖ్యంగా సింహళ నేపాళములలో క్రొత్తరకం భారతీయ సామ్రాజ్యవాదం తలయెత్తుతుందేమోనన్న భయాందోళనలున్నవి. ఇవి నిష్కారణమైనవని భారతీయులంటారు. అమెరికా ఇరుగుపొరుగున వున్న దేశాలు పడే భయాన్నిగూర్చి మనము కూడా అంతే అంటాముకదా! అయినా ఈ ఆరోపణలను తరచు వింటూ వుంటాము. చాలామంది అవి నిజమైనవేనని నమ్ముతున్నారు. కనుక భారతదేశ స్థితి క్రమేణా వృద్ధిజెందుతున్నది కాబట్టీ, దాని పలుకుబడీ, ప్రాబల్యం హెచ్చుతున్నవి కాబట్టీ దానిని ఇరుగుపొరుగువారు భయంతో చూడడం, అనుమానాలు పెట్టుకోవడం కూడా అధికమవుతూనే వుంటుంది.

భారతదేశ ఉత్తరసరిహద్దున 500 మైళ్ళ మేరకు నేపాలు విస్తరించివుంది. నేపాలుకూ, భారతదేశానికీ గల ప్రస్తుత సంబంధాలు, వాటి ఒడుదుడుకులు అమెరికాకూ, దాని మిత్రరాజ్యాలు కొన్నిటికీ, సహచరరాజ్యాలు కొన్నిటికీ గల సంబంధాలను పోలివున్నాయి.

1951 లో టిబెట్టులో కమ్యూనిస్టుసైనా రోడ్లువేయ నారంభించినప్పుడు, భారతదేశం తన ఉత్తర సరిహద్దుల విషయమై ఆందోళన చెందింది. 1952 లో భారతీయ సైనికబృందం నేపాలు సైన్యాన్ని పునర్వ్యవస్థీకరించడానికై ఖాట్మండూకు పంపబడింది. టిబెట్టు - నేపాలు సరిహద్దులపైగల హిమాలయ కనుమలలో గస్తీ తిరగడానికై నేపాళీ గూర్ఖా దళాలతోపాటు భారతీయ సైనికదళాలుకూడా పంపబడ్డవి.

ఆ తర్వాత వెంటనే భారతదేశం నేపాలుప్రభుత్వానికి తగు ఆర్థికసహాయం

చేయడం జరిగింది. ఆపిమ్మట అనేక ఆర్థిక రాజకీయ సంస్కరణలు నేపాలులో ప్రవేశపెట్టారు. ఆవెనుక నేపాలు పన్నులవిధానాన్ని ఆధునికంచేసి, దాని రోడ్డు నిర్మాణ కార్యక్రమంలో సహాయపడి, దాని ప్రభుత్వయంత్రాంగమును బాగుపరచ డానికై భారతదేశం తన ప్రభుత్వాధికార్లలో ప్రవీణులైనవారిని పంపింది.

భారతదేశం ఈ విధంగా ధైర్యంచేసి సర్వతోముఖకృషి చేయడంవల్లా, అమెరికా ఒకిమోస్తరుగా పాయింట్ ఫోర్ కార్యక్రమంక్రింద సహాయం చేయడం వల్లా నేపాలు ప్రజాస్వామ్య విధానంప్రకారం స్వతంత్రంగా వుండే అవకాశం కలిగింది. అయినా భారతదేశం అంత ఉదారంగాచేసిన సహాయానికి నేపాలు ప్రజలు సంతోషపడి, కృతజ్ఞతాభావంతో ఉప్పొంగిపోయారా? లేదు. అమెరికా చేసే సహాయానికి కొన్ని స్వేచ్ఛాప్రియదేశాలు ఎంత కృతజ్ఞత కలిగివుంటున్నాయో భారతసహాయానికి నేపాలుకూడా అదేవైఖరి చూపింది.

అంతర్జాతీయ వైమనస్యాల విషయంలో గమనించదగ్గవి మరికొన్ని పోలికలున్నాయి. సోవియట్ యూనియన్‌తో, ఎర్రచైనాతో అమెరికా సఖ్యత కుదుర్చుకోలేక పోతూవుందని తరచు విమర్శించే భారతీయులు భారత పాకిస్తానుల విభేదాలు సత్వరంగా పరిష్కరింపబడటంలేదన్న అంశాన్ని గమనిస్తున్నారా? ఆ మాట వచ్చేసరికి మౌనభావంగా వుంటున్నారు.

అయినా భారతపాకిస్తానుల ప్రజలు కొన్నిశతాబ్దాలపాటు ఒకే ప్రభుత్వం క్రింద వున్నవారు. వీరు మాట్లాడేభాషలు చూద్దామా అంటే తేడాలేదు. పాకిస్తాన్ భాషలు భారతదేశంలోనూ వున్నవి. ఉభయదేశాలూ ప్రపంచవ్యవహారాలలో సహేతుకమైన సమస్వీకృత విధానాన్ని అనుసరిస్తే ఆసియాలో శాంతికి అవకాశాలు హెచ్చుఅవుతాయి. స్వాతంత్ర్యం పొంది ఏడు సంవత్సరాలైనతర్వాత కూడా ఈ రెండుదేశాలూ పరస్పరవైరంతో రాజీకి రాలేకపోతున్నవి.

ఆసియావారు సహనం, హృదయవైశాల్యం, జీవకారుణ్యభావం వుండాలని బోధిస్తూవుంటారు. కాని వారిలోనే కులమత జాతిభేదాలున్నవి. అవిచూచి మేము తికమకపడి, "అయ్యా, ఆసియా ప్రజలారా, మీరు చెప్పేది మొదట మీరు ఆచరించండి" అని అంటూవుంటాము.

అమెరికాలో నీగ్రోలను కేటాయింపుగా చూడడాన్ని, భారతదేశంలో కులభేదా

లను పాటించడాన్ని ఒకేరకమైన విచక్షణగా భారతీయులు గుర్తించరు. భారతీయుల ఈ వైఖరికి పాశ్చాత్యులు విస్తుపోతూవుంటారు. అందుచేత ఒకరు మరొకరి సమస్యలను అర్థంచేసుకొనవలసిన సమయం ఆసన్నమైంది. అవతలివారి కృషికి దోహదం చేయాలిగాని లేనిపోని ఆక్షేపణలు చేయడం మంచిదికాదు.

ఇట్టి ఆవేశాలను గాంధీజీ వ్యతిరేకించాడు. అందుకై తనప్రాణాలిచ్చాడు. కాబట్టే ఆయన సహనమునూ, ఉచితానుచితాలనూ ప్రబోధించే ఆసియాకూ, తప్పొప్పులను నైతికదృక్పథంతో చూచే పాశ్చాత్యప్రపంచానికీ సంధానకర్తగా ఉపయోగపడ్డాడు. శాంతము కావాలన్నాడు. అయితే అన్యాయాన్ని చూస్తూ వూరుకునేవాడా? లేదు. ఇతరులకు లొంగాలా? లేదు. సకలజీవులనూ గౌరవించండని చెప్పాడు. కాని చెడును, అది ఏరూపంలోవున్నా, ఎదిరించమన్నాడు.

ప్రాచీన ఆసియా మతసూత్రాలైన శాంతము, సన్యాసము మున్నగు సద్గుణాలను వ్యాప్తిలోకితెచ్చి వాటికి ప్రాబల్యం కల్పించవలెనని ప్రయత్నించాడు. కాని ఆయనకు వ్యతిరేకంగా హింసాత్మకధోరణి ఒకటి ప్రబలింది. ఉద్రేకస్వభావంగల బెంగాలునాయకుడు సుభాస్‌చంద్రబోసు బ్రిటీషువారితో పోరాడటానికై, భారత జాతీయసైన్యాన్ని ఏర్పాటుచేశాడు. ఆయనను ఆరాధించేవారు నేటికీ ఆసియా ఖండంలో చాలామంది వున్నారు. 1948 లో భారతదేశం కాశ్మీరును కాపాడటానికై తక్షణమే సైన్యాన్ని పంపింది. సైనికంగా విజయమొందింది. మరి గాంధీ చెప్పినట్లు హింసను ద్వేషించే లక్షలాది భారతీయులు తమ ప్రభుత్వపు చర్యకు హర్షామోదములు తెలిపారు. గాంధీమహాత్ముడు కూడా బహిరంగంగానే ఆ చర్యకు తన ఆమోదంతెలిపాడు. అలా ఆమోదించడం విషాదకరమే కదా!

కాబట్టి తేలిందేమంటే ఆసియాఖండానికి బుద్ధుడు, అశోకుడు, గాంధీ మున్నగు మహనీయులున్నప్పటికీ వారుకూడా తక్కిన ప్రపంచంవలెనే హింసాత్మక విధానాలనూ, యుద్ధాన్నీ వర్జించలేక పోతున్నారు. పాకిస్తాను గనుక సరిహద్దుపైగల తన సైన్యాలసంఖ్యను పెంచిందంటే తన బలాన్నికూడా పెంచుకోవడం తప్ప ఏమిచేయాలో భారతదేశానికి తోచకుండావుంది. అలాగే భారతదేశం పెంచినప్పుడు పాకిస్తాన్ కూడా పెంచుతున్నది. కనుక ఇంతకూ నేను చెప్పవచ్చిన దేమిటంటే-ఒకభయానికి తోడు మరొకభయం చేరి సైన్యాన్నీ, ఆయుధాలనూ పెంపు చేసుకోవడమనేది ఒక్క పాశ్చాత్యదేశాలలో మాత్రమే జరగడం లేదు. ఆసియాతోసహా అంతటా జరుగుతూవుంది.

నవ ఆసియా భౌతికాభివృద్ధికోసం అర్రులు చాస్తూవుంది. ఇందులో దాపరికం లేదు. ఎల్లెడలా కన్పిస్తున్నదే. చైనాలో క్రూరమైన దౌర్జన్యంతో, హింసతో అచటి మానవశక్తిని వినియోగానికి తేవడం జరుగుతూవుంది. అహింసతో తమదేశపు 36 కోట్ల ప్రజలకు స్వాతంత్ర్యం సంపాదించిపెట్టిన ప్రజాస్వామిక భారతనాయకులు నియంతృత్వ మక్కరలేకుండానే దారిద్ర్యాన్నీ, పేదరికాన్నీ నిర్మూలించవచ్చునని నిరూపించడంకోసం తమ శక్తియుక్తులనన్నీ వినియోగించి పంచవర్ష ప్రణాళికలు అమలు జరుపుకుంటున్నారు.

మంచికో, చెడుకో, చెప్పలేముగాని ఐహికచింతన అంతగా లేనివారని పేర్వడసిన ఆసియావాసులు ఇప్పుడు ఉరుకులు పరుగులతో అభివృద్ధిసాధనకు పూనుకున్నారు. పాశ్చాత్యపద్ధతులను త్యజించడంపోయి ప్రజలు, పార్లమెంటులు అభివృద్ధికోసం తహతహలాడటం అమెరికన్లు చూస్తున్నారు.

అంతర్జాతీయ వ్యవహారాలలో ఒక నిర్ణయానికి రావడంలో స్వేచ్ఛా ప్రియమైన ఆసియాదేశాల నాయకుల విచిత్రమైన రెండు నాల్కల విధానాన్ని చూచిన పాశ్చాత్యులు ఆశ్చర్యపోతూ వుంటారు. చరిత్ర ఆరంభమైనదాదిగా ఆసియా మత నాయకుల లక్ష్యాలు ఎంత గొప్పవైనా సరే వాటిసాధనకు దుష్టవిధానాలను అవలంబించడం మంచిదికాదని చెబుతూ వచ్చారు. గాంధీ బోధనలలో ముఖ్యమైనది ఇదే. లక్ష్యాలకన్న సాధనాలు ముఖ్యమన్నాడు ఆయన.

అయినప్పటికీ దుష్టవిధానాలను తెగడే ఆసియా నాయకులు అవసరమొచ్చినప్పుడు వాటిని అవలంబిస్తూనే వున్నారు. పాశ్చాత్యదేశాలు చేసే ప్రతితప్పుకూ సంజాయిషీ చెప్పమని అంటారు. కాని కమ్యూనిస్టుదేశాలు అవలంబించే కపట వైఖరిని, అక్కడ జరిగే అకృత్యాలను విమర్శించారు. తమకు పట్టనట్లు ఉపేక్షా భావంతో వుంటారు.

పొగరుతో నిండిన పాతవైఖరులను విడనాడమనీ, ఇతరుల అభిప్రాయాలను గౌరవించమనీ, రాజకీయమైన షరతులూ తగలాటకాలూ లేకుండాచేసే సహాయం చేయమనీ అడిగేహక్కు ఆసియావారికి వుంది. అది నేను కాదనను. అంతేగాక అంతర్జాతీయ వ్యవహారాలలో మరింత ఉన్నతనైతిక ప్రమాణంతో వ్యవహరించమనీ, సంప్రదింపులలో పట్టువిడుపులు, సరసత చూపమనీ, బాంబులపైనా పాశవిక శక్తిపైనా ఆట్టే ఆధారపడక చరిత్రగమనాన్ని తీర్చిదిద్దుతూవున్న రాజకీయ ఆర్థిక

శక్తులను మరింత సన్నిహితంగా అవగాహనచేసుకోవలసిందనీ కోరేహక్కు కూడా ఆసియావారికి వుంది.

కాని అందుకు బదులుగా మా కష్టాలను తెలుసుకోమనీ, శాంతి అనేది ఇరు పైపులవారూ హృదయపూర్వకంగా వాంఛిస్తేనే లభ్యమవుతుందనీ, కమ్యూనిస్టులు కూడా ప్రపంచాధిపత్యం వహించవలెనన్న వారి ఉద్దేశాలను విడనాడితేనే శాంతి సాధ్యమవుతుందనీ కమ్యూనిస్టేతరులైన ఆసియావారు గ్రహించవలెననే హక్కు అమెరికాకూ, పాశ్చాత్యదేశాలవారికీ వుంది.

"తెల్లవాడి పీడ" అని చెప్పబడ్డకాలంలో ఎంతకపటమున్నా, ఎంతవంచన వున్నప్పటికీ పాశ్చాత్యులలో కూడా కొందరు నిజాయతీపరులు వుండేవారు. వారు తమ నాగరికతలో గల ఉత్తమ అంశాలను ఆసియాదేశాలకు కూడా వర్తింపచేసి, అవి పురోగమించడానికి పాటుపడి కొంతవరకు కృతకృత్యులయ్యారు. ఈనాడు రంగుమనిషికి ప్రపంచవ్యవహారాలలో హెచ్చుబాధ్యత లభ్యమవుతున్నది. అందు చేత తాను పొరపాట్లుచేసి గుణపాఠాలు నేర్చుకున్న పాశ్చాత్యప్రపంచం ఆ పొర పాట్లే మీరూ చేయవద్దని ఆసియావారికి చెప్పడం అనుచితం కాదు.

అసలే అయోమయమైవున్న అంతర్జాతీయవ్యవహారాలలో తానూ మరొక కలహకారంగా తయారై ఇతరులను దూషించడం ఆసియా చేయవలసిన పని కాదు. ఆసియాచేయవలసిన మంచిపనులెన్నో వున్నవి; నేటి ప్రపంచానికి ఊరట కలిగించడం అవసరం. ఆశలు చిగిర్చజేయడం అవసరం. ఒక మంచితెరువును చూపాలి. ఇక్కడే వారు నిర్వహించవలసిన కర్తవ్యం వుంది.

"యావత్ప్రపంచానికీ ఆసియా ఇవ్వగల సందేశం వుంది....అయితే ఆసియా ఆసియాకొరకే గాక సకలప్రపంచానికీ ఆధారంగా వుండాలంటే అది పునహః బుద్ధుని సందేశాన్ని అభ్యసించాలి. ఆ సందేశాన్ని ప్రపంచానికొసగాలి" అని గాంధీ తన అనుచరులకు హితవు చెప్పినప్పుడు ఆయన ఉద్దేశం పైన నేను చెప్పిందే నని అనుకుంటాను.

# 28

# స్వతంత్ర ఆసియా భవిష్యత్తేమిటి ?

ఆసియా విధానం విషయంలో నూతనదృక్పథం, కొత్త ప్రతిపాదనలు అవసరమని శ్రీ బౌల్స్ విశ్వాసం. ఆసియాలో ప్రచలితమౌతున్న విప్లవాత్మకశక్తులను పరిశీలనగా అవలోకిస్తూ ఆసియా మన్రోసిద్ధాంతం సాధ్యపడవచ్చునని ఆయన అన్నారు.

1954 అక్టోబరు నెల 'ఫారిన్ ఎఫేర్స్' పత్రికనుండి.

చారిత్రక సామ్యాలూ, సాదృశ్యాలూ తరచు అల్పమైనవి. కాని నేటి ఆసియా తటస్థదృక్పథానికీ, గతశతాబ్దిలో అమెరికా విదేశాంగవిధానాన్ని రూపొందించిన వైఖరులకూ మధ్యగల పోలిక కొట్టవచ్చినట్లు, స్ఫుటంగా కనిపిస్తుంది.

కొత్తగా స్వాతంత్ర్యంపొందిన ఆసియాదేశాలవలెనే అమెరికా సంయుక్త రాష్ట్రాల రాజ్యంకూడా ఫ్రెంచి విప్లవము, నెపోలియన్ యుద్ధాలు ఉధృతంగా వున్న అల్లకల్లోలదశలో ఉద్భవించింది. ఆ పరిస్థితిని దృష్టియందుంచుకొనే అధ్యక్షుడు వాషింగ్టన్ అమెరికావిధానం తటస్థవైఖరిపై, చైతన్యోద్దీపితమైన స్వాతంత్ర్యభావంపై ఆధారపడివుండాలని ప్రబోధించాడు.

నెపోలియన్ సైన్యాలు వాటర్లూవద్ద పరాజయం పొందటంతో 1814 లో అమెరికావిధాననిర్ణేతలు అనుకోకుండా ఒక కొత్త సమస్య నెదుర్కొన్నారు. అప్పుడు అమెరికాకు చెప్పుకోదగ్గ పెద్ద సైన్యంలేదు. నౌకాదళం కూడా చిన్నదే. అయితే ప్రపంచమంతటా అమెరికాకు మంచి నైతికబలం వుండేది. ఈనాడు

ఇండియాకు కూడా అలాంటి నైతికబలమే వుండిరిదా. ఈనాడు ప్రచ్ఛన్నయుద్ధంలో చిక్కుకున్న ఉభయపక్షాలవారూ భారతదేశ స్నేహాన్ని వాంఛిస్తూ వున్నట్లే అటు రష్యా నాయకత్వంక్రిందగల సత్‌సఖ్యతాకూటమి, ఇటు బ్రిటిషు ప్రభుత్వమూ 1820-23 లో అమెరికా అమోదంకోసమూ, మద్దతుకోసమూ ప్రయత్నిస్తూ వుండేవి.

రష్యాలోని కమ్యూనిస్టు ప్రభుత్వం ఆసియాలోని స్వేచ్ఛాప్రియ దేశాలకు నేడు ఎలా రెచ్చగొట్టేదిగా కనిపిస్తూవుందో 1823 లో రష్యాను పాలిస్తూ వుండిన జార్ ప్రభుత్వంకూడా అమెరికా ప్రజాస్వామ్యవాదులకు అలాగే విప్రసరకారంగా కనిపిస్తూవుండేది. నేడు ఆసియాలోని స్వతంత్రదేశాలు కమ్యూనిజంతో చేతులు కలుప నిరాకరిస్తున్నట్లే జార్ ప్రభుత్వం చేసిన ప్రతిపాదనను కూడా అమెరికా మర్యాదగానే గట్టిగా తిరస్కరించడం జరిగింది.

సత్ సఖ్యతాకూటమి దక్షిణ అమెరికాలో చేసే అతిక్రమణలను ఎదిరిస్తూ గట్టిగా నిలబడవలసిందని బ్రిటన్ అమెరికాను బాహాటంగా ప్రేరేపించటోదగింది.

అమెరికా అధ్యక్షుడు మన్రో, ఆయన విదేశాంగమంత్రి జాన్ ఆడమ్సు ఏకపక్ష నిర్ణయం గైకొన్నారు. 1823 డిసెంబరు 2 వ తేదీన కాంగ్రెసు సభకు పంపిన ఏడవ వార్షికసందేశంలో మన్రో తన సుప్రసిద్ధ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. అదే మన్రో సిద్ధాంత మన్న పేరుతో వ్యవహరింపబడుతూ వుంది.

ఈవిధంగా అమెరికా తన చరిత్రలో తొలిదశలోనే ప్రపంచరాజకీయాల ప్రాథమికసూత్రం ప్రకారం వెంటనే తగుచర్య గైకొంది. అయితే ఆచర్యను అమెరికన్లు తర్వాత విస్మరింపజొచ్చారు. ఆ సూత్రం ఇది: ఎవరైనా సరే, కోరుకున్నంతమాత్రాన తటస్థవిధానాన్నీ, నిబంధవిధానాన్నీ సాధించలేరు. సకాలంలో నిర్మాణాత్మకంగా, శాంతియుతంగా జోక్యంచేసుకొని వ్యవహరించారంటే ఆ తర్వాత రక్తపాతంతో విషాదంగా పరిణమించగల ప్రమేయాన్ని నివారించిన వాళ్ళవుతారు.

నేడు భారతదేశస్థితికీ, 1823 లో అమెరికా స్థితికీ మధ్య ఎన్నో భేదాలూ వున్నవి; ఎన్నో సాదృశ్యాలూ వున్నవి.

ఈనాటి మధ్యప్రాచ్యం, ఆగ్నేయాసియాలవలెనే 1823 లో దక్షిణ అమెరికా

కూడా తగు అధికార ప్రాబల్యం లేక సూదంటురాయివలె విదేశాలను ఆకర్షిస్తూ వుండేది. మరి అధికార విషయకంగా శూన్యస్థితి ఏర్పడినప్పుడు ఆ అవకాశంతో అక్కడికి వెళ్ళి తమ ప్రాబల్యం నెలకొల్పజూచే దేశాలు వుంటాయి కదా! ఈనాడు భారతదేశమూ, స్వేచ్ఛాప్రియ ఆసియా ఎదుర్కొంటూ ఉన్న ప్రశ్నను 1823 లో అమెరికా ఎదుర్కొన్నది; అధికారప్రాబల్యంకోసం జరిగే పోటీ, పోరాటములు తన ఇంటి గుమ్మందాకా వచ్చేసి ప్రపంచయుద్ధంగా పరిణమించకుండా నివారించడ మెలా అన్నదే ఆ ప్రశ్న. అలాంటి ప్రపంచయుద్ధమే సంభవిస్తే తానూ జోక్యం చేసుకోక తప్పదు కదా!

1823 లో అమెరికా భావించినట్లే ఈనాడు భారతదేశంకూడా సంఘర్షణకు ఆస్కారంగల ప్రధాన కేంద్రాలకు తాను భౌగోళికంగా వేరుగా విడిపడివున్నానని అనుకొంటోంది. తన నెదుర్కొనే బ్రహ్మాండమైన ఆర్థికసమస్యల పరిష్కారంలో నిమగ్నమైవుంది. అభివృద్ధికీ, ప్రగతికీ మార్గాలను వెదుకుతూవుంది.

వలసవాదమంటే భారతదేశానికి పెద్ద అనుమానం. కనుకనే వలసపాలన కూలద్రోయప్రయత్నించే పరాధీనదేశాల ఉద్యమాలను బలపరచ చూస్తూవుంది. శాంతి విషయంలో, సిరిసంపదల విషయంలో తన ఆకాంక్ష ఈడేరవలెనంటే అన్ని రాజ్యాలతో సక్రమమైన సంబంధాలను నిలబెట్టుకోవలెనని, తన ప్రజలు అనవసరమైన ఆవేశాలకు లోనై ప్రస్తుతవివాదాలలో తలదూర్చకుండా నివారిస్తూ వుంది భారతదేశం.

ఈ సాదృశ్యం ఎంతవరకు నిలబడగలుగుతుంది? 1823 లో అమెరికా వలెనే నేడు భారతదేశంకూడా ముందుచూపుతో నిశరమైన చర్య తీసుకుంటేనే, విస్పష్టమైన బాధ్యత స్వీకరిస్తేనే స్వతంత్రప్రతిపత్తిని నిలబెట్టుకోగలమన్న విషయం ఎరిగే వ్యవహరిస్తున్నదా?

మధ్యప్రాచ్యంలో, ఆగ్నేయాసియాలో ప్రస్తుతమున్నట్టి అధికార రాహిత్య స్థితి ఇలాగే కొనసాగిందంటే, అదిచూచి కమ్యూనిజం ఆకర్షింపబడి అక్కడికి వెళ్ళి తిష్ఠవేసుకొని ఆ ప్రాంతాన్ని కైవసంచేసుకొన చూస్తుంది. రష్యా చైనాలు కలిసి, సాయుధముగా దండయాత్ర జరిపినట్లయితే అమెరికా వెంటనే తగుజవాబు చెబుతుంది. మూడవ ప్రపంచయుద్ధం వచ్చేట్టు వున్నాసరే, అమెరికా జంకదు.

ఈనాడు భారతదేశం తన విదేశాంగవిధానానికి తటస్థవైఖరిని పునాదిగా

పెట్టుకొనివుంది కదా. ఒకవేళ అమెరికా రష్యాల మధ్య అట్టి సాయుధ సంఘర్షణ జరిగి, భారతదేశానికి ప్రాణప్రదమైన సముద్రరవాణా సౌకర్యాలకు అంతరాయ మేర్పడి ఆ దేశపు ఎల్లలవరకూ పోరువిస్తరిస్తే భారతదేశం తన తటస్థవిధానాన్ని నిలబెట్టుకోగలుగుతుందా ?

కొలంబో ప్రణాళికదేశాలు (ఇండియా, పాకిస్తాన్, బర్మా, సింహళం, ఇండోనీషియా) బలపరచనట్టి ఆసియా-రక్షణవ్యవస్థ ఏర్పడినా సైనికంగా పటియుత ప్రయత్నమే అవుతుంది. అందువల్ల రాజకీయంగా లేనిపోని బరువుభారాలు పెరగటమే గాని మరేలాభమూ వుండదు.

భవిష్యత్తులో కొలంబో ప్రణాళికదేశాలు అయినంతటికీ ఒక ప్రత్యామ్నాయ మార్గం వుంది. నేటి చిక్కుపరిస్థితిలో ఆసియాలో స్థిరత్వాన్ని సాధించాలంటే, అదొక్కటే ఆచరణసాధ్యమైన పని.

ఈ దేశాలు ఒకవంక పాశ్చాత్యదేశాల మద్దతుపొందే సైనిక ఒడంబడి కలలో చేరకుండా నిరాకరిస్తూనే ముందుముందు చైనా తమపై చేయగల ఒత్తిడిని ముందుగానే పసికట్టి భవిష్యత్తులో ఆసియాపై ఎవరివల్ల దురాక్రమణ జరిగినాసరే, వజ్రసంకల్పంతో ఎదిరిస్తామని సర్వప్రపంచానికీ చాటాలి.

ఈ సందర్భంలో క్రొత్తఢిల్లీలో జరిగిన ఇండియా - చైనా ఒప్పందాలను కమ్యూనిస్టుల విజయంగా భావించడం పెద్దపొరపాటు కాగలదు. ఏప్రిల్ నెలలో వెలువడ్డ చౌఎన్‌లై-నెహ్రూ ప్రకటనలో టిబెట్టు వ్యవహారంలో ఇండియా చైనాలు చేసుకొన్న ఒడంబడిక ఆసియాకంతటికీ ఒక ఆదర్శంగా వుండగలదని చెప్ప బడింది. ఈ ఒడంబడిక అవతారికలో స్నేహసంబంధాలు పొసగుటకు ఐదు సూత్రాలు నిర్దేశింపబడ్డవి. అవి ఇవి : 1. ఒకరి సర్వసత్తాక ప్రతిపత్తిని, ప్రాంత సమగ్రతను మరొకరు గౌరవించాలి. 2. పరస్పరము ఒకరిపై ఒకరు దురాక్రమ ణకు దిగకుండా వుండాలి. 3. ఒకరి అంతరంగిక వ్యవహారాలలో మరొకరు జోక్యం చేసుకోకూడదు. 4. ఉభయులూ సమానులే కనుక పరస్పర ప్రయోజనం ఆశించాలి. 5. శాంతియుత సహజీవనం. వీటినే పంచశీలములన్నారు.

అయినా చైనా 1951 లో టిబెట్టును వశపరచుకొని ఈ ఐదు సూత్రాలను ఉల్లంఘించిందన్న విషయాన్ని భారతీయులు విస్మరింపలేరు. చైనావిషయంలో భారతదేశం ఈ సూత్రాలను పాటించలేదని ఎవరూ ఆక్షేపించలేరు. ఇప్పుడు ఈ

కమ్యూనిస్టుల పురోగమనాన్ని నిలుపరించుటకు భారతదేశం ఎంతదాకా పూను కొంటుంది? ఇప్పటిస్థితినిబట్టి దీనినెవరూ ఊహించలేరు. భారతీయులే చెప్పగాలరు. భారతదేశమూ, దాని పొరుగురాజ్యాలూ కలిసి ఆసియాకు ఒక మన్రో సిద్ధాంతాన్ని తలపెట్టి అది ప్రయోజనకారి కావాలని అనుకుంటూ వున్నట్లయితే మొదట ఈ సందేహనివృత్తిచేయాలి.

1954 ఏప్రిలులో జరిగిన సింహళ మహాసభ ఒక విషయాన్ని స్పష్టం చేసింది. అధ్యక్షుడు మన్రో దక్షిణఅమెరికాలో తన పొరుగురాజ్యాల అభిప్రాయాల విషయం పట్టించుకోకుండా ఏకపక్షంగా తనకు తానే నిర్ణయంచేసుకొని ఆప్రకారం వ్యవహరించినప్పటికీ నెహ్రూ అలా ఏకపక్షంగా వ్యవహరించి తన "నెహ్రూ సిద్ధాంతము"ను ప్రకటించలేదు. అలాచేస్తే అభిమానధనులైన అతని పొరుగు రాజ్యాలవారు నిరసనతెలుపవచ్చు. ఆసియాకు ఆసియావాసులు తలపెట్టే మన్రో సిద్ధాంతం ప్రయోజనకారి కావాలంటే దాన్ని ఒక్కొరుగారే పిలుపుకు కలిసి నిర్ణ యించాలి. అలాచేయాలంటే కొన్ని ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి.

ఆసియాకు దేశవాళీ మన్రోసిద్ధాంతం ఏర్పడాలంటే ఎన్నో బలీయమైన ప్రతి బంధకా లున్నవి. అట్టి కృషి ఎప్పుడు, ఎలా ఆరంభమవుతుందో చెప్పడం తెలివి తక్కువపని. అట్టి కార్యక్రమం ఏదేవతనోటినుండో వెలువడదు. ప్రగాఢమైన విధానాలన్నింటివలెనే అదికూడా వివిధవైఖరుల, సానుభూతుల, ఎంపికల, వ్యక్తుల, అధికారాల ఫలితంగా అవతరిస్తుంది.

ఈ సత్యాన్ని గమనించి అమెరికన్లు చిట్కాలకోసం ప్రాకులాడడం మానాలి. ఆసియాలో చిట్కాలు దొరకవు. కనుక దీర్ఘకాలికదృక్పథం ఏర్పరచు కోవడానికి అమెరికన్లు ఎంత త్వరగా పూనుకుంటే అమెరికన్లు వాంఛిస్తూవున్న శాంతి స్థిరత్వముల కవకాశాలు అంతమెరుగుగా వుండగలవు.

ఈలోపల ముందెన్నడైనా రష్యా చైనాలమధ్య పోటీలు, స్పర్ధలు వచ్చే అవకాశం వుందేమో అమెరికన్లు ఆలోచించాలి. అలాంటివి ఏమైనా వుండేట్లయితే వాటివల్ల అమెరికన్లు లాభంపొందకుండా చేసేందుకై అమెరికాదేశంలో తల యెత్తే రాజకీయవత్తిడులను ఎదిరించాలి.

మధ్యధరాప్రాంతానికీ, దక్షిణచైనా సముద్రానికీ మధ్య స్వేచ్ఛాప్రియమైన, ఆత్మవిశ్వాసంగల, తేజోవిరాజితమైన నూతన రాజ్యాలు ఏర్పడటమే మన అంతిమ లక్ష్యం. అలాంటిది జరిగడానికి కమ్యూనిస్టులు వేసుకొన్న పథకం వీలిస్తుందా లేదా అనేది వేరే ప్రశ్న. ఆసియానాయకులు ఈనాడు ఏమనుకొంటున్నప్పటికీ ఆ ప్రశ్న ఎలా పరిణమిస్తుందో చెప్పలేము.

అయితే ఆసియాలోగాని, లేక మరేప్రాంతంలోగాని ఇట్టి పరిస్థితులను అమెరికా కల్పించలేదు. వాటంతట అవే పుట్టుకొచ్చి పెంపుకావాలి. మనం చేయవలసిందల్లా స్నేహపూర్వకంగా బొట్టూకాటుకపెట్టి పిలువనక్కరలేకుండా ప్రోత్సాహమిచ్చి తోడ్పడటమే.

# 29

## ఆసియావారు చిక్కు ప్రశ్నలే వేస్తున్నారు!

శ్రీ బౌల్స్ అమెరికాను విమర్శించే ఆసియావాసులతో ఎన్నో పూర్తి సంభాషణలు జరిపారు. ఆసియా విషయంలో అమెరికా వైఖరి ఏమిటో శ్రీ బౌల్స్ బర్మాప్రొఫెసరుకు ఈ విధంగా వివరించారు.

1954 నవంబరులో వెలువడ్డ "పారేడ్ మేగజైన్" నుంచి.

ఆసియా వారికీ మనమీద అవగాహన అనేది ఏర్పడవలెనని తాము ప్రయత్నిస్తూ వున్నట్లయితే అమెరికన్లు తక్కువగా మాట్లాడాలి. ఎక్కువగా వింటూ వుండాలి. ఒకొక్కప్పుడు వారు వినేది వారికి గిట్టకపోవచ్చు, నచ్చకపోవచ్చు. అయినా వినాలి.

ఈమధ్య నేనొక బర్మాదేశప్రొఫెసర్‌ను కలుసుకోవడం తటస్థించింది. ఆయన సైన్సుప్రొఫెసర్. అమెరికా అంటే ఆయన కెందుకో అకారణవిద్వేషం. అలాగే కమ్యూనిస్టులన్నా ఆయనకు సరిపడదు. ఆయనకూ నాకూ మధ్య జరిగిన సంభాషణలో స్వేచ్ఛాప్రియపాశ్చాత్య దేశాలకూ, స్వేచ్ఛాప్రియ ఆసియాదేశాలకూ మధ్యగల సంబంధాలు చర్చింపబడ్డవి:

బర్మాప్రొఫెసర్: ఆసియాలో మీ అమెరికనులు చేసిన తప్పులు విషాదకరమైనవి. రెండవ ప్రపంచయుద్ధం ముగిసినప్పుడు మేము మీనుంచి ఎంతో ఆశించాము. కాని ఇప్పుడు మా ఆశలు అడియాసలైనవి.

అమెరికా రాయబారి: బహుశా పెద్ద ఆశలు పెట్టుకొన్నారేమో. ఎంతైనా

మీవలెనే మేమూ మానవమాత్రులమే. మాకూ ఎన్నో పరిమితులున్నాయి. స్వభావ రీత్యా మేము అంతర్జాతీయ వ్యవహారాలలో వ్రేలుపెట్టే మనుషులంకాము. 1941 దాకా మేము రెండవ ప్రపంచయుద్ధానికి దూరంగా వున్నాము. కాని 1941 లో పెరల్‌హార్బర్ ఉదంతం మా వేరుపాటును అంతంచేసి మమ్మల్ని యుద్ధంలోకి లాగింది. యుద్ధం అయిపోగానే మేము మా సైన్యాన్ని ఇళ్ళకు పంపించాము. కాని సోవియట్ యూనియన్ తన సైన్యాన్ని అలాగే వుంచి, పైగా దాన్ని ఆధునికం చేయడానికి కొన్నివందలకోట్లు ఖర్చుపెడుతూ వుండడం గమనించాము.

ఈనాడు మాకుగల స్థితి మేము ప్రయత్నిస్తే వచ్చిందికాదు. మాకెట్టి వెసులుబాట్లూ అక్కర్లేదు. మేము ఒంటికాయ శొంఠికొమ్ములమూ కాము; సామ్రాజ్యవాదులమూ కాము. శాంతిభద్రతలకోసము, కమ్యూనిజాన్ని నిలుపరించే సాధనాలకోసము మేము పాటుపడుతున్నాము.

బ.ప్రొ: కమ్యూనిజమంటే మీకెంత అయిష్టమో నాకూ అంతే. నా మేనల్లుడు 1951 ఆగస్టులో కమ్యూనిస్టు గెరిల్లాలచే చంపబడ్డాడు. మా ప్రభుత్వం కమ్యూనిస్టులతో కొన్నేండ్లనుంచీ పోరాడుతూవుంది. ఇటీవలనే వారిని ఓడించింది. కాని మీ అమెరికనులకు కమ్యూనిజమంటే ఒకటే భయం. కాబట్టి మీరు ఆసియా వాస్తవస్థితికి దూరంగా వున్నారు.

అ.రా: మాకు అతి భయంలేదు. కమ్యూనిస్టులు ప్రపంచాన్ని స్వాధీన పరచుకో జూస్తున్నారన్న విషయాన్ని మీరు విస్మరిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీ లక్ష్యాన్ని లెనిన్ 30 ఏళ్ళక్రిందటే నిర్దేశించాడు. అప్పటినుంచి పేరుగల ప్రతి కమ్యూనిస్టూ దానినే వల్లిస్తున్నాడు.

బ.ప్రొ: అది నిజమే. కాని కమ్యూనిజంపై బాంబువేసి దాన్ని నిలుపరించవచ్చునని మీ అమెరికన్లు అనుకుంటున్నారు. కమ్యూనిజం ఒక స్థలంకాదు; ఒక సైన్యం కాదు బాంబుకు నాశనమైపోవడానికి. అదొక భావం; ఒక సిద్ధాంతం.

అంతకన్న మంచిభావం, మంచిసిద్ధాంతం మీ అమెరికావారి దగ్గర వుందని మేము ఎల్లప్పుడూ అనుకొంటూ వస్తున్నాము. చదువు

కున్న ఆసియావారిలో చాలామంది మీ స్వాతంత్ర్య ప్రకటనపత్రాన్ని చదివారు. కొందరి కది కంఠతాపచ్చు. ఆసియాలో మేము నిర్మింపజూస్తూవున్న ప్రజాస్వామ్యాలకు మీ రాజ్యాంగమే అదర్శప్రాయమైంది.

మీ అమెరికనులు ఇప్పుడు మీ స్వాతంత్ర్యసంప్రదాయాలపట్లా, మానవజాతిపై మీకుగల విశ్వాసంపట్లా వైముఖ్యం చూపుతున్నట్లు మాకు అనిపిస్తూవుంది. కమ్యూనిజాన్ని నాశనంచేయబోయి మీ దేశంలోనే మీరు కమ్యూనిస్టు పద్ధతులను అనుసరించ సిద్ధంగా వున్నట్టున్నారు.

అ.రా: మేము మా ప్రజాస్వామిక సంప్రదాయాలను భిన్నంగా వ్యవహరిస్తున్నామని ఎలా అనగలరు? రెండవ ప్రపంచయుద్ధం తర్వాత ఆసియాలో మా చరిత్రను పరికించండి. ఆసియాను జపాన్ సామ్రాజ్యవాదంనుంచి కాపాడడానికై యుద్ధంలో వేలాదిమంది అమెరికన్ యువకులు ప్రాణాలర్పించారు.

ఐక్యరాజ్యసమితి భద్రతాసంఘంలో అయిదు గొప్పరాజ్యాలలో ఒకటిగా చైనాకొక స్థానమివ్వబడవలెనని అధ్యక్షుడు రూజ్వెల్టు వాదించాడు. యుద్ధం ముగియడంతోటే మేము ఫిలిప్పీన్స్‌కు స్వాతంత్ర్యమిచ్చాము. అన్నమాట నిలబెట్టుకున్నాము.

భారత, ఇండొనీషియాల స్వాతంత్ర్యాన్ని సమర్థించాము. జపానువారికి అధికంగా సహాయంచేసి ప్రోత్సహించాము. విజేతలెవరైనా ఇలా చేశారా? ఒకప్పటి శత్రువును ఇలా చూచారా?

బ.ప్రొ: ఆ సంగతి నాకు తెలుసు. కాని మీరు పాశ్చాత్య లోకంలో ఒక భాగమన్న సంగతి మేము మరువలేము. పాశ్చాత్య దేశాలు ప్రతిసంవత్సరం ఆసియానుంచి లక్షలకొలది డాలర్లను లాగుకుపోయి తమ పట్టణాలను, విశ్వవిద్యాలయాలను నిర్మించుకున్నాయి. తమ ప్రజల జీవనప్రమాణాన్ని వృద్ధిచేసుకొని మమ్మల్ని నిరుపేదలనుచేసి ఆకలితో అలమటించే స్థితికి తెచ్చాయి. ఇలా కొన్ని తరాలపాటు చేశారు.

సంపద కొల్లగొడితే కొట్టారు. కాని ఆసియాను ఎంతగా అవమానించారు! మేము నల్లజాతివాళ్ళం కాబట్టి మమ్మల్ని రెండవతరగతి మనుషులుగా చూచారు. ఎంతహీనం!

అ.రా: నేను అడిగేది మళ్ళీ అదే-మమ్మల్ని వాళ్ళల్లో ఎందుకు చేరుస్తున్నారు? అమెరికారు ఆసియాలో ఎన్నడూ వలసలులేవు. అసలు యూరపువలస అధిపత్యంనుండి స్వతంత్రులము కావడానికై మాజాతే మొట్టమొదట పోరాడింది.

బ.ప్రొ: కాని గడచిన కొన్నేండ్లుగా మీరు చేస్తున్నదేమిటి? ఫ్రెంచివారికి కొన్నిలక్షల డాలర్ల సైనికసామగ్రినిచ్చి ఇండో చైనాలో ఫ్రెంచివలసాధిపత్యాన్ని నిలబెట్ట ప్రయత్నిస్తున్నారు. 1946 లో మీరు గట్టిగా నిలబడ్డట్టయితే ఇండియా, పాకిస్తాన్, బర్మా, సింహళములనుండి బ్రిటిషువారు ఉపసంహరించుకున్నట్లుగా ఇండో చైనానుండి ఫ్రెంచివారు తరలిపొయ్యేవారే. వియత్నాం, కాంబోడియా, లావోస్‌లకు రక్తపాతంలేకుండా స్వాతంత్ర్యం లభించేది.

అ.రా: కాని హోచీమిన్ కమ్యూనిస్టు కదా. అతగాడు ఆ మూడు దేశాలనూ కమ్యూనిస్టు చైనాకు అప్పగించేవాడు.

బ.ప్రొ: హోచీమిన్ కమ్యూనిస్టే కాని అతగాడు కొత్తగా పొందిన వియత్నామ్ స్వాతంత్ర్యాన్ని కమ్యూనిస్టు చైనాకో, లేక రష్యాకో, లేక మరొక విదేశానికో అమ్మజూపినట్లయితే ప్రజలు అతన్ని అవతలికి తరిమివుండేవారు. అసలు వియత్నాం ప్రజలకు చీనావారంటే ఎప్పుడూ అపనమ్మకమే.

ఫ్రెంచివారు అతగాణ్ని సైనికశక్తితో నాశనంచేయ ప్రయత్నించారు. అది తెలివితక్కువ పని. మీరు ఓడలనిండా మరతుపాకులు, టాంకులు, విమానాలు, ఇతరసామగ్రి పంపి ఫ్రెంచివారి ప్రయత్నాలకు వత్తాసు ఇచ్చారు. అటువంటప్పుడు ఆసియాలో సామ్రాజ్యవాదాన్ని మీరు బలపరచలేదని ఎలా చెప్పుకోగలరు?

అ.రా : యూరపువలసవాదమంటే మీ కెలా గిట్టదో మాకూ అంతే. ఇండో చైనాలో ఫ్రెంచివారు తప్పులు చేశారని మేమూ అంగీకరిస్తాము. కాని ఆసియాలో మీరు చెబుతూవున్న వలసవాదం పాతపురాణం. అది ఇప్పుడు లేదు.

మీరు కొత్తగా వస్తూవున్న కమ్యూనిస్టు సామ్రాజ్యవాదాన్ని విస్మరిస్తున్నట్టున్నారు. అది మిగుల ప్రమాదకరమైంది. మీ ఆసియావాసులు పాతబడి అంతరించిపోయిన యూరపువలసవాదాన్నిగూర్చి ఇలా వాదాలు సాగిస్తూవుంటే ఇరవయ్యోశతాబ్ది కమ్యూనిస్టుల కొత్త వలసవాదం మిమ్మల్ని స్వాహాచేస్తుంది.

బ.ప్రొ : మీరు మమ్మల్ని మా మానానికి వొదిలేస్తే మీ రనుకున్న దానికన్న బాగా కమ్యూనిజం నుంచి మా స్వాతంత్ర్యాన్ని కాపాడుకోగలం. గతచరిత్రను పరిశీలించండి. చైనాలో యుద్ధంగాక రెండవ ప్రపంచయుద్ధానంతరం నుంచీ ఆసియాలో ఆరు అంతర్యుద్ధాలు జరిగాయి. ఈ ఆరూ కమ్యూనిస్టులు లేపెట్టినవే.

వాటిలో నాలుగు అంతర్యుద్ధాలు ఇటీవలే స్వాతంత్ర్యంపొందిన ఫిలిప్పీన్స్, ఇండోనీషియా, బర్మా, ఇండియాలలో జరిగాయి. ఈ నాల్గింటిలో బైటిసహాయం లేకుండానే కమ్యూనిస్టులను అణచివేయడం జరిగింది. తక్కిన మలయా ఇండోచైనా దేశాలలో కమ్యూనిస్టులు పెద్దబెడదే తెచ్చిపెట్టారు. ఇండోచైనాలో ఫ్రాన్సు అమెరికా సైనిక శక్తి ఏకంగా పనిచేసినప్పటికీ, కమ్యూనిస్టులు పూరా విజయం పొందారు.

ఎందువల్ల ? ఎందువల్లనంటే తాము విదేశీశ్వేతవలసవాదులను సముద్రంలో పడద్రొయ్యడానికై సామ్రాజ్యవాద వ్యతిరేకయుద్ధం చేస్తున్నట్లుగా మలయా, ఇండోచైనాలలోని కమ్యూనిస్టులు అచటి ప్రజలకు నచ్చజెప్పగలిగారు. కాని ఆసియా జాతీయవాదాన్ని ఎదుర్కొనవలసిన చోట్ల మాత్రం విఫలులయ్యారు.

పైగా మీ అమెరికావారు ఇక్కడ ఒక్క ఆసియాలోమాత్రమే వలసవాదాన్ని బలపరచలేదు. ఆఫ్రికాలోకూడా మీ చరిత్ర ఏమీ

బాగాలేదు. సర్వ ప్రజలకు స్వేచ్ఛగావుండే హక్కు వుందంటూ, ఇంకా ఏవేవో మంచిమాటలు మీరు పైకి అంటూవుంటారు. కాని ఐక్యరాజ్యసమితిలో ట్యునీషియా, మొరాకోల స్వాతంత్ర్యోద్యమాల ప్రసక్తి వచ్చినప్పుడు మీరు వాటికి వ్యతిరేకంగా ఓటు వేశారు.

అ.రా: ఫ్రెంచి ఆఫ్రికావిషయంలో మేము రాజీపడవలసిన అగత్యం కలిగింది. ఎందుచేతనంటే యూరపురక్షణకు ఫ్రెంచి సైన్యం చాలా అవసరం. కనుకనే ఆల్జీరియా, ట్యునీషియా, మొరాకోల స్వాతంత్ర్యాన్ని అడ్డగించిన ఫ్రెంచి వారితో మేము సత్సంబంధాలు పెట్టుకోవలసివచ్చింది. ఇలా అప్పుడప్పుడు మేము మా అంతరాత్మకు విరుద్ధంగా ఓటువేసినమాట నిజమే.

బ.ప్రొ: అలాంటి రాజీలవల్ల మీకుకలిగే లాభమేమిటి? మీరు ఆసియా ప్రజల సద్భావాన్నేగాక, ఆఫ్రికా ప్రజల సుహృద్భావాన్ని కూడా కోల్పోయారు.

అసలు మీ అమెరికనులవల్ల వచ్చిన చిక్కేమిటంటే - మీరు ప్రతిదాన్ని సైనికశక్తి దృష్టితో చూస్తూవుంటారు. కాని ప్రపంచంలో చాలావరకు సైనికశక్తి ప్రాబల్యం తగ్గిందన్న విషయం అంతా ఎరిగినదే.

బ్రిటిషువాళ్ళు ఇండియాను ఎందుకు వదిలిపోయ్యారు? వారికి సైనికశక్తి లేకనా? కాదు. ప్రపంచంలో సైనికబలగంరీత్యా వారు మూడవ అగ్రస్థానంలో వున్నారు. కాకపోతే మరికొంతకాలం ఇండియాను తమవశంలో వుంచుకొనేవారేమో! గాంధీనాయకత్వంక్రింద భారతప్రజలు ముక్తకంఠంతో బ్రిటిషుపాలన అంతరించాలన్నారు; వారిని ఎదిరించడం బ్రిటిషువారికి సాధ్యపడలేదు. ఇప్పుడు ఇండో చైనాలో ఎన్నో కష్టనష్టాలు అనుభవించినమీదట ఫ్రెంచివారికి కలిగిన జ్ఞానోదయంకూడా అదే.

ఆసియా సమస్యలు ప్రాథమికంగా రాజకీయమైనవనీ, ఆర్థిక

మైనవనీ, సైనికవిషయాలు వాటితర్వాతనే అనీ మీ అమెరికనులు ఎప్పుడు గ్రహిస్తారు?

అ.రా: మేము దీనిని గుర్తించాము. మా పాయింట్ ఫోర్ కార్యక్రమంతో ఆసియాదేశాలలో దారిద్ర్యాన్నీ, రోగాలనూ, అవిద్యనూ నిర్మూలించడానికి, ఆ దేశాలు వాటికాళ్ళపై నిల్చొనేటట్టు చేయడానికి కృషిచేశాము.

బ.ప్రొ : ప్రపంచచరిత్రలో పాయింట్‌ఫోర్ కార్యక్రమం సాహసోపేతమైనదనీ, దాన్ని తలపెట్టినందుకు అమెరికావారు అభినందింప దగ్గవారనీ నేనూ అంగీకరిస్తాను. అయితే నిజం చెప్పాలంటే ఇంతవరకూ కలిగిన ఫలితం అత్యల్పం.

అ.రా: మా పాయింట్‌ఫోర్ కార్యక్రమం పరిమితమైందన్న మాట నిజం. స్వదేశాలలో మాకు రాజకీయవిభేదాలున్నవి. పైగా మేముచేస్తూవున్నది వారి సహాయంకోసమే నన్నసంగతి ఇతరదేశాల ప్రజలు గుర్తించడంలేదని మా దేశీయులు చాలామంది మనస్తాపం చెందుతూవుంటారు.

బ.ప్రొ : అంటే తగుమాత్రంగా కృతజ్ఞులైవుండటం లేదంటారా? అంటే డబ్బుపెట్టి స్నేహితులను కొనాలన్న ఉద్దేశంతో మాకు సహాయంచేస్తున్నారన్నమాట. అమెరికాలో అలానే చేస్తూవుంటారా? అక్కడ డబ్బుతో స్నేహితులను కొనే వీలుందా? ఏమో, నాకు నమ్మకంలేదు.

అమెరికా చేసే ధనసహాయానికి ఒకేఒక ఉద్దేశంవుండాలి. ఏమిటంటే-అభివృద్ధిచెందని దేశాల ప్రజలు స్వయంసహాయం చేసుగొనే విధంగా వారికి తోడ్పడటమే. ఆర్థికప్రగతి చేకూరుతున్నదనీ, పంటలు మరింత బాగా పండుతున్నాయనీ, రోగాలు తగ్గుతున్నాయనీ, తమ పిల్లలు నానాటికీ ఆరోగ్యవంతులవుతున్నారనీ, పాఠశాలలు, రోడ్లు ఏర్పడుతున్నాయనీ ఆ ప్రజలు గ్రహించారంటే, అవసరమొస్తే ప్రాణాలర్పించడానికైనా సిద్ధపడతారు. ఒక ప్రయోజనంకోసం తాము త్యాగం చేస్తున్నామన్నభావం వారికి కలుగుతుంది. అదీ, అందుకు

అమెరికా సహాయం ఉద్దేశింపబడాలి గాని కృతజ్ఞతకోసం, స్నేహితుల కోసం, ఐక్యరాజ్యసమితిలో ఓట్లకోసం కాకూడదు.

ప్రపంచంలో సుస్థిరత ఏర్పడితే మీకు చాలదా? అమెరికన్ భావాలకీ, ప్రాబల్యానికీ దాసోహమనే ప్రపంచమే మీకుకావాలా? మా దేశాలలో కమ్యూనిస్టులు అల్పసంఖ్యాకులుగానైనా వుండి కేకలు వేస్తూ వుండబట్టి సరిపోయిందిగాని, లేకపోతే మీ అమెరికావారు మమ్మల్నీ, మా దారిద్ర్యాన్నీ జ్ఞాపకంపెట్టుకుంటారా? ఎన్నడో పూర్తిగా మరచిపోయి వుండేవారు కారా?

అ.రా: అలా అనడం న్యాయంకాదు. చైనాలో కమ్యూనిజం అసలు సమస్యగా తయారవకపూర్వమే మేము చైనాకు సహాయపడే ఉద్దేశంలో ఎంతో ధనం వ్యయపరిచాము. కాని జరిగిందేమిటి? ఇప్పుడు చైనా మాకు బద్ధశత్రువైంది: మామీద ద్వేషం కక్కుతూవుంది. మేము విషక్రిమితో యుద్ధంచేస్తున్నామని ఆరోపిస్తూవుంది. ఇలా సమస్త ఆసియానూ మాపైకి ఉసిగొల్పడానికి ప్రయత్నిస్తూ వుంది.

బ.ప్రొ: చైనాకమ్యూనిస్టులు ద్వేషంగలవారనీ, కయ్యానికి కాలుదువ్వేవారనీ నేనూ అంగీకరిస్తాను. వారు రష్యావారికంటె కూడా ఉపద్రవకారులుగా తయారుకావచ్చు. అయితే మీ విధానాలు పరిస్థితుల్ని బాగుపరచడానికి బదులు మరింత అధ్వాన్నంచేస్తున్నాయి.

మనకు నచ్చినా, నచ్చకపోయినా కమ్యూనిస్టుచైనా రాజ్యం ఏర్పడిపోయింది. అది వాస్తవం. అటువంటప్పుడు చైనావారితోనే నేరుగా వ్యవహారాలు ఎందుకు జరుపరు? మధ్యన రష్యాదళారీలు ఎందుకు? రష్యావారు చైనాకు ఏకైక ఏజెంట్లా? వారికి వ్యాఖ్యాతలా?

అ.రా: కమ్యూనిస్టుచైనా కొరియాలో ముప్పైవేలమంది అమెరికన్ సైనికులను చంపిందికదా. అలాంటప్పుడు కమ్యూనిస్టు చైనాను ఎలా పరిగణించేది? చరిత్రను చూడండి. కమ్యూనిస్టుచైనా దురాక్రమణదారు కాదంటారా?

బ.ప్రొ: మీరు రష్యావారినికూడా అలాగే అన్నారుకదా. రష్యావారెంత కమ్యూనిస్టులో చైనావారూ అంతే. కాని మీరు ఇరవై

ఏళ్ళ క్రిందటే రష్యాను పరిగణించడమేకాక యుద్ధంలో వారిని మిత్రులుగా చేసుకొని వారి సరసననిల్చొని పోరాడారు.

మీరు కమ్యూనిస్టుచైనాను పరిగణించకపోవడానికి అసలు కారణం చైనావారు తెల్లజాతివారు కాకపోవడమేనని మా ఆసియా వాసులలో చాలామందిమి నమ్ముతున్నాము. మీ అమెరికాలోనే రంగు జాతులవారిని రెండవతరగతి పౌరులుగా చూస్తున్నారుకదా! రంగు జాతుల ప్రజలు తెల్లవారితో సమానమైనవారని మీరు గుర్తిస్తున్నట్లయితే, రెండవ ప్రపంచయుద్ధంలో జపాన్‌పై అటంబాంబు ఎందుకు వేశారు? జర్మనీపై ఎందుకు వేయలేదు?

అ.రా : అది అర్థంలేనిమాట. జర్మనీతో యుద్ధం ముగిసేవరకూ అసలు ఆటంబాంబు తయారుచేయబడనేలేదు.

బ.ప్రొ : కాని ఆసియావాసి ఎవరైనా ఆ మాట నమ్ముతారా? నమ్మజెప్పగలరా మీరు ?

(ఇలా సంభాషణసాగింది)

* * *

ఈ ఆసియావాసి వాదోపవాదాలు ఇలావున్నాయి. టెహ్రాన్ మొదలు టోక్యోవరకు కోట్లాది ఆసియావాసుల అభిప్రాయాలు అవి.

అతనికి కమ్యూనిజమంటే ఇష్టంలేదు. ప్రజాస్వామికమే అమలులో వుండవలెనని అతని ఆకాంక్ష. అమెరికాను నమ్మాలని అతనికుంది. తనదేశం శాంతి, సుస్థిరత, సంపదలకేసి పురోగమించవలెనని అతనికోరిక.

కాని అమెరికా అయోమయత్వంలో పడటం అతనికి బాగాలేదు. స్నేహం చేసుకోవలసినవారిని అమెరికా నిర్లక్ష్యంచేయడం అతనికి నచ్చలేదు. అతనికి ఒక వంక తికమక, మరొకవంక భయం.

అయినా ఆతని ప్రగాఢవిశ్వాసాలకు చరిత్రలో ప్రాముఖ్యంవుంటుంది. ఒక రోజుకు అవే ఆయుధాలస్థాన మాక్రమించి ప్రపంచంలో సమస్థితిని నిలబెడతాయి. అతనుచెప్పేది మనంవినాలి. అతను చెబుతున్నది తప్పు అని మనకు అనిపించి నప్పుడు ఆవిషయం అతనితో అనెయ్యాలి. కాని అతను అంటున్నదిమాత్రం శ్రద్ధగా వినాలి.

# 30

# తటస్థదేశాలు - భారత విజయగాథ

మనం మన యూరపు మిత్రులను విస్మరించి అభివృద్ధిచెందుతూ వున్న దేశాలకు హెచ్చు ప్రాముఖ్యమిస్తున్నామా? లేదని శ్రీబౌల్స్ వాదం. తటస్థదేశాలకూ, మన మిత్రదేశాలకూ అన్నిటికీ - అవి అమెరికా సహాయాన్ని సరిగా వినియోగించుకునేట్టయితే సహాయం చేయవలసిందేనని ఆయన అన్నారు.

—1962 జూలై నెల 'దిస్‌మంత్' పత్రికనుండి.

ఆఫ్రో-ఏషియన్ వర్గం విషయమై అమెరికావారు చాలా మంది ఇటీవలనే ఆసక్తి కనపరుస్తున్నారు. ఇది సహజమే. ఎందుచేతనంటే ఇప్పుడు ప్రపంచ వ్యవహారాలలో ప్రాముఖ్యం వహిస్తూవున్న చాలా ఆసియా ఆఫ్రికాదేశాలు గడచిన కొన్నేండ్లలో స్వాతంత్ర్యంపొందాయి.

ఇప్పుడు ఐక్యరాజ్యసమితిలో 104 సభ్యదేశాలున్నాయి. వీటిలో సరిగ్గా సగం ఆసియా ఆఫ్రికా ఖండాలకు చెందినవి. ప్రపంచసంస్థలో ఈ కొత్తదేశాలకు అంతర్జాతీయ నామమొకటి పెట్టబడింది. దాన్ని ఇవి వాడుకొంటున్నాయి.

సమితిలో చర్చలు జరుగుతున్నప్పుడు ఆసియా ఆఫ్రికాదేశాలు వ్యక్తపరిచే వైఖరులు రష్యావిధానానికంటె అమెరికావిధానానికే సన్నిహితంగా వుంటాయి. అయితే అనేక భేదాభిప్రాయాలుండడంవల్ల అమెరికావారు చాలామంది వాటిపట్ల ఆదుర్దా చెందుతూ వుంటారు.

గడచిన కొన్నినెలల్లో ఈ భేదాభిప్రాయాలు మరింత తీవ్రమయ్యాయి. ముఖ్యులైన ఆసియా ఆఫ్రికా నాయకులు అమెరికాను నిశితంగా విమర్శిస్తూ రష్యా వారితో ఒద్దికగా వుంటున్నారు.

దీనికితోడు విదేశవ్యవహారాలు మరీ చిక్కుపడడం. ముఖ్యప్రశ్నలకు చప్పున తేలికైన సమాధానాలు లభించకపోవడం. తప్పుడు అంచనాలవల్ల అణ్వస్త్రాలతో రాగల ప్రమాదం అలాగే వుండడం...వీటన్నిటిమూలకంగా అమెరికా వారిలో నిరాశానిస్పృహలు, తికమక ఎక్కువయ్యాయి.

ఈస్థితిలో తటస్థదేశాలనూ, మిత్రదేశాలనూ విమర్శించడం జరుగుతూ వుంది. ఆఫ్రో-ఏషియనులపట్ల అమెరికా అతి శ్రద్ధచూపుతున్నదనీ, అనవసరంగా వారితో పూసుకుతిరుగుతున్నామనీ, మన విధానాలు వాస్తవదృష్టితో ఉండినవి కావనీ విమర్శకులంటున్నారు.

'కఠినమైన వాస్తవికదృష్టిగలవారిమి' అని చెప్పుకొనేవారు తరచు ఇటువంటి అభిప్రాయాలు వ్యక్తంచేస్తూవుంటారు. కొంచెం నిగ్రహంతో ప్రపంచ వ్యవహారాలను అవలోకించే వారిని వీరు 'అస్పష్టమనస్కులైన ఆదర్శవాదులు'గా లెక్కకడుతూ వుంటారు.

విదేశాంగ విధానంలో వీరిది పాతపద్ధతి. ప్రపంచశక్తులంటే వీరికి ఓర్పు లేదు. కాబట్టే తరచు తప్పులు చేస్తూవుంటారు.

ఉదాహరణకు-మొదటి ప్రపంచయుద్ధం ముగిసినవెంటనే ఈ 'వాస్తవికదృష్టి' గల ప్రబుద్ధులు వుడ్రోవిల్సన్‌నూ, ఆయన నానాజాతిసమితి స్థాపననూ విమర్శించారు. కాబట్టే అమెరికన్లు ఒక తరంవరకూ వేరుపాటుగా వున్నారు. ప్రపంచం మరొక ప్రపంచయుద్ధానికి గురిఅయింది. అది దారుణ ప్రచండయుద్ధం. సర్వ యుద్ధాలనూ అంతంచేయగల యుద్ధం అది.

అలాగే వాస్తవికదృక్పథం గలవారు ఆసియా, ఆఫ్రికా వ్యవహారాలలో దూరదృష్టిలేకుండా ప్రవర్తించారు. ఇండియా, పాకిస్తాను, సింహళము, బర్మా దేశాలనుండి బ్రిటిషువారు ఉపసంహరించుకున్నట్లయితే బాధ్యత ఎరుగని అచటి దేశవాళీప్రజలు కుప్పగా కూలిపోతారని బ్రిటనులోవున్న వాస్తవికదృక్పథం గల వారికి చెప్పడం జరిగింది. అట్లే సూయజ్‌కాలువను ఈజిప్టుదేశీయులు నిర్వహిం

చుకోలేరనీ, అనుభవంగల యూరోపియనులు వుంటేనే ఆ కాలువ ఉపయోగంలో వుంటుందనీ అన్నారు.

కాని జరిగిందేమిటి? వీరు అనుకున్నదానికి పూర్తిగా భిన్నంగా జరిగింది. తమను తాము పాలించుకోగలమని ఈ దేశాలు రుజువుపరచి విమర్శకుల నోళ్ళు మూయించాయి. పైగా ఈ దేశీయులు బ్రహ్మాండమైన సమస్యలను ఎంతో స్థిర సంకల్పంతో, నిపుణతతో పరిష్కరించుకొంటున్నారు.

రెండవప్రపంచయుద్ధానంతరం ఫ్రాన్సులోని 'వాస్తవికదృక్పథం గల పెద్దలు' ఇండోచైనాలో అదివేరు పద్ధతిని అనుసరించవలసిందిగా ఫ్రెంచి ప్రభుత్వాన్ని ప్రేరేపించారు. అసాధ్యమైన నైసర్గిక, రాజకీయపరిస్థితులలో ఆసియాలో ఒక వలసను అట్టిపెట్టుకుందామని వీరు ప్రయత్నించేసరికి ఆసియాలోని వలస విధానవ్యతిరేకులు, జాతీయవాదులు, కమ్యూనిస్టులు అంతాకలిసి హోషిమిన్ నాయకత్వాన ఐక్యసంఘటనగా ఏర్పడి ఫ్రెంచివారికి వ్యతిరేకంగా జాతీయ విమోచనోద్యమం నడిపి విజయంపొందారు.

అయినా ఇండోచైనాలో కలిగిన శృంగభంగం ఈ 'వాస్తవికదృక్పథం గలవారి'కి ఎట్టి గుణపాఠమూ నేర్పలేకపోయింది. ఫ్రెంచి ప్రభుత్వం ఆల్జీరియనులతో సరిసమైన ఒడంబడికకు రాకుండా కొన్నేండ్లవరకూ అటంకపెడుతూ రావడానికి కూడా కారకులు ఈ 'వాస్తవికదృక్పథం గల' మహాశయులే. ఇటీవలనే వీరు నిరాశోపహతులైన ఫ్రెంచి సైనికనాయకులను మురారి మార్గానపట్టిస్తామని బెదిరిస్తున్నారు. ఆ మార్గం సర్వనాశనం తెస్తుంది తప్ప ఎట్టిమేలూ కలిగించజాలదు.

'ఆసియా ఆఫ్రికాలు గంగలో కలిస్తే మనకేమి' అని వాదించే ఈ మహాశయులు సమస్తజాతులలోనూ తెల్లజాతివారే రాజాజాతివారని విశ్వసించే సంప్రదాయానికి చెందినవాళ్ళు. కొన్ని తరాలక్రితం వీరి పూర్వీకులు 'రంగుజాతిదేశవాసి మనుషులు' మరీ తెగబడితే తుపాకీప్రయోగం చేయవలసిందేనని ప్రబోధంచేసిన ప్రబుద్ధులు!

ఆరోజులలో మరికొంచెం ఓర్పు, దూరదృష్టి వున్నట్లయితే, కఠినమైన వాస్తవికదృక్పథాన్ని వారు తగ్గించుకున్నట్లయితే ఆసియా ఆఫ్రికాలలోని కొత్త ప్రభుత్వాలు ఇంత పెద్ద కష్టాలను ఎదుర్కోవలసిన అగత్యంలేకపోయేది. అసలు

దొరతనమనేదే క్రమేణా రూపు మాసిపోపనున్నయుగంలో తెల్ల దొరతనపు భావన చేటుకాదా?

గడచిన 16 సంవత్సరాలలో పూర్వపు యూరోపియను సామ్రాజ్యం క్రింద వున్న ప్రాంతమంతా పరాధీనతనుండి తప్పించుకొని స్వతంత్రమైంది. ఇప్పుడా ప్రాంతంలో 44 కొత్తస్వతంత్రదేశాలు వెలిశాయి. ప్రపంచ జనాభాలో వాటి జనాభా మూడవవంతు. తమ రాజకీయ ఆర్థికస్వాతంత్ర్యం విషయంలో ఈ కొత్త దేశాలకు ఎక్కడలేని ఆదుర్దాగావుంది. ఆర్థికవిధానం ఎంత సమంజసమైనదైనా అది విదేశీయులదని లేశమాత్రమైనా అనుమానం కలిగిందా, దాని పొంతపోరు. రష్యా అమెరికాలతో వారు వ్యవహరించే వైనంలో ఈ వైఖరి మనకు స్పష్టంగా కన్పిస్తుంది.

కనుక వారి లక్ష్యమేమిటి? ఈ కొత్త దేశాలు వాటిదోవలో అవి వ్యవహరించేట్టు అమెరికా మసులుకోవాలి. వాటి సంస్కృతినిబట్టి అవి ప్రవర్తిస్తాయి.

ఈ కొత్తదేశాలు అమెరికా విధానాలను అనుసరించడానికి అంగీకరించినంతమాత్రాన, ఆ దేశాల పౌరులు అమెరికా తుపాకీలను చేతబట్టి కాల్చగలిగినంత మాత్రాన కమ్యూనిజాన్ని నిలుపరించే శక్తిరాదు. ప్రతి కొత్తదేశం తన ప్రకృతి సంపదను, అంగబలాన్ని చక్కగా వినియోగానికి తెచ్చుకొని స్వంతజాతీయ లక్ష్యంతో ప్రభుత్వవ్యవస్థను రూపొందించుకున్నట్లయితే కమ్యూనిజాన్ని ఎదిరించే తాహతువస్తుంది.

నేడు అమెరికా సమస్త సిరిసంపదలతో తులతూగుతూవుంది గదా. ఇట్టి అమెరికా నిర్మాణం ఒక్కరోజులో జరిగిందా? లేదు. కొన్ని తరాలుపట్టింది. ఎంతమందో పనిచేయవలసివచ్చింది. ఎన్నో త్యాగాలు అవసరమైనవి. ఎంతో డబ్బు గుప్పించవలసివచ్చింది. రష్యావారు కూడా ముప్పైనలభైయేళ్ళలో ఆధునిక పారిశ్రామికరాజ్యాన్ని నిర్మించుకోగలిగారు. కాని వారు అనుసరించిన పద్ధతులు స్వేచ్ఛాప్రియవైఖరికి విరుద్ధమైనవి.

ఇప్పుడు ప్రపంచదృష్టి ఆసియా, ఆఫ్రికాలలోని బడుగుదేశాలపైకి మళ్ళింది. ఇక్కడ కోట్లాదిప్రజలు ఉత్తమజీవనంకోసం ఉవ్విళ్ళూరుతున్నారు. కొన్నితరాలుగా వలసపాలనలో దారిద్ర్యంతో అలమటించడంవల్ల ఇప్పుడు వారిలో స్వాతంత్ర్యం

పట్ల అభిలాష హెచ్చుగా వుంది. స్థిరసంకల్పులై వున్నారు. అన్నిటికీ తొందర పడుతున్నారు.

స్వేచ్ఛద్వారా సంపదను పొందవలెనన్న ఆసియా ఆఫ్రికావాసుల లక్ష్యం ఎలా సిద్ధిస్తుందంటే....ఇప్పటికే బాగా అభివృద్ధిచెందివున్న బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సు, జర్మనీ, జపానువంటి స్వేచ్ఛాప్రియ దేశాలు బడుగుదేశాల వృద్ధికి అవసరమైన ఆర్థికసహాయం చేస్తేనే.

ఈ సహాయం అమెరికన్లు చెయ్యకపోతే ఈ దేశాలు సోమరితనంతో మళ్ళీ గతంలోకి పోతాయని అనుకోవడం పట్టిభ్రమ. భవిష్యత్తు అవకాశాలను అవి రుచిచూశాయి. ఆ అవకాశాలను ఏదో ఒకవిధంగా అందుబాటులోకి తెచ్చుకోవలెనని కృతనిశ్చయులై వున్నాయి.

ఈ స్థితిలో ఓర్పు, స్థైర్యం, యుక్తాయుక్తవిచక్షణ, అవగాహన, చక్కని నిర్ణయం చేయగల తెలివి రావాలి. దక్షతకూడా రావాలి. నేడు ఆసియా ఆఫ్రికాలలో విస్ఫులించే రాజకీయ సాంఘిక చైతన్యాన్ని శాంతియుతమార్గ సమన్వితమైన స్వయం సహాయంచేసి, అభివృద్ధిపథంవైపు మళ్ళిస్తే ఇటు మనకూ, అటు ఆ కొత్తదేశాలకూ ఎంతో మేలు కలుగుతుంది.

అలాకాక చూస్తూవూరుకొంటే కమ్యూనిస్టు చైనావంటివి చిన్నా పెద్దా రాజ్యాలు ఏర్పడతాయి. అవి రష్యాతో అంటుకట్టిస్తాయి. అమెరికా నాశనం కోసం కంకణం కట్టుకుంటాయి.

ఈ లక్ష్యం అమెరికా అందుకోరానిదా? నేను అలా అనుకోను. ఉదాహరణకు వెనుకబడివున్న ఒకదేశంలో ఒకతరంకన్న తక్కువకాలంలోనే ఏమి జరిగిందో పరిశీలిద్దాము.

భారతదేశ జనాభా 45 కోట్లు. అంటే ఆఫ్రికా, లాటిన్ అమెరికాలు రెండింటి జనాభాను కలిపితే ఎంతో, అంత.

1962 ఆగస్టు 15 తేదీన స్వతంత్రభారతం తన పదిహేనవ జన్మదినోత్సవం జరుపుకొంటుంది. గాంధీ తెలివితేటలవల్లా, బ్రిటిషువారి దూరదృష్టివల్లా, అవగాహనాశక్తివల్లా భారతదేశం తన మాజీవలసపాలకులపట్ల సుహృద్భావంతో తన స్వాతంత్ర్యోత్సవాలను జరుపుకొంటున్నది.

గడచిన పదేండ్లలో భారతజాతీయాదాయం 42 శాతం పెరిగింది. ఆహార

ధాన్యాల ఉత్పత్తి 56 శాతం అధికమైంది. ఏటా 10 కోట్లమందికి మలేరియా వచ్చేదని 1947 లో వేసిన లెక్కలను బట్టి తేలింది. ఇప్పుడీ వ్యాధి దాదాపు రూపు మాసిపోతున్నది. భారతదేశంలో 1947 లో వ్యక్తుల సగటు ఆయుర్దాయం 27 సంవత్సరములు మాత్రమే. ఇప్పుడు సగటు ఆయుర్దాయం 42.

పదిహేనేండ్లక్రితం భారతదేశంలో నూటికి 10 మంది మాత్రమే అక్షరాస్యులు. ఇప్పుడు ఈ దేశబాలబాలికలలో నూటికి 60 మందులమంది (పన్నెండేండ్లలోపు వారు) స్కూళ్ళకువెళ్ళి చదువుకుంటున్నారు. భారత పారిశ్రామికోత్పత్తి ఏటా 14 శాతం చొప్పున పెరుగుతూ వుంది. ఇది ప్రపంచంలో పెద్ద పెరుగుదల అని చెప్పవలసివుంది.

భారతదేశం స్వాతంత్ర్యంపొందగానే తన రాజ్యాంగమును నిర్మించుకొన్నది. అందులో అమెరికా, బ్రిటిషురాజ్యాంగాల లక్షణాలు చేరి వున్నవి. ఆ తర్వాత మూడు సార్వత్రిక ఎన్నికలు జరిగినవి. ప్రతి ఎన్నికా ప్రపంచంలో పెద్ద ప్రజాస్వామిక ఎన్నిక. ప్రతిదానిలో అమెరికాలోకంటె ఎక్కువమంది జనం ఓటు వేశారు.

భారతదేశంలో వాక్ స్వాతంత్ర్యం, మతస్వాతంత్ర్యం, పత్రికా స్వాతంత్ర్యం వున్నవి. అమెరికాలో కంటె ఆ దేశంలో ప్రైవేటు పరిశ్రమల రంగంలో ప్రభుత్వ జోక్యం తక్కువ.

భారతదేశం ఇంతగా అభివృద్ధి చెందడానికి కారణం దాని స్వయంకృషే. భారతప్రజలు కష్టించి పనిచేశారు. సమర్థులైన నాయకులను ఏర్పాటుచేసుకున్నారు. విద్యావిజ్ఞానములు సముపార్జించుకున్నారు. బ్రిటిషువారిచ్చిన గట్టిశిక్షణ ప్రాతిపదికపై సివిలుసర్వీసు ఉద్యోగుల వ్యవస్థను ఏర్పాటుచేసుకున్నారు. అయితే అమెరికాయే ఉదారంగా సహాయంచేయకపోయినట్లయితే భారతప్రజాస్వామ్యం ఇంత దేదీప్యమానంగా వెలుగొందేదికాదు. గడచిన పదిహేనేండ్లలో భారత దేశానికి అమెరికన్లు 3.8 బిలియనుడాలర్ల ఆర్థికసహాయం చేశారు. అంటే దాదాపు 400 కోట్లడాలర్లు.

ఈ సహాయంలో నూటికి 55 పంతులు గోధుమ, ప్రత్తి, మొక్కజొన్న ధాన్యంవంటి మిగులు ఉత్పత్తులరూపంలో చేయబడింది. నూటికి 42 పంతులు సామగ్రి కొనుగోలుకై డాలర్ల రూపంలో ఇవ్వబడింది. అమెరికాలో అమెరికన్ కార్మికులు తయారుచేసిన ఉక్కు తదితర యంత్రసామగ్రే కొనుగోలుచేయబడింది. తక్కినది సాంకేతికసహాయం రూపంగా, శిక్షణరూపంగా ఇవ్వబడింది.

అమెరికన్లు ఇంత భారీయెత్తున సహాయం చేస్తున్నప్పటికీ, భారతదేశం ప్రజాస్వామ్య సూత్రాలనే పాటిస్తున్నప్పటికీ ఆ దేశం అమెరికాతో ఎల్లప్పుడూ ఏకీభవించదు. నైసర్గికంగా ఒకవైపు రష్యా, మరొకవైపు చైనా దగ్గరగా వుండడంవల్లనూ, కొంత భారతదేశ గతచరిత్ర కారణంగానూ, భారతదేశం ప్రపంచవ్యవహారాలలో అమెరికాకంటె భిన్నమైనదృక్పథం ఏర్పరచుకుంది. అమెరికన్లూ అంతేకదా! అమెరికా రెండు మహాసముద్రములవెనుక సురక్షితస్థానంలో వుండడంవల్ల అమెరికన్లు తటస్థంగా వేరుపాటుగా వుండగా బ్రిటిషు రాజనీతి, బ్రిటిషు నౌకాదళం శాంతిని కాపాడాయి.

అయినప్పటికీ ఆసియాలోని ఈదేశం ఇంతగా అభివృద్ధిచెందడం అమెరికా భద్రతకే చాలాముఖ్యం. ఆత్మవిశ్వాసంతో దినదిన ప్రవర్ధమానమయ్యే స్వతంత్ర భారతం ఆసియాలో కమ్యూనిస్టు చైనాకు సరిదీటుగావుండి చైనాబలానికి తగు జవాబు ఇవ్వగలుగుతుంది. ప్రజాస్వామ్యమనేది విసనొంపైన పాశ్చాత్యసిద్ధాంతం మాత్రమే కాదనీ, ఆచరణలో అది అద్భుతంగా పనిచేయగలదనీ భారతదేశం రుజువుచేస్తున్నది.

ప్రపంచవ్యవహారాలలో అమెరికా దృక్పథాన్ని పూర్తిగా ఆమోదించని ఆసియా, ఆఫ్రికానాయకుల విమర్శలకు అమెరికన్లు తరచు చిరాకుపడతారు. మనఃక్లేశం పొందుతారు. అటువంటప్పుడు ఇండియా, పాకిస్తాన్, ఫిలిప్పీన్స్ తదితర దేశాలలోకలిగిన అభివృద్ధి కమ్యూనిస్టేతర ప్రపంచానికెంత నైతికబలం ఇచ్చిందో, వాటికెంత ప్రోద్బలమిస్తూవుందో అమెరికా గ్రహించాలి. ఆదేశాల కృషి సఫలం కాకపోయినట్లయితే కమ్యూనిస్టేతర దేశాలు ఎటువంటివిపత్తు నెదుర్కొనవలసి వచ్చేదో కూడా అమెరికా ఆలోచించాలి.

దీర్ఘకాలంపై చూస్తే అమెరికా దేశభద్రత అట్టి స్వతంత్రదేశాలన్నీ కలిపి, ఒకప్రపంచవ్యవస్థగా ఏర్పడటంపై ఆధారపడివుంటుంది. అట్టి ప్రపంచవ్యవస్థకూ, అమెరికాకూ మానవసంబంధ విషయాలపై సాధ్యమైనంతవరకూ ఏకాభిప్రాయం వుంటుంది. ప్రపంచప్రజలు అట్టివ్యవస్థగా సంఘటితమైనప్పుడు కమ్యూనిజం పప్పులుడకవు.

## 31

# మధ్యప్రాచ్యంలో కొత్తపోకడలు

మధ్యప్రాచ్య ప్రజలు వారి జాతీయసంపదను వృద్ధిచేసే కోవదంలో నిమగ్నులైవున్నారు కదా. మరి అక్కడి ఉద్రిక్తస్థితి తగ్గుతుందా? కొంత తగ్గుతుందన్న నమ్మకాన్ని శ్రీ బౌల్స్ వెలిబుచ్చారు. 1962 ఏప్రిల్ 12 తేదీన అమెరికన్ యూదు మహా సభలో శ్రీ బౌల్స్ చేసిన ప్రసంగమిది.

గడచిన దశాబ్దిలో మధ్యప్రాచ్యం విషయంలో అమెరికా అభిప్రాయం అటూ ఇటూ ఊగిసలాడింది. ఒకప్పుడు ఎన్నో ఆశలు పుట్టుకొచ్చేవి. మరొకప్పుడు అంతా అంధకారబంధురంగా, చెడురోజులు రానున్నట్లుగా కన్పించేది. ఇప్పుడు మధ్యస్థంగా ఒకచోట నిలకడగావుంది.

ప్రస్తుతం అమెరికా అంచనాలను విమర్శనాత్మకంగా పరిశీలిస్తే మధ్య ప్రాచ్య సత్వర ఆర్థికాభివృద్ధి విషయంలో, ఆ ప్రాంతపు రాజకీయస్థిరత్వం విషయంలో అమెరికన్లు పెట్టుకొన్న కొండంత ఆశలనుండి కొంత దిగివచ్చారని విదితమవుతుంది. మరొకవిధంగాచూస్తే అత్యంత సంక్లిష్టస్థితిలో ఇటు అమెరికన్ ప్రభుత్వమూ, అటు సోవియట్ యూనియన్, మధ్యప్రాచ్యదేశాలూ వాస్తవములనెరిగి తమకుతాము సర్దుబాటు చేసుకున్నట్లు విశదంకాగలదు.

భౌగోళికంగా అత్యంత కీలకస్థానంలోవున్న ఈ ప్రాంత ప్రజలు కొన్ని వందల యేండ్లుగా యుద్ధాలకూ, పీడనకూ గురిఅవుతూవచ్చారు. మొదటి ప్రపంచ

యుద్ధం వారిలో స్వాతంత్ర్యం, సంపత్సమృద్ధి, ఐక్యత మున్నగువిషయాలలో ఎన్నోఆశలు రేకెత్తించింది.

ఒట్టోమన్ సామ్రాజ్యం పతనం కావడంతో మధ్యప్రాచ్యంలో రాజకీయంగా శూన్యస్థితి యేర్పడింది. ఆ శూన్యతను బ్రిటిషువారు, ఫ్రెంచివారు పూరించారు. పాతకలహాలకు బదులు కొత్తకలహాలు మొదలైనవి. రెండవ ప్రపంచయుద్ధంతో అరబ్బుప్రపంచంలో యూరోపియన్ వలసవాదం తుడిచిపెట్టుకు పొయ్యే స్థితి వచ్చింది. ఇజ్రేల్ స్వతంత్రదేశంగా అవతరించింది.

ఇది ఎన్నో వైమనస్యాలకు తావిచ్చినకాలం. అయినప్పటికీ ఇతర ప్రాంతాలమాదిరిగానే మధ్యప్రాచ్యంలో కూడా ప్రజలు హేతుబద్ధంగా ప్రవర్తిస్తారనీ, నానాటికీ నూనెవల్ల వచ్చే హెచ్చు ఆదాయం ఆప్రాంతప్రయోజనాలకు వినియోగింపబడగలదనీ, అరబ్ ఇజ్రేలు దేశాల ప్రజలు సఖ్యతతో జీవించడం నేర్చుకొని కలిసి కృషిచేస్తారనీ, నీటిసప్లయి, శరణార్థులు వంటి సమస్యలను పరస్పర సహకారంతో పరిష్కరించుకుంటారనీ అమెరికనులు ఆశించారు.

ఇవి అందనిపండ్లని ఇటీవల కొన్నేండ్లక్రితం తెలిసివచ్చేసరికి నిరాశా నిస్పృహలు అమెరికన్ల నావరించాయి. ఆ ప్రాంతమంటే నిరాశాపూరితవైఖరి అలవరచుకున్నారు.

నేడు మధ్యప్రాచ్యంకేసి దృష్టిసారిస్తే మూడు విషయాలలో పరిస్థితి మెరుగైనట్లు తెలియవస్తుంది:

1. కమ్యూనిజం క్రమేణా దాని ఆకర్షణను కోల్పోతున్నది. సోవియట్ యూనియన్, వెనుకటి జారిస్టు రష్యాబాటను ఆధునిక రూపంగా ఆవిర్భవిస్తున్నదనీ, నూనెలాభాల విషయంలో పెద్దపోటీదారు అనీ స్పష్టమవుతున్నది.

2. మధ్యప్రాచ్యదేశాలతో సంబంధాల విషయంలో అమెరికా కొంత నయంగావున్నట్లూ, పాతలనాటి స్పర్ధలు వెంటనే పరిష్కారం కావలెనని కోరుతున్నట్లూ వెల్లడిఅయింది.

3. మధ్యప్రాచ్యదేశాలే తమ ఇరుగుపొరుగుతో స్పర్ధలను తగ్గించుకొంటున్నవి. తమ దేశాభివృద్ధి విషయంలో హెచ్చు ఆసక్తి చూపుతున్నవి.

ఈ మూడు మార్పులూ రాజకీయ ఆర్థిక ఉద్రిక్తత సడలిందనడానికి నిదర్శనాలు. అదృష్టంబాగుంటే ఈస్థితి ఉద్రిక్తత తగ్గుదలకూ, అందరికీ సదవకాశాలకూ

దారితీయవచ్చు. నేటి సంక్షుభిత ప్రపంచంలో ఇట్టి మెరుగుస్థితి పత్రికలలో పతాక శీర్షికలుగా అచ్చుపడదు. కాని ఇది చరిత్రను లిఖిస్తుంది.

అరబ్ జాతీయవాదం కమ్యూనిజానికి బందీ అవుతుందని చాలా ఏండ్ల క్రిందట అమెరికనులు ఆందోళనపడేవారు. కాని ఈ రెండు రాజకీయశక్తులూ ఒక దానికొకటి ఎంత వ్యతిరేకమైనవో, అభివృద్ధిచెందే దేశపు చైతన్యవిలసితకృషి విదేశీయులు చొచ్చుకురావడానికి ఎట్టి ప్రతిబంధకంగా నిలుస్తుందో ఇటీవల అమెరికన్లు స్వయంగా చూచారు.

ఈజిప్టును చూడండి. అధ్యక్షుడు నాసర్ తన దేశాన్ని తనకు తోచిన ఆచరణసాధ్యరీతిని వృద్ధిచేసుకొంటూ అస్వాన్ హైడామునకు సోవియట్ రష్యా నుండి భారీయెత్తున సహాయం స్వీకరిస్తున్నాడు. అయినా క్రుశ్చేవ్ సమైక్య అరబ్ రిపబ్లిక్‌ను తన చెప్పుచేతలలో వుంచుకోలేకపోతున్నాడు సరికదా, స్థానిక కమ్యూనిస్టుపార్టీ కార్యకలాపాలను సహించి వూరుకోమని నాసర్‌కు చెప్పలేకపోతున్నాడు.

అమెరికా ప్రభుత్వంకూడా మధ్యప్రాచ్యంలో అమెరికా ప్రభావపరిమితులను గ్రహించింది. పడుతూలేస్తూ తప్పులుచేస్తూ దిద్దుకొంటూ ఈ ప్రాంతంతో వ్యవహరించే సందర్భంలో కొన్ని జీవితసత్యాలను గ్రహించింది. ముఖ్యంగా ఏది ఎంత కావాలని అనుకున్నారో అది అంతగా మధ్యప్రాచ్యంలో అక్కరలేదనీ, అత్యధిక సైనికభద్రతా కార్యక్రమానికి ప్రాముఖ్యమిచ్చినంతమాత్రాన అది అమెరికా దేశ భద్రతను కాపాడు వడానికి సర్వోత్తమమార్గమని భావించనక్కరలేదనీ తెలిసి వచ్చింది.

అసలు అమెరికన్లకు కావలసిందల్లా నిగ్రహం. నిగ్రహంతో సరిహద్దు సంఘర్షణలు, స్పర్థలు ప్రపంచవిపత్తుకు దారితీయకుండా నిరోధించాలి. తగుసుస్థిరత చేకూర్చి క్రమబద్ధమైన రాజకీయ ఆర్థికపురోగతికి వీలుకలిగించాలి. పైగా మధ్యప్రాచ్యదేశాలు వాటివాటి జాతీయాదర్శాల ననుసరించి వాటి ఆర్థికవ్యవస్థలను భవితవ్యాలను వృద్ధిచేసుకొని స్వతంత్రంగా నిలబడి స్వేచ్ఛాప్రియ ప్రపంచంలో ఆత్మగౌరవం కలసభ్యదేశాలుగా వుండవలెనని అమెరికన్ల అభిమతం.

మధ్యప్రాచ్యంలో అనుభవంవల్ల అమెరికన్లు కొన్ని సంగతులు నేర్చుకున్నారు. తక్కినచోట్లలాగే ఇక్కడకూడా అమెరికన్ల తటస్థవాదంతో, అనేక రకాల కలయికలతో సహజీవనం నెరపడం నేర్చుకున్నారు.

మధ్యప్రాచ్య అవసరాలు పెద్దవి. కొన్నిశతాబ్దాలుగా దండయాత్రలు, ప్లేగులు, జనసంహారం, తిరుగుబాట్లు సంభవించినందువల్ల ఆ ప్రాంతంలో మానవబలగం తగ్గింది. ప్రకృతిసంపద క్షీణించింది. ఎడారులలో ఒకప్పటి నీటివసరు ప్రాజెక్టుల శైథిల్యాలు కన్పిస్తాయి. ఒకప్పుడు లవణరహితంచేయబడ్డ భూములను వ్యర్థంగా వుంచి తిరిగి వెడిపోనిచ్చారు. మురుగుపారుదల కాల్వలకు గోతులుపడ్డవి. సాగు నీటివసరులు నాశనంగావింపబడ్డవి. ఇది చాలా క్లిష్టప్రదేశం. ప్రతిదాన్నీ ప్రకృతితో పోరాడిసాధించాలి. పూర్వపు ఆర్థికపునాదులను పునహావేయడమంటే అది బ్రహ్మాండమైన పని.

మధ్యప్రాచ్య అంతర్గత సమస్యలను వాణ్బాతుర్యంతో పరిష్కరించలేమని ఆప్రాంతం నాయకులు గ్రహించారు. భూమిసంపిణీ సరిగాలేదు. విద్యలేదు. ఆరోగ్యసదుపాయాలు లేవు. సంఘసంస్కరణలు అసలు ఎప్పటినుంచో నిర్లక్ష్యం చేయబడ్డవి. ఇప్పుడు ఈ సమస్యలవిషయంలో నాయకులు ఆసక్తి చూపుతున్నారు.

మధ్యప్రాచ్యంలో అనేక విజయాలను, వైఫల్యాలను పొందిన అమెరికా ఒక ఉపఖండం మొత్తపురాజకీయ ఆర్థికనిర్ణయాలకు తాను బాధ్యతవహించలేననీ, కేవలం డాలర్లవల్లనే సంతృప్త సమాజం ఏర్పడదనీ గ్రహించింది. పైగా మధ్య ప్రాచ్యంలో అమెరికా విధానంవల్ల ప్రయోజనంచేకూరాలంటే ప్రజలను సరిగా అర్థంచేసుకోవాలనీ, ప్రజలు తమ భవితవ్య నిర్ణయంలో తాము భాగస్వాములు కావలెనని కోరుతారు. జరుగుతున్నది తమకోరకేనన్న భావం వారికి కలగాలి. వ్యక్తిగతన్యాయం, గౌరవం వుండాలి అని వారు వాంఛిస్తారు అనీ తెలుసుకున్నారు అమెరికనులు.

ఇలాంటి మానవాంశములను నిర్లక్ష్యంచేస్తే సత్వర ఆర్థికాభివృద్ధి నిరాశకు తావిస్తుంది. ప్రజలు తాము చేకూర్చుకోగలిగిన దానికంటే ఎక్కువదానికి ఆశపడ వలెనని ప్రోత్సహిస్తుంది. పాత సాంఘికసంబంధాలను విచ్ఛిన్నంచేస్తుంది. ఇవన్నీ అనుభవంవల్ల అమెరికా నేర్చుకొన్నవి. అయినా అభివృద్ధికృషి ఆపరాని దని అమెరికన్లకు తెలుసు.

కాబట్టి అమెరికన్లు యెదుర్కొనే సవాలు ద్విముఖమైంది. అత్యవసరమైన ఆర్థికలక్ష్యాలను సిద్ధింపజేసుకునేందుకు సాధనాలను కనుగొనడం ఒక సవాలు. ఆ చేయడంకూడా దేశీయవ్యక్తులకు హెచ్చు సంతృప్తికరంగా వుండేట్టుచూడడం రెండవసవాలు.

ప్రస్తుతం మధ్యప్రాచ్య మనఃస్థితి చాలా మెరుగు అనుకూలంగానే వుంది. ఈస్థితే ఇకముందుకూడా వుండగలదని అమెరికన్లు ఆశించవచ్చు. దీనివల్ల ఆప్రాంత చరిత్రగతే మారనున్నది. అది ఎప్పుడూ ప్రగాఢస్పర్థలతో, సంఘర్షణలతో, వినాశకరచర్యలతో, తరచు బుద్ధిమార్పులతో తాపిలమైవుంటే ప్రాంతంగదా. అట్టి చోట కొంత నిలకడ కల్పించడం మేలుకాదా?

అయితే అంతర్వాహినివలె వున్న ప్రమాదభరితములను అమెరికన్లు తక్కువ అంచనా కట్టకూడదు. ఏమైనా బలప్రయోగం జరిగిందంటే ప్రగతి అంతా తిరోగమిస్తుంది. మళ్ళీ ఆప్రాంతంలో రక్తపాతంతో కూడిన అరాచక మొస్తుంది. ఆలోపల ప్రాంతీయసమస్యలు యథాతథంగా వుండిపోతాయి. వాటి పొంత కెవరూ పోరుకదా. అప్పుడు సులభమార్గాలకోసం వెతకడం బుద్ధితక్కువ పని అవుతుంది.

ఉదాహరణకు జోర్డాన్‌నది సమస్య వుంది; అరబ్‌శరణార్థుల సమస్యవుంది. ఈ రెండుసమస్యలు మధ్యప్రాచ్యం మొత్తాన్ని శాశ్వతసంక్షోభంలో వుంచుతూ వున్నవి. వీటిని కొంత సడలింపచేయాలంటే అన్నిపక్షాలవారూ నిజాయతీతో కృషిచేయడం అవసరం.

చివరకు మధ్యప్రాచ్యంలో ఒకేజాతి భావం ప్రబలవచ్చు. దానివల్లకలిగే మేలు అన్నిపక్షాలవారికీ ముఖ్యమైతే పరంపరాగతంగా వస్తూవున్న విభేదాలను మరచిపోతారు. ఇప్పుడు యూరప్‌లో సమష్టిభద్రత ప్రతిపాదన ఎన్నోవిభేదాలను సమయింపచేయడంలేదా? కనుక కొత్తమనఃస్థితి పూర్తిగా రూపొందేటంత వరకూ అమెరికన్లు రాజకీయ ఆర్థికసంబంధమైన పైనంటిన సమస్యలను వాస్తవ స్థితిగతులనెరిగి పరిష్కరిస్తూవుండాలి.

ఇక్కడే ఇజ్రేల్ నిర్వహించవలసిన ముఖ్యపాత్ర వుంది. ఒక్కతరం లోపలే ఇజ్రేల్ గొప్ప అభివృద్ధిని సాధించింది. ప్రపంచంలోనే ఇదొక గొప్ప విశేషం. ఏటా 8 శాతం అభివృద్ధి! ఈదేశపు తలసరిమేరకు జాతీయోత్పత్తి సంవత్సరానికి 1,000 డాలర్లకుపైగా వుంది. అంటే దానిపొరుగున వున్న మధ్య ప్రాచ్య దేశాలకన్న చాలాఎక్కువ అన్నమాట. నెదర్లెండ్సు, ఇటలీ, స్పెయిన్, ఆస్ట్రియా, గ్రీసు, పోర్చుగల్‌కంటె కూడా ఎక్కువే.

1961 లో ఇజ్రేల్ పారిశ్రామికాభివృద్ధి 14 శాతం. ఇది ప్రపంచంలోని

ఉన్నతప్రమాణాలలో ఒకటి. అంతకుక్రితం సంవత్సరంకన్న దానిదిగుమతులు 25 శాతం పెరిగినవి. దాని విదేశీమారకపునిధులు 65 శాతం అధికమైనవి.

అరబ్ దేశాలు ఇస్రేల్‌ను బహిష్కరించడంవల్ల ఇస్రేల్ మధ్యప్రాచ్యం అవల స్నేహితులను, మార్కెట్లను చూచుకోవలసిన అగత్యం కలిగింది. దీనిఫలితం గానే ఇస్రేలీ విదేశీ సాంకేతిక సహాయకార్యక్రమం ఆవిర్భవించింది. దీనిక్రింద ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికాలలోని రమారమి 20 దేశాలు సహాయం పొందుతున్నవి. గడచినసంవత్సరం 52 దేశాలనుండి వెయ్యిమంది విద్యార్థులు ఇస్రేల్ వెళ్ళి అక్కడ చదువుకుంటున్నారు. రెండువందలమందికి పైగా ఇస్రేలీ సాంకేతికులు అభివృద్ధిచెందని దేశాలలో సలహాదార్లుగా పనిచేస్తున్నారు.

కాని ఇస్రేల్ ఇరుగుపొరుగుదేశాలు ఇస్రేల్ చేస్తూవున్న ఈ కృషిని ప్రశం సించేట్టు లేవు. పైగా అకారణంగా దానిని ద్వేషిస్తూవున్నవి. కాని మధ్యప్రాచ్య దేశాలు వాటివాటి అభివృద్ధిప్రణాళికలను అమలుపరుస్తూ ఆత్మవిశ్వాసం పొందుతూ పొయ్యేకొద్దీ వాటికి సహనం అలవడుతుంది. ఇతరులను అవగాహన చేసు కుంటాయి. ఆవిధంగా వాటి పై ఒకరిలో మార్పువస్తుంది.

ఈపరిస్థితిలో మధ్యప్రాచ్యంలో అమెరికా విధానానికి ఉండవలసిన గుణ విశేషాలేమిటి?

మొదటిది.—ఈ ప్రాంతంలో అన్నిదేశాలూ వాటిస్వాతంత్ర్యాన్ని నిలబెట్టు కొనేట్టు అమెరికన్లు తోడ్పడాలి. ఇందుకు ఏవైపునుంచి దురాక్రమణ జరిగినా దాన్ని తిప్పికొట్టగల అమెరికా సాధనం వుండాలి.

రెండవది.—ఉద్రిక్తతను తగ్గించడానికి, అరబ్-ఇస్రేలీ వివాదం ప్రత్యక్ష సంఘర్షణకు దిగకుండా నిరోధించడానికీ ఐక్యరాజ్యసమితి వ్యవస్థలను ఉపయో గించాలి.

మూడవది.—మధ్యప్రాచ్యదేశాలు వాటి ఇరుగుపొరుగుతో ప్రచార సంబంధ మైన వాగ్వివాదాలకు దిగి కాలం వ్యర్థపుచ్చకుండా అవి తమ దేశీయ అభివృద్ధి సమ స్యల పరిష్కారానికి హెచ్చు ఆసక్తిచూపేవిధంగా ప్రోత్సహించాలి. తమదేశంలో కొద్దిమంది ధనవంతులకేగాక పౌరులందరిస్థితిని బాగుపరచజూచే దేశాలకు ప్రత్యేక ప్రాధాన్యమిచ్చి సహాయంచేయాలి.

నాల్గవది—ఎంత పరిమితంగానున్నాసరే, మధ్యప్రాచ్యదేశాల మధ్య ఎంతో కొంత సహకారానికి ప్రాతిపదిక ఏర్పడేట్టు కృషిచేయాలి.

మధ్యప్రాచ్యంలో గాని, మరెక్కడగాని సుస్థిరత చేకూరాలంటే, ఇంద్ర జాలపు సూత్రాలు లేవు. అమెరికన్‌లు సైనికంగా, పారిశ్రామికంగా గొప్పశక్తి గలవారైనప్పటికీ ఇతరచోట్లవలెనే మధ్యప్రాచ్యంలో కూడా పరిస్థితులను రూపొందించే వీలు వారికి చాలాతక్కువ.

అయినా ఓర్పునేర్పులతో కూడిన రాజనీతి, దురాక్రమణ బెదిరింపులను తట్టుకొని నిలువగలధైర్యం, ఇతరుల ఉద్దేశాలనూ, వాటికికారణాలనూ అర్థం చేసుకోగల తెలివి, ఆర్థికాభివృద్ధికి తోడ్పడటానికై అమెరికా సాధన సంపత్తులను వివేచనతో ఉపయోగించడం - ఈ పనులవల్ల అరాచకస్థితిని తొలగించి రాజకీయ ఆర్థిక సుస్థిరతకు రాచబాటవేయవచ్చు. ఇక్కడే అమెరికా ప్రమేయానికి వీలు కలుగుతుంది.

ఒకవిషయంమాత్రం నిజం. పౌరులకు నిజమైన స్వాతంత్ర్యం, వ్యక్తికి గౌరవం, భౌతికశ్రేయస్సు వుండే న్యాయబద్ధమైన సమాజాలను సృష్టించడం ద్వారానే అమెరికన్లు శాశ్వతమైన ప్రపంచశాంతిని నెలకొల్పగలరు.

ఈ విషయంలో మధ్యప్రాచ్యంలో భవిష్యత్పరిణామాలు ఎలావుంటాయో ఊహించడం కష్టం. అయినా ఆశారేఖలు లేకపోలేదు.

# 32

## ఆఫ్రికాలో ప్రయాణీకుడు

1955 చలికాలంలో శ్రీ బౌల్స్ సతీసమేతంగా ఆఫ్రికాలో సహారా ఎడారి దిగువప్రాంతంలో ఆరువారాలు పర్యటించి తమ కుటుంబానికి కొన్ని లేఖలు వ్రాశారు. ఆ లేఖలలోనుంచి కొన్ని అంశాలు.

మేము ఆఫ్రికాకు రాకముందు కొందరు మాతో- వున్నది ఒక ఆఫ్రికాకాదనీ, కనీసం అరడజను ఆఫ్రికా లున్నాయనీ అన్నారు. ఆఫ్రికాఖండంలో రెండు వారాలు పర్యటించాక ఆమాట నిజమని మేము తెలుసుకున్నాము.

ఒకచివర ముస్లిం ఉత్తరాఫ్రికా వుంది. అక్కడ 25 లక్షల మంది ఫ్రెంచివారు, ఇటాలియనులు వున్నారు. మరొకచివర దక్షిణాఫ్రికా వుంది. అక్కడకూడా అంతేసంఖ్యలో తెల్లవాళ్ళున్నారు. వీళ్ళు మహాతలబిరుసు గల మనుషులు. అలాగే పోర్చుగీసు తూర్పు ఆఫ్రికా పశ్చిమ ఆఫ్రికా వున్నాయి. బ్రిటిషు తూర్పుఆఫ్రికా వుంది. కాబట్టే ఇక్కడ స్థిరపడదామని వచ్చిన తెల్లజాతులవారు ఈ ప్రాంతాన్ని చూచి చంకలెగరేసి ఇళ్ళూ వాకిళ్ళూ ఏర్పరచుకొని తిష్ఠవేశారు.

బ్రిటిషు పశ్చిమాఫ్రికా విచిత్రంగావుంది. ఇక్కడ నివాసమేర్పరచుకున్న యూరపియనుల సంఖ్య తక్కువ. ఇంగ్లీషువారికి ఈప్రాంతంలో తమ బాధ్యత వదిలించుకుందామన్న కాంక్ష అధికం. వారీప్రాంతానికి స్వాతంత్ర్యమివ్వ సిద్ధంగా వున్నారు. సహారాఎడారికి దక్షిణంగావున్న ఫ్రెంచి ఆఫ్రికా, బెల్జియన్ కాంగో ఇందుకు భిన్నంగావున్నవి. ఆప్రాంతాలలో వలసపాలకులు స్పష్టమైన పథకాలు

వేసుకొనివున్నారు. అయినా వాటిభవిష్యత్తు తేలవలసివుంది. ఇది లైబీరియా, ఎథియోపియా, ఈజిప్టు, లిబియా, సూడాన్‌లతో విడిచిన స్వతంత్ర ఆఫ్రికా వుంది. ఈదేశాలన్నీ వలస కొరడాపునిషి లేకుండానే తమ సమస్యలను ఎదుర్కొంటూ వున్నవి.

ఆఫ్రికారంగంపై కన్పించే కొన్నితేడాలు నా ఈ నోటులలో విప్పించవచ్చు.

*　　　*　　　*

ఆఫ్రికా శూన్యఖండమన్నభావం నాకుకలిగింది. ఆసియాను చూచినతర్వాత ఆఫ్రికానుచూస్తే రెండిటిమధ్యగల తేడా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఆసియాలో కంటె ఆఫ్రికాలో జనాభా తక్కువ. మరి ఆఫ్రికా ఆర్థికాభివృద్ధి సమస్య మరింత జటిలమవుతుందికదా ?

బెల్జియన్‌కాంగో విస్తీర్ణంలో భారతదేశమంత వుంది. భారతదేశంలో వలెనే కాంగోలో కూడా ప్రకృతి సంపదవుంది. కాని కాంగో జనాభా 1 కోటి 20 లక్షలు మాత్రమే. మరి భారతదేశ జనాభా 36 కోట్లు. అచటి గవర్నరు నాతో మాట్లాడుతూ "మా జనాభా ఐదురెట్లు అయినట్లయితే మా అభివృద్ధి రెట్టింపు వేగంతో సాధ్యమవుతుంది" అన్నారు.

ఆసియా ప్రభుత్వాలు ఆధునికయంత్ర సామగ్రిని ఉపయోగించ సంకోచిస్తాయి. అక్కడ జనమెక్కువ-పనులు తక్కువ. అంతా పనులకోసం ఎగబడేవారే. తమ కొనుగోలుశక్తి పెరగాలని చూచేవారే. కాని ఆఫ్రికాలో మానవ శ్రమను తప్పించడానికి ఎట్టి యంత్రసాధనమునైనా ఉపయోగించ జూస్తారు. ఈ విధంగా ఆఫ్రికాలో పనితనం, నైపుణ్యం పెరిగినకొద్దీ వేతనాలు పెరిగే అవకాశం వుంది. జీవనప్రమాణాలు పెరిగే వీలుంది. కాని ఇందువల్ల కలిగే రాజకీయ పరిణామాలు ఎలాంటివో చెప్పలేము.

ఈనాడు కాంగోలోని ఫాక్టరీలు భారతదేశంకంటె ఆధునికమైనవి. బట్టల మిల్లుకార్మికునికి అక్కడ రోజుకు రెండు డాలర్లవేతనం, వుండడానికి ఇల్లు అతనికీ అతనికుటుంబానికీ వైద్యసదుపాయాలు, ఇంకా ఆహారపు అలవెన్సు ఇస్తారు.

*　　　*　　　*

1938 లో గోల్డుకోస్టుకు వచ్చిన ఒకానొక బ్రిటిషు జిల్లా అధికారిని అతని బాధ్యతలేమిటో వివరించి చెప్పమని అడిగాను. అతను ఇలా చెప్పాడు: "మొదటిది

శాంతిభద్రతల పరిరక్షణ. ఆ తర్వాత రాకపోకలు, వార్తాసౌకర్యాల ఏర్పాటు, అంటువ్యాధుల నివారణ. అంటువ్యాధులంటే యూరపియనులకు తగిలే వ్యాధులని అతని భావం.

ఈనాడు అతను చేసేపని ఏమిటని అడుగగా ఆ మార్పు ప్రాముఖ్యమేమిటో గుర్తించని వాడివలె అతను "మొదటిది గ్రామరోడ్లు, నీటిసౌకర్యం ఏర్పాటు; తర్వాత పాఠశాలలు; మలేరియా అదుపు, గ్రామ ఆసుపత్రులు; వ్యవసాయోత్పత్తిని వృద్ధిచేయడం" అన్నాడు.

వలసప్రభుత్వాలు యుద్ధం తర్వాతనుంచే ఆఫ్రికా ప్రజల వ్యవహారాలలో ఆసక్తి చూపుతున్నాయని చెప్పడం అతిశయోక్తి కాదనుకుంటాను. యుద్ధానికి ముందు ఈ ప్రభుత్వాలు ఆఫ్రికన్ ప్రజలకు ఏవో చేసేవి. ఇప్పుడవి ఆఫ్రికనుల కోసమే చేస్తున్నాయి. ఇదీ అసలు అభివృద్ధి. కాని ఆఫ్రికాప్రజలతో కలిసి వారి తోడ్పాటుతో చేయనంతవరకు భాగస్వామ్యమనేది ఏర్పడుతుందా?

* * *

తెల్లవారంటే మండిపడే ఒక ఆఫ్రికన్ ఆక్రాలో నాతో మాట్లాడుతూ "తెల్లవాడు క్రీస్తుపేరిట ఆఫ్రికాకు బానిసత్వం తెచ్చాడు" అన్నాడు.

క్రైస్తవమిషనరీలుకూడా తప్పులుచేశాయి. కాని దుమ్ములూపొదలతోనిండిన గ్రామసీమలలో గుర్రంపై పోతూ చూస్తే మిషనరీల శక్తిసామర్థ్యాలు, ధైర్యం, లక్ష్యంపై వారికిగల ఆసక్తి అవగతమయ్యాయి. నల్లమనిషి ఎప్పుడూ సాంఘిక న్యాయంకావాలని ఘోషిస్తాడని విసుగుపడేముందు అమెరికన్ల క్రైస్తవమత బోధల వల్లనే అతనిలో విశ్వాసం, ఆకాంక్ష ఉద్భవించాయని వారు తెలుసుకోవాలి. వాటి వల్లనే అతను ఇప్పుడు తెల్లవారికి కొరకరాని కొయ్యగా తయారయ్యాడు.

* * *

ఇండియాలో ప్రవేశపెట్టిన విద్యావిధానాన్నే బ్రిటిషువారు గోల్డుకోస్టులో ప్రవేశపెడుతూ వుండవచ్చు. ఈ విద్యావిధానంవల్ల ఇండియాలో నిరాశతో క్రుంగిపోయ్యే మేధావులు చాలామంది తయారయ్యారు.

ఈ విద్యావిధానం సక్రమమైంది కాదేమోనని ఒక ఇంగ్లీషు పెద్దమనిషితో నేననగా ఆయన "ఇండియాలో ప్రమాణాలను పడిపోనిచ్చారు కాబట్టి ఈ విద్య

విధానం క్షీణించింది. కాని ఇక్కడ గోల్డుకోస్టులో ఆక్స్‌ఫర్డు ప్రమాణాలను నిలుపుతాం చూడండి" అన్నాడు.

"కాని ఒకటి ఆలోచించండి. ఆఫ్రికన్ సమాజాలు సాంకేతిక నైపుణ్యం కోసం తహతహ లాడుతున్నవి. అటువంటప్పుడు ఆక్స్‌ఫర్డు, కేంబ్రిడ్జి, హార్వర్డు, యేల్ విశ్వవిద్యాలయాల విద్య ఈ ఆఫ్రికన్ యువకులకు తగినదికాదేమో" అన్నాను నేను.

అతను వెంటనే "కాదు సార్, ఆఫ్రికావాడు కోరుకునేది ఆక్స్‌ఫర్డు విద్య. అదిలభిస్తే జన్మతరించినట్లు భావిస్తాడు." అన్నాడు. ఇక ఈ విషయం చర్చించి లాభంలేదని సంభాషణధోరణి మార్చాను.

ఆఫ్రికానాయకులకు ఉదారంగా విద్యగరపటడం అవసరమే. అదికాదనను. కాని బ్రిటిషువారి అభిప్రాయంలో కొంత 'అతి' కన్పిస్తుంది నాకు. ప్రత్యేకనిపుణుల శిక్షణకూడా చాలా ముఖ్యమైంది.

ఆఫ్రికాకు ఇంజనీర్లు, డాక్టర్లు, వ్యవసాయ ప్రవీణులు కావాలి. సమర్థమైన రాజకీయనాయకత్వం కావాలి. ఆసియా ఆఫ్రికాలను చూచినవారెవరైనా ఆ ప్రాంతాలలో తక్కువ న్యాయవాదులున్నా పరవాలేదుగాని వ్యవసాయంలో ప్రవీణులైనవారుమాత్రం చాలామంది కావాలని వెంటనే అంగీకరిస్తారు.

వలసవిద్యాధోరణుల మధ్య కన్పించే వ్యత్యాసం గమనార్హమౌతుంది. బ్రిటిషువారు మంచి ఉన్నతవిద్యకు......వీలైతే ఆక్స్‌ఫర్డు ప్రమాణం విద్యకు ప్రాధాన్యమిస్తారు. ఎంతమంది పట్టభద్రులుంటే అంత మంచిదని వారి విశ్వాసం. గోల్డుకోస్టు భావిపౌరులు మూడువేలమంది ఇప్పుడు విదేశాలలో ఆంగ్లభాషా విద్యాసంస్థలలో చదువుతున్నారు. అక్రానగరం వెలుపల వెయ్యిమంది విద్యార్థులకు వీలుగా ఆక్స్‌ఫర్డునమూనా ప్రకారం ఒక విశ్వవిద్యాలయం ఏర్పాటుచేస్తున్నారు.

ఇంగ్లీషువారి సంగతి ఇట్లావుంటే బెల్జియన్ అధికార్లకు చదువుకున్న ఆఫ్రికన్ అంటే చచ్చేభయం. కాంగో విద్యార్థులు 11 మంది ఇప్పుడు బెల్జియంలో చదువుతున్నారు. ఇక మరెక్కడా ఎవరూ చదవడంలేదు. లియోపాల్డువిల్ నగరం వెలుపల ఒక విశ్వవిద్యాలయాన్ని ఏర్పాటుచేస్తున్నారు. అందులో ప్రతియేటా ఆరుగురో, లేక ఏడుగురో పట్టభద్రులను తయారుచేయాలని వారి ఆశయం।

ఫ్రెంచివారు ఈ రెండిటికీ మధ్యస్థంగా వున్నారు. ఫ్రెంచి ఈక్వెటోరియల్

ఆఫ్రికా విస్తీర్ణంలో అమెరికా సంయుక్తరాష్ట్రాలలో సగముంటుంది. కాని దాని జనాభామాత్రం 40 లక్షలే. ఆ ప్రాంతానికి చెందిన 300 ఆఫ్రికనులు ఫ్రాన్సులో చదువుతున్నారు. వీరిలో చాలామందిని వృత్తివిద్యలలోకి దింపుతున్నారు. బహు తక్కువమందిని మాత్రమే ఆర్ట్సుకోర్సులను చదువనిస్తారు.

అయితే వలసదేశాలన్నింటిలో విద్యాసౌకర్యాలు త్వరితగతిని వృద్ధిచెందుతున్నాయి. ఆరేండ్లవయస్సు పిల్లలలో నూటికి 50 వంతులమంది పాఠశాలలకు వెళుతున్నారని అందరి ఊహ. ఇదే నిజమైతే భారతదేశంలోకంటె పరిస్థితి మెరుగేనని చెప్పవలసివుంటుంది.

ఫ్రెంచి ఈక్వెటోరియల్ ఆఫ్రికాలో, బెల్జియన్ కాంగోలో నేను వున్నంత కాలమూ నాకు నలుగురు ఆఫ్రికనులను మాత్రమే పేర్లుచెప్పి పరిచయంచేశారు. ఆ నలుగురూ వట్టి మేదకులు. నిశ్చితంగా ఏదీ చెప్పరు. ఎటూ మాటజారని రకాలు. లియోపాల్డువిల్ నగరంలో ముగ్గురినీ అడిగాను. "ప్రస్తుతవిధానంలో దేన్ని మీ ప్రజలు హెచ్చుగా విమర్శిస్తారు?" అని. వాళ్ళు ఒకక్షణం తటపటాయించి "రాజకీయవివక్షను అంతగా పట్టించుకోము. కాని సాంఘికవివక్షతే ఒకగొడవ. నల్లవాళ్ళపట్టణమునీ, తెల్లవాళ్ళపట్టణమునీ వేర్వేరుగా వున్నాయి. చీకటిపడిందంటే నల్లవాళ్ళు తెల్లవాళ్ళపేటలోకి పోరాదు. తెల్లవాళ్ళు నల్లవాళ్ళపేటలకేసి రారు."

* * *

మధ్య ఆఫ్రికాలో అమెరికా సమాచారకార్యక్రమం భవిష్యత్తుకు రూపురేఖలుదిద్దే అధికసంఖ్యాకులైన ఆఫ్రికనులకోసం కాదు. అల్పసంఖ్యాకులైన యూరపియనులకోసం. లియోపాల్డువిల్ నగరంలోవున్న అమెరికన్ లైబ్రరీలో పుస్తకాలు తీసుకోవడానికని 980 మంది పేర్లు రిజిష్టరు చేయించుకున్నారు. వారిలో 12 మందిమాత్రమే ఆఫ్రికనులు. లైబ్రరీలో మొత్తం 4,300 పుస్తకాలున్నాయి. వాటిలో 280 మాత్రమే ఫ్రెంచిభాషలో వున్నాయి. లియోపాల్డువిల్ ప్రజలలో ఎంతమందికి ఇంగ్లీషు మాట్లాడను, చదువను వచ్చు అని అడిగాను. "బహుశా 1800 మందికి. వీరిలో కొద్దిమందితప్ప తక్కినవారంతా బెల్జియనులు" అని సమాధానం చెప్పారు.

అమెరికాయిస్తున్న కొద్దిపాటినిధులను వివేచనతో ఖర్చుపెట్టాలి. అమెరికా అభిప్రాయాలను అధికసంఖ్యాకులైన ఆఫ్రికనులకు నిష్కపటంగా చెప్పజాలనప్పుడు వారి కృషిని అక్కడగాక మరొకచోట సాగించడం మంచిది.

లియోపాల్డువిల్‌లో రెండు పెద్దదినపత్రికలున్నాయి. 1000 ప్రతులను మాత్రమే 300,000 ఆఫ్రికనులు వాడుకొంటారు. ఈ అంకెలను చూచిన పిరికి యూరపియనులు సంతోషపడతారేమో! ఎందుచేతనంటే ప్రమాదకరమైన భావాలు పెద్దపెట్టున వ్యాప్తిచెందుతాయన్న భయంలేదు కదా. ఎంత తక్కువమంది పత్రికలు చదివితే అంతమంచిది!

* * *

ఉత్తరరొడీషియాలో మేము ఒకగని చూడటానికి వెళ్ళాము. అందులో 9,000 మంది ఆఫ్రికనులు, 1,500 మంది యూరపియనులు పనిచేస్తున్నారు. వీరికి వేర్వేరు కార్మికసంఘాలున్నవి.

యూరపియన్‌గని పనివారలకు నెలకు సగటున 284 డాలర్లు వేతనం లభిస్తుంది. అదికాక 60 శాతం కాపర్‌బోనసు, ఉచితవైద్యసహాయం, వసతిగల మంచి ఇల్లు ఇవ్వబడుతాయి. మంచి కంట్రీక్లబ్బులో నెలకు నామమాత్రపు సభ్యత్వరుసుము చెల్లిస్తే సభ్యత్వం లభిస్తుంది. అమెరికాలో రాగిగనిపనివారలకు లభించే వేతనాలకంటె అధికంగానే వీరికి లభిస్తున్నాయి. కాని ఇచట జీవన వ్యయప్రమాణంమాత్రం అమెరికా ప్రమాణానికి సగమేవుంటుంది.

గనిలోపల పనిచేసే ఆఫ్రికనుకు నెలకు సగటున 18 డాలర్ల వేతనం మాత్రమే ఇస్తారు. ఒకచిన్న ఇల్లు ఇస్తారు. నిత్యఆహారభత్యము, ఉచిత వైద్య సహాయంకూడా వుంటాయి. అన్ని అంశములనూ లెక్కలోకి తీసుకుంటే నిష్పత్తి 20 : 1 వుంటుంది. ఈఅంకెలను నేను ఫెడరేషన్ ప్రభుత్వం ప్రకటించే నెలసరి లెక్కలపత్రిక (1954 డిసెంబరు) నుండి తీసుకున్నాను.

అయితే ఆఫ్రికనులకన్న యూరోపియనులు చేసేపని ప్రావీణ్యముతో కూడి వుంటుంది.

దక్షిణరొడీషియాలో వేతనాలు ఉత్తర రొడీషియాలోకన్న 30 శాతం తక్కువగావుంటాయి. అయితే నెలకు కనీసం 16 డాలర్లు ఇవ్వవలెనన్న శాసనం వుంది. ఆఫ్రికనులలో నూటికి 70 వంతులమంది ఈ కనీసవేతనం పొందుతూ వుంటారు. తక్కువలో తక్కువ వేతనం పొందే యూరపియన్ కన్న హెచ్చు వేతనం పొందుతూవున్న ఆఫ్రికనులు ఫెడరేషన్ మొత్తంలో రెండు డజనుల కంటె ఎక్కువమంది వుండరని అచటివారు నాతో చెప్పారు.

ఆఫ్రికన్ గనిపనివారలు ఏమికావాలని కోరుతున్నారని నేను ప్రశ్నించగా "నెలకు 18 పౌనులు (48 డాలర్లు) కావాలంటున్నారు. తీవ్రవాదులు రాజకీయ ప్రయోజనాలకోసం ఈ కోర్కెను ప్రచారం చేస్తున్నారు" అన్న సమాధానం వచ్చింది.

* * *

నేను ఒక ఉన్నతాధికారితో మాట్లాడుతూ "ఒకసంగతి నాకు అర్థం కాకుండావుంది. గోల్డుకోస్టులోని ఆఫ్రికను, దక్షిణరోడీషియాలోని ఆఫ్రికను ఇద్దరూ ఒకటే తెగకు చెందినవారేకదా. కాని గోల్డుకోస్టువారు 4 వేలమంది స్వదేశంలో, విదేశాలలో కాలేజీలలో చదువుకుంటున్నారు. కాని దక్షిణరోడీషియా ఫెడరేషన్ మొత్తంలో 50 మంది ఆఫ్రికనులు మాత్రమే పట్టభద్రులు. అంతేగాక గోల్డుకోస్టు ప్రభుత్వంలో పెద్ద సమర్థులైన ఆఫ్రికనులు ఎందరో వున్నారు. ఇక్కడ ఎవరూ లేరు. కారణమేమిటి?" అన్నాను.

ఉన్నతాధికారి తెల్లబోయి తనకూ అది విచిత్రంగానే వుందనీ, ఈ అంశాన్ని తాను ఎన్నడూ గట్టిగా ఆలోచించలేదనీ అన్నాడు.

కాని దీనికి సమాధానం సామాన్యమైంది. బ్రిటిషు తూర్పు ఆఫ్రికాలో ఆఫ్రికనుల పురోగతిపై వలసప్రభుత్వం సర్వప్రయత్నాలు చేస్తూవుంది. ఇక్కడ సెంట్రల్ ఫెడరేషన్‌లో విశేషప్రతిపత్తిగల 200,000 యూరపియనులు 60 లక్షల మంది ఆఫ్రికనుల ఆశలపై. ఆకాంక్షలపై పెద్ద దుప్పటివలె పరచుకొనివున్నారు. వీరి భగ్నకాంక్షలు ఎప్పుడు ప్రేలుతాయో!

* * *

కాంగో విషయంలో మరికొన్ని అభిప్రాయాలు చెప్పదలచుకున్నాను. బెల్జియనులు వారి దృష్టిననుసరించి ఈ ప్రాంతాన్ని ఒక పథకంప్రకారం అభివృద్ధి పరిచే ప్రయత్నంలో వున్నారు.

కాని వారి కార్యక్రమంలో ఒక లోపముంది. ఏమిటంటే, ఆఫ్రికనులను ఉన్నతవిద్య నభ్యసించనివ్వరు. చివరకు సాంకేతిక విద్యకూడా పనికిరాదంటారు. ఉన్నతవిద్య నభ్యసిస్తే తమ భవిష్యత్తును రూపొందించుకొనుటలో తమకు హెచ్చు బాధ్యత ఇవ్వబడవలెనని ఆఫ్రికనులు కోరుతారేమోనని బెల్జియనుల భయం.

బెల్జియనులు జాతీయశక్తులతో రాజీపడరేమో అన్నది ఆలోచించవలసిన అంశంకాదు. కాని పరిస్థితుల వత్తిడివల్ల రాజీపడటమే జరిగితే ఆఫ్రికనులు తమకు సంక్రమించే బాధ్యతలను సరిగా నిర్వర్తించజాలరు. ఎందుచేతనంటే వారికి తగు అనుభవంవుండదు. అది ప్రమాదకరపరిస్థితి. బాధ్యతలను వారు కోరేమాట నిజమే. వాటిని సాధించేమాటా నిజమే.

కాంగోకన్న బ్రిటిషు వలసలు రాజకీయంగా ప్రశాంతంగా వున్నట్లు కన్పిస్తాయి. కారణమేమంటే బ్రిటిషువారు ఒక్క దక్షిణ రొడీషియాలో మినహా తక్కిన చోట్ల ఆఫ్రికనులకు ప్రభుత్వనిర్వహణలో తగు అనుభవం లభింపజేస్తున్నారు. దీని ఫలితమేమిటంటే జాతీయశక్తులు ప్రభుత్వ బాధ్యతను స్వీకరించినప్పుడు ఆ పూర్వ వల్ల ఎట్టి ఇబ్బందులూ, ఒడుదుడుకులూ రావు. అంతా సవ్యంగా సాగిపోగలదు.

* * *

దక్షిణ రొడీషియాలో మేము కలుసుకున్న యూరోపియనుల ఆతిథ్య స్వభావమునూ, స్నేహశీలమునూ అతిశయోక్తిచేసి చెప్పలేము. మమ్మల్ని బాగా చూచారు. అయితే వారి విధానాలు, వైఖరులు చూచి మేము ఎంతో నొచ్చుకున్నామని చెప్పవలసి వస్తున్నందుకు బాధపడుతున్నాను. వారు అసలు జీవిత వాస్తవాలకే దూరంగా వున్నారు. ఉగండాలో జాతివిచక్షణ కొంత మెరుగు. ఉగండాతో పోలిస్తే తక్కినప్రాంతాలలో యూరపియనుల విధానాలు ఎట్టివో తెలిసివస్తాయి.

శాలిస్బరీలో మా గౌరవార్థం మూడు విందులు జరిగాయి. అన్నీ 'నల్లవైట్' విందులే! చివరి విందు గవర్నర్ జనరల్ ఇచ్చాడు. మేముగాక మరి 16 మంది హాజరయ్యారు. ఆ 16 మందిలో ఇద్దరికిమాత్రమే బిరుదములు లేవు. వారిద్దరూ మమ్మల్ని లోపలికి గొనిపోయిన సైనిక అంగరక్షకులు. తక్కినవారిలో ఇద్దరు "ప్రభువులు." అయిదుగురు 'సర్' బిరుదము గలవారు. వారు భార్యల సమేతంగా వచ్చారు. ఈ మూడువిందులలో దేనికైనా 'దేశవాళీ' మనిషి వచ్చాడంటే అక్కడి కొక శివంగి వచ్చినట్లు భావించారేమో!

కాని ఉగండాలో పరిస్థితి వేరు. మొదటిరాత్రి గవర్నరు భవనంలో విక్టోరియా సరస్సువద్ద విందు జరిగింది. ఆ విందుకు కంపాలానగర మేయరు (ఇతను భారతీయుడు), అనేక ఆఫ్రికన్ అధికార్లు, ఇద్దరు అమెరికన్ సాంఘిక శాస్త్రజ్ఞులు, వారి భార్యలు వచ్చారు. రెండవరాత్రి కంపాలాలో విందు జరిగింది. దానికి యూరప

పియనుల కన్న భారతీయులూ ఆఫ్రికనులే ఎక్కువమంది వచ్చారు. మరొక రాత్రి పూట ప్రభుత్వభవనంలో ఇరవై మందికి విందు ఏర్పాటుచేయబడింది. దానికి వచ్చిన అతిథులలో సగంమంది ఆఫ్రికనులు.

మా గౌరవార్థం విపరివిందును ఉగండాలోని భారతీయు లిచ్చారు. దీనికి ఆఫ్రికనులూ, యూరపియనులూ వచ్చారు. ఇక్కడ నల్లవాళ్లు లేవు. వుంటే "ఆఫ్రికనులకు అనవసరమైన ఖర్చు."

ఉగండాకూ తక్కినప్రాంతాలకూ గల రెండు తేడాకు కారణమేమిటి? ఉగండాలో యూరపియనులు తక్కువమంది వున్నారు. మొత్తం జనాభా 55 లక్షలు కాగా వారిలో యూరపియనులు 6,000 మంది మాత్రమే. వారుకూడా ఆర్థికంగా వేళ్లు పాతుకొనిలేరు. 1 శాతం భూమిలో సగం భూమిమాత్రమే వారి అధీనంలో వుంది. అక్కడి శాసనము ననుసరించి అంతకన్న ఎక్కువభూమిని వారు కొనడానికి వీలులేదు.

* * *

ఈనాడు ఆఫ్రికాలో 85 శాతం విద్యను గరిపేది క్రైస్తవ చర్చిలు. వారికి ప్రభుత్వం సబ్సిడీల రూపంలో ధనసహాయం చేస్తుంది. ముస్లిములకు తగువిధానం లేదు. అందుచేత ముస్లిములే నిరక్షరాస్యులై వెనుకబడివున్నారు.

ఆఫ్రికాలో ఒకవేళ క్రైస్తవము విఫలమయిందంటే వ్యవధిలేక, అవకాశాలు లేక విఫలంకాదు. క్రీస్తుబోధలు అక్కడ పనికిరాకా కాదు. ఒక చర్చికీ, మరొక చర్చికీ మధ్య పోటీ హెచ్చుకావడం వల్లా, చాలా మిషనరీలు క్రైస్తవమును మరీ సంకుచితంగా వర్తింపజేయ ప్రయత్నించడంవల్లా క్రైస్తవం విఫలం కావచ్చునేమో. ఎందుచేతనంటే కొత్తగా మతం పుచ్చుకునేవారికి మిషనరీల గొడవలు వింతగా, హాస్యాస్పదంగా వుంటాయి.

కొన్నిచోట్ల కొన్నివందలమైళ్లు కారుమీద పోతూవుంటే ఒక్క పాఠశాల కూడా కనపడదు. హఠాత్తుగా ఒకచోట పెద్ద కేతలిక్ స్కూలు వుంటుంది. దానికెదురుగా ఒక గుట్టపై దానికి ఇరుపోటీగా ప్రొటెస్టెంట్ స్కూలు వుంటుంది. ఇందుకు ఆఫ్రికనులను నిందించి ఏమిలాభం?

* * *

ఉగండాలో చాలామంది ఆఫ్రికనులకు పారిశ్రామికాభివృద్ధి అంటే భయం.

దగ్గరలో నైల్‌నదిపై కట్టే జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టుఅన్నా భయమే. తమ భయానికి కారణాలు ఇలా చెబుతారు : "యూరోపియన్ ఒక గనిని తనిపెట్టినా, లేదా ఒక ఫ్యాక్టరీ నెలకొల్పుతున్నా వాటిని నిర్వహించడానికి తెల్లజాతి ప్రవీణులను పట్టుకొస్తాడు. అప్పటికీ సంతృప్తిపడక ఫోర్మెనులను, సాంకేతికులను కూడా తెల్లవాళ్ళనే తీసుకొస్తారు. అలా తమ బలం దిట్టంచేసుకుంటారు. ఇక ఆతర్వాత ఏమి జరుగుతుందో మాకు తెలుసు. కీన్యా, దక్షిణాఫ్రికాలలో వలె మా పని దిగ్బంధన మవుతుంది.

కీన్యాలోవున్న యూరోపియనులు ధైర్యశాలురు. మర్యాద, మన్నన గలవారు. దీక్షతో పనిచేస్తారు. కాని అజ్ఞానులు. ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో వారికి తెలియదు. పాతకాలపు అధికారం పరిమితులు వారికి తెలియవు. సెంట్రల్ ఫెడరేషన్‌లో ఆ పరిమితులను గమనించాలి. భయం పుడుతుంది.

కీన్యాలో 55 లక్షలమంది ఆఫ్రికనులు 120000 మంది ఆసియావారు (వీరిలో ఎక్కువమంది భారతీయులే), 40000 మంది యూరోపియనులు వున్నారు. మంచి భూమి చాలావరకు యూరపియనుల అధీనంలో వుంది. వీటినే "తెల్లవారి మిట్టభూములు" అంటారు. ఆ భూమిలో కొంతమాత్రమే సాగుచేయబడుతుంది. తక్కింది వారు సాగుచేయరు, ఆఫ్రికనులకూ ఇవ్వరు. పాపం! ఆఫ్రికనులు నాసిరకం పొలాలు సాగుచేస్తూ వుంటారు. భూమి తక్కువ, మనుషు లెక్కువ!

ఆఫ్రికానాయకు డొకాయన నాతో ఇలా అన్నాడు : "మంచి యూరపియన్ రైతుకు అతని భూమిని అతడు సాగుచేసుకునే హక్కు వుంది. మేము కాదనము. అతనికి ఐదువేల ఎకరాలున్నా అతను సొంతంగా సాగుచేసుకొంటున్నంతవరకూ మేము అభ్యంతరపెట్టము. కాని తాను సాగుచేసినా చేయకపోయినా దాన్ని తన అధీనంక్రింద వుంచుకొనే హక్కు తనకున్నదనీ, ఆ హక్కు దైవదత్తమనీ, ఇతరులు ఆకలితో మాడుతున్నాసరే దానిని సాగుచేసి పంట పండించుకొనే హక్కు వారికి లేదనీ అంటే మాత్రం మేము అంగీకరించము."

ఆదివారంనాడు మేము నైరోబీకి ఈశాన్యంగా 95 మైళ్ళ దూరాన కీన్యా పర్వతపు వాలులలో వున్న నెయిరీకి మోటారుకారులో వెళ్ళాము. మొదటి 30 మైళ్ళ మేరా సారవంతమైన భూములున్నవి. ఇవి యూరపియనులవి. చాలావరకు సాగుచేయని భూములే. కాఫీ, సిసాల్ (తాళ్ళకు పనికివచ్చే నార) ముఖ్యపంటలు.

# 33

# ఐక్యరాజ్యసమితికి ఆఫ్రికా సవాలు

పరాధీనతనుంచి విముక్తమైన కాంగో వెంటనే 1960 వేసవిలో భగ్గుమనేసరికి ఆఫ్రికాలో సరికొత్త యుగసంధిగల పెద్దప్రమాదాలు కన్పించింది. అప్పుడు శ్రీ బౌల్స్ ఆఫ్రికా నేటి పరిస్థితిలో "ప్రవర్తన నియమావళి"ని సిద్ధంచేసుకుని ఐక్యరాజ్యసమితి చొరవతీసుకోవలెనని ప్రతిపాదించారు.

1960 ఆగస్టు 21 నాటి "న్యూయార్కు టైమ్సు మేగజైన్" పత్రికనుంచి.

ఇటీవల కాంగోలో "రాజకీయమైన ప్రేలుడు" సంభవించింది. భగ్గున మంటలు లేచాయి. దీనినిబట్టి ఆఫ్రికా సమస్యలు ఎంతవిస్తృతమైనవో, ఆ ఖండంతో కొత్త సంబంధాలను నెలకొల్పుకోవడంలో అమెరికా వైపునుంచి చొరవతీసుకో వలసిన అవసర మెంతగావుందో విశదమవుతుంది.

ఆఫ్రికాలో రాజకీయంగా, ఆర్థికంగా అస్వస్థత ఏర్పడింది. దాన్ని నివృత్తి చేయడానికి ఐక్యరాజ్యసమితి ముందంజవేస్తే సమస్య కొంత సడలుతుంది. ఆఫ్రికనులు కూడా సమితి అట్టి పాత్ర నిర్వహిస్తే ఆమోదించ సిద్ధంగా వున్నారు.

సమితి ఆఫ్రికాకు చేయవలసింది చాలావుంది. ఎంతోవుంది. సాంకేతికప్రజ్ఞ తను సమకూర్చడమేగాక రాజకీయమైన మార్పులు ఏ గొడవాలేకుండా ప్రశాంతంగా జరిగేటట్లూ, ఆర్థికప్రగతి సాధ్యమయేటట్లూ చూడాలి. ఈ విషయంలో



అమెరికా ఒక కొత్తవిధానం అనుసరించి నిర్మాణాత్మకంగా తన కృషిని ఆఫ్రికాలో ఆరంభించాలి.

ఇందుకై అనువైనకాలంలో జరిగే సమితి సర్వసభ్యసమావేశంలో ఆఫ్రికాలో వున్న ఆఫ్రికనేతర శక్తులన్నీ ప్రవర్తన నియమావళిని అనుసరించవలెనని ప్రతిపాదిస్తూ అమెరికా ఒక తీర్మానం ప్రవేశపెట్టాలి.

అగ్రరాజ్యాలు ఆఫ్రికాలో ఏమిచేయకుండా వుండటానికి అంగీకరిస్తాయో దానిని ఒక ప్రకటనరూపంలో వెలువరించినంతమాత్రంచేత సరిపోదు. ప్రవర్తన నియమావళి విపులంగా పేర్కొనబడాలి. ఐక్యరాజ్యసమితి సభ్యదేశాలన్నీ కొత్తగా స్వతంత్రమైన ఆఫ్రికాదేశాల స్వాతంత్ర్యానికి ఏమాత్రం ముప్పురానివ్వకుండా నిర్మాణాత్మకంగా ఆర్థిక రాజకీయచర్యలు గైకొనుటకు అంగీకరిస్తూ, ఆఫ్రికా దేశాలు ఒక క్రమబద్ధమైన రీతిని రాజకీయ ఆర్థికపురోగతిని సాధించే ప్రోత్సాహమిస్తామనీ, ప్రచ్ఛన్నయుద్ధపు గుంజాటనలనుండి వాటిని విముక్తంచేస్తామనీ బాస చెయ్యాలి.

ఇలాంటి వాగ్దానం చేయడం జరిగితే బాగా అభివృద్ధిచెందిన దేశాలు ఐక్యరాజ్యసమితి "తటస్థ" యంత్రాంగం ద్వారా ఆఫ్రికా అవసరాలను తీర్చవచ్చు. అటువంటప్పుడు విభిన్నరాజ్య కూటముల మధ్య పోటీ ఏర్పడగల ప్రమాదాన్ని నివారించవచ్చు. అసలు అలాంటి పోటీప్రమాదంవల్లనే మధ్యప్రాచ్యంలో ఆగ్నేయాసియాలో ప్రపంచం మరొక యుద్ధాన్ని ఎదుర్కొనేటంతవరకూ వచ్చి వెంట్రుకవాసిలో ఆ ఉపద్రవం తప్పిపోయింది.

ఆ వాగ్దానాలేమిటో పరిశీలిద్దాము.

1. ఆఫ్రికాలో ఆందోళన అలజడి రేపే ప్రచారాన్ని తాము సాగించమనీ, ప్రత్యక్షంగా లేక పరోక్షంగా విద్రోహచర్యలకు పూనుకోమనీ ప్రతిజ్ఞ గైకొనాలి. ఇందుకు భిన్నంగా ఏదైనా జరిగినట్లు ఆరోపణలువస్తే వాటిని పరిశీలించి సర్వసభ్య సమావేశానికి నివేదించేందుకు ఐక్యరాజ్యసమితికి అధికార మివ్వాలి.

2. అలాగే ఆఫ్రికాలో ఆయుధాల పోటీకి దోహదమివ్వమని ఒక ఒప్పందం జరగాలి. ప్రస్తుతం కొత్తగా స్వతంత్రమైన ఆఫ్రికాదేశాలకు ఆయుధాలంతగా అక్కరలేదు. వాటివి అలా వుండనివ్వడం మనకూ లాభమే, ఆఫ్రికనులకూ మేలే.

3. ఆఫ్రికాకుచేయబడే ఆర్థిక, సాంకేతిక, విద్యాసహాయాన్ని సమితిద్వారా

చేస్తామని అగ్రరాజ్యాలు ఒక ఒడంబడిక చేసుకోవాలి. ఇందుకు అవసరమైన యంత్రాంగం వుండనే వుంది. సాంకేతిక సహాయపాలక వ్యవస్థ, ప్రత్యేక నిధి, ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ అభివృద్ధి సంఘమువంటి ప్రత్యేక వ్యవస్థలు వున్నాయి కదా.

ఇప్పుడు చేయవలసిందల్లా ఉభయదేశాలమధ్య పరస్పర సహాయానికి బదులు అంతర్జాతీయ యంత్రాంగమును సాధ్యమైనంత హెచ్చుగా వాడకంలోకి తీసుకురావడమే. దేశాలు వేటికవి సహాయాలు ఇచ్చుపుచ్చుకొంటూ వుంటే ప్రచ్ఛన్న యుద్ధపు పోటీ తప్పనిసరిగా వస్తుంది.

4. ఆఫ్రికాకు అనుభవజ్ఞులైన సివిలు ఉద్యోగులు, సాంకేతికులు, ఇంజనీర్లు, ఉపాధ్యాయులు, ఇంకా అనేక వృత్తులవారు అవసరమవుతారు. వీనికి ప్రచ్ఛన్న యుద్ధం గొడవ పనికిరాదు. ఐక్యరాజ్యసమితి సివిలు సర్వీసు కొరదానిని ఏర్పాటు చేసి తద్వారా ఆఫ్రికాకు వీరిని లభింపజేయాలి.

కనీసం ఒకతరంవరకైనా ఆఫ్రికనులైన ప్రధాన నిర్ణేతలక్రింద ఆఫ్రికనేతర సివిల్ ఉద్యోగులు పనిచేయడం అవసరం. అలా చేస్తేనే ఆఫ్రికాదేశాలు ఆర్థికంగా, రాజకీయంగా వృద్ధిజెందుతాయి. కాని ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. ఆఫ్రికనేతరులను ఎక్కడనుంచి తీసుకోవాలి? వారు ఎవరికి విధేయులై మెలగాలి? ఆఫ్రికాకు వారు ప్రచ్ఛన్నయుద్ధం తీసుకొస్తారా? లేక అంతర్జాతీయ సహకారానికీ, అవగాహనకూ పాటుపడతారా?

5. ప్రస్తుతం కాంగోలో అంతర్జాతీయ పోలీసుదళమొకటి ఏర్పాటుచేయబడుతూ వుందికదా. అదేమాదిరిగా ఆఫ్రికాలోనూ, ఇతరచోట్లా వినియోగించడానికి శాశ్వతమైన సమితి పోలీసు దళమును ఏర్పరచాలి. ఇలాంటి పోలీసుదళం వల్లనే కాంగోలో ఆంతరంగిక భద్రత, జాతీయ ఐక్యత చేకూరగలవన్న ఆశ వుంది. ఇతర ప్రాంతాలలో కూడా ఇటువంటి బెడదలు రావచ్చు. యూరోపియనులు పాలించి ఉపసంహరించుకున్న ప్రాంతాలలోనేగాక, కొత్త ఆఫ్రికా దేశాలమధ్య స్పర్ధలు పెరిగినప్పుడు కూడా ఇలాంటి బెడదలు వచ్చి ఉద్రిక్తస్థితి ప్రబలవచ్చు.

వివిధదేశాల సరిహద్దులను చూపే పటముపై ప్రస్తుతం ఆఫ్రికన్ విధేయతలను చిత్రించే పటమును అచ్చువేస్తే గీతలు ఒకదానికొకటి పొంతనలేకుండా వుంటాయి. గీతలు ఒకదానిమీదుగా ఒకటి పోతాయి. ఈ పరిస్థితి ఇప్పటికే ఘర్ష

జకు దారితీసింది. అనేక సమావేశాలను తలపెట్టడం, ప్రకటనలు చేయడం, మళ్ళీ వాటిని రద్దుచేయడం జరిగింది.

ఈ వ్యవహారాల పర్యవసానం ఎలావుంటుందో నిర్ణయించడం ఐక్యరాజ్య సమితి చేయవలసిన పనికాదు. యథాస్థితిని నిలబెట్టడం, లేదా మార్పులు ప్రవేశ పెట్టడం-ఇవి సమితికి అక్కరలేదు. వీటిని నిర్ణయించుకోవలసినవారు ఆఫ్రికనులు.

అయితే అట్టిపరిస్థితులు విషమించి హింస ప్రజ్వరిల్లకుండా, ముఖ్యంగా అగ్రరాజ్యాలు ఏదో ఒక దేశానికి మద్దతు ఇచ్చి అనవసర జోక్యం కలుగజేసుకోకుండా చూడటం సమితి కర్తవ్యం. ఆఫ్రికాదేశాలలో భర్తీచేయబడ్డ పోలీసు దళమొకటి సమితి ఆధ్వర్యంక్రింద వుంటే బైటివారు ఏకపక్ష ధోరణిలో సైనికంగా జోక్యం కలుగజేసుకోకుండా నిరోధించవచ్చు.

II. ఆఫ్రికన్ నియమావళిలో ప్రత్యేక ఆఫ్రికన్ న్యాయస్థానం ఏర్పాటుచేసే అవకాశం కూడా వుండాలి. ఈ న్యాయస్థానం ప్రపంచ న్యాయస్థానానికి అనుబంధంగా వుండాలి. ఆఫ్రికాఖండంలోని దేశాలమధ్య వచ్చే తగాదాలనూ, ఆఫ్రికా దేశాలకూ ఇతర దేశాలకూ మధ్య వచ్చే వివాదాలనూ ఈ న్యాయస్థానం పరిష్కరించాలి.

ఇట్టి న్యాయస్థానంలో కేవలం ఆఫ్రికనులు మాత్రమే న్యాయమూర్తులై వుండనక్కరలేదు. ఇతరులనుకూడా నియమించి విశాలదృక్పథం కలిగించవచ్చు. ఇట్టి న్యాయస్థానం బైటివారి జోక్యాన్ని అడ్డగించగలదు. అయితే ఆఫ్రికాదేశాలు హెచ్చు షరతులు పెట్టకుండా ఈ న్యాయస్థానం ఇచ్చిన తీర్పులను అంగీకరించాలి.

ఒక కొత్త ఆఫ్రికా అవతరిస్తూ వుంది. అందులోనూ ఎంతో కళకళ లాడుతూ వుంది. ఇట్టి ఆఫ్రికా సమస్యలను ఐక్యరాజ్యసమితి విజయవంతంగా పరిష్కరించగలుగుతుందని నేను అనుకోను. అయితే ఆ సమస్యలకు పరిష్కార మార్గాలను వెదకడానికి సమితి సమర్థవంతమైన యంత్రాంగంగా ఉపకరించ గలుగుతుంది. పైగా ఇందులో ఒక మేలుకూడా వుంది. దీనివల్ల ఆఫ్రికాదేశాలను ప్రచ్ఛన్నయుద్ధపు వైరాలనుండి తప్పించవచ్చు.

అమెరికా ప్రభుత్వం ఆఫ్రికాపట్ల అసమగ్రమైన, నిష్ప్రయోజనమైన ప్రస్తుత విధానాన్ని విడనాడి, ధైర్యం చేసి ఒక కొత్తవిధానాన్ని అవలంబించి అంతర్జాతీయ సహకారానికి బాటవేస్తుందా?

వారి పిరికితనంవల్ల అమెరికన్లు ఈ అవకాశాన్ని పోగొట్టుకున్నారంటే ఒక విషయం మాత్రం తథ్యం. ఆఫ్రికా త్వరితంగా ప్రచ్ఛన్న యుద్ధరంగమవుతుంది. దానివల్ల కలిగే ఫలితాలూ, పర్యవసానాలూ మిక్కిలి ప్రమాదకరమైనవి.

# 35

# ఆఫ్రికాలో ఆశాజ్యోతి

ఆఫ్రికా దేశాల నిమిత్తం ఏర్పాటుచేయబడ్డ ఐక్యరాజ్యసమితి ఆర్థిక సంఘం సమావేశం 1962 ఫిబ్రవరిలో ఎథియోపియాలోని అడిస్ అబాబాలో జరిగింది. దానిలో పాల్గొన్నవారిలో ఆఫ్రికనులే అధిక సంఖ్యాకులు. అమెరికా అధ్యక్షునికి ఆఫ్రికా ఆసియా లాటిన్ అమెరికా వ్యవహారాల సలహాదారుగా, అధ్యక్షుని ప్రత్యేక ప్రతినిధిగా శ్రీ బౌల్స్ ఆసమావేశంలో ఆఫ్రికాపట్ల అమెరికాప్రభుత్వ కొత్త విధానాన్ని ఈవిధంగా వివరించారు:

"ఆఫ్రికాఖండం సువిశాలమైంది. ఇది ఇప్పుడే మేల్కొని చైతన్యం పొందుతూ వుంది. ఈ ఖండంలో 22 కోట్లమంది ప్రజలు తమ భవిష్యత్తు విషయం ఆలోచిస్తున్నారు. ఇట్టి ఖండం సమస్యలను చర్చించడానికి మనమిక్కడ సమావేశమైనాము.

"ఆఫ్రికాలో ఆశాజ్యోతి వెలుగనారంభించింది. మిక్కిలి ప్రకాశవంతంగా వెలుగబోతోంది. ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్ని వినియోగించి దారిద్ర్యం, బాధ్యలు, పీడనలను నిర్మూలించి వాటిస్థానే సిరిసంపదలు, ప్రగతి, న్యాయం వర్ధిల్లే ఆధునిక సమాజనిర్మాణానికై ఆఫ్రికాలో కన్పిస్తూవున్నంత ఉత్సాహం, సంకల్పం మరొక చోట కానరావు.

"ఇరవై ఎనిమిది స్వతంత్ర ఆఫ్రికాదేశాలు ఈరోజు ఇట్లా అడిస్ అబాబాలో సమావేశమై తమ ప్రజల ఆర్థిక సాంఘిక భవిష్యత్తును ఇట్లా చర్చిస్తాయని పదిహేనుసంవత్సరాలక్రితం అమెరికన్లెవరైనా ఊహించగలిగారా ?

"మరి అమెరికా ఆఫ్రికాతో ఎట్టిసంబంధం పెట్టుకోంటుంది? ఆఫ్రికా భవిష్యత్తుతో అమెరికా ప్రమేయమేమైనా వుందా? ఆఫ్రికాలో అమెరికా లక్ష్యాలేమిటి?

"మేము వినయంతో ఆఫ్రికాలో మా కృషిని ఆరంభిస్తాము. ఆఫ్రికా విషయంలో ఇన్నాళ్ళూ మేము అజ్ఞానంలో వున్నందుకూ, మీ ప్రజలతో మాకు సంబంధాలు లేనందుకూ మేము విచారిస్తున్నాము. ఇన్నేండ్లుగా మేము మిమ్మల్ని బాగా ఎరిగివుండకపోవడానికి కారణమేమిటంటే ఇంతవరకూ మా దృష్టి మా దేశాభివృద్ధిపై లగ్నమైవుంది.

"మా పూర్తి శక్తితో మా సమస్యలను పరిష్కరించుకోవడంలో మేము నిమగ్నులమై వున్నందువల్ల వలసవాద వ్యతిరేక విప్లవంలో మేము ఎట్టి హక్కుల కోసం పోరాడామో అట్టి హక్కులకోసమే పోరాడుతూవున్న ఇతర ప్రజల పోరాటాలను గూర్చి మేము తెలుసుకోలేకపోయాము. మీవలె మేమూ ఒకప్పుడు వలస పాలనను ఎదిరించిన వాళ్ళమే.

"మేము ఆఫ్రికాకు సవినయంగా వస్తున్నాము. ఇక్కడ వినయభావంతో మీ ముందు నిలబడుతున్నాము. మా దేశంలో కూడా జాతివిచక్షణ, తన్మూలమైన సంఘర్షణలు వున్నాయి. వీటివల్ల మా దేశం కొంత ఇబ్బందికి లోనయింది. మా దేశప్రజలలో నూటికి 10 వంతులమంది ప్రజల పూర్వీకులు మీ ఆఫ్రికాకు చెందిన వారే. నూరేళ్ళక్రితం మా దేశంలో జరిగిన గొప్ప అంతర్యుద్ధంలో బానిసత్వాన్ని నిర్మూలించడంకోసం 10 లక్షల మంది తెల్లవారు (అమెరికనులు) ప్రాణాలు గోల్పోయారు.

"అప్పటినుండి అమెరికాలోని తెల్ల, నల్లజాతులు పరస్పర గౌరవానికీ, సహకారానికీ క్రమేణా ప్రాతిపదికను నిర్మిస్తూ వచ్చాయి. ముఖ్యంగా గడచిన కొన్ని సంవత్సరాలలో అన్నిరంగాలలో జాతివిచక్షణను నిర్మూలించడానికి ఎంతో కృషిచేశాము. కొంత సాధించాము.

"మానవ సమానత్వమనే నైతిక వాస్తవికతను అంగీకరించనివారు మా దేశంలో ఇంకా కొందరున్నప్పటికీ జాతివిచక్షణ అంతంమాత్రం కనుచూపు మేరలో వుంది.

"అమెరికాలో ఒకింత యోచన చేయగల అన్నిజాతుల ప్రజలూ ఆఫ్రికాపట్ల శ్రద్ధాసక్తులు కనపరుస్తున్నారు. దీనినిబట్టి మా సాధారణ లక్ష్యం వ్యక్తమవుతూ

వుంది. ఆఫ్రికానుగూర్చి వెలువడుతూన్న పుస్తకాలు, చలనచిత్రాలు, పత్రికలు, వ్యాసాలు ఇందుకు నిదర్శనం.

"అంతర్జాతీయ రాజకీయాలలో మాకొక ప్రాథమిక లక్ష్యముంది. అదేమిటంటే—ఆఫ్రికాను ప్రచ్ఛన్నయుద్ధానికి దూరంగా వుంచడం. ఆ వైషమ్యాలు, విభేదాలు, వైరాలు, ఆర్థిక దుబారా మీకు తప్పడం మీకూ, మాకూ శ్రేయస్కరం. ఆ జంజాటంలో మీరు పడకూడదు.

"ఈ లక్ష్యాన్ని మేము సాధించాలంటే ఐక్యరాజ్యసమితి శక్తివంతమైన సంస్థ కావలెనని మేము భావిస్తున్నాము. అందుకోసమే కాంగోలో ఐక్యరాజ్య సమితికి అయ్యే ఖర్చులో నూటికి దాదాపు 50 వంతులను అమెరికా భరిస్తూ, సమితి కార్యక్రమాలను అన్నిచోట్లా గట్టిగా బలపరుస్తూ వుంది.

"ఇక ఆర్థికరంగంలో చూస్తే ఆఫ్రికా కొత్తదేశాలు చాలా వాటితో ఇచ్చి పుచ్చుకొనే సంబంధాలను పెంపొందించుకోవడానికి మేము ప్రయత్నిస్తున్నాము. మీసమాజానికి జవసత్వాల నివ్వగలది మాకూ శక్తిదాయకమేనని మేము ఎరుగుదుము.

"ఆర్థికాభివృద్ధి విషయంలో అనేక ఆఫ్రికన్ దేశాలు అనుసరిస్తూవున్న మార్గాన్ని చూస్తూవుంటే మాకు ఎంతో ఉత్సాహం కలుగుతూవుంది. ఈ దిగువ అంశాలు ముఖ్యమైనవి :

"మొదటిది—పారిశ్రామిక కార్యక్రమాల సత్వరావశ్యకతను మీరు గుర్తిస్తున్నప్పటికీ, వ్యవసాయం, గ్రామాభివృద్ధి ప్రాముఖ్యాన్ని మీరు విస్మరించడం లేదు. ఆసియా, లాటిన్ అమెరికాలలో వలెనే మీ ఖండంలో కూడా నాల్గింట మూడువంతులమంది ప్రజలు గ్రామాలలో నివసిస్తున్నారు. వారే ఆహారోత్పత్తి చేసేది. నగరంలో తయారయ్యే వస్తువులను కొనగలిగే తాహతు తెచ్చేది కూడా వారే.

"గ్రామాలలో సిరిసంపదలు, విద్య, న్యాయం వ్యాప్తిజెందకపోతే రాజకీయ, ఆర్థిక, సాంఘిక పునాదులను వేయడం దుస్సాధ్యమవుతుంది. ఆ పునాదులు లేకపోతే పురోగమనం శూన్యమే.

"రెండవది—మానవ ప్రతిపత్తికీ, మానవ సంబంధాలకూ మీరు ప్రాముఖ్యమివ్వడం మాకు హర్షదాయకమైన విషయం. ఆర్థికప్రగతి ముఖ్యమైనదే. కాని ఆ ప్రగతిని సాధించేటప్పుడు వ్యక్తులుగా మానవులకు గౌరవమివ్వకపోతే, వారి

శ్రేయస్సును గమనించనిపోతే రాజకీయ సుస్థిరత్వంపై ఆ ప్రగతి ప్రభావం ఏమీ వుండదు.

"మూడవది. మీరు విద్యకు ప్రాధాన్యమివ్వడం సంతోషకరం. మీ దేశాలలో ప్రాథమిక, ఉన్నత పాఠశాలల విద్య సరిగా వ్యాప్తిచెందుతూవుంది. ఉన్నత విద్యాసంస్థలను మీరు ఏర్పరచుకొంటున్నారు. దీనినిబట్టి ఆధునిక సమాజనిర్మాణంలో విద్యకు గల కీలకపాత్రను ఆఫ్రికా గుర్తించిందని విశదమవుతున్నది.

"నాల్గవది. మీరు ప్రభుత్వ రంగంతోపాటు ప్రైవేటు పెట్టుబడినికూడా వాంఛించడం మాకు సంతోషదాయకమైన విషయం. ప్రైవేటు పెట్టుబడి అభివృద్ధిచెందిన దేశాలనుండి లభిస్తుంది. మా సంపదలో హెచ్చుభాగం ప్రైవేటు పెట్టుబడి రూపంలోనే వుంది. మా ప్రజలు వారి ఆదాయాలనుండి మిగిల్చి కూడబెట్టిన సొమ్ము అది.

"అమెరికా ప్రభుత్వం ఆఫ్రికాకు తాను చేసే సహాయాన్ని క్రమేణా హెచ్చిస్తూవుంది. అది ద్విపక్షంగా, అనేకపక్షాలుగా ఇవ్వబడుతూ వుంది. 1962 లో ఆఫ్రికాకు అమెరికన్లు ఇచ్చిన అప్పులు, గ్రాంట్లు, సాంకేతికసహాయం, వ్యవసాయోత్పత్తుల అమ్మకాలు, వాటి గ్రాంట్లు, ఆఫ్రికాలో అమలుజరిగే సమితి కార్యక్రమాలకు మొత్తం 50 కోట్ల డాలర్లకు మించి వున్నవి.

"ప్రజలు ప్రజలకుచేసే సహాయం కూడా హెచ్చింపు అవుతున్నది. శాంతిదళం ద్వారా కొన్నివందలమంది అమెరికన్ సెకండరీ స్కూళ్ళ ఉపాధ్యాయులు మీ దేశాలలో విద్య గరుపుతున్నారు. ఇంకా కొన్నివందలమంది ఉపాధ్యాయులు రానున్నారు.

"మీ అనుభవంవల్ల వారెంత నేర్పుతారో అంత నేర్చుకుంటారు కూడా. ప్రస్తుతం మూడువేలమంది ఆఫ్రికన్ విద్యార్థులు అమెరికాలో చదువుతున్నారు. చదువుకుంటూ అమెరికన్లకు నేర్పుతున్నారు కూడా.

"ఆఫ్రికా ఒక మహా సమరంగమనీ, అచ్చట ఎన్నో కొత్త విశేషాలు జరుగుతున్నవనీ, కొత్త ఆశలు, అవకాశాలు అక్కడ ఏర్పడుతున్నాయనీ అమెరికా దేశంలో యువకులు భావిస్తున్నారు. ఈ సంగతి నాకు ఎలా తెలుసునని అడుగుతారేమో! నా కుమారుడు, కోడలు గడచిన సెప్టెంబరునుంచీ నైజీరియన్ ఉన్నతపాఠశాలలో ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. వారిప్పుడు నైజీరియన్ ప్రభుత్వోద్యోగులు. వారు

నాకు వ్రాసే ఉత్తరాల ద్వారా రేపు ఆఫ్రికానాయకులు కానున్న యువకుల మనో భావాలను తెలుసుకోగలిగాను.

"ఇక ఆఫ్రికా ఆర్థిక ఏకీకరణలో మీరు కనపరుస్తున్న ఇతోధిక ఆసక్తికి నేను సంతపిస్తున్నాను.

"ఐక్యతకు అనేకమార్గాలున్నవి. మీరు తగ్గ మార్గాన్ని మీరే ఎన్నుకోవాలి. అయితే ఒకటిమాత్రం నిజం. కొన్ని దేశాలు పారిశ్రామికంగా బాగా అభివృద్ధిచెంది 'మాతృదేశాలు'గా వ్యవహరిస్తూ వలసప్రాంతాలలో మార్కెట్లు సంపాదించుకొని అక్కడ తమ సరుకులను విక్రయించుకొనే యుగం శాశ్వతంగా అంతరించింది. ఈ విచ్ఛిన్నతవల్ల నవఆర్థిక యథార్థాలు తెలిసివచ్చాయి. ప్రాంతీయ ఆర్థికవర్గాలు, కూటములు ఏర్పడుతూ వుండటాన్నిబట్టి ఈ యథార్థాలు వెల్లడి అవుతున్నాయి.

"అయితే ఆఫ్రికా ప్రాంతీయ సహకారానికి, ఏకీకరణకూ అనేక పెద్ద ప్రతి బంధకాలున్నాయి. ఆఫ్రికాలో వున్నన్ని సర్వసత్తాక స్వతంత్ర ప్రదేశాలు మరి ఏ ఖండంలోనూ లేవు. ఇవన్నీ కొన్నేండ్లక్రిందట విదేశీయులు ఎక్కడో వున్న వారి వారి వలసరాజధానులలో ఒడంబడికలద్వారా కల్పించి ఏర్పాటుచేసినవి.

"ఇప్పు డీ ప్రదేశాలన్నీ స్వతంత్రదేశాలై నవి. కోట్లాది ప్రజలు వారివారి దేశాల భవిష్యత్తును రూపొందించుకొంటున్నారు. అయితే ఉనికి వస్తూవున్న స్వాతంత్ర్యప్రకర్షకూ, ప్రాంతీయ సహకారానికీ మధ్య సమాధానం కుదరాలి. ఆర్థికాభివృద్ధి వేగంగా జరగాలంటే ప్రాంతీయసహకారం అవసరం. ఒక పెద్ద వర్గ కూటమిలో సభ్యురాలై వున్న దేశం సత్వరంగా అభివృద్ధిచెందలేకపోయిందన్న మాట ఆఫ్రికాలో నేను ఎప్పుడూ వినలేదు.

"మీరొక బ్రహ్మాండమైన ప్రయత్నం చేస్తున్నారు. ప్రపంచంలో సంపన్నమై, ఎన్నో అవకాశాలు కలిగివున్న ఖండానికి పునర్జన్మ కలుగజేయడమే ఆ ప్రయత్నం. సత్ప్రారంభమే సగం జయం అన్నారు. మీ కృషి జయప్రదమగుగాక!"

# 36

## లాటిన్ అమెరికాలో భూమికోసం పెనగులాట

అమెరికా ఉపాధ్యక్షునిగా ఒకరు లాటిన్ అమెరికా పర్యటనకు పోగా అక్కడ ఇవ్వబడ్డ వ్యతిరేకపూరిత స్వాగతం ఆ ప్రాంతంలో అమెరికా విధానం విఫలమైనట్లు రుజువుచేసింది.

1961 నవంబరులో 'న్యూయార్క్ టైమ్సు మేగజైన్'లో శ్రీ స్జుల్క్ వ్రాసిన ఈ వ్యాసం లాటిన్ అమెరికాలో నాడూ, నేడూ ప్రజలలో అశాంతికిగల ముఖ్యాంశమైన ఆర్థిక సమస్యలను వెలుగులోకి తెచ్చింది.

లాటిన్ అమెరికా జాతీయనాయకులలో చాలామంది కమ్యూనిస్టు వ్యతిరేకులే. తమ తమ దేశాలలో దారిద్ర్యాన్నీ-పేదరికాన్నీ, అవిద్యనూ, ఋణగ్రస్త స్థితినీ, భయాన్నీ తొలగించడం వీరి లక్ష్యం. ఈ అరిష్టాలన్నీ అల్పసంఖ్యాకులైన కొద్దిమందిని తప్ప తక్కిన ప్రజాబాహుళ్యాన్ని తమదేశ అభివృద్ధికృషిలో పాల్గొనకుండా చేశాయి.

ఇందుకు వారి మొదటి ఆయుధం—భూసంస్కరణలు. అట్టి సంస్కరణల వల్ల రైతు కుటుంబాలకు స్వంత భూమి లభిస్తుంది. ఈ సంస్కరణల కార్యక్రమం తమకు బాటవేసేది కాబట్టి కమ్యూనిస్టులు తప్పకుండా ఇట్టి ఉద్యమంతో చేతులు కలుపుతారు.

భూసంస్కరణలు కమ్యూనిస్టులకు మొదటిమెట్టు వంటివి. అక్కడినుంచి

వారు సాముదాయిక క్షేత్రవిధానాన్ని అమలులోకి తెచ్చి రైతులను ప్రభుత్వానికి బానిసలుగా తయారుచేస్తారు. పాపం, కల్లా కపటం ఎరుగని సొంతభూములు లేని అమాయక రైతులు కమ్యూనిస్టుల నినాదాలు నమ్మి వాటివల్ల తమకేదో స్వేచ్ఛ వచ్చి పడుతుందని భావిస్తారు.

ఈ సందర్భంలో ముఖ్యసమస్య లేవి? వాటిని ప్రజాస్వామిక పద్ధతుల ద్వారా పరిష్కరించే అవకాశముందా?

ఈనాడు లాటిన్ అమెరికాలో సేద్యంక్రింద వున్న మొత్తం భూములో సగ భాగం 1½ శాతం ప్రజల అధీనంలో వుంది. వీరికి ఒక్కొక్కరికి పదిహేనువేల ఎకరాలకు పైగా భూమి వుంది. మంచి సారవంతమైన భూమి చాలా మేరకు వీరి చేతుల్లోనే వుంది. లాటిన్ అమెరికనులలో అధికసంఖ్యాకులు నిరుపేదలైన కౌలు దార్లు. వీరు భూస్వాములకు ఋణగ్రస్తులై వున్నారు.

అక్కడ ఈ భూమి అమరిక విధానం ఇప్పటిదికాదు. పూర్వమెప్పుడో స్పెయిన్‌వారు, పోర్చుగీసువారు ఈ లాటిన్ అమెరికాదేశాలను జయించి అక్కడ స్థిరపడిపోయ్యారు. వారు తమతోపాటు తమ మధ్యయుగాల ఫ్యూడల్ భూస్వామ్య విధానాన్ని ప్రవేశపెట్టారు. పందొమ్మిదవ శతాబ్ది తొలి దశలో వలస సంబంధాలు విచ్ఛిన్నమైనప్పుడు పెద్ద భూస్వాముల ప్రాబల్యాన్ని అంతరింపజేయకుండా అలాగే వుంచారు.

పాతబడిపోయిన ఈ గ్రామీణ వ్యవస్థవల్ల ప్రజలకు తిండి, బట్ట సరసమైన ధరలకు లభించివుంటే సాంఘిక ఆర్థిక అసమానత్వం, అన్యాయం ఇంత ప్రస్ఫుటంగా కనిపించేవి కావు. కాని హెచ్చుభూమిని కాఫీ, చక్కెరవంటి వాణిజ్యపు పంటలకు కేటాయించినందువల్లా, ఆ పంటలు కొద్దిమందికి మాత్రమే లాభకరం కావడంవల్లా, సేద్యపద్ధతులు తాతలకాలంనాటివి కావడంవల్లా చాలామంది లాటిన్ అమెరికన్‌లు తిండిలోపంవల్ల ఇబ్బంది పడుతున్నారు.

దీనికితోడు లాటిన్ అమెరికాలో జనాభా ఏటా 2½ శాతం చొప్పున పెరుగుతూ వుంది. ప్రపంచంలో ఈ పెరుగుదల అత్యధికము. ఇందువల్ల ఆహార సరఫరా సమస్య మరింత క్లిష్టమవుతూ వుంది.

కనుక ఈ ప్రాంతంలో శాంతి, సుస్థిరత్వం నిలవాలంటే భూమి అమరిక విధానంలో మార్పు అవసరమని అచ్చటి ప్రజాస్వామ్యవాదులు అంగీకరిస్తున్నారు.

కాని ప్రజాస్వామిక పద్ధతులద్వారా రైతులు శాంతియుతమైన మార్పులను తెచ్చుకోవడంలో తమ పాత్ర ఎట్టిదో భూస్వాములు గ్రహించలేకుండా వున్నారు.

ఒకటిరెండు తరాలక్రింద మెక్సికో విప్లవంలో జరిగిన అత్యాచారాలనూ, రష్యా చైనా విప్లవాలలో జరిగిన ఇంతకన్నా ఘోర దురాగతాలనూ భూస్వాములు అర్థంచేసుకున్నట్లే లేదు.

అయితే ఎస్టేట్లను స్వాధీనంచేసుకోవడం, లేదా వాటిని జాతీయంచేయడం అనేది ఎంత న్యాయబద్ధంగా జరిగినప్పటికీ అది ఒక్కటే సమస్యకు పరిష్కారమార్గం కాదని లాటిన్ అమెరికన్ భూసమస్యల ప్రవీణులు చెబుతున్నారు. ప్రతి దేశానికీ కొన్ని ప్రత్యేక సమస్యలుంటాయి.

ఏదైనా లాటిన్ అమెరికన్ భూయాజమాన్యవిధానంలో తీవ్రమైన మార్పులు మాత్రం అవసరం. కాని ఒక్క ప్రశ్న వుంది: ఈ మార్పులు ఎట్లా వస్తాయి? రక్తపాతంతో కూడిన విప్లవం ద్వారానా? లేక ఓర్పుతో కూడిన ప్రజాస్వామ్య ప్రణాళికా విధానం వల్లనా? గతానుభవం నేర్పిన గుణపాఠాలను పరిశీలిస్తాము.

మెక్సికోలో 1916 1934 సంవత్సరాల మధ్య 250 లక్షల ఎకరాల భూమిని భూస్వాములనుంచి స్వాధీనంచేసుకొని రైతులకు కేటాయించడం జరిగింది. ఫలితంగా తొలిదశలో 900,000 మంది వ్యక్తులు చిన్నచిన్న కమతాలు పొందగలిగారు. అధ్యక్షుడు కార్డెనాస్ 1934 లో పదవి నధిష్ఠించగా 5 కోట్ల ఎకరాల భూమిని భూస్వాములనుంచి తీసుకొని సొంత భూములులేని 80 లక్షల రైతులకు పంచడం జరిగింది.

మెక్సికో భూసంస్కరణల తొలిదశలో జరిగిన కొన్ని లోపాలు తరువాత తెలిసివచ్చాయి. కొత్తగా భూమిపొందిన ఇండియన్లు కష్టపడి పండించాలన్న అభిలాష వున్నప్పటికీ ఏం చేస్తారు? మంచి విత్తనాలు లేవు. సేద్యపు పనికి అవసరమైన పశువులు, పనిముట్లు లేవు. అతనికి పరపతి ఎక్కడ పుట్టుతుంది? ఇచ్చేవారెవరు? పథకాలు వేసుకోవడం అతనికి తెలియదు. పండించిన పంటను మార్కెట్లో లాభానికి అమ్ముకోవడం తెలియదు. ఫలితంగా వ్యవసాయోత్పత్తి తగ్గిపోయింది. ధాన్యం, చిక్కుళ్ళు వంటి సరకుల కొరత ఏర్పడింది.

అప్పటినుంచి మెక్సికో ప్రభుత్వం అమెరికా ప్రభుత్వసహాయంతో, అమెరికన్ ప్రైవేటు పెట్టుబడి సహాయంతో ఈ లోపాల నన్నిటినీ సవరించేందుకై

గ్రామవిస్తరణ పథకాన్ని అమలుజరుప నారంభించింది. ఆ పథకంవల్ల రైతులకు కొత్త పద్ధతులు అందుబాటులోకి వచ్చాయి. ఇప్పుడు వ్యవసాయోత్పత్తి క్రమేణా హెచ్చుతూ వుంది.

వెనిజులాలో అధ్యక్షుడు రోమ్యులో బెటాన్‌కోర్ట్ గత జులైలో కాంగ్రెసు సభవారికి ఒక బిల్లును సమర్పించాడు. ఆ బిల్లులో పాతబడిపోయిన ఆ దేశ వ్యవసాయభూమి సమస్యను పరిష్కరించేందుకు గట్టిచర్యలు తలపెట్టబడ్డవి. మెక్సికో అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని వెనిజులా కార్యక్రమంలో రైతుల కవసరమైన యంత్రసామగ్రి, పనిముట్లు, విత్తనాలు, రసాయనిక ఎరువులు లభింపచేసేందుకై ప్రభుత్వం ఉదారంగా అప్పులిచ్చే వీలు కల్పించబడింది. అంతేగాక కొత్త భూ ఖామందులకు ఎప్పుడు ఎట్లా పైరుపెట్టాలి అన్న విషయంలో తగు సలహా లిచ్చేందుకై వ్యవసాయ విస్తరణ సర్వీసు ఆరంభింపబడింది.

బెటాన్‌కోర్టు రెండవ ప్రయత్నం కూడా చేశాడు. 1948 లో వెనిజులా చరిత్రలో మొట్టమొదటిసారిగా జరిగిన స్వేచ్ఛాయుతమైన ఎన్నికలలో బెటాన్‌కోర్టు నాయకత్వం క్రిందగల ప్రజాస్వామ్యపక్షం గెలిచి అధికారానికి వచ్చింది. ఆ పక్షం వారు భూసంస్కరణల శాసనము నొకదానిని ప్రవేశపెట్టారు. ఆ శాసనము ననుసరించి భూస్వాములకు పరిహారమిచ్చి వారివద్దనుంచి భూమి తీసుకొని దానిని భూమి లేనివారికి పంచవచ్చు. కాని 36 రోజుల తర్వాత ఈ సంస్కరణలు ప్రవేశపెట్టిన ప్రభుత్వాన్ని సైనికనాయకులు పడగొట్టారు.

బొలీవియాలో విప్లవప్రభుత్వం అధికారంలోకి రాగానే మొట్టమొదటి చర్యగా 1952 లో భూసంస్కరణలను ప్రవేశపెట్టింది. బొలీవియా భూస్వాములు ధాన్యము, వెట్టిచాకిరీ చేయించుకోవడంలో పేరుపడ్డవారు. దాస్యవిధానాన్ని అమలులోకి తెచ్చి నౌకరులచేత సేవ చేయించుకొనేవారు.

విప్లవప్రభుత్వం ఒక్కొక్క రైతుకు 25 ఎకరాలు మొదలుకొని 2000 ఎకరాల వరకు భూమి నివ్వ సంకల్పించింది. అంటే సారవంతమైన భూమి అయితే తక్కువ, నాసిరకమైతే ఎక్కువ ఇవ్వాలనుకుంది. కాని బొలీవియాలో ఏ భూమి ఎటువంటిదో ఎప్పుడూ పరిశీలనే జరగలేదు. అసలు సేద్యభూము లేవో తెలిపే చిత్రపటాలే లేవు.

కాని ఓర్పులేని మరతుపాకీదారులైన రైతులు అధికారం కైవసం చేసుకున్నారు. ఈనాడు బొలీవియా భూసంస్కరణలు అరాజకస్థితిలో వున్నవి. అయితే

ఒకటిమాత్రం నిజం. బొలీవియా వ్యవసాయకూలీ భూస్వాములకు దాసుడుగా ఇక ఎన్నటికీ వుండడు. ఆ రోజులు పోయాయి.

తమ ప్రజల ఆందోళన మరీ తీవ్రరూపం దాల్చి విషమస్థితి ఏర్పడకముందే అతి జాగ్రత్తతో రూపొందింపబడ్డ భూమి పంపిణీ కార్యక్రమానికి తగు శాసనాన్ని ప్రవేశపెట్టవలెనని బాధ్యత నెరిగిన లాటిన్ అమెరికన్ నాయకులు ఎంతగానో అభిలషిస్తున్నప్పటికీ యథాస్థితి కొనసాగవలెనని పట్టుబట్టేవారి బలం హెచ్చుగా వుంది.

కాని చరిత్ర ఎంతకాలమని వేచివుంటుంది? మన శతాబ్దిలో ప్రజాస్వామిక ప్రభుత్వాలు నాలుగుసార్లు పెద్దపెట్టున భూసంస్కరణలను అమలు జరిపినవి. జెకోస్లోవేకియాలో 1920 లోనూ, విప్లవానంతర మెక్సికోలోనూ, భారతదేశంలో కొన్ని రాష్ట్రాలలోనూ, పోర్టొరికోలోనూ ఈ సంస్కరణలు అమలు జరిగాయి. 1900 లో అమెరికా కాంగ్రెసు సభవారు కార్పొరేషనులు 500 ఎకరాలలోపు భూమిని మాత్రమే కలిగివుండవచ్చునని, అంతకు మించకూడదనీ ఒక శాసనాన్ని ఆమోదించారు.

లాటిన్ అమెరికాలో ఇట్టి పరిస్థితి అమెరికా రాజనీతికి ఒక సవాలుగా వుంది. అమెరికా పౌరులు లాటిన్ అమెరికాలో పెట్టిన ప్రైవేటు పెట్టుబళ్ళు 9 వందల కోట్ల డాలర్ల దాకా వున్నవి. ప్రపంచంలో మరే ప్రాంతంలోనూ ఇంత పెద్ద పెట్టుబడి పెట్టడం జరగలేదు. పైగా ఈ పెట్టుబళ్ళ కన్నిటికీ న్యాయసంబంధమైన కట్టుదిట్టాలు లేవు. ఈ పెట్టుబడిలో కొంతభాగం మాత్రమే భూమిపై పెట్టబడింది. అయినా పెద్ద ఎస్టేట్లను విచ్ఛిన్నం చేయనెంచే ఏ శాసనాన్నయినా కొందరు అమెరికన్ పెట్టుబడిదార్లు వ్యతిరేకిస్తారు.

అందుచేత లాటిన్ అమెరికాలో అమలులోవున్న పాతతరహా భూమి అమరిక విధానాన్ని సంస్కరించడం అత్యవసరమే అయినప్పటికీ, అది ప్రజాస్వామ్య బద్ధమే అయినప్పటికీ, హేతుబద్ధమే అయినప్పటికీ ఏదిచేయబోయినా దాన్ని "కమ్యూనిస్టు యుక్తి" అని పెడర్థం చెబుతారు. కాంగ్రెసు సభపైనా, విదేశాంగ శాఖపైనా వత్తిడులు అధికమవుతాయి. అమెరికాలో వ్యక్తిగత భూయాజమాన్యం ఎప్పటినుంచో సంప్రదాయంగా వుంది. అటువంటి అమెరికాను కూడా ఈ వత్తిడులు భూస్వామ్యవిధానాన్ని ఆమోదించేట్టు చేయవచ్చు. కాని అభూస్వామ్య

విధానం ఒక ప్రాంతం అభివృద్ధిని అరికట్టుతూ వుంది. ఆ ప్రాంతంపైనే అమెరికా భద్రత ఆధారపడివుంది.

ఆధునికచరిత్రలో అన్నిటికన్నా తీవ్రమైన భూసంస్కరణలు జపానులో రెండవ ప్రపంచయుద్ధం ముగిసినవెంటనే జనరల్ డగ్లస్ మెకార్థర్‌చే ప్రవేశపెట్టబడ్డవి. పెరల్‌హార్బర్ ఉదంతానికి ముందు జపాను రైతులలో మూడింట రెండు వంతులమంది కౌలుదార్లే. కాని ఈనాడు జపాన్ రైతుకుటుంబాలలో నూటికి 92 వంతుల మందికి స్వంత భూమి వుంది. వీరు ఎకరాకు పండించే పంట అత్యధికంగా వుంటున్నది.

అమెరికా ప్రభావంవల్లనే చాంగ్‌కై షేక్ తైవాన్‌లో ప్రజాస్వామిక భూయాజమాన్య విధానాన్ని ప్రవేశపెట్టాడు. ఇదే విధానాన్ని చైనా ప్రధాన భూభాగంలో పదిసంవత్సరాల ముందు అతడు ప్రవేశపెట్టివుంటే రైతులు అతన్నే బలపరచివుండేవారు.

చాంగ్‌కై షేక్ ప్రవేశపెట్టిన కార్యక్రమము ననుసరించి ఏ రైతుకూ పది ఎకరాలకు మించి భూమి వుండటానికి వీల్లేదు. పైగా స్వంతంగా సేద్యం చేయని రైతుకు భూమి వుండకూడదు. ఇటువంటి సంస్కరణలవల్లనే తైవాన్‌లో వరి పంట ఎకరా దిగుబడి అసాధారణంగా పెరిగిందని తైపేలోని ప్రభుత్వ అధికార్లు చెబుతారు,

అయితే ఈ సంస్కరణలను కొందరు గట్టిగా వ్యతిరేకించారు. చివరకు ఒక డిక్రీ ద్వారా ఇవి అమలులోకి తేబడ్డవి. ముఖ్యంగా జనరల్ మెకార్థర్ సైనిక ప్రభుత్వం జపాను భూస్వాముల మెడలువంచి సంస్కరణలను ప్రవేశపెట్టింది.

లాటిన్ అమెరికా ప్రభుత్వాలు తమ ప్రాంతంలో శాంతియుతంగా విప్లవాత్మక మార్పులను తేవడానికి పెనగులాడుతున్నవి. అమెరికా రాజనీతిజ్ఞులు యుక్తితో, అవకాశాన్నిబట్టి తగురీతిగా మెలగి, ఇతరులకు నచ్చచెప్పి లాటిన్ అమెరికాదేశాలకు సహాయపడగలరా?

అమెరికా ప్రభుత్వం ఇతరదేశాలలో ఏమిజరగాలో నిర్దేశించకూడదని మాట నిజమే. కాని తన పలుకుబడితో కొన్ని నిర్మాణాత్మకపనులు చేయించవచ్చు. ఉదాహరణకు—

హెచ్చుమంది భూమికి యజమానులై వుండే అమెరికన్ సంప్రదాయాన్ని

పునరుద్ఘాటించి ఇతరులకు మద్దతు ఇవ్వవచ్చు. లాటిన్ అమెరికాదేశాల ప్రభుత్వాలు భూస్వాములకు న్యాయమైన నష్టపరిహారం చెల్లించి, కొత్తగా భూమిని పొందే రైతులకు పెద్ద భారం లేకుండానే సాగుభూమిని లభింపజేయవచ్చు.

మానవులు ఎల్లప్పుడూ చట్టాలకు కట్టుబడివుండకపోవచ్చు. అన్యాయాలు జరుగుతూనే వుంటాయి. దీర్ఘకాలిక సుస్థిరత్వంకోసం చెల్లించే స్వల్పకాలిక ధర అధికమైనదిగానే కన్పిస్తుంది. అయినా అమెరికన్లు సరిపెట్టుకుని ముందుకుపోవాలి.

అన్నిటికన్న ఒక ముఖ్యాంశాన్ని అమెరికన్లు విస్మరించకూడదు. ఆసియా ఆఫ్రికాలలో వలెనే లాటిన్ అమెరికాలోకూడా పౌరస్వత్వం కావాలా, లేక దాస్యం కావాలా, అరాజకంగా వుండాలా లేక నిరాశానిస్పృహలు వ్యాప్తిచెందాలా, క్రమబద్ధమైన రాజకీయ అభివృద్ధికావాలా లేక రక్తపాతంతో కూడిన తిరుగుబాట్లు జరగనివ్వాలా—ఈ రెండిటిమధ్య ఏదికావాలో తేల్చుకోవలసివుంది. దీన్ని అమెరికన్లు అర్థంచేసుకోలేకపోయినా, లేదా నాయకత్వంకోసం ప్రయత్నించే నూత్నశక్తులకు సహాయపడలేకపోయినా విపత్కరస్థితి తప్పదు.

## 37

# ప్రగతికోసం మైత్రి అంటే ?

విదేశాంగశాఖ సహాయమంత్రిగా వున్న శ్రీ బౌల్స్ 1961 అక్టోబరులో మెక్సికోసిటీలోని మెక్సికన్-నార్త్ అమెరికన్ వైజ్ఞానిక సంస్థలో ప్రసంగిస్తూ అమెరికా, లాటిన్ అమెరికా ప్రజలకు ఎప్పుడో ఏర్పడవలసిన ఈ కార్యక్రమం చారిత్రక ప్రాముఖ్యాన్ని వివరిస్తూ ధైర్యంచేసి అంతరంగిక సంస్కరణలు ప్రవేశపెట్టవలసిన అగత్యాన్ని నొక్కి చెప్పారు.

లాటిన్ అమెరికా అంతటా పేదరికాన్నీ, అన్యాయాన్నీ నిర్మూలించి వారి ఇరవై ఒక్క దేశాల ప్రజలూ ప్రభుత్వాలూ శాంతియుత ప్రజాస్వామిక పద్ధతులద్వారా తమ తమ స్వేచ్ఛాయుత వ్యవస్థలను బలపరచుకోవడానికై ప్రగతికోసం మైత్రి అనే భావం ఏర్పడింది.

ఇది కొత్తకలయిక-కొత్త భాగస్వామ్యం. దీని బాగోగులను పరిశీలించే ముందు కొన్ని యథార్థాలను గమనించాలి.

ఒక దేశానికి ఎంతగా సాధనసంపత్తి, సద్భావం వున్నప్పటికీ అది ఇతర దేశాలకు చేయగల సహాయానికి ఒక పరిమితి వుంటుందని అనుభవంవల్ల అమెరికన్లు గ్రహించారు. ఒకదేశ ప్రజలు మరొక దేశప్రజలకు సిరిసంపదలనూ, స్వాతంత్ర్యాన్నీ ఇవ్వలేరు. వాటిని ఆయా ప్రజలు చొరవతీసుకొని కష్టించి పనిచేసి అనేక త్యాగాలుచేసి సాధించుకోవాలి.

లాటిన్ అమెరికాలో అన్నీవున్న అల్పసంఖ్యాకప్రజలు సొంత లాభం

కొంత మానుకొని స్వేచ్ఛాసమాజాల ఏర్పాటుకు పాటుపడాలి. అప్పుడే శాంతియుత మార్గాలద్వారా రాజకీయ సాంఘిక ఆర్థికప్రగతికి అవకాశమేర్పడుతుంది.

చాలా లాటిన్ అమెరికా దేశాలలో స్వాతంత్ర్యయోధులు వలసపాలన సంకెళ్ళను త్రెంచివేయగానే పిస్తలసకోరుడి అంతరించింది. ఆనాటినుంచీ ఎందరో ప్రజాస్వామికనాయకులు ధైర్యంతో, దీక్షతో కృషిచేసినప్పటికీ, ఒక సమాజానికి గాఢత్వము,గౌరవము ఇవ్వగల ఆర్థిక సాంఘికసంస్కరణలను అణచివేయడమో, లేక పేరుత్రోవ పట్టించడమో జరిగింది.

మరి అత్యవసరంగా కావలసిన ఆర్థిక సాంఘికమార్పులు రానికారణంచేత ఒకవైపు సంపద, దానిప్రక్కనే మరొకవైపు దారిద్ర్యం వుంటాయి.

ప్రగతికోసం మైత్రి అనే భావం దేశాలమధ్య భాగస్వామ్యానికి ప్రాతిపదిక ఏర్పరుస్తుంది. ఇది మొత్తం పశ్చిమార్ధగోళపు ఆర్థిక సాంఘికసమస్యల పరిష్కారానికి కొత్త ప్రజాస్వామ్య వైఖరిని ఆపాదిస్తుంది. అట్టి భాగస్వామ్యాన్ని పెంపొందించడమెలా? ఒక్కొక్క భాగస్వామి నిర్వహించవలసిన పాత్రను నిర్వచించి అర్థంచేసుకోవడమెట్లా?

1960 సెప్టెంబరులో బొగోటాచట్టం ఆర్థిక సాంఘిక అభివృద్ధి అనేది రెండువైపులా పోవడానికి వీలైనవిధిగా వుంటేనే సాధ్యమవుతుందని నొక్కి చెప్పింది.

"ఆర్థిక సాంఘికప్రగతికై ఉద్దేశింపబడ్డ సహకార కార్యక్రమం విజయవంతం కావాలంటే అమెరికన్ రిపబ్లికులు అత్యధికంగా స్వయం సహాయకృషికి పూనుకోవలెనని, ప్రస్తుతసంస్థలు, పద్ధతులు మెరుగుకావలెనని, ముఖ్యంగా పన్నులవిధింపు, భూమిపై యాజమాన్యం, భూమివినియోగం, విద్య, శిక్షణ, ఆరోగ్యం, గృహావసతివంటివి బాగుపడవలెను" అని బొగోటాచట్టం విశదీకరించింది.

1961 ఆగస్టులో పున్టాడెల్ఎస్టె అనుచోట అమెరికా ప్రజల ప్రకటన పత్రం మరింత బాగా వివరించింది. న్యాయబద్ధంకాని భూమి అమరకవిధానాలనూ, భూమి వినియోగాన్నీ అది ఖండించింది. ఒక్కొక్క దేశస్వభావాన్నిబట్టి భూసంస్కరణల కార్యక్రమం అమలులోనికి రావాలని, స్వయంగా సేద్యంచేసే

వ్యక్తికే భూమి శ్రేయస్సు ఒనగూర్చేదిగా వుండి, అతని స్వాతంత్ర్యానికీ ప్రతిపత్తికీ హామీగా వుండవలెననీ నిర్దేశించింది.

కలవారివద్దనుంచి ఎక్కువ పన్నులు పుచ్చుకొని, పన్నులు ఎగవేసేవారిని కఠినంగా శిక్షించి, అక్కరవున్నవారికి మేలుచేసే విధంగా జాతీయ ఆదాయాన్ని పునఃపంపిణీచేసి తోడ్తోడనే ప్రజలు డబ్బుమిగిల్చి పలుమార్లు పెట్టుబడిపెట్టే అవకాశం కలిగించవలెనని ఆ ప్రకటనపత్రం ఉద్బోధించింది.

ఇట్టి గొప్ప ఆర్థిక సాంఘిక సాంస్కృతిక మార్పులు ప్రతిదేశం స్వయం సహాయకృషికి పూనుకొంటేనే వస్తాయని ప్రకటనపత్రం చెప్పింది.

ఈ సూత్రాలనన్నిటినీ చేర్చి అమెరికన్ కాంగ్రెసు సభవారు సెప్టెంబరులో ఆర్థికసహాయశాసనాన్ని ఆమోదించారు. ఆ శాసనంలో మంజూరుచేయబడ్డ నిధులను కేటాయించడంలో అధ్యక్షుడు కెనెడీ బాధ్యతనుకూడా పేర్కొన్నారు.

అభివృద్ధి చెందేదేశాలకు అప్పులు, గ్రాంట్లు ఇచ్చే సందర్భంలో వాటిని తీసుకొనేదేశం తన ప్రజల ఆర్థికరాజకీయ సాంఘిక అభిమానాలను ఎంతవరకు పాటించసిద్ధపడుతుంది, స్వయంసహాయకృషికి పూనుకొనేసంకల్పాన్ని ఎంత మేరకు కనపరుస్తుంది అన్న అంశాలను అధ్యక్షుడు గమనించవలెనని క్రొత్త శాసనం ఆదేశించింది.

ఈ శాసనంలో దుబారా, అవినీతి మున్నగువాటిని అరికట్టడానికి కూడా సమగ్రమైన పథకాలు వేయవలెనని చెప్పబడింది. సేద్యంచేసేవారికి సదవకాశాలు, న్యాయం కలుగజేయడానికై గ్రామాలను సంఘటితపరచవలెనని ఉద్బోధించబడింది.

నూత్న ఆర్థికసహాయ కార్యక్రమము ననుసరించి లాటిన్ అమెరికా దేశాలకు బొగోటాచట్టంలోని సూత్రాలప్రకారమే సహాయం చేయాలి.

ఇవి అమెరికన్ల విస్పష్టలక్ష్యాలు. మరి కార్యక్రమం మాటేమిటి? పద్ధతులు, ప్రమాణాలు, నిర్దిష్టకార్యక్రమాలు ఇంకనూ నిర్ణయించవలసిన స్థితిలోనే వున్నప్పటికీ కొన్ని సాధారణాంశాలను అమెరికా పరిశీలించవచ్చు.

లాటిన్ అమెరికా ప్రజలలో నూటికి 70 మంది గ్రామాలలో నివసిస్తున్నారు. కనుక అసలు అమెరికన్లెదుర్కోవలసిన సవాలు అక్కడ.

ఈ సమస్యను ఆలోచించేటప్పుడు అమెరికన్లు 'భూ సంస్కరణలు కావాలి' అన్న నినాదంతోనే సరిపెట్టుకోక, కొంచెం ఆవలకూడా పారజూడాలి. గ్రామాలు చైతన్యంతో వర్ధిల్లాలంటే వ్యక్తులు భూమికి యజమానులు కావాలి. లేదా సహకారపద్ధతిలో భూమిపై యాజమాన్యం ఏర్పడాలి. కాని ఇంతమాత్రంతో సరిపోదు.

గ్రామీణకుటుంబాలకు గౌరవం, సదవకాశాలూ కలగాలంటే ప్రభుత్వవిస్తరణ సర్వీసుద్వారా ఆధునిక వ్యవసాయపద్ధతులను వ్యాప్తిలోకి తేవాలి. ప్రకృతి సంపదను ప్రయోజనకరంగా వినియోగించుకోవాలి. ఈ విస్తరణ సర్వీసులో ఆరోగ్యకేంద్రాలు, స్కూళ్ళు, రోడ్లు కూడా చేర్చబడాలి.

తక్కువవడ్డీలకు అప్పులు లభింపజేయాలి. సహకారసంస్థలను ఏర్పాటు చేయాలి. అప్పుడు గ్రామంయావత్తూ కలిసికట్టుగా పనిచేసి తన ఉద్ధరణకు తానే పాటుపడుతుంది. వీలైనచోట్ల నదులకు ఆనకట్టలు, అడ్డుకట్టలుకట్టి, గొట్టపుబావులు పెట్టి సాగు నీరు లభింపజేయాలి.

ఈ కొత్త సౌకర్యాల ఏర్పాటుకై గ్రామంలో దృఢకాయులైనవారంతా శ్రమదానంచేసేట్టు ప్రోత్సహించాలి. విస్తరణ సేవకుడు గ్రామీణులకు కాయకష్టంవిలువా, అందులోవుండే గౌరవాన్ని తెలియజెప్పి వారిని అభివృద్ధికృషిలో భాగస్వాములుగా చేయాలి.

గ్రామస్థులతో కలిసి పనిచేసిన అనుభవంవల్ల ఒక గుణపాఠం కలిగింది: గ్రామాభివృద్ధి కార్యక్రమాలను జాగ్రత్తగా మేళవిస్తే ప్రజల శక్తిస్తోమతలు పూర్తిగా బయలుపడి లక్ష్యసిద్ధి కలుగుతుంది.

ఆర్థికాభివృద్ధినికోరే ఏదేశమైనా తన పిల్లలకు తాను విద్యగరపుకోలేనని అనజాలదు. అలాగే ప్రజారోగ్యం విషయంకూడా శ్రద్ధవహించవలసివుంటుంది.

బొగోటాచట్టంలోనూ, పుంటాడెల్ఎస్టేలో ఇటీవల జరిగిన మహాసభలోనూ క్రమానుగతమైన ఆదాయపుపన్ను విషయమై నొక్కి వక్కాణించబడింది. ఉపయోగంలేకుండా వున్న లాభాలను వాడకంలోకి తేవడానికి అటువంటి పన్నుల విధానాలు అవసరం. మూలలపడి మూలుగుతూవుండే డబ్బును ఉత్పాదనకు వీలైన కొత్త వ్యాపారాలకు పెట్టుబడి పెట్టేందుకు తగు ప్రేరణ కలిగించాలి.

ఇతరుల వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవాలన్న కోర్కె అమెరికన్లకు లేదు. అయితే ధనికులకూ, పేదలకూ మధ్య పెద్ద తేడాలున్నట్లయితే ప్రజలలో వైషమ్యాలు పెరుగుతాయి. అలజడి రేగుతుంది. లేనివారు నిరాశానిస్పృహాలతో క్రుంగుతారు.

దేశంలోపలి పెట్టుబళ్ళను వృద్ధిచేయాలంటే, అభివృద్ధి బాగా సాగాలంటే అభివృద్ధిచెందే దేశపు కరెన్సీకీ, ఆ దేశం ఏ దేశాలతో వాణిజ్యంచేస్తుందో ఆ దేశాల కరెన్సీకీ హేతుబద్ధమైన సంబంధం వుండాలి.

దేశీయమైన పెట్టుబడి అస్థిరంగా వుంది కాబట్టి అందుకు బదులుగా అమెరికా ప్రభుత్వాన్నిగాని, లేక పెట్టుబడిపెట్టే ఇతరులనుగాని అప్పులు,లేగా గ్రాంట్లు ఇవ్వం డని ప్రాధేయపడవలసిన అవసరమేముంది ? తగు ఆంక్షలు విధిస్తే దేశీయ పెట్టు బడి లభించక ఎక్కడికి పోతుంది ? యుద్ధానంతరం బ్రిటిషువారు అట్టి ఆంక్షలు విధించేకదా వారి ఆర్థికవ్యవస్థను తిరిగి దృఢపరచుకున్నారు ?

సంపన్నులైన తమ ప్రజలపై పన్నులు విధించుకోలేని, పన్నులు తప్పించు కొనే వారిని చూస్తూ ఉపేక్షించే దేశాలకు సహాయపడటానికై అమెరికా ప్రజలపై లేనిపోని పన్నులు రుద్దడం దేనికి ? అమెరికాలో అర్థశతాబ్దినుంచి అమెరికన్లు ఆదాయపు పన్నులు చెల్లిస్తున్నారు.

బోగోటా చట్టము ననుసరించి స్వయంసహాయానికై తగు చర్యలు తీసు కొనే దేశాలకు సహాయపడటానికిగాను అమెరికా ఏమిచేయడానికి సిద్ధంగా వుంది ?

ప్రతిదేశానికీ ప్రత్యేక అవసరాలు, అవకాశాలు వుంటాయి. అభివృద్ధి కార్య క్రమాలకు అవసరమైన అప్పులు, గ్రాంట్లరూగాను అనేక సంస్థలనుంచి తగు మొత్తాలు లభిస్తాయి. పథకరచనకూ, పనుల నిర్వహణకూ సాంకేతిక నిపుణులు లభిస్తారు. గోధుమలు, మొక్కజొన్నలు, పాలపొడి, కొవ్వుపదార్థాలు లభిస్తాయి. అమెరికా విశ్వవిద్యాలయాలనుంచి ఎంపికచేయబడ్డ స్వచ్ఛంద సేవకులు చదువు చెప్పడానికీ, ఇతర కార్యక్రమాల పరిశీలనకూ లభ్యమవుతారు.

ఇప్పుడు కొన్ని పరిశీలనలు జరుగుతున్నాయి. వాటివల్ల తగు ఒడంబడికలు జరిగి లాటిన్ అమెరికాదేశాలకు అత్యవసరమైన వ్యవసాయోత్పత్తులకు సరసమైన ధరలు లభించగలవు.

అమెరికన్లముందున్న సమస్య ఇది : బొగోటా చట్టంక్రింద అమెరికన్లు ఉమ్మడిగా ప్రతినబూనింది శాంతియుతమైన ప్రజాస్వామిక విప్లవాన్ని కొనసాగిస్తామని. ఈ విప్లవం లాటిన్ అమెరికాలోని ప్రతిగ్రామానికీ చేరాలి. అక్కడి పాతపద్ధతులస్థానే తీవ్రమైన మార్పులు రావాలి.

ఈ ప్రకటన అర్థమేమిటో, దీనివల్ల జరిగేదేమిటో అమెరికన్లు ఎంత బాగా అంచనా వేశారు ? ముందున్న పెద్ద కష్టాలను ఎంత స్పష్టంగా పసికట్టారు ?

ఈ కష్టాలకు మూలకారణాలున్నాయి. పేదరికంలోవున్న రైతులూ, మురికిపేటలలో నివసించేవారూ పూర్తిగా నిరాశోపహతులై వున్నారు. వారిని పైకి లేవనెత్తాలి. ముఖ్యులైన రాజకీయనాయకులు నిర్మాణాత్మక శాంతియుతమార్పులు రావడం అసాధ్యమని భావిస్తున్నారు. అర్థబలంగల మోతుబరి ఆసాములు నేటి విప్లవాత్మకప్రపంచంలో యథార్థాన్ని గ్రహించ నిరాకరిస్తున్నారు.

ఈ ప్రతిబంధకాలను తక్కువ అంచనా కట్టడం తెలివితక్కువే అవుతుంది. అయితే అమెరికాలక్ష్యాలకు తగ్గ కార్యక్రమాలను పలుకుబడిగల నాయకులూ, ఇతర వర్గాలవారూ సమర్థిస్తున్నారు. ఇది అమెరికన్లకు గుండెబలము నిస్తుంది.

గుండెదిటవుగలవారికీ, ప్రగాఢవిశ్వాసంగలవారికీ ఈయుగం నాయకత్వం అవకాశాలను కలుగజేస్తుంది. ప్రజాస్వామ్యబద్ధమైన అభివృద్ధికై ఒక మహా అంతర్జాతీయ కృషిలో పాల్గొనజేస్తుంది. అసలు ఈ సవాలు యువతీయువకులకు. ఈ మహోద్యమం జయప్రదమైందా, దీని ప్రయోజనం యువతీయువకులకే. విఫలమైందా, యువజనమే భంగపడతారు.

పిరికివారూ, పట్టినే సిద్ధాంతాలు వల్లించేవారూ దీనికి పనికిరారు. కొందరు వెర్రిబాగులవాళ్ళు ఈ ప్రపంచాన్ని ఒక్కరోజులో బాగుపరచవచ్చుననుకుంటారు. మరికొందరు సిద్ధాంతాలనే పిశాచాలకు హడలిపోయి కూలబడిపోతారు. అమెరికన్లు ఈ రెంటికీ మధ్య ఆచరణసాధ్యమైన విధానాన్ని అవలంబించాలి.

కనుక ఇక కాలాన్ని వ్యర్థపుచ్చకూడదు. సమయం తక్కువ. "పుంటా డెల్ ఎస్టేలో ప్రజల ఆశలు చిగిర్చే పీలు కల్పించబడింది. ఒకపని చేద్దామని అంగీకారానికి వచ్చినతర్వాత జాప్యం, అసమర్థతలవల్ల నిస్పృహ ఆవరిస్తుంది" అని అధ్యక్షుడు లొపేజ్‌మాటియోస్ అన్నారు. అమెరికన్లనెదుర్కొనే సవాలును ఆయన చాలా బాగా చెప్పారు. అందులో అతిశయోక్తిలేదు.

విభాగము-4

# కమ్యూనిస్టు సవాలు

ప్రపంచ భవిష్యత్తును రూపొందిస్తూవున్న విప్లవాత్మక శక్తులను అమెరికా రాజనీతి గమనించాలి. అమెరికన్లు స్థిరసంకల్పంతో వుండాలి. సుదూరాన వున్న కమ్యూనిస్టు లోకంలోని అంతరంగిక వైరుధ్యాలను ఎప్పటికప్పుడు గమనిస్తూ వాటిని అవకాశంగా తీసుకొని అమెరికా రాజనీతి ముందుకుపోవాలి. కమ్యూనిస్టుదేశాల చర్యలకు మంత్రముగ్ధులై అమెరికన్లు కర్తవ్యతా విమూఢులు కాకూడదు. సర్వప్రజల స్వాతంత్ర్య కాంక్షను ఆచరణ సాధ్యమైనంతవరకూ అమెరికన్లు బలపరచాలి. అన్నిటికన్న ముఖ్యం— అమెరికన్ల పూర్వీకులు వారి స్వాతంత్ర్య ప్రకటనపత్రంలో వివరించిన 'మానవాళి అభిప్రాయాలకు మన్నన' అనే వైఖరిని అమెరికా రాజనీతి అనుసరిస్తూ పోవాలి.

ఫిబ్రవరి 28, 1954.

# 38

# మార్క్స్ తిరిగి రాగలిగితే...

*1952 లో భారతదేశంలో మార్క్సిజం ఒక ఆర్థికసిద్ధాంతంగా చాలామందిచే ఆమోదింపబడుతూవుండేది. కమ్యూనిస్టులు కానట్టి విశ్వవిద్యాలయ విద్యార్థులుకూడా దీన్ని అలా ఆమోదించారు. ఆ సంవత్సరమే అక్టోబరునెలలో కొత్త ఢిల్లీలో భారత రాజకీయ శాస్త్ర విద్యార్థుల సమావేశంలో శ్రీ బౌల్స్ ప్రసంగిస్తూ మార్క్స్ అభిప్రాయాలలో వున్న ప్రాథమిక దోషాలను వివరించి భారత ఆర్థిక రాజకీయ వ్యవహారాలలో మార్క్స్ భావాలు పొసగనివనీ, అవి ఎన్నడో పాతబడిపోయినవనీ స్పష్టం చేశారు.*

కారల్ మార్క్స్ బోధనలను వివేచన చేసేటప్పుడు అతను ఏకాలంలో నివసించాడో, ఏ పరిస్థితులలో తన సిద్ధాంతాన్ని రూపొందించాడో అమెరికన్లు గమనించాలి. కమ్యూనిస్టు మానిఫెస్టో (సిద్ధాంతప్రణాళిక) 1848 లో ప్రచురితమైంది. అప్పుడు యూరపులో పారిశ్రామికవిప్లవం రాబోతున్నది. మామూలు పౌరులకు జీవితం అసౌఖ్యదాయకంగా, బాధామయంగా గోచరించిన కాలమది.

అప్పుడు ఎక్కడచూసినా పేదరికమే. 8, 10, 12 సంవత్సరాల వయస్సు గల పిల్లలు ప్రతిరోజూ ఎన్నోగంటలు ఫ్యాక్టరీలలో పని చేసేవారు. ఇంతాచేస్తే వారికి ముట్టేవి వారానికి కొన్ని అణాలు! కొందరేమో భాగ్యధనవంతులు. వారు ఆ

యనీ, మార్క్సు అనుకొనివుండడు. మరి ఇవన్నీ అమెరికా ప్రైవేటు యాజమాన్య విధానంక్రింద సాధ్యమయ్యాయి. విద్యావిధానంలో అమెరికా 18 ఏండ్ల వయస్సు వరకూ బాలబాలికల కందరికీ ఉచితవిద్యా సౌకర్యం కల్పిస్తున్నది. 16 ఏళ్ళు నిండని పిల్లలు ఫ్యాక్టరీలలో పనిచేయరాదని అమెరికన్ శాసనాలు చెబుతున్నవి. వారసత్వపు పన్నులు అమెరికన్లకున్నవి. 65 ఏళ్ళ వయస్సుమొదలు వృద్ధాప్యపు పించనులు వారికున్నవి. వైద్యభీమా, నిరుద్యోగభీమా, ప్రజలకు గృహవసతి, పిల్లలకు పాఠశాలల్లో ఉచితభోజనం వంటి సదుపాయాలు ఉన్నవి.

ఇవన్నీ ప్రపంచం మున్నెన్నడూఎరుగని ప్రజాసౌకర్యాలు. ఎంతో విప్లవ చింతనతో ప్రవేశపెట్టబడ్డవి. ఇలాంటివి ముందుముందు రాగలవని చివరకు మార్క్సుకూడా ఊహించివుండడు. ఒకశతాబ్దికిపైగా అమెరికాలో ఒకకొత్త అహింసాత్మక విప్లవం జరుగుతూవుంది. ప్రజల మేలుకొరకై అది. ఇంకా పురోగమిస్తూవుంది.

ఇవన్నీ ఇరవయ్యోశతాబ్ది పురోగమనాలు. ఇవి ఒక్క అమెరికాలో మాత్రమే జరగలేదు. స్వీడన్, ఫిన్లెండు, డెన్మార్కు, నార్వే దేశాలలో చక్కని సహకారసంస్థలు ఏర్పడ్డాయి. పెద్ద పరిశ్రమలు వెలిశాయి. ఆ పరిశ్రమలు కొను గోలు దారుల యాజమాన్యంక్రింద వున్నవి. ఇవన్నీ ఇలా సాధ్యమవుతాయని మార్క్సు కలలోనైనా అనుకున్నాడా? వస్తుపంపిణీకికూడా సహకారసంఘా లేర్పడి, వాడకందార్లకు ఖర్చు తగ్గించాయిగదా. వీటినన్నిటినీ మార్క్సు ఎలా ఊహించగలడు?

ఇప్పుడు ప్రైవేటు యాజమాన్యంతో పాటు ప్రభుత్వ యాజమాన్యంకూడా ఏర్పడుతూవుందికదా. రెండూ పోటీపడుతూనే సహజీవనం నెరపుతున్నాయి. ఆర్థికరంగంలో మూడురకాల ఉత్పత్తివిధానాలు వచ్చాయి. ఒకటి—సహకార విధానం. రెండవది—ప్రైవేటు పెట్టుబడివిధానం. మూడవది—సామ్యవాద విధానం. ఇవిమూడూ చౌకధరలకు మంచి సరుకులను ఎవరు ఉత్పత్తిచేయగలరు, కార్మికులకు హెచ్చువేతనాలు ఎవరు ఇవ్వగలరు, ప్రజలకు మంచి భవిష్యత్తును ఎవరుచూపగలరు అన్నవిషయాలలో ఒకదానితో ఒకటి పోటీపడుతున్నవి. ఇలా జరుగుతుందని మార్క్సు అనుకున్నాడా?

ఇంగ్లండులో లేబర్‌పార్టీ ప్రభుత్వం ఉక్కు-ఫాక్టరీలూ, బొగ్గుగనులూ ప్రభుత్వ యాజమాన్యంక్రింద వుండవలెనని సమర్థిస్తూ, ప్రైవేటు యాజమాన్యం కూడా చాలామేరకు వుండవలెనని అంటుందని మార్క్సు అనుకున్నాడా?

ఇండియా, పాకిస్తాన్, బర్మా, సింహళదేశాల 50 కోట్ల ప్రజలకు స్వాతంత్ర్య మివ్వబడవలెనని బ్రిటిషు కామన్సుసభలో సభ్యులు ఓటువేస్తూవుంటే, ఆ సభలో మార్క్సు కూర్చొని ఆ చోద్యంచూచి ఏమని అనుకొనేవాడు? రక్తపాతం లేకుండా అహింసతో గాంధీ ఇంతపెద్ద విప్లవంతెచ్చాడే! దీన్ని మార్క్సు ఊహించగలడా?

ప్రపంచదేశాలు ఐక్యరాజ్యసమితిగా ఏర్పడతాయనీ, కొన్నిలోపా లున్నప్పటికీ సమితి ప్రపంచానికి ఒకవేదికగా ఉపకరిస్తుందనీ, సమితికి అనుబంధంగా ప్రపంచ ఆరోగ్యసంస్థ, ప్రపంచ విద్యావైజ్ఞానికసంస్థ, ఆహార వ్యవసాయసంస్థ, బాలలనిధి ఏర్పడి సర్వమానవాళికీ సేవచేస్తాయనీ మార్క్సు ఊహించగలిగాడా?

కారల్‌మార్క్సు వీటినన్నిటినీ ఊహించలేదు. ఎందుకంటే 1850 ప్రాంతాల నెలకొన్న ఆర్థికవిధానం బాగా పాతుకుపోయిందనీ, దానిబొసగులను అది నివారించలేదనీ, కనుక అగ్నిపర్వతం బ్రద్దలై ప్రపంచంలో రక్తపుటేరులు తప్పక పారుతాయనీ ఆయన భావించాడు. అందుచేతనే ఆ ఆర్థికవిధానాన్ని విమర్శించాడు.

ఆర్థికస్థితి అనివార్యమైందనీ, అదే అన్నిటినీ మార్చగలదనీ మార్క్సు విశ్వాసం. అయితే మానవమాత్రుల సమర్థతను ఆయన విస్మరించాడు. మానవులు ప్రజాస్వామిక ప్రభుత్వాలద్వారా తమ జీవితాలను బాగుచేసుకోగలరనీ, తమ పరిసరాలను అదుపుచేయగలరనీ, ఆర్థికశక్తులను సకలప్రజల శ్రేయస్సుకు వినియోగించుకోగలరనీ మార్క్సు తెలుసుకోలేకపోయ్యాడు.

ముందు ముందు ప్రపంచంలో సాంకేతికశాస్త్రం పెంపొందుతుందని మాల్థ్యూస్ సిద్ధాంతాలు ఊహించలేకపోయ్యాయి. అసలు మార్క్సుసిద్ధాంతాలు మానవుణ్ణే పరిగణనకు తీసుకోలేదు. కాని గాంధీ మానవునిపై అచంచలవిశ్వాసం గలవాడు.

ఇక కారల్‌మార్క్సు, సోవియట్ యూనియనుల వ్యవహారమేమిటి? నేటి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చూచి మార్క్సు ఏమనుకొనేవాడు?

ఇప్పుడు కారల్‌మార్క్సు వస్తే ఆయనకు ఇనుప తెరలోపలికి ప్రవేశం లభిస్తుందో లేదో నాకు సందేహమే. కాని సోవియట్ యూనియన్‌కూ, దాని ఉపగ్రహరాజ్యాలకూ వెళ్ళడానికి మార్క్సుకు అనుమతిపత్రాలు లభిస్తే అక్కడి పరిస్థితులను చూచి అతను విభ్రాంతిచెందేవాడు. కమ్యూనిజం ఉన్నత శిఖరాల నధిరోహించిందని ఇండ్లకప్పుల పైకెక్కి కేకలువేస్తున్నారు కదా. కాని ఈ కమ్యూనిజానికీ, మార్క్సు ఆశించిన కమ్యూనిజానికీ పోలికలే లేవు!

మొట్టమొదట మార్క్సుకు ప్రస్ఫుటంగా కన్పించేది ప్రజలకు వ్యక్తిగత స్వాతంత్ర్యం పూర్తిగా మృగ్యంకావడం. అప్పుడతను తన సిద్ధాంతం దృష్ట్యా ఇలా వ్రాసేవాడు: "ఈ కమ్యూనిస్టు ప్రభుత్వం 35 ఏళ్ళనుంచీ అధికారంలో వుంది. ఈపాటి కిది తప్పక క్షీణించిపోవ నారంభించవలసింది. కార్మిక కర్షకులు అతితక్కువ ప్రభుత్వ ఆంక్షలతో, హెచ్చు వ్యక్తిగత స్వాతంత్ర్యంతో తమ వ్యవహారాలను తామే నిర్వహించుకోవలసింది. కాని అలా జరగలేదు."

మార్క్సు మాస్కో-రేడియో కార్యక్రమాలు విన్నాడంటే అతనికి పునః విశ్వాసం కలుగుతుంది. ఎందుచేతనంటే ఆ రేడియో కమ్యూనిస్టు పదజాలాన్నీ, సుభాషితాలనూ వల్లిస్తూ వుంటుంది. అవి విని మార్క్సు ప్రాణం లేచిరావచ్చు. పెట్టుబడిదారీవిధానం చివరకు దానంతట అదే నశిస్తుందని సోవియట్ నాయకులు జోస్యం చెబుతూవుంటారు. మార్క్సు విని ఆనందిస్తాడు. పెట్టుబడిదారీ దేశాలు ఒక యుద్ధంలో తమనుతామే నాశనం చేసుకొంటాయనీ, ఆ యుద్ధం పెట్టుబడిదారీ ప్రపంచాన్ని రెండుగా చీలుస్తుందనీ రేడియో చెబుతుంది. (కమ్యూనిస్టు పరిభాషలో పెట్టుబడిదారీ దేశాలంటే సోవియట్ విస్తరణనూ, అతిక్రమణనూ వ్యతిరేకించే ఏ దేశమైనా అని అర్థం.) ఒకవంక చెవికి అలవాటుపడ్డ ఈ వాక్యాలు విన్నప్పటికీ, పాపం, మార్క్సు అసలు పరిస్థితులను బాగా తెలుసుకొన్నాడంటే పాతకేకలు అర్థరహితములని తప్పక గ్రహిస్తాడు.

మార్క్సు జోస్యం చెప్పినట్లు ప్రపంచం రెండువర్గాలుగా విభజితమైవున్న మాట నిజమే. అయితే జరుగుతున్న సంఘర్షణ పెట్టుబడిదారీ విధానం మధ్య: కమ్యూనిజం మధ్య కాదు. అసలు స్పర్ధఅంతా, తమ ప్రభుత్వం ఏరకపుదైనప్పటికీ,

తాము స్వేచ్ఛగా వుండనభిలషించే దేశాలకూ, బలప్రయోగంతో ఇతరులపై అతి క్రమణకు పూనుకొనజూచే దేశాలకూ మధ్య మాత్రమే.

ఇది దురదృష్టకరమైన స్పర్థ. ఈ స్పర్థలో బ్రిటను, స్కాండినేవియా దేశాల ప్రజాస్వామిక సామ్యవాదం అమెరికాకు చెందిన ప్రైవేటు యాజమాన్యం తోనూ, యుగోస్లావియా స్వతంత్ర కమ్యూనిస్టు ప్రభుత్వంతోనూ బుజం బుజం కలిపి తోడుగా నిలబడివుండటం మార్క్స్ చూడగలడు.

"పెట్టుబడిదారీవిధానానికీ సామ్యవాదానికీ వైరం. రెంటికీ పొత్తు కలియదు" అన్న పాత వివాదం నేటి ఆధునికప్రపంచంలో పనికిరాకుండాపోయిందనీ, అది అంతా కల్పితవైరమనీ, అసలు స్పర్థఅంతా స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు వాంఛించే శక్తులకూ, అతిక్రమణకూ దమననీతికీ పాల్పడే దేశాలకూ మధ్యనే జరుగుతున్న దనీ కారల్‌మార్క్స్ సులభంగా గ్రహించి, 'డామిట్, కథ అడ్డం తిరిగింది' అని నిష్క్రమిస్తాడు.

# 39

## సోవియట్ యూనియన్ దేనికి ఎక్కువ భయపడుతున్నది?

కొరియాయుద్ధం 1953 లో అంతమైనా కమ్యూనిస్టుల సైనిక అతిక్రమణ ఇంకా జరుగుతుందేమోనన్న భయాందోళనలను రేపింది. శ్రీ బౌల్స్ ఆ సంవత్సరం అక్టోబరులో కనెక్టికట్‌లోని హార్ట్‌ఫర్డ్ వై. యం. సి. ఏ. లో ప్రసంగిస్తూ అటువంటి భయాలను అల్లంతదూరంలో వుంచమని ధైర్యంచెప్పి, అసలు ఎవరు దేనికి భయపడుతున్నదీ విశదంచేశారు.

అమెరికన్లు దేనికి భయపడుతున్నారన్నసంగతి కాసేపు అలా వుంచి సోవియట్ యూనియన్ నాయకులు నేటి విప్లవాత్మకప్రపంచంలో దేనికి భయపడుతున్నారో కాస్త ఆలోచిద్దాము.

అన్నిటికన్న వారికి ప్రజాస్వామికదేశాలంటే హెచ్చు భయం. ప్రజాస్వామ్య దేశాలు బాగా అభివృద్ధిచెంది ఇతరులకు చక్కని ఆదర్శంగా కనిపిస్తూ, ప్రపంచ సమస్యలను చక్కగా పరిష్కరిస్తూపోతే ప్రజాస్వామ్యమనే భావన చివరికొకరోజు సోవియట్ యూనియన్‌లో సైతం ప్రజలను మిక్కిలిగా ఆకర్షించగలదనీ, అప్పుడు ప్రజలు దీనినుండి మనస్సును మరల్చుకోలేరనీ రష్యా భయం.

నిశ్చయంతో, ఇదమిత్థంగా అమెరికన్లు గైకొనే చర్యలు ప్రజాస్వామిక

ప్రపంచాన్ని సుదృఢంచేసినట్లయితే ఆంతరంగిక కమ్యూనిస్టు విప్లవం అసాధ్య మవుతుందేమోనని వారి భయం.

అమెరికన్లు పాయింట్ ఫోర్ కార్యక్రమాన్ని విస్తరించి, ఆర్థికాభివృద్ధికికూడా దాన్ని వర్తింపజేశారంటే అమెరికన్ సహాయంతో ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికా దేశాలు నియంతృత్వ నిర్దాక్షిణ్యపు బెడదలేకుండానే అభివృద్ధిజెందుతా యేమోనని వారి భయం.

ఈ దేశాలకు అమెరికన్లు పెట్టుబడిపెట్టి, సాంకేతిక సహాయమిచ్చి ప్రజా స్వామికకృషిలో అవి కృతార్థతజెందేట్టు చేశారంటే వీటిలో ఆర్థికసంక్షోభం, ఆర్థికపతనం రావనీ, అవి రానప్పుడు కమ్యూనిజం వచ్చే ఆస్కారమే వుండదనీ వారి భయం.

ఆసియాలో అసలు పోటీ అంతా కమ్యూనిస్టుచైనా, ప్రజాస్వామిక భారత దేశం మధ్యనే అని అమెరికన్లు ఎక్కడ గ్రహిస్తారో, అలా గ్రహించి రష్యావారు చైనాకిస్తున్న దానికన్న అమెరికన్లు భారతదేశానికి హెచ్చు మద్దతు ఇస్తారేమోనని వారి భయం.

స్వతంత్ర ఆసియాదేశాలు స్వతంత్ర విదేశాంగ విధానాలను అనుసరించ కృతనిశ్చయం చేసుకుంటే, ఏ సైనిక కూటమిలోనూ చేరకుండా వుందామని అనుకుంటే వారి నిశ్చయాన్ని గౌరవించి అమెరికన్లు ఆమోదిస్తారేమోనని వారి భయం. ఈవిధంగా పాశ్చాత్యదేశాలు ఆసియా జాతీయతత్వాన్ని గౌరవించాయంటే అప్పుడు కమ్యూనిస్టులను మాత్రమే "విదేశపు ఏజెంట్లు" అని అంతా అంటారని రష్యాకు తెలుసు.

అమెరికన్లు ప్రస్తుతం "మీరు వుంటే మావైపు వుండాలి. లేదా ఆవతలిపక్షం లోకి పొండి" అన్న ప్రయోజనరహితవిధానాన్ని అవలంబిస్తున్నారు. ఇందువల్ల స్వాభిమానంగల మిత్రదేశాలు చిరాకుపడ్డవి. కోపం తెచ్చుకున్నవి. ఇట్టి అమెరికా వైఖరి తటస్థవిధానానికి విరుద్ధమైంది. మొదటి ప్రపంచయుద్ధానికి ముందు పూర్తిగా ఒక శతాబ్దివరకూ అమెరికన్లు తటస్థవిధానాన్నే అవలంబించారుకదా! కాబట్టి సత్ఫలితంలేని నేటి అమెరికా వైఖరిని అమెరికన్లు విడనాడుతారేమోనని వారి భయం.

ఆఫ్రికాలోనూ, ఇంకా కొద్దీ గొప్పా మిగిలివున్న ఆసియాప్రాంతాలలోనూ

వలసవిధానాన్ని అమెరికన్లు వ్యతిరేకించి ఆయాదేశాల జాతీయోద్యమాలనూ స్వాతంత్ర్యాన్నీ బలపరుస్తారేమోనని వారి భయం. అలా బలపరచినట్లయితే తా మొక్కరే సామ్రాజ్యవాదానికి వ్యతిరేకులని చెప్పుకునే అర్హత సోవియట్ యూనియన్‌కు వుండదు.

ప్రజాస్వామ్యవ్యతిరేక ప్రభుత్వాలనూ, ప్రజల ఆమోదం పొందని ప్రభుత్వాలనూ అమెరికా సమర్థించడం మానుకుంటుందేమోనని వారి భయం. మరి అటువంటి ప్రభుత్వాలు ఎక్కడైనా వుండబట్టేకదా కమ్యూనిస్టులు విమర్శించే అవకాశం కలుగుతున్నది।

అత్యవసరమైన భూసంస్కరణలను, సాంఘిక సంస్కరణలను అమలుపరచి న్యాయబద్ధమైన పన్నుల విధానాన్ని ప్రవేశపెట్టే ప్రభుత్వాలకు అమెరికన్లు ప్రత్యేకంగా పనికట్టుకొని మద్దతు ఇస్తారేమోనని వారి భయం.

అమెరికా ఆర్థికసహాయం పొందే దేశాలు అట్టి సంస్కరణలను ప్రవేశపెట్టవలెనన్న షరతును అమెరికన్లు విధిస్తారేమోననీ, అలా విధిస్తే అమెరికన్లు వారిపైపే వున్నారన్న అభిప్రాయం ప్రపంచ ప్రజలకు కలుగుతుందేమోననీ రష్యా భయం.

దురాక్రమణను సాముదాయికంగా ఎదుర్కొనడానికి మాత్రమేగాక ప్రపంచ ఆర్థికసమస్యలను పరిష్కరించే ముఖ్యోద్దేశంతో కూడా అమెరికన్లు ఐక్యరాజ్య సమితిని సమర్థించి దానికి బలం చేకూరుస్తారేమోనని వారి భయం.

అమెరికన్లు యుక్తితో, శీఘ్రగ్రాహిత్వంతో ఐక్యరాజ్యసమితిని ప్రజాస్వామ్యాన్ని వాంఛించే ప్రజలకు ముఖ్యకేంద్రంగా చేస్తారేమోనని వారి భయం.

అమెరికన్లు స్వదేశమైన అమెరికాలో ఆర్థిక మాంద్యం, సంక్షోభం ఏమీ లేకుండా చక్కని ఆర్థికవ్యవస్థను ఏర్పరచుకుంటారేమోనని వారి భయం.

జాతీయంగా, అంతర్జాతీయంగా కొత్త కార్యక్రమాలను పూర్తి విశ్వాసంతో అమలుపరచుకొని పూర్తి ఉత్పత్తి సాధించి పూర్తిగా ఉద్యోగావకాశాలను కల్పిస్తారేమో, అందువల్ల మార్క్సిస్టు జోస్యాలు తారుమారులవుతాయేమోననీ వారి భయం.

గడచిన ఇరవైయేండ్లలో జాతుల సంబంధాలవిషయంలో అమెరికన్లు సాధించిన అభివృద్ధిని అలాగే కొనసాగించడమేగాక, అమెరికా పౌరులందరికీ

సమానహక్కులు, సంపూర్ణ గౌరవం కలుగజేసి అందరిచే సెభాష్ అనిపించు కుంటారేమోనని రష్యావారి భయం.

కమ్యూనిస్టులవల్ల భయంతో, అమెరికనులు చీలి ఛిన్నాభిన్నంగాక స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సూత్రాలపట్ల విశ్వాసంతో, సమైక్యతతో వ్యవహరిస్తారేమోనని వారి అదుర్దా.

కమ్యూనిజంతో పోరాడుతూనే అమెరికన్ పౌరహక్కులను చెక్కుచెదర కుండా కాపాడుకుంటారేమో, అట్టితరి ప్రజాస్వామ్యవిధానం ప్రపంచాని కొక చక్కని ఆదర్శంగా నిలుస్తుందేమోనని వారి భయం,

ఒక్కమాటలో చెప్పాలంటే జాగృతమైన అమెరికా నాయకత్వం క్రింద, థామస్ జెఫర్సన్, అబ్రహాంలింకన్, ఫ్రాంక్లిన్ రూజ్వెల్టువంటి మహనీయుల ఉద్బోధలకు అంకితమైన అమెరికా నాయకత్వంక్రింద ప్రజాస్వామిక ప్రపంచం శీఘ్రంగా ముందంజవేస్తూ కమ్యూనిజం వ్యాపించడానికి అస్కారమిచ్చే పరిస్థితులను తొలగించి, ప్రపంచాధిపత్యాన్ని పొందవలెనన్న కమ్యూనిస్టుల ఆశలను అడియాస లుగా చేయడం ఎన్నటికైనా జరుగుతుందేమోనని సోవియట్ యూనియన్ భయం.

## 40

# అమెరికన్ల నెదుర్కొనే క్లిష్టస్థితి అమెరికన్లకోసమని ఆగదు

1955 లో సోవియట్ పంథా మారింది. సోవియట్ యూనియన్ తన బహిరంగ అతిక్రమణ వైఖరిని మానుకొని ఆర్థిక రాజకీయ, సిద్ధాంత సంబంధ రంగాలలో ఎత్తులు జిత్తులు సాగించ మొదలుపెట్టడంతో అమెరికా ఒకకొత్త సవాలును, ఒకకొత్త క్లిష్టస్థితిని ఎదుర్కొనవలసి వచ్చిందని నవంబరు 27 తేదీనాటి న్యూయార్కు టైమ్సు మేగజైన్‌లో వ్రాసిన ఈ క్రిందివ్యాసంలో శ్రీ బౌల్సు వివరించారు.

1955 జూలైలో జరిగిన శిఖరాగ్ర సమావేశంలో ప్రస్తుతపరిస్థితిలో అణ్వస్త్ర యుద్ధమే జరిగితే అది ఉభయపక్షులవారిని సర్వనాశనం చేస్తుందనీ, కాబట్టి అటువంటియుద్ధం ఆచరణరీత్యా ఒక అసాధ్యవిషయమైందనీ అంతా గుర్తించారు. ఆరీత్యా జెనీవా సమావేశం చరిత్రాత్మకమైంది. అయితే అంతటితో సోవియట్‌యూనియన్ దీర్ఘకాలంపై తానుపెట్టుకొన్న ప్రపంచలక్ష్యాలను విడనాడిందన్న సూచనలు ఎక్కడా గోచరించలేదు.

కృశ్చేవ్, బుల్గానిన్‌లు ఒకఅంశాన్ని అర్థంచేసుకున్నారు. సిద్ధాంతాల పట్టింపుతో, అహంభావంతో స్టాలిన్ ఆ అంశాన్ని గ్రహించలేకపోయ్యాడు. ఆ అంశ

సమానహక్కులు, సంపూర్ణ గౌరవం కలుగజేసి అందరిచే సెభాష్ అనిపించు కుంటారేమోనని రష్యావారి భయం.

కమ్యూనిస్టులవల్ల భయంతో, అమెరికనులు చీలి ఛిన్నాభిన్నంగాక స్వేచ్ఛా స్వాతంత్ర్యాల సూత్రాలపట్ల విశ్వాసంతో, సమైక్యతతో వ్యవహరిస్తారేమోనని వారి ఆదుర్దా.

కమ్యూనిజంతో పోరాడుతూనే అమెరికన్ పౌరహక్కులను చెక్కుచెదర కుండా కాపాడుకుంటారేమో, అట్టితరి ప్రజాస్వామ్యవిధానం ప్రపంచానికి కొత్త చక్కని ఆదర్శంగా నిలుస్తుందేమోనని వారి భయం,

ఒక్కమాటలో చెప్పాలంటే జాగృతమైన అమెరికా నాయకత్వం క్రింద, థామస్ జెఫర్సన్, అబ్రహాంలింకన్, ఫ్రాంక్లిన్ రూజ్వెల్టువంటి మహనీయుల ఉద్బోధలకు అంకితమైన అమెరికా నాయకత్వంక్రింద ప్రజాస్వామిక ప్రపంచం శీవితో ముందంజవేస్తూ కమ్యూనిజం వ్యాపించడానికి ఆస్కారమిచ్చే పరిస్థితులను తొలగించి, ప్రపంచాధిపత్యాన్ని పొందవలెనన్న కమ్యూనిస్టుల ఆశలను అడియాస లుగా చేయడం ఎన్నటికైనా జరుగుతుందేమోనని సోవియట్ యూనియన్ భయం.

# 40

## అమెరికన్ల నెదుర్కొనే క్లిష్టస్థితి అమెరికన్లకోసమని ఆగదు

1955 లో సోవియట్ పంథా మారింది. సోవియట్ యూనియన్ తన బహిరంగ అతిక్రమణ వైఖరిని మానుకొని ఆర్థిక రాజకీయ, సిద్ధాంత సంబంధ రంగాలలో ఎత్తులు జిత్తులు సాగించ మొదలుపెట్టడంతో అమెరికా ఒకకొత్త సవాలును, ఒకకొత్త క్లిష్టస్థితిని ఎదుర్కొనవలసి వచ్చిందని నవంబరు 27 తేదీనాటి న్యూయార్కు టైమ్సు మేగజైన్‌లో వ్రాసిన ఈ క్రిందివ్యాసంలో శ్రీ బౌల్సు వివరించారు.

1955 జూలైలో జరిగిన శిఖరాగ్ర సమావేశంలో ప్రస్తుతపరిస్థితిలో అణ్వస్త్ర యుద్ధమే జరిగితే అది ఉభయపక్షాలవారిని సర్వనాశనం చేస్తుందనీ, కాబట్టి అటువంటియుద్ధం ఆచరణరీత్యా ఒక అసాధ్యవిషయమైందనీ అంతా గుర్తించారు. ఈరీత్యా జెనీవా సమావేశం చరిత్రాత్మకమైంది. అయితే అంతటితో సోవియట్‌యూనియన్ దీర్ఘకాలంపై తానుపెట్టుకొన్న ప్రపంచలక్ష్యాలను విడనాడిందన్న సూచనలు ఎక్కడా గోచరించలేదు.

కృశ్చేవ్, బుల్గానిన్‌లు ఒకఅంశాన్ని అర్థంచేసుకున్నారు. సిద్ధాంతాల పట్టింపుతో, అహంభావంతో స్టాలిన్ ఆ అంశాన్ని గ్రహించలేకపోయ్యాడు. ఆ అంశ

మేమిటంటే—సైనికంగా ప్రతిష్టంభన ఏర్పడింది కాబట్టి సైనికచర్యలతో దురాక్రమణ సాగించడం, అలా సాగిస్తామని బెదిరించడం పనికిమాలినవై పొయ్యాయి.

శిఖరాగ్ర సమావేశానికి ముందూ, ఆతరువాతా సోవియట్ నాయకులు అణ్వస్త్రబలం సమతూకపు అర్థాన్ని గ్రహించి తదనుగుణంగా వ్యవహరించ మొదలుపెట్టారు. గడచిన కొన్నినెలలనుంచి సోవియట్ విదేశాంగవిధానం మరొక రంగంలో—అంటే రాజకీయ, ఆర్థిక, సిద్ధాంత, దౌత్యవిషయాలలో స్పర్ధకు పూనుకుంటూవుంది.

ఆలోపల అమెరికావిధానం వెనుకటివ్యూహానికే కట్టుబడివుంది. కాని ఆ వ్యూహం ప్రచ్ఛన్నయుద్ధంలో సంకుచితమైందని తేలిపోయింది. ఈ కొత్తరకపు స్పర్ధకు అదిచాలదు. ప్రపంచంలో చాలామేర ఈనాడు అమెరికావిధానాలు సైనిక బలం దృక్పథంపైనే ఆధారపడివున్నాయి. ఆసియా ఆఫ్రికాలలో అమెరికన్లు పట్టు విడుపులులేని రాజనీతిని అవలంబించడంచేత పాతబడిపోయిన, ఇతరులచే ఏవగించుకోబడిన యథాస్థితిని పట్టుకు వ్రేలాడుతున్నారు. అది ఎప్పుడో నీటి బుడగవలె తప్పుమంటుంది.

అణ్వస్త్రయుద్ధం తప్పకవస్తుందని అమెరికన్లు భావిస్తున్నట్లయితే దీర్ఘకాలికమైన ఆర్థిక, సిద్ధాంత, రాజకీయరంగాలకు వుండే ప్రాముఖ్యం తక్కువ. కాని జెనీవా శిఖరాగ్రసమావేశంలో జరిగినదాన్నిబట్టి ఉభయపక్షాలూ సైనికంగా, అణ్వస్త్ర రీత్యా సమతూకంలో వున్నంతవరకూ ప్రపంచ యుద్ధమనేది అసంభవమని తేలింది. అది పాతకాలపుమాట అయింది. ఎందుచేతనంటే ఆధునిక ఆయుధాలు అంత భయంకరమైనవి.

అటువంటప్పుడు సైనిక వ్యూహాలకూ. కీలకాలకూ హెచ్చు ప్రాముఖ్యమిచ్చి రాజకీయ, ఆర్థిక, సిద్ధాంత సంబంధశక్తులకు తక్కువ ప్రాముఖ్యమిచ్చే విదేశాంగవిధానం అసమగ్రమైంది. ఎందుకంటారా, రాజకీయ, సిద్ధాంత, ఆర్థిక శక్తులే ఇప్పుడు చరిత్రను రచిస్తూ వున్నవి.

అమెరికన్లు సోవియట్ ఎత్తుగడలకు భయపడకూడదు. వాటిని ఆహ్వానించాలి. అమెరికన్ ప్రజాస్వామ్యవిధానానికి ఆర్థికాభివృద్ధి రాజకీయాలు, భావాలు, ఆదర్శాలు వివిధాంగములవంటివి. అవిఅన్నీ చేరివుంటేనే ప్రజాస్వామ్యమవుతుంది. అమెరికాప్రత్యర్థి పోటీని మరొక రంగానికి మార్చాడు. ఆ రంగం అమెరికన్లకు

అనుకూలమైంది. అక్కడ ఇదివరకే అమెరికా బలం రుజువైంది. కాబట్టి ఈ కొత్త సవాలును అమెరికన్లు ఆత్మవిశ్వాసంతో ఎదుర్కోవచ్చు.

కాంగ్రెసుసభవారి దృష్టినీ, ప్రజాదృష్టినీ ఇప్పుడు అమెరికా ఎదుర్కొంటూ వున్న సవాలుపై లగ్నం చేయవలెనంటే ధైర్యవిశ్వాసాలలో, పోటీ మంచిచెడ్డల విషయంలో కొత్త దృక్పథంగల నాయకత్వం అవసరం. నేటికి పదేండ్లక్రితం యూరపును స్వతంత్రంగా వుంచడానికి ఉభయపక్షాల కలయిక ఎంత తీవ్రంగా వివేచనతో జరిగిందో 1956 లోనూ, ఆ తర్వాతా ప్రస్తుత ధోరణిని మార్చడానికి అలాంటి చర్యలే అవసరమవుతాయి.

ముఖ్య చర్చనీయాంశాలను పేర్కొంటే సవాలు పైనమును విశదీకరించినట్లవుతుందికదా!

1. రష్యావల్ల సైనికంగా ఎట్టి బెడదవచ్చినా దాన్ని ఎదుర్కోవడానికి తగిన సైనికరక్షణ కార్యక్రమం అవసరం.

2. మార్షల్‌పథకం యూరపుకు ఎట్టి సహాయాన్ని లభింపజేసిందో అట్టి సహాయాన్ని ఆసియా, ఆఫ్రికా, దక్షిణఅమెరికాలకు చేయగల ఆర్థికాభివృద్ధి కార్యక్రమం కావాలి.

3. అసలు సమస్యపై దృష్టిని కేంద్రీకరించేట్టుగా జర్మనీవిధానం ఒకటి రూపొందించడం. ఎర్రసైన్యాన్ని దాని హద్దుల వెనుకకు మరలించడానికి చేయవలసిన తతంగాలు, జరపవలసిన మంతనాలు.

4. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికక్రింద పటిష్ఠమైన ఆర్థిక రాజకీయ పునాదులు వేయగల యూరపు ప్రజావ్యవస్థను ప్రోత్సహించడం. ఆ వ్యవస్థ తూర్పు యూరపులో వున్న రష్యా ఉపగ్రహరాజ్యాలపై పాశ్చాత్యప్రభావం వేసేదిగా వుండాలి.

5. ఆసియా ఆఫ్రికాప్రజల విశ్వాసాన్ని చూరగొనగల వలసవిధానం అవలంబించడం. అప్పుడు అమెరికన్లు స్వాతంత్ర్యాన్ని బలపరిచేవారుగా వాసికెక్కుతారు. ఇంకా వలసలుగావున్న ప్రాంతాలలో ప్రజలు బాధ్యతాయుతంగా ఉద్యమాలు నడిపేట్టు చేయడం.

6. లక్ష్యాన్ని సాధించేందుకు తగిన మధ్యప్రాచ్యవిధానాన్ని రూపొందించడం. మధ్యప్రాచ్యంలో అమెరికా లక్ష్యమేమిటి? నిర్మాణాత్మకంగా వ్యవహరించే

దేశీయశక్తులను ప్రోత్సహించి, ఆ ప్రాంతంలోకి సోవియట్ ప్రభావం చొచ్చుకు పోకుండా నిరోధించడం.

7. దూరప్రాచ్యంలో కనీసం 17 వ అక్షాంశరేఖకు దిగువగా స్వతంత్ర ఇండోచైనా వర్ధిల్లేట్టుగా ఒడంబడిక కుదర్చడానికి కొత్త ప్రయత్నం చేయడం. అలాగే స్వతంత్ర ఫార్మోజాను నిలబెట్టాలి. దానికి తగురక్షణ వుండాలి. జపాను ఆర్థికంగా స్వయంసమృద్ధమయ్యేట్టు చేయాలి. కమ్యూనిస్టుచైనాతో సాధారణ సంబంధాలకు ప్రయత్నించాలి.

8. ఆసియాలో జపాను భారతదేశాల కీలకప్రాముఖ్యాన్ని అర్థం చేసుకోవాలి. వచ్చే పదేండ్లలో భారతదేశం ఏమి సాధించగలుగుతుందో, ఏమి సాధించలేక విఫలమవుతుందో, జపానులో ఏయే విశేషాలు జరుగుతాయో, వాటినిబట్టి కమ్యూనిస్టేతర ఆసియా భవిష్యత్తు నిర్ణయమవుతుంది. భారత తటస్థవిధానాన్ని చూచి అమెరికన్లు నిస్పృహచెందడం మానుకోవాలి. యథార్థాలను గమనించి, మరీ కరడుగట్టినట్లుగా కాక కొంత సరసంగా నిశ్చితార్థం ప్రాప్తించే రీతిలో వ్యవహరించాలి.

పైన పేర్కొన్న అంశాలలో మొదటి రెండూ చాలా ముఖ్యమైనవి. అమెరికా సైనికశక్తిని యథాతథం వుంచుకోవాలి. కాని ఆర్థిక రాజకీయరంగాలలో కమ్యూనిస్టుల ఎత్తుగడలను ఎదుర్కోవాలి.

అమెరికన్లు ఈ కొత్త ఆర్థిక, సిద్ధాంత, రాజకీయ స్పర్ధను ఎదుర్కోలేరేమోనని కొందరి వాదం. అయితే ఇందుకు ఏటా ఎంత ఖర్చు అవుతుందని అడుగుతారా? ఎంత అవుతుంది? ఒక్క 1955 లోనే అమెరికన్ జాతీయాదాయంలో 12 వందల కోట్లడాలర్ల పెరుగుదల కన్పించింది. ఇందులో కొంత ఖర్చుపెడితే చాలు.

దక్షిణకొరియానుంచి కమ్యూనిస్టులను దూరంగా వుంచడానికి అమెరికా, తదితర మిత్రదేశాలు కొన్నివేలమంది సైనికుల ప్రాణాలను బలిపెట్టవలసివచ్చింది. 50 వందల కోట్ల డాలర్ల విలువగల సైనిక సామగ్రిని వ్యయపరచవలసి వచ్చింది. కనుక ఇప్పుడు అమెరికన్లు తడబడితే యూరపును, మధ్యప్రాచ్యాన్ని, దక్షిణ ఆసియాను, ఆఫ్రికాను కమ్యూనిస్టుల బారినుంచి కాపాడటానికి ఇంకా ఎంతో హెచ్చు మూల్యం చెల్లించవలసి వస్తుంది. కొత్త సోవియట్ సవాలు ఎంత తీవ్రమైనదో అమెరికా జవాబు కూడా అంత దిట్టమైనదే కావాలి.

ద్వితీయప్రపంచ యుద్ధానంతరం రెండవ దశాబ్దిలో అమెరికా నాయకత్వం క్రిందగల ప్రపంచ స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు తగు నిధులులేని కారణంచేత వాడి వత్తలైపోయాయని రాబోవుతరాల చరిత్రకారులు వ్రాయకుండునట్లుగా అమెరికన్లు వ్యవహరించాలి.

# 41

## ఈ పోటీలో అమెరికన్లు ఓడిపోకూడదు

1957 లో శ్రీ బౌల్స్ సోవియట్ యూనియన్‌ను సందర్శించి నప్పుడు రష్యన్ యువతీయువకులు అమెరికానుగూర్చి హెచ్చు వివరాలు తెలుసుకోవడానికి కనపరచిన ఆసక్తిని గమనించి సంత సించారు. ఆకాలంలో అమెరికా-రష్యా వైజ్ఞానిక మారకములను ఆటంకపరుస్తూ వుండేవారు. అట్టివిధానాన్ని శ్రీ బౌల్స్ నిర సించారు.

ఇది 1957 ఆగస్టు 24 తేదీ "శాటర్ డే రివ్యూ" పత్రికకు వ్రాసిన వ్యాసం.

ఇటీవల నేను సోవియట్‌రష్యా సందర్శించినప్పుడు సోవియట్ యువజనంలో కొంతసంచలనం గమనించాను. అంటే అక్కడి యువజనం కమ్యూనిస్టు విధానంపై తిరుగుబాటు లేవదీయజూస్తున్నారని చెప్పడం నాఉద్దేశం కాదు. అలాంటిదేమీలేదు. కాని కరకుతనం తగ్గుతూవున్న సూచనలు కన్పించాయి. పాతసిద్ధాంతాలను ప్రశ్నించేధోరణి గోచరించింది. ప్రతిచోటా సంగతి సందర్భాలు తెలిసికొన నిచ్ఛగల యువతీయువకులు మాకు ఉత్సాహంతో స్వాగతమిచ్చారు. ప్రశ్నలడిగారు.

స్టాలిన్ హయాం అనంతరం తాత్కాలికంగా ఏర్పడ్డ అరమరలులేని అవస్థను అమెరికన్లు సద్వినియోగం చేసుకొంటున్నారా లేదా అన్నది ముఖ్యప్రశ్న. అంటే కమ్యూనిస్టు ప్రపంచమంతటా వస్తూవున్న మార్పునూ, సంచలనాన్నీ అమెరికన్లు తగువిధంగా ప్రోత్సహిస్తున్నారా లేదా అని అడిగారు. ఈప్రశ్న నన్ను కలతపెట్టింది.

రష్యాలో ఎక్కడవిన్నా మాస్కోలో జరగబొయ్యే ఆరవ ప్రపంచ యువ జనోత్సవాన్ని గూర్చిన చర్చలే. ఆఉత్సవాలకు ప్రపంచం మొత్తంనుండి కొన్ని వేలమంది యువతీయువకులను ఆహ్వానించారట. ఈదేశానికి మార్చిలో నేను తిరిగి వచ్చినతర్వాత సమర్థులైన యువకవిద్యార్థులు ఈ సంవత్సరం ఉత్సవం ప్రజా స్వామిక అమెరికా అభిప్రాయాలను నలుగురికీ తెలిపేందుకు మంచి అవకాశ మనుకొని ఉత్సవాలలో పాల్గొన ప్రయత్నిస్తున్నట్టు తెలిసింది. కాని వారు అలా చేయకుండా అమెరికన్ అధికారులు నిరుత్సాహపరచడం శోచనీయం.

దీనిపై అసలువిషయమేమిటని కొందరు అధికారవర్గాలను ప్రశ్నించాను. వారు అమెరికా ప్రభుత్వ పిరికివైఖరిని ఇలా వివరించారు : "మీప్రభుత్వం మీకు ప్రయాణానుమతిపత్రం ఇవ్వ నిరాకరించడంలేదు. కాని ఈ ఉత్సవాన్ని స్వీయ రాజకీయోద్దేశాలతో సోవియట్ ప్రభుత్వం ఏర్పాటుచేసింది. కాబట్టి దానికి హాజ రయ్యే అమెరికనులు కమ్యూనిస్టులక్ష్యాలకు దోహదమిచ్చిన వారవుతారు.

దీనిఫలితంగా అమెరికా ప్రతినిధివర్గం నూటికి ఇంకా తక్కువేఅయింది. తప్పుకున్నవారిలో చాలామంది సమర్థులైన ప్రజాస్వామికవక్తలు. ఎటువంటి చర్చలోనైనా తమవాదాన్ని సమర్థించుకోగల దక్షతగలవారు. కాని అక్కడికి పోవాలని ఇంకా ప్రయత్నిస్తూవున్నవారిలో చాలామంది రాజకీయంగా చతురత లేనివారు. లేదా కమ్యూనిస్టు అనుయాయులు. అమెరికన్ ప్రజాస్వామిక దృక్ప థాన్ని సమర్థతతో వ్యక్తంచేయగల యువతీయువకులను అధికార్లు నిరుత్సాహ పరచడంచేత వారుమానుకున్నారు. నలుగురైదుగురు ప్రయోజకులు వెళ్ళారేమో !

ఉత్సవాన్నిగూర్చి వచ్చిన తొలివార్తలనుబట్టి తమ పిరికితనంవల్ల అమెరికన్లు ఒకమంచి అవకాశాన్ని పోగొట్టుకున్నారని తెలుస్తున్నది. వ్యక్తి వ్యక్తితోమాట్లాడి సత్సంబంధాలు పెంపొందించుకోవడంలో అమెరికనులు సమ ర్థులు. ఆ అవకాశం కాస్తా పోయింది. మొత్తం 102 దేశాలనుంచి 220,000 మంది యువతీయువకులు ఉత్సవానికి వచ్చారట. అమెరికన్ యువజనులకు స్వాతంత్ర్యం అన్నమాటకు అర్థం బాగాతెలుసు. పైగా ఉత్సవం పరిస్థితులుకూడా అమెరికన్లకు అనువుగావున్నాయట.

ఇటీవల 'లైఫ్' మేగజైన్ ఇట్లా వ్రాసింది ; "ఈ ఉత్సవానికి రష్యన్ అధికార్లు కొంత స్వాతంత్ర్యమిచ్చారు. యువతీయువకులు స్నేహంగా, సన్ని హితంగా మెలగే వీలుకలిగింది. ఇలాంటి వాతావరణాన్ని చూచిన రష్యనులు

ఉక్కిరిబిక్కిరయ్యారు. తాము మరచిపోయిన స్వాతంత్ర్యాన్ని మళ్ళీ చవిచూచారు." అక్కడికొచ్చిన ప్రతినిధులు సహవాసంతో సన్నిహితులుకావడం, ఒకరితో ఒకరు నేస్తం చేయడం, స్వేచ్ఛగా రాజకీయవాదాలు చేయడం చూచిన ఫ్లోరాలెవిస్ అను పత్రికావిలేఖరి ఒకామె 1955 వార్సా ఉత్సవం తర్వాత "అశాంతి అనే నివురు గప్పిన నిప్పుకణాలు బహిర్గతమై కమ్యూనిస్టు ప్రపంచంలో ప్రేలుతున్నట్లు" స్ఫురించిందట. మాస్కోలో పోలెండు దేశీయుడొకడు ఆమెతో "ఇలా వీళ్ళందరికీ స్వాతంత్ర్యమివ్వడం ఎంత ప్రమాదం తెచ్చిపెట్టుకోవడమో కృశ్చేవ్ గ్రహించాడో లేదో నాకు అబ్బురంగా వుంది" అన్నాడుట!

ఇది అమెరికన్లకు మంచి అవకాశం. స్వేచ్ఛాకాముకులైన ప్రజలు, ఒక వ్యక్తి మరొక వ్యక్తితో కలుసుకున్నప్పుడు తమ మనోభావాలు వివరించి తమ ప్రభావం చూపగలుగుతారు. అమెరికన్లకీ అవకాశం తప్పిపోయింది. నేను మాస్కోలో వున్నప్పుడు అంతర్జాతీయ హాకీ పోటీ ఒకటి జరిగింది. అమెరికాజట్టు నొకదానిని ఆహ్వానించారు. వస్తామనిచెప్పి, ఆ జట్టువారు రాలేదు. "మీ జట్టు ఎందుకురాలేదు?" అని మాస్కో విశ్వవిద్యాలయ సోవియట్ విద్యార్థులు నన్ను ప్రశ్నించారు. "ఒలింపిక్ పోటీలలో మిమ్మల్ని మేము తరచు ఓడిస్తూ వుంటామని చెప్పిరాలేదా?" అనికూడా అన్నారు వాళ్ళు.

అమెరికా అధికారవర్గాలు చేసిన వివరణనే నేను వారికి అప్పగించాను: 1956 అక్టోబరులో హంగరీలో జరిగిన తిరుగుబాటును అణచివేసిన తర్వాత అందుకు నిరసనగా సోవియట్ యూనియన్‌కు వైజ్ఞానిక ప్రతినిధివర్గాలను పంపడం అమెరికన్లు మానుకున్నారు అని వారితో అన్నాను.

"దేనికి నిరసనగా" అని వెంటనే ప్రశ్నించా డొక రష్యన్. హంగరీ విప్లవాన్ని గూర్చి నా అభిప్రాయాన్ని చెప్పే అవకాశ మొకటి దొరికింది. ఇలాంటి అభిప్రాయాన్ని వా రంతకుముందు వినివుండలేదు. అయితే "ఇనుపతెర" లోకి పోము అని చెప్పే నిరసనలు మంచివికావు. వాటివల్ల అమెరికన్లను అమెరికన్లు ఓడించుకోవడమే అవుతుంది.

ఒక నిరసనవల్ల ప్రయోజనం కలగాలంటే ఎవరి కది ఉద్దేశింపబడిందో వారు దాన్ని ఎరగాలి. మరి అమెరికావా రేమనుకుంటున్నారో రష్యనులు తెలుసుకోవాలంటే వారు అమెరికనులతో కలిసి మాట్లాడాలి. అదే వైజ్ఞానిక సంపర్కం. పిరికితనంతో అమెరికన్లు దాన్ని పరిమితం చేస్తున్నారు.

సోవియట్ యువజనులు ఇప్పుడు మేల్కొంటున్నారు. వారిని జాగృతం చేయడాని కుపకరించే ప్రతి అవకాశాన్నీ అమెరికన్లు వినియోగించుకోవాలి. ఇదిగో, దీనికే అమెరికా ప్రభుత్వం భయపడుతూ వుంది.

సోవియట్ ప్రభుత్వం అద్యతనభావిలో తన రాజకీయపరిస్థితిని సడలించ బోతూందన్న ఆశ కృశ్చేవ్ ఇటీవలి ప్రకటనలను చదివితే విలగడంలేదు. అయితే "ఇనుపతెర"ను కొంతైనా తొలగించారు కదా!

మాస్కో విశ్వవిద్యాలయంలో విద్యార్థులు నడుపుతూవున్న పత్రికను నాకు చూపారు. అందులో ఇండియానావిశ్వవిద్యాలయ విద్యార్థుల లేఖ ప్రచురితమైంది. ఒకరికొకరు సమాచారం తెల్పుకొంటూ వుండాలనీ, ఒక విశ్వవిద్యాలయం విద్యార్థులు మరొక విశ్వవిద్యాలయాన్ని సందర్శించే అవకాశాలు వుండవలెననీ ఇండియానా వారు ఆ లేఖలో ప్రతిపాదించారు. ఈ లేఖ చదివిన రష్యన్ విద్యార్థులు సంతోషాతిరేకం వ్యక్తంచేశారు.

విశ్వవిద్యాలయ రేడియోకేంద్రంనుంచి అమెరికన్ జాజ్ సంగీతం వినిపిస్తూ వుంటారు. మేము ప్రసారకేంద్రానికి వెళ్ళినప్పుడు లూయీ ఆర్మ్‌స్ట్రాంగ్ రచన "ప్రేమా, ఓ ప్రేమా, ఓ జాగ్రత్తలేని ప్రేమా" అన్న పాట ప్రసారమవుతూ వుంది. మావెంట న్యూయార్కు టైమ్సుపత్రిక యూరపు ప్రచురణ తాలూకు ఇటీవలి ప్రతులు కొన్ని వున్నాయని తెలిసి విద్యార్థులు వాటిని తమకివ్వమని అడిగారు.

కాలేజీకి వెళ్ళి చదువుకొనే పిల్లలు నాకు ఎదురుగుడున్నారు. ప్రతిచోటా పీళ్ళను గూర్చిన ప్రశ్నలడిగారు నన్ను. "ఏం చదువుతున్నారు?" "పట్టభద్రులైన తర్వాత ఏం చేస్తారు?", "ప్రపంచంలో శాంతి నెలకొంటుందని వారు అనుకుంటు న్నారా?"—ఇలాంటి ప్రశ్నలు. అసలు ఏ కాలంలోనైనా రష్యావాళ్ళతో అమెరికన్లకు వ్యక్తికి వ్యక్తి సంపర్కముంటే అమెరికన్లకెంతో లాభం. అదే లేకుండా చేస్తున్నారు అమెరికావారు!

కొన్నినెలలక్రితం అమెరికా పాయిలెవరో మాస్కోలో వ్యవసాయ ప్రదర్శనాన్ని ఏర్పాటుచేయ తలపెట్టినట్లూ, అందుకు రష్యావారు అంగీకరించినట్లూ నాతో ఒకరన్నారు. ప్రదర్శనం ఎక్కడపెట్టవలసిందీ, ఏమేమి ప్రదర్శించవలసిందీ, ప్రదర్శనాన్ని స్వయంపోషకం చేయడానికి ప్రవేశరుసుము ఎంత పెట్టవలసిందీ నిర్ణయించుకొనే స్వాతంత్ర్యం కూడా రష్యావారు ఇచ్చారు. కాని అమెరికా విదేశీ అధికార్లు

మొదట అట్టి ప్రదర్శనం ప్రైవేటు వ్యక్తుల ఆధ్వర్యాన గాక ప్రభుత్వ ఆధ్వర్యాన జరగాలన్నారు. ఆపిమ్మట చల్లగా జారుకున్నారు. అమ్మ పెట్టాపెట్టదు.........అన్న సామెతలా ఏ ప్రదర్శనమూ లేకుండానే పోయింది.

అమెరికన్లు ఈ ప్రపంచంలో దేనికి భయపడుతున్నారు? కమ్యూనిస్టు భావాలకూ అమెరికా భావాలకూ మధ్య జరిగే స్వేచ్ఛాయుతపోటీలో అమెరికన్లు ఓడిపోతారా? స్వాతంత్ర్య సంప్రదాయంలో పెరిగిన అమెరికనులు నిలువనీరై అప్రతిష్ఠపాలై పోయిన సిద్ధాంతం నీడన జీవించే రష్యనులతో తారసిల్లి పోటీపడి ఓడిపోతారా? ఎన్నటికీ ఓడరు.

రష్యా యువకులు సోవియట్ విధానాన్ని ప్రత్యక్షంగా చూచారు. సిద్ధాంతపు నినాదాలు, పదేపదే పల్లించే చిలుకపలుకులు వినివిని విసుగెత్తిపోయ్యారు. కొత్త ఏదైనా కావాలి వారికి.

రష్యావారు తమ కిష్టులైన 500 విద్యార్థులను ఎంపికచేసి అమెరికాకు పంపమనండి. అమెరికా విద్యార్థులను 500 మందిని సోవియట్ యూనియన్‌కు పంపుదాము. ఫలితమేమిటంటే—కమ్యూనిస్టు సిద్ధాంతానికి ముప్పం వస్తుంది.

అమెరికాకు వచ్చిన సోవియట్ విద్యార్థులు వారి దేశానికి తిరిగివెళ్ళేటప్పటికి కళ్ళు తెరుస్తారు. వారి ప్రభుత్వం చేస్తూన్న తప్పుడుప్రచారాన్ని గ్రహిస్తారు. స్వేచ్ఛాయుత వ్యవస్థల ప్రాభవాన్ని గమనిస్తారు. రష్యాకు వెళ్ళిన అమెరికా విద్యార్థులు మానవులపట్ల సానుభూతితో, రష్యా ప్రజలంటే చాలా ఇష్టంతో స్వదేశానికి మరలివస్తారు. దీనితోపాటు నియంతృత్వ ప్రభుత్వంక్రింద మానవ జీవితమెంత దుఃఖభాజనమవుతుందో, ప్రజాస్వామ్యవ్యవస్థలో ఎట్టి సదవకాశాలుంటాయో యువజనులకు తెలిపివస్తాయి.

కాని ఇలాంటి ప్రతిపాదనను సోవియట్ ప్రభుత్వం అంగీకరించదు. అది నాకు బాగా తెలుసు. అయినా అలాంటి ప్రతిపాదన అమెరికన్లుచేసి అమెరికన్ యువజనాళి ప్రదర్శించే ప్రజాస్వామ్యవాదాలను లోకానికి తెలియనివ్వాలి. ప్రజాస్వామ్యంపై అమెరికన్లకెట్టి నమ్మకముందో లోకానికి తెలుస్తుంది,

ఇతోధిక వైజ్ఞానిక సంపర్కాలు కావాలంటూ రష్యావారు మాస్కో రేడియోనుంచి కేకలువేస్తూ వుంటారు. ఈ సవాలు నెదుర్కొనే సమయ మాసన్నం కాలేదా?

# 42

## చైనా ఎలావుంది?

ఆహారోత్పత్తిని అధికంచేయాలని చైనాదేశం కమ్యూనుల విధానాన్ని ప్రవేశపెట్టింది. కాని ఆ విధానానికి 1959 లో ఎన్నో చిక్కులొచ్చాయి. శాటర్‌డే ఈవెనింగ్ పోస్టు (ఏప్రిలు 4, 1959) పత్రికలో ప్రచురితమైన ఈ వ్యాసంలో శ్రీ ఆల్సప్ సిడివిపై ఆ విధానం తెచ్చిపెట్టగల ప్రమాదాలనూ, కోట్లాది ప్రజలకు తిండి పెట్టడానికి చైనా పడుతున్న అవస్థల ప్రాముఖ్యాన్నీ విశదంచేశారు.

కమ్యూనిస్టు ఆర్థికసూత్రాలు రెండు తరాల కాలంలో రష్యాను ఆధునిక పారిశ్రామిక రాజ్యంగా చేశాయి. మరి ఆ సూత్రాలు ఆసియాలో తమలక్ష్యాన్ని సాధించగలవా? లేక ఆసియాలోని భిన్నపరిస్థితులదృష్ట్యా ఆసియా కమ్యూనిజం విఫలమవుతుందా?

ఈ ప్రశ్నను అమెరికన్ విధాననిర్ణేతలైన ఉభయ రాజకీయపక్షాలవారూ వెంటనే ఆలోచించాలి. దీనికి లభించే జవాబుపైనే రేపటి ప్రపంచం చాలావరకు ఆధారపడివుంటుంది.

చైనాకమ్యూనిస్టులు భీకరసమస్యల నెదుర్కొంటున్నారు. ఆ సమస్యలు వారి ఆర్థిక, రాజకీయ సిద్ధాంతాలను అగ్నిపరీక్షకు గురిచేస్తున్నవి.

సోవియట్‌రష్యాను ఆదర్శంగా పెట్టుకొని పీకింగ్‌ప్రభుత్వం తాను తల

పెట్టిన సత్వర పారిశ్రామికీకరణ పథకాన్ని అమలుజరుపుతూ పోయిందా, చైనా గ్రామీణ ఆర్థికవ్యవస్థపై అసాధ్యమైన భారాన్ని మోపినదవుతుంది. ఇప్పటికే చైనాగ్రామాలు 65 కోట్ల జనాభాకు తిండిపెట్టడమేగాక, అవసరమైన వస్తువులను ఇతరదేశాలనుంచి దిగుమతి చేసుకోవడానికి డబ్బు చెల్లించాలంటే మిగులు వ్యవసాయోత్పత్తులను లభింపజేయాలి.

చైనాప్రభుత్వం రైతులను సమాధానపరచి అధికాహారోత్పత్తిని ప్రోత్సహింప ప్రయత్నిస్తే, కమ్యూనిస్టు రాజకీయలక్ష్యాలను విడనాడవలసిన అగత్యం రావచ్చు. స్పష్టంగా చెప్పాలంటే ఇదే చైనాకు ముఖ్యసమస్య. ఈ డోలాయమానంలోపడి చైనా ఏమిచేయాలో తోచనిస్థితిలో వుంది.

రష్యాలో నంటే ఎంతో ప్రాణనష్టానికి సిద్ధమై జాతినంతటినీ ఒక కొత్త వ్యవస్థలోకి దించారు. అది రష్యాలోగాబట్టి సరిపోయింది. దానినే చైనాలో అమలుజరపాలంటే ఆ ప్రయత్నం విఫలమవుతుంది. కారణమేమంటే చైనా పరిస్థితులు వేరు. అక్కడి భూమి వేరు, ఆహారవిహారాదులు వేరు. ఆచారవ్యవహారాలు వేరు. ప్రజలు వేరు.

సోవియట్ యూనియన్ రెండు ఖండాలలో దాదాపు 10 వేల మైళ్ళ పొడువున వుంది. అమెరికాలో పడమటిప్రాంతంవలెనే రష్యాలో ఉరాల్ పర్వత పంక్తులకు ఆవలవున్న సువిశాలభూభాగం గడచిన 200 ఏండ్లనుంచి మాత్రమే ప్రజల రాకపోకలకు అందుబాటులోకి వచ్చింది. ఆ ప్రాంత మింకా చాలావరకు అభివృద్ధిజెందకుండానే వుంది.

కమ్యూనిస్టులు రాకపూర్వం రష్యాప్రజలకు ఆకలి అంటే ఏమిటో తెలియదు. ప్రథమప్రపంచయుద్ధం రాకముందు జారిస్టు రష్యా ప్రతియేటా 1 కోటి టన్నుల గోధుమలు ఎగుమతి చేస్తూవుండేది.

వ్యవసాయికంగా ఇటువంటి వనరులన్నీ వున్నప్పటికీ 1930 ప్రాంతాలలో రష్యాలో ఆహారంకొరత ఏర్పడి సోవియట్ రాజకీయప్రయోగం దాదాపు పతనం చెందే స్థితికివచ్చింది. సోవియట్ యూనియన్‌ను వేగంగా పరిశ్రమలమయం చేయాలంటే పరిశ్రమలలో పనిచేయడానికి నగరాలకు ఎంతోమంది తరలివస్తారు. నగరాలజనాభా విపరీతంగా పెరుగుతుంది. వారందరి తిండికై కొన్నివేల టన్నుల ధాన్యాలు పట్టణాలకు పంపవలసివుంటుందని స్టాలిన్ గ్రహించాడు.

కనుకనే లెనిన్ వాగ్దానంచేసిన స్వతంత్ర భూయాజమాన్యమునూ, రైతు కుటుంబాలకు అత్యధికావకాశాలనూ తుంగలోతొక్కి స్టాలిన్ ధైర్యంగా, పకడ్ బందీతో గ్రామీణరష్యాను కఠిన రాజకీయపద్ధతులప్రకారం సమీకరించ మొదలు పెట్టాడు.

'ఉత్పత్తిని అధికంచేయం'డని రైతులను ఇరవైయేళ్ళు బాధించారు. భయ పెట్టారు. దండోపాయం అవలంబించారు. క్షేత్రంలో వ్యవసాయోత్పత్తులకు తక్కువధరలు నిర్ణయించి, వాటికే ప్రభుత్వ చిల్లరదుకాణాలలో హెచ్చుధరలు నిర్ణయించి, అట్లా అధికలాభాలు గుంజారు. సత్వర పారిశ్రామికీకరణకై అధి కాహారోత్పత్తిని సాధించండని రైతులను వత్తిడిచేశారు. పీడించారు.

గ్రామీణాభివృద్ధిపై వారుపెట్టిన పెట్టుబడి తక్కువ. వినిమయ సరుకులు లేనేలేవు. సోవియట్‌యూనియన్ తన మిగులు ఆహారంపై అసిధారావ్రతంతో జీవించింది. ఆ మిగులుకూడా నానా పాట్లుపడి సాధించిన మిగులు. కమ్యూనిస్టులు సాధించిందికాదు. ప్రకృతి ప్రసాదించింది.

ఇలా వెర్రిగా జూదమాడారు. కాని చిత్రమేమిటంటే నిడివిపై ఇది ప్రయోజనకరమే అయింది. ప్రజలు అష్టకష్టాలుపడ్డారు. కూలిపడబొయ్యారు. అయినా స్టాలిన్ వజ్రసంకల్పంవల్లా, రష్యా నేల ఇవ్వగలిగిన సంపదవల్లా సోవియట్ప్రభుత్వం రెండు తరాలలోపలే శక్తివంతమైన పారిశ్రామిక రాజ్యాన్ని నిర్మింపగలిగింది.

ఇట్టి స్టాలిన్ కార్యక్రమాన్నే పీకింగ్‌ప్రభుత్వం చైనాకు అభివృద్ధి సాధనంగా స్వీకరించింది. కాని చైనాలోని క్లిష్టపరిస్థితుల దృష్ట్యా అచటిప్రభుత్వం దుస్సాహసం చేసి చరిత్రలో కనివిని ఎరుగనట్టి ఆర్థిక రాజకీయ జూదానికి దిగింది.

లెనిన్ వలెనే మావో కూడా రైతులకు గొప్ప వాగ్దానాలు చేసి అవి ప్రాతి పదికగా తన విప్లవాన్ని అమలుపరచదొడగినాడు. "భూస్వాములు నశింతురుగాక. దున్నేవాడికే భూమి" అన్న వినాదం లేవదీశాడు. కాని కాల మాసన్నమయ్యేసరికి స్టాలిన్ వలెనే మావో కూడా తన వాగ్దానాలను ప్రక్కకు నెట్టి, చైనా రైతులను ప్రైవేటు భూయాజమాన్యానికి తావులేని ఒకానొక ఆర్థిక రాజకీయ విధానంలోకి బలవంతంగా దింపాడు.

1957 వరకల్లా చైనాగ్రామీణ కుటుంబాలనన్నిటినీ 740,000 సాముదాయిక

కాపురాలుగా మార్చారు. 1958 లో మావో మరొక "పెద్ద అడుగు ముందుకు" వేశాడు. క్షేత్రసాముదాయిక కాపురాలనూ, గ్రామపారిశ్రామిక వర్గాలనూ, స్థానిక సైన్యాన్నీ కమ్యూనులన్న పేరుతో సంఘటితపరిచాడు. ఇది నిజంగా దారుణమైన పని. ఇందులో భార్య, భర్త, పిల్లలు, కుటుంబం అన్న దాక్షిణ్యం, విచక్షణ లేదు. నిర్దాక్షిణ్యంగా కమ్యూనుల నేర్పాటుచేశారు. ఇటువంటి సాహసానికి స్టాలిన్ కూడా ఒడిగట్టివుండేవాడు కాదేమో!

కాని పీకింగ్ ప్రభుత్వం కష్టాలపాలైంది. అయినా వారిపంథా మార్చుకుంటు న్నారని చెప్పవీలులేదు. కమ్యూనుల కార్యక్రమ లక్ష్యాలను ఎప్పటికప్పుడు పునరు ద్ఘాటిస్తూనే వున్నారు.

తమ ఈ ప్రయత్నాలు సఫలమయ్యేదీ లేక విఫలమయ్యేదీ తేలేది గ్రామాల లోనేనని కమ్యూనిస్టుచైనా నాయకులకు తెలుసు. వారి నెదుర్కొనే కష్టాలు పెద్దవే. అయినా ఇదిగో ఈ విషయంలో తమ సోవియట్ సహచరులకు అందిరాని అను భవం తమకు అందుతున్నదన్న సంతృప్తి వారికి వుంది.

రష్యా విప్లవాన్ని 200,000 మంది పార్టీసభ్యులు సాధించారు. వారిలో చాలామంది మేధావులు. పట్టణాలకు చెందిన కార్మికులు. మాస్కో, లెనిన్‌గ్రాడ్ నగరాలలో విప్లవం పతాకస్థాయికి చేరుకొనే తరుణంలో లెనిన్ "భూమి అంతా దున్నేవారికే" అన్న ప్రకటన చేసేసరికి రష్యా రైతులు కూడా ఆయనతో చేతులు కలిపారు. కాని తాముకూడా ఈ మహోద్యమంలో పూర్తి భాగస్వాములమన్న భావం రైతులకెన్నడూ రష్యా కమ్యూనిస్టు నాయకులు కలుగనివ్వలేదు.

కాని చైనావిప్లవం అలా కాదు. దాని వేళ్ళు గ్రామాలలో పాదుకొని వున్నవి. ఎర్రసైన్యం కదలిపోవడానికి నాందిగా గ్రామాలను 50 లక్షలమంది పార్టీసభ్యులు వ్యవస్థీకరించారు. ఇప్పుడు వారి సంఖ్య 1 కోటి 30 లక్షలైంది. వీరిలో చాలామంది రైతుకుటుంబాలవారే. ఇట్లా గ్రామప్రాతిపదికగల కమ్యూనిస్టు నాయకులు, ఉపనాయకులు సారథ్యం వహించడంవల్ల చైనాలోని 10 లక్షల గ్రామాలు రెండు దశాబ్దాలనుంచీ కమ్యూనిస్టు క్రమశిక్షణను అలవరచుకున్నవి.

ఈ పద్ధతులన్నింటితో విప్లవోన్ముఖమైన ఉత్సాహాన్ని నిలబెట్టవచ్చుననీ, తద్వారా చైనా ఈ అభివృద్ధిదశ తాలూకు కష్టాలనన్నిటినీ అధిగమించి సత్వర పారిశ్రామికీకరణకు అవసరమైన పెట్టుబడిని పొందవచ్చుననీ కమ్యూనిస్టు నాయ కుల విశ్వాసం.

ఒకప్పుడు చైనాప్రజలు కుటుంబసంబంధాలతో ప్రాచీన మతసూత్రాల ప్రకారం జీవనం గడపుతూవుండేవారు. ఇప్పుడు పార్టీ క్రమశిక్షణకు లోబడి ఆ రెంటినీ గోల్పోయి కేంద్రప్రభుత్వాధికారానికి విధేయులై వుంటూ దినబత్తెం పొందగలుగుతున్నారు.

పూర్వం సాంప్రదాయికమైన ప్రోత్సాహంతో జీవితావసరవస్తువులను అధికంగా తయారుచేసేవారు. ఇప్పుడు ఆ పనులకు బదులు జేగంటలతో, బాణాసంచాలతో, నాట్యాలతో విన్యాసాలతో "ప్రజలకు శత్రువులు" అని తామెంచినవారిని సామూహికంగా ఖండిస్తూ ఉత్సవాలు, సభలు జరుపుకుంటున్నారు.

దూరశ్రవణయంత్రాలతో, అధ్యయన సమావేశాలతో అధిక కృషికి పూనుకొండని ప్రజలను ప్రేరేపిస్తూ వుంటారు. బైటిదేశాలతో ఘర్షణ రావచ్చుననీ, అందుకు సిద్ధంగా వుండాలనీ చెబుతూవుంటారు. ఈ సందర్భంలో చైనా నాయకులు ముఖ్యంగా అమెరికాపై దుమ్మెత్తిపోస్తారు.

ప్రజలను ఇంతపెద్దపెట్టున సమీకరించినప్పటికీ, వాతావరణపరిస్థితి అనుకూలంగా వున్నప్పటికీ ఇతరదేశాలలో వలెనే చైనాలో కూడా ఆహారోత్పత్తి కార్యక్రమం కొన్ని వాస్తవాలను ఎదుర్కోవలసి వస్తున్నది. వాటిని కమ్యూనిస్టు నినాదాలు తొలగించలేవు. చైనా కృషి విజయవంతం కాకపోవడానికి ఆ దేశ జనాభా పెద్ద ప్రతిబంధకంగావుంది. చైనా జనాభా ఏడాదికి 1 కోటీ 60 లక్షల చొప్పున పెరుగుతూ వుంది. నేల తక్కువ. అందుచేత జనసమ్మర్దం హెచ్చుతున్నది.

ఇప్పుడు ఒక్కొక్క కుటుంబానికి సగటున రెండెకరాలకు లోపే భూమి వుంది. పడమటిదిక్కున కొన్నిప్రాంతాలలో తప్ప చైనాలో సేద్యయోగ్యమైన భూమి అంతా సాంద్రతర వ్యవసాయంక్రిందవుంది. పడమటకూడా చాలా డబ్బు ఖర్చుపెడితే కొత్తభూములను సాగుకు తేవచ్చు.

చైనాప్రజలు ఇప్పటికే వరి, గోధుమ, కాయగూరలపై ఆధారపడి జీవిస్తున్నారు. స్టాలిన్ చేసినట్లు పశువులకు తక్కువపెట్టి ధాన్యం మిగిలించాలంటే వల్లకాకుండావుంది. ఇప్పటికే ఎకరా ఉత్పత్తి అధికంగావుంది. చైనా కమ్యూనిజం పాలబడటానికి ఎంతో పూర్వమే అచటిరైతులు మంచి విత్తనాలు, ప్రకృతిసిద్ధమైన ఎరువులు వాడుతూవుండేవారు. అభివృద్ధిచెందని ఇతరదేశాలకన్న చైనాలోనే పైరుపెట్టుపద్ధతులు, కోతలవిధానం మెరుగుగావుండేవి.

జపానులో ఎకరా ఉత్పత్తి చైనాకంటె రెండురెట్లు అధికంగావుంది, కాని చైనా ఇంతత్వరలో జపాను ఉత్పత్తిస్థాయిని అందుకోలేదు.

చైనా గ్రామీణ ఆర్థికవ్యవస్థలోని కఠోర ఆర్థిక సాంఘిక వాస్తవాలివి. మరి పీకింగ్ప్రభుత్వం తనపరిశ్రమలను త్వరితగతిని వృద్ధిచేస్తున్నట్లు బడాయిలు చెప్పుకుంటున్నది. అమెరికన్లు ఈ బడాయిలను, అసలు నిజాలను కలిపి క్షీరనీర న్యాయంతో వివేచనచేయాలి.

# 43

## 'చైనా సమస్య' పునఃపరిశీలన

చైనా సమస్యనూ, కమ్యూనిస్టుచైనా విషయంలో జాతీయచైనా విషయంలో అమెరికా అనుసరిస్తూవున్న విధానాన్ని శ్రీ డొల్స్ 1960 ఏప్రిలునెల "ఫారిన్ ఎఫేర్స్" కు వ్రాసిన ఈ వ్యాసంలో విశ్లేషణచేస్తూ అమెరికా అవలంబించవలసిన వైఖరిని స్థూలంగా వివరించారు. ఈ అభిప్రాయాలను అటు మావ్‌సేటుంగ్, ఇటు తైవాన్‌లోని జాతీయ చైనానాయకులు విమర్శించారు.

చైనా సమస్యయొక్క ముఖ్యవాస్తవాలను గమనించవలసిన సమయ మాసన్నమైంది. వాటిని గమనించనంతవరకూ ఆసియాతో అమెరికా సంబంధాలు ఏవో ప్రతికూలతలను ఎదుర్కొంటూనే వుంటాయి.

ప్రస్తుత పరిస్థితులలో కమ్యూనిస్టు చైనాను అమెరికా పరిగణించవలెనన్న అంశంపై జరిగే చర్చ అరణ్యరోదనంగానే వుంది. పోనీ రాయబారులను నియమించుకుందామని అమెరికన్లు ప్రతిపాదనచేస్తే ఫార్మోజా రాష్ట్రంపై కమ్యూనిస్టుచైనా సర్వసత్తాక అధికారాన్ని అమెరికా గుర్తించినట్లేనా అని మావ్‌సేటుంగ్ ప్రశ్నిస్తాడు. గుర్తించినట్లు కాదని మనం సమాధానం చెప్పామా మన ప్రతిపాదనను అతగాడు కోపంతో, ద్వేషంతో, అలక్ష్యంగా తిరస్కరిస్తాడు. సరే, రెండు చైనాలకూ సమితిలో సభ్యత్వ మివ్వాలని ప్రతిపాదించామా, దానికీ అదేగతి పట్టుతుంది. అట్టి ప్రతిపాదనను చాంగ్‌కైషేక్ కూడా తిరస్కరిస్తాడు. ప్రతిష్టంభన యథాతథంగా వుంటుంది.

దీని అర్థమేమిటంటే అక్కడ అమెరికాలో తీవ్ర అభిప్రాయభేదాలు కలుగజేసిన రెండు సమస్యలూ పరిష్కరింపదగ్గవిగా లేవన్నమాట. మరికొంతకాలం

పొయ్యాక, వాస్తవ స్థితిని ఉభయపక్షాలవారూ ఆమోదించి ఒక ఒడంబడికకు రావడం మంచిదనీ, లేకపోతే యుద్ధంతప్ప మరొక సాధనంతో వాస్తవ స్థితిని మార్చడం సాధ్యంకాదనీ చైనాకొరకు ప్రతిపాదనచేసి, అది శాంతియుతంగా సమస్య లను పరిష్కరించుకొనగోరుతుందా లేదా పరీక్షించి తేల్చుకోవచ్చు. అందాకా లాంఛనప్రాయమైన సంబంధాల సమస్యను ప్రక్కకుపెట్టి, వెంటనే పరిశీలించ వలసిన అంశాలనూ, సాధించవీలయ్యేవాటినీ గమనించాలి.

కమ్యూనిస్టుచైనాపై కొత్తపరిశీలనలు చేయనవసరంలేదని అనుకోకూడదు. ఒక్క నిరాయుధీకరణ చాలదా? చాలా ముఖ్యాంశం కదా! చైనా పాల్గొననిదే ఎట్టి నిరాయుధీకరణ పథకమైనా అర్థరహితమే అవుతుంది. చైనాకు ప్రపంచం మొత్తంపై పెద్ద సైన్యం వుంది. అంతేగాక అణ్వస్త్రాలను తయారుచేసే తాహతు దానికి వుంది. పైగా ఈ విషయంలో చైనా చేసే పనులకు రష్యా పూచీ పడవలె నని అడిగే ఆస్కారం కూడా లేదు. చైనా ఏదో చేస్తే రష్యా ఎలా జవాబుదారు అవుతుంది? ప్రపంచవ్యాప్త నిరాయుధీకరణవిషయంలో తగురక్షణలుగల ఒక విధానంగూర్చి ఒడంబడిక చేసుకొనే ఆలోచననైనా అమెరికన్లు విరమించుకోవాలి. లేదా చైనా రంగస్థలంపై జరగబొయ్యే సంఘటనలపై అమెరికా ప్రభావం పడేట్టు చూడాలి.

కమ్యూనిస్టుచైనాలో జరిగే సాధారణ విషయాలపై అమెరికా ప్రభావం వుండ దేమో. కాని చైనా సమస్యను ప్రభావితం చేసే యోగ్యత, స్తోమత అమెరికన్ల కున్నాయి. కాని వారి స్తోమతను వారు గుర్తించడంలేదు.

ఫార్మోజా సంగతి చూడండి. ఈ ద్వీపం సుసంపన్నమైంది. సారవంత మైంది. దీని ఆర్థికాభివృద్ధి అద్భుతంగా జరిగింది. కాని దాని రాజకీయ స్థితిమాత్రం ఏనాడు ఏమిజరుగుతుందో అన్నట్లుగా వుంది. ఫార్మోజా ఒక్క కమ్యూనిస్టుచైనా విషయకంగానే కాక ఇండియా మొదలు జపానువరకు గల స్వతంత్ర ఆసియాతో సంబంధాల విషయంలో కూడా ప్రమాదావస్థలో వుంది.

ఎందువల్లనంటే అసలు ఫార్మోజా రాజకీయ హోదా ఒక అభూత కల్పన. పదకొండేండ్లక్రితం చాంగ్‌కై షేక్ చైనా ప్రధాన భూభాగంనుంచి తరిమివేయ బడ్డాడు. అలాంటివాడు ఇప్పటికీ 65 కోట్ల చైనీయులకు పాలకుడుగా వున్నాడు! ఇది వట్టి అభూతకల్పన అని చాలామంది ఆసియావాసులు, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక మిత్రులు,అమెరికన్లకు సన్నిహితులైన కెనెడియనులు,చాలామంది అమెరి

కనులు గ్రహించారు. అయితే మూడో నాలుగో ఆసియా ప్రభుత్వాలు మాత్రం వాషింగ్టన్ వత్తిడివల్లా, అమెరికా విదేశాంగశాఖ వత్తిడివల్లా, కొందరు కాంగ్రెసు సభ్యుల ప్రోద్బలంవల్లా ఫార్మోజాను సమర్థిస్తున్నాయి. ఈ కల్పనను శాశ్వతం చేస్తే ఫార్మోజా ఇతర ఆసియాదేశాలకు మరింత దూరమవుతుంది. ఇది మంచిది కాదు. ఫార్మోజా భవిష్యత్తు స్వతంత్ర, కమ్యూనిస్టేతర ఆసియాతో ముడిపడి వుంది. ఫార్మోజా నాయకులు మనసావాచాకర్మణా స్వతంత్ర ఆసియాతో సంబంధాలు పెట్టుకోవలసిన ఈ సమయంలో ఫార్మోజా వేరుపాటు ధోరణి అభిలషణీయంకాదు.

అమెరికనులు, జాతీయ చైనాప్రజలు తమ మిత్రులతో ఏయే ఉభయ సామాన్యాంశాలపై సఖ్యత కూర్చుకోవచ్చో పరిశీలించాలి. పచ్చేదశాబ్దిలో ఆసియా వ్యవహారాలకు రూపమిచ్చే శక్తులతో కలిసి తమ విధానాలను నిర్ణయించుకోవాలి. అట్టి విధానాలు ఈ దిగువ యథార్థాంశాలపై ఆధారపడినవి కావాలి:

1. పీకింగ్ ప్రభుత్వం కొన్నిచిక్కులలో తగుల్కొనివున్నప్పటికీ చైనా ప్రధాన భూభాగంపై దానికే గట్టి అదుపు వుంది. అక్కడిప్రభుత్వం మరొకరిదికాదు.

2. చైనా ప్రధానభూభాగంలో సాధనసంపత్తులు చాలినన్ని లేకపోయినప్పటికీ, జనాభా నానాటికీ పెరుగుతున్నప్పటికీ, దయాదాక్షిణ్యాలులేని కమ్యూనిస్టు నాయకత్వంక్రింద అదివున్నప్పటికీ, వారికి జాతీయతత్వం జాస్తి అయినప్పటికీ అది కొద్దికాలంలోనే దక్షిణపువైపుగావున్న బలహీన రాజ్యాలపై భీకర విస్తరణ ధోరణిని అవలంబిస్తుంది.

3. చైనా కమ్యూనిస్టునాయకులు ఆగ్నేయాసియాలో సాయుధజోక్యంతో రాజ్యవిస్తరణకు పూనుకోవచ్చు. అట్టిచర్యలను నిరోధించడమే అమెరికన్ విధానం ముఖ్యలక్ష్యం కావాలి.

4. ఎట్టి నిరాయుధీకరణ కార్యక్రమమైనా ప్రయోజనకరం కావాలంటే చైనా అందులో పాల్గొనాలి.

5. ప్రస్తుత పరిస్థితులలో పీకింగ్‌తో అమెరికా విభేదాలనుగూర్చి సంప్రదింపులు జరిపినందువల్ల ప్రయోజనమేమీవుండదు.

6. 80 లక్షల ఫార్మోజావాసులకూ, చైనా ప్రధాన భూభాగంనుంచి తరలి

వచ్చి ఫార్మోజాలో నివాస మేర్పరచుకున్న 20 లక్షలమంది చైనీయులకూ స్వతంత్రంగా వుండే హక్కు వుంది. వారు కమ్యూనిస్టులతో కలిసిపోనక్కరలేదు. ఇతరదేశాలతో వైజ్ఞానికసంబంధాలు పెట్టుకోవచ్చు. ఫార్మోజాలో ఇట్టి పరిణామాలు రావడం అమెరికాప్రజలకే మేలు.

7. ప్రస్తుతానికి ఫార్మోజాస్వాతంత్ర్యం అమెరికా సైనికహామీలపైనా, ఆర్థికసహాయంపైనా ఆధారపడివుంటుంది.

8. దీర్ఘకాలంపై చూస్తే ఫార్మోజాప్రజల భద్రత, భాగ్యము ఆసియాలోని కమ్యూనిస్టేతరదేశాల సక్రమరాజకీయ పెరుగుదలపైన, ముఖ్యంగా భారత జపాను దేశాల ప్రగతిపైన, ఫార్మోజాప్రభుత్వంపట్ల అవిచూపే వైఖరిపైనా ఆధారపడి వుంటాయి.

9. ఎప్పటికైనా సాధ్యమైనట్లయితే ప్రధాన భూభాగంపై నివసించే చైనాప్రజలతో సంప్రదాయసిద్ధంగా వారికున్నట్టి స్నేహసంబంధాలను పునః స్థాపించుకోగలిగితే, అది అమెరికన్ జాతికే శ్రేయస్కరం.

ఈ భావనలదృష్ట్యా అమెరికావిధానం ఎట్టి యథార్థాల నెదుర్కోవలసి వస్తుందో పరిశీలిద్దాము.

* * *

ఈనాడు ఫార్మోజాలో రాజకీయాధికారం చాంగ్‌కైషేక్ నియంతృత్వ జాతీయచైనా ప్రభుత్వం చేతుల్లో వుంది. చాంగ్‌తోపాటు 1949 లో 20 లక్షల మంది ప్రధాన భూభాగవాసులు ఫార్మోజాకు తరలిపోయ్యారు. వీరిలో చాలామంది కేంద్రప్రభుత్వోద్యోగులుగా వున్నారు. ఫార్మోజాకుగల 600,000 మంది సైన్యంలో మూడింట రెండువంతులమంది ఇలా తరలివచ్చినవారే. ఫార్మోజావిషయంలో అమెరికావిధానం ఒకదశాబ్దివరకూ జాతీయచైనా అల్పసంఖ్యాక పాలకవర్గంపై కేంద్రీకృతమైవుంది. కాని నిడివిపై చూస్తే 80 లక్షల ఫార్మోజావాసులే ఆ ద్వీపం భవిష్యత్తును నిర్ణయిస్తారు. దేశవాళీప్రజలు వారేకదా! వారి ఆశలు, ఆశయాలు, ఆందోళనలు ఏమిటో అమెరికన్లకు తెలియవు. వారిలో ఒకరు * ఇటీవల 'ఫారిన్

---

* లీతియాంగ్‌హాక్. "చైనా ప్రతిష్టంభన: ఒక ఫార్మోజావాసి అభిప్రాయం." 'ఫారిన్ ఎఫేర్స్' పత్రిక-ఏప్రిలు, 1959.

ఎఫేర్స్' పత్రికలో వ్రాస్తూ ఫార్మోజాలో స్వతంత్రంగా వ్రాసే వార్తాపత్రికలు లేవనీ, గుర్తింపబడ్డ రాజకీయపార్టీలు లేవనీ అన్నారు.

1945 కు పూర్వం రమారమి రెండు తరాలవరకూ ఫార్మోజావాసులకు జపాను పరిపాలనమాత్రమే తెలుసు. ఫార్మోజా ప్రజలలో చాలామంది ఆగ్నేయ చైనాకు చెందిన ఫుకీన్ భాషే మాట్లాడినప్పటికీ వీరు చదువుకున్నది జపాన్ పాఠశాలల్లో. ఫార్మోజా ద్వీపం సంపత్సమృద్ధులతో తులదూగడంచేత ప్రజలు చైనా ప్రధాన భూభాగానికన్న టోక్యోకు సన్నిహితులైనారు. అయితే పదిహేనేండ్ల జాతీయపాలన ముఖ్యమైన మార్పులనెన్నిటినో తెచ్చింది. కాలం, సామీప్యము, విద్య మొదలైనవి ఈ ద్వీపంలోవున్న చైనీయులనూ, దేశవాళీ ఫార్మోజావాసులనూ క్రమేణా కలిపివేస్తూన్నది. ముఖ్యంగా యువజనంలో ఈ మేళవింపు కనిపిస్తున్నది. బహుశా మెల్లమెల్లగా ఒక కొత్త జాతీయస్వరూపం ఏర్పడవచ్చునేమో. దీని సంస్కృతి ప్రధానంగా చీనా సంస్కృతియే అవుతుంది. కాని దృక్పథం మాత్రం ఫార్మోజావారి దృక్పథమవుతుంది.

1949 నుంచి జాతీయప్రభుత్వం ఎన్నో నిర్మాణాత్మక చర్యలు గైకొన్నది. చైనా ప్రధాన భూభాగంపై వున్నప్పుడు ఈ ప్రభుత్వం అట్టిచర్యలు గైకొనలేకపోయింది. ఆ చర్యలలో ముఖ్యమైనది గ్రామీణుల ప్రాముఖ్యాన్ని గుర్తించడం. తక్కిన ఆసియాదేశాలలో వలెనే ఫార్మోజాలో కూడా జనాభాలో అధికసంఖ్యాకులు గ్రామీణులే. వారే ఆహారం సరఫరాచేస్తారు. సక్రమాభివృద్ధికి ఆర్థికంగా, రాజకీయంగా అసలు కీలకం వారిచేతుల్లోనే వుంది.

చాంగ్‌నాయకత్వంక్రింద భూసంస్కరణల కార్యక్రమం అమలుజరుపబడింది. పదిఎకరాలకు మించి ఎవరికీ భూమి వుండరాదన్నారు. దీనికితోడు కౌళ్ళను తగ్గించారు. గ్రామవిస్తరణ పథకాలు అమలుజరిపారు. సులభంగా అప్పులు లభించే ఏర్పాటుచేశారు. రసాయనిక ఎరువుల పరిశ్రమను వృద్ధిచేశారు. ఈ చర్యల ఫలితంగా వరి, ప్రత్తిపంటల ఎకరా దిగుబడి హెచ్చింది. రైతులు సంపన్నులయ్యారు. ఈనాడు ఫార్మోజాలో ప్రజల జీవన వ్యయప్రమాణం ఆసియాలో రెండవస్థానమాక్రమిస్తున్నది. జపాను తర్వాత ఫార్మోజాలోనే ప్రజలు హెచ్చుగా సంపాదించి హెచ్చుగా జీవితావసరాలకు ఖర్చుపెట్టగలిగిన స్థితిలో వున్నారు.

ఫార్మోజా అంతరంగిక రాజకీయ పరిస్థితి కూడా మెరుగైంది. యథార్థం చెప్పాలంటే జాతీయప్రభుత్వం ఇప్పటికీ చైనా ప్రధాన భూభాగంనుంచి వచ్చిన

వారిచేతనే నడుపబడుతున్నది. ఫార్మోజా అసెంబ్లీలో 1576 మంది సభ్యులున్నారు. వీరిలో 26 మంది మాత్రమే ఫార్మోజావాసులు. అయినా ఫార్మోజావాసులు ప్రజాస్వామ్యంలో పాల్గొనడం మునుపటికంటె కొంత నయమని చెప్పాలి. రాష్ట్ర అసెంబ్లీలలో, స్థానిక సంస్థలలో ఒకమాదిరి స్వేచ్ఛాయుత ఎన్నికలు జరిగి, ఫార్మోజావాసులే అధికసంఖ్యాక సభ్యులుగా వున్నారు. చాలా పట్టణాల మేయర్లు దేశవాళీ ఫార్మోజా వాసులే.

ఓటమిలో, గెలుపులో చాంగ్‌కై షేక్ ఒక్కడే ముప్పైసంవత్సరాలకు పైగా కూమింటాంగ్ ఛిన్నాభిన్నంకాకుండా నిర్వహించుకు వస్తున్నాడు. కాని ఎల్ల కాలం అతడే పాలించలేడు. ఫార్మోజా భవిష్యత్తు దాని ప్రభుత్వ సుస్థిరత్వంపై ఆధారపడివుంటుంది. చాంగ్‌కై షేక్ రంగంలో లేకుండాపోయినా ప్రభుత్వం మాత్రం నిలుస్తుంది.

తూర్పుఆసియాలో అమెరికా చాలినంత సముద్ర, వైమానికబలగాన్నివుంచి అవసరమైతే దాని నుపయోగించ సిద్ధంగా వున్నంతవరకూ ఫార్మోజాపై తన ఆధిపత్యాన్ని నెలకొల్పాలంటే మావ్‌సేటుంగ్‌కు ఒకేఒక మార్గం వుంది: అది ఏమిటంటే—ఫార్మోజాలో సైనిక తిరుగుబాటుద్వారా అచటి ప్రభుత్వాన్ని పడగొట్టి, చాంగ్‌నుగాని, లేక అతనితర్వాత రాజ్యాధిపతి అయినవాణ్ణిగాని పదవీభ్రష్టుణ్ణి చేసి పీకింగ్‌తో సమాధానపడే ప్రభుత్వాన్ని ఆ ద్వీపంలో ఏర్పాటుచేయడం.

చైనా ప్రధాన భూభాగంపై నియంతృత్వశక్తులు లెనిన్ - స్టాలిన్ - మావో విధానాలప్రకారం చీనా సమాజానికి కొత్తరూపమిస్తున్నాయి. చీనావారి ఆలోచనలను, భావాలను మార్చివేస్తున్నాయి. అసలు చీనా చరిత్రనే తిరిగి వ్రాస్తున్నాయి.

స్వతంత్ర చీనా—ఫార్మోజా జాతి ప్రవర్ధమానమైందంటే ఆధునిక కమ్యూనిస్టేతర సమాజానికీ, కమ్యూనిస్టుచీనా సమాజానికీ వుండే వ్యత్యాసాన్ని బహు చక్కగా చూపెట్టగలుగుతుంది. కమ్యూనిస్టేతర చీనా—ఫార్మోజా సమాజంలో జనబాహుళ్యాన్ని వర్గీకరించి నిర్బంధపెట్టడమనేది వుండదు. హెచ్చుగా రాజకీయ స్వాతంత్ర్యం వుంటుంది. పౌరులందరికీ ఆర్థిక అవకాశాలు అధికంగా వుంటాయి. అట్టి సమాజనిర్మాణంలో చీనా—తైవాన్ యువతరంవారు ఒకవిధమైన ఉభయ సామాన్యలక్ష్యాన్ని చూడగలుగుతారు. అంతేగాక విదేశాలలోవున్న 1 కోటి 30 లక్షల చీనావారికి వైజ్ఞానిక ప్రాతిపదికలను లభింపజేయగలుగుతారు.

* * *

మరి ఇట్టి పర్యవసానం కలుగవలెనంటే అమెరికా విధానాన్ని సరిదిద్దడ మెలా ?

కమ్యూనిస్టేతర ఆసియాలో ఫార్మోజా తగుపాత్ర నిర్వహించాలంటే, దాన్ని అమెరికన్ విధాన నిర్ణేతలు సాధించలేరు. ఎంత సద్భావమున్నా, ఎన్నికోట్ల డాలర్లు వెచ్చించినా ఇది సాధ్యపడదు. చైనా ప్రధాన భూభాగంనుంచి తరలి వచ్చిన జాతీయశరణార్థులు అధికసంఖ్యాకులైన ఫార్మోజావాసులపై తమ అభి ప్రాయాలను నిరంకుశంగా రుద్దలేరు. అమెరికా ముఖ్యలక్ష్యం తాను చైనా ప్రధాన భూభాగంపై దండెత్తడానికి ఫార్మోజాను సైనికస్థావరంగా తయారు చేయడం కాదనీ, ఫార్మోజాలో ఒకకొత్త స్వతంత్రజాతి క్రమబద్ధంగా వృద్ధి చెందేటట్టు చేయడమే అమెరికా ఉద్దేశమనీ దేశవాళీ ఫార్మోజావాసులకూ, జాతీయ చైనావారికీ, తక్కిన ప్రపంచానికీ నచ్చజెప్పాలి.

అమెరికా ప్రస్తుతవిధానం మరొకవిధంగా అర్థంచేసుకోబడుతున్నది. జాతీయ చైనాప్రభుత్వం చైనా ప్రధాన భూభాగంపై దండెత్తడం తథ్యమనీ, ఇందుకు అమెరికా మద్దతుగావున్నదనీ అంతా అనుకుంటున్నారు. ఇది వట్టిమిథ్య. అయినా దీనినేనమ్మి పీకింగ్‌వారు ఎదురుదెబ్బగా శత్రుచర్యలకు పాల్పడుతున్నారు. అందుచేత చైనా తీరానికి దగ్గిరలోవున్న దీవులు తటస్థంగా వుండేట్టు అమెరికన్లు ప్రోత్సహించాలి.

మరొకపంక్తి ఫార్మోజాపై కమ్యూనిస్టుదాడి జరిగేపక్షంలో సర్వవిధాలా సైనికసహాయం చేస్తామని వారికి నమ్మజెప్పాలి. సైనిక తిరుగుబాటు తెచ్చి ప్రభు త్వాన్ని పడగొట్టేప్రయత్నం జరిగితే దాన్నికూడా నిరోధిస్తామని ఫార్మోజావారికి అభయమివ్వాలి. సైనిక తిరుగుబాటే జరిగేపక్షంలో అమెరికన్లు ఆర్థిక, నౌకా దిగ్బంధనం వెంటనే జరిపి పీకింగ్ ప్రభుత్వం ఫార్మోజాను ఆక్రమించకుండా చేయాలి.

ఫార్మోజా ఒక స్వతంత్రదేశంగా ఐక్యరాజ్యసమితిలో అంగీకరింపబడి స్థానంపొందడానికి కొంతకాలం పట్టవచ్చు. కాని అదే జరిగిందంటే దానిభద్రతకు సమితి పూర్తి పూచీపడివుంటుంది. ఈలోపల ఈ ద్వీపాన్ని రక్షిస్తామని అమె రికన్లు ఇచ్చినమాటను నిలబెట్టుకోవాలి. ఈవిషయంలో సంశయాని కేమాత్రం తావివ్వరాదు. పశ్చిమ బెర్లిన్ ప్రజలను అమెరికన్లు విడిచిపెట్టలేనట్లే ఫార్మోజా ప్రజలనుకూడా విడనాడలేరు.

ప్రపంచమంతటా వున్న కమ్యూనిస్టేతర చైనీయులకు ఫార్మోజా ముఖ్య వైజ్ఞానిక కేంద్రంగా పెంపొందేట్టు అమెరికావిధానం, అమెరికా డబ్బు తోడ్పడాలి. ఇందుకై అమెరికా ప్రభుత్వంనుంచీ, ప్రైవేటు అమెరికన్ సంస్థలనుంచీ ఫార్మోజా కాలేజీలకు సహాయంఅందాలి. విదేశాలలో నివసించే చైనీయులు ఫార్మోజాను గూర్చి అధ్యయనంచేయడానికీ, అలాగే చైనావారూ, ఫార్మోజావారూ అమెరికాలో ఉన్నతవిద్య నభ్యసించడానికీ ఉపకారవేతనాలు అధికంగాఇవ్వాలి.

అల్లే ప్రతిభగల అమెరికన్ విద్యార్థులు ఫార్మోజాలోని విద్యాసంస్థలలో, చీనా సంస్కృతినిగూర్చి అధ్యయనం చేయడానికి ఫెలోషిప్పులు ఇస్తే ఒక కొత్త సౌభ్రాత్రభావం, భాగస్వామిత్వం ఏర్పడతాయి. చీనావారికీ అమెరికన్లకూ ఎంతకాలంగానో సంబంధమున్నప్పటికీ, చాలామంది అమెరికనులకు చైనాచరిత్ర, చైనా సంస్కృతి బొత్తిగా తెలియవు.

జాతీయచైనాప్రభుత్వం ఆసియాలోని కమ్యూనిస్టేతర చైనీయులపట్ల వాస్తవికదృక్పథ మేర్పరచుకొని వ్యవహరించేట్టు ప్రోత్సహించాలి. ఒకస్వతంత్ర జాతిగా, ఒక స్వతంత్ర దేశంగా ఫార్మోజా భవిష్యత్తు స్వతంత్ర ఆసియా భవిష్యత్తుతో, ముఖ్యంగా భౌగోళికంగా, రాజకీయంగా రెండు గొప్ప లంగరులైన భారత, జపాన్‌దేశాలతో ముడిపడివుంటుంది.

* * *

ఇక రెండవచైనా సంగతేమిటి? అంటే చైనా ప్రధాన భూభాగంమాట. అక్కడ అమెరికన్లు నిర్మాణాత్మకంగా చేయగలిగింది తక్కువ.

ఈనాడు చైనా కమ్యూనిస్టుప్రభుత్వం తన 65 కోట్ల ప్రజలను పారిశ్రామిక యుగంలో ప్రవేశపెట్టడానికి బ్రహ్మాండమైన ప్రయత్నం చేస్తూవుంది. కాని దానికి గల వనర్లు, సాధనాలు చాలాతక్కువ. ఈ ప్రయోగంవల్ల మూడు ఫలితాలు కలుగవచ్చు.

ఒకటి—తమస్థితి కఠినమైన ఆర్థిక పరిమితులకు లోబడివుందన్న సంగతి గ్రహించి, చైనా కమ్యూనిస్టులు తమవిధానాలను క్రమేణా మార్చుకోవచ్చు. తాము పెట్టుకున్న లక్ష్యాలను కొంతతగ్గించుకొని శాంతియుతంగా విదేశాలతో వ్యాపారానికి దిగడంద్వారా తమ ఆహారకొరతను, ఇతరవస్తువుల కొరతను తీర్చుకోవచ్చు. అయితే వారిలో ప్రస్తుతం కన్పించే ఉద్ధృతమైన కమ్యూనిస్టు సిద్ధాంత తత్వాన్నిబట్టిచూస్తే, ఇది అద్యతనభావిలో జరిగేటట్టు లేదు.

రెండు—నానాటికీ పెరిగిపోతూవున్న తమజనాభాలో కొంతమందికి చైనా సరిహద్దుపైగల సోవియట్ యూనియన్ సువిశాలప్రాంతాలలో పునరావాసం కల్పిస్తారేమో. కాని అవి ఆసియాకు మరీ లోతట్టుప్రాంతాలు. శీతోష్ణస్థితి సమమైనదికాదు. ఫలానాకాలంలో ఫలానావిధంగా వుంటుందని నిశ్చయంగా చెప్పలేము. అట్టిచోట్ల పునరావాసం సులభంకాదు. పైగా చైనాజనాభాకు తమ సరిహద్దులపై పునరావాసం కల్పించడానికి సోవియట్ యూనియన్ ఎట్టి షరతులపై అంగీకరిస్తుందో ఊహించలేము.

మూడు—ఇకమిగిలితే చైనా ఆగ్నేయాసియాలోకి విస్తరించి చొచ్చుకుపోవడం. ఆగ్నేయాసియాలోని గ్రామసీమలలో జనాభాతక్కువ. ఆహారం సమృద్ధిగా లభిస్తుంది. అంతేగాక నూనె, తగరము, రబ్బరు, ఇతర ప్రకృతిసంపద అపారంగావుంది. వీటికోసం చైనా మొహంవాచివుంది. ఎలాగైనా వాటిని సంపాదింపజూస్తుంది. కనుక అట్టిప్రయత్నం జరగకుండా అమెరికన్లు సైనిక, రాజకీయ, ఆర్థిక ఆటంకాలు కల్పించాలి.

అంతేకాని అణ్వస్త్రయుద్ధం చేస్తామని అమెరికన్లు బెదిరిస్తూపోతే ఆసియాలోని కమ్యూనిస్టేతరదేశాలు మరీ బెదిరిపోతాయి. అగ్నికి ఆజ్యంపోసినట్లు కయ్యానికి కాలుసాచే చీనా అహంభావ జాతీయవాదం మరింత పేట్రేగిపోతుంది. అయితే చైనా దాడినుంచి ఆగ్నేయాసియాను రక్షిస్తామని అమెరికన్లు చేసిన వాగ్దానాన్ని మంచిమాటలతో దౌత్యవర్గాలద్వారా స్పష్టపరచాలి. చైనాగనుక దక్షిణంవైపు అతిక్రమణకు దిగిందంటే ఐక్యరాజ్యసమితి ధర్మసూత్ర ప్రణాళికలో ప్రస్తుతమున్న పూచీలు రంగంలోకివస్తాయి. ఫార్మోజాపై దాడిసంగతివేరు.

చివరకు దక్షిణఆసియా, ఆగ్నేయాసియాలలోని కమ్యూనిస్టేతరదేశాల భవితవ్యం రెండు అంశములచే నిర్ధారణ అవుతుంది. అవికూడా పరోక్షప్రభావం మాత్రమే వేయగలవి. ఈ దేశాలు ఆర్థికంగా, రాజకీయంగా స్థిరత్వాన్ని సంపాదించి తమ సార్వభౌమత్వాధికారంపై ఎట్టి ఉల్లంఘన జరిగినా దానిని వ్యతిరేకించేందుకు సిద్ధపడటం ఒకటి. రెండవది-ఈ ప్రాంతంలో రెండు పెద్ద దేశాలైన భారత పాకిస్తానులు తమబలాన్ని చైనా దురాక్రమణను నిరోధించడానికి సమీకరించడం.

అమెరికన్లు వివేకంతో వ్యవహరించారంటే ఈ పర్యవసానాన్ని సాధించవచ్చు. సైనికంగా అమెరికన్లు నిశ్చబ్దంగా ఎట్టి అవాంతర స్థితినైనా ఎదుర్కోవ

డానికి సర్వసన్నద్ధులై వుండాలి. అమెరికన్లు తటస్థంగావున్న పంధొమ్మిదవ శతాబ్దిలో బ్రిటిషు నౌకాదళం మన్రో సిద్ధాంతానికి ఒకఅర్థం కల్పించినట్లే అమెరికన్లు కూడా వ్యవహరించాలి. స్వయంసహాయానికి పూనుకొనే వాంఛ, స్తోమత కలిగివుండి, ముడిసరుకుల విషయంలో ఉత్పత్తిదారులకు సరసమైనధరలు లభింపజేసే కార్యక్రమాలను అమలుజరుపగల దేశాలకు అమెరికా ఆర్థికసహాయం హెచ్చు ప్రాధాన్యంతో జరగాలి.

ఆసియాలో అమెరికా సముచితపాత్రను నిర్వహించేశక్తి అమెరికాకువుంది. అయితే అందుకుతగ్గ యుక్తి, సూక్ష్మబుద్ధి, నేర్పు, పట్టువిడుపులు అమెరికన్లకున్నాయా అన్నదే ముఖ్యప్రశ్న. అమెరికా సిద్ధాంతాలు, భావాలు కాసేపు ఆపలవుంచి చీనా రష్యా సంబంధాల స్వరూపాన్ని పరిశీలిద్దాము.

చీనా కమ్యూనిజంమధ్య, రష్యా కమ్యూనిజంమధ్య పెద్ద విభేదాలున్నాయి. కారణమేమంటే ఈ రెండుదేశాల సంస్కృతులు వేరు. అనుభవాలు వేరు. నాయకత్వాలు వేరు. పైగా ఈ రెండుదేశాలప్రజలు అభివృద్ధి విషయంలో వేర్వేరు దశలలో వున్నందువల్ల, వీటిభేదాలు మరింత పెద్దవిగా కన్పిస్తాయి. రష్యా పారిశ్రామికంగా ఎంతో ఉన్నతస్థితికి వచ్చింది. ప్రకృతిసంపద విస్తారంగావుంది. కావలసినంత భూమివుంది. చైనా వ్యావసాయికంగా లోపభూయిష్ఠమైవుంది. సాధనసంపత్తి తక్కువ. జనాభా చూద్దామా అంతులేకుండా పెరుగుతోంది.

చైనా రష్యాలస్నేహం ముందుముందు ఎలావుంటుందో బైటివారెవరూ చెప్పలేరు. అయితే ఈ స్నేహం చాలా చిక్కులతో కూడుకొనివుంది. కడు సున్నితమైంది. అంతేకాని ఈ స్నేహం చెక్కుచెదరనిదనీ, మొక్కవోనిదనీ, ఏకశిలవంటిదనీ అనడం పాతకాలపుమాట.

ఈ దృష్ట్యా వాదంలో గెలిచే ఉద్దేశంతో అమెరికా విదేశాంగశాఖ ప్రతినిధులు కృశ్చేవ్‌ను "ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమనాయకుడు"గా చిత్రించడం, ఆయన చైనాను కూడగట్టుకోకుండా తనదారినితాను పోతున్నాడని చెప్పడం యుక్తితో కూడిన పనికాదు. పైగా తమనుతాము ఓటమిపాలుచేసుకోవడమే అది! కమ్యూనిస్టు స్నేహాలూ, కమ్యూనిస్టు దేశాలూ ఆర్థిక, జాతీయ, చారిత్రక ప్రభావాలకు లోనై ఒరుసుకుపోయే అవకాశమున్నవే అని అమెరికన్లు మొదట గుర్తించాలి.

1919—1933 సంవత్సరాల మధ్య అమెరికాకు సోవియట్ యూనియన్‌తో

దౌత్యసంబంధాలు లేవు. అయినా అప్పుడు కొన్ని వేలమంది అమెరికనులు రష్యాలో పర్యటించి అక్కడి సంగతులు తెలుసుకున్నారు. రష్యాప్రజలు అమెరికన్లను అవగాహన చేసుకున్నారు. అలాగే ఈనాడు అమెరికన్లు చైనా ప్రధాన భూభాగంతో సంబంధాలకు ప్రయత్నించాలి. అమెరికా ప్రజలు ఆ దేశానికి పోయి సంగతి సందర్భాలు తెలుసుకోవాలి. అచటి ప్రజలు అమెరికా అమెరికాకు వచ్చి అక్కడి విశేషాలు తెలుసుకోవాలి. దీనివల్ల ఎర్రచైనాకు అమెరికా విలేఖరులను పంపి, వారి విలేఖరులుఅమెరికాదేశానికి రావడానికి వీలేర్పడుతుంది. సమర్థులైన అమెరికన్ విలేఖరులు పంపగల వార్తలు, విశేషాలు అమెరికన్లకిప్పుడు చాలా అవసరం. చైనా విలేఖరులు అమెరికాకువస్తే వారికి ఏమి దక్కుతుందో నన్న భయం అమెరికన్లకు అక్కరలేదు.

ఇట్టి విలేఖరుల మార్పిడిని . ఇటు అమెరికా ప్రభుత్వమూ, అటు పీకింగ్ ప్రభుత్వమూ వ్యతిరేకిస్తూ వచ్చాయి. అయితే చైనా ప్రజలతో వార్తా సంబంధాలు తిరిగి పెట్టుకోవడానికై అమెరికన్లు చేసే ప్రయత్నాలకు పీకింగ్ ప్రభుత్వం సమ్మతిస్తుందని అనుకోవడం ఊహాగానం మాత్రమే.

అమెరికన్లను వారి ప్రజాశత్రువుగా దూరంగా వుంచడం కమ్యూనిస్టులకే లాభదాయకం. అందువల్ల వారి ఉద్దేశాలు నెరవేరుతాయి. కాబట్టి విలేఖరుల పర్యటనకు మనవైపుగల సాంకేతిక ప్రతిబంధకాలను మొదట తొలగించారంటే వార్తా సౌకర్యాలకు అడ్డుపడుతున్నారన్న నిందను కమ్యూనిస్టులైనా పైననే అమెరికన్లు మోపవచ్చు.

వార్తలు స్వేచ్ఛగా అందేట్టుచేయడం మొదటిచర్య మాత్రమే. విద్యావేత్తలు, రాజకీయవాదులు, వ్యాపారస్థులు, ఇంకా చైనా విప్లవాన్ని ప్రత్యక్షంగా చూచి అవగాహనచేసుకొని తాము లాభపడి, వారి అవగాహనను అమెరికన్లకు తెలియజెప్పగల ప్రాజ్ఞులు చైనాలో పర్యటించడానికి అమెరికా ప్రభుత్వం అనుమతించి వారికి తగు ప్రోత్సాహమివ్వాలి.

* * *

ఒకవేళ చైనా ఆగ్నేయాసియా భూభాగాలనూ, ప్రకృతిసంపదనూ బలవంతంగా వశపరచుకోవడం మానుకుంటే మరి ఏంచేస్తుంది అన్న ప్రశ్న వస్తుంది. విస్తృతంగా వ్యాపారంచేస్తుంది. ఏమైనా తుదకు చైనా ఏమార్గం అనుసరిస్తుంది అన్నదానిపై ప్రపంచశాంతి ఆధారపడివుంటుంది కాబట్టి ఈ ప్రశ్నను అమెరికా విధాన నిర్ణేతలు సత్వరమే పరిశీలించవలసి వున్నది.

తూర్పుఆసియాను అలావదిలి, రెండు చైనాలున్నాయన్న యథార్థాన్ని గుర్తుపెట్టుకొని తెలివితేటలతో అమెరికా విధానాలను రూపొందించుకొని వాటినిఅమలు జరిపారా ముందు జరుగబొయ్యేవాటిపై అమెరికా నిర్మాణాత్మక ప్రభావాన్ని వేయ గలుగుతారు. అలా చేస్తూవుండగా తూర్పుఆసియాలో యుద్ధప్రమాదానికి జడిసి ఆ ప్రాంతంలో అమెరికా సోవియట్ యూనియనులు క్రమేణా సహకార ధోరణికి రావచ్చు. రాజకీయంగా, సిద్ధాంతాల రీత్యా, లక్ష్యాలరీత్యా అమెరికాకూ రష్యాకూ విభేదాలున్నప్పటికీ, ఆసియాలో ప్రమాదం తక్కువగా వుంచగల సైనిక, ఆర్థిక, రాజకీయ సమతూకం ఏర్పడవలెనన్న విషయంలో ఈ రెండు దేశాలకూ ఏకాభి ప్రాయమూ, ఉభయసామాన్య ప్రయోజనమూ వున్నట్లగుపిస్తున్నది.

నేను సూచించిన విధానాలు ఫార్మోజాలోని తీవ్రజాతీయవాదులకు నచ్చవు. అలాగే పీకింగ్‌లోని కమ్యూనిస్టులు వీటిని తెగనాడుతారు. అల్లే చాంగ్‌ను ప్రక్కకు నెట్టి వారి స్వంతప్రభుత్వం ఏర్పాటుకాపడానికి సహాయపడమని అమెరికన్లను కోరుతూవున్న ఫార్మోజా జాతీయవాదులు దేశభక్తులేకాని, వారిది వాస్తవిక దృక్పథంకాదు. వారుకూడా నా సూచనలను తిరస్కరిస్తారు.

ఈ తరుణంలో ఈ దిగువ అంశాలను చైనా కమ్యూనిస్టునాయకులకు రుజువుపరిచే విధంగా అమెరికా విధానాలు ఉద్దేశింపబడాలి:

1. చైనావారు ఆగ్నేయాసియాలోకి చొచ్చుకురావడానికి ప్రయత్నిస్తే నకల సాధనాలతో అమెరికన్లు దాన్ని ప్రతిఘటిస్తారు.

2. నేరుగా దాడిచేసిగాని, లేక విద్రోహచర్యల ద్వారాగాని చైనా ఫార్మో జాలను కబళించజూస్తే దాన్ని అమెరికన్లు జరగనివ్వరు.

3. ఫార్మోజాలోవున్న అమెరికా సైనిక సామగ్రి వగైరాలు జాతీయవాదులు చైనా ప్రధాన భూభాగంపై దండెత్తడానికి ఉపయోగపడేందుకు ఉద్దేశింప బడినవికావు.

4. ఫార్మోజా స్వతంత్రరాజ్యంగానే వుండాలి. అక్కడ ఎటువంటి ప్రభుత్వం వుండాలి అన్నవిషయమై ఫార్మోజా ప్రజలను సంప్రదించి నిర్ణయం గైకొనాలి.

ఈ లక్ష్యాలను అమెరికన్లు అవలంబించినట్లయితే ఫార్మోజా సుస్థిరత్వం హెచ్చి అది సంపన్నమయ్యేకొద్దీ పీకింగ్‌ప్రభుత్వం గునుస్తూనైనా ఆ ద్వీపపు స్వాతంత్ర్యం కమ్యూనిస్టేతర ఆసియాజీవితంలో ఒకానొక యథార్థమని తన మన స్సుకు నచ్చజెప్పుకొని సమాధాన పడవచ్చు.

# 44

# రష్యా నిరాయుధీకరణకు ఒప్పదు – ఎందుకని?

*1959 ఏప్రిలు 19 తేదీ న్యూయార్కు టైమ్సు మేగజైన్‌కు శ్రీ బౌల్సు వ్రాసిన ఈ దిగువవ్యాసంలో ఆయుధాల అదుపు ఒడంబడికకు రష్యావారు ఎందుకు వెనుకాడుతున్నదీ వివరిస్తూ అమెరికా ఎట్టివైఖరి అవలంబించవలసిందీ సూచించారు.*

అసలే నేటిప్రపంచం నిరాశతో క్రుంగిపోతున్నది. పైగా ఒకపెద్ద ప్రతిష్టంభనను ఎదుర్కొంటున్నది. ఎలాగైనా ఆయుధాలపోటీ అనే విషవలయంనుంచి తాను బైటపడగలనా, అందుకు గట్టి ఏర్పాటేదైనా జరుగుతుందా లేదా అని అనుకుంటున్నది. పైకి కనపడుతున్న దానినిబట్టి ఆయుధాల అదుపుకు ఒక ఒడంబడిక చేసుకోవాలన్న ఉద్దేశం రష్యావారికి వున్నట్టులేదు.

పూర్తి నిరాయుధీకరణ కార్యక్రమం కావాలని రష్యానాయకులు పట్టుబట్టరేమి? అలాకోరితే వారికి రెండువిధాల లాభంకలుగుతుందే! మొదటిది: సైన్యంపై పెట్టే ఖర్చును వినిమయ వస్తూత్పత్తికి పెట్టి ఇంటా బైటా మేలు పొందవచ్చుకదా. రెండవది: కమ్యూనిస్టు సిద్ధాంతంప్రకారం పెట్టుబడిదారీ వర్గానికి చెందిన పాశ్చాత్యదేశాలు ఆయుధాల పరిశ్రమలను పెంపొందించుకుంటూ వాటి ఆధారంగా సంపన్నమవుతున్నాయనికదా అంటున్నారు. నిరాయుధీకరణ జరిగితే పెట్టుబడిదారీ దేశాల సంపన్నత్వం తరుగుతుందికదా!

మొదటికారణాన్ని పరిశీలిస్తే సోవియట్‌యూనియన్ ఉత్పాదనాశక్తులలో నూటికి 22 వంతులు సైన్యానికి కేటాయింపబడుతున్నవి. 190 వందల కోట్ల డాలర్ల వెరశి మొత్తం జాతీయోత్పత్తిలో ఇది ఏటా 40 వందల కోట్ల డాలర్లకు సమానం. నిరాయుధీకరణ ఒడంబడిక జరిగితే రష్యా ప్రణాళిక నిర్ణేతలు ఇందులో చాలామొత్తాన్ని తమస్థానానికి బలంచేకూర్చే ఇతర కార్యకలాపాలకు వినియోగించగలుగుతారు.

రష్యాలో నివాసగృహముల కొరత బాగావుంది. కనుక పెద్ద గృహనిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టవచ్చు. పది పదిహేనేండ్లలో దేశంలో చాలావరకు మురికి వాడలను నిర్మూలించవచ్చు. మోటారుకార్ల పరిశ్రమను, ఇతర వినిమయ వస్తువుల ఉత్పత్తిని విస్తరింపజేయవచ్చు.

వెనుకబడివున్న దేశాలకూ, యూరపుకూ తన ఎగుమతులు హెచ్చించి, ఆ ప్రాంతాలలో పెట్టుబడిదారీదేశాల వ్యాపారంపై దెబ్బతీయవచ్చు. టైప్‌రైటర్లు, కార్లు, లారీలు, ఇతర సామగ్రి ధరలను అమెరికన్, బ్రిటిషు, ఫ్రెంచి, జర్మన్ సామగ్రి ధరలకంటె 30, 40, 50 శాతం తక్కువ చేసి, కొనుగోలుదారులను ఆకర్షించవచ్చు. శాంతియుతమైన పోటీలో ఎట్టి పరీక్షకైనా తాను నిలిచి గెలవ గలనని కృశ్చేవ్ తరచు సవాలు చేస్తూవుంటాడు కదా మరి!

ఇక రెండవకారణం సంగతి పరిశీలిద్దాము. అమెరికన్ ఆయుధనిర్మాణ పరిశ్రమలు మూతపడేకొద్దీ ఆర్థికమాంద్యం హెచ్చి దివాలాస్థితి ఏర్పడుతుందనీ, ప్రజలు కడగండ్లపాలై, రాజకీయవిభేదాలు రెచ్చిపోయి పెట్టుబడిదారీ విధానం పతనమవుతుందనీ, అప్పుడు కమ్యూనిజానిదే విజయమనీ కమ్యూనిస్టులు తరచు అంటూవుంటారు.

ఇటువంటి మార్క్సిస్టు వివేచన అమెరికా సమస్యను కొంతంతగా చేసి చూపునట్టిదైనప్పటికీ ఆయుధాలపై పెట్టే ఖర్చు బాగా తగ్గిందంటే అమెరికన్ పరిశ్రమలు కష్టాల నెదుర్కోవలసి వస్తుందని ఎంతటి పెట్టుబడిదారైనా అంగీక రించక తప్పదు.

కాంగ్రెసుసభవారు పన్నులను బాగా తగ్గించారంటే ప్రభుత్వ ఆయుధ కొనుగోలు పద్దునుంచి కొన్నిలక్షల డాలర్లను తప్పించి వాటిని కుటుంబ కొను గోళ్ళకూ, ఉపాధులకల్పనకూ మళ్ళించవచ్చు. ఇంతవరకూ నిర్లక్ష్యంచేయబడ్డ

ప్రాంతాలలో గృహవసతి, రహదార్లు, స్కూళ్ళు, ఆసుపత్రులు మొదలైన సౌకర్యాలు కలిగించవచ్చు. ఇప్పుడు అమెరికన్లు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలకు చేసే ఆర్థికసహాయ కార్యక్రమాలు చాలీచాలకుండా వున్నవి. వాటిని విస్తరించి ఎగుమతి వ్యాపారాన్ని వృద్ధిచేయవచ్చు.

ఇట్టి చర్యల ఫలితం తెలిసిరావాలంటే కొన్నినెలలపాటు కష్టపడి సర్దుబాట్లు చేసుకోవలసివుంటుంది. ఈలోపల అమెరికాతో పోటీచేసే సోవియట్ యూనియన్ వారు తమ నియంతృత్వ పరిపాలనావిధానం కలిగించే వెసులుబాటుతో కొత్త మార్కెట్లు సంపాదిస్తారు. పాతమార్కెట్లనుంచి అమెరికన్లను వెళ్ళగొడతారు. ప్రపంచం మొత్తం నుంచి తమదేశాన్ని సందర్శించేవారికి భౌతికంగా కమ్యూనిజం సాధించిన విజయాలను చూపి చంకలు ఎగరవేస్తారు.

ఈ రెండు కారణాలవల్లనైనా సోవియట్ యూనియన్ నిరాయుధీకరణ ఒడంబడికకు కృషిచేయాలి. రష్యానాయకులు ప్రకటనలు చేశారు. విజ్ఞప్తులు అచ్చువేశారు. ధ్వజాలపై కాటికాయంత అక్షరాలతో నినాదాలు వ్రాసి ప్రదర్శించారు. శాంతికపోతాలను వదిలారు. కాని సంప్రదింపులదగ్గరికి వచ్చేసరికి ఇదమిత్థమైన, ఆచరణసాధ్యమైన ప్రతిపాదనలు చేయలేకపోతున్నారు. ఎందుకని?

మొదటి సమాధానాన్ని చెప్పేవారు పాశ్చాత్య పరిశీలకులు. వీరు హెచ్చుగా సైనికవృత్తి గలవారు. అయితే సైనికాభిప్రాయానికి ప్రతినిధులని చెప్పదగ్గవారు కారు. వీరికి భవిష్యత్తు అంధకారబంధురం. ఏదో ఉప్పెన వస్తుందంటారు. సోవియట్ రష్యా నిరాయుధీకరణ విషయంలో పట్టుదల చూపకపోవడాన్నిబట్టి బలప్రయోగంతో ప్రపంచాధిపత్యం నెరపవలెనన్న సోవియట్ యూనియన్ ఏకైక లక్ష్యం, తిరుగులేని లక్ష్యం బైటపడుతున్నదని వీరి వాదం.

మరొకవంక తీవ్రమైన అభిప్రాయాలు కలిగివుండే ఆదర్శవాదులున్నారు. వీరి సమాధానం వేరు. సర్వమానవాళి, చివరకు సోవియట్ విధాన నిర్ణేతలు కూడా ఉత్తములుగా వ్యవహరించవలెనని వీరి ఆశయం. అమెరికన్లు గట్టిప్రయత్నం చేయలేదు కాబట్టి రష్యావారు నిరాయుధీకరణకు అంగీకరించలేదని వీరు అమెరికన్ల లోపాల నెంచ బూనుకుంటారు.

అయితే దీనికంతటికీ అసలు సమాధానం సంక్లిష్టమైనదని నా భావం.

ప్రస్తుత సోవియట్ వైఖరిని అర్థంచేసుకోవాలంటే ఈ దిగువ అంశములనుకూడా అమెరికన్లు గమనించాలి.

1. తాము సృష్టించిన శక్తులకు తామే వాస్తవంగా భయపడుతున్నారు సోవియట్ నాయకులు. అవి ఏవి? పునరుజ్జీవితమైన సాయుధజర్మనీ: ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక; ప్రపంచవ్యాప్త అమెరికన్ అణ్వస్త్ర స్థావరాలు.

2. వారికి పొరుగున 65 కోట్లమంది చైనావారున్నారు. వారు నిద్ర మేల్కొన్నవారు. తమ భూమి చాలడం లేదో అని మొరపెట్టుకొంటున్నవారు. ఎప్పుడో ఒకప్పుడు కమ్యూనిస్టు ఉద్యమానికి నాయకత్వం వహింపటూస్తున్నారు.

3. రష్యావారికి గుట్టు, మట్టు అనే సంప్రదాయంవుంది. సోవియట్ నాయకులు ఆ సంప్రదాయానికి గురి అయినవారు. ఆయుధాల పోటీలో ఇది వారికి ఒక విధంగా ఉపకరిస్తుంది. కాని అమెరికన్ల సంగతివేరు. అమెరికన్ల వ్యవహారమంతా బయలు కదా.

4. విధానాలను నిర్ణయించడంలో కమ్యూనిస్టులు సంకోచిస్తారు. అనేక వత్తిడులు. కమ్యూనిస్టు పార్టీలోనే విభేదాలు. పార్టీకీ, సైన్యానికీ అభిప్రాయ భేదాలు. వీటన్నిటివల్ల రష్యా కార్యస్వాతంత్ర్యం కొన్ని పరిమితులకు లోబడి వుంటుంది. అమెరికన్లలోవున్న విభేదాలుకూడా అమెరికన్ ప్రభుత్వాన్ని కొంత అదుపు చేస్తున్నాయి కదా!

పైవాటికి తోడు నా ఊహనుకూడా కొంత చేరుస్తాను. హంగరీ అనుభవం తర్వాత నిరాయుధీకరణవిషయంలో రష్యా వెనుకంజ వేస్తోంది. 1955 లో జెనీవాలో అగ్రరాజ్యచతుష్టయ సమావేశం జరిగినపిమ్మట ఉద్రిక్తతలు కొంత సడలాయి. కమ్యూనిస్టు సామ్రాజ్యమంతటా ఏదైనా శక్యమేనన్న భావం ప్రబలింది. చివరకు పోలెండులో, హంగరీలో తిరుగుబాట్లు జరిగాయి.

కనుక ప్రచ్ఛన్నయుద్ధాన్ని మితంచేయడమంటే సోవియట్ నాయకులకు చాలా ప్రమాదభూయిష్ఠమైన పని. నియంతృత్వంగల ఏ రాజ్యానికైనా సంకోచింపవలసిన సంగతే. అలా మితంచేయడమంటే సోవియట్ యూనియన్ సమైక్యతను నిలబెట్టిన భయసంకోచాలను విడనాడటమన్నమాట.

ఈ పరిస్థితులలో అమెరికన్ల కర్తవ్యమేమిటి? సమాధానం చెప్పడం కష్టం. రష్యా ఉద్దేశాలేమిటో అమెరికన్లకు తెలియవు. ఊహించుకోవలసిందే. కనుక ఎట్టి

పర్యవసానానికైనా అమెరికన్లు సిద్ధంగా వుండాలి. ఇందుకు అమెరికా విధానం త్రిముఖమై వుండాలి.

1. ఎట్టి దుస్థితికైనా అమెరికన్లు సన్నద్ధులై వుండాలి. నిరాయుధీకరణకు రష్యా వెనుకాడటమే అది తాను అనుకున్నసమయంలో తనకు అనుకూలమైన చోట యుద్ధానికి పథకాలు వేస్తూ వున్నదని కొందరు పరిశీలకులు అనేమాట నిజమే కావచ్చు. ఏమైనా అమెరికన్లు చేతులుకాలిన తర్వాత ఆకులు పట్టుకోకూడదు. ముందు జాగ్రత్తతో వుండాలి.

2. అలావుంటూనే తమ సైనిక కార్యక్రమంలో కన్పించే హెచ్చింపు రష్యా సృష్టించిన ప్రతిష్టంభన ఫలితమేననీ, పెద్దపెట్టున నిరాయుధీకరణకు తాము నిజంగా అభిలషిస్తున్నామనీ ప్రపంచానికి నచ్చజెప్పాలి.

అట్టి నిరాయుధీకరణవిషయంలో నేటి అమెరికా ప్రభుత్వానికి స్పష్టమైన, నమ్మకమైన, సంప్రదింపులు జరుపదగ్గ విధానమనేది వుంటే అది ఎటువంటిదో ఎవరికీ తెలియదు. సోవియట్ యూనియన్ సిద్ధంగాలేదు కాబట్టి అమెరికన్లు ఒడు దుడుకులులేని శాంతికార్యక్రమానికి పూనుకోలేకపోతున్నారని అనడం ఒక సాకు చెప్పడమే.

3. చివరకు పరిస్థితి చక్కబడటానికి కూడా—అంటే నిరాయుధీకరణకు రష్యా అంగీకరించడానికి కూడా అమెరికన్లు ప్రయత్నించాలి.

ఇదే జరిగితే, ఆయుధాల పోటీ సడలినప్పుడు అమెరికా ఆర్థికవ్యవస్థపై దాని ప్రభావమేమిటో ఆలోచించాలి. దీనిని కాంగ్రెసుసభకు చెందిన సంయుక్త ఆర్థిక సంఘంగాని లేదా ప్రత్యేకంగా నియమించబడిన సంఘంగాని పరిశీలన చేయాలి. పరిశ్రమలలో, కార్మికోద్యమాలలో, విశ్వవిద్యాలయాలలో పనిచేసే ఆర్థిక ప్రవీణు లను ఈ పనికి నియోగించాలి.

ఈ పరిశీలన ఏ ప్రాంతానికాప్రాంతం విడిగా జరగాలి. ఆయుధోత్పత్తి తగ్గి నందువల్ల నిరుద్యోగస్థితి ఎంతవస్తుంది, పన్నులపై దీని ప్రభావమేమిటి, పన్నులు తగ్గినందువల్ల పెట్టుబళ్ళపై, వినిమయదారుల కొనుగోలుపై ప్రభావం ఎంతవరకు పడుతుంది, మున్నగువాటినన్నిటినీ విచారణ చెయ్యాలి.

పట్టణాల అభివృద్ధిపై, గృహవసతి స్కూళ్ళు ఆసుపత్రులు రోడ్ల కార్య క్రమంపై, విదేశాలలో పెట్టుబడి కార్యక్రమంపై దీని ప్రభావమేమిటి? ఈ మార్పు జరిగే దశలో నిరుద్యోగ పరిహారానికి ఎంతమొత్తం వెచ్చించవలసి వుంటుంది? ఇవి పరిశీలించాలి.

నిరాయుధీకరణయొక్క ఆర్థిక పర్యవసానాలేమిటో చర్చించడానికి చాలా మంది అమెరికనులు భయపడతారు. కాని అలా భయపడవలసిన అగత్యమే లేదు. ఊరికే బెదిరిపోవడం మంచిదికాదు.

1945 లో యుద్ధఉత్పత్తి మండలి సభ్యుడనుగా నేను యుద్ధస్థితినుండి శాంతిస్థితికి అమెరికా ఆర్థికవ్యవస్థను మార్చే పథకాలవిషయంలో కొంత పనిచేశాను. ఏణ్ణర్ధంలోనే అమెరికా పరిశ్రమలలో సగభాగాన్ని యుద్ధస్థితినుండి శాంతిస్థితికి గొని తెచ్చారు. మరి అప్పుడు పెద్ద ఆర్థికమాంద్యం, సంక్షోభం సంభవించలేదు. అనుకున్నంత నిరుద్యోగస్థితి ఏర్పడలేదు. ఒక కోటిమంది ప్రవీణులైన పనివారు ఉద్యోగాలకోసం హఠాత్తుగా ఎగబడ్డారు; అయినా సాధించారు.

అట్టిస్థితి ఈనాడు ఏర్పడినా మళ్ళీ తట్టుకొని నిలువగలరని నా విశ్వాసం. అమెరికన్ల మొత్తం కృషిలో చాలా తక్కువభాగం ఆయుధోత్పత్తిలో నిమగ్నమై వుంది. ప్రజారోగ్యం, విద్య, విదేశీసహాయం, తదితరరంగాలలో చేయవలసింది చాలా వుంది. వాటికి అమెరికన్ బలగాన్ని ఉపయోగించాలి.

కొత్తగా అమెరికా తీసుకొనే చొరవకు, సైనిక ఆర్థిక రాజకీయాంశాలను గమనించి అమెరికా అవలంబించే శాంతివిధానానికి రష్యా ఎంతవరకు ప్రభావితమవుతుందో ఎవరూ చెప్పలేరు. అయితే ఈ యుగం వెనుకటిపలె మందకొడిగా లేదు. వేగంగా మార్పులు వస్తూవున్న కాలమిది. ఎన్నో విశేషాలు జరుగవచ్చు. స్టాలిన్ మరణానంతరం సోవియట్ యూనియన్‌లోనే ఎన్నోమార్పులు వచ్చాయి.

అయితే విప్లవాత్మకమైన ఈ శతాబ్దిలో ఒక విధానాన్ని నిర్ణయించడం తేలికైనపనికాదు. కీడెంచిమేలెంచాలి. వచ్చే ప్రమాదాలేమిటో, జరిగే మేళ్ళేమిటో బేరీజువేసుకొని లాభనష్టాలు లెక్కగట్టాలి. ఎటూ అతికాకూడదు. విశ్వసనీయమైన, క్షేమకరమైన మార్గమంటూ ఏదీ లేకపోయినప్పటికీ, చేతులుముడుచుకు కూర్చుంటే ఆయుధాల పోటీ మరీ తీవ్రమై ప్రపంచశాంతికి ఉపద్రవమేర్పడవచ్చు. కనుక దృఢమైన, ఆచరణసాధ్యమైన, వివేకయుతమైన అమెరికన్ విధాననిర్ణయం అమెరికా జాతి జనులందరి బాధ్యత. ఆ బాధ్యతను అమెరికన్లు విస్మరించలేరు. రేపులే మాపులే అని వాయిదావేయలేరు. అదే అమెరికన్లకు పట్టుగొమ్మ అని గ్రహించాలి.

# 45

# రక్షణ: నిరాయుధీకరణ: శాంతి

సైనికసాంకేతిక విజ్ఞానం రోజురోజుకూ వృద్ధిచెందుతూవుంది. —ఇందువల్ల అయుధీకరణకూ, నిరాయుధీకరణకూ మధ్య ఘర్షణ చెలరేగుతున్నది. దీనినంతటినీ సమీక్షచేస్తూ శ్రీ బౌల్స్ రెంటికీ సమన్వీకృతవిధానాలను రూపొందించేందుకు కొత్త ప్రయత్నం జరగాలని 1960 మార్చిలో లాస్ ఏంజెల్స్‌లో జరిగిన మాడరన్ ఫోరం వారి సభలో చేసిన ప్రసంగంలో ఉద్బోధించారు.

నేడు ప్రపంచం ఆయుధాలపై ఏటా 100 వందల డాలర్లు ఖర్చుపెడుతూ వుంది.

చిత్రమేమిటంటే ఇంత ఖర్చుపెట్టినా కలిగే ఫలితాలు ఏమీలేవు. ఈ ఆయుధాల పోటీలో నిమగ్నమైవున్న దేశాల వ్యూహరచనావేత్తలు మాత్రం ఖర్చు పెట్టిస్తూనే వున్నారు.

ఆయుధాలపోటీ తీవ్రమైనకొద్దీ నిరాయుధీకరణ జరగవలసిన అగత్యం కూడా స్ఫురిస్తూనే వుంటుంది. అయితే అంతా అనిశ్చయస్థితి. భయం. ఆందోళన. తగు కట్టుదిట్టంగా లేకపోతే ఏ రోజు యే ప్రమాదం ముంచుకొస్తుందోనని మళ్ళీ రక్షణసామగ్రిని తయారుచేస్తూ వుంటారు.

ఇటు వాషింగ్టన్‌లోనూ, అటు మాస్కోలోనూ వ్యవహర్తలు ఆయుధీకరణ సవాలునే పట్టించుకుంటున్నారుగాని నిరాయుధీకరణ పొంతకు పోవడంలేదు. ఒక్కొక్కప్పుడు వీరు ఆయుధాలు దండిగావున్నకొద్దీ నిరాయుధీకరణకు ప్రోత్సాహం లభిస్తుందన్న అర్ధసత్యాన్ని వల్లిస్తూ వుంటారు. మరి చర్చిల్ ఒకప్పుడు అన్నాడు కదా—సంధి జరగాలంటే మొదట సాయుధులై వుండడం అవసరమని।

కాని ఆయుధాలపోటీ ఫలితాలు మంచివికావు. శాంతి నెలకొనాలంటే తగు ఆయుధాలు చేతిలోవుండడం అవసరమని ఎవరి మనస్సుకు వారు నచ్చచెప్పు కోవడం, ఒకవంక సోవియట్ సైనికశక్తి పెరుగుతూవుంటే మనం పూరుకోవడం మంచిదికాదని అనుకోవడం అసంగతం.

ఇప్పుడు శాంతిఅనేది మామూలు సంగతికాదు. ఒకప్పుడు తేలికగా లభించే దైనా నేడు అలాకాదు. గురూపదేశంవల్ల పట్టుబడేదికాదు. ఒక పక్షంవారు పూను కున్నందువల్ల అలవి అయ్యేదికాదు. నైతిక, సైనిక, ఆర్థిక, సాంకేతిక సమస్య లనే తిరుగుళ్ళు దీనికెన్నో వున్నాయి.

నేటి ఈ గందరగోళంనుంచి క్రమబద్ధమైన విధానాన్ని రూపొందించడం అసాధ్యమని అమెరికన్ పరిశీలకులు చెబుతూవుంటారు.

వీరిని అమెరికన్లు నిరాశావాదులని అంటారు. వీరు చెప్పేది రేపునాడు తప్పు కావచ్చు. కాని ఈ చిక్కులన్నీ ఇలాగేవుంటే వారి మాట చేసు ఒప్పు అవుతుంది. ఆయేటికాయేటికి శాంతిసమస్యలు సహజంగా క్లిష్టమవుతూ పోతాయి. ముఖ్యంగా రక్షణ, నిరాయుధీకరణవంటి సమస్యలు తీరకాయ పీచువంటివి. ఈ సమస్యలను పెరగనిచ్చినకొద్దీ ఇవి అదుపురాకుండా అవుతాయి. మరి వీటిని దొరకబుచ్చు కోవడ మెట్లా ?

అణుశక్తిసంఘం కమీషనర్‌గా పనిచేసిన థామస్ ఇ. ముర్రే ఇలా అన్నాడు: "అణుశక్తి దాని నైజంప్రకారం అది వృద్ధిఅయింది. అపరిమితమైన ఈ శక్తిని సైనికవ్యూహంతో సంఘటితపరచినప్పుడు కలిగే ఫలితాలను మొదట మేము ఊహించడానికే భయపడేవాళ్ళం. ఆధునిక యుద్ధాలలో అణుశక్తితో పౌరులను వేలకొద్దిగా నాశనం చేయవచ్చు. అలా జరగడం కళ్ళారా చూచాము. అయినా ముందుకుపోయి సంఘటితపరిచాము. పరాకు చిత్తగించిన ఒకానొక మనఃస్థితిలో మన వ్యూహవిధానాలను రూపొందించేపనిని సైనిక సాంకేతిక విజ్ఞానానికి అప్ప గించాము ...చివరకు సాంకేతికవిజ్ఞానం పిడికిట్లో బందీలమైపోయ్యాము."

1960 జనవరి 14 తేదీన సుప్రీం సోవియట్ సభలో కృశ్చేవ్ చేసిన ప్రసం గాన్నిబట్టి సాంకేతిక విజ్ఞానమనే మాయావి రష్యాలో కూడా తన కెదురైన వాటి నన్నిటినీ మాయంచేసి వశపరచుకున్నట్లు తెలుస్తున్నది. అణ్వస్త్రాల స్వభావాన్ని బట్టీ, అవి విరుచుకుపడే వేగాన్నిబట్టీ ప్రచ్ఛన్నయుద్ధానికి ఒకవేపున సాంకేతిక

విజ్ఞానమనేది ఎక్కువగంటలు పనిచేసి మరొకపేప్పు పెరిగే సాంకేతిక శాస్త్రాన్ని యుక్తితో మించిపోపడం అనివార్యమవుతుంది. తాత్కాలికంగా ఏమాత్రం వెసులుబాటు కలిగినా ఆ అవకాశాన్ని ప్రతిపక్షిని పరాభూతంచేయడానికి వినియోగించుకుంటారు. దీనితో సమతూకానికి భంగంకలిగించడం, ఎవరిదో ఒకరిది పైచెయ్యి కావడం, ఇట్లా ఈ పోటీ అంతమనేదిలేకుండా జరుగుతూ పోతుంది. వ్యయం పెరుగుతుంది. దానితోపాటు ప్రపంచానికి ప్రమాదమూ హెచ్చుతుంది.

దీనితోపాటు విజృంభించడానికీ, ఆత్మరక్షణస్థితిలో వుండడానికీ మధ్య వుండే తేడా అనుదినమూ హెచ్చుతున్నది. ఇప్పు డీ తేడా ఎంతగా పెరిగిపోయిందంటే శాంతచిత్తులైన, బుద్ధిమంతులైన సోవియట్ వ్యూహరచనావేత్తలు సైతం అమెరికాపై ఆకస్మిక అణ్వస్త్రదాడి సహేతుకమైన సోవియట్ విధానం కాగలదని త్వరలోనే అనుకుంటారో ఏమో!

ఈ దశాబ్ది ఆయుధసాంకేతిక విజ్ఞానంలోనే సంభ్రమాశ్చర్యాలు, వేగం, తప్పుడు అంచనా, ప్రమాదంవంటి అరిష్టాలు వున్నాయి. అది సహజం కూడా. పైగా అమెరికన్ ప్రచ్ఛన్నయుద్ధ వ్యూహరచనావేత్తలు ఇనుపతెరకు ఆవల ఈవల వున్నవారి ఉద్దేశాలేమిటో పరిశీలిస్తూ అంచనాలు కడుతూ వుంటారు. దీనివల్ల ప్రపంచం అస్థిరస్థితిలో కాలం వెళ్ళబుచ్చుతూ వుంది.

నేటితరం అమెరికనుల సాధనసంపత్తులు, శక్తియుక్తులు, అంగబలంఅంతా మహాప్రళయసమానమైన అరగంటపాటి అణ్వస్త్ర మారణహోమంలో బ్రతికి బట్టకట్టగలుగుతామా లేదా అన్న అంశాన్ని తేల్చుకోవడానికి కేంద్రీకరించబడుతూ వున్నవి. మానవుడు ఆందోళనతో జీవించవలసిరావడం మహాదారుణం. కీలకప్రాయమైన ఈ కృషి అనే గాలిపటానికి రాజనీతి, విదేశీసహాయం, విద్యవంటివి తోకలవంటివి.

అణ్వస్త్రయుగంలో లక్షలాదిప్రజలను నాశనం చేస్తామనే బెదిరింపులు, ఎదురుబెదిరింపులు, ఎత్తులు, పైయెత్తులు ప్రధానమైపొయ్యాయి. పైగా అమెరికన్ బెదిరింపులను అమెరికన్ ప్రతిపక్షి నమ్మడానికి వీలుగా ఎప్పటికప్పుడు కొత్త పద్ధతులు కనిపెట్టాలని సలహా చెప్పేవారూ వున్నారు.

సాంకేతికవిజ్ఞానం అదుపులేకుండా వృద్ధిఅవుతూవుంది కాబట్టి కేవలం భయంతో బెదిరింపులను నమ్మే రోజులు కూడా పోవచ్చు. హిరోషిమాపై వేయబడ్డ ఆటంబాంబు రెండవ ప్రపంచయుద్ధంలో వాడబడ్డ అత్యధిక ప్రేలుడుశక్తిగల పెద్ద

బాంబుకంటె కొన్నివేలరెట్లు శక్తివంతమైనది. కాని అపిమ్మట అమెరికన్లు తయారు చేసిన హైడ్రోజన్‌బాంబులు రెండవప్రపంచంలో ప్రయోగింపబడ్డ మొత్తం బాంబుల ప్రేలుడు శక్తికన్న కొన్నివేలరెట్ల శక్తిగలవి.

అణ్వస్త్ర, సాంకేతిక విజ్ఞానపు ఈ పోటీ చివరకు ఎలా పరిణమిస్తుందో అని వితర్కించుకోవలసిన పనేలేదు. ఈ పోటీ ఇలా అడ్డులేకుండా సాగిందా తుదకు ప్రపంచం సర్వనాశనంకావడం తథ్యం. ఇప్పుడు అమెరికన్లు పట్టినదారి అమెరికన్లను ఆ పరిణామానికే తీసుకుపోతుంది. కాబట్టే ఎవరో అన్నారు—ఇతర గ్రహములలో మానవజనాభా బహుశా లేకపోవడానికి కారణం ఆ గ్రహములలో ఒకప్పుడు నివసించిన విజ్ఞానశాస్త్రవేత్తలు అమెరికన్లకంటె ముందడుగువేసినవారు కావడమే అని. కావచ్చు గదా !

* * *

ఈనాడు అమెరికన్లు నిరాయుధీకరణను గూర్చి మాట్లాడేటప్పుడు రెండవ ప్రపంచయుద్ధానికి ఎప్పుడో పూర్వపురోజులను గూర్చి మాట్లాడే అలవాటును మానుకోవాలి. అణ్వస్త్రయుగానికి పూర్వపుకాలాన్ని గూర్చిగాని, రాకెట్లూ చోదితాస్త్రాలకు వెనుకటి కాలాన్ని గూర్చిగాని మాట్లాడి ఇప్పుడు ప్రయోజనంలేదు: 1960 సంవత్సరపు ప్రపంచం వాటన్నిటికంటె భిన్నమైనది. వెనుక పాతసిద్ధాంతాలను వదిలి ఈ యుగాన్ని దీన్నిగానే పరిశీలించాలి.

చిత్రమేమిటంటే, తమకెట్టి గుదిబండసిద్ధాంతాలూ లేవని చెప్పుకొనే ప్రజాస్వామ్యవాదులకంటె కృశ్చేవ్ ఈనాడు సిద్ధాంతాలను స్వేచ్ఛగా విడనాడుతున్నాడు. 1957 ఫిబ్రవరిలో క్రెమ్లిన్‌లోని ఆయన కార్యాలయంలో నేను కృశ్చేవ్‌ను కలిసి మాట్లాడే అవకాశం కలిగింది. మేము నిరాయుధీకరణను గూర్చి మాట్లాడుతున్నాము. మార్క్సిస్టు సిద్ధాంతమార్గంనుంచి మీరు తప్పిరాలేదా అని నేను ఆయనతో అన్నాను. గట్టినిరాయుధీకరణ ఒడంబడికకు సంప్రదింపులు జరపడానికి సిద్ధంగావున్నారా అని ప్రశ్నించాను.

పాశ్చాత్య పెట్టుబడిదారీదేశాలు సంపదకోసం వాటి ఆయుధనిర్మాణ పరిశ్రమలపై ఆధారపడివున్నాయనే మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఆయనకు నేను గుర్తుచేశాను. నిరాయుధీకరణవల్ల కమ్యూనిస్టు విజయం త్వరగా సిద్ధిస్తుందన్నభావం ఆ మార్క్సిస్టు సిద్ధాంతంలో వుంది. అమెరికన్ ఆయుధపరిశ్రమలు మూతపడేకొద్దీ

నిరుద్యోగస్థితి హెచ్చుతుంది. ప్రజల కొనుగోలు శక్తి తగ్గుతుంది. ఆర్థికమాంద్యం వ్యాపిస్తుంది. రాజకీయంగా తిరుగుబాట్లు సంభవిస్తాయి. పెట్టుబడిదారీవిధానం పతనం చెందుతుంది.

అటువంటప్పుడు క్రుశ్చేవ్ మార్క్సిస్టు సిద్ధాంతంప్రకారం ఎందుకు నడవడు? నిరాయుధీకరణ ఒడంబడికను సాధించి పెట్టుబడిదారీవిధాన పతనానికి ఎందుకు కారకుడు కాడు? అలా చేయకపోవడం వారి మార్గం విడనాడటం కాదా? ఆయన దారితప్పినవాడు కాడా? ఆయనకంటె సిద్ధాంతపరులైన ఆయన సహచరులు ఏమనుకుంటారు? వారేమనుకున్నా ఆయనకు లెక్కలేదా?

నా ఈ వాదన విని క్రుశ్చేవ్ నవ్వి ఫూరుకున్నాడు. దాన్నిబట్టి నా వాదనలో ముఖ్యాంశాన్ని ఆయన గ్రహించాడని తెలుసుకున్నాను. ఆయన ఏమాత్రం చలింపలేదు.

ఆధునిక మార్క్సిస్టులు తమ సిద్ధాంతాన్ని గూటిలో పెట్టేసేకంటే ఆ సిద్ధాంతంప్రకారం నడచుకోపడమే మంచిది అని ఎవరైనా అంటే ఎలావుంటుంది? మరి ఈ సందర్భమేమిటి, ఇలావుంది?

అమెరికనులకు కూడా ఆయుధాల అదుపువిషయంలో కొన్ని సిద్ధాంతాలున్నాయి. ముఖ్యంగా రాజకీయ సమస్యలు గొప్పవి. బెర్లిన్, జర్మనీ, మధ్య ప్రాచ్యం, కొరియా, వియత్నామ్. ఫార్మోజా—అన్నీ అన్నే! కాబట్టేకదా ఆయుధాలను అదుపుచేసేముందు ఈ సమస్యలను పరిష్కరించాలని కొందరంటారు!

ఆయుధాలు ఒక లక్షణంమాత్రమే, అసలు కారణంకాదు అని కొందరంటారు. ఆయుధాల అదుపుకు దానంతట అదే ప్రాముఖ్యం వచ్చేసింది. ప్రస్తుతం సంప్రదింపులు జరిగే అవకాశమే కన్పించదు. జరిగినా ఫలితంవుంటుందా అన్న అనుమానం వుంది. అందుచేత ప్రపంచ మెదుర్కొనే ముఖ్యరాజకీయ సమస్యలలో ఆయుధాల అదుపుకు మొదటి ప్రాధాన్యం లభించింది.

కాని ఈ సమస్యకు అడుగున రెండు ప్రాథమిక సత్యాలున్నాయి. మొదటిదేమిటంటే—ప్రపంచచరిత్రలో ఆయుధాలపోటీ జరిగినప్పుడల్లా ఆ పోటీ చివరకు యుద్ధంగా పరిణమించింది. రెండవది-యుద్ధానికి సన్నద్ధంగాలేనిదేశం, లేదా తనకై తాను ఆయుధవిసర్జన చేసినదేశం, తగురక్షణ ఏర్పరచుకోకుండా అస్త్రసన్యాసం చేసిన దేశం ఘోరవిపత్తు నెదుర్కోవలసి వస్తుంది.

ఈ రెండు సత్యాలనూ జంటగా ముందుంచుకొని పరిశీలనచేయాలి. వీటిని వేరుచేసి ఆలోచించడంవల్లనే ఇబ్బందులొస్తున్నాయి. అమెరికా సైనికరక్షణ నిర్దుష్టంగా, సమగ్రంగా వుండవలెనని వాదించే వారికి ఆయుధాల అదుపుకోరే వారంటే అపనమ్మకం, అనుమానం. అలాగే తగురక్షణలతో నిరాయుధీకరణ సాధించాలని చూచేవారు సైన్యపు మనుషులను నమ్మరు.

బ్రతికి బట్టకట్టడానికై సైనికదృక్పథంతో ఆలోచిస్తే ఆయుధాలపోటీలో అమెరికన్లకూ అగ్రగాములై నిలవాలనిపిస్తుంది. అలాగాక మానవీయదృక్పథంతో చూస్తే ఆయుధాలను తగ్గించడమెలాగా అని ఆలోచిస్తారు.

1959 జనవరి "ఫారిన్ ఎఫేర్స్" పత్రికలో వ్రాసిన ఒకవ్యాసంలో ఆల్బర్టువోల్‌స్టెట్టర్ ఇలా అన్నారు: "ఉద్రిక్తతను సడలించడం మంచిదని ప్రతివారూ అంటారు. కాని తన రక్షకభటుడిని తీసివేయడం చెడ్డపని అని అంతా అంగీకరిస్తారు. దానికీ దీనికీ తేడా కన్పిస్తుందా?"

రక్షణ, నిరాయుధీకరణ విషయాలను గూర్చి భిన్నాభిప్రాయాలున్నాయి. తనిఖీ సమస్య ముఖ్యమైంది. మరింత శాస్త్రోక్తంగా సంసిద్ధమైవుంటే ఇంతకాలం వ్యర్థమయ్యేదికాదు. ఇంత అనిశ్చయస్థితి వుండేదికాదు. ఏదేశమైనాచేసే అణ్వస్త్ర పరీక్షలను కనిపెట్టవచ్చా లేదా అన్న విషయమటుంచనిచ్చి, అసలు పరీక్షలు జరపాలనేకోర్కెను ఏదేశానికీ లేకుండా చేయడం సాధ్యంకాదు. కనిపెట్టడమెలా అన్న ప్రశ్నకు సమాధానం లభించినా ఈ వివాదమింతటితో సమసిపోదు. అయితే జెనీవాసభలో ఒకపెద్ద అయోమయత్వానికీ, ఆటంకానికీ మూలమైనదానిని ఇది అంతమొందిస్తుంది.

సర్వతోముఖాభివృద్ధి కష్టసాధ్యమైనట్టి రంగంలో మరింత కచ్చితమైన విజ్ఞానం రాజకీయ విధానమనే త్రాసును తట్టగల ప్రాంతాన్ని నిర్లక్ష్యం చేయడం వివేకంకాదు. భూగర్భంలో జరిగే పరీక్షలను కనిపెట్టడం వివాదగ్రస్తమైన అంశంగా వుంది కాబట్టి దానివిషయంలో కొంత కృషిజరగాలి. సాంకేతికంగా ఇదొకలోపం. దీన్ని పూరించాలి.

అణ్వస్త్రముల పంపిణీకూడా వివాదగ్రస్తంగానే వుంది. కొందరు అణ్వస్త్ర బలాన్ని హెచ్చుదేశాలు కలిగివుండవలెనని వాదిస్తారు. అమెరికన్లకు శత్రుసమానుడైన వానివద్ద అణ్వస్త్రమున్నప్పుడు అమెరికా మిత్రుడికి అమెరికన్లు దాన్ని ఇవ్వక

పోవడం క్షణంలో ప్రతికక్షిదేశాన్ని బుగ్గిపాలుచేసే ఈయుగంలో ఆత్మహత్యా సదృశమని వారు వాదిస్తారు.

మరికొందరు ఇప్పటికే కొన్నిదేశాలకు అణ్వస్త్రాలున్నాయి; అదిచాలు, మరిన్నిదేశాలకు అణ్వస్త్రాలుంటే వాటిని అదుపులోకి తేవడం కష్టమనీ, ప్రమాద వశాత్తుగానో, లేక కావాలనో అణ్వస్త్రాన్ని ప్రయోగిస్తే ఇంకేమైనా వుందా,ప్రపంచం భగ్గుమనదా అని అంటారు.

కాని ఇవి అంతగా భిన్నాభిప్రాయాలు కావు. ఎక్కడో కలుస్తాయి.అదుపు విధానాలలోనే రాజీకుదిరే అవకాశముంది. ఈ విషయంలో కొన్ని ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి.

రక్షణ, నిరాయుధీకరణ అవసరాలకు ఎట్టి చర్యలు గైకొనాలి? శత్రువు దెబ్బను తట్టుకోవడానికీ, ప్రైటిదురాక్రమణను రెచ్చగొట్టకుండా వుండటానికీ ఉత్తర అట్లాంటిక్ ఒడంబడికలో కొత్త ఏర్పాట్లు ఏవి జరగాలి? ఇప్పుడు కొన్ని దేశాలు తమకు అణ్వస్త్రం లేదే అని అనుకుంటున్నాయి. అణ్వస్త్రాన్ని తయారు చేయ ప్రయత్నిస్తున్నాయి. వాటికి ఆభావం కలుగకుండా, చేసి అణ్వస్త్ర సాంకేతిక విజ్ఞానం సర్వప్రజలకూ ప్రయోజనకారిగా వుండేట్టు చేయాలంటే ఏవిధానం మంచిది?

విచక్షణలేకుండా మిత్రులకు అణ్వస్త్రాలనిచ్చినందువల్ల పై ప్రశ్నలకు సమాధానాలు లభించవు. అలాగే అమెరికా అణ్వస్త్రాలరాశిని పెంచుకుంటూ సంతృప్తిపడుతూ, అమెరికన్లు అడ్డుచెప్పినా, అమెరికన్లు సహాయంచేయకపోయినా ఇతరదేశాలు వాటివాటి అణ్వస్త్రాలను తయారుచేయగల అవకాశాలనంగతి పట్టించుకోమని మూర్ఖించినందువల్ల కూడా సమాధానాలు దొరకవు.

అణ్వస్త్రాలవిషయంలో ఇప్పుడు ఫ్రాన్సు అమెరికన్లని కాదని తనదారిని తాను పోతూవుంది. కనుక ఇప్పుడు అణ్వస్త్రంలేని రాజ్యాలు ఫ్రాన్సును ఆదర్శంగా పెట్టుకోకుండా చేయాలంటే ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక ననుసరించి ఆ దేశాలకు అణ్వస్త్రములపై అదుపు, పర్యవేక్షణ, పథకరచన విషయాలలో కొంత బాధ్యత ఇవ్వాలి. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక దేశాలకు మొత్తానికి అణ్వస్త్ర రక్షణ కవచాన్ని ఏర్పాటుచేస్తే ఎవరికివారికి ఆ అస్త్రం వుండవలెనన్న కోరిక రాదు.

ఇందువల్ల రష్యావారికి కూడా ఆందోళన కొంత తగ్గుతుంది. ఉత్తర అట్లాంటిక్ కూటమి లోపల సంయుక్త శాస్త్రీయపరిశోధనకు అవకాశం కల్పిస్తే ఆయుధాల అదుపు విషయంలో ఎంతైనా మేలు చేకూరగలదు.

అట్లాంటిక్ కూటమివెలుపల అణ్వస్త్రవ్యాప్తి జరిగిందంటే దాని ఫలితాలు వెంటనే కన్పిస్తాయి. కమ్యూనిస్టు చైనాకుగాని, లేక ఆరాటపడుతూన్న తూర్పు జర్మనీకిగాని స్వతంత్ర అణ్వస్త్రం లభ్యమయ్యే అవకాశం కల్పిస్తే రష్యావారు సంతోషపడరు. ఉభయులకూ ప్రమాదమున్నప్పుడు ఆ భయంతో ఉభయుల శ్రేయస్సుకోసం కొత్త అవకాశాలు కలిగించుకుంటారు.

ఇటీవల కొలంబియా-హార్వర్డు పరిశోధకుల జట్టు సెనేట్ విదేశవ్యవహారాల సంఘంకోసం "రష్యా - తూర్పుయూరపు" అన్న విషయంపై ముఖ్యపరిశీలన జరిపింది. అందులో ఇలా వ్రాశారు: "ఆయుధాల పోటీకి సంబంధించిన కొన్ని అంశాలను పరిమితంచేయడానికై ఉభయులకూ ప్రయోజనకరమైనవాటిని అన్వేషణ చేసేటప్పుడు రష్యన్‌లు అమెరికన్లకు పూర్వాచారపరులుగా, బాధ్యత నెరిగిన ప్రత్యర్థులుగా కన్పించవచ్చు." ఈ మాట చాలామంది అమెరికన్‌లకు విడ్డూరంగా తోచవచ్చు. కాని ఇది అసాధ్యంమాత్రం కాదు.

* * *

ఆయుధాల అదుపు సమస్యకు అమెరికన్లు తగినంత ప్రాధాన్యమివ్వలేదు. ఇప్పటికే తాత్సారం చేశారు. ఇంకా చేస్తున్నారు. అమెరికన్లని తొందరపెట్టిన వారెవరూ లేరనికాదు. ఎవరైనా చెప్పినా అమెరికన్లు వినిపించుకోలేదు. పెడచెవిని పెట్టారు.

కనుకనే పదేళ్ళక్రితం—1950 మార్చి 1 వ తేదీనాడు సుప్రసిద్ధుడైన కనెక్టికట్ సెనేటర్ కీ॥శే॥ బ్రీన్ మెక్‌మాహన్ సెనేటులో ప్రసంగిస్తూ అమెరికన్లు ఇంతవరకూ చేయకుండా వున్నపనిని చేయమని ఉద్బోధించాడు. త్వరపడమన్నాడు. ఇప్పుడు తెలుస్తూవుంది ఆయనమాట లెంతగొప్పవో!

"ఒక్కొక్క-పేపు బరువుహెచ్చి త్రాసు మొగ్గినకొద్దీ నాగరికతను రక్షించడానికి వ్యవధి తగ్గుతూపోతూంది. ఈ పనికి అమెరికన్లు యెప్పుడు పూనుకుంటారు? విధి అమెరికన్లకు అలక్ష్యం ప్రసాదించదు. ఇప్పుడు అమెరికన్లు కదలక

పొయ్యారా మనోహరమైన ఈ గ్రహంపై అమెరికన్లకు వారసులుగా వచ్చినవారు అమెరికన్లను శాశ్వతంగా నిందిస్తారు.

"అమెరికన్లను మూర్ఖులని కూడా దూషించరు. ఎందుచేతనంటే మూర్ఖులకు సైతం ఘోరప్రమాదం యొక్క జ్ఞానముంటుంది. రాగల ప్రమాదాన్ని వారు పసికట్ట గలుగుతారు. అమెరికన్లు పిరికివారని నిందిస్తారు. పిరికివాడు మాత్రమే పలా యనం చిత్తగిస్తాడు. యథార్థాలను ధైర్యంగా ఎదుర్కోకుండా పారిపోతాడు. పరమ విపత్కరమైన ఈ సమయమే పరమోత్కృష్టమైన అవకాశం. అణు యుగంలో శాంతిఅనేది పొందదగిన బహుమానం. దాన్ని గెలుచుకోవాలి. దానితో పాటు అద్భుతమైన నవప్రపంచం కూడా అమెరికన్లకు లభిస్తుంది."

పదేండ్లక్రింద అన్నమాటలైనా ఎంత కొత్తగా అనిపిస్తున్నాయి ఇప్పుడు!

# 46

## రష్యా తప్పుచేయడమనడం పక్షపాతం

1961 లో కొత్త ప్రభుత్వం ప్రాంతీయ సమావేశాలు ఏర్పాటు చేసింది. ఈ సమావేశాలలో అమెరికా విదేశాంగవిధాన సమస్యలను గూర్చి అమెరికాలోని ప్రసిద్ధ పత్రికాసంపాదకులతో అధికారులైన వారితో చర్చలు జరుపబడుతాయి. [illegible] రాష్ట్రంలోని [illegible] లో 1961 అక్టోబరులో జరిగిన సమావేశంలో అప్పుడు విదేశాంగశాఖకు అండర్ సెక్రటరీగావున్న శ్రీ బౌల్స్ ప్రచ్ఛన్నయుద్ధంలో సోవియట్ రష్యా వేసే ఎత్తులను కొత్త దృక్పథంతో పరిశీలించాలని సూచించారు.

సోవియట్ బలమునూ, దాని ఉద్దేశాలనూ హెచ్చు [illegible] బడే జాతీయవిధానం మిక్కిలి ప్రమాదకరమైంది. అది ఆత్మహత్యాసదృశం. మంచిచెడ్డల విచక్షణ వుండాలి. రష్యనులందరూ పది అడుగుల ఎత్తు మనుషులు కారు।

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని కొత్తదేశాలతో [illegible] వ్యవహరించేటప్పుడు రష్యా రాజకీయ ఆర్థికరంగాలలో తరచు పొరపాట్లు చేస్తూ వచ్చిందన్నవిషయాన్ని విస్మరిస్తూ వుంటారు. రష్యా తప్పులు చేసింది. అనేక మార్లు నిట్టూర్పు విడిచింది కూడా.

అసలుపరిస్థితిని వెలుగులోకి తీసుకురావాలంటే గత పదిహేనేండ్లలో జరిగిన సంఘటనలను సమీక్షిద్దాము. ఆ సమీక్షించడం మూలా రష్యనులు ప్రశాంతంగా కూర్చొని యథార్థాలను, తమ తప్పులను వారిలోవారు ఎలా మననం చేసు

గలరా ? కాని ఒక్క జెకోస్లొవేకియా మినహా, ఎర్రసైన్యం జయించి ఆక్రమించు కున్న ప్రాంతానికి ఆవల అంగుళంమేర నేలకూడా రష్యావశం కాలేదు. సకాలంలో ధైర్యం చేసి సమైర్యంగా తగుచర్యలు గైకొన్నందువల్ల యూరపు స్వాతంత్ర్యా నికి భంగం కలుగలేదు. చరిత్రలో మునుపెన్నడూ లేనంతగా యూరపు బలీయంగా సిరిసంపదలతో ఓలలాడుతూవుంది.

1948 లో సోవియట్ యూనియన్ మరొక ప్రచ్ఛన్నయుద్ధపు ఎత్తువేసింది. అదే బెర్లిన్ దిగ్బంధనం. కాని ఆ సందర్భంలో కూడా అమెరికనులు, బ్రిటిషు వారు బుద్ధికుశలతతో వ్యవహరించి ఆ పరీక్షలో నెగ్గారు. విమానాలద్వారా బెర్లిన్‌కు సైన్యాలు, సరుకులు రవాణాచేసి రష్యావారి పోటును తట్టుకున్నారు. ఫలితమేమంటే కమ్యూనిస్టు ఉపద్రవం పాశ్చాత్యులకు తెలిసివచ్చింది.

1948 లో యుగోస్లావియా రష్యాతో తెగతెంపులు చేసుకుంది. రష్యావారు పదమూడేండ్లపాటు బెదిరించినా, లాలనచేసినా యుగోస్లావియా మళ్ళీ రష్యావారితో కలువలేదు. దీనితో ఏకశిలవంటిదిగావున్న సోవియట్ సామ్రాజ్యంలో చీలిక వచ్చే సింది. యుగోస్లావియావారు తామిప్పటికీ కమ్యూనిస్టులమనే చెప్పుకుంటున్నప్పటికీ వారు ఈనాడు సోవియట్ అదుపులేకుండా స్వతంత్రంగా సంపన్నమైన ఆర్థిక వ్యవస్థను నిర్మించుకుంటున్నారు.

1948 సంవత్సరమంతా స్టాలిన్‌కు ఊపిరిసలుపని పని అయింది. అతని అనుయాయులకు చేతినిండా పని; వారి ఒదేశంమైననే ఆ సంవత్సరం ఆసియాలో క్రొత్తగా ఆరు కమ్యూనిస్టు విప్లవాలు ఆరంభమైనవి. ఎక్కడ ? ఫిలిపీన్స్, ఇండో నీషియా, ఫ్రెంచి ఇండోచైనా, మలయా, బర్మా, భారతదేశాలలో;

ఈ ఆరింటిలో అయిదుదేశాలు కొత్తగా స్వాతంత్ర్యం పొందినట్టివి. అవి బాగా వ్యవస్థితమై లేవు. విభేదాలతో బలహీనంగా వున్నాయి. వీటిల్లో దేశీయ కమ్యూనిస్టు ఉద్యమాలను నిర్మించి, డబ్బు పెట్టుబడిపెట్టి బాగా నడిపితే అవి సుల భంగా కమ్యూనిస్టురాజ్యా లవుతాయని రష్యా ఉబలాటపడింది. కాని ఈ ఐదుదేశా లలో రష్యా ప్రయత్నాలు విఫలమైనాయి.

ఆరవదానిలో—అంటే ఇండోచైనాలో కమ్యూనిస్టులు ముమ్మరంగా ప్రచారం చేశారు. తెల్లజాతికి చెందిన ఫ్రాన్సువారు వలసపాలకులుగా వున్నారు కదా. వారిపై వత్తిడి పెట్టారు. ఈ ఒక్క దేశంలో మాత్రం రష్యా కృతార్థు రాలైంది.

నేటికి కొన్ని సంవత్సరాలక్రితమే చాలామంది పరిశీలకులు రష్యా మధ్య ప్రాచ్యంలోకి చొచ్చుకుపోతుందేమోనని ఆందోళన చెందారు. ఈజిప్టు సోవియట్ అదుపులోకి పోతోందని అనుకున్నారు. కాని ఈనాడు నాసర్ జాతీయవాదం దేశీయ కమ్యూనిజంతో పోరాడుతూవుంది. రష్యాతో అతనికిగల సంబంధాలు బాగాలేవు. మధ్యప్రాచ్య పరిస్థితి అనిశ్చయంగా, ఎవరూ జోస్యం చెప్పలేనివిధంగా వున్నప్పటికీ అక్కడ రష్యా తాను అనుకున్నది సాధించలేకపోయింది.

1955 లో రష్యావారు ఇండియా బర్మాసందర్శనాలలో క్రుశ్చేవ్ రచిపు రాజకీయ-ఆర్థిక కార్యక్రమాన్ని ఆరంభించారు. ఎన్నో వాగ్దానాలు చేశారు. ఆశ పెట్టారు. అయినా తమ లక్ష్యం సాధించలేకపోయారు.

భారతదేశానికి నేడు ఎన్నో సమస్యలున్నప్పటికీ అది విశ్వాసంతో త్వరిత గతిని అభివృద్ధిచెందుతూ వుంది. అది నేడు దృఢమైన ప్రజాస్వామ్యరాజ్యం. యుద్ధానంతరం బర్మా కూడా తన అంతరంగిక క్లిష్టపరిస్థితులను అధిగమిస్తూ ప్రజాస్వామిక ప్రభుత్వం ఆధ్వర్యాన ఆశాజనకమైన ఆర్థిక రాజకీయ ప్రగతిని సాధిస్తూ వుంది.

ఇక ఆఫ్రికాసంగతి. సోవియట్ యూనియన్ ముఖ్యలక్ష్యాలలో ఆఫ్రికా ఒకటి. రష్యా ఎన్నో ఆశలు పెట్టుకున్న ప్రాంతమది.

గడచిన పదేండ్లలో ఆఫ్రికాలో కొత్తగా 24 దేశాలు స్వాతంత్ర్యం పొంది నూతనరాజ్యాలుగా అవతరించాయి. ఇందుచే కమ్యూనిస్టులు అక్కడ వారి కార్యకలాపాలను ఉధృతంచేశారు. అందువల్ల ఆఫ్రికాలో కూడా సోవియట్ ఉపగ్రహ రాజ్యాలు తయారవుతాయని అంతా అనుకున్నారు.

ఆఫ్రికా రాజధానులనుండి మనస్క్లేశం కలిగించే ఉపన్యాసాలు అడపా దడపా వినిపించినప్పటికీ, సంబంధాలు ఒడుదుడుకులకు లోనైనప్పటికీ, ఆఫ్రికన్ జాతీయవాదం ఇంతవరకూ రష్యా ఒత్తిళ్లను ఎదిరించి నిలిచింది.

రష్యావారికి కాంగోలో ఘోరపరాజయం కలిగింది. అక్కడ రష్యాకు ఐక్యరాజ్యసమితే ప్రత్యర్థియై నిలిచింది. ఈ ఓటమి ఫలితంగానే రష్యా ఐక్యరాజ్యసమితికి ఒక్క ప్రధాన కార్యదర్శికిగాక ముగ్గురు కార్యదర్శులు సరిసమాన హోదాలో వ్యవహరించాలన్న ప్రతిపాదన తెచ్చింది. ఈవిధంగా సమితిని బలహీనం

చేయాలని రష్యా ఉద్దేశం. కాని సోవియట్ కూటమి మినహా మరేదేశమూ ఆ ప్రతిపాదనను సమర్థించలేదు. ఇదికూడా రష్యాకొక శృంగభంగమే!

అయితే ఐక్యరాజ్యసమితిలో ప్రతిదీ అమెరికన్లకు అనుకూలంగా జరుగుతున్నదని నేను అనడంలేదు. కాని సమితిని నిర్వీర్యం చేయడానికీ, లేదా దానిని క్షీణింపజేయడానికో రష్యా చేసే ప్రయత్నాలు ఇంతవరకు విఫలమే అయ్యాయి.

తుదకు కమ్యూనిస్టుచైనాలో సైతం రష్యా ఆశ్చర్యకరమైన శత్రువును, ముందుగా ఊహించిచెప్పరాని అపాయాలను ఎదుర్కొంటున్నది. ఒకప్పుడు చైనాలో కమ్యూనిజానికి దిగ్విజయం లభించిందని సోవియట్ నాయకులు సంతోషించుకున్నారు గదా. కాని ఈనాడు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి నాయకత్వం వహించే విషయంలో మాస్కో పీకింగులకు పోటీ ఏర్పడుతున్నది. సిద్ధాంతసంబంధమైన వివాదాలు కూడా తెరపిలేకుండా జరుగుతున్నాయి.

ఇక రష్యావారు గమనించవలసిన ఆర్థిక రాజకీయ పరిస్థితులను కూడా పరిశీలిద్దాము. కొన్నేండ్లనుంచి రష్యా పెట్టుబడిదారీ విధానానికీ, కమ్యూనిస్టు వ్యవస్థకూ మధ్య శాంతియుతమైన పోటీ జరగాలని అంటూవున్నది. నేడు అటువంటి పోటీని వారి గుమ్మంముందే వారు చవిచూడ లేదా?

నేటికి పదిహేనేండ్లనుంచీ పశ్చిమజర్మనీ ఒక విధానప్రకారం, తూర్పుజర్మనీ వేరొక విధానంక్రింద అభివృద్ధిచెందుతున్నాయి. ఫలితమేమిటి? ఆర్థిక రాజకీయ సాంఘికరంగాలలో పశ్చిమజర్మనీ పురోగమన గతి ఆశ్చర్యకరంగా మెప్పుకు దగినదిగా వుంది. అచటి సమాజం స్వేచ్ఛావాతావరణంలో సుఖజీవనం అనుభవిస్తూ చైతన్యవంతమై వుంది.

ఇందుకు భిన్నంగా తూర్పుజర్మనీ వైఫల్యాలకు ఆలవాలంగా వుంది. ఆర్థిక మాంద్యం ప్రబలింది. తెలివితేటలు తగ్గాయి. అచటి పౌరులే తూర్పుజర్మనీ ప్రభుత్వాన్ని తృణీకారభావంతో చూస్తున్నారు. తూర్పుజర్మనీలో సోవియట్ వైఫల్యం ఎట్టిస్థితికి వచ్చిందంటే కమ్యూనిస్టులు బెర్లిన్‌నగరంలో మధ్యభాగం పొడవునా ఒక గోడ కట్టుకొని మరతుపాకీలతో, టాంకీలతో తగు సిబ్బందినిపెట్టి తూర్పుజర్మనీ యొక్క "కమ్యూనిస్టు స్వర్గం"నుంచి ప్రజలు మూకుమ్మడిగా పశ్చిమజర్మనీ యొక్క "పెట్టుబడిదారీవిధానపు మురికిగుంట"లోకి పారిపోకుండా నిరోధించవలసి వచ్చింది.

కమ్యూనిస్టునాయకులు నిస్పృహతో ఇట్టి తెగువకు పాల్పడి తమ ప్రజలను తాము బంధించివుంచగలమని ప్రపంచానికి స్పష్టం చేశారు. తూర్పు బెర్లిన్ పాశ్చాత్యదేశాలకు సదా కొత్తసమస్యలు సృష్టిస్తున్నప్పటికీ, అది యూరప్‌లో సోవియట్ విధానవైఫల్యానికి ఎల్లకాలం జ్ఞాపకం పెట్టుకోదగ్గ చిహ్నంగా వుంది.

తమ ప్రజల మద్దతును పొందడంలో కమ్యూనిస్టులు ఒక్క తూర్పుజర్మనీలోనే విఫలులయ్యారా? లేదు. తూర్పుజర్మనీతోపాటు పోలెండు, హంగరీ, అసంతృప్తి ప్రబలిన తదితర ఉపగ్రహరాజ్యాలలో కూడా వారికి చుక్కెదురైంది. పదిహేనేండ్లపాటు నిర్విరామంగా ఎన్నో వత్తిడులతో, ఎంతో పరిశ్రమతో యుద్ధానంతరం పాలించినప్పటికీ స్కూళ్లద్వారా, కమ్యూనిస్టు రేడియోద్వారా, పుస్తకాల ద్వారా, వార్తాపత్రికల ద్వారా కమ్యూనిజం సిద్ధాంతాలను నూరిపోసినప్పటికీ పరిస్థితి ఇలా వుంది.

ఇట్టి సోవియట్ వైఫల్యాలకు తోడుగా, ప్రజలు వ్యక్తిగత స్వాతంత్ర్యం వాంఛిస్తున్నారు. ఉపగ్రహరాజ్యాలు జాతీయస్వాతంత్ర్యం కావాలంటున్నవి. సోవియట్ నియంతృత్వాన్ని ఎదిరించిన సందర్భాలు కూడా చాలా వున్నవి.

ఐదేండ్లక్రితం బుడాపెస్టు నగరవీధులలో సోవియట్ టాంకులతో పోరాడి ఇరవైఐదు వేలమంది హంగరీ యువకులు ప్రాణాలర్పించారు. 40 లక్షలమంది తూర్పుజర్మనీప్రజలు (వీరిలో ఎక్కువమంది యువకులు) తమ ఇళ్ళూ వాకిళ్ళూ వదిలి స్వాతంత్ర్యంకోసం, భద్రతకోసం పశ్చిమజర్మనీలో తలదాచుకున్నారు. ఇవన్నీ రష్యా విఫలమైందని చాటడం లేదా?

సోవియట్ యూనియన్ సాధించిన సైన్సు ప్రగతిని అమెరికన్లు తక్కువ అంచనా కట్టరాదని నేనూ అంగీకరిస్తాను. కాని రాజకీయంగా, ఆర్థికంగా రష్యా తలపెట్టిన విధ్వంసం యూరప్‌లో విఫలమైంది. దూరప్రాచ్యంలో దెబ్బతిన్నది. మధ్యప్రాచ్యంలో తిరోగమించింది. ఆఫ్రికాలో ఆశాభంగం పొందింది. ఒక్క క్యూబా మినహా లాటిన్ అమెరికాలో కూడా పరాజయం పొందింది.

ఇంతకూ నేను మనవిచేయదలచుకున్నదేమిటంటే—సోవియట్ రష్యా ప్రచ్ఛన్నయుద్ధంలో గెలవడంలేదు. ఓడిపోతూవుంది.

# 47

# కమ్యూనిస్టు సిద్ధాంతం నీరసిస్తూవుంది

జాతీయవాదం బలపడడం, పాశ్చాత్య దేశాలు మూలపడిపోకుండా అరుకాయలుగా వర్ధిల్లడంవల్ల కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రజలను ఆకర్షించలేకపోతున్నదని శ్రీ బౌల్స్ 1962 జూలై "ఫారిన్ ఎఫేర్స్" పత్రికలో వ్రాసిన వ్యాసంలో సోపపత్తికంగా విశదీకరించారు.

ప్రపంచసిద్ధాంతంగా కమ్యూనిజం వ్యాప్తిచెంది బలపడుతూవుందా? కొత్త దేశాలనూ, పాతవారినీ ఆకట్టుకోగలుగుతూ వుందా? లేక చారిత్రక సత్యానికీ, యథార్థాలకూ దూరమై కరవడితగ్గి అసంగతము, అప్రస్తుతము అయిపోతున్నదా?

ఇటీవల నేను నాలుగు ఖండాలలో పర్యటించినపుడు కమ్యూనిస్టు సిద్ధాంతానికీ, నేటి కఠోర ఆర్థికరాజకీయవాస్తవాలకూ మధ్యగల భేదాలను ప్రజలు క్రమేపి అర్థంచేసుకుంటున్నారు.

సోవియట్ యూనియన్‌లో సైతం సిద్ధాంతానికీ, ఆచరణకూ మధ్య ఎంతో వైరుధ్యం కానవస్తూవుంది. ప్రపంచం ఏవిధంగా వ్యవహరించవలెనని కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రబోధించిందో అందుకు భిన్నంగా ప్రపంచం నడుచుకుంటున్నది.

మార్క్స్ సూత్రాలననుసరించి కమ్యూనిజం అంతర్జాతీయ ఆశాజ్యోతిగా వుండాలి. ఆ జ్యోతిచుట్టూ సకలదేశాల కార్మికులూ రాజకీయ సరిహద్దులను లెక్క-చెయ్యక ఏకమై గుమికూడి ఉద్యమంపట్ల దీక్షాపరులుకావాలి. ఈరీతిగా పశ్చిమ

యూరపులోని ముఖ్యదేశాలలో అంతర్జాతీయ దృక్పథంగల కార్మిక వర్గాలను సోవియట్ యూనియన్ అధికారంలోకి తీసుకురావాలని లెనిన్ ఆశించాడు. కాని అలా జరగలేదు. లెనిన్ తీవ్రమైన ఆశాభంగం పొందాడు.

స్టాలిన్ ప్రపంచవిప్లవానికి ప్రాముఖ్యమివ్వకుండా "ఒక్క దేశంలోనే సామ్యవాదం" అన్న సిద్ధాంతానికి ప్రాధాన్యమివ్వడంటే అతను ఆత్మరక్షణకు పూనుకున్నాడని చెప్పాలి. అంటే ప్రపంచాధిపత్యం అచిరకాలసాధ్యం కావడానికి ముందు సోవియట్ యూనియన్ ఊపిరిపీల్చుకొని బలం పుంజుకోవడానికి తగిన వ్యవధి అవసరమని అతను భావించాడన్నమాట.

రెండవ ప్రపంచయుద్ధం తర్వాత ఎర్రసైన్యాలు తూర్పుయూరపును ఆక్రమించడంతో స్టాలిన్ కోరుకున్న సమయం వచ్చేసింది. సోవియట్ యూనియన్ లో విద్యాకార్యక్రమాలనూ, పారిశ్రామికాభివృద్ధినీ విస్తరింపజేశాడు. వెంటనే యుద్ధపీడితమైన పశ్చిమయూరపులో కమ్యూనిస్టు శక్తి ఆరంభమైనట్లు ప్రజలు గ్రహించారు. ఈ సంవత్సరంలో కూడా సోవియట్ పథకాలకు ప్రతిబంధకాలు ఎదురయ్యాయి. యూరపుదేశాలు ఆర్థికంగా అతివేగంగా కోలుకున్నాయి. మార్షల్ పథకం వాటిని ఆదుకొన్నది. పైగా ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక ఆ దేశాలవారికి కొంత ఉపకరిస్తుంది.

స్టాలిన్ అప్పుడు తన దృష్టిని ఆసియా ఆఫ్రికాలవైపు సారించాడు. 1948 లో ఆసియాలోని అనేక దేశాలలో కమ్యూనిస్టుల నాయకత్వాన విప్లవోద్యమాలు ఆరంభించబడ్డవి. వాటితోడు దీర్ఘకాలంగా చైనా విప్లవం అనన్యంగా సాగుతూవుంది. అన్నిటికీ అనుకూల పరిస్థితులే కన్పించాయి. కొత్తగా స్వాతంత్ర్యంపొందిన భారతదేశంలో, ఇండోనేషియాలో, బర్మాలో, మలయాలో, ఫిలిపీన్సులో ఈ విప్లవాలు విఫలమయ్యాయి. ఒక్క ఇండోచైనాలో మాత్రం ఫ్రెంచివారు అసాధ్యమైన వలసను నిలబెట్టుకోవాలని ప్రయత్నించినందువల్ల ఈ విప్లవం విజయవంతమైంది.

అలాగాయితే ఆసియా ఆఫ్రికాలలో కమ్యూనిస్టు ఉద్యమాలు అనేక కష్టాల నెదుర్కొంటున్నాయి. ఇందుకు కమ్యూనిస్టు ప్రపంచంలోని వైరుధ్యాలు, వివిధదేశీయ కమ్యూనిస్టు పార్టీలకూ రష్యాకూ మధ్యగల విభేదాలు, స్థానిక పార్టీలలోని చీలికలు, రష్యా తరచుచేసే ప్రయోగాలు, అవలంబించే మార్పులూ ప్రజల నిదర్శనాలై వున్నవి.

గమనించదగ్గ మరొక విశేషమేమిటంటే కమ్యూనిజం ప్రచారకులు తమ వ్యవస్థయొక్క ఆర్థిక సాంఘిక గుణగణాలను పేర్కొనరు పోవడం, అందుకు బదులుగా జాతీయవాదశక్తులకు కమ్యూనిజం మిత్రునివంటిదని వారు చిత్రిస్తున్నారు.

ఇందువల్ల సిద్ధాంతసంబంధమైన చిక్కులు ఏర్పడుతున్నవి. ఏమైనా తూర్పు యూరపులోని దాని ఉపగ్రహరాజ్యాలలో రష్యా చేసిన జాతీయ వ్యతిరేకకృత్యాలు ఇప్పుడు అందరికీ తెలిసినవే. పైగా జాతీయవాదానికి మాటమాత్రంగా మద్దతు ఇస్తూ సోవియట్ నాయకులు కమ్యూనిస్టు సిద్ధాంతానికి మాత్రమేగాక వారి దీర్ఘకాలిక లక్ష్యాలకు కూడా వ్యతిరేకమైన అసంగతి వైఖరి అవలంబిస్తున్నారు.

ఉదాహరణకు నేడు దక్షిణవియత్నాములో కమ్యూనిస్టు ప్రచారం ఏ తీరులో వుందో గమనించండి. అక్కడ కమ్యూనిస్టులు క్రిస్టియన్లను, బౌద్ధభిక్షువులను మార్క్సిస్టు సూత్రాలప్రకారం తిరుగుబాటుచేయండని ప్రబోధించడానికి బదులు తెల్లజాతికి చెందిన విదేశీయులు ఆధిక్యంచేస్తుంటే విలక్షణ కాదా అని హెచ్చరికలు చేస్తున్నారు. ఎందుచేత? అది వారికి వాటంగా వుంది.

రష్యావారు ఇతరదేశాలలో కమ్యూనిజం సుగుణాలను ప్రచారం చేయడం వల్ల వప్పులుడకవు. కనుక సాంప్రదాయికమైన రష్యా లక్ష్యాలను నిలబెట్టుకొనే ఉద్దేశంతో ప్రచారోద్దేశాన్ని విరమించుకుంటారు.

ఉదాహరణకు అఫ్గనిస్తాన్‌లో కమ్యూనిస్టు కరపత్రాలుగాని, పోస్టర్లుగాని, ఊరేగింపులుగాని కన్పించవు. కమ్యూనిస్టుల ప్రచారమే వినపడదు! మార్క్సిస్టు సంప్రదాయము ననుసరించి అఫ్గన్ రాజరికానికి వ్యతిరేకంగా విద్యార్థులను, కార్మికులను, కర్షకులను తిరుగుబాటుచేయండని రెచ్చగొట్టడానికి బదులు, పొరుగుననే వున్న రష్యానుంచి ఆర్థికసహాయం, సాంకేతిక మార్గదర్శకత్వం సిద్ధాంతాలతో సంబంధంలేకుండా ఇస్తాము కాబట్టి దాన్నిపొంది అఫ్గనిస్తాన్‌ను త్వరితంగా ఇరవయ్యోశతాబ్దిలోకి గొనిపోవడం మంచిదని పాలకులకు, పాలితప్రజలకు సోవియట్ రష్యా నాయకులు నచ్చజెప్పుతున్నారు.

రష్యా అవలంబించే విధానాలకూ, కమ్యూనిస్టు సిద్ధాంతలక్ష్యాలకూ చాలా చోట్ల వైరుధ్యం కనిపిస్తూవుంది. ఉదాహరణకు-అల్జీరియాలో రష్యా జాతీయ ప్రయోజనాల నాశించి రష్యానాయకులు డీగాల్ ప్రభుత్వాన్ని సంతోషపెట్టేందుకు ప్రయత్నించారు. కాబట్టే పోరు విరమింపబడేవరకూ అల్జీరియా తాత్కాలిక ప్రభు

త్వాన్ని పరిగణించకుండావుండి సిద్ధాంతరీత్యా చాలామంచి అవకాశాన్ని రష్యావారు పోగొట్టుకున్నారు.

అట్లే సోవియట్ యూనియన్ తన నూనెను ఎక్కడ మార్కెట్టు లభిస్తే అక్కడ అమ్ముతూవుంది. అందువల్ల మధ్యప్రాచ్యంలో నూనె ఉత్పత్తి జరిగే రాజ్యాలలోని కమ్యూనిస్టు ఉద్యమంపై ఎట్టి ప్రభావం పడుతుందో వారు ఆలోచించడంలేదు.

ఈలోపల రమారమి 45 దేశాలలో శాసనాలద్వారానో, లేక ప్రత్యేక ఉత్తర్వుల ద్వారానో కమ్యూనిస్టుపార్టీలను అణచివేశారు. ఇదిగాక ఆఫ్రికాలోని కొన్ని కొత్తదేశాలలో కమ్యూనిస్టుపార్టీలు 'ఆరంభంలోనే హంసపాదు' అన్నట్లు దెబ్బతిన్నాయి. ఇప్పుడు రెండు ఆఫ్రికన్ రాజ్యాలలో మాత్రమే కమ్యూనిస్టుపార్టీ చట్టబద్ధంగా పనిచేస్తూవుంది. ఒకటి ట్యునీషియా: రెండవది మెడగాస్కర్. ట్యునీషియాలో ఆ పార్టీకి ప్రాముఖ్యమే లేదు. మెడగాస్కర్‌లోని కమ్యూనిస్టులు తాము టిటో పక్షం వారమని చెప్పుకొంటారు.

ఒకవేళ ఎక్కడైనా మరో రూపంలోవున్న కమ్యూనిస్టులను అచటి ప్రభుత్వాలు సహించడం జరిగినా వాటివల్ల జరగబొయ్యే ప్రమాదమేమీలేదు. ఆ పార్టీలు నామకార్థమే వున్నాయి. కొన్నిచోట్ల కమ్యూనిస్టుపార్టీలు ఇతర పార్టీలలో కలిసిపోయి తమ ప్రత్యేకతను పోగొట్టుకున్నాయి. అలా కలిసిపోలేనిచోట్ల వాటికి కారాగారవాసం ప్రాప్తించింది.

వర్గ విభేదాలు తక్కువగావుండి జాతీయతత్వం తీవ్రంగావున్న ఆఫ్రికాదేశాలలో కమ్యూనిస్టు సిద్ధాంతం ఎట్టి కష్టాల నెదుర్కొంటున్నదో తెలుసుకోవాలంటే గినీదేశం మంచి ఉదాహరణగా వుంది. ఒకేఒక రాజకీయపక్షంగల గినీ రాజ్యంలో తమకూ కొంత స్థానం సంపాదించుకోవడానికై కమ్యూనిస్టులు వారి ఆదర్శాలను అణచుకొని ప్రభుత్వం యొక్క ఉద్ధృత జాతీయలక్ష్యాలకు తలఒగ్గారు. పోయిన డిసెంబరులో వారు అలా తలవంచుకొనిపోవడంలో కొంత అలక్ష్యం చేసేసరికి ప్రభుత్వం తమదేశంలో వున్న సోవియట్ రాయబారిని పిలిపించి దేశం విడిచి పొమ్మని ఆజ్ఞాపించింది.

భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీని ప్రభుత్వం నిషేధించలేదు. అది చట్టబద్ధమైన పార్టీగానే వుంది. కాని ఆ పార్టీలో ఐక్యతలేదు. దీనినిబట్టి అభివృద్ధిచెందుతూ

వున్న దేశాలలో కమ్యూనిస్టులు ఎట్టి చిక్కులలో పడివున్నారో విశదమవుతుంది. భారతదేశంలోని కమ్యూనిస్టులు వారికిపడే ఓట్లను నిలబెట్టుకోవడానికై తమ సిద్ధాంతాల రణగొణధ్వనిని కొంత తగ్గించుకొని గోవా, రాష్ట్రీయవంటి జాతీయ లక్ష్యాలను బలపరచవలసి వచ్చింది. పార్టీలోపల కూడా రష్యాకు అనుకూలమైన వర్గమునకూ, చైనాకు అనుకూలంగావుండే వర్గానికీ మధ్య ఎప్పుడూ సిద్ధాంతాల యుద్ధం ముమ్మరంగా జరుగుతూ వుంటుంది.

వర్ధమానదేశాలలో దేనిలోకూడా స్థానిక కమ్యూనిస్టునాయకులు బహిరంగంగా రష్యా ఏజంట్లవలె వ్యవహరించడంలేదు. కమ్యూనిస్టుపార్టీని అణచివేయడం జరగనిచోట్ల, లేక దాని ప్రాముఖ్యమేమిటిలే అని పట్టించుకోలేనిచోట్ల కొంత గొడవచేస్తూ చిక్కులు తెచ్చిపెడుతూ వుంటారు.

అయితే ఇండోనీషియా మాత్రం ఇందుకు అపవాదంగావుంది. సోవియట్ కూటమి వెలుపలగల దేశాలలో ఇండోనీషియాలో మాత్రమే కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం అత్యధికమని వాళ్ళు గొప్పగా చెప్పుకుంటారు. కాని అక్కడి కమ్యూనిస్టుపార్టీకి అంతబలం ఎలా వచ్చిందంటే ఒకేఒకకారణం కనిపిస్తుంది. ఇండోనీషియా రాజకీయాలలో వలస సమస్య ఒకేఒకటి మిగిలివుంది. అది—పశ్చిమ న్యూగినీ. ఆ సమస్య విషయంలో అక్కడి కమ్యూనిస్టుపార్టీ అచటి జాతీయశక్తులతో చేయికలిపింది. దానితో కమ్యూనిస్టుపార్టీకి మంచి బలం లభించింది. పశ్చిమ న్యూగినీ సమస్య గనుక శాంతియుతంగా పరిష్కరింపబడిందంటే, ఆర్థికాభివృద్ధి కోసం తీవ్రకృషి జరిగిందంటే ఇండోనీషియా కమ్యూనిజం ప్రస్తుత బలం తగ్గుముఖం పడుతుంది.

* * *

కొత్తగా అభివృద్ధిచెందే దేశాలలో కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రజల నాకర్షించలేక పోతున్నదని సోవియట్ యూనియన్ గ్రహించింది కాబట్టే అది ఇతరమైన రాజకీయ ఆయుధాలు రెండిటిని ప్రయోగిస్తూవుంది: ఒకటి విద్రోహచర్యలు: రెండవది విదేశీసహాయం.

దక్షిణవియత్నామ్, లావోస్‌లలో కమ్యూనిస్టులు చొచ్చుకొనివచ్చి విద్రోహచర్యలు జరపడానికి అచటి నైసర్గికస్థితులు మిక్కిలి అనుకూలమైనవి. కాని నేరుగా కమ్యూనిస్టు వత్తిడికి తక్కువ అవకాశాలున్నచోట్ల మాస్కో పీకింగులు

ప్రాయం అమెరికాకు ఎదురుతిరుగుతుంది కదా. కాని ఆయుధాల అదుపుకు సమ్మతిస్తే తనిఖీకి కూడా అంగీకరించాలి. ఆ పని రష్యావారెన్నడూ చేయరు. తమ దేశంలో ఏమిజరుగుతున్నదో ఇతరులు చూడకూడదు. అంతా అతి రహస్యం! మరి తనిఖీకి అవకాశముంటేనేకదా ఆయుధాల అదుపు వాస్తవంగా సాధ్యమయ్యేది!

నేను పేర్కొన్న ఉదాహరణ లన్నింటినిబట్టి కమ్యూనిస్టుల ప్రచారంలో, రాజకీయచర్యలలో, విద్రోహప్రయత్నాలలో, విదేశీసహాయంలో కమ్యూనిస్టు సిద్ధాంతం సోవియట్ విధానానికి ప్రయోజనరహితమైందని తెలియవస్తున్నది. ఒక్కొక్కప్పుడు కమ్యూనిస్టు సిద్ధాంతం సోవియట్ విధానానికి ప్రతిబంధకంగా కూడా వుంటున్నదేమో. రష్యావారు తమ అనుభవాన్నిబట్టి, వాస్తవ స్థితినిబట్టి ఎన్నో సర్దుబాట్లు చేసుకుంటున్నారు. అవసరమైనచోట్ల సిద్ధాంతాలు జేబులలో పెట్టుకొని తలవంచుకుపోతున్నారు. కాబట్టే కమ్యూనిస్టు సిద్ధాంతం ఎన్నో ముడతలు పడి, వంపులుతిరిగి తికమకగా తయారైంది. కొన్ని సందర్భాలలో అసలు సిద్ధాంతాన్నే పూర్తిగా విస్మరిస్తున్నారు.

కమ్యూనిస్టు సిద్ధాంతం తనను నమ్మే దేశాలను ఒక కొలికికి తీసుకురావడంలో కూడా విఫలమవుతున్నది. కమ్యూనిస్టు కూటమికి చెందిన దేశాలే పరస్పర వివాదాలు పెంచుకుంటున్నవి. అసలీ సిద్ధాంతం చేసే మేలు వివాదాలు తెచ్చిపెట్టడమే నేమో. రష్యా చైనాలకు ఎంతతీవ్రంగా వివాదం జరుగుతున్నదో చిత్రగించండి. ఈ వివాదాలు మార్క్స్ చెప్పిన ఏకైక రాజకీయ ఆర్థికగమనాన్ని భంగపుచ్చి పెద్ద గందరగోళం తెచ్చిపెడుతున్నవి. రష్యా తన అనుభవాలదృష్ట్యా తన జాతీయ ప్రయోజనాలకు అనుగుణంగా సిద్ధాంతానికి వ్యాఖ్యానాలు చేస్తూవుంది.

జాతీయవాదమనేది మార్క్స్ చెప్పిన వర్గనిర్మిత ప్రపంచం అన్న సూత్రానికి విరుద్ధమైంది. మార్పుఅనేది ఆర్థికవిషయాలు, చరిత్ర మున్నగు పాటుపోటుల మూలంగా అనివార్యంగా వస్తుందని అంటారుకదా. కాని జాతీయతత్వం మార్పును వ్యాఖ్యానాలపాలు చేస్తుంది. ఒక వ్యక్తి, లేదా ఒక వర్గంయొక్క ఆజ్ఞానుసారం మార్పులు జరుగుతాయి. మాస్కో, పీకింగ్, బెల్గ్రేడ్, తిరానా, తదితర తూర్పు యూరపు ఉపగ్రహరాజ్యాల రాజధానుల మధ్య రేకెత్తే అభిప్రాయభేదాలలో, వివాదాలలో ఈ సత్యం అమెరికన్లకు గోచరిస్తుంది.

తాము ఐక్యతతో మెలగకపోవడం ప్రమాదకరమని తెలిసివుండి కూడా కమ్యూనిస్టుదేశాలు ఐక్యసంఘటనను ఏర్పరచుకోలేకపోతున్నాయంటే 'సామ్యవాద శిబిరం'గా వాటి భవిష్యత్తుకు దెబ్బతగలడమేగాక అవిచ్ఛిన్నమైన ఐక్యతతో

# 48

# కమ్యూనిస్టు ప్రపంచాన్ని అమెరికన్లనుండి వేరుచేసే మూడు సరిహద్దులు

అమెరికా సైనిక సరిహద్దును కాపాడుకోవడానికి అవసరమైన శక్తిని యథాతథంగా వుంచుకొంటూనే ఆర్థిక, సాంస్కృతిక సరిహద్దులపై సాధ్యమైనంత హెచ్చు బిగ్గుతనానికి బదులు సాధ్యమైనంత హెచ్చుగా చతురత, పట్టు విడుపులు అలవరచుకో వలెనని శ్రీ బౌల్స్ వాదించారు. 1962 జూన్ 21 తేదీన నెబ్రాస్కా విశ్వవిద్యాలయంలో చేసిన ప్రసంగం.

అమెరికాలో విదేశాంగవిధానంపై జాతీయ ప్రజాభిప్రాయమంటూ ఒకటి ఈనాడు వుందా? మూడు అంశముల విషయంలో ప్రజాభిప్రాయం వుందనే నేను నమ్ముతున్నాను.

1. శక్తివంతమైన సైనికబలగం ఆవశ్యకత. సైనికబలాలను అవసరమైతే దురాక్రమణను తిప్పికొట్టడానికై ఉపయోగించవలెనన్న సంకల్పము.

2. అణ్వస్త్రాలు సైనికపరిస్థితిలో ఒక కొత్తస్థితిని తెచ్చిపెట్టాయి. కనుక యుద్ధం ఆరంభమైందంటే అది త్వరగా పరస్పర వినాశక వ్యాయామంగా తయారవుతుంది.

3. ఇరవై యేండ్లలోపలే ప్రపంచపటములకు ఒకకొత్త ఆకారమిచ్చి కోట్లాది ఆసియా ఆఫ్రికా ప్రజల జీవితాలను మార్చివేసినట్టి రాజకీయ ఆర్థిక శక్తుల ప్రాముఖ్యం.

అవుతున్నాయనీ, ఇందువల్ల ప్రతిదేశంలో మార్పులకోసం వత్తిడి జరుగుతూ వుందనీ, ఒక కమ్యూనిస్టుదేశం మరొక కమ్యూనిస్టుదేశంతో కలిగివుండే సంబంధాలు కూడా మార్పులకు లోనవుతున్నాయనీ వీరు అంటారు. అమెరికా విదేశాంగ విధానం ఇట్టి ధోరణిని ఇంకా ప్రోత్సహించేదిగా వుండాలని వీరి విశ్వాసం.

సైనిక అవసరాలేమిటో ఈ రెండవవర్గం వారికి తెలుసు. అధికారము, బలము అంటే సైనిక ఆయుధాలు, పారిశ్రామిక స్తోమత మాత్రమేగాక ప్రజలూ, వారిని కదిలించే భావాలు కూడా నని వీరి అభిప్రాయం. కాబట్టే అభివృద్ధిచెందే దేశాల భావాలకూ విధానాలకూ ఒక నిర్దిష్టరూపమిచ్చే న్యాయం, వ్యక్తి గౌరవం, ప్రగతి మున్నగు ఆదర్శాలకు వీరు ప్రత్యేక ప్రాముఖ్యమిస్తారు.

ఈ పూర్వవృత్తాంతాన్ని దృష్టిలో పెట్టుకొని కమ్యూనిస్టుదేశాలకూ, స్వేచ్ఛాప్రియ దేశాలకూ మధ్య సైనిక ఆర్థిక సాంస్కృతిక రంగాలలో హద్దులేమిటో, వాటిపైపడే ప్రభావమేమిటో పరిశీలిద్దాము.

ఈ మూడు సరిహద్దుల స్వభావంలో ప్రాముఖ్యంలో తేడాలున్నప్పటికీ పరుషవైఖరి కావాలనేవారు వాటిని విస్మరిస్తారు. ప్రతి సరిహద్దు ఒక అడ్డువంటిదనీ, ఆ అడ్డును అలాగే కనికరమనేది లేకుండా అట్టే పెట్టివుంచాలనీ, దానితో టాంకులను మాత్రమేగాక, వాణిజ్యం, సహాయం, ప్రజలు, భావాలు......వీటన్నిటినీ ఎదుర్కోవాలనీ వాదిస్తారు.

మంతనాలు జరపాలనేవారు ఈ మూడు సరిహద్దుల విభేదాలే ఈ అణుయుగంలో దృఢమైన విదేశాంగవిధానాన్ని నిర్ధారణ చేస్తాయని అంటారు. ఈ విభేదాలేమిటి ?

సైనిక సరిహద్దు బాల్టిక్‌నుండి ఇనుపతెర దేశాలమీదుగా బాస్ఫోరస్ వరకు వుంది. అక్కడ సోవియట్ ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక రాజ్యాల సైన్యాలు, టాంకులు, విమానాలు ఎదురుబొదురుగా తారసిల్లివుంటాయి. వాటికి మధ్య ముళ్ళతీగె వుంటుంది. అటూ ఇటూ కాపలా బురుజులు, మందుగుండు సామగ్రితో ఏమాత్రం వత్తిడి తగిలినా పెద్దపెట్టున ప్రేలుళ్ళు సంభవించగల ప్రాంతాలు వున్నాయి.

సైనిక సరిహద్దు అక్కడినుంచి సెంటో, సీటో ఒడంబడికలగుండా దక్షిణ

వుండడంవల్లా, రాజకీయంగా నిస్పృహా వ్యాపించివుండడంవల్లా ఇటలీ ఎన్నికలలో కమ్యూనిస్టులే గెలుస్తారేమోనని అప్పుడు పరిశీలకులు ఆందోళన చెందుతున్నారు. గెలిచారా, స్వేచ్ఛాయుత ఎన్నికల చరిత్రలో వారిది నిజమైన, మొట్టమొదటి విజయమవుతుంది. అటు చైనాలంతర్యుద్ధంలో కమ్యూనిస్టులకే విజయం లభించేటట్టుగావుంది.

ఈ విధంగా ఫ్రాన్సు సరిహద్దులనుండి జపాన్ సముద్రంవరకూ ఏకఖండంగా కమ్యూనిస్టు సామ్రాజ్య మేర్పడే ప్రమాదాన్ని అమెరికన్లెదుర్కొంటూ వున్న సమయమది. అటువంటిదే జరిగితే దానిప్రభావం యుద్ధంవల్ల పాడుబడ్డ యూరపుదేశాలపైనా, కొత్తగా స్వాతంత్ర్యంపొందిన ఆసియాదేశాలపైనా ఎలా వుంటుందో అతిశయోక్తులతో చెప్పవలసినపనిలేదు.

ఇట్టి ముఖ్య సంవత్సరపు ఫిబ్రవరి, మార్చినెలల్లో లోపల లోపలే రగుల్కొంటూవున్న టిటో-స్టాలిన్‌మధ్య విభేదాలు బైటకివొచ్చాయి. జూన్‌నెలలో యుగొస్లావియా ధైర్యంతో తాను సోవియట్ అదుపు, ఆజ్ఞలనుంచి బైటపడుతున్నట్లుగా ప్రకటిస్తూ అమెరికా సహాయం అర్థించింది.

ఏమిచెయ్యడమూ అన్నప్రశ్న అధ్యక్షుడు ట్రూమన్‌నూ, ఆర్థర్‌వాండెన్‌బర్గ్ నాయకత్వం క్రిందగల రిపబ్లికన్ కాంగ్రెస్ సభనూ ఎదుర్కొంది. చారిత్రక ప్రాముఖ్యంగల ఘట్టమది. యుద్ధకాలంలో యుగొస్లావియావారు 30 నాజీ డివిజనుల సైన్యంధాటికి తట్టుకొని వీరోచితంగా ప్రతిఘటించారు. అయితే ఇటీవలే పాశ్చాత్యదేశాలను ఎదిరించే కమ్యూనిస్టురాజ్యకూటమిలో యుగొస్లావియా ప్రముఖ రాజ్యంగా వ్యవహరిస్తూవుంది. అందుచేత యుగొస్లావియా అంటే అమెరికన్ ప్రజలకు అసలే ఒళ్ళుమంటగావుంది.

అయినప్పటికీ జాతీయస్వాతంత్ర్యం స్థాపించుకోవాలని టిటో పెనగులాడుతూన్నప్పుడు అమెరికన్లు అతన్ని ఆదుకోకపోతే యుగొస్లావియా మళ్ళీ స్టాలిన్ వలయంలోకే పోవలసిన స్థితిరావచ్చు. ఇట్లా కమ్యూనిస్టు సామ్రాజ్యంలో బీట ఇచ్చినట్లే ఇచ్చి మళ్ళీ అతుక్కుపోవడం జరుగవచ్చు.

కనుక ఎన్నో తర్జన భర్జనలు జరిగినతర్వాత యుగొస్లావియా స్వాతంత్ర్యానికి సహాయపడటం అమెరికాకే మేలని నిర్ణయించబడింది. వెంటనే సైనిక సామగ్రి, ఇతరసరుకులు ఓడలపై పంపబడ్డాయి. 1952 లో అధ్యక్షుడుగా ఐసెన్

చూపింది. ఉదాహరణకు పోలెండు భూమిని సామూదాయికంచేసే ఆలోచనను విరమించుకున్నదంటే అందుకు కారణం యుగొస్లావియా స్వతంత్ర ప్రవర్తనమే.

అయితే పోలెండుదేశం తూర్పుజర్మనీలోనూ, సోవియట్ యూనియన్ లోనూ గల ఎర్రసైన్యాల మధ్య వుందికాబట్టి విదేశాంగ విధానానికి సంబంధించిన విషయాలలో రష్యాను బలపరుస్తూ వుంటుంది. అయినా సైనిక సరిహద్దుకు ప్రక్కగా అమెరికా తగుమాత్రపు ఆర్థికసహాయం చేస్తూవుండడంవల్ల పోలిష్ ప్రజలు కొంత ఆత్మవిశ్వాసంతో స్వతంత్రించి వ్యవహరించ గలుగుతున్నారు. పోలెండు విదేశీవ్యాపారంలో నూటికి 42 వంతులు ఇప్పుడు కమ్యూనిస్టేతర దేశాలతో జరుగుతూ వుంది.

యుగొస్లావియాకు ఆర్థికసహాయం చేయడంలో మొదటినుంచీ అమెరికా లక్ష్యం ఒక్కటే. ఆ దేశప్రభుత్వం దాని ఇచ్ఛానుసారం నిర్ణయాలు గైకొనవలె నన్నది అమెరికా ముఖ్యలక్ష్యం. దానితోపాటు ఇతర కమ్యూనిస్టుదేశాల ప్రజలలో స్వాతంత్ర్యభావాలు కలగాలనికూడా అమెరికా ఆశయం. ఈ లక్ష్యం చాలావరకు సిద్ధించిందనే నాకు అనిపిస్తున్నది.

ఇక ఆర్థిక సరిహద్దులోని ముఖ్యవిభాగం సంగతి ఆలోచిద్దాము. అక్కడ ఉభయవర్గాలవారూ వాదోపవాదాలు సాగిస్తూనే వున్నారు. ముఖ్యవిభాగం అంటే. ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికాలలో కొత్తగా ఆవిర్భవిస్తూ వున్న దేశాలని నా భావం.

ఈ ప్రాంతంలో అమెరికా విధానాలను బలపరిచే దేశాలకు మాత్రమే సహాయం చేయాలని పరుషమైన ఖరి వర్గంవారు వాదిస్తారు. ఇది మంచిదికాదు. అయితే అది లేకపోతే ఇది అన్న పైఖరివల్ల కొత్తగా అభివృద్ధిచెందుతూవున్న దేశాలు ఒకవంక మాస్కోకు దాసులుకావడమో, లేక వాషింగ్టన్ చెప్పుచేతలలో వుండడమో నిర్ణయించుకోవలసిన వారవుతారనీ, లేదా పేదరికాన్ని అనుభవిస్తూ అల్లకల్లోలంపాలు కావలసివుంటుందనీ మంతనాలు సాగాలనేవారు అంటారు.

అభివృద్ధిచెందుతూవున్న ఖండాలలో ఇప్పుడు అమెరికన్లు ఎదుర్కొంటూ వున్న పరిస్థితిని పరిశీలించారంటే అన్నిఅంశాలూ స్పష్టమవుతాయి.

ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని కొత్తదేశాలు అవిద్య, అనారోగ్యం, దారిద్ర్యం, అన్యాయం మున్నగు దారుణ సమస్యలతో సతమత మవుతు

న్నాయి. ఈ చెడుగులన్నిటినీ నిర్మూలించడానికై కృషి జరుగుతూ వున్నదని ఆ దేశాల ప్రజలను నమ్మించగలిగితేనే క్రమబద్ధమైన రాజకీయ పురోగతి సాధ్యమవుతుంది.

అయితే ఈ కొత్తదేశాలకు సహాయం చేయడంకోసం అమెరికా చేస్తూ వున్న ప్రయత్నాలు ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికాలలోని జగడగొండులైన కొందరు నాయకుల రాజకీయ పోకడలవల్ల చిక్కులపాలవుతున్నవి. ఆ నాయకులు గతంలో జాతివివక్ష చూపే పాశ్చాత్యవలసదేశాలతో, ఆర్థికంగా మంచిస్థితిలో వున్న దేశాలతో తాము లోగడ పొందిన అనుభవందృష్ట్యా అమెరికన్లను అనుమానిస్తూ తప్పుబెంచే వైఖరితో వ్యవహరిస్తూ వుంటారు.

ఈ ఆఫ్రో - ఏషియన్ నాయకులు ఐక్యరాజ్యసమితిలోనూ, ఇతరచోట్లా అమెరికాను విమర్శించినప్పుడు అమెరికా పత్రికాసంపాదకులు వారిని కృతఘ్నులనీ, కమ్యూనిస్టుల వలలో పడ్డవారనీ నిందిస్తూ సంపాదకీయాలు వ్రాస్తూ వుంటారు. అలా విమర్శించిన దేశాలకు అమెరికన్లు చేసే సహాయాన్ని వెంటనే నిలిపివేయాలని కాంగ్రెసు సభ్యులు ప్రభుత్వాన్ని కోరడం జరుగుతూన్నది.

అమెరికన్లకు కలిగిన నిరాశలదృష్ట్యా ఇట్టి అభిప్రాయాలు కలగడం సహజమే అయినప్పటికీ వాటివల్ల యథార్థమైన ప్రపంచపు చిక్కులు తీరవు.

పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన దేశాలు ఆసియా ఆఫ్రికా లాటిన్ అమెరికా దేశాల ముడిసరుకులపైన, మార్కెట్లపైన ఆధారపడి వుంటున్నాయి కాబట్టి ఆ ముడిసరుకులపైన, మార్కెట్లపైన ఎలాగైనా పెత్తనం సంపాదించాలని కమ్యూనిస్టుల ముఖ్యలక్ష్యం. ఆ ప్రయత్నం సాగకుండా చేసి, వర్ధమానదేశాలు వాటి స్వాతంత్ర్యాన్ని సుదృఢం చేసుకొని రాజకీయ సుస్థిరత్వంతో, ఆర్థిక ప్రగతితో అలరారేట్టు చేయడమే అమెరికా విదేశాంగవిధాన ప్రాథమిక లక్ష్యం.

కొత్తదేశాలు ఎప్పుడెలా వ్యవహరిస్తాయో చెప్పడం కష్టసాధ్యమని అమెరికన్లకు అనిపించినప్పటికీ అవి బ్రిటిషు, ఫ్రెంచి, బెల్జియన్, డచ్చిపరిపాలనలతో పోరాటం జరిపి విముక్తమైనవి కాబట్టి ఆ పరిపాలనలకు బదులు నిర్దయాత్మకమైన రష్యా పాలనను ఎన్నటికీ కోరుకోవు. పైగా వాటి చరిత్ర, సంస్కృతి విశిష్టమైనవి. అవి వైవిధ్యాన్ని కావాలంటాయిగాని విదేశీయ సిద్ధాంతాలకూ, ఒత్తిడులకూ ఎన్నటికీ లొంగవు.

దేశీయమైన ఇట్టి ప్రతిరూలశక్తులు సోవియట్ ఆధిపత్యంక్రింద ప్రపంచం వుండవలెనన్న లెనినిస్టుల లక్ష్యానికి బలీయమైన అడ్డంకులుగా వుంటాయి. 'తనిసి కాని గుడిసెకప్ప'దన్న సామెతగా తల బొప్పికట్టిన తర్వాత రష్యావాడు ఈ నిరోధ సత్యాన్ని గుర్తిస్తున్నారు.

పట్టువిడుపులతో, సమర్థతతో ఆర్థిక సహాయకార్యక్రమాలను అసలు జరిపితే ఇదివరకే నిర్మితమైవున్న ఈ అడ్డుగోడలు మరింత బలపడతాయని మంత్ నాలు సాగాలనేవారు అంటారు. ఏమైనా ఈ కృషివల్ల కలిగే ప్రయోజనాలను, దీని పరిమితులను స్పష్టంగా గ్రహించాలని వారి ఉద్దేశం.

అభివృద్ధిచెందేదేశాల ప్రకటనలనూ, వాటి విధానాలనూ అదుపులో పెట్టడం అమెరికా లక్ష్యం కాదు. ప్రపంచంలో ఖ్యాతి తెచ్చుకోవడానికై రష్యాతో పోటీ పడటం అమెరికాలక్ష్యం కాదు. ఐక్యరాజ్యసమితిలో ఓట్లు కొనడం అమెరికా లక్ష్యం కాదు.

డబ్బిచ్చి వ్యక్తుల్ని కొంటే ఎంతో అమెరికన్ డాలర్లతో కొనగలిగిన ప్రభుత్వాలూ అంతే! అవి నిలవవు. పైగా అమెరికావంటి సంపన్నదేశాలను పేద దేశాలు ప్రేమిస్తాయని అనుకోవడం భ్రమ. ధనికుణ్ణి పేదవాడు ఆప్యాయతతో ప్రేమిస్తాడా? కాకపోతే గౌరవం చూపుతాడు. అమెరికా సంగతీ అంతే.

కాబట్టి అమెరికా అసలు లక్ష్యాలు రెండువిధాలుగా వుండాలి. మొదటిది— స్వయంసహాయంతో పైకిరాజూచే దేశాలకు తోడ్పడి వాటి ఆర్థికప్రగతికి అవకాశ మివ్వడం. రెండవది—అది ఎలా చేయాలంటే, ప్రజలు విస్తృతంగా ఆ కృషిలో పాల్గొనాలి. జాతీయ స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవడంలో ప్రతి కుటుంబం భాగ స్వామి కావాలి.

ఈ రెండు లక్ష్యాలను దృష్టియందుంచుకొని పరస్పరవిరుద్ధములైన పరుష వైఖరితో, మంతనాల వైఖరితో భారత రిపబ్లిక్ విషయంలో వ్యవహరించే వైనాన్ని పరిశీలిద్దాం. కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో భారతదేశం పెద్దది కదా.

ప్రపంచంలో భారత, చైనాలు పెద్ద జనాభాగల దేశాలు. ఈ రెండు దేశా లలో జరిగే సంఘటనలను అమెరికన్లు పదేండ్లనుంచీ చూస్తున్నారు. చైనా నియం

మైనదనీ, నీతిబాహ్యమైనదనీ విమర్శిస్తారు. కాదు, దీనివల్ల ప్రజలు ఒకరినొకరు అర్థంచేసుకోగలుగుతున్నారనీ, ఒకరి మంచిచెడ్డలు మరొకరికి తెలిసివస్తున్నాయనీ మంతనాలు సాగాలనేవారు అంటున్నారు.

ప్రాచ్యపాశ్చాత్యదేశాల మధ్య ఇప్పుడుగల స్పర్ధలు చివరకు సమసిపోయాయంటే అది సైనిక సరిహద్దుకు అటూ ఇటూ గల ప్రజల పరస్పర అవగాహన ఫలితమేనని చెప్పాలని వారంటారు.

కొంతవరకు అమెరికన్లందరూ అలవాటనే గ్రహపాటుకు దాసులై వున్నారు. కేవలం అపార్థాలనే మనసులో పెట్టుకొని ఎదుటివారిని అంచనావేదుతూ వుంటారు. అమెరికా మనోముద్రలు చెరిగిపోవు. అవి చెరగాలంటే భావాలలో, ఆలోచనలలో, కళలలో, విజ్ఞానశాస్త్రాలలో ఆదానప్రదానాలు జరగాలి. ఒకరి సాంస్కృతిక సంపద మరొకరికి తెలిసిరావాలి. స్థితిగతులు తేటతెల్లమైనప్పుడు వివేకంతో వ్యవహరిస్తారు.

నా వరకు నాకు ఈ రెండు వైఖరులలో దేన్ని వరించాలన్న విషయంలో విస్పష్టమైన అభిప్రాయం వుంది. స్వేచ్ఛావాతావరణంలో జీవించే అమెరికనులు భావాల కెందుకు భయపడాలి? భావాలకు భయపడవలసినవారు కమ్యూనిస్టులు కదా?

* * *

మరి భవిష్యత్తు మాటేమిటి?

అణ్వస్త్ర ప్రతిష్టంభన ప్రమాదభరితమైంది. అయినా సైనిక సరిహద్దు విషయంలో అమెరికా వైఖరి దృఢమైంది. రష్యావారు మడతపేచీలు పెట్టారు. గదువిస్తూ హెచ్చరికలు చేశారు. అవన్నీ గడచిపోయ్యాయి. స్వేచ్ఛాజీవులైన ప్రజలు వారి స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకోవడానికి వజ్రసంకల్పులై ఎలా నిలుస్తారో తెలుసుకోవాలంటే సైనిక సరిహద్దుపై ఒక చౌకీఅయిన పశ్చిమబర్లిన్ మహోజ్జ్వల తార్కాణంగా వుంది.

గడచిన రెండేండ్లలో అమెరికా సైనికశక్తి బాగుపడింది. అమెరికా బలగాలు ఎక్కడికిపడితే అక్కడికి తరలిపోగలస్థితిలో వున్నవి. కనుకనే సైనిక సరిహద్దును కాపాడే స్తోమత కలిగివున్నవి. ఈలోపల చరిత్రలో ఎన్నడూ లేనంతగా పారిశ్రామిక అభివృద్ధిని సాధించిన రెండు గొప్పదేశాల మధ్య స్పర్ధలు, వైరాలు మంచివికావనీ, ఒకదాన్ని నాశనంచేయడానికి రెండవది ఎంత స్తోమత

సంపాదించుకొంటుందో చూడాలనే బుద్ధి ఆత్మవినాశకరమైందనీ సోవియట్ నాయకులు గ్రహిస్తారని అమెరికన్లు ఆశిస్తారు.

ఆర్థిక సాంస్కృతిక సరిహద్దులపై పురోగమనం, పరివర్తనం కలిగే శుభసూచన లున్నాయి.

కమ్యూనిస్టేతర ప్రపంచం మున్నెన్నడూలేని రీతిగా ఆర్థిక ప్రగతి సౌధ ప్రాంగణంలో వుంది. స్వేచ్ఛాజీవులైన ప్రజలతో సుసంపన్నమైన, సుసంబంధ శోభితమైన సమాజాన్ని అమెరికన్లు నిర్మిస్తూ పోయినకొద్దీ సోవియట్ నాయకులు కూడా వారి వ్యవస్థలోని పరుషత్వాన్ని బిడ్డుదనాన్ని విడనాడి సరసవైఖరి అవలంబించవలసిన స్థితికి రావచ్చు.

ఈలోపల ఆర్థిక సాంస్కృతిక సరిహద్దులకు అటూ ఇటూ వ్యాపారం, పెట్టుబడి, సాంకేతికులు, శాంతిసేనదళాలు, గోధుమలు, ప్రత్తి, వాద్యసమ్మేళనాలు, భావాల మార్పిడి, ఇచ్చిపుచ్చుకోవడం జరిగిందంటే మూతపడ్డ మనస్సులు తెరచుకొని, సిద్ధాంతాల బిడ్డుసడలి, వైవిధ్యానికి అవకాశం కలుగుతుంది.

అమెరికన్లు ప్రయోగాలపట్ల అభిలాషగలవారమనీ, కొత్త పరిస్థితులకు సర్దుబాటు చేసుకోగలవారమనీ, కొత్తమార్గాల నూహించడంలో ప్రగతిశీలురమనీ గర్విస్తూ వుంటారు. ప్రజాస్వామిక సూత్రాలపై అచంచలవిశ్వాసంతో శక్తివంతులయ్యారు. ఎట్లా అయ్యారు? అమెరికన్లకు బిడ్డుతనం లేదుకాబట్టి. ఉన్నతావునుంచి కదలమని అనరుకాబట్టి. నిర్మాణాత్మకదృష్టితో వ్యవహరిస్తారు కాబట్టి.

ఇప్పుడు సమంజసశాంతిని ఆకాంక్షిస్తూ వున్న అమెరికన్లు అమెరికా సంప్రదాయాన్ని మరలుకోవడమెందుకు? అభిమానధనులైన వర్ధమానదేశాలవారు అమెరికన్లు ఏ దృష్టితో ప్రపంచాన్ని చూస్తారో ఆ దృష్టితోనే చూడాలని పట్టుపట్టడం దేనికి? జెఫర్సన్, జాక్సన్, లింకన్ కాలములనాటి ఉదీయమాన అమెరికా కల్లాకపటం లేకుండా తన ఉద్దేశాలను ఎంత స్పష్టంగా చెప్పేదో, ఎంతగా స్వతంత్రించి వ్యవహరించేదో, ఏ బాటుకీ వెందకుండా ఎలా నిబ్బరంగా వుండేదో అలా మరే కొత్తదేశమైనా వుండదా?

* * *

ఇంతకూ అసలుప్రశ్న అలాగేవుంది: నేటి ప్రపంచపు చిక్కులకు దీటైన

విధంగా ఒక ప్రజాస్వామిక ప్రభుత్వం చక్కని విదేశాంగవిధానాన్ని రూపొందించి దాన్ని సమర్థతతో అమలుపరచగలదా ?

ఈ ప్రశ్నకు సమాధానం అమెరికా అధ్యక్షునికి మంచి స్థానబలమిచ్చి, ఆయన ప్రపంచనాయకత్వం వహించగలిగే విధంగా జాతీయ ప్రజాభిప్రాయాన్ని అమెరికన్లు సమీకరించడంపై ఆధారపడివుంటుంది.

అట్టి ప్రజాభిప్రాయాన్ని రూపొందించేందుకై యుద్ధానంతరం నుంచీ అమెరికన్లు యెంతో కృషిచేశారు. అయినా విభేదాలింకా వున్నాయి. కారణమేమి టంటే, ఒకవంక ఉపగ్రహరాజ్యాలపట్ల, మరొకవంక ఆసియా ఆఫ్రికాలలోని నూత్న విబంధదేశాలపట్ల అమెరికన్లు అవలంబించే వైఖరే।

ఈ తేడాయే చరిత్రలో ఒకానొక విపత్కరఘట్టంలో అమెరికన్ విదేశాంగ విధానం ఉపయుక్తంకాకుండా చేస్తోంది. ఈ గండిని పూడ్చాలంటే అరమరలు లేకుండా బాధ్యతాయుతమైన చర్చలు బహిరంగంగా జరగాలి. ఇచ్చట నేను వ్యక్తంచేసిన అభిప్రాయాలు ఆ చర్చలో పాల్గొన్న ఒక వ్యక్తి భావాలుగా స్వీకరించాలని నా మనవి.

# 2

# ప్రజల కలలు నిజం చేయడం

# ద్వితీయభాగమును గూర్చి

ప్రథమ భాగములో ప్రపంచ సమస్యలను చర్చించాను. ఆ సమస్యలను అమెరిక ఎంత దృఢంగా ఎదుర్కొంటారనేది అమెరికా సమాజంపై సంపల్ల నిర్ధారణ అవుతుంది. మూడు అంశాలు అమెరికా సమాజాన్ని రూపొందిస్తాయి.

... అమెరికా అంతరంగిక ఆర్థికవ్యవస్థస్తోమత, దాని చురుకుదనం.

... అమెరికా ఫెడరల్ ప్రభుత్వం అవలంబించే వైఖరి. పట్టువిడుపులు. సమతూకవిధానం. ప్రభుత్వయంత్రాంగం. శాసనసభలు. న్యాయస్థానాలు. రాజకీయవ్యవస్థలు చూపే సరసవైఖరి.

... సాటి అమెరికనులకు గౌరవం, అవకాశాలు, న్యాయం చేకూర్చడానికై అమెరికన్లు ప్రదర్శించే నైతిక బాధ్యత.

ఈ మూడు అంశాల విషయంలో అమెరికన్లు విఫలు లయ్యారంటే ప్రపంచవ్యాప్త ఆర్థిక సవాలును ఎదుర్కోవడానికీ, విదేశాలలో రాజకీయ విపత్తులను చక్కబెట్టడానికీ, ఇతర ప్రజల మన్ననను చూరగొనడానికై జాతీయసంఘటితశక్తిని కూడబెట్టడానికీ అమెరికాకు తాహతువుండదు.

ద్వితీయ భాగములో ఈ అంశములకు సంబంధించిన వ్యాసాలు, ప్రసంగాలు వున్నవి. ఇవి అన్నీ 17 సంవత్సరాలలో వ్రాయబడ్డవి. వీటిని నేను మళ్ళీ చదువుతూ వుంటే కొన్ని అంశాల విషయంలో అమెరికన్లు సాధించిన ప్రగతిని తెలుసుకొని సంతుష్టాంతరంగుడనయ్యాను. కొన్నిటి విషయంలో విఫలులమైనందుకు విచారించాను.

అమెరికాలో ఇంకా కొంత నిరుద్యోగం, జాతివిచక్షణ విధానం, అవినీతివుండడం, పాఠశాలలు ఇంకా కొన్నిచోట్ల తక్కువగా వుండడం, కొన్ని పట్టణాలు అశుభ్రంగా వుండటం, రాష్ట్రశాసనసభలలో

అందరికీ తగ్గ ప్రాతినిధ్యం లేకపోవడం, వాషింగ్టన్‌లో ప్రభుత్వ యంత్రాంగ సంబంధమైన అడ్డంకులు—ఇవన్నీ అమెరికా జాతీయ అంతరాత్మకూ, ఆత్మవిశ్వాసానికీ, అర్హతకూ బరువుభారాలు.

పదేండ్ల క్రితం నేను కనెక్టికట్ రాష్ట్ర గవర్నరుగా వున్నప్పుడు ఎదుర్కొన్న సమస్యలే 1962 సంవత్సరపు జాతీయశాసనప్రతిష్టం భనకు ప్రాతిపదికలుగా వున్నవి. రాష్ట్రాల హక్కులను గూర్చి గొంతు చించుకొనే రాజకీయనాయకులే రాష్ట్రబాధ్యతలను నిరాకరిస్తూ వుంటారు !

అమెరికా ప్రపంచలక్ష్యాలలో చాలా వాటి విషయంలో ఉభయ పక్షాల ప్రజాభిప్రాయం సాధించబడింది. అయితే దానికి తగ్గట్టుగా అమెరికా సమాజంపైనం ఎలా వుండాలో నిర్ధారితంకాలేదు. ఈ గండి ప్రమాదకరమైంది. దీన్ని పూడ్చే ప్రయత్నం జరగాలి.

—చెస్టర్ బౌల్స్

విభాగం-1

# సంపన్నసమాజం లక్ష్యంకేసి....

ఈ దేశంలో నిజమైన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని అమెరికన్లు గ్రాహ్యం చేసుకోవాలన్నా, అమెరికన్ సంప్రదాయాల ననుసరించి వ్యక్తి జీవితాన్ని బాగుచేయాలన్నా ఒకటే మార్గం వుందని నా ప్రగాఢవిశ్వాసం. ఏమి టంటే—పూర్తి ఉత్పత్తి, పూర్తి ఉపాధికల్పన సాధించబడాలి. వ్యాపారస్థులకు మంచిలాభాలు వుండాలి. కార్మికులకు పనులు, స్థిరమైన వేతనాలు లభించాలి. రైతుల ఆదాయాలు పెరగాలి. ఇట్టి వాతావరణం ఏర్పడితేనే అమెరికన్లు భయం నుండి, భద్రతలేదన్న ఆందోళననుండి విముక్తులు కాగలరు. పూర్వం అమెరికన్లలో ఇట్టి భయాందోళనలు వుండడంవల్లనే ధైర్యంతో, ఊహాపోహలతో ఆలోచించే శక్తి అమెరికన్లకు లేకుండేది.

సెప్టెంబరు 1, 1945.

# 1

# శాంతి, అందరికీ ఉపాధికల్పన

జపానుపై అమెరికా విజయం సాధించిన మూడు వారాల తర్వాత యుద్ధానంతర ఆర్థికవ్యవస్థలో అందరికీ పనులు, ఉద్యోగాలు కల్పించే నిమిత్తమై సర్కారు ఉపాధికల్పన బిల్లునుగూర్చి ప్రముఖ వ్యక్తుల అభిప్రాయాలను తెలుసుకోవడానికి సెనేట్ బ్యాంకింగ్ కరెన్సీ సంఘం సమావేశాలు జరిగాయి. అప్పుడు ధరవరల పాలక సంస్థ అధిపతిగావున్న శ్రీ బౌల్స్ 1945 సెప్టెంబరు 1 వ తేదీన ఈ వాఙ్మూలమిచ్చారు.

యుద్ధం ముగిసింది. శాంతి ఏర్పడుతూవుంది. దీనితో అమెరికన్ ప్రజలు నవ వ్యవస్థ ప్రాంగణంలోకి వచ్చారు.

యుద్ధం జరుగుతున్నప్పుడు అమెరికా పారిశ్రామిక యంత్రాంగం ఎంతటి బ్రహ్మాండమైన ఉత్పత్తిని సమకూర్చగలదో ప్రత్యక్షంగా చూశాము. అట్టి పారిశ్రామిక యంత్రాంగమే యుద్ధకాలపు ఉత్పత్తినుంచి శాంతికాలపు ఉత్పత్తికి వచ్చేసరికి ఎట్టి జీవనప్రమాణాలను సాధించగలదో, మంచి ఇండ్లు, మంచి విద్య, ఆరోగ్యం, వినోదం, విశ్రాంతి ఇవ్వగలదో తెలియనివారు అమెరికన్లలో ఎవరూలేరు.

ఇప్పుడు మీ సంఘం ముందు ముర్రే-పాట్మన్ బిల్లువుంది. స్వేచ్ఛావ్యాపార విధానం అనుసరించి సంపత్సమృద్ధులను సాధించడం అమెరికనుల జాతీయవిధానమని ఈ బిల్లు చెబుతున్నది.

చాలామంది ఈ బిల్లు అంటేనే భయపడుతున్నారు.

కొందరికి ప్రభుత్వప్రణాళిక అంటే అయిష్టం. అపనమ్మకం. వారు ఈ

బిల్లును వ్యతిరేకిస్తున్నారు. ఈ బిల్లు నిర్దేశించే పరిమిత ప్రభుత్వ ప్రణాళిక అంటే వారికి భయం.

చాలామేరకు ప్రభుత్వం అదుపులేకుండా, ఈ బిల్లులో చెప్పబడ్డ ప్రతిపాదనలేవీ అమలుజరుగకుండా అమెరికనులు మరొక ఆర్థికమాంద్యాన్ని, 1932 వంటి తీవ్రమైన ఆర్థిక సంక్షోభాన్ని దాటగలరనే మీరు నిజంగా భావిస్తున్నారా?

ఈ బిల్లు ఫెడరల్‌ప్రభుత్వాన్ని దివాలా తీయిస్తుందని చెప్పి మరికొందరు దీనిని ప్రతిఘటిస్తున్నారు. కాని పడుతూ లేస్తూవుండే జాతీయోత్పత్తితో, లక్షలాది నిరుద్యోగులైన ప్రజలతో ఒక బడ్జెట్ పరిమితికి లోబడి అమెరికా ఫెడరల్ ప్రభుత్వానికి అవసరమైన డబ్బును ఎట్లా సంపాదించడం?

మరికొందరు నిరాశానిస్పృహలతో క్రుంగి ఈ బిల్లు మంచిదికాదంటున్నారు. స్వాతంత్ర్యానికీ, భద్రతకూ పొసగదని వారి నమ్మకం. స్వేచ్ఛావ్యాపారవిధానాన్ని నిలబెట్టుకోవడానికి తాపత్రయపడితే ఆర్థికసమృద్ధి, సంక్షోభమనే వలయం తప్పదని వారంటారు. లోగడ ఈ వలయాన్ని అమెరికన్లు ఎన్నోమార్లు దాటివచ్చారనీ, అయినా అమెరికాదేశం గొప్పదేశమయిందనీ వారి వాదం.

ప్రైవేటు వ్యాపారవాణిజ్యాల విధానం ద్వారా ప్రపంచం మొత్తంలో గొప్ప పారిశ్రామిక యంత్రాంగాన్నీ, గొప్ప జీవనప్రమాణాలనూ అమెరికన్లు సాధించారు. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని బలిఇవ్వకుండానే దీన్ని సాధించారు.

అయినప్పటికీ ఈ సమృద్ధి—సంక్షోభముల వలయాన్ని ఇలాగే సాగనిస్తే అమెరికన్లు సాధించిందంతా నాశనం కావచ్చు.

వ్యక్తిస్వాతంత్ర్యం అమెరికా అసలు గమ్యస్థానం కదా? ప్రతి స్త్రీకి, ప్రతి పురుషునికి ఏ రంగంలోనైనా ప్రవేశించి పనిచేసి సంపాదించే హక్కు వుందికదా? ఆ హక్కును పరిరక్షించడం అమెరికా కర్తవ్యం కదా?

అమెరికా ఆర్థికవ్యవస్థను లక్ష్యాన్ని సాధించే సాధనంగాకాక లక్ష్యంగానే భావించేవారు తప్ప తక్కినవారెవరూ ఒక దశాబ్దంక్రిందటి ఆర్థికమాంద్య మప్పుడు వ్యక్తిస్వాతంత్ర్యం, వ్యక్తికి అవకాశాలు వుండేవని అంటారని నేను అనుకోను.

ఈ దేశంలో నిజమైన ఆర్థికస్వాతంత్ర్యాన్ని అమెరికన్లు గ్రాహ్యం చేసుకోవాలన్నా, తమ అమెరికన్ సంప్రదాయాల ననుసరించి వ్యక్తి జీవితాన్ని బాగు

చేయాలన్నా ఒకటే మార్గముందని నా ప్రగాఢవిశ్వాసం. ఏమిటంటే— పూర్తి ఉత్పత్తి. పూర్తి ఉపాధికల్పన సాధించబడాలి. వ్యాపారస్థులకు మంచి లాభాలు వుండాలి. కార్మికులకు పనులు, స్థిరమైన వేతనాలు లభించాలి. రైతుల ఆదాయాలు పెరగాలి. ఇట్టి వాతావరణం ఏర్పడితేనే అమెరికన్లు భయంనుంచి, భద్రతలేదన్న ఆందోళననుండి విముక్తులు కాగలరు. పూర్వం అమెరికన్లలో ఇట్టి భయాందోళనలు వుండడంవల్లనే ధైర్యంతో ఉత్సాహంతో. ఆలోచించేశక్తి అమెరికన్లకు లేకుండేది.

ఈ బిల్లు ఆమోదించబడినందువల్ల శాంతికాలంలో అమెరికాకు పూర్తిఉత్పత్తి, పూర్తి ఉపాధికల్పన సాధ్యమవుతాయి. అయితే ఈ బిల్లే కార్యక్రమం కాదు. అమెరికా జాతీయవిధానం ఇందులో చెప్పబడివుంది. దాన్ని సాధించాలంటే ఒక కార్యక్రమం వుండాలని ఇది నిర్దేశిస్తున్నది.

త్వరలోనే ఒక కార్యక్రమం సిద్ధమవుతుందని, అందులో అన్నివృత్తుల వారికీ సాంఘికభద్రత కల్పించబడుతుందని, కనీసవేతనాల శాసనం రాగలదని, తాత్కాలికంగా నిరుద్యోగులైవున్నవారికి తగు పరిహారం ఇవ్వబడగలదని, ఆరోగ్య భీమాపథకం మొదలైనది అమలుపరచబడగలదని, రైతులకు హెచ్చు ఆదాయాలు వుండేట్లుగా విదేశాలకు ఓడలపై రవాణాచేయడానికి వీలుగా తగు సాధన నిలువలు ఏర్పడేట్లుగా వ్యవసాయక్షేత్ర కార్యక్రమమొకటి అమలులోకి రాగలదని నేను విశ్వసిస్తున్నాను.

తక్షణమే ధైర్యంతో ఈ చర్యలు గైకొనాలి.

యుద్ధములలోకెల్ల మహాయుద్ధమైన ఈ రెండవ ప్రపంచసంగ్రామమునుంచి అమెరికా ప్రపంచంలో గొప్ప బలదర్పాలుగల దేశంగా బైటపడింది. ఇంత శక్తివంతమైన రాజ్యం ఇప్పుడు ప్రపంచంలో మరొకటి లేదు. ఇప్పుడు అమెరికన్లు శాంతిపర్వంలోకి వచ్చారు. మరీ హెచ్చు పెట్టుబడి, మరీ ఎక్కువమంది కార్మికులు, మరీ హెచ్చు యంత్రాలు, మరీ అధికాహారం అన్న చింత, ఆందోళన ఒక్క అమెరికాలో మాత్రమే వున్నాయన్న సత్యాన్ని అమెరికన్లు తెలుసుకోవాలి.

అమెరికన్లకోసం, ప్రపంచంలో ప్రజాస్వామ్యాన్ని అభిమానించేవారందరి కోసం అమెరికన్లు పరాజయ మనస్తత్వాన్ని వీడి భవిష్యత్తును నిర్మించే ప్రయత్నానికి పూనుకోవాలి. ఇందులో కృతార్థులయ్యే సమర్థత అమెరికన్లకుంది.

# 2

# పరివర్తన చెందే అమెరికాకు పథకాలు

శ్రీ బౌల్స్ ఒకప్పుడు వ్యాపారి. ప్రైవేటు వ్యాపారవిధానం ఎలా పనిచేసేదీ యథార్థాలు గమనించి, యుద్ధానంతరం పూర్తి ఉత్పత్తి, పూర్తి ఉపాధికల్పన ఎంత ముఖ్యమో వ్యాపారస్థులు గ్రహించాలని శ్రీ బౌల్స్ ప్రబోధించారు. సేమోర్ ఇ. హారిస్ సంపాదకత్వాన వెలువడ్డ "సేవింగ్ అమెరికన్ కేపిటలిజం" అను ప్రచురణనుండి—

రెండవ ప్రపంచయుద్ధం మానవులు అర్థంకూడా చేసుకోలేనంతగా వినాశాన్ని కలిగించింది. పట్టణాలు, ఫ్యాక్టరీలు, ఆనకట్టలు, విద్యుచ్ఛక్తి యంత్రాగారాలు, రైలుమార్గాలు చాలా మేరకు ధ్వంసమయ్యాయి. అంతకన్నా దౌర్భాగ్యకరమైన విశేషమేమంటే ప్రపంచం తిరిగి ఎవరివల్ల పునరుద్ధరింపబడవలసివున్నదో ఆ లక్షలాది ప్రజల జవసత్వాలను, ఆశలను, వారి స్తోమతను యుద్ధం క్రుంగదీసింది.

ప్రపంచం ఇంతగా నాశనం కాగా అమెరికా చెక్కుచెదరకుండా వుంది. అసలు యుద్ధం దెబ్బ అమెరికాకు తగలనేలేదు. దాని ప్రకృతిసంపదలు, ద్రవ్యసాధనాలు యథాతథంగా వున్నవి. దాని ప్రజలు సంపన్నులై సమైక్యంగా వున్నారు. సర్వప్రపంచంలో అమెరికా ఆర్థికంగా, ఒక సుందరస్వప్నంగా నిలిచింది.

అయినప్పటికీ ఈనాడు అమెరికా అంతటా ఆర్థికభవిష్యత్తు విషయమై

ఆందోళన కల్పిస్తున్నది. యూరపు ఆసియాలలోని అధ్వాన్నస్థితిని చూస్తూ వుంటే చుట్టూ ప్రపంచమంతా పేదపడిపోయివుండగా అమెరికన్లు అట్టి ప్రపంచంలో సిరి సంపదలతో నిండిన ఈ దేశంలో సుఖంగా వుండగలరా అన్న సందేహం కలుగుతూ వుంది.

1930 ప్రాంతాలలో ఆర్థికజాడ్యపు తత్వంవల్ల అమెరికా ఆర్థికాభివృద్ధి చాలా కుంటుపడింది. పెరల్‌హార్బర్ ఉదంతం జరిగిన ఒకనెల తర్వాత ఏటా 50 వేల విమానాలు, 50 లక్షల టన్నుల ఓడలు నిర్మించవలసిందని అధ్యక్షుడు రూజ్వెల్టు జాతికి విజ్ఞప్తి చేయగా ఆయన అమెరికన్లని అసాధ్యమైన పని చేయమంటున్నాడని అనుకున్నారు.

కాని అదే అమెరికన్ల పొరపాటు. పిరికి ఆలోచన. నెలలు గడచినకొద్దీ అమెరికాదేశంలో మళ్ళీ పరిశ్రమలన్నీ పూర్తి ఉత్పాదకశక్తితో పనిచేయ మొదలెట్టాయి. అధ్యక్షుడు చెప్పిన 50 వేల విమానాల లక్ష్యాన్ని సాధించారు. దానికి రెట్టింపు చేయబోయ్యారు. ఆయన ఏటా 50 లక్షల టన్నుల ఓడలంటే అమెరికన్లు దానికి నాలుగురెట్లు తయారుచేశారు. పనిచేసేవారి సంఖ్య నూటికి 10 వంతుల చొప్పున తగ్గినప్పటికీ అమెరికా రైతులు నూటికి 30 వంతులు అదనంగా వ్యవసాయోత్పత్తి సాధించారు. లోగట్టానుబట్టి చూస్తే చరిత్రలో మున్నెన్నడూ లేనంతగా అమెరికన్లు 1942, 1943, 1944 లో హెచ్చుగా వినిమయసరుకులు తయారు చేసినట్లు విశదమవుతున్నది. ఇవిఅన్నీ అలావుంచి, సైనిక యంత్రసామగ్రి, సర్వీసులు ఎంత సాధించారు అని ప్రశ్నిస్తే సాలుసరి ఉత్పత్తిరేటు 100 వందల కోట్ల డాలర్ల విలువగలదని తెలిసింది.

యుద్ధకాలంలో అమెరికా ఉత్పత్తిని పరిశీలిస్తే అమెరికా పరిశ్రమలు అమెరికా ప్రజలకు ఎంత ఇవ్వగలవో తెలియవస్తుంది. అమెరికా పరిశ్రమలపై అమెరికన్లకు గల విశ్వాసం ద్విగుణీకృతమవుతుంది. యుద్ధకాలపు ఫ్యాక్టరీలు రేయింబగళ్ళు పనిచేస్తూవుండగా చూచినప్పుడు శాంతికాలంలో ఇవి ఎంతగా వినిమయ సరుకులు తయారుచేయగలవో కనిపెట్టగలిగారు. కనుక ఆర్థికమాంద్యాలు అనివార్యములని భావించకూడదన్న భావం ప్రబలింది. బూజుపట్టిపోయిన ఆర్థిక సిద్ధాంతాలను తుంగలో తొక్కాలని అనిపించింది. వ్యక్తిస్వాతంత్ర్యానికి భంగం కలుగకుండానే అమెరికా ప్రజలకూ, సకల ప్రపంచానికీ అత్యవసరంగా కావలసిన వాటిని

లభింపజేయడానికై ఏదోవిధంగా అమెరికా ఫ్యాక్టరీలు, వ్యవసాయక్షేత్రాలు నిరంతరంగా పనిచేయాలని నిశ్చయించారు.

యుద్ధకాలపు ఉరవడిని నిలబెట్టడ మెట్లా? పూర్తి ఉపాధికల్పన, పూర్తి ఉత్పత్తివుండే ఆర్థికవ్యవస్థను ఏ సూత్రంప్రకారం నిర్మించాలో ఆ సూత్రాన్ని సూక్ష్మంగా ఇట్లా చెప్పవచ్చు. సరుకులుగాని సేవలుగాని, ఒక డాలరు విలువగలవి సాధింపబడితే ఒక డాలరు విలువగల కొనుగోలు స్తోమతను కూడా సాధించాలి.

ఉత్పత్తిస్థాయిని తగ్గకుండా వుంచి దాన్ని ఇంకా హెచ్చించాలంటే ఈ డబ్బంతా వ్యక్తులచే, వర్గాలచే, సంస్థలపై వెచ్చింపబడాలి. లేకపోతే సేవలు, సరుకులు ఎవరూ డబ్బుపెట్టి కొనకుండా అలాగే వుండిపోతాయి. అమెరికా ఉత్పత్తి ఆ మేరకు తగ్గుతుంది.

దానితో కొత్త సామగ్రికీ, కొత్త యంత్రాలకూ ఇచ్చిన ఆర్డర్లను రద్దు చేయడం జరుగుతుంది. పెట్టుబడి దిగబడిపోతుంది. నిరుద్యోగం పెరుగుతుంది. కొనుగోలుశక్తి క్షీణిస్తుంది. మళ్ళీ ఆర్థికమాంద్యం తయారవుతుంది.

అమెరికా కొనుగోలుశక్తి ఎంతమొత్తం వుంటుందో అంతమొత్తం డబ్బును ఖర్చుపెట్టేవి మూడువర్గాలు వున్నవి. ఈ మూడువర్గాలూ కలిసి ఖర్చుపెట్టే డబ్బు అంతవుంటుంది. అందువల్ల అమెరికా ఆర్థికవ్యవస్థ సంపన్నమై విస్తృతమవుతుందన్న భరవసావుంటుంది. ఈ మూడువర్గాలలో ఒకటి వ్యాపారవర్గం. ప్రతిసంవత్సరం ఈ వ్యాపారవర్గంవారు పారిశ్రామిక విస్తరణపైన, ఇన్వెంటరీలపైన, కొత్త సామగ్రిపైన, భవనాలపైన విరివిగా డబ్బు ఖర్చుపెడుతూ వుంటారు.

రెండవవర్గం ప్రభుత్వం. అంటే కేంద్ర, రాష్ట్ర, స్థానిక ప్రభుత్వాలు. ప్రభుత్వం స్కూళ్ళపైన, ఆసుపత్రులకోసం, రోడ్లకోసం, వంతెనలు, సాగునీటి ప్రాజెక్టుల కోసం, పోలీసు అగ్నిమాపక శాఖలపైన, సైనిక నౌకాస్థావరాలకోసం ఏటా ఎంతో డబ్బు ఖర్చుపెడుతూ వుంటుంది.

మూడవవర్గం అమెరికా ప్రజలే. వీరే వినిమయదార్లు, ఆహారం, వస్త్రం, ప్రయాణాలు, సినిమాలు, వినోదాలు, పుస్తకాలు, వాషింగ్ మిషనులు, వాక్యూం క్లీనర్లు, ఇండ్లు, కారులు మున్నగువాటికోసం ప్రజలు వారి వేతనాలను, రోజువారీ జీతాలను, పెట్టుబళ్ళపై వచ్చే లాభాలను, డివిడెండ్లను ఖర్చుపెడుతూ వుంటారు. ఈ ఖర్చు చాలా పెద్ద మొత్తంలో వుంటుంది.

ఈ మూడు వర్గాలూ పెట్టే ఖర్చు ఒక్కొక్క ఏడాది ఒక్కొక్క విధంగా వున్నప్పటికీ వీటంతా పెట్టే మొత్తం ఖర్చు సేవలరూపంలో, సరుకుల ఉత్పత్తి రూపంలో అంతా సంపాదించే ఆదాయాల మొత్తానికి సమానమై వుంటుంది. అలా వుండాలి. లేకపోతే అమెరికన్లు అధిక నిరుద్యోగస్థితిని ఎదుర్కొంటారు.

కాబట్టి సమస్య సుస్పష్టమే. ఈ మూడు వర్గాలమధ్య సరియైన సమతూకాన్ని సాధిస్తే అమెరికా సేవలకూ, అమెరికన్లు ఉత్పత్తిచేసే సరుకులకూ మార్కెట్ వుంటుంది. ఉత్పత్తి, ఉపాధికల్పన ఉన్నతస్థాయిపై వుంటాయి. అమెరికన్ల ఉత్పాదనశక్తి హెచ్చినకొద్దీ ఆ స్థాయికూడా పెరుగుతూ వుంటుంది.

అమెరికా కొనుగోలుశక్తిని నిలబెట్టడంలో ప్రభుత్వపాత్ర అతిముఖ్యమైంది. ఎందుచేతనంటే అమెరికా ప్రభుత్వపు ప్రస్తుత బడ్జెట్ల ప్రభావం అమెరికా ఆర్థికవ్యవస్థ మొత్తంపైననే చాలా వుంది. ప్రభుత్వ వ్యయాలచే అమర్చబడే అమెరికా మొత్తం కొనుగోలుశక్తి శాతం ప్రతి సంవత్సరం అమెరికా మొత్తం అవసరాలకు అనుగుణంగా, సముచితమైన పరిమితులకు లోబడి, కొంచెం అటూ ఇటూగా వుంటూ వుంటుంది.

ప్రభుత్వం ఏమి సాధించగలదు, ఏమి సాధించాలి అన్న అంశాన్ని పరిశీలిస్తూ వుంటే అమెరికన్ల దురభిమానాలు, విధినిషేధాలూ బహిర్గతమవుతూ వుంటాయి. నేరాలను అదుపుచేసి, అమెరికా సైనిక నౌకాబలగాలను దృఢంచేసి, రోడ్లు వేయించి, ఈ సేవలన్నిటికీ అవసరమైన డబ్బుకుగాను ఆదాయపు పన్నులను విధించడం ప్రభుత్వ ప్రాథమిక బాధ్యతగావున్న కాలంలో నలభై యేండ్లకు పై వయస్సులోవున్న అమెరికనులు పెద్దవాళ్ళయారు.

ప్రభుత్వాధికారాన్ని మరీ విస్తరిస్తే అది వ్యక్తి స్వాతంత్ర్యాలకు భంగం కలిగిస్తుందనీ, అట్టిదాన్ని ఎదిరించడం జరుగుతుందనీ, అవసరంమేరకు కనీస ప్రభుత్వంకూడా క్షేమకరంకాదనీ, పోతే పోనీ అని ఉపేక్షిస్తేనే వుండగలిగేదనీ కొందరు వాదించారు. మా చిన్నతనంలో పత్రికలలో వెలువడే వ్యంగ్య చిత్రాలలో ప్రభుత్వాధికార్లను స్థూలకాయులైన రాజకీయవాదులుగా, నోటిలో పెద్ద చుట్టతో, తలపై డెర్బీహాట్‌తో, జేబులోనుండి "లంచం" అని అక్షరాలు వ్రాయబడివున్న వెయ్యిడాలర్ల బిల్లులు జారి క్రిందపడుతూన్నట్లుగా చిత్రించేవారు.

1929 సంవత్సరపు పతనం తర్వాత ఈ పాతచింతకాయ పచ్చడి భావం

క్రమేణా అంతరించింది. దేశాభివృద్ధితోపాటు అమెరికా ప్రభుత్వం కూడా పెద్ద బాధ్యతలను స్వీకరించవలసి వుంటుందని గ్రహించారు. అమెరికా ఆర్థిక సాంఘిక వ్యవస్థలు రూపొంది అనేక చిక్కులు ఏర్పడేకొద్దీ ప్రభుత్వంపట్ల పౌరదృష్టి తప్పనిసరిగా మారవలసి వచ్చింది. లేకపోతే పరిస్థితుల వత్తిడివల్ల ప్రభుత్వం కొత్త బాధ్యతలు స్వీకరించవలసివస్తే అది వాటిని అమెరికా స్వాతంత్ర్యాలకు భంగం కలుగనివిధంగా ఎలా సమర్థవంతంగా నిర్వహించగలదు?

ఒక ముఖ్యవిషయాన్ని అమెరికన్లు విస్మరించరాదు. అమెరికన్ ప్రజలే గనుక తగుప్రభుత్వాన్ని భరించడానికి సిద్ధంగా లేకపోతే ఘోరమైన దెబ్బతింటారు. ఈ మాట పైకి చూడటానికి పరస్పరవిరుద్ధంగా కన్పట్టవచ్చు. కాని ఇది సత్యం. ప్రభుత్వం అత్యవసరంగా చేయవలసిన పనులకు దానికి తగు అధికారా లివ్వక పోతే అపరిష్కృతంగావున్న సమస్యలు అమెరికన్లని వాటి కబంధహస్తాలలో చిక్కించుకొని బాధిస్తాయి. అప్పుడు విపత్కరస్థితి వస్తుంది. అయ్యో, మొదటే తగుచర్యలు తీసుకొనివుంటే ప్రభుత్వ అజమాయిషీలో అన్నీ సవ్యంగా వుండేవి కదా, ఇప్పుడు వ్యవహారం చేయిజారిపోయిందే అని వాపోతారు.

*　　　*　　　*

ప్రభుత్వం ముఖ్యంగా చేయవలసిన పనులు ఆరు వున్నాయి. మొదటిపని సాంప్రదాయికమైనదే: సమర్థవంతమైన పోస్టాఫీసు విధానాన్ని పరిపోషించడం. ముఖ్యమైన ప్రభుత్వ సేవలను లభింపజేయడం. ఈ విషయంలో రెండు అభిప్రాయాలకు తావేలేదు.

ప్రభుత్వం చేసే రెండవపని ఏమిటంటే—అమెరికా ఆర్థికవ్యవస్థకు మూల కందాలైన వ్యాపారులు, కార్మికులు, రైతులు, వినిమయదార్లు అను నాలుగు వర్గాలకు మధ్య పరిష్కర్తగా వ్యవహరించడం. అమెరికా ఆర్థికచరిత్ర తొలిదశలో ఈ పనికి అంత ప్రాముఖ్యముండేదికాదు.

అయితే వ్యాపారం భారీ అయ్యేసరికి కార్మికవర్గం, రైతాంగం కూడా భారీ యెత్తుకు పోయింది. ఫలితంగా ప్రభుత్వం కూడా భారీ అయింది. 14 కోట్ల పౌరుల హక్కులనూ, శ్రేయస్సునూ కాపాడవలసిన గురుతరబాధ్యత ప్రభుత్వంపై పడింది. లేకపోతే ఇంత ప్రజానీకమూ సువ్యవస్థితులైన వ్యాపార, కార్మిక, రైతాంగ వర్గాల వారి దయాదాక్షిణ్యాలపై ఆధారపడివుండవలసిన గతిపట్టుతుంది.

ఏ రంగంలో అట్టి గుత్తధోరణిని—అది ఏ వర్గంవారిదైనాసరే, దాన్ని—అంతంచేయడం ప్రభుత్వ ప్రధాన బాధ్యత. పారిశ్రామికోత్పత్తి పరిమితమయ్యేసరికి కార్మికులు సోమరులై ప్రత్యామ్నాయాలు అన్వేషిస్తారు. ఈ రెండు విధాలుగా అమెరికా సాధనసంపత్తి సంతటినీ అంటే పారిశ్రామిక స్తోమతనూ, మానవ బలగాన్నీ—అమెరికన్లు పూర్తిగా ఉపయోగించడంలేదనీ, కావలసివుంటే, దానినంత వసేలేదనీ అన్న తలంపువల్ల దాపురిస్తున్నాయి.

ప్రభుత్వం మూడవ బాధ్యత ప్రజల కవసరమైన సేవలు లభింపజేయడం. ఈ సేవలను లాభనష్టాల పద్ధతిపై పనిచేసే వ్యక్తులు లభింపజేయలేరు. ఉదాహరణకు ఒక పందకోట్ల డాలర్ల పెట్టుబడి అవసరమైన టెన్నెసీలోయ పాలకసంస్థను ప్రైవేటు పెట్టుబడితో ఏర్పాటుచేసి నిర్వహించడం సాధ్యమవుతుందా? అలాగే మిస్సోరి, ఆర్కాన్సాస్, కొలంబియా, సెంట్‌లారెన్సు, తదితర నదీజలాలను ప్రైవేటు నిధులతో ఉపయోగానికి తేవడం సాధ్యంకాదు.

అట్లే మురికిపేటల నిర్మూలనం, ఆధునిక పురోద్యానాల నిర్మాణానికీ, ఆసుపత్రులూ, వినోదకేంద్రాల స్థాపనకూ ప్రైవేటు పెట్టుబడిదార్లు పూనుకుంటారని ఆశించలేరు. ఇంకా ఎన్నో ప్రజోపయోగకర సర్వీసు లున్నవి. వాటనపేక్షించే హక్కు అమెరికన్ ప్రజలకు వుంది. వాటిని లభింపజేయవలసిన బాధ్యత ఆధునిక ప్రజాస్వామిక ప్రభుత్వంపై వుంది.

ఇక ప్రభుత్వానికి నాల్గవ బాధ్యత ఏమిటంటే—అమెరికాది ప్రైవేటు వ్యాపార వాణిజ్యాల వ్యవస్థ కాబట్టి జాతిమత వర్ణవివక్షలులేకుండా ప్రతి పౌరునికీ సమానావకాశాలు కల్పించడం. అమెరికాదేశంలో, పుట్టింది పేదరికంలోనైనా అవకాశాలవల్ల, స్వయంకృషివల్లా ప్రభుత్వరంగంలో, వ్యాపారరంగంలో, న్యాయశాఖలలో ఉన్నతపదవులలోనికి వచ్చిన వ్యక్తులు చాలామంది వున్నారు. అట్టి చారిత్రక వ్యక్తులను గూర్చి అమెరికనులు సగర్వంగా చెప్పుకొంటూ వుంటారు.

అయినప్పటికీ అమెరికా గమ్యస్థానం యింకా చాలా దూరంవుంది. ధనికులైన తల్లిదండ్రులుగల పిల్లలకు వైద్య, విద్యా, వినోద, అభివృద్ధివిషయాలలో మంచి అవకాశాలుండగా తక్కువ ఆదాయాలవారి పిల్లలకు అవి అందుబాటులో లేవు.

అమెరికాలో ప్రతిబాలునికీ, ప్రతిబాలికకూ—వారి తల్లిదండ్రుల ఆదాయంతో నిమిత్తంలేకుండా—ఉన్నతవిద్యకు అవకాశం కల్పించడం ఫెడరల్ ప్రభుత్వ బాధ్యత.

ప్రజారోగ్యం విషయంలో కూడా ఒక కనీసప్రమాణాన్ని అమెరికనులు నెలకొల్పాలి. అది ఉన్నతమైనది కావాలి. సమగ్ర వైద్యభీమా కార్యక్రమానికి వేలకొలది ఆసుపత్రులను నిర్మించాలి. వేలాది డాక్టర్లను, దంతవైద్యులను, నర్సులను శిక్షణ ఇచ్చి తయారుచేయాలి. అమెరికన్లది సంపన్నజాతి. పై బాధ్యతలను అమెరికనులు తప్పించుకోలేరు.

ప్రజలకు గృహవసతి కల్పించడానికి అమెరికా ప్రభుత్వం ముందంజ వేయాలి. యుద్ధానికి పూర్వం అమెరికన్ కుటుంబాలలో మూడవవంతు వాటివాలని ఇండ్లలో వుంటున్నట్లు అంచనావేయబడింది. గృహవసతి పరిశ్రమ గుత్తదార్ల చేతిలోవుండి మందగమనంతో రాజకీయ ప్రేరితమైన నిర్మాణసూత్రాలతో ప్రజల పట్ల తన బాధ్యతను సరిగా నిర్వర్తించలేకపోయింది.

అమెరికా ప్రభుత్వపు ఐదవ బాధ్యత—ప్రపంచమంతటా ఆపన్నులకు సహాయం, పునరావాసం కలిగేరీతిగా అమెరికా ఎగుమతి దిగుమతి కార్యక్రమాలను సంధానపరచడం.

యుద్ధంపొడ తగలని పెద్దజాతి, పెద్దదేశం ప్రపంచంలో అమెరికన్లదొక్కటే. అమెరికనులకు ప్రకృతిసంపద వుంది. నేర్పరులైన పనివారున్నారు. ఉత్పాదకశక్తివుంది. అమెరికనులు నివసించే ప్రపంచం నానాటికీ చిన్నదవుతూ వుంది. ప్రపంచంపట్ల అమెరికా కెట్టి బాధ్యతలూ లేవనీ, అమెరికన్ల కృషి అంతా అమెరికా ప్రజల సంపదను పెంపొందించడంపై కేంద్రీకరింపబడవలెననీ అమెరికన్లలో కొందరు అంటూవుంటారు. అమెరికా శ్రేయస్సుకోసం, ప్రపంచ శ్రేయస్సుకోసం ఈ అభిప్రాయం మారాలి.

చుట్టూవున్న ప్రపంచమంతా మురికిపేటగావుంటే అమెరికనులకు అమెరికా దివ్యప్రాసాదం నిర్మించగలదా? సమస్త ప్రజల జీవనప్రమాణాలు పెరగకపోతే అమెరికన్లకూ, అమెరికా సంతతికీ శాంతిభద్రతలు లేవు.

ప్రపంచ ఉత్పాదకశక్తిని పెంచి, ప్రపంచప్రజల భద్రతను నిలబెట్టవలెనంటే ప్రపంచ వ్యవసాయం ఆధునికం కావడానికి అమెరికనులు తోడ్పడాలి. వచ్చేతరంవారికి ఇది పెద్ద సవాలు. ఆధునిక రవాణా సాధనాలు, విద్యుచ్ఛక్తి, ప్రాథమిక పారిశ్రామిక యంత్రాగారాలు ఏర్పడటానికి కూడా అమెరికన్లు సహాయపడాలి. అమెరికన్ మేనేజిమెంటు ప్రవీణులకుగల అవకాశాలు అపారమైనవి.

సోవియట్ యూనియను, ఇతర కమ్యూనిస్టుపార్టీలు బాధార్తులైన ప్రజలకు ఉన్నత జీవనప్రమాణాలు చేకూరుస్తామనీ, ఆర్థికభద్రత కలిగిస్తామనీ ఆశ చూపెడుతూ వుంటారు. ఈ వాదనను అమెరికన్లు ఎదుర్కోవాలంటే 'కమ్యూనిజం కంటే రాజకీయ ప్రజాస్వామ్యపు పరిసమాప్తి' అని స్ఫూర్తితో వాదించి ప్రయోజనం లేదు. ప్రపంచమంతటా రాజకీయ స్వాతంత్ర్యమేగాక ఆర్థిక ప్రజాస్వామ్యం కూడా కల్పించాలి.

ఇది అమెరికా ప్రభుత్వపు అసలు బాధ్యత. సమస్య: అమెరికా ఉత్పత్తి కంతటికీ మార్కెట్లు లభించే విధంగా తన విధానాలను సమన్వయపరచుకోవడం.

ఇంతకూ నేను చెప్పదల్చుకున్నదేమంటే...అమెరికా కార్మికులు, రైతులు, వ్యాపారులు ప్రతి సంవత్సరం ఉత్పత్తిచేసే సరుకులను కొనగలిగే కొనుగోలు శక్తిని అమెరికా ప్రభుత్వం కల్పించాలి. అమెరికా పూర్తిఉత్పత్తి, పూర్తి ఉపాధి కల్పన నిలబడాలంటే ఇది అత్యవసరం. దీనికెంత వెచ్చిస్తే ఆర్థికవ్యవస్థపై అమెరికనులకు అంత విశ్వాసం పెరుగుతుంది. మరుగుపడ్డ గిరాకీ తలయెత్తుతుంది. సరుకులకు ఆర్డర్లు వస్తాయి. ఈ అంశానికి అమెరికన్లు ప్రాధాన్యమివ్వాలి.

* * *

మామూలు కాలమైతే ప్రతివ్యాపారీ రెండింటికి సిద్ధమై తనవృత్తిని సాగిస్తాడు. ఒకటి పోటీ. అంటే సరసమైన ధరలకు నాణ్యమైన సరుకులను ఉత్పత్తి చేయడంలో సాటివ్యాపారులతో పోటీకి నిలువగలిగే సామర్థ్యం అతనికి వున్నదా లేదా అన్న పరీక్ష అతన్ని ఎదుర్కొంటుంది. అమెరికా ప్రైవేటు వ్యాపార విధానంపై నమ్మకమున్నవారంతా ఈ పోటీని ఆమోదించాలి. ఈ పోటీలో పాల్గొనాలి.

రెండవది వ్యాపారమాంద్యం సర్వదా పొంచివుంటుందన్న సత్యాన్ని గుర్తించడం. అదే వస్తే అప్రయోజకులతోపాటు ప్రయోజకులుకూడా దివాలా ఫారం దాఖలు చేయవలసిందే. వ్యాపారమాంద్యం భయంతో వర్తకులు తమ ఉత్పత్తిని పరిమితంచేసుకొని, విస్తరణపథకాలకు కళ్ళెం బిగించి, డబ్బు దాచిపెట్టుకొంటారు. చెడురోజులువస్తే ఆ నిలవపై బ్రతుకుతారు.

ఆధునిక ఆర్థికవ్యవస్థ తీరుతెన్నులనుబట్టి చూస్తే పై రెండవ ప్రమాదం అనివార్యమైంది కాదు. తెలివితో దాన్ని నివారించవచ్చు.

మొదట ప్రణాళికార్యాల సమన్వయం జరగాలి. ఏ కార్యాలు ఎప్పుడు జరగవలసిందీ, అదనుఎరిగి నిర్ణయించేయాలి.

అమెరికా ద్రవ్యవిధానాన్ని, పన్నులవిధానాన్ని సవరించాలి. అసలు కొన్నేండ్లుగా అమెరికా పన్నులవిధానం ఎట్టి లోగికపు క్రమంలేకుండా పెరిగిపోయింది. దానికి ఎటుపడితే అటు గతుకులు, గోతులు, సొట్టలు ఏర్పడుతూ వచ్చాయి. పూర్తి ఉత్పత్తి, పూర్తి ఉపాధికల్పన సాధించేటట్లు పన్నుల విధానాన్ని పూర్తిగా సంస్కరించాలి.

ఆధునిక పన్నులవిధానం కొత్తవ్యాపార వాణిజ్యాలను ప్రోత్సహించేదిగా వుండాలి. కొత్తవ్యాపారాలకు మొదట్లో నష్టాలు రావచ్చు. తర్వాత క్రమేణా లాభాలురావచ్చు. వాటిని సర్దుబాటు చేసుకొనే వెసులుబాటు వుండాలి.

ఆర్థికపరిస్థితులు ఎప్పు డేవిధంగా వుంటాయో వాటినిబట్టి పన్నుల రేట్లు వుండాలని అర్థశాస్త్రవేత్తలు చెబుతారు. ధరలు పెరుగుతూవున్నకాలంలో పన్నులు హెచ్చుగావుండాలి. ఉత్పత్తి తగ్గుముఖంపెట్టే ప్రమాదమున్నప్పుడు పన్నులను తగ్గించాలి. అప్పుడు ప్రజల కొనుగోలుశక్తి పెరుగుతుంది. రాబడులేర్పడతాయి.

అమెరికా అధ్యక్షుడు ఆయనఆర్థికసలహాదార్లతో సంప్రదించి అమెరికా ఆర్థికవ్యవస్థ అవసరాలను తీర్చడానికై పన్నులను హెచ్చిస్తూ, తగ్గిస్తూ వుండాలని నా కోర్కె. అయితే అలాచేసేందుకు అధ్యక్షుని అధికారం శాసనసభ ఆమోదానికీ, ఇతర ప్రమాణాలకూ అనుగుణంగా వుండాలి. ఇందువల్ల అమెరికా ఆర్థికవ్యవస్థ ద్రవ్యోల్బణానికో, లేక ద్రవ్యం తరుగుదలకో గురిఅయ్యే తీరును చూచుకొని కొనుగోలు శక్తిని హెచ్చించడమో లేదా తగ్గించడమో అమెరికన్లు చేయవచ్చు. వ్యాపార వలయాన్ని సరిదిద్దేందుకై ఇట్టిసంస్థ ఒకటి ఏర్పరచేందుకు అమెరికన్లకు తగు ఆర్థికపరిజ్ఞానం వుందనే నా విశ్వాసం.

అయితే ప్రైవేటు వ్యాపారవిధానంలో ప్రభుత్వమే అమెరికా ఆర్థిక సమస్యలనన్నిటినీ పరిష్కరించగలదని అనుకోవడం పొరపాటు. ఎంత శ్రద్ధగా సమన్వయించినా ప్రభుత్వం పెట్టే ఖర్చు వ్యాపార, కార్మిక, కర్షకనాయకులు వారి వారి ఆర్థిక కార్యకలాపాలను ప్రైవేటు విధానంక్రింద నిర్వహించుకోవడంలో ఎదురయ్యే వైఫల్యాలను భర్తీ చేయజాలదు. అమెరికన్లు అమెరికా ప్రైవేటు వ్యాపారవిధానాన్ని నిర్వహించగలిగినంతవరకూ వేతనాలూ, ధరలూ, లాభాలను నిర్ణయించడంలో, అమెరికా పారిశ్రామిక వసతులను విస్తృతంచేయడంలో అమె

రికా ఆర్థికవ్యవస్థపై వ్యాపారులూ, కార్మికులూ, రైతుల ప్రభావమే అత్యధికము. ఏమైనా ప్రైవేటు విధానాన్ని అమెరికన్లు సదా ఆదరిస్తారనే నా నమ్మకం.

అమెరికా ఆర్థిక వ్యవస్థను సహేతుకంగా పరిష్కరించవలెనంటే అమెరికన్లకు బాధ్యతాయుతమైన కార్మిక నాయకత్వం కావాలి. తూలికాతల్పాల పద్ధతి అంతరించాలి. పూర్తి దినవేతనానికి పూర్తిదినం పనిచేస్తామని కార్మికులు ప్రతిజ్ఞ గైకొనాలి.

అందరికన్న పెద్ద బాధ్యత అమెరికా వ్యాపారస్థులది. ఎందుచేతనంటే ప్రైవేటు వ్యాపారవిధానమంటే వ్యక్తుల ఆర్థికవ్యవస్థ. వ్యక్తులు లాభాలు రాని వ్యాపారపద్ధతులు అనుసరించాలని అమెరికన్లు కోరడం న్యాయంకాదు. వ్యాపారానికి లాభాలే ప్రాణం.

అమెరికా వ్యక్తులు వారి బాధ్యతలనేగాక అమెరికా ఆర్థికవ్యవస్థపట్ల వారికి గల విధిబాధ్యతలనుకూడా నిర్వర్తించాలంటే లాభాలపట్ల వారిపైఖరి దీర్ఘకాలిక పైఖరి అయివుండాలి.

వేతనాలు పెంచాలంటే మూడే మార్గాలున్నాయి. తగు మాత్రంకంటె హెచ్చులాభాలు సంపాదించే వ్యాపారసంస్థ హెచ్చువేతనా లివ్వగలదు. ప్రస్తుత ధరలను పెంచకుండా అలాగే వుంచినాగాని లాభాలుతీయగలదు. ఒక ప్రమాణం కంటె తక్కువవేతనాలు చెల్లిస్తూ మామూలు లాభాలు సంపాదించే వ్యాపారసంస్థ ధరలు పెంచి వేతనాలను పెంచగలదు. అలా పెంచాలికూడా. వేతనాలు తక్కువగా వున్నప్పుడు ఈ చర్య అవసరం. కనీస వేతనాలు చెల్లించలేని యజమానులు వ్యాపారం మానుకోవడం మంచిది. కార్మికులకు తక్కువ వేతనాలు చెల్లించి వినిమయదారులకు తక్కువధరలకు సరుకులివ్వడం మంచిదికాదు.

ధరలను యథాతథంగా వుంచినా లేక తగ్గించినా, లాభాలను యథాతథంగా వుంచినా లేక తగ్గించుకున్నా, కార్మికులుచేసే ఉత్పత్తిని హెచ్చించగలిగితే వేతనాలను కూడా హెచ్చించవచ్చు. అమెరికా జీవన ప్రమాణం పెరగాలంటే ఈ మార్గం అనుసరణీయం. యుద్ధానికిపూర్వం ఇరవైయేండ్లలో ఒకమనిషి పనిచేసే కాలానికి కార్మికుల ఉత్పత్తి సాలీనా 4 శాతం పెరిగింది.

అయితే ఇట్టి పెరుగుదల మేలురకం యంత్రాలు, సౌకర్యాలు వుంటేనే సాధ్యమవుతుంది. యజమానులు తాము సంపాదించే లాభాలను వారి యంత్రాలు

సమర్థవంతంగా పనిచేసేందుకు పెట్టుబడి పెట్టాలంటే కార్మికులు ఎక్కువ ఉత్పత్తి చేసి తమకు ఎక్కువలాభాలు సంపాదించిపెట్టాలని ఆశించే హక్కు వారికి వుంది. అయితే కార్మికులు సాధించే హెచ్చు ఉత్పత్తివల్ల కలిగే లాభాలలో కొంతభాగాన్ని వారి వేతనాలను హెచ్చించేందుకు కేటాయించాలి.

ఈ దృక్పథాన్ని యజమానులు అంగీకరించలేకపోతే, లేదా కార్మికులు తమ వాదాన్ని సరిగా చెప్పజాలకపోతే హెచ్చుగా ఉత్పత్తిఅయ్యే సరుకులను కొనగలిగే కొనుగోలుశక్తి అమెరికా కుండదు. అలాంటి కొనుగోలుశక్తి లేకపోవడంవల్లనే 1929 లో ఘోరమైన వ్యాపారమాంద్యం సంభవించింది.

ప్రైవేటు వ్యాపారవిధానంలో వర్తకులు ముఖ్యంగా చేయవలసింది ధరల నిర్ణయం. ఒక్కొక్కప్పుడు హెచ్చుధరలను నిర్ణయిస్తూ వుంటారు. ధరలను తక్కువగా పెడితే అమ్మకం ఎక్కువవుతుంది, ఎక్కువలాభాలు వస్తాయి అన్న విషయాన్ని వర్తకులు గ్రహించరు. అమెరికన్ వ్యాపారంలో ఇట్టి సందర్భాల నెన్నిటినైనా చూపవచ్చు.

ఏమైనా, ప్రైవేటురంగంలో హెచ్చుయత్నం, హెచ్చువ్యాపారం, కార్మిక-యజమాని సంబంధాల విషయంలో ముందు పారజూచి వ్యవహరించడం, మెరుగైన వ్యాపారపద్ధతులు, అమ్మకం హెచ్చితే లాభాలు దండిగావుంటాయన్న గ్రహింపూ అవసరమని నేను చెప్పదలచుకున్నాను.

ప్రజలలో కొనుగోలుశక్తి బాగావుండి మార్కెట్లు బాగావుంటేనే పూర్తి ఉత్పత్తి సాధ్యమవుతుంది. ఈ విషయంలో ప్రభుత్వంపై పెద్ద బాధ్యత వుంది. అయితే వేతనాలు, ధరలు, లాభాలు నిర్ణయించడంలో అమెరికా వర్తకులూ, కార్మికులూ, రైతుల బాధ్యత అంతకన్నా గొప్పది.

ప్రైవేటు నిర్ణయాలు సరిగాలేకుంటే అమెరికా ఆర్థికవ్యవస్థలో ప్రభుత్వ పాత్ర హెచ్చుతుంది. గుత్తపద్ధతిలో ధరలనిర్ణయం జరుగుతూపోతే పరిస్థితిని ప్రభుత్వం అదుపుచేయవలెనని ప్రజలు గట్టిగా కోరుతారు. కార్మికులకూ యజమానులకూ మధ్య వివాదాలు పెరిగి అమెరికా ఆర్థికజీవితంలో ఒడుదుడుకులు సంభవిస్తే ప్రజలు ప్రభుత్వాన్ని ఇంకా ఎన్నో కోరుతారు.

ఒకమారుగనుక ప్రభుత్వం ప్రైవేటురంగంపై దాడిచేసిందంటే, ఒకటి తర్వాత ఒకటి అదుపుఆజ్ఞలు పెరిగి ప్రభుత్వ అజమాయిషీ హెచ్చుతుంది. దీన్ని అమెరికన్లు నివారించాలి.

సాలీనా 4 శాతం వున్నట్లయితే అమెరికన్లు ఉత్పత్తిచేసిన దానికన్న 170 వందల కోట్ల డాలర్ల విలువగల సరుకులు, సేవలు అదనంగా సాధించివుండేవాళ్ళు.

1958 లో రాక్‌ఫెల్లర్ నివేదిక 5 శాతం రేటుప్రకారం అభివృద్ధి సాధ్యమే ననీ, అవసరం కూడా అనీ చెప్పింది. ఆ ప్రకారం అమెరికన్లు సాధించివుంటే కొరియా యుద్ధానంతరం అమెరికా అదనపు ఉత్పత్తి 40 వేల కోట్ల డాలర్ల విలువకు మించివుండేది.

ఇది చాలా పెద్దమొత్తం. ఇది ఒక పూర్తిసంవత్సరపు జాతీయాదాయానికి సమానం. అమెరికా జాతీయఋణమైన 285 వందల కోట్ల డాలర్లకు ఇది ఒకటిన్నర రెట్లు.

కొరియా యుద్ధానంతరం అమెరికా ఆర్థిక స్తోమత ఎందుకు తగ్గింది? లోప మెక్కడ వుంది?

కారణాలు అనేకం. అన్నీ పీటముడులవంటి చిక్కులు. వాటి లక్షణాలు, వాటి నివారణ మున్నగువిషయాలలో భిన్నాభిప్రాయాలు వుండవచ్చు. అమెరికా వైఫల్యానికి ముఖ్యకారణం ప్రైవేటు వ్యాపార ప్రాముఖ్యాన్ని అమెరికనులు గ్రహించకపోవడమేనని చరిత్రకారులు తప్పక వ్రాస్తారు. అమెరికన్లు నోటి మాటగా అంటారేగాని ప్రైవేటు వ్యవస్థ ప్రాముఖ్యాన్ని గణనకు తీసుకోరు.

అమెరికా ఆర్థికవ్యవస్థపై కేంద్రప్రభుత్వానికి గల అధికారాన్ని చెలాయిం చక పోవడంవల్లనే అమెరికనులు విఫలు లయ్యారని అనుకోవడం సరికాదు. అధికారాన్ని అమెరికనులు అసలుపనులకు గాక వేరేపనులకు, వేరే కారణాలకోసం, తప్పుడుమార్గాలలో వినియోగించడంవల్లనే అమెరికాకి వైఫల్యం ప్రాప్తించింది.

అమెరికా ప్రభుత్వ వ్యవస్థలనూ, అధికారాన్నీ ఆర్థికాభివృద్ధికీ, హెచ్చు ఉపాధికల్పనకూ వినియోగించడానికి బదులు ఆర్థికాభివృద్ధి, హెచ్చు ఉపాధికల్పన, ధరల స్థిరీకరణ–ఇవి ఒకదానికొకటి పొసగవన్న భావంతో, పొరపాటున పెరుగు దలను కుంటుపడజేసేందుకు అధికారాన్ని ఉపయోగించారు.

ధరలు చాలా హెచ్చుగా వున్నప్పటికీ జీవన వ్యయసూచీలు సంవత్సరానికి పైగా నిలకడగానే వున్నవి. ఇటీవలి పందొమ్మిదేండ్లలో ధరలు ఇప్పుడే హెచ్చు కాలంవరకు స్థిరంగా వున్నాయని కార్మికశాఖవారు చెబుతున్నారు.

సాధారణ నిలువల ధరలు, స్థిరాస్తుల ధరలు మాత్రమే పెరిగాయి. వీటి ధరలు కొన్నివందల కోట్ల డాలర్ల చొప్పున పెరిగిపోయాయి.

అధ్యక్షా, ఈ స్థితి ఇలాగే సాగితే వెనుక జరిగినట్లే ఇప్పుడు కూడా అమెరికన్లు విలువ అని చెప్పేవి పతనమవుతాయి. అది జరిగినప్పుడు ద్రవ్యోల్బణాన్ని గూర్చి జాగ్రత్తచేయకుండా వాగుడు మొదలైనందువల్ల భయపడి మార్కెట్లో కాలు పెట్టిన లక్షలాది చిన్న పెట్టుబడిదార్లు బాగా దెబ్బతింటారు.

అమెరికా ఆర్థికవ్యవస్థ ఒక స్థిరమైన రేటుప్రకారం పెరగకపోవడంవల్ల అమెరికా కాంగ్రెసు సభవారి ముందుకొచ్చే ప్రతి సమస్య దాని ప్రభావానికి లోనవుతున్నది. అమెరికన్లు వాస్తవాలను తప్పించుకోలేరు. ఈ దృష్ట్యా ఆ కాంగ్రెసు సభ ప్రతిపాదించిన జాతీయ ఆర్థికవిధాన ప్రకటనను పునఃపరిశీలన చేయాలి. ప్రతిపాదన ఏమిటంటారా? 1946 సంవత్సరపు ఉద్యోగచట్టమే ఆ ప్రతిపాదన.

యుద్ధానంతరం సహకారమును పెంపొందించాలనే ఉద్దేశంతో ఈ చట్టం తేబడింది. ఉభయ రాజకీయపక్షాల సభ్యులు గల బృంద మొదట ఈ చట్టాన్ని కాంగ్రెసు ద్వారా ప్రవేశపెట్టింది. ఉభయపక్షాలలో అధికసంఖ్యాకులు దీన్ని బలపరిచారు.

ప్రజాశ్రేయస్సే దీని లక్ష్యం. అమెరికాలోగల ఉద్యోగ స్థాయిలను, ఉత్పత్తిస్థాయిని, కొనుగోలుశక్తిని పేర్కొంటూ, ప్రకటితవిధానాన్ని అమలు పరచడానికి అవసరమైన స్థాయిలను వివరిస్తూ ఒక ఆర్థిక నివేదికను అధ్యక్షుడు కాంగ్రెసు సభకు పంపవలెనని ఆ చట్టంలో నిర్దేశింపబడింది.

గత జనవరిలో అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ పంపిన ఆర్థిక నివేదికలో ఈ బాధ్యత ప్రస్తావింపబడింది. అయితే ఆయన అంతకుపూర్వపు ఆర్థిక నివేదికలను అనుసరించలేదు. పూర్వపునివేదికలలో జాతీయలక్ష్యాలు ఏటా నిర్దేశింపబడటమే గాక, వాటిని సాధించడానికై సాధనాలను కూడా పేర్కొనడం జరిగేది.

ఇతర సమస్యలవలెనే ఈ సమస్యకూడా కాంగ్రెసుసభ పరం చేయబడింది. అమెరికా జాతీయలక్ష్యాలను విశదీకరించడంలో విఫలులై ఈ బాధ్యతనుండి గెంటారా, అవకాశాలను పోగొట్టుకున్నవాళ్ళవుతారు.

అమెరికా ఆర్థిక ఉత్పత్తి మందగించడానికి కారణాలను కూడా ఈ సభలో చర్చించి ఒక అభిప్రాయానికి రావడం అవసరం. ఒక అభిప్రాయానికి రాగలిగితే

సరియైన చర్యలు తీసుకొని ఉత్పత్తిని హెచ్చించి ధరలను స్థిరీకరించ గలుగుతారు.

ఈ సందర్భంలో కొన్ని అంశాలను నివేదించదలిచాను.

మొదటిది—అమెరికా పరిశీలనలలో, సంయుక్త ఆర్థిక సంఘ నివేదికలో అమెరికా అంగబలాన్నీ, యంత్రాలనూ, పెట్టుబడినీ సాధ్యమైనంత హెచ్చుగా వినియోగానికి తెస్తే అమెరికా ప్రభుత్వ ఆర్థికవ్యవస్థ, ప్రైవేటు ఆర్థికవ్యవస్థ ఏ రూపంలో వుంటాయో వివరిస్తూ సంఖ్యలను, లోగట్టాను క్రోడీకరించాలి.

రెండవది—అమెరికా పరిశ్రమలకు మంచి మార్కెట్లు వుండాలంటే, అమెరికా యంత్రాగారాలను ఆధునికంచేసి విస్తృతపరచడానికి తగిన పెట్టుబడి లభించాలంటే, ప్రపంచంలో సంపన్నదేశంగా అమెరికాదేశ ప్రజలకు సకల వసతులు, సేవలు లభ్యంకావాలంటే కొనుగోలుశక్తి ఎంత అవసరమో తెలిపే నిర్దిష్టమైన అంచనాలు ఆ నివేదికలో వుండాలి.

మూడవది—అమెరికా ఆర్థికవ్యవస్థ పూర్తిస్తోమతతో వుంటే దానిప్రభావం అమెరికా కేంద్ర, రాష్ట్ర, స్థానిక ఆదాయాలపై ఎలావుంటుందో కూడా నివేదికలో స్పష్టంచేయబడాలి.

నాల్గవది—సాధనములను నిర్ణయించే సంఘం అమెరికా ప్రస్తుత పన్నుల విధానాన్ని విశ్లేషణచేస్తూ దాన్ని బాగుపరిచే పద్ధతులను సిఫారసు చేసేటప్పుడు పన్నులవల్ల అమెరికా కొచ్చే ఆదాయంలో రాష్ట్ర, స్థానికప్రభుత్వాలకు అధిక వాటాను ఇచ్చే విధానాన్ని ఆలోచించి, పారిశ్రామికాభివృద్ధికీ, విస్తరణకూ అవసర మైన ప్రత్యేకపన్నులను కూడా సూచించాలి.

పెట్టుబడిగా పెట్టిన ప్రతిడాలరుకూ, ప్రతియేటా కనీసం రెండుడాలర్ల వెరశి మొత్తం జాతీయోత్పాదన సాధ్యమవుతుంది గనుక అట్టికృషి మొత్తం అమెరికా ఆర్థికవ్యవస్థకే చురుకుపుట్టిస్తుంది.

ఐదవది—ప్రస్తుత పన్నులవిధానంలో వ్యాపారఖర్చులక్రింద హెచ్చు మొత్తాలను మినహాయించడంవంటి దోషాలున్నవి. వాటిని బాగా పరిశీలించాలి. ఇలా అనేకరూపాలలో అమెరికన్లు ఏటా 4 వందల కోట్ల డాలర్లను కోల్పో తున్నట్లు కొందరు పరిశీలకుల అంచనా.

ఆరవది—గుత్తపద్ధతి లేకపోయినా దాదాపు అలాంటి పద్ధతివున్న పరిశ్రమ

లలో ఆజ్ఞాపిత ధరల సమస్యను పరిష్కరించడానికై వివిధ ప్రతిపాదనలను పరిశీలించాలి. వాటిని గట్టిగా ఆలోచించాలి. ప్రస్తుత గుత్తశాసనాన్ని విస్తృతం చేయాలా? ప్రత్యేకించి "మిదివార" (Excess margin tax) పన్నును విధించడం విలువుతుందా? అందువల్ల మంచి ప్రయోజనముంటుందా?

ఏడవది—ధరలుగాని, వేతనాలుగాని అధికంగా పెరిగితే అమెరికా జాతీయ ఆర్థికసుస్థిరతకు భంగం కలిగేటట్లు వుంటే ప్రజలకుంది వాస్తవసమాచారం తెలుసుకొనే ప్రతిపాదనను ఈ సభవారు పరిశీలించాలి.

ఎనిమిదవది—అమెరికా ముఖ్య వ్యవసాయకసమస్య ఉత్పత్తి విధానాలకు సంబంధించినదైనప్పటికీ, ఆహారవినిమయం హెచ్చుగల అవకాశాలనుకూడా అమెరికన్లు ఆలోచించాలి. దాన్ని అలక్ష్యంచేయరాదు.

అమెరికా వ్యవసాయక సంపత్సమృద్ధి అమెరికా చేతిలో దివ్యాయుధం వంటిది. అమెరికా మిగులు ఉత్పత్తిని పేదదేశాల ప్రజల ఆకలిని తీర్చడానికీ, వారి ఆర్థికవ్యవస్థకు తోడ్పడటానికీ వినియోగించవచ్చు. అమెరికా మిగులు ఉత్పత్తులను నిరుపయోగంగా కొట్లలో పోసివుంచడం అవివేకము, ఆర్థికంగా నష్టకరము, నైతికంగా సమర్థనీయంకాదు.

మిగులు ఆహారంలో కొంతభాగం అక్కడ - అమెరికాలోనే అవసరమై వుంది. ఇప్పుడు నిలవలుగా వుంచే ఎనిమిదివందల కోట్ల డాలర్ల విలువగల ఆహారాన్ని పాఠశాలల మధ్యాహ్న భోజన కార్యక్రమానికీ, ఫుడ్‌స్టాంప్ ప్లానుకూ వినియోగించి దేశీయమైన ఆస్తిగా దానిని మార్చుకోవచ్చు.

తొమ్మిదవది—సంయుక్త ఆర్థికసంఘ నివేదికలో వడ్డీరేట్లనూ, వాటివల్ల పారిశ్రామిక వ్యవసాయక క్షేత్రాల ఉత్పత్తిపైన, నిర్మాణకార్యాలపైన, కొనుగోలు శక్తిపైన, నిరుద్యోగస్థితిపైన, ప్రభుత్వ ఆదాయాలపైన అన్ని స్థాయిలలో పడే ప్రభావాలనూ బాగా విశ్లేషణచేయడం జరుగగలదని ఆశిస్తాను.

పదవది—చివరకు నా అభిప్రాయాలను మనవి చేయదలచుకున్నాను.

అమెరికా అన్నిటికన్నా నిరాయుధీకరణవల్ల కలిగే ఆర్థికఫలితాలకు జంకుతుందని కమ్యూనిస్టులు కొన్నేండ్లుగా ప్రపంచానికి చెబుతూవస్తున్నారు.

అమెరికా రక్షణశాఖగనుక ఆయుధాలకు ఆర్డర్లు ఇవ్వడం మానిందంటే అమెరికన్ పరిశ్రమలు దివాలాతీసి అమెరికన్ కార్మికులు ఆకలితో మాడతారని

సోవియట్ నాయకులు అంటున్నారు. అప్పుడు పెట్టుబడిదారీవిధానం పతనమై, కమ్యూనిజానికి విజయం లభిస్తుందని వారి వాదం.

కారల్ మార్క్స్ ఏమన్నప్పటికీ శాంతికాలపు ఆర్థికవ్యవస్థను అమెరికన్లు అనుకున్నదానికంటె సాఫీగా అలవడవచ్చునని నా అభిప్రాయం.

రెండవ ప్రపంచయుద్ధం ముగిసినతర్వాత పద్దెనిమిది నెలలలోనే అమెరికన్ పరిశ్రమలలో నూటికి 45 వంతులు యుద్ధకాలపు ఉత్పత్తినుండి శాంతికాలపు ఉత్పత్తికి మారింది. అమెరికా సాయుధదళాలలో పనిచేసిన 1 కోటి మందిని పౌర ఆర్థికవ్యవస్థలో లీనంచేశారు.

నిజంచెప్పాలంటే అప్పుడు అమెరికా కొరత వెసులుబాటు వుంది. యుద్ధం జరుగుతున్నంతకాలం గృహవసతి, పాఠశాలలు, వినిమయసరుకుల ఉత్పత్తివంటి కార్యక్రమాలు అమలుగాకుండా అలాగే వుండిపోయాయి. కాని నేడు రక్షణ సామగ్రి ఉత్పత్తికై ఉపయోగింపబడుతూవున్న అమెరికా ఆర్థికవ్యవస్థ 1945 లో ఉపయోగింపబడ్డదానిలో అయిదవవంతుమాత్రమే. ఇక యుద్ధంవల్ల తీరకుండా వున్న అమెరికన్ల ఇతర అవసరాలు చాలావున్నాయని ప్రతిమేయరుకూ, పట్టణ పథకకర్తకూ, విద్యావేత్తకూ, రహదార్ల ఇంజనీరుకూ, ఆసుపత్రి సూప రింటెంటుకూ, సాంఘికశాస్త్రవేత్తకూ బాగా తెలుసు.

సెనేటర్ హంఫ్రీ అధ్యక్షతన ఏర్పడిన సెనేటు నిరాయుధీకరణ సంఘం నిరాయుధీకరణవల్ల కలిగే ఆర్థికఫలితాలవిషయంలో ముఖ్యులవద్దనుండి సాక్ష్యాలు సేకరించింది. ఈ సమస్యను ఇంకా పరిశీలించినట్లయితే అమెరికన్ ప్రజలకు మరి కొంత భరవసాకలగడమే గాక, ప్రచ్ఛన్నయుద్ధపు ఉద్రిక్తస్థితిని నిజంగా తగ్గించే విషయంలో ఆటంకాలు కల్పిస్తున్నది సోవియట్ యూనియనేకాని అమెరికా కాదని ప్రపంచానికి చాటినట్లవుతుంది.

నేనువేసిన ప్రశ్నలకు ఆచరణసాధ్యమైన సమాధానాలు కనుగొనవలెనంటే వ్యక్తులుగా, ఒకజాతిగా అమెరికన్లు ఎంత పణంఒడ్డవలసివుంటుందో పరిశీలించాలి.

అధికజనులకు ఉద్యోగావకాశాలు లభించి, వచ్చే ఆర్థికసంవత్సరంలో ఆర్థి కాభివృద్ధి పెరుగుదల అధికంగా వుంటే అందువల్ల కేంద్రఆదాయాలపైన, కేంద్ర బడ్జెట్టుపైన ఎట్టి ప్రభావం పడుతుంది?

1961 ఆర్థికసంవత్సరంలో ఆర్థికవిస్తృతి 4 శాతం చొప్పున సంభవించిం

దంటే 1960 ఆర్థిక సంవత్సరంలో ఆశించిన పెరుగుదలకన్న 18 మొదలు 20 వందల కోట్ల డాలర్ల సరుకుల అధికోత్పత్తి సాధ్యమవుతుంది.

ఇందువల్ల కేంద్రపన్నుల ఆదాయానికి అనేకవందల కోట్ల డాలర్లు అధికంగా లభ్యమవుతాయి. పట్టీఖర్చులు, కేంద్రసహాయం చెల్లింపులు తగ్గాయంటే నిర్మాణాలు, రక్షణ, వైద్యపరిశోధన, శ్రేయస్సు మున్నగువాటికి అయ్యే ఖర్చును భరించడానికి అమెరికనులకు పుష్కలంగా ఆదాయముంటుంది.

ఆ తర్వాతి సంవత్సరాలలో ద్రవ్యోల్బణం లేకుండా సత్వర విస్తృతీకరణ జరిగేట్టుగా సమర్థవంతమైన విధానాన్ని అనుసరించారంటే పన్నులను ఇంకా తగ్గించవచ్చు. ఎన్నాళ్లుగానో వాయిదావేస్తూ వచ్చిన జాతీయఋణం తగ్గింపును సాధించవచ్చు.

అధ్యక్షా, ఇది పగటికల అని ఎవరైనా అనుకొంటే పొరపడినవారవుతా రని మనవిచేస్తున్నాను. స్థిరమైన ఆర్థికాభివృద్ధికి ఇదంతా అత్యవసర పరిశీలనము.

అమెరికన్ జాతి భద్రతనూ, అమెరికా ప్రజల శ్రేయస్సునూ నిలబెట్టాలంటే అవసరంగా చేయవలసిన పనులను ఎదిరించే వర్గాలు వుండనే వుంటాయి. వారి కారణాలు వారివి.

డాములు, స్కూళ్ళు, ఇండ్లు నిర్మిద్దామని అమెరికన్లు తలపెట్టితే అమెరికా బడ్జెటు క్రిందుమీదు అవుతుందనీ, దుంపతెంచే ద్రవ్యోల్బణం సంభవిస్తుందనీ ఈ వర్గాలు విమర్శిస్తాయి. అమెరికా సమస్యల అసలు కారణాలను తొలగింప బూనుకున్నారా, అవి నిరుపయోగమైనవనీ, అదనుకు తగ్గవి కావనీ వీరు ఖండిస్తారు.

అమెరికా భవిష్యత్తు విషయంలో విశ్వాసంలేకుండా పిరికితనంతో ఇలా విమర్శించడం మూర్ఖపు పని. వీరు ఈ సభలోని అధికసంఖ్యాకులను బెదిరించి భయపెట్టి రాజకీయంగా అసమర్థులను చేయడం తగనిపని. ద్రవ్యోల్బణం లేకుండా అమెరికా ఆర్థికవ్యవస్థను విస్తృతపరచి త్వరితగతిని వృద్ధిచెందేట్టు చేయడం ఈ కాంగ్రెసు సభవారు పరిశీలించవలసిన అంశాలలో మొట్టమొదటిగా వుండవలెనని విజ్ఞప్తిచేస్తున్నాను.

# 4

# ఉక్కు ధరలు - జాతీయ ఆర్థికవ్యవస్థ

అమెరికాలో 1959 ఆగస్టులో ఉక్కు కార్మికులు సమ్మెచేశారు. సమ్మె మొదలైన నాలుగువారాల తర్వాత శ్రీ బ్లౌస్ అధ్యక్షుడు ఐసెన్‌హోవర్‌కు ఈ దిగువలేఖ వ్రాశారు. ఆర్థికవ్యవస్థకూ, ఉక్కు పరిశ్రమకూ దీర్ఘకాలిక ప్రయోజనం చేకూరవలెనంటే ఉక్కుధరను హెచ్చించక తగ్గించాలని కాంగ్రెసు సభ్యుడైన శ్రీ బ్లౌస్ సూచించారు.

అధ్యక్షా, యుద్ధకాలంలో ధరలపాలకుడుగా, ఆర్థికస్థిరీకరణ డైరెక్టరుగా ఉక్కు పరిశ్రమలో ధరలూ, వేతనాలూ, లాభాల పరస్పరసంబంధాలను గాఢంగా పరిశీలించే అవకాశం నాకు కలిగింది. అప్పటినుంచి అమెరికా ఆర్థికవ్యవస్థలో తయారీ ఖర్చులపైన, ఉపాధికల్పనపైన అధికప్రభావంగల ఈ కీలకపరిశ్రమను పరిశీలిస్తూ తరచు ఆందోళనచెందుతూ వచ్చాను.

ఈ పధ్నాలుగేండ్లలో కార్మికులకూ, యజమానులకూ మధ్య విభేదాలవల్ల ఉక్కుపరిశ్రమ ఆరుసార్లు మూతపడింది. 190 రోజుల ఉత్పత్తిని కోల్పోయ్యారు. ఫలితంగా 4 కోట్లా 50 లక్షలటన్నుల ఉక్కు ఉత్పత్తి జరగలేదు. ఇక వేతనాల రీత్యా, లాభాలరీత్యా అమెరికన్లకు కలిగిన నష్టం కొన్ని వందలకోట్లు వుంటుంది.

సమ్మె నాల్గవవారంలో పడుతూవుంది. త్వరలో ఒక ఒడంబడికకు రాకపోతే అమెరికా ఆర్థికవ్యవస్థే ఛిన్నాభిన్నంకావచ్చు.

పదేండ్లలో మూడవ పనివిడుపునుండి అమెరికన్లు ఇప్పుడే బైటపడు

అయితే ఇప్పుడు అమెరికా ఎదుర్కొనే పరిస్థితి జరూరైనది. ఇంకా జాగు చేశారా అమెరికా ఆర్థికవ్యవస్థ క్షీణించి పనులకూ లాభాలకూ ముప్పుతెచ్చిపెట్టుతుంది. అప్పుడు కోలుకోవడం కష్టం.

యజమానులకూ కార్మికులకూ మధ్య వివాదం దృష్టితో చూస్తే ఇటీవల సాధ్యపడ్డ కార్మికుల ఉత్పాదనపెరుగుదలరీత్యా ధరలు పెంచనక్కరలేకుండానే ఉక్కుపరిశ్రమ కార్మికులవేతనాలను హెచ్చించవచ్చని స్పష్టమవుతున్నది. ఈ పరిశ్రమస్తోమత పెద్దదికాబట్టి లాభాలుకూడా అధికంగానే తీయవచ్చు.

ఏమైనా వేతనములరేట్లలో మార్పులు లేకుండానే ఉక్కుధరలు తగ్గించడం ద్వారా ప్రజలకు హెచ్చుమేలుచేయవచ్చు. ఉక్కుపరిశ్రమ ఈచర్యను తీసుకొని లాభాలను తీస్తూవుండవచ్చు.

కాని అట్టి ప్రతిపాదనను యజమానులుగాని, కార్మికులుగాని ఉత్సాహంతో అమలు జరుపదలచడంలేదు. అయితే ప్రజాశ్రేయస్సుదృష్ట్యా ఉక్కునిర్ణయాలు అమెరికన్లు వర్గాలకు అతీతంగా ఆలోచించవలసిన అగత్యముంటుంది. ముఖ్యంగా ఉక్కుపరిశ్రమ విషయంలో అమెరికన్లు ఆస్థితికి వచ్చారు.

ఉక్కుధర టన్నుకు పదిడాలర్ల చొప్పున తగ్గిందంటే మోటారుకార్లు,వాషింగ్ మిషనులు, రెఫ్రిజిరేటర్లు, ఇతరగృహోపయోగ పరికరముల ధరలుకూడా తగ్గుతాయి. అంతేగాక మనరోడ్ల కార్యక్రమం, పారిశ్రామిక నిర్మాణం, యంత్రాల పనిముట్లు, ఇతర అవసరవస్తువుల ధరలుకూడా తగ్గుతాయి.

ఇందువల్ల అమెరికా ఆర్థికవ్యవస్థకు జవసత్వాలు తిరిగిచేకూరుతాయి. అమెరికా ఉత్పాదకసాధనాలు సంపూర్తిగా వినియోగింపబడి అమెరికా ప్రజలకు ఉద్యోగాలు, ఉపాధి లభిస్తేనే అట్టి జవసత్వాలు చేకూరగలవు. దీనివల్ల ఉక్కుపరిశ్రమ తన అమ్మకాలను హెచ్చించవచ్చు. కార్మికులకు తీయకుండా పని కల్పించవచ్చు. ఉక్కు దిగుమతులవిషయంలో అమెరికా పోటీ స్తోమతను నిలబెట్టవచ్చు.

ఇటీవల అమెరికన్లు ద్రవ్యోల్బణంగూర్చి తరచువింటున్నారు. కాని ఆర్థికాభివృద్ధి సంగతి ఎవరూ మాట్లాడరు. అసలు ఈరెండు సమస్యలు పరస్పరసంబంధంకలవనీ, ఈరెండిటినీ కొంతవరకైనా పరిష్కరించాలంటే ఉక్కుధరలు తగ్గించడమొకటే మార్గమనీ నేను మనవి చేస్తున్నాను.

కనుక అమెరికాదేశ శ్రేయస్సుకోసం, అమెరికా ఆర్థికవ్యవస్థబాగుకోసం ఉక్కుపరిశ్రమవారు ధైర్యంచేసి ఇట్టిచర్య గైకొనవలెనని మీరుకోరాలి.

వైఖరిని పునరాలోచించుకోవలసిన స్థితివస్తున్నది. నిష్ఫలమైన సిద్ధాంతాలనూ, భావాలనూ వదులుకుంటున్నారు. కొత్త స్థానాలు వెదుకుతున్నారు.

మొదటి శక్తి ఏదంటే—అమెరికాసమాజంపై యుద్ధానంతర ప్రపంచపు ప్రభావము; మరింత వాస్తవిక వైఖరికొరకై అమెరికా అన్వేషణ.

అమెరికన్లు ఎదుర్కొన ప్రయత్నించే ప్రపంచపు వత్తిడులు తాత్కాలిక మైనవనీ, అమెరికన్లు ధైర్యంతో, తెలివిగా ప్రవర్తిస్తే ప్రపంచ అత్యయిక స్థితి ఏదో ఒకవిధంగా సమసిపోతుందనీ, దానితో అమెరికన్లు నిశ్చింతగా వుండి అమెరికా భౌతిక సంపదలను, సుఖభోగాలను నిరభ్యంతరంగా అనుభవించవచ్చుననీ అమెరి కన్లకు అమెరికన్లే పదిహేనేండ్లనుండి నచ్చచెప్పుకొంటున్నారు.

ఇది సంకుచితదృక్పథము. ప్రమాదకరమైనది. గతంలో అమెరికన్లు కేటుగా వున్నారు. ఇప్పుడు ఆ పొరపాటు ధోరణినుంచి బైటపడాలనుకుంటున్నారు. అదీ గాక, యుద్ధానంతరం అంతర్జాతీయ సమస్యలను ప్రత్యేకంగా అమెరికన్లకు అను కూలమైన స్థానంనుంచి పరిష్కరింప ప్రయత్నిస్తూ ప్రపంచవ్యవహారాలను అపార్థ దృష్టితో పరిశీలిస్తున్నారు. ఈకారణాలన్నింటివల్లా అమెరికన్లకు సంకుచితదృక్పథం అలవడింది.

యుద్ధం దెబ్బకు ప్రపంచంమొత్తంలో ఒక్క అమెరికా ఆర్థికవ్యవస్థే చెక్కుచెదరకుండా నిలిచింది. పైగా యుద్ధకాలపు పెట్టుబడులవల్ల బలపడింది. అమెరికాసైనికశక్తికి దృఢమైన పునాది ఏర్పడింది. కారణమేమంటే అమెరికాయే అణ్వస్త్రాలుగల మొట్టమొదటి రాజ్యం.

ఇందువల్ల ఇతరదేశాలతో పోల్చినప్పుడు అమెరికాసైనికశక్తి అనన్యమైన దిగా, అందరినీ మించిపోయేదిగా వుంది. అమెరికన్లే తలచుకొంటే ప్రపంచంలో అమెరికన్లు చేయజాలనిపని అంటూ ఏదీలేదు.

కాని గత కొన్ని సంవత్సరాలనుంచీ ఈపరిస్థితి చాలామారింది. అమెరికన్లు పందొమ్మిదివందలా అరవయ్యోవపడిలో ప్రవేశిస్తూవుంటే ఒకవంక నవయూరపు బలంపుంజుకుంటూ సంఘటిత సమాజాన్ని నిర్మించుకొంటూవుంది. సోవియట్ యూనియన్ పారిశ్రామికంగా, సైనికంగా అమెరికాదేశంతర్వాత రెండవ బలీయ మైన దేశంగా నిలిచింది. మరొకవంక చైనా కరకు కమ్యూనిస్టు ప్రభుత్వం క్రింద ఇరుగుపొరుగుతో అతిక్రమణధోరణితో వ్యవహరిస్తూవుంది.

లేకుండా వున్నాయో, అమెరికా పెరుగుదలరేటు ఇతర పారిశ్రామికదేశాల రేటు కంటె ఎందుకు తక్కువగా వుందో, అమెరికన్ కుటుంబాలలో నూటికి 20 పంతుల కుటుంబాలు ఏడాదికి 2000 డాలర్లకు తక్కువ మొత్తంపై జీవించవలసిన అగత్యం ఎందుకు కలుగుతున్నదో, సకలరంగాలలో ఉత్పత్తి జరగవలసిన సమయంలో నిరుద్యోగస్థితి ఎందుకొచ్చిందో తెలుసుకోవాలంటే బాగా పునరాలోచన చేసుకోవాలి.

అమెరికాదేశీయ ఆర్థికవ్యవస్థకు సంబంధించినంతవరకు ముఖ్య ప్రశ్నలివి:

ప్రతిసంవత్సరం తక్కువ ఖర్చుతో ఎక్కువగా మంచి ఇండ్లు కట్టాలంటే అమెరికా గృహనిర్మాణ పరిశ్రమను పునర్వ్యవస్థీకరించడమెట్లా?

ఈ అరవయ్యోపడిలోనే మురికిపేటలను పూర్తిగా నిర్మూలించి అమెరికా నగరాలను పునర్నిర్మించడమెట్లా?

ఆర్తులకు మంచి వైద్య సహాయం లభింపజేయడమెట్లా?

అమెరికన్ బాలబాలికలందరూ కాలేజీలలో చదివేటట్లుగా అమెరికా విద్యావిధానాన్ని పటిష్ఠం చేయడమెట్లా?

ఈ ప్రశ్నలకు సమాధానాలు వెదికే అమెరికన్ ప్రయత్నం స్థానికరాష్ట్ర కేంద్రప్రభుత్వాలవరకే పరిమితం కాకూడదు. అమెరికాదేశ కార్మికసంఘాలలో, విశ్వవిద్యాలయాలలో, వ్యాపారసంస్థలలో, వ్యవసాయవృత్తిలో మేధావులైన వారంతా ఈప్రశ్నలకు సమాధానాలు వెదకాలి.

అమెరికన్ పౌరులందరికీ మంచి అవకాశాలు, భద్రత, రక్షణవిధానం చేకూర్చి, ప్రజాస్వామిక వ్యవస్థలద్వారా తమ పేదరికాన్ని తొలగించుకొన ప్రయత్నించే నూత్నదేశాల పురిటినొప్పులను తగ్గించాలంటే, అమెరికన్లు అందివ్వవలసిన సహాయాన్ని లభింపజేయాలంటే అమెరికా ఆర్థికవ్యవస్థే అమెరికన్లకు శక్తివంతమైన ఆయుధం.

ఈ సవాలును ఆత్మవిశ్వాసం, చురుకుదనం, ధైర్యస్థైర్యములు గల అమెరికా మాత్రమే ఎదుర్కోగలదు. అయితే ఉత్పత్తివిస్తరించకుండా అమెరికన్లు కల్పించుకున్నట్టి ప్రతిబంధకాలు అమెరికన్లను కదలకుండా కట్టిపడవేశాయి.

ఇక మూడవశక్తి సంగతి. రాజకీయజాగృతి కలుగుతూవున్న కాలమిది

అమెరికాలోని నీగ్రోపౌరులు తమకు పూర్తి హక్కులు ఉండాలంటున్నారు. మరి ప్రపంచంలో అమెరికన్లది గొప్ప ప్రజాస్వామికదేశమని అనుకుంటున్నారు కదా!

అసలు జాతివివక్షకు వ్యతిరేకంగా పోరాటం జరిపినవారు తెల్లజాతి అమెరికనులే. ఏవర్గం పట్లనైనా వివక్షచూపడం నైతికసూత్రాలను భంగపుచ్చడమేనని వారి అంతరాత్మలు ఉద్బోధించాయి. ఇప్పుడీ పోరాటానికి నీగ్రో అమెరికన్లు నాయకత్వం వహిస్తున్నారు. అమెరికారాజ్యాంగం ప్రకారం పొందవలసిన హక్కులను కోరండని వారు సాటినీగ్రోలను ప్రోత్సహిస్తున్నారు. నీగ్రోలంతా సమిష్టిగా ఉద్యమం నడుపుతున్నారు. వారికోర్కె నానాటికీ బలపడుతున్నది.

వీరివాణి ఒక్క అమెరికాదేశంలోనేగాక ప్రపంచమంతటా వినిపిస్తున్నది. నీగ్రోల పూర్వీకులు ఆఫ్రికానుంచి అమెరికాకు వలసవచ్చారు. వారి ప్రజాస్వామ్య హక్కులను అమెరికన్లు కాదన్నంతకాలం ప్రజాస్వామ్య సూత్రాలపై అమెరికన్లకు గల విశ్వాసాన్ని ఆసియా ఆఫ్రికాదేశాల ప్రతినిధులు నమ్ముతారని అనుకోకూడదు.

అరవయ్యోపదిలో అమెరికా ప్రజలు ఎదుర్కొనే ముఖ్యమైన మూడు సవాళ్ళు ఇవి: ప్రపంచంలో అమెరికాసంబంధాలు; అమెరికా ఆర్థికవ్యవస్థస్తోమతను వృద్ధిచేసే విషయంలో అమెరికన్లు చూపే సామర్థ్యం; జాతిమతవర్ణవివక్షతలు ఆధారంగా ఏ అమెరికన్‌పట్లనూ వివక్ష చూపడాన్ని నిర్మూలించే విషయంలో అమెరికన్లు చేసే ప్రయత్నాలు.

ఈ ప్రశ్నల విషయంలో అమెరికన్లు పడే తర్జనభర్జనలవల్ల అరవయ్యోపదిలో నూతన రాజకీయధోరణులు తప్పక ఆవిర్భవిస్తాయి.

ఔదార్యవాది, మితవాది, తీవ్రవాది, అభివృద్ధినిరోధకుడు వంటి పాత రాజకీయ పారిభాషికపదాలకు అర్థాలే మారిపోతున్నాయి. కనుక కొత్తధోరణి ఎంత త్వరగా వస్తే అమెరికన్లకు అంతమంచిది. 1930 ప్రాంతాలలో అమెరికన్లను కదిలించిన నినాదాలు ఇప్పుడు అమెరికన్లకు ఏట్టి ప్రేరణా కలిగించడంలేదు. పైగా ఉదాసీనతను తెచ్చిపెడుతున్నాయి.

అయితే 1960 ప్రాంతాలలో అమెరికన్లను విభజించే రాజకీయధోరణులు, రాజకీయచర్యలు గతంతో సంబంధం లేకుండా వుంటాయని నేను అనుకోవడం లేదు. ఔదార్యవాదానికి (Liberalism) ఏయుగంలోనైనా కొన్ని సార్వజనీన విలువలపై, ధర్మాలపై విశ్వాసం వుండవలసిన అవసరముంది. ఆవిలువలను ప్రతితరం

వారు తమ అనుభవాలదృష్ట్యా, తమ లక్ష్యాలదృష్ట్యా, వాస్తవపరిస్థితులదృష్ట్యా ఎప్పటికప్పుడు తిరిగి రూపకల్పన చేసుకొంటూపోవాలి.

వెనుకటివలెనే ఇప్పుడుకూడా మితవాదులు గతంపై అభిమానంతో భవిష్యత్తును అనుమానంతో చూస్తూవుండడం కద్దు.

మితవాదులలోనూ మరీ పాతచింతకాయ పచ్చడిరకంవారు అమెరికన్లు ఐక్యరాజ్యసమితినుండి, మిత్రత్వ ఒడంబడికలనుండి ఉపసంహరించుకోవాలనీ, అమెరికా ప్రభుత్వబడ్జెట్లను బాగా తగ్గించుకోవాలనీ, అమెరికా నగరాలను పునర్నిర్మించి విద్యావ్యాప్తికిచేసే ప్రయత్నాలను మందగింపచేయాలనీ, అమెరికన్ నీగ్రోలు కొంతకాలం ఓర్పు వహించాలని వారికి హితవుచెప్పాలనీ అంటూ వుంటారు.

అంటే వారు అనే దాని సారాంశమిది: "ఈ ప్రపంచాన్ని ఆపండి. మేము దిగిపోతాము." కాని లోకవృత్తం నిలుస్తుందా? నిలపదు. ఎంత పిరికివారైనా ఈ ప్రపంచంనుండి పలాయనం చిత్తగించడం సాధ్యపడని సంగతి.

ఎన్నో మార్పులు వస్తూవున్న నేటి ప్రపంచంలో ఎన్ని అపాయాలుదాగా గర్భితమై వున్నవో అట్టివి చరిత్రలో మున్నెన్నడూలేవు. అయితే వ్యక్తి పెరగడానికీ, అతనికి నిజంగా గౌరవం సిద్ధించడానికీ, లోకశ్రేయస్సుకోసం మానవుని శక్తిసామర్థ్యాలు అక్కరకు రావడానికీ ఈయుగంలో వున్నన్ని సదవకాశాలు మానవచరిత్రలో మున్నెన్నడూ లేవు.

కనుక భావి ఔదార్యవాదులు అమెరికన్లకూ, ఇతర కమ్యూనిస్టేతర రాజ్యాలకూ మధ్య పటిష్ఠమైన ప్రపంచవ్యాప్త భాగస్వామ్యం కావాలంటారనీ, ఇతర ప్రజల స్వాతంత్ర్యంపట్ల, శ్రేయస్సుపట్ల శ్రద్ధాళువులై వుంటారనీ, సోవియట్ నాయకుల బెదిరింపులకు చలించక దృఢంగా నిలబడటమేగాక జాతిమతపక్షవిచక్షణ లేకుండా అమెరికాప్రజలందరూ వారివారి శక్త్యనుసారం కృషిచేయడానికి అనువైన ఉత్తమసమాజం సృష్టింపబడాలని వాదిస్తారనీ అమెరికన్లు ఆశించవచ్చు.

నూత్న చట్రంలో ప్రజాస్వామ్యంయొక్క అసలైన అర్థం చర్చింపబడుతూ వుండగా, కొత్తవిభేదాలు స్వచ్ఛమై తేటతెల్లమవుతూ వుండగా, నూత్న రాజకీయ ధోరణులు నిర్ధారితమవుతూవుండగా యావత్తుపరిస్థితి మానవుని హక్కులకు,బాధ్యతలకు హెచ్చుప్రాధాన్యమిచ్చేవారికి అనుకూలంగా మారగలదని ఆశించవచ్చు. ఆవేశ కావేషాలు, ఉద్రిక్తతలు, అపాయాలు, భవిష్యత్తుకు శుభసూచనలు—అన్నీ ఏకకాలంలో గోచరించే నేటిప్రపంచంలో ప్రజాస్వామ్యతత్వంయొక్క మహాత్వమును వారే పునఃనిర్వచించాలి.

విభాగము-2

# బాధ్యతాయుతరాష్ట్రప్రభుత్వాలు: వికేంద్రీకరణకు కీటుకు

నానాటికీ అధికమవుతూవున్న అమెరికా సామాజిక అవసరాల దృష్ట్యా అమెరికా రాష్ట్రప్రభుత్వాల యంత్రాంగాన్ని సర్దుబాటుచేయడంలో అమెరికన్లు వెనుకపడ్డారు.

దీనిఫలితంగా రాష్ట్రాల రాజధానులలో ఎంతో చక్కగా పరిష్కరింపబడవలసిన సమస్యలను ప్రజాభిప్రాయపు ప్రత్తిడులవల్ల అనేకమార్లు కేంద్రప్రభుత్వం తనపై వేసుకొని పరిష్కరింపవలసి వచ్చింది. రాష్ట్రప్రభుత్వాల యంత్రాంగములను, వాటి విధానాలను కాలానుగుణంగా తీర్చిదిద్దకపోవడంచేతనే రాజ్యాధికారం చాలావరకు వాషింగ్టన్‌లో కేంద్రీకృతమై వుంది.

మార్చి 9, 1950.

# 6

# గవర్నరు ఉద్యోగం: గవర్నరుగా పనిచేసిన వ్యక్తిభావాలు

శ్రీ బౌల్స్ కొంతకాలం కనెక్టికట్ రాష్ట్రగవర్నరుగా పనిచేశారు. అప్పుడు తన అనుభవంలోనుంచి ఆ ఉద్యోగం విధానాన్ని ఏమిటో, ఎట్టి అవకాశాలుంటాయో, ఎటువంటి ఒత్తిడి తారిస్తే ప్రమాదాలుంటాయో శ్రీ బౌల్స్ వివరించారు. ఇది 1949 జూలై 24 తేదీ న్యూయార్కు టైమ్సు మేగజైన్‌లో వ్రాసిన వ్యాసం.

గత నవంబరులో నేను కనెక్టికట్ రాష్ట్రగవర్నరునయ్యాను. ఇది మా పార్టీ వారికీ, ఓటర్లకూ, నాకూ కొంత ఆశ్చర్యం కలిగించింది. కనెక్టికట్ ఆధునిక చరిత్రలో కొద్ది ఓట్లతేడాతో గెలిచినవారిలో నేను ద్వితీయస్థానమాక్రమిస్తాను. 2225 ఓట్లతేడాతో నేను గెలిచాను. అంటే చాలా తీవ్రమైన పోటీ అన్నమాట.

దేశంలో వున్న రిపబ్లికన్ పక్షంవారందరివలెనే కనెక్టికట్ రాష్ట్ర రిపబ్లికనులు కూడా తమ అభ్యర్థి గెలుస్తాడన్న విశ్వాసంతో వున్నారు. కనెక్టికట్ ప్రజలు స్థిరచిత్తులనీ, అలవాట్లను మార్చుకోరనీ ప్రతీతి. గడచిన రెండువందల యేండ్లలో ఆ రాష్ట్రానికి 11 మంది డెమోక్రటిక్ పక్షంవారు మాత్రమే గవర్నర్లుగా ఎన్నికైనారు.

1948 లో కనెక్టికట్ రాష్ట్రగవర్నరుగా డెమోక్రటిక్ పార్టీ అభ్యర్థి ఎన్నికవుతాడన్న విశ్వాసంతో నేను గవర్నరు పదవికి పోటీచేయలేదు. అందులోనూ కనెక్టికట్‌లో గెలవడమూ! అయితే కొన్ని ముఖ్యకారణాలవల్ల నేను పోటీచేయ వలసి వచ్చింది.

చాలా రాష్ట్రాలకువలెనే కనెక్టికట్ రాష్ట్రానికికూడా జటిలసమస్యలున్నాయి. అక్కడిస్కూళ్ళు తక్కువ. టీచర్లు తక్కువ. ట్రైనింగుపోయింతేనేగాని ఈ సమస్యతీరదు. గృహావసతి లోపం మరీజాస్తి. మురికిపేటలను కొనసాగలేము. మంచి ఆధునికమైన పిచ్చి ఆసుపత్రుల అవసరమెంతో వుంది. పాతవి-రెండు తరాలక్రిందకట్టినవి-కారాగారాలవలెవున్నవి. నిరుద్యోగస్థితి హెచ్చుతూవుంది. కొత్త కార్మికశాసనాల అగత్యంవుంది. వృద్ధాప్యంలో వున్నవారికి హెచ్చుసహాయం అవసరం.

ప్రభుత్వం తలచుకుంటే ఈ సమస్యలను పరిష్కరించవచ్చని నాకు అని పించింది. వాషింగ్టన్‌లో రాజ్యాధికారం హెచ్చుగా కేంద్రీకృతమైవుండడం ప్రమాదకరం కావచ్చు. అయితే ప్రజలకు విద్యా, వైద్య, గృహావసతి, వృద్ధాప్య సదుపాయాలు కలిగించడంలో రాష్ట్రప్రభుత్వం విఫలమైతే అవసరాన్నిబట్టి గాని, లేక తన అధికారపరిధిని అతిక్రమించిగాని కోర్కెలు కలిగించుకొని కేంద్రం సహాయపడాలి.

వాషింగ్టన్‌లో ప్రభుత్వం మరీ కేంద్రీకృతం కాకుండా నిరోధించాలంటే అమెరికా రాష్ట్రప్రభుత్వాల సామర్థ్యాన్ని పెంచడం అవసరమని నాకు తోచింది.

ప్రజాసమస్యలను పరిష్కరించడంలో కనెక్టికట్, తదితరరాష్ట్రాలు బాధ్య తతో పనిచేసి మంచి సామర్థ్యాన్ని చూపాయంటే వాషింగ్టన్‌కేసి తిరిగి చేబదించ వలసిన అవసరం తక్కువగా వుంటుంది.

సరే నేను ఎన్నికయ్యాను. అవేశాలూ, ఆశ్చర్యాలూ సమసిపోయ్యాయి. అప్పుడు చుట్టూ పారజూచాను. వెంటనే చేయవలసిన పనులు రెండు కన్పించాయి. మొదటిది—ఏ ఎన్నికల ప్రణాళికను ప్రజలముందుంచి నేను గెలిచానో దాన్ని అమలు జరపడానికి శాసనాలను ప్రవేశపెట్టడం. రెండవది—రాష్ట్రబడ్జెటును తయారు చేయడం.

రెండూ కష్టమైనపనులే అనిపించింది. ఎందుచేతనంటే, కనెక్టికట్ సెనే టులో డెమోక్రటిక్ పక్షానికి మంచి మెజారిటీ వున్నప్పటికీ ప్రజాప్రతినిధుల సభలో అధికసంఖ్యాకులు రిపబ్లికన్ పక్షంవారే.

పై రెండు బాధ్యతలూ గాక రాష్ట్రప్రభుత్వపరిపాలన సమర్థవంతంగా వుండేట్టు చేయాలనీ, శాసనసభ అనుమతిస్తే పరిపాలన సామర్థ్యం పెరిగేందుకు వీలుగా ప్రభుత్వశాఖలలో మార్పులు ప్రవేశపెట్టాలనీ అనుకున్నాను. కాని గవర్నరు

కట్‌లోని 108 సంస్థలు, వాటి పరిపాలనాయంత్రాంగాలు రూబె గోల్డుబెర్గును కూడా బెదరగొట్టుతాయి. నాకు జవాబుదార్లయినవారు 800 మంది కమీషనర్లు వున్నారు. మంత్రివర్గ సమావేశం ఏర్పాటుచేయవలసివున్నా నా ఈ 800 మందినీ పిలవాలు కావలసిందే! ఈ శాఖలన్నీ విపరీతంగా పెరిగిపోయ్యాయి. కొన్ని రాజకీయకారణాలతో సృష్టింపబడ్డవి.

డెమోక్రాట్ కానివ్వండి, రిపబ్లికన్ కానివ్వండి కనెక్టికట్ పౌరులంతా వ్యయభారంతో కూడిన ఈ రాష్ట్రపాలనా యంత్రాంగాన్ని సవరించ ప్రయత్నించినవారే. 1930 ప్రాంతాలలో గవర్నర్ విల్బర్‌క్రాస్ ఈ పనికి పూనుకొని కొంత ముందుకు వెళ్ళాడు. మళ్ళీ ఆ ప్రయత్నం చేయాలని నేను పూనుకున్నాను.

హూవర్‌కమిటీద్వారా ప్రభుత్వవ్యవస్థను పునర్వ్యవస్థీకరించాలని శాసనసభను కోరాను. శాసనసభ అందుకు అంగీకరించింది. ప్రభుత్వవ్యవస్థతో సంబంధంగల పన్నులుకట్టే వర్గాలవారుకూడా చేయూతనిచ్చారు. ఆ కమిటీ వచ్చే సంవత్సరారంభంలో సిఫారసులు చేయాలి. అంతా కలిసివస్తే 1951 సంవత్సరానికల్లా కనెక్టికట్ ప్రభుత్వానికి కొత్తరూపం రావచ్చు.

ఒకవైపు నాకు చుక్కెదురైంది. నా క్రిందవున్న 18 మంది కమీషనర్లు అంతా రిపబ్లికనులే! వారిని రిపబ్లికనులే నియమించారు. నా విధానాలన్నా, కార్యక్రమాలన్నా వారికి సరిపడనివి. వారిలో కొందరు చాలా సమర్థులే అయినా వారితో నా విధానాలను అమలుజరుప బూనుకోవటం క్రిస్లర్ ఏర్పాటుచేసిన డైరెక్టర్ల బోర్డుతో జనరల్ మోటార్సుకంపెనీని నిర్వహింప బూనుకోవటంవంటిదికదా అని నేను విస్మయంచెందేవాణ్ణి!

శాసనసంబంధమైన కార్యక్రమం నాకు ముఖ్యకార్యం. ఇది ముళ్లదారి. ప్రారంభోత్సవానికి నేను పంపిన సందేశంలో నా కార్యక్రమాన్ని సూచించాను. అది ఎన్నికరోజునుంచీ నేను అనుకుంటూ వచ్చిన కార్యక్రమమే.

డెమోక్రటిక్ పక్షం వారి మెజారిటీ గల సెనేటు, ఆ పక్షమూ నా కార్యక్రమానికి అండగావున్నాయి. కొందరు స్వతంత్రపౌరులుకూడా నన్ను బలపరుస్తున్నారు. సెనేటులో మాది మెజారిటీ కాబట్టి శాసనసభఆమోదం లభిస్తుందని నాకు తెలుసు. కాని రిపబ్లికనులకు మెజారిటీ వున్న ప్రజాప్రతినిధుల సభ సంగతి వేరు. దాన్ని అంకెకు తేవడం అసాధ్యం.

దీనికి కారణం అప్పటియువాడుకైన రిపబ్లికనులు కొందరూ, డెమోక్రటిక్ పార్టీవారూ అన్నట్లు "బూజుపట్టిన పాతవిధానం." ఈ విధానము ననుసరించి 1850 కి పూర్వం నెలకొన్న ప్రతిపత్తి. అది ఎంత చిన్నదైనా సరే, ప్రజాప్రతినిధులసభకు ఇద్దరు ప్రతినిధులను పంపవచ్చు. కనెక్టికట్ రాష్ట్రంలో అంతర్యుద్ధం నాటినుంచీ చిన్న బస్తీలన్నీ రిపబ్లికన్ మెజారిటీ గలవే కాబట్టి. పట్టణాలకంటె బస్తీలసంఖ్య అధికం కాబట్టి ఈరాష్ట్ర ప్రజాప్రతినిధుల సభలో రిపబ్లికన్ మెజారిటీ వుండటం ఖాయం.

ప్రతినిధుల సభలోని సభ్యులలో మూడింట రెండువంతులమంది రిపబ్లికనులే అయినా వారు ప్రజానీకంలో మూడవవంతు ప్రజలకు మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తారు. కనెక్టికట్ జనాభాలో నూటికి 35 వంతులమంది 6 పెద్ద నగరాలలో నివసిస్తున్నారు. కాని ఆనగరాలు దిగువసభలోని సభ్యులలో 35 శాతాన్ని ఎన్నుకునే బదులు 3 శాతంకంటె తక్కువ సభ్యులను మాత్రమే ఎన్నుకొని పంపుతున్నాయి.

నాకు చిన్న బస్తీలంటే ఇష్టం. నేను ఎస్సెక్సు అనే చిన్న బస్తీలో నివసించడానికి నిశ్చయించుకున్నాను. దాని జనాభా 3100. మొత్తం 866000 జనాభాగల ఆరు పెద్దనగరాలకు చెందిన పదిమంది ప్రతినిధులను 2523 జనాభా మాత్రమే కలిగిన ఆరు చిన్నబస్తీలకు చెందిన పన్నెండుమంది ప్రతినిధులు మించిపోవడం నాకు సమ్మతం కాదు.

కనెక్టికట్ ప్రజాప్రతినిధుల సభలో రిపబ్లికన్ శాసనసభా పక్షనాయకుడు సభ సమావేశమవుతున్న రోజులలో ఏమిమాట్లాడినా, ఏమిచేసినా అతడు ఎన్నికలలో ఓడిపోయే ప్రమాదం ఇసుమంతైనా లేదు. ప్రజాస్వామ్యంలో ఇలాంటి పరిస్థితి వుండటం బాగాలేదు.

ఈ విషయాన్ని అమెరికా రాష్ట్రప్రభుత్వాలు శాంతంగా ఆలోచించాలి. అమెరికాప్రభుత్వ సమస్యలను పరిష్కరించడంకోసం వాషింగ్టన్ కేసి చూస్తూ పోతే ప్రభుత్వాధికారాలు ప్రమాదకరరీతిగా కేంద్రీకృతమవుతూ పోతాయి.

ప్రజాసమస్యలు సాధ్యమైనంతవరకు రాష్ట్రప్రభుత్వాలచే పరిష్కరింపబడాలి. అయితే రాష్ట్రప్రభుత్వాల ప్రజాస్వామిక యంత్రాంగం పౌరులకు సక్రమరీతిలో ప్రాతినిధ్యం వహిస్తే తప్ప లేకపోతే రాష్ట్రాలు తగురీతిగా వ్యవహరించలేవు.

కనెక్టికట్‌లో మేము అట్టి యంత్రాంగంకోసమే కృషిచేస్తున్నాము.

# 7

# అమెరికా పాఠశాలలు

యుద్ధానంతరం కనెక్టికట్‌లో పాఠశాలల కొరత ఏర్పడింది. దానిపై ఆర్థికంగా, రాజకీయంగా కొన్ని సమస్యలు ఎదుర్కొన్నాయి. గవర్నర్ బౌల్స్ కేవలం స్కూళ్ళసమస్యను మాత్రమే చర్చించడానికై 1949 నవంబరులో రాష్ట్ర శాసనసభను సమావేశపరచి ఈదిగువ సందేశమిచ్చారు. కొన్నివారాల తర్వాత ఆమోదించబడ్డ శాసనంవల్ల ఇప్పుడు కనెక్టికట్ రాష్ట్రం పిల్లలలో మూడింట రెండు వంతులమంది కొత్తగా నిర్మింపబడ్డ పాఠశాలల్లో చదువుతున్నారు.

అమెరికా రాష్ట్రంలో విద్యాసమస్యను చర్చించే నిమిత్తమై కనెక్టికట్ జనరల్ అసెంబ్లీ ఈనాడు ప్రత్యేకంగా సమావేశమైంది.

ఒక్క కనెక్టికట్‌కేగాక మొత్తం దేశానికీ, ప్రపంచానికీ కూడ విద్యకంటె ప్రధానమైన సమస్య వేరొకటిలేదేమో. అమెరికా విద్యావిధానాన్ని వృద్ధిపరచడానికి ఇప్పుడు తగుచర్య గైకొనకపోయ్యారంటే భవిష్యత్తులో అమెరికన్ ప్రజాస్వామిక ప్రభుత్వవ్యవస్థకే ముప్పుతెచ్చిపెట్టినవారవుతారు.

అమెరికా ఇప్పటితరంవారు గడచిన ముప్పైయేళ్ళనుంచీ కొన్ని సమస్యలను పరిష్కరించడానికి సతమతమవుతున్నారు. పెద్దగా కృతార్థులు కాలేదు. ఇప్పటి సంతతివారు వీటికంటె చిక్కైన సమస్యలు ఎదుర్కొంటారు.

కనుక అమెరికా విద్యావిధానం అభివృద్ధి విషయం అమెరికన్లు మాట్లాడుతున్నారంటే అమెరికాపిల్లలు భవిష్యత్తులో జటిలసమస్యలు ఎదుర్కొందుకు వీలుగా వారిని తయారుచేసే పైనాన్ని పరిశీలిస్తున్నారన్నమాట. ఏ సమాజానికైనా,

పోయ్యేకొద్దీ పరిస్థితి అధ్వాన్నమవుతుందని ఈ నివేదిక హెచ్చరించింది. ఇప్పుడు అమెరికన్ల పిల్లలచదువు ప్రమాణబద్ధమైనదికాదు. అనేకనగరాలలో బస్తీలలో తరగతి గదులలోపల అదనపు తరగతులు నిర్వహింపబడుతూ వున్నవి. చాలాచోట్ల నేలమాళిగలలో, వాకిళ్ళలో, రద్దుబందులలో, కొట్లలో, వంటలలో తరగతులు పెట్టడం జరుగుతూవుంది. యథార్థాలు ఇట్లా వున్నవి.

వచ్చే రెండు సంవత్సరాలలో ఎన్నిభవనాలు అవసరమో, వచ్చే పదేండ్లలో ఎంతవసతి అవసరమో కూడా నివేదికలో అంచనావేయబడింది. చాలా కావాలి. అందుచేత పెద్దపెట్టున భవననిర్మాణ కార్యక్రమాన్ని సత్వరమే అమలు జరపాలి.

ఇందుకు ప్రభుత్వసహాయం అవసరమా అన్నది రెండవప్రశ్న. కొన్ని బస్తీలు మాత్రమే ఋణగ్రస్తమైనట్లు పైకి కన్పించినా చాలా పట్టణాలు వాటి తాహతునుబట్టి అప్పులుచేశాయి. అనేక స్థానికప్రభుత్వాలుకూడా ధనాభావాన్ని తట్టుకొని నిలవడానికై గరిష్ఠ ఆర్థికపరిమితిమేరకు ఆస్తి పన్నులను పెంచాయి.

అమెరికా బస్తీలలో, పట్టణాలలో స్కూళ్ళకు భవనములకొరతేగాక నీటి వసతి, మురుగుపారుదల, అగ్నిమాపక ఏర్పాటు, పోలీసురక్షణ మున్నగు సదుపాయాల కొరతకూడా వుంది. వీటికి డబ్బుకావాలి. ఈ లోపాలన్నీ ఆ నివేదికలో వున్నాయి.

భవనాలు కట్టించాలంటే, ప్రభుత్వసహాయం అవసరమని 116 పట్టణాల, బస్తీల స్కూళ్ళబోర్డులు అంటున్నాయి. మరి 17 బస్తీలుకూడా ఆమాటే అన్నాయి. 7 బస్తీలు మాత్రం అసలు సహాయం అక్కరలేదన్నవి. ఏమైనప్పటికీ కనెక్టికట్ రాష్ట్రం ఇతర రాష్ట్రాలననుసరించి భవననిర్మాణ కార్యాలకై స్థానికసంస్థలకు ధనసహాయం చేస్తేతప్ప లేకపోతే అసలు పాఠశాలలే ఏర్పడవని అధికసంఖ్యాకుల అభిప్రాయంగా వుంది.

ఇక మూడవప్రశ్న: అమెరికాపట్టణాలు, బస్తీలు అన్నిటికీ డబ్బు అవసరం సమానంగా వుందా? అంటే సహాయం సంగతి. ఈ బస్తీలకు వాటి అవసరాలను తీర్చుకొనే ఆర్థికస్తోమత ఒకవిధంగా లేదు. భేదాలున్నాయి. కొన్నిబస్తీలు డబ్బు గలవి. కొన్ని పేదరికంలో వున్నాయి. మరికొన్ని మధ్యస్థంగా ఉన్నాయి. ఒక బస్తీకి స్తోమతవుందా, లేదా అన్న విషయం దాని పరిమాణాన్నిబట్టి, పన్నువేయదగ్గ ఆస్తినిబట్టి నిర్ణయించాలి.

అయితే ప్రజాస్వామిక సమాజంలో పిల్లలకు వారి బస్తీ డబ్బుగలదైనా

చను. ఆర్థికమాంద్యం వున్న ఈరోజులలో పన్నులుపెంచితే వ్యాపారానికి దెబ్బ తగులుతుంది. జనానికి ఉద్యోగాలు, పనులు తగ్గి ఉపాధిపోతుంది.

పన్నులహెచ్చింపు అనవసరమని నా అభిప్రాయం. బడ్జెట్ త్వరితగతిని అంతే దానికన్న అమెరికా ఆదాయస్వరూపం మరీ తీసికట్టుగా వుందనుకుంటే తప్పు. లేక పోతే పన్నులు పెరగవలసిన అగత్యంలేదు. జాగరూకతతో వ్యవహరించి, వివేకంతో శాసనం చేసుకొంటే అమెరికా ఆదాయవ్యయాలను సమతూకంలో వుంచవచ్చు. *

మరి ఈసమస్య పరిష్కరింపబడదట మెలా? స్థానికంగా నిర్మితమైన పాఠశాలలకు లభించవలసిన ప్రభుత్వ సహాయాన్ని కిస్తీపద్ధతి ప్రకారం చెల్లించవచ్చు. అంటే వాయిదాలపద్ధతి.

ఒక వ్యాపారసంస్థ తన ఫ్యాక్టరీని విస్తరింపచేటప్పుడు అప్పుగా డబ్బు తీసుకొని ఫ్యాక్టరీలాభాలు తెస్తున్నకాలంలో ఆ అప్పును వాయిదాలుగా తీరుస్తుంది. అలాగే ఒక కుటుంబం ఇల్లు కొన్నప్పుడు, ఆ ఇంటిని కుదువపెట్టి కొంతడబ్బు అప్పుతీసుకొని ఆ అప్పును కొన్నియేండ్లలో తీర్చడం కద్దు. ఈవిధంగా అటుగినిన్లు అమెరికారాష్ట్రంలో ఉపాధ్యాయుల కళాశాలలు, వృత్తిపనుల పాఠశాలలు, కనెక్టికట్ విశ్వవిద్యాలయం విస్తరణ విభాగాలు నిర్మించుచున్నారు. ఈనూతన పాఠశాలల నిర్మాణంకొరకై ప్రభుత్వం చేయవలసిన సహాయం 2 కోట్ల 60 లక్షల డాలర్లను కూడా వాయిదాలుగా రాబట్టవచ్చు.

ఈ సమావేశం ప్రతిరాజకీయపక్షం చిత్తశుద్ధిని, ప్రతిశాసన సభ్యుని నిజాయతీని పెద్ద పరీక్షకు గురిచేస్తున్నది. అమెరికా విద్యావిధానాన్ని పటిష్ఠంచేయాలన్న ఉద్దేశం అమెరికన్లకుందా, లేదా? ఉంటే, ఆ లక్ష్యాన్ని సాధించడానికి తగు చర్యలు గైకొంటారా లేదా?

అదీ విస్పష్టప్రశ్న: అపోహలకు తావేలేదు. స్కూలు భవనాలవిషయం అమెరికన్లు చర్చించనారంభించి ఇప్పటికి సంవత్సరమైంది. ఏమీ జరగలేదే అన్న అసంతృప్తివుంది. ఇక ఇప్పుడు చేస్తే ఏదైనా చేయడమో, లేకపోతే కొట్టివేస్తే సెయ్యడమో—ఏదో ఒకటి చెయ్యాలి.

ఈ సమావేశం సందర్భంగా అమెరికన్లందరిపైనా గొప్ప బాధ్యతవుంది. నా ఉద్దేశాలేమిటో స్పష్టంగా చెప్పి పరిస్థితిని మీకు వివరించడం నా విధి.

నా విధి నేను నిర్వర్తించాను. ఇక జరగవలసిందేమిటో మీరు నిర్ణయించాలి.

* గవర్నర్ బౌల్స్ పరిపాలనాకాలంలో పన్నులు పెంచకుండా బడ్జెటును సమస్థితిలో వుంచిన మూడు రాష్ట్రాలలో కనెక్టికట్ ఒకటి.

# 8

# కనెక్టికట్ గృహవసతి

1948-49 లో గృహవసతి సమస్య రాజకీయసమస్య అయింది. అప్పుడు కనెక్టికట్ రాష్ట్రప్రభుత్వం తక్కువ ఖర్చుతో ఇండ్లు నిర్మించి వాటికి యాజమాన్య పద్ధతిని ఎలా అమలుజరిపిందీ ఈ వ్యాసంలో వివరించబడింది. ఇలా నిర్మించబడ్డ ఇండ్లలో 70 వేల మంది స్త్రీ పురుషులు, పిల్లలు నివసిస్తున్నారు. "[illegible]" అన్న పత్రికనుంచి ఈ వ్యాసం 1960 సంవత్సరంలో ప్రచురితమైంది.

గృహవసతిని ఏర్పాటుచేసే విషయంలో అమెరికా రాష్ట్రప్రభుత్వాలు నిర్వహించవలసిన పాత్ర ఏమైనా వుందా? ఈ ప్రశ్నను గృహనిర్మాణంపై ఆసక్తి గలవారు మాత్రమేగాక కేంద్రప్రభుత్వంపై అమెరికన్లు అధికంగా ఆధారపడి వుండడాన్ని ఆందోళనతో గమనించేవారు కూడా పరిశీలించాలి.

ఇప్పుడు కేంద్ర మునిసిపల్ కార్యక్రమాలద్వారా మాత్రమే మురికిపేటల నిర్మూలన, తక్కువ ఖర్చుతో ఇండ్లనిర్మాణం, ప్రైవేటు నిర్మాణాలు, మధ్యతరగతి ఆదాయపు వర్గాలవారికి ఇండ్ల నిర్మాణంవంటి పనులు జరుగుతూవున్నవి. రాష్ట్ర కార్యక్రమాలే లేవు.

మురికిపేటల నిర్మూలనకూ, పునఃఅభివృద్ధికీ, గృహనిర్మాణ పరిశోధనకూ, ఇండ్లు కొనేవారికీ కట్టేవారికీ అప్పులివ్వడానికి కేంద్రప్రభుత్వం చేసే సహాయం గమనించదగింది. రాష్ట్రప్రభుత్వాలు వాటి ప్రస్తుత పన్నుల విధానాలనుబట్టి అలాంటి సహాయం చేయలేకుండా వున్నవి.

కాని కనెక్టికట్ గవర్నరుగా నా అనుభవాన్నిబట్టి బాధ్యతతో చక్కగా నిర్వహింపబడే రాష్ట్రప్రభుత్వం కూడా చొరవతీసుకొని, పెట్టుబడిపెట్టి గృహవసతి కార్యక్రమాలను అమలుజరపవచ్చు అని చెప్పగలుగుతున్నాను. అందువల్ల కేంద్ర, స్థానిక ప్రభుత్వాల కార్యక్రమాలకు మద్దతు ఇచ్చినట్లవుతుంది.

సమర్థవంతమైన రాష్ట్రప్రభుత్వం పన్నుచెల్లించేవారికి ప్రయాస అక్కర లేకుండానే అప్పులుచేసి ఒకమాదిరి మంచి ఆదాయంగల వర్గాలవారికై చక్కని గృహనిర్మాణ కార్యక్రమాన్ని చేపట్టవచ్చు. కొత్త కార్యక్రమాలను, కొత్త పెట్టుబడి విధానాలను అనుసరించవచ్చు. కేంద్రప్రభుత్వానికి ఈ వెసులుబాటు వుండదు.

కారణమేమంటే కేంద్రప్రభుత్వం ఎక్కడో దూరాన వుంటుంది. ఇండ్లు ఎక్కడో కడుతూవుంటే పర్యవేక్షణ చేయడం దుస్సాధ్యమవుతుంది. రాష్ట్ర ప్రభుత్వంవిషయం వేరు. చక్కగా పర్యవేక్షణ చేయవచ్చు. వివిధ కార్యకలాపాలను సమన్వయపరచి, స్థానిక గృహనిర్మాణ సంస్థల కార్యదక్షతను పెంపొందించవచ్చు. కేంద్రప్రభుత్వ గ్రాంటులకు తోడుగా తానూ కొంత డబ్బు ఖర్చుపెట్టి, స్థానికాధికారులను ప్రోత్సహించి, సమాజాన్ని ప్రేరేపించి మురికిపేటల నిర్మూలన, పునఃఅభివృద్ధి, తక్కువ అద్దెల ఇండ్లనిర్మాణంవంటి పనులు చేయించవచ్చు.

“గృహవసతి సమస్య ప్రజాస్వామ్యప్రభుత్వ ప్రాతిపదికను స్పృశించేది. కేంద్రప్రభుత్వ అధికారాలకూ, రాష్ట్రప్రభుత్వ అధికారాలకూ గల సంబంధాన్ని తోడితీసేది. గృహనిర్మాణ బాధ్యతనంతటినీ కేంద్రప్రభుత్వంపైన, నగర ప్రభుత్వాలపైన పెట్టడమంటే రాష్ట్రప్రభుత్వాల ముఖ్యపాత్రను విస్మరించడమే అవుతుంది. అంటే వాషింగ్టన్‌పై పూర్తిగా ఆధారపడటమే కదా!

కనెక్టికట్‌లో గృహవసతి సమస్యను గూర్చి శాసనసభలోనూ, రాజకీయ పక్షాల వేదికపైనా జరిగిన చర్చలను రెండేళ్ళపాటు విన్నతర్వాత రాష్ట్ర గృహవసతి కార్యక్రమం చిక్కులేనిదన్న అభిప్రాయం నాకు కలిగింది. ఇక ప్రభుత్వం గృహనిర్మాణ సమస్య జోలికి పోకూడదనేవారు ఇటు రాష్ట్రరాజధానులలోనూ వున్నారు, అటు కేంద్రంలో వాషింగ్టన్‌లోనూ వున్నారు!

2500 కనెక్టికట్ కుటుంబాలు ప్రభుత్వం కట్టించిన ఇండ్లలోకి గృహప్రవేశం చేయడం నేను కళ్ళారా చూసిన పిమ్మట రాష్ట్ర గృహవసతి కార్యక్రమం రాజకీయంగా, శాసనవిషయకంగా కొంత తలనొప్పి పని అయినప్పటికీ దానివల్ల

ప్రజాస్వామిక సమాజానికి ఎంతమేలు చేకూరుతుందో నేను గ్రహించాను. కట్టిన ఇండ్లు శుభ్రంగా, అందంగా, సౌకర్యవంతంగా వున్నవి.

సరసమైన ధరలకు, లేదా అద్దెలకు మంచి ఇండ్లు కట్టించి ఇవ్వడం అమెరికా "స్వేచ్ఛాసమాజం ఆరోగ్యానికి మంచిదని అమెరికన్ ప్రజలు నమ్ముతున్నారు. అట్టి ఇండ్లను ప్రైవేటుగా కట్టడం సాధ్యంకానప్పుడు ప్రభుత్వం ముందంజవేసి ఆ కొరతను పూరించవలెనని ప్రజలు కోరుతున్నారు.

యుద్ధానంతరం కనెక్టికట్‌లో గృహావసతి పరిస్థితి పారిశ్రామిక రాష్ట్రాలలో ఎలావుంటుందో అలాగే వుంది. కనెక్టికట్‌లో ప్రత్యేక యుద్ధపరిశ్రమలు నెలకొనడంచేత పలుప్రాంతాలనుండి కార్మికులు ఇచటికి వచ్చారు. పదేండ్లలో 3 లక్షల జనాభా పెరుగుదల సంభవించింది. తాత్కాలికంగా నిర్మించిన 5,000 లాన్‌హామ్ చట్టం గృహాలు మినహా యుద్ధకాలంలో ఇండ్లనిర్మాణమే జరగలేదు.

దీనఫలితంగా అమెరికా చిన్నరాష్ట్రంలో 37,000 కుటుంబాలవారు వారి బంధువుల ఇండ్లలో, స్నేహితుల ఇండ్లలో వుంటున్నారు. ఇండ్లు ఇరుకైపోయాయి. మరి 42,000 కుటుంబాలు హీనమైన ఇండ్లలో, అంటే మురికిపేటలలో వుంటున్నాయి.

ప్రైవేటువర్గాలవారు యేటా 7,000 మొదలు 8,000 ఇండ్లు మాత్రమే కట్టగలరని తేలిపోయింది. 1946 లో కేంద్రానికి సంబంధించిన వెటరన్స్ ఎమర్జెన్సీ హౌసింగ్ ప్రోగ్రామ్ రద్దుచేయబడ్డ తర్వాత పై ఆదాయాలవారికి మాత్రమే ప్రైవేటుసంస్థలు ఇండ్లు నిర్మించాయి. ఒక్కొక్క ఇంటి ఖరీదు 15,000 డాలర్లు. ఒక ఇంటికి నెలకు అద్దె 90 డాలర్లు!

అప్పుడు పెద్దలు కుపితులై అందుబాటులో వున్న తమ రాష్ట్రశాసన సభకు విషయం నివేదించి విజ్ఞప్తి చేశారు. ప్రైవేటుకంట్రాక్టర్ల గృహనిర్మాణానికి తోడు రాష్ట్రప్రభుత్వం కూడా తక్కువ ఆదాయాలవారికీ,మధ్యతరగతివారికీ ఇండ్లు కట్టించాలని వారు కోరారు. 1948 లో గవర్నరు ఎన్నికకు ప్రజల ఈ కోర్కె ఒక ముఖ్యాంశమైంది.

నేను గవర్నరుగా పదవీస్వీకారం చేసినతర్వాత 13,000 ఇండ్లు కట్టడానికై స్టేట్‌బాండ్లు జారీచేయడానికి అనుమతించవలసిందిగా శాసనసభను కోరాను. కట్టే ఇండ్లలో సగం ఇండ్లను అద్దెకివ్వాలనీ, మిగతా సగం ఇండ్లను తగుమాత్రపు

ఆదాయంగల కుటుంబాలకు అమ్మాలనీ షరతుపెట్టి శాసనసభ నా ప్రతిపాదనను ఆమోదించింది.

ఈ కార్యక్రమానికి డబ్బు పెట్టుబడికోసం రాష్ట్రప్రభుత్వం ఒక సంవత్సరపు నోట్లు జారీచేయడం, ప్రతిసంవత్సరం వాటిని తిరుగవ్రాయడం ముఖ్యాంశాలు. ఈ నోట్లపై వడ్డీరేటు ప్రస్తుతం 1 శాతంకన్న తక్కువే. 50 ఏండ్ల అప్పులపై వడ్డీరేటు 2.6 శాతం. ఈవిధమైన తక్కువవడ్డీగల స్వల్పకాలిక పెట్టుబడివల్ల ఇండ్ల అద్దె సగటున 43 డాలర్లు నిర్ణయించే వీలుకలిగింది. అంటే తక్కువ అద్దె కదా! ప్రతిసంవత్సరం అప్పటి వడ్డీరేటునుబట్టి సగటు అద్దె కొంచెం ఇంచుమించుగా నిర్ణయింపబడుతూ వుంటుంది. రాష్ట్రప్రభుత్వానికి నష్టమేమీ వుండదు.

అయితే అమ్మకానికి కట్టిన ఇండ్లపై కొంత నష్టం వుంటుంది. వడ్డీరేటు పెరిగినట్లయితే తరుగు సంభవిస్తుంది. ఆ తరుగును రాష్ట్రప్రభుత్వం భరించాలి. అమెరికా గృహవసతి మరీ దారుణస్థితిలో వుండడంచేత ఈ నష్టాన్ని భరించవలసిందేనని నిర్ణయింపబడింది.*

ఈ కార్యక్రమాన్ని జనరల్ అసెంబ్లీ ఎదుట పెట్టేముందు దీన్నిగూర్చి రాష్ట్రంలోని వాస్తుశాస్త్రజ్ఞులతో, కంట్రాక్టర్లతో, నిర్మాణసామగ్రి పంపిణీదార్లతో, కార్మికనాయకులతో చర్చలు జరిపాను. తక్కువ ఖర్చుతో నాణ్యమైన ఇండ్లు నిర్మించేవిషయంలో ప్రభుత్వంతో సహకరిస్తామని వారంతా నాకు మాటఇచ్చారు.

ముఖ్యంగా కార్మికనాయకులు పనిలో ఏమాత్రం ఆటంకం కానివ్వమని వాగ్దానం చేశారు. వారి వాగ్దానాన్ని వారు నిలబెట్టుకోవడం నాకెంతో సంతోషం కలిగించింది.

కనెక్టికట్‌లో గృహనిర్మాణ ప్రయత్నాలద్వారా రాష్ట్ర-స్థానిక ప్రభుత్వాల మధ్య, ప్రభుత్వానికీ ప్రైవేటు వర్గాలకూ మధ్య చక్కని బాధ్యతల పంపిణీ జరిగింది. ప్రభుత్వ పెట్టుబడితో మంచి పథకాలప్రకారం గృహనిర్మాణం జరిగిందంటే అందువల్ల ప్రైవేటు వర్గాలకు మంచి ప్రోత్సాహం లభించి, గృహోపయోగసామగ్రి, ఫర్నిచర్ సప్లయిచేసేవారికి బాగా పనివుంటుందని నచ్చచెప్ప గలిగాము.

---

* నిజంగా వడ్డీరేట్లు పెరిగాయి. తరుగు సంభవించింది. అయినా గృహవసతి సమస్యను సడలజేయడానికి ఈమాత్రం మూల్యం చెల్లించవలసిందేనని అంతా అంగీకరించారు.

# 9

# రాష్ట్రప్రభుత్వ వైద్యసహాయ కార్యక్రమం

ప్రజలకు వైద్యసహాయం చేయడానికి రాష్ట్రప్రభుత్వం ఒక ఇన్సూరెన్సు కార్యక్రమానికి పథకంవేసి దానిని ఎలా అందుకోవచ్చో గవర్నరు శ్రీ బౌల్స్ 1960 ఆగస్టు 28 తేదీన రేడియో ప్రసంగంలో విశదీకరించారు.

అమెరికనులు ఆయేటికాయేటికి ఆరోగ్యవంతులవుతున్నారు. 1900 సంవత్సరం నుంచి కొత్తగా పుట్టిన శిశువుకు అమెరికన్లు అనుభవించే ఆయుఃపరిమాణానికి మరి ఇరవై సంవత్సరాల అదనపు ఆయుర్దాయం చేకూర్చారు. క్షయ, న్యూమోనియా, డిఫ్తీరియావంటి జబ్బులు పూర్వం రోగులను మృత్యువువాతపడవేసేవి. ఆజబ్బులపై కొత్త మందులతో దెబ్బతీశారు.

ఇప్పుడు కేన్సర్, శిశుపక్షవాతం, గుండెజబ్బు, ఇతర రుగ్మతల నివారణ విషయంలో చాలా ప్రగతి సాధించారు.

కనెక్టికట్‌లో అమెరికన్ల ఆరోగ్యప్రమాణం చాలాబాగుంది. మంచి డాక్టర్లు వున్నారు. మంచి ఆసుపత్రులున్నవి. అమెరికాలో ఇతరప్రాంతాలకన్న ఆ ప్రాంత ప్రజలు ఆరోగ్యంతో హెచ్చుకాలం జీవిస్తున్నారు.

అయినా వైద్యసహాయం విషయంలో మూడు అంశాలను పరిశీలించాలి:

మొదటిది—పెద్ద తరహాజబ్బు అంటురించకమునుపే దాన్ని కనిపెట్టేందుకు ఏమిచేయాలి?

రెండవది - కనెక్టికట్‌లో డాక్టర్లకు అధికశిక్షణ ఏర్పాటు చేయడమెట్లా?

మూడవది - దీర్ఘకాలం బాధించే వ్యాధులవల్ల కొన్ని కుటుంబాలు శాశ్వతంగా ఋణగ్రస్తమయ్యాయి. అప్పులను ఎలా ఎదుర్కోవాలి?

మొదటిప్రశ్న: అపాయకరమైన జబ్బును ముందే కనుగొనాలి. ఆరంభదశలో గనుక అట్టి జబ్బును కనిపెడితే వేలకొలది రోగుల ప్రాణాలను కాపాడవచ్చునని డాక్టర్లు చెబుతున్నారు. అందుకే ఏడాదికొకమారు డాక్టరు దగ్గరకెళ్ళి పరీక్షచేయించుకోవడం ఎందుకైనా మంచిదని అంటారు.

కాని బద్ధకంవల్లనో, అలక్ష్యంవల్లనో ఈ సలహాను అమెరికన్లు పాటించరు. అసలు తీరికే వుండదు. డాక్టరు పరీక్షకు ఫీజుచెల్లించలేక చాలామంది వూరుకుంటారు.

ఇదిగో ఈ పరిష్కారార్థం సమస్త రాష్ట్రమంతటా ఇరవై, లేక ముప్ఫయి రోగనిదానశాలలు పెట్టాలని నేను సూచించాను. ఈ శాలలను డాక్టర్లే నడపాలి. ఈ శాలలను అవసరమైనచోట్లకు మార్చేవీలుండాలి. వీటిద్వారా కనెక్టికట్ పౌరులకు తక్కువ ఖర్చుతో యేటా, లేదా అప్పుడప్పుడు ఆరోగ్యపరీక్ష సదుపాయం కల్పించవచ్చు.

అందుకయ్యే ఖర్చును రాష్ట్రవ్యాప్త ఇన్స్యూరెన్సు పథకంద్వారా భరించవచ్చు. తక్కువ ఆదాయపు కుటుంబాలకు భారంగాకుండా రాష్ట్రప్రభుత్వం నేరుగా ధనసహాయం చేయవచ్చు.

ఇట్టి పథకంద్వారా ఆరోగ్యపరీక్షకు వీలుకల్పిస్తే కనెక్టికట్‌లో ఏటా కొన్నివేల ప్రాణాలను కాపాడవచ్చునని ఎందరో డాక్టర్లు నాతో అన్నారు. భారీయెత్తున పనిచేయగలదని జనసామాన్యానికి క్షయవ్యాధినిమిత్తం ఎక్సురే పరీక్షలు జరపడానికి అమెరికన్లుచేసిన ఏర్పాటువల్ల తెలియవస్తున్నది.

రెండవది-ప్రస్తుతమున్నట్టి అమెరికన్ ఆరోగ్యాధారాలను విస్తృతంచేసి ఆధునిక వైద్యశాస్త్రం సమకూర్పగల ప్రామాణిక ఆరోగ్యసేవలను ప్రజలకు లభింపజేయడం. ముందుముందు మరికొన్ని ఆసుపత్రులు నిర్మించాలి, వాటికి యంత్రసామగ్రి కూర్చాలి. డాక్టర్లకు, నర్సులకు, ఆరోగ్యప్రవీణులకు హెచ్చుగా శిక్షణ ఇవ్వాలి.

అమెరికా వైద్యవిద్యాసంస్థల సదుపాయాలను హెచ్చించాలని నా అభి

మతం. యేల్ విశ్వవిద్యాలయ వైద్యవిద్యాసంస్థ అమెరికాలోనే ఉత్తమమైనదని అంటారు. కాని దానినుంచి ఏడాదికి 65 మంది యువతీయువకులు మాత్రమే వైద్య పట్టభద్రులు కాగలుగుతున్నారు. ఎక్కువమందికి అందులో చోటులేదు. అంటే పాతికేండ్ల క్రితం ఎంతమంది పట్టభద్రులయ్యేవారో ఇప్పుడూ అంతేనన్నమాట. రాశిరీత్యా అభివృద్ధి ఏమీ లేదు.

చాలామంది యువతీయువకులకు ఇప్పుడు వైద్యపట్టభద్రులయ్యే అవకాశం లేకుండావుంది. హార్ట్‌ఫర్డ్ ఆసుపత్రి పద్ధతిప్రకారం మాత్ర కనెక్టికట్ విశ్వవిద్యాలయ వైద్యవిద్యాసంస్థ ప్రతియేటా ఎందరో వైద్యపట్టభద్రులను తయారు చేయవచ్చు.

ఇక మూడవది చాలా ముఖ్యసమస్య: దీర్ఘవ్యాధులవల్ల చాలా కుటుంబాలు పేదపడిపోతున్నవి. కారణం చికిత్సకు అయ్యేఖర్చు విపరీతంగా వుండటమే.

ఇంత ఖర్చుకావడానికి తగుకారణాలున్నవి. ఆధునిక ఆసుపత్రులను నిర్మించి వాటికి యంత్రసామగ్రి, డాక్టర్లను సమకూర్చాలంటే అదిపెద్దయుంతో కూడినపని. ఒకడాక్టరు శిక్షణకు 7 లేక 8 ఏండ్లు పట్టుతుంది. అవసరమైన కొత్త మందులను తయారుచేసి పంపిణీచేయాలంటే బోలెడు డబ్బుకావాలి.

ఈ విపరీతపుఖర్చులవల్ల అమెరికావారులు బాగా దెబ్బతింటున్నారు. కొందరు నాకు వ్రాసిన ఉత్తరాలు చదివితే గుండెలవిసిపోతాయి.

ఒక కుటుంబంసంగతి ఉదాహరణగా చెబుతాను. ఆ కుటుంబంలో తండ్రి వయస్సు 47 ఏండ్లు. వారానికి 65 డాలర్లు సంపాదిస్తాడు. కనెక్టికట్ కుటుంబాల సగటు ఆదాయ మది. భార్యాభర్త లిద్దరూ కష్టించి పొదుపుచేసి కొన్నేండ్లకు 3,100 డాలర్లు మిగల్చగలిగారు. ఈ డబ్బుతో తెలివిగలవాడైన తమ కుమారుడికీ, కూతురికీ కాలేజీచదువు చెప్పించవచ్చునని అనుకున్నారు.

కాని వారి కుటుంబంతో నివసిస్తూవున్న తాతగారు (తల్లిగారి తండ్రి) మూడేండ్లక్రితం హృద్రోగానికి లోనయ్యాడు. అది దీర్ఘకాల వ్యాధి. మందులకూ, ఆసుపత్రి ఖర్చులకూ 4,000 డాలర్లు కావలసి వచ్చింది. వారు మిగుల్చుకొన్న 3,100 డాలర్లు కర్పూరంవలె హరించుకుపోయాయి. పిల్లలిద్దరికీ కాలేజీ చదువు గగనకుసుమమై పోయింది.

ఇటువంటివి ఎన్నోసందర్భాలున్నాయి.

ఈ సమస్యను కొంత మెరుగుపరచడానికి బ్లూక్రాస్‌వంటి స్వచ్ఛంద ఇన్సూరెన్సు కార్యక్రమాలు తోడ్పడుతున్నాయి. కాని పౌరులందరికీ వాటివల్ల సరిపోతుందా?

అందుచే స్వచ్ఛందకార్యక్రమాలకు తోడుగా ప్రత్యేకంగా కనెక్టికట్ ఇన్సూరెన్సు కార్యక్రమమొకటి వుండాలని నేను అంటున్నాను.

ఈ కార్యక్రమానికి డబ్బుకోసం అమెరికాలో ప్రతిఒక్కరూ సాలుసరి పన్నులరూపంలో కొంతమొత్తం చెల్లించాలి. అది అంతా కలిపి ఒక నిధి అవుతుంది. ఈ నిధిని మామూలు జబ్బుల ఖర్చుకోసం వినియోగించడం జరగదు. దీనిని పెద్దవ్యయం అవసరమయ్యే దీర్ఘకాలవ్యాధులకే ఖర్చుపెట్టడం జరుగుతుంది. మామూలు ఇంటిఖర్చుతోపాటు పెద్ద జబ్బుల చికిత్సకు డబ్బుపెట్టలేనివారికి ఇందు మూలంగా సహాయం లభిస్తుంది.

ఈ కార్యక్రమం ఎలా పనిచేస్తుందో వివరిస్తాను: ఒక్కొక్క కుటుంబానికి వారి ఆదాయాన్నిబట్టి ఒక పరిమితి నిర్ణయింపబడుతుంది. ఆ పరిమితికి దిగువన వైద్యం ఖర్చులన్నీ మామూలుప్రకారం నేరుగా చెల్లింపబడతాయి. ఆ పరిమితికి మించితే కేంద్రఇన్సూరెన్సు నిధినుండి ఆ కుటుంబానికి సహాయంలభిస్తుంది.

ఒక జబ్బుకు కుటుంబ సంవత్సరాదాయానికి 10 శాతంకంటె తక్కువ ఖర్చుఅయితే దానిని రోగికాని, లేదా ఆ రోగి కుటుంబంగాని స్వయంగా చెల్లిస్తారు. ఖర్చు 10 శాతానికి మించితే ఇన్సూరెన్సు నిధినుండి చెల్లించడం జరుగుతుంది.

నేను ఇంతకుముందే ఒక కుటుంబంసంగతి చెప్పాను కదా. వారికి ఈ కార్యక్రమం ఎలా సహాయపడుతుందో వివరిస్తాను: తండ్రి ఆదాయం వారానికి 65 డాలర్లు కదా. అంటే ఏడాదికి 3,380 డాలర్లు. అందులో 10 శాతం—అనగా 338 డాలర్లవరకు ఖర్చులయ్యే మామూలు జబ్బుకు ఆ కుటుంబంవారే బిల్లు చెల్లించుకుంటారు. ఆదాయంనుంచో, మిగిల్చిన డబ్బునుంచో, లేక కుటుంబానికిగల ఇతర ఆధారాలనుంచో వారే చెల్లించుకోవాలి.

కాని తాతగారి దీర్ఘవ్యాధికి 4,000 డాలర్లకు పైగా ఖర్చుఅయింది కదా. ఇటువంటప్పుడు ఆ కుటుంబం ఇన్సూరెన్సు నిధినుండి సహాయం లభిస్తుంది.

అంటే మొత్తం ఖర్చు 4,000 డాలర్లకూ, ఆ కుటుంబ ఆదాయానికి 10 శాతమైన 338 డాలర్లకూ మధ్యగల తేడాను ఇన్సూరెన్సు నిధివారే నేరుగా చెల్లి

స్తారు. అనగా ఈ కుటుంబం విషయంలో 3,662 డాలర్లను నిధివారు చెల్లిస్తారన్నమాట.

రాష్ట్రవ్యాప్తమైన ఈ కార్యక్రమంనుండి ఒక్కొక్కరి ఆదాయాలనుబట్టి సహాయం లభిస్తూవుంటుంది. ఉదాహరణకు 25,000 డాలర్ల సంవత్సరాదాయంగల కుటుంబంలో ఒక వ్యక్తి ఒక యేడాదిలో వచ్చిన జబ్బుకు, లేదా జబ్బులకు మొదటి 10 శాతం—అనగా 2,500 డాలర్లు చెల్లించాలి.

నా ఈ ప్రతిపాదనలో కొన్నిలోపాలు, వ్యత్యాసాలు వుంటే వుండవచ్చు. చర్చలు జరిపి, ఈ రంగంలో అనుభవం గడించిన స్వచ్ఛంద ఆరోగ్యభీమా సంస్థల సలహా తీసుకొని దీన్ని నిర్దుష్టం చేయవచ్చు.

ఏమైనా ఏవో చిక్కులున్నాయని చెప్పి ఆ చిక్కులు కార్యానికి ప్రతిబంధకాలు అయ్యేట్టు అవకాశమివ్వకూడదు. వైద్యపుఖర్చులు పెరిగేకొద్దీ పరిస్థితి విషమిస్తూ పోతుంది. విపత్కరవ్యాధులు వచ్చినప్పుడు తక్కువ ఆదాయపు వర్గాలవారిపై పడే భారాన్ని తగ్గించే వీలుగా ఆచరణసాధ్యమైన ఒక పథకాన్ని సిద్ధపరచాలి.

ఇట్టి పథకంవల్ల వైద్యం, మందులు ప్రభుత్వం అనుగ్రహించి ఇస్తాయని గాని, వైద్యసహాయం సంఘపరమై పోతుందనిగాని అనుకోకూడదు. ఈ కార్యక్రమం ఒక ధర్మకర్తల సంఘంచే అమలుజరుపబడాలి. ఆ సంఘంలో డాక్టర్లకు, ఆసుపత్రుల సూపర్నెంట్లు మున్నగు వృత్తులవారికి హెచ్చు ప్రాతినిధ్యం వుండాలి.

మీ ఇష్టంవచ్చిన డాక్టర్లను మీరు ఎంచుకోవచ్చు. డాక్టర్లు కూడా రోగులను ఎంపిక చేసుకోవచ్చు. డాక్టర్లకూ, రోగులకూ వుండే సంబంధాలు ఎక్కడికీ పోవు. దేన్నీ నేను భంగపరచను. నా ప్రతిపాదనవల్ల వైద్యప్రమాణాలు వృద్ధిఅవుతాయి. ఇది కనెక్టికట్ కార్యక్రమం. దీనికీ, వాషింగ్టన్‌లోని ఫెడరల్ ప్రభుత్వానికీ ఎట్టి సంబంధమూ వుండదు. ప్రైవేటు ఆరోగ్యవసరులను—అంటే డాక్టర్లను, నర్సులను, ఆసుపత్రులను, ఔషధవిక్రేతలను కలుపుకొని ఈ కార్యక్రమం అమలుజరుపబడుతుంది.

దీనివల్ల వ్యయభారంతో క్రుంగిపోతూవున్న కనెక్టికట్ కుటుంబాలకూ, సేవచేసినా డబ్బు రాబట్టలేకుండావున్న డాక్టర్లకు, నర్సులకు, ఆసుపత్రి సూపర్నెంట్లకు, ఔషధవిక్రేతలకూ ఎంతో మేలుకలుగుతుంది.

నేను పైన పేర్కొన్న మూడు సమస్యలు చాలాకాలం నన్ను మాన

పికంగా బాధించాయి. ఇతరులు మరే ప్రతిపాదనలైనా చేయవచ్చు. ఏమైనా అవసరాన్నిబట్టి ప్రయోజనకరమైన, ఆదరణసాధ్యమైన, తక్కువఖర్చు అయ్యే పథకాన్ని రూపొందించుకోవాలి.

ఈ విషయంలో కనెక్టికట్ వాసులు ఇతరులకు ఆదర్శప్రాయులు కావాలి. అమెరికన్లకు సంపద వుంది. వారి ఆరోగ్యసేవలు మంచివి. ఫెడరల్ ప్రభుత్వంమీదకు వెళ్ళి చెయ్యి చాపనక్కరలేకుండా అమెరికా సమస్యలకు రాష్ట్రవ్యాప్త పరిష్కారం వెదకాలి.

అమెరికా ఫెడరల్ ప్రభుత్వవిధానం 48 "రాష్ట్రప్రభుత్వ ప్రయోగశాలలకు" అవకాశమిచ్చింది. సంఘ అవసరాలను తీర్చడానికి వాటిలో ప్రయోగాలు జరిపి ఉత్తమ పద్ధతు లేవో తెల్సుకోవచ్చు.

ఇది అమెరికన్ సంప్రదాయం. ఈ సంప్రదాయాన్ని అనుసరించి పశ్చిమ రాష్ట్రాలు పనిగంటలు-వేతనాల శాసనాన్ని అమెరికన్లకిచ్చాయి. కనెక్టికట్ రాష్ట్రం వ్యవసాయవిస్తరణనూ, పరిశోధనా కార్యక్రమాన్నీ ఇచ్చింది.

కనుక ఇప్పుడు రాష్ట్రవ్యాప్త ఆరోగ్యకార్యక్రమాన్ని చేపట్టి కనెక్టికట్ రాష్ట్రం ఇతరులకు మార్గదర్శకం కావాలని నేను అభిలషిస్తున్నాను. దీనివల్ల వైద్యులు, నర్సులు, ఆసుపత్రులు, వైద్యశాలల సంఖ్య హెచ్చి ప్రజల అవసరాలు తీరుతాయి.

అయితే ఇట్టికృషిలో డాక్టర్లు, రోగుల స్వేచ్ఛకు భంగం కలుగనివ్వరాదు. వారి విషయంలో ప్రభుత్వజోక్యం పనికిరాదు. అమెరికా ఉన్నతవైద్య ప్రమాణాలను పరిరక్షించాలి.

ప్రభుత్వ సహకారకృషిపట్ల అమెరికన్లకుగల సాంప్రదాయిక సందేహాలతో, భయాలతో ఏమీచేయకుండా చేతులు ముడుచుకు కూర్చోవడం మంచిదికాదు. ఆస్థితి రాకుండా నివారించాలి.

రోగనిరోధానికీ, చికిత్సకూ అమెరికా వైద్యసదుపాయాలను విస్తృతం చేయాలి. ప్రతి కనెక్టికట్ కుటుంబానికీ మంచి వైద్యసహాయాన్ని అందుబాటులోకి తీసుకురావాలి.

ప్రైవేటు వైద్యులు, ప్రభుత్వము, ఇతరవర్గాలూ కలిసికట్టుగా పనిచేసి ఆదరణీయమైన, ఆర్థికంగా సాధ్యమైన, అమెరికన్ సంప్రదాయానికి అనుగుణమైన కార్యక్రమాలు అమలుజరిపి లక్ష్యాన్ని సాధించాలి.

ఇప్పుడు వాషింగ్టన్‌లో చర్చింపబడుతూవున్న జాతీయ ఆరోగ్యకార్యక్రమాన్ని వైద్యులు వ్యతిరేకించడానికి ముఖ్యకారణం దాని రూపొందించడంలో వైద్యులకు తగుపాత్ర లేకపోవడమే.

అందుకే నా ప్రతిపాదనను గూర్చి డాక్టర్ల, నర్సుల, వైద్యవిద్యానిర్వాహకుల, వృత్తిసంస్థలా అభిప్రాయాలను తెలుసుకొన కుతూహలపడుతున్నాను.

ఈ సమస్యను నేను ఇదివరకే కనెక్టికట్ రాష్ట్రడాక్టర్లతో, నర్సులతో, వైద్యప్రవీణులతో చర్చించాను. ఆ తర్వాతనే ఆరోగ్యసాధనాలను గూర్చిన గవర్నరు ప్రత్యేక సంఘాన్ని నియమించాను.

ఆ సంఘానికి సిబ్బందికిగాను, పరిశోధనకుగాను నా సాదరుఖర్చులనిధినుండి తగుమొత్తం డబ్బు కేటాయించాను. కొద్దివారాలలో సంఘంవారి నివేదికలు, సిఫారసులు అందగలవని తెలిపింది. *

* గవర్నరు బౌల్స్ 1951 జనవరిలో పదవివిరమణచేయగానే, ప్రజలు ఎన్నో ఆశలుపెట్టుకొన్న ఈకార్యక్రమం మూలపడింది.

# 10

## ఆధునిక రాష్ట్ర ప్రభుత్వం

ప్రాచీన అప్రయోజకమైన రాష్ట్ర ప్రభుత్వ కార్యవిధానాలను పరిశీలించడానికై గవర్నర్ శ్రీ బౌల్స్ "లిటిల్ హూవర్ కమీషన్"ను ఏర్పాటుచేశారు. ఆ కమీషన్‌వారి సిఫారసులను ఆమోదించడానికి కనెక్టికట్ శాసనసభ ఆటంకపరుస్తూవుండగా, వాటిని ఆమోదించవలసిందని గవర్నర్ శ్రీ బౌల్స్ 1950 ఏప్రిలులో జరిగిన ప్రత్యేక సమావేశంలో విజ్ఞప్తిచేశారు. ప్రజాప్రతినిధుల సభలో గ్రామీణ పట్టణముల మెజారిటీ వుండటంచేత సిఫారసులు చాలావరకు ఆమోదింపబడక తిరస్కరింపబడ్డవి. కాని మరి పదేండ్ల తర్వాత ఆ సిఫారసులన్నీ అబ్రహాం రిబికోఫ్ గవర్నరుగా వున్నప్పుడు ఆమోదింపబడ్డవి. అప్పుడు రాష్ట్ర శాసన సభలో డెమోక్రటిక్ పక్షంవారి మెజారిటీ వుంది. మూరేండ్లకాలంలో అది మొట్టమొదటి డెమోక్రటిక్ రాష్ట్ర శాసనసభ.

170 ఏండ్లవరకు అమెరికన్ ఫెడరల్, రాష్ట్ర ప్రభుత్వాలలో అదుపాజ్ఞలు, సమతూకాల విధానం అమలులో వుండడంచేత అమెరికా ప్రజాస్వామ్యం చక్కగా నిర్మాణమవుతూ వచ్చింది. ఎన్నో విపత్తులు సంభవించాయి. వాటిల్లో ఏ ఒక్కటైనా బలహీన ప్రభుత్వవ్యవస్థను నాశనం గావించేదే. అయినప్పటికీ అదుపాజ్ఞల విధానం తన బలాన్ని రుజువుచేసుకుంది.

గతంలోవలెనే ఇకముందుకూడా పరీక్షకు నిలబడ్డ ఈ సూత్రం అమెరికన్లకు ప్రయోజనకారి కావాలంటే శాసననిర్మాణ, కార్యనిర్వాహక, న్యాయస్థాన విభాగాలను ఎప్పటికప్పుడు పటిష్ఠం చేస్తూ వుండాలి. ప్రతి విభాగం ప్రజలకు సన్ని

హితంగా వుండేట్టూ, ప్రతిదీ ప్రజల ఆశయాలనూ, అవసరాలనూ తీర్చేదిగా వుండేట్టూ చూడాలి. ప్రతివిభాగం అమెరికా ఆధునిక సమాజంలోని స్పర్థలను, సమస్యలను ప్రజాస్వామికపద్ధతిలో త్వరగా పరిష్కరించగలుగుటకై దానికి అవసరమైన యంత్రాంగాన్ని ఏర్పాటుచేయాలి.

అమెరికన్ ఫెడరల్ ప్రభుత్వయంత్రాంగాన్ని చక్కగా పనిచేసే స్థితిలో వుంచేందుకై ఎంతో కృషి జరిగింది. అమెరికన్ ఫెడరల్ కాంగ్రెసు సభ, న్యాయ స్థానాల కార్యవిధానాలు బాగుపరచబడ్డవి. ఫెడరల్ ప్రభుత్వ కార్యనిర్వాహక విభాగం అనేకసందర్భాలలో పునర్వ్యవస్థీకరించబడింది. ఈవిధంగా అమెరికన్ ఫెడరల్ ప్రభుత్వం పనిచేసే పైనమును తరచు పునఃపరిశీలనచేస్తూ రావడంవల్ల దాని విభాగాల మధ్య అధికారమును సమతూకంలో వుంచే వీలుకలిగింది.

అయితే అమెరికన్ రాజ్యాంగాన్ని రూపొందించిన పెద్దలు అమెరికా ప్రభుత్వ విధానంలో మరొక ప్రాథమిక సమతూకాన్ని కూడా ఏర్పాటుచేశారు. అంటే..... కేంద్రప్రభుత్వానికీ రాష్ట్రాలకూ మధ్య అధికారములను, బాధ్యతలను విభజించారు. అయితే ఇచ్చట అవసరమైన సమతూకాన్ని నిలబెట్టడంలో అమెరికన్లు సఫలులు కాలేదు.

నానాటికీ పెరుగుతూవున్న అమెరికా సమాజ అవసరాలకు అనుగుణంగా అమెరికా రాష్ట్రప్రభుత్వాల యంత్రాంగాన్ని సరిదిద్దడంలో అమెరికన్లు వెనుక పడ్డారు.

ఫలితంగా కేంద్రప్రభుత్వం అనేకసందర్భాలలో ప్రజల ఒత్తిడివల్ల కొన్ని సమస్యలను చేపట్టవలసి వచ్చింది. నిజానికి ఆ సమస్యలను రాష్ట్రప్రభుత్వాలు చక్కగా పరిష్కరించగలిగేవి. రాష్ట్రప్రభుత్వ పద్ధతులను సవరిస్తూ వచ్చివుంటే వాషింగ్టన్‌లో అధికార కేంద్రీకరణ ఇంతగా జరిగి వుండేదికాదు.

అమెరికన్ల కనెక్టికట్ రాష్ట్రపరిస్థితిని పరీక్షిద్దాము. ఈ రాష్ట్ర రాజ్యాంగము, దీని ప్రభుత్వ యంత్రాంగమూ 130 యేండ్ల క్రిందట—అనగా 1818 లో రూపొందింపబడినవి. ఆ కాలం వేరు. అమెరికన్ గ్రామాలు, పట్టణాలు, వ్యవసాయ క్షేత్రాలు అప్పటికి పారిశ్రామికం కాలేదు. అప్పుడు రైలుమార్గాలు లేవు. విమానాలు లేవు. రేడియోలు, కార్లు, భారీయంత్రాగారాలు లేవు. పట్టణాలు ఇప్పటివలె జన సమ్మర్దమై లేవు. పెద్దపెట్టున నిరుద్యోగస్థితి లేదు. అణ్వస్త్రయుద్ధాలు లేవు.

కనెక్టికట్ రాష్ట్రప్రభుత్వం కడు సాధారణంగా వుండేది. మొత్తం నాలుగే

శాఖలు. యాభై యేండ్లక్రితం ప్రస్తుతం అమెరికన్లకున్న 202 శాఖలలో 80 శాతం శాఖలు ఉండేవికావు. 1930 వరకూ గవర్నరుపదవి, అనేక రాష్ట్ర ప్రభుత్వశాఖల అధిపతుల పదవులు పార్టీసేవకు బహుమతులుగా పంచబడేవి. అమెరికా యంత్రయుగపు అవసరాలు, పట్టణాలు పూర్వపు గ్రామపుజంటి ఆర్థికవ్యవస్థలో ఎన్నో మార్పులు తెచ్చాయి.

ఈ కాలంలో రాష్ట్రప్రభుత్వ విధినిర్వహణలు చెడురోజులలో మంచిరోజులలో, రిపబ్లికనుల హయాంలో డెమోక్రాట్ల పరిపాలనాకాలంలో పెరుగుతూ వచ్చాయి. ఎంత వ్యయమవుతున్నది, సామర్థ్యం ఎలావుంది అన్న వివేచనను ఎవరూ పట్టించుకోలేదు.

ఇతర రాష్ట్రాలలోవలెనే కనెక్టికట్‌లో కూడా ప్రభుత్వ బాధ్యతలు పెరిగాయి. కనుక పరిపాలనాయంత్రాంగాన్ని ఇక చక్కదిద్దటం చేయాలి. పార్టీసేవ ప్రభుత్వం నష్టం, దురుపయోగం. సంస్కరణలు ఎప్పుడో రావలసింది.

ప్రజాస్వామ్యం విస్తృతత్వం సామర్థ్యం హెచ్చవలసిన అవసరం దృష్ట్యా రాష్ట్రప్రభుత్వాన్ని పునర్వ్యవస్థీకరించవలెనని ఎన్నోమార్లు ప్రతిపాదనలు చేయబడ్డాయి. 1902 లో రిపబ్లికన్ గవర్నర్ జార్జి పి. మెక్లీన్, 1938 లో డెమోక్రాట్ గవర్నర్ విల్బర్‌క్రాస్ రాష్ట్రయంత్రాంగాన్ని ఆధునికం చేయటానికై ధైర్యంతో ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నాలు ఫలప్రదం కాలేదు.

అందుకు కారణాలు ఇవి: చెడుప్రభుత్వంపై ఆధారపడివున్న వ్యక్తుల, సంస్థల సంఖ్యను, వారి శక్తిని అమెరికనులు సరిగా అంచనావేయలేదు. చెడు ప్రభుత్వం పతనమైతే వారి ఆట కట్టినట్లే కదా. కాబట్టి మార్పులనేసరికి వారంతా గోచీబిగించి రంగంలోకి దిగేవారు. మార్పులు ప్రజలకు లాభకరం. కాని ప్రజలు నిద్రపోయ్యేవారు.

1949 జనవరి 5 వ తేదీనాటి నా ప్రారంభోత్సవ సందేశంలో మీరూ, నేనూ, అనగా కార్యనిర్వాహక విభాగము, శాసనవిభాగము కలిసి కనెక్టికట్ ప్రభుత్వాన్ని పూర్తిగా ఆధునికం చేద్దామని నేను ప్రతిపాదించాను. రాష్ట్రప్రజలకు అమెరికన్ల సేవలు ఉపయోగపడేందుకై అవసరమైన మార్పులను ప్రవేశపెట్టి, దుబారా తగ్గించి, కార్యనిర్వాహక వ్యయాన్ని తగ్గిద్దామని సూచించాను.

1949 మార్చి 31 తేదీన ఐదుగురు సభ్యులతో రాష్ట్రవ్యవస్థీకరణ సంఘము

నియమించుటకు అంగీకరించాము. రాష్ట్రప్రభుత్వంలో ప్రతిశాఖను పరిశీలించడం, అమెరికాప్రభుత్వం పనిచేసే పైనాన్ని ఇతర ఉత్తమ రాష్ట్రప్రభుత్వాలతో పోల్చి చూడటం, సమగ్రమైన సిఫారసులు చేయడం ఇవి ఆ సంఘం చేయవలసిన పనులు. సంఘంవారి నివేదిక ఇప్పుడు అమెరికన్ల ముందున్నది.

నివేదిక సారాంశమిది: 132 ఏండ్లనాటి రాజ్యాంగంపై ఆధారపడివున్న అమెరికన్ రాష్ట్రప్రభుత్వ యంత్రాంగం పాతబడి బూజుపట్టిపోయింది. పాలన యంత్రాంగం చిట్టడివిలా పెరిగి శాసనసభగాని, గవర్నరుగాని, న్యాయస్థానాలుగాని, ప్రజలుగాని అదుపుచేయ వీలులేనంత తయారైంది. దుబారా, అసమర్థత, నిస్పృహ హెచ్చాయి.

ప్రభుత్వోద్యోగుల దరిమి, అసమర్థత, ప్రజాసేవాభావంలేమి. అనేక స్వతంత్ర సంస్థల, సంఘసభ్యుల కృషివల్ల అమెరికా రాష్ట్రప్రభుత్వం పూర్తిగా అభివృద్ధి నిరోధకమైన బ్యూరాక్రసీగా తయారయ్యే ప్రమాదం తప్పింది.

పై సంఘంవారి సిఫారసులు మూలకారణాలను స్పృశించాయి. ఫలవంతంగా నిర్వహింపబడుతూవున్న వ్యాపారసంస్థల అనుభవాన్ని, హూవర్ కమీషన్‌వారు ఆమోదించిన సత్పరిపాలనా సూత్రాలనూ, ఇదివరకే తమ శాఖలను పునర్వ్యవస్థీకరించిన ఇతర రాష్ట్రాల అనుభవాన్ని, కనెక్టికట్ సంప్రదాయాలనూ సమస్యలనూ బాగా ఎరిగిన పై సంఘం సభ్యుల ప్రత్యక్ష అనుభవాలనూ దృష్టియందుంచుకొని సిఫారసులు రూపొందింపబడ్డవి.

సిఫారసుల వివరమిది:

మొదటిది—రాష్ట్ర ఆర్థిక నిర్మాణాన్ని పూర్తిగా చక్కబెట్టి ఆదాయవ్యయాలు ఏ స్థితిలో వున్నవో ఎప్పుడుపడితే అప్పుడు తెలుసుకొనే వీలుకలిగించాలి. ఇప్పుడు అమెరికా ఆర్థికవిషయాలు, బడ్జెట్ వ్యవహారాలు అయిదు విభిన్నవ్యవస్థల ఆధీనంలో వున్నవి.

రెండవది—ప్రస్తుత అమెరికాప్రభుత్వపు 202 శాఖలను, కమీషనులను 18 శాఖలుగా కుదించాలి.

మూడవది—అమెరికా కౌంటీవిధానం వ్యర్థమైంది. అది కొన్ని తరాల నుంచి అమెరికా ప్రభుత్వ మనే వాహనానికి ఐదవచక్రంవలె వుంది. దాన్ని తొలగించాలి. పన్ను చెల్లించేవారు ఇదివరకే దీనికి ఎంతో మూల్యం చెల్లించారు.

నాల్గవది—అమెరికా నగరాలకూ, బస్తీలకూ స్వయంపరిపాలనాధికారం వుండటానికై ఒక కార్యక్రమం సిద్ధంచేయాలి. ప్రస్తుతం అమెరికా స్థానిక

నిధులసభ ఎన్నికలో ఈ పాతపద్ధతిని అనుసరించడంవల్ల అమెరికాప్రజలలో మూడింట రెండువంతులమందిపట్ల వివక్షత చూపినట్లవుతున్నది.

ప్రస్తుతం అమెరికాప్రజలలో మూడవ వంతుమంది ప్రతినిధులసభలో మూడింట రెండువంతులమందిని ఎన్నుకొంటున్నారు. కనెక్టికట్‌లోని ఈ పరిస్థితిని పాతబడ్డ అప్రజాస్వామిక ప్రాతినిధ్యానికి ప్రత్యక్ష ఉదాహరణగా అమెరికా అంతటా పేర్కొని నవ్వుకోవడం జరుగుతూవుంది.

దీనికి ప్రత్యామ్నాయంగా ఏవిధానం వుండాలో, దేనిని బహుగుణ సభ్యులూ ఏకగ్రీవంగా ఆమోదించగలరో దాన్ని రూపొందించుటకై సంఘం సభ్యులు చాలా ప్రయత్నించేశారు. కాని వారిలో విభేదాలవల్ల ఏకాభిప్రాయానికి రాలేక ఈ సమస్యను వాయిదావేశారు. అసమానత్వంగల ఇట్టి ప్రాతినిధ్య విధానం కనెక్టికట్‌లో సంపూర్ణ ప్రజాస్వామ్యసిద్ధికి ప్రతిబంధకంగా వుంది. ఈ ప్రతిబంధకాన్ని ఎప్పుడో ఒకప్పుడు తొలగించకతప్పదు.

ఇతర ప్రాంతాలలోవలెనే కనెక్టికట్‌లో కూడా రాజకీయ ఉదాసీనత ప్రబలుతున్నది. ఈ అణుయుగంలో అమెరికా ప్రజలు ప్రభుత్వ విధానం విషయంలో ఆసక్తిచూపుతున్నారు. ప్రభుత్వం యథార్థంగా ప్రజలశ్రేయస్సుకు ప్రతిబింబంగా వుండవలెనని వారు కోరుతున్నారు.

ఇక నావైఖరిని విశదీకరిస్తాను. ఈప్రాతినిధ్యం సమస్య మినహా తక్కిన విషయాలలో నేను సంఘంవారి నివేదికతో ఏకీభవిస్తున్నాను. ఉత్సాహంతో, మనస్ఫూర్తిగా ఆమోదిస్తున్నాను. సంఘంవారి సిఫారసులను శాసనంగా రూపొందించందని కనెక్టికట్ జనరల్ అసెంబ్లీని అర్థిస్తున్నాను.

విభాగము-3

# స్వతంత్రులు, స్వేచ్ఛామనస్కులు

నేడు వ్యక్తి స్వాతంత్ర్యానికై జరిగేపోరాటం నవయుగపు ముఖ్య రాజకీయస్పర్థగా భాసిస్తూవుంది. స్వాతంత్ర్యాన్ని గూర్చి అమెరికా ఏమి ఆలోచిస్తుందో, స్వాతంత్ర్యం విషయంలో అమెరికా ఏమి చేస్తుందో వాటివల్ల ప్రతిదేశ ప్రజలభావాలూ, ప్రభుత్వ విధానాలూ ప్రభావితమవుతున్నవి. స్వాతంత్ర్యమంటే ఏమిటి అన్న విషయంలో ఇప్పుడు అమెరికాలో తికమకలకు స్థానం వుండరాదు. స్వాతంత్ర్యమంటే అర్థమేమిటి? దాన్ని ఎలా సాధించగలం? అన్న ప్రశ్నలను బాగా పరిశీలించి విశాలదృష్టితో ఏకాభిప్రాయానికి రావడం అవసరం.

మే 28, 1950.

# 11

# స్వాతంత్ర్యానికై నిరంతర అన్వేషణ

*గవర్నర్ శ్రీ హాల్స్ వ్రాసిన ఈ వ్యాసం 1960 మే 28 తేదీ 'న్యూయార్క్ టైమ్సు మేగజైన్'లో ప్రచురితమైంది. మానవహక్కులను సృష్టించుకున్న తొలితరంవారి ఆదర్శయోగ్యతాస్థితికి గౌరవం ఇవ్వవలసి సమానంగా ఉంచవలసిన బాధ్యత నేటితరంవారిపై కలదని శ్రీ హాల్స్ చెప్పినారు.*

"స్వాతంత్ర్యమంటే ఏమిటో మంచి నిర్వచనం ఇంతవరకు ప్రపంచానికి లభించలేదు. అమెరికా ప్రజలకు ఇప్పుడు అట్టినిర్వచనం చాలా అవసరం. స్వాతంత్ర్యం వుండాలని అంతా అంటారు. కాని ఆ పదం వాడేటప్పుడు ఎవరి అర్థం వారిదిగా వుంది." అని 1864 లో లింకన్ మహాశయుడు అన్నాడు.

అప్పుడు, ఇప్పటికీ స్వాతంత్ర్యమంటే ఎవరి అర్థం వారిదిగా వుంది. నేటి ముఖ్యరాజకీయస్పర్ధలలో వ్యక్తి స్వాతంత్ర్యంకోసం జరిగేపోరాటం మహత్తరమైనది. స్వాతంత్ర్యాన్ని గూర్చి అమెరికా ఏమి ఆలోచిస్తున్నదో, స్వాతంత్ర్యం విషయంలో అమెరికా ఏమిచేస్తుందో వాటివల్ల ప్రతిదేశ ప్రజల భావాలూ ప్రభుత్వ విధానాలూ ప్రభావితమవుతున్నవి. స్వాతంత్ర్యమంటే ఏమిటి అన్న విషయంలో ఇప్పుడు అమెరికాలో తికమకలకు స్థానముండరాదు. స్వాతంత్ర్యమంటే అర్థమేమిటి? దాన్ని ఎలా సాధించగలం? అన్న ప్రశ్నలను బాగా పరిశీలించి విశాల దృష్టితో ఏకాభిప్రాయానికి రావడం అవసరం.

"స్వాతంత్ర్యము" అనేది బహుముఖప్రయోగము. అనేకవిధములైన స్వాతంత్ర్యాలున్నవి. స్వాతంత్ర్యం అవిభాజ్యం అని అనడం విజ్ఞతగల మాట కాదు. వాస్తవికం కూడా కాదు.

మొదటిది రాజకీయస్వాతంత్ర్యం: ఎన్నికలలో అమెరికా కాంగ్రెసు సభ్యులను, అధ్యక్షుణ్ణి, గవర్నరును, ప్రధానమంత్రులను, పన్నులు వసూలుచేసే వారినీ ఎన్నుకొనేందుకై ఓటువేసే స్వాతంత్ర్యం అమెరికన్లంతా ఎరిగినదే. ప్రభుత్వ విధానాలను ఆమోదించడం, ఆమోదించకపోవడం కూడా రాజకీయ స్వాతంత్ర్యం క్రిందే లెక్క.

ఇక పౌరస్వాతంత్ర్యాలున్నవి. మనస్సులో వున్నమాటను స్వేచ్ఛగా చెప్పే వాక్స్వాతంత్ర్యం: సభలూ సమావేశాలు జరుపుకునే స్వాతంత్ర్యం: ప్రభుత్వోద్యోగాలలో అందరికీ సమానప్రవేశముండడం: దేశంలో ఎక్కడికి వస్తే అక్కడికి స్వేచ్ఛగా వెళ్ళే స్వాతంత్ర్యం: నేరమారోపింపబడితే న్యాయబద్ధంగా విచారణ జరిగే ఏర్పాటు: సరియైన అధికారం లేకుండా అనవసరంగా తనిఖీ, సోదా మొదలైనవి చేయడం, పట్టుకోవడం, జప్తుచేయడం, దేశంనుంచి వెళ్ళగొట్టడం మొదలైనవి జరగకుండా వుండే కట్టుదిట్టాలు.

వ్యక్తిగతస్వాతంత్ర్యాలు కొన్ని వున్నవి. ఎవరి ఇష్టమొచ్చిన మతమును వారు పుచ్చుకొనే స్వాతంత్ర్యం, ఇష్టమైనవారిని పెండ్లాడే స్వాతంత్ర్యం, అమెరికన్ సూత్రాలప్రకారం అమెరికన్ల పిల్లలను పెంచి పెద్దవారిని చేసే స్వాతంత్ర్యం, శాకాహారులో, సన్యాసులో, ఇంకా మరేమో అయ్యే స్వాతంత్ర్యం వగైరాలు.

వ్యక్తి స్వాతంత్ర్యాలు కొన్ని వున్నవి. జాతి, మత, వర్ణ, దేశ, ఆర్థిక స్తోమత అనే విచక్షణలు లేకుండా స్వేచ్ఛగా, మానవగౌరవానికి అనుగుణంగా, సమర్థతనుబట్టి వృద్ధిచెందే స్వాతంత్ర్యం. ఇతర స్వాతంత్ర్యాలకన్న ఇది నవ్యమైనది. అసలు దీని దృక్పథమేమిటో తర్వాత వివరంగా చర్చిస్తాను.

ఇకపోతే ఆర్థిక స్వాతంత్ర్యాలున్నవి. అమెరికన్లకిష్టమైనచోట పనిచేయడం, అమెరికన్ల పనిని, లేక ఉద్యోగాన్ని అమెరికన్లే నిర్ణయించుకోవడం, లేదా వ్యాపారం పెట్టుకోవడం, ఒక కొత్త వస్తువును తయారుచేసే విధానాన్ని కనుగొనడం, దాన్ని మార్కెట్లో విక్రయించడం, రాగిలంధరకు ఒక వస్తువునుఅమ్మడం, ఒక ఉద్యోగాన్ని, లేక పనిని స్వీకరించడం, లేదా దాన్ని వదిలివేసి వెళ్ళిపోవడం, ఆస్తిని సంపాదించడం లేక అమ్మడం. వీటన్నిటికీ అమెరికన్ల స్తోమత, తెలివి, ఇష్టం—ఇవే పరిమితులు. ఇతరులు ఆటంకాలు పెట్టకూడదు.

చాలా నాగరికసమాజాలు ఈ స్వాతంత్ర్యాలలో కొన్నిటిని ప్రజలకిచ్చాయి. అయితే నేటి అమెరికన్ల కాలంవరకు వాటిని ఇస్తున్నట్లు మైతం ఎవరూ నటించ

లేదు. పూర్వపునాగరికతలలో పైవారికి కొన్ని స్వాతంత్ర్యాలను తమకు ఇష్టమైనన్ని వారికి ఇవ్వడం జరిగేది. తక్కిన వర్గాలవారికి అట్టిస్వాతంత్ర్యాలులేవు. ఇచ్చేవారూ లేరు.

ఆధునిక ప్రజాస్వామిక సమాజానికి గీటురాయి ఏమిటంటే — ఈ స్వాతంత్ర్యాలలో ఎన్ని నిజంగా ప్రత్యక్షంగా ఆచరణలో వున్నవి? ఎన్ని స్వాతంత్ర్యాలు ఎంతమంది ప్రజలకు లభ్యమవుతూ వున్నవి? ఈ రెండు ప్రశ్నలకూ సంతృప్తికరమైన సమాధానం లభిస్తే అది ఆధునిక ప్రజాస్వామిక సమాజమనడానికి సందేహం లేదు. మానవచరిత్రలో ఇతర నాగరికతలకన్న, ఇతర దేశాలకన్న అమెరికా ఎక్కువ హక్కులు సంపాదించుకుంది. అంతేగాక ఈనాడు ప్రపంచంలో మరి యే దేశమూ ఇవ్వని హెచ్చుస్వాతంత్ర్యాలను అమెరికాదేశం తన ప్రజలకిస్తున్నది.

తక్కిన స్వాతంత్ర్యాలన్నీ రాజకీయస్వాతంత్ర్యంపై ఆధారపడి వుంటాయి కాబట్టి మొదట దాన్ని పరిశీలిద్దాము.

పౌరులకు రాజకీయస్వాతంత్ర్యమున్న ప్రాథమిక సూత్రంపై అమెరికాదేశం స్థాపితమైంది. ఈ ప్రాథమికస్వాతంత్ర్యాన్ని సిద్ధాంతరీత్యానేగాక వాస్తవంగా ఆచరణలో పెట్టడానికై గడచిన 150 ఏండ్లనుండి అమెరికన్లు కృషిచేస్తున్నారు. అమెరికా సంయుక్తరాష్ట్రాలు అనే రాజ్యం మొదట నెలకొన్నప్పుడు అమెరికా వయోజనపౌరులలో కొద్దిమందికి మాత్రమే ఓటువేసేహక్కు, పదవిలో వుండే హక్కు వుండేవి. నీగ్రోలకు, స్త్రీలకు, కొన్ని రాష్ట్రాలలో ఆస్తిలేనివారికి ప్రభుత్వాన్ని నడపడంలో ప్రమేయంగాని పలుకుబడిగాని వుండేవికావు.

ఈనాడు ఇంకా మిగిలివున్న పోల్‌టాక్సు రాష్ట్రాలలోని కొన్నిలక్షలమంది నీగ్రోలను తప్ప 21 ఏండ్లకు మించిన వయస్సుగల అమెరికా పౌరులందరికీ ఓటు వేసే హక్కువుంది. కొన్నిలక్షలమంది నీగ్రోలకు ఓటుహక్కు లేకపోవడం నాకే గాక అమెరికాలో నావంటి చాలామందికి అసంతృప్తి కలిగించే విషయం.

పౌరస్వాతంత్ర్యం మాటేమిటి? ఇదికూడా ప్రాథమిక స్వత్వమే. అమెరికా స్వాతంత్ర్య ప్రకటనపత్రంలో, అమెరికా రాజ్యాంగంలో, అమెరికా హక్కుల బిల్లులో ఇది వుంది.

చాలాదేశాలతో పోల్చిచూస్తే, ముఖ్యంగా నియంతృత్వరాజ్యాలతో పోల్చిచూస్తే, అమెరికా, పరులుచూచి అసూయ చెందదగ్గ విశేషాలను సాధించింది. అయితే పరిపూర్ణంగా ఇంకా సాధించలేదన్నసంగతి అమెరికన్లకు తెలుసు.

పౌరస్వత్వాలంటే తెల్లజాతివారికి ఏ అర్థంలో వాడుతున్నటో అట్టి పౌరస్వత్వాలు అమెరికన్ దక్షిణరాష్ట్రాలలోని నీగ్రోలకు ఎన్నడూ లభించలేదు. తమ అభిప్రాయాలతో ఏకీభవించని వ్యక్తులకు పౌరస్వత్వాలంటే హుటాహుటి ఒంటికాలిపై లేచి దాడిసల్పేవారు కాంగ్రెసు సభలోను, కాంగ్రెసు వెలుపలా వున్నారు. పిడివాదపు మనుషులు. కమ్యూనిజం విస్తృతలక్షణాలలో ఒక లక్షణాన్ని. అంటే పౌరస్వత్వాల అణచివేతను అమెరికన్లు కూడా అవలంబించి అమెరికా స్వాతంత్ర్యాన్ని దృఢపరచుకోగలరనీ, ప్రపంచ కమ్యూనిజాన్ని పరాస్తం చేయగలరనీ అనుకోవడం ప్రమాదకరమైన తత్వం.

ఇట్టి లోపాలలో సైతం కొంత సంతుష్టిచెందడానికి తగు ఆధారాలున్నాయి. నీగ్రో పౌరులకు ఇతోధిక పౌరస్వత్వాలకొరకై కొంత కృషి జరుగుతున్నదనీ, వెనుకటికంటె పరిస్థితి ఇప్పుడు కొంత మెరుగనీ నిష్పాక్షికమైన పరిశీలకులు తప్పక అంగీకరిస్తారు. యుద్ధం తర్వాత పరిస్థితి బాగుపడింది. ఇది అమెరికన్ల శీలం సంగతి అంటారా, సాంప్రదాయికమైన అమెరికన్ న్యాయదృష్టి, సముచిత నిర్ణయం గైకొనడంవంటివి పునరుజ్జీవితమై యథాస్థానాన్ని పొందుతున్నవి.

పౌరస్వత్వముల విషయంలో అమెరికన్లలో అమెరికన్లకు అభిప్రాయభేదాలు ఏర్పడ్డమాట నిజమే. అయితే ఆర్థికస్వాతంత్ర్యం విషయంలో మరింతగా వాగ్వివాదాలు జరిగాయి. అపోహలు కలుగుతున్నాయి.

అమెరికా తొలిదశలో ఆదర్శప్రాయమైన ఆర్థికస్వాతంత్ర్యాన్ని నెలకొల్పింది. నాగరికతచరిత్రలో అది అద్వితీయమైనది. అప్పుడు అమెరికాది కొత్తజాతి. కొత్తప్రజ. సువిశాలదేశం. అంతవరకూ వాడబడకుండావున్న ప్రకృతిసంపద. కావలసినంత భూమి. చేత పనిముట్టు పట్టుకొని కాయకష్టం చేయబూనుకున్నవానికి అపారమైన ఆర్థికావకాశాలు.

అయితే ఆ ఎర్రరక్తపు యుగంపై అమెరికన్లకుగల భ్రాంతిలో పడి ఒక సత్యాన్ని మరువరాదు. చరిత్రలో అపూర్వమైన పారిశ్రామికవిప్లవం ఆర్థిక స్వాతంత్ర్యం విషయంలో అమెరికన్లకు తొలుతగల అభిప్రాయాలను అగ్నిపరీక్షకు గురిచేసింది. పారిశ్రామిక విప్లవంవల్ల మనిషికి శ్రమతప్పే పరికరాలు, ఉపకరణాలు, యంత్రాలు లభ్యమైనమాట నిజమే. కార్మికుల ఉత్పాదనాశక్తి పెరిగింది. అమెరికా జాతీయసంపద హెచ్చింది. కాని అమెరికాప్రజలు పల్లెలనుంచి పట్టణాలకు ఎగబ్రాకి ఫ్యాక్టరీలలో, మిల్లులలో జీతగాళ్ళు అవడంతో వ్యక్తిగత ఆర్థికస్వాతంత్ర్య

హక్కులు స్వాభావికమైనవి. అంతర్గతమైనవి. పరాధీనంగావించరానివి. విస్మరించరానివి. ప్రతివ్యక్తికి వుండే హక్కులు. అవి ఏమంటే జీవించే హక్కు, స్వేచ్ఛగా వుండే హక్కు, ఆనందం అనుభవించే హక్కు, ఇత్యాదులు."

ప్రపంచంలో గొప్ప మతములు ఉద్బోధించిన సారాంశం కూడా ఇదే. భగవంతుని దృష్టిలో ఎంత తక్కువస్థితిలో వున్నవారలైనా, ఎట్టి హీనకులజులైనా, ఎంతటి నిరుపేదలైనా, మితిమీరిన భారం మోసేవారలైనా విలువ, మన్నన వున్నాయి.

మానవుని మనస్సునుగూర్చి, వ్యక్తిత్వమును గూర్చి అమెరికన్లకుగల విస్తృత పరిజ్ఞానం, వ్యక్తివికాసముపై పరిసరాలప్రభావం, అట్టి సాంఘిక మానసిక శక్తుల ప్రభావం—ఇవికూడా మానవత్వప్రతిష్ఠను ఉద్ఘాటించాయి.

మానవహక్కుల విషయంలో అమెరికన్లు చేసిన బృహత్తర ప్రయత్నమేది అంటే—అమెరికన్ పిల్లలందరికీ విద్యాభ్యాసానికి అవకాశం కల్పించాలనే ఉద్యమం. నూరేళ్ళక్రితం వరకు కూడా అమెరికాదేశంలో కొందరు పెద్దలు ప్రజా బాహుళ్యానికి విద్యగరపడం హేతుబద్ధమైన పనికాదనీ, అనవసరమనీ, ప్రమాదకరమనీ వాదించారు.

కాని రాజకీయ స్వాతంత్ర్యమనే భావన అమెరికాదేశంలో పెక్కు తావుల్లోకాని వుండడంవల్ల ప్రజాబాహుళ్యం అభీష్టాన్ని ప్రభుత్వం మన్నించక తప్పలేదు. అమెరికా అంతటా క్రమేణా ప్రజావిద్య ప్రవేశపెట్టబడింది. ఈనాడు ప్రజావిద్య అనే భావన ఇంకా వ్యాపిస్తున్నది. చివరకు అర్హులైన విద్యార్థులందరికీ కళాశాలా ప్రవేశం సిద్ధించవచ్చు.

అట్లే రోగాలనుండి, జాడ్యాలనుండి అమెరికా ప్రజలకు విమోచనం కలిగించడానికై ఎంతో కృషిజరిగింది. ఇదికూడా మానవహక్కుల పరిరక్షణక్రిందికే వస్తుంది. మానసిక రుగ్మతకు లోనైనవారు, గ్రుడ్డివారు, అంగవైకల్యం పొందినవారు, క్షయరోగులు, తదితరులను శాశ్వతంగా పనికిమాలినవారని అనకూడదనీ, వారికి ముక్తిలేదని భావించరాదనీ నిర్ణయించుకున్నారు.

అమెరికా రాజకీయస్వాతంత్ర్యాన్ని వైద్యపరిశోధన, పునరావాసం, ప్రజారోగ్యం, ఆసుపత్రిసేవలు కల్పించడానికై వినియోగించారు. అవి రోగులందరికీ నగర, రాష్ట్ర, కేంద్రప్రభుత్వాల సంస్థలవల్ల లభ్యమవుతూ వున్నవి. చివరకు

పౌరులందరికీ వారి ఆదాయంతో నిమిత్తం లేకుండా నిరోధక వైద్యసదుపాయం కలిగించేందుకు ఒక మార్గాన్ని కనుగొని ఒక ఒప్పందానికి రాగలరని నా విశ్వాసం.

పారిశ్రామిక సమాజంవల్ల మానవజీవితంవేగం హెచ్చింది. ముసలివారినీ, ముతకవారినీ కనిపెట్టుకొని వుండటం వీలులేకుండా అయింది. కనుక అట్టి వృద్ధులకు కనీసభద్రత, గౌరవం, ఊరట, శమనం కలుగజేసేందుకు ఇతోధిక కృషి జరుగగలదని భావిస్తున్నాను. అట్లే మురికి పేటల నిర్మూలనకై ఒక పెద్ద కార్యక్రమం అములుజరిగితే అమెరికాపౌరులలో చాలామంది వారికుటుంబాలను శుభ్రమైన ఆధునిక గృహంలో పోషించుకొనే అవకాశం కలుగుతుంది.

భౌతికసంపద అందరికీ సమానంగా వుండాలన్నది అమెరికా ఉద్దేశం కాదు. జీవించడానికీ, పనిపాటలు చేసుకోవడానికీ, ఆసక్తినిబట్టి సమర్థతనుబట్టి ముందుకు పోవడానికీ అందరికీ అవకాశాలు వుండవలెనని అమెరికన్లు కోరుతున్నారు. అదే అమెరికన్ల ధ్యేయం. అమెరికన్లకూ, వారి సంతతికీ మంచి విద్య అభ్యసించడానికీ, మంచి ఆరోగ్యసదుపాయాలు పొందడానికీ తగు అవకాశాలుండాలి. ప్రతివారికీ కనీసభద్రతవుండాలి. ఇవిగాక రాజకీయస్వాతంత్ర్యాలు, పౌరస్వాతంత్ర్యాలు అమెరికన్ సంప్రదాయానికీ, ఉదారబుద్ధికీ ప్రాతిపదికలుగా భాసిస్తూ వున్నవి.

కనుక మానవహక్కులను పద్దెనిమిదో శతాబ్దినుంచి ఇరవయ్యోశతాబ్దికి పరివర్తనం చేయవచ్చునని నిరూపించడం ఈతరం అమెరికన్ల కర్తవ్యమై వున్నది.

# 12

# వలసవచ్చే వారిపట్ల నూత్నవిధానం అవలంబించాలి

అమెరికాకు వలసవచ్చే వారిపట్ల అమెరికన్ ప్రభుత్వం అనుసరిస్తున్న విధానం దూరదృష్టితో కూడుకున్నది కాదనీ, విచక్షణా పూరితమైనదనీ, ఈవిధానాన్ని విడనాడి రాగోరేవారు ఏదేశం వారైనా,ఏ జాతివారైనా, అర్హులైతే, సమానహక్కుల ప్రాతిపదికపై వారికి అనుమతి ఇవ్వాలని 1951 నవంబరులో 'సర్వే మేగజైన్'లో ప్రచురితమైన ఈవ్యాసంలో శ్రీ బౌల్స్ విజ్ఞప్తిచేశారు.

విదేశీయులను అమెరికాకు రానిచ్చే విషయంలో అమెరికాకు ఒకకొత్తవిధానం చాలా అవసరం. అమెరికా ప్రస్తుతవిధానం హార్డింగ్, కూలిడ్జిల యుగానికి చెందినది. అప్పుడు అమెరికన్లు తక్కిన ప్రపంచాన్నుంచి, వారి సమస్యలనుంచి దూరంగా వుండాలన్న ధోరణిలో వున్నారు. కనుక ప్రస్తుతవిధానం కాలానుగుణమైనదికాదు. పైగా విచక్షణాపూరితమైంది. అమెరికాదేశం, అమెరికాజాతి ఏ ప్రజాస్వామిక సూత్రాలపై నిర్మితమైనవో ఆ సూత్రాలకే ఈవిధానం విరుద్ధమైనది.

స్వాతంత్ర్య ప్రకటన పత్రముపై చేవ్రాళ్ళుచేసినది మొదలు 1921 సంవత్సరంవరకూ ప్రపంచంలో యేప్రాంతంనుంచి ఎవరు అమెరికాకు వచ్చి స్థిరపడదలచుకున్నా ఉదారంగా రానిచ్చేవాళ్ళు. రానిచ్చారు. ఈవిధానం ఫలితంగా 4 కోట్లమంది స్త్రీ పురుషులు, బాలబాలికలు సముద్రాలుదాటి అమెరికాకు వచ్చి స్వాతంత్ర్యంతో, చక్కని అవకాశాలతో జీవించనారంభించారు.

సంభవించినప్పటికీ 1924 సంవత్సరపు చట్టంప్రకారం నిర్ణయింపబడ్డ కోటాలవల్ల మొదటి ప్రపంచయుద్ధం ఆరంభంకావడానికి ముందటి పద్నాలుగేండ్లలో సగటున ఎంతమందివచ్చారో వారిలో ఆరవవంతును మాత్రమే ఏటా రానిచ్చేందుకు అనుమతించడం జరుగుతున్నది.

అమెరికా ప్రస్తుతవిధానం 1924 లో నిర్ణయమైందిగదా. అయినప్పటికీ కొత్తవారు వలస రావడాన్ని ఇలా బాగా తగ్గించడం తప్పు. నేటి ప్రపంచపరిస్థితి దృష్ట్యా అది మరీ అనభిలషణీయమైనది. ప్రపంచం ఒక పెద్ద పోరాటంలో చిక్కు-కొని వుంది. ఈ పోరాటంలో అమెరికా విజయం అమెరికా ప్రజల శక్తిసామర్థ్యములపైన, దృఢవిశ్వాసాలపైన ఆధారపడివుంటుంది.

గడచిన నూరేండ్లలో విదేశాలనుంచి అన్నిలాటప్రజలు అమెరికాకు వలస రావడంవల్లనే అమెరికన్లు ఆర్థికంగానే కాక, ఆధ్యాత్మికంగా కూడా అమితంగా శక్తివంతులై వున్నారన్న సంగతిని ఎవరు కాదనగలరు?

ప్రస్తుతపు అమెరికా తప్పుడు వలసఅనుమతి విధానం కొందరు ఉన్నత రకమైన ప్రజలు ఉత్తమ అమెరికన్ పౌరులుగా భాసిస్తారని నిర్ణయించింది. ఈ లక్ష్యానికి అనుగుణంగా లవెల్లీలు, పెట్రోవిస్కీలవన్న పిల్లజాతులవారు, ష్వార్ట్జ్‌లు అమెరికనులు కాదగ్గవారని నిర్ణయించారు.

జాతీయతలో కూడా ఇలా ఒక 'తరగతి'ని నిర్ణయించడంవల్ల, కొన్ని కొలది అమెరికనులను ఇలా హీనపౌరులుగా ఎంచడంవల్ల అమెరికాయొక్క ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధంగా నడుచుకున్నట్లయింది. ఇది ప్రజాస్వామ్యవిరుద్ధమే గాక పరిహాసాస్పదం కూడా.

పశ్చిమ యూరపునుంచి, ఉత్తర యూరపునుంచి వలసవచ్చి అమెరికనులుగా స్థిరపడిపోయినవారికన్న దక్షిణ యూరపునుంచి తూర్పుయూరపునుంచి వచ్చి స్థిరపడ్డవారు అమెరికాదేశ నిర్మాణానికి తక్కువ తోడ్పడ్డారని అనడానికి సాక్ష్యాధార మెక్కడ వుంది?

దక్షిణ, తూర్పుయూరపులనుంచి వలసవచ్చిన పోలిష్, ఇటాలియన్, గ్రీకు జాతీయులు హెచ్చుగా న్యూయార్కు, మసాచూసెట్స్, రోడ్ ఐలెండ్, కనెక్టికట్, న్యూజెర్సీ, పెన్సిల్వేనియా, ఓహియో, మిచిగన్ రాష్ట్రాలలో స్థిరపడ్డారు. ఆ రాష్ట్రాలే అమెరికన్ యూనియన్‌లో సంపత్సమృద్ధమైనవి. హెచ్చుగా అభ్యుదయకరమైన శాసనాలను ఆమోదించడంలో కూడా వాటికవే సాటి.

మైన విచక్షణను అమెరికన్లు తొలగించవచ్చు. దేశాలవారీ కోటా విధానాన్ని రద్దు పరచి జాతి, మత, వర్ణ, దేశ వివక్షతల విషయంలో సమాన ప్రాతిపదికను అవలంబించాలి.

కొత్త వలస-అనుమతిచట్టం అమలులోకి వచ్చిన తొలిదశలో చాలాజాతుల కోటాలు త్వరగా భర్తీ అయ్యాయి. దక్షిణ, తూర్పుయూరపురాజ్యాలలో వేచి వుండవలసినవారి జాబితాలు పెరుగుతూ పొయ్యాయి. కాని 1930 ప్రాంతాలలో ఆర్థికమాంద్యం ప్రభావంవల్ల వలసరావడం తగ్గింది. 1940 ప్రాంతాలలో యుద్ధం వల్ల మరీ తగ్గిపోయింది. 1930 నుంచి 1940 వరకు బ్రిటిషువారు వారి కోటాలో 5 శాతం, ఐర్లెండువారు 3 శాతం మాత్రమే ఉపయోగించుకున్నారు. అన్నిదేశాల సగటు 23 శాతం మాత్రమే. భర్తీకాని ఈ కోటాలను పునఃచెలామణీ చేసి జాతీయతతో నిమిత్తం లేకుండా బకాయామేరకు ప్రజలను వలస రానివ్వాలి.

జాతీయతనుబట్టి కోటాలులేని దేశాలనుంచి అమెరికా జనాభాలో 1 శాతంలో పదింట నాలుగువంతుల మేరకు ప్రజలను వలసరానివ్వాలని నేను సూచిస్తున్నాను. కొందరు అమెరికనులు ఇది చాలా జాస్తి అని అంటారేమో. కాని ఇది సబబైనదని విజ్ఞులు అంగీకరించకపోరు.

అట్టి శాసనంప్రకారం ఏ రకం ప్రజలు అమెరికాకు వలస వస్తారు ? వచ్చి స్వయంకృషితో అమెరికాదేశంలో స్థిరపడి అమెరికాదేశానికి విశ్వాసపాత్రులుగా వుంటూ అమెరికా శాసనాలకు కట్టుబడివుంటారా ? కమ్యూనిస్టులు, ఫాసిస్టులు, ఇతర అనభిలషణీయ వ్యక్తులవల్ల వచ్చే ప్రమాదం సంగతేమిటి ?

కొన్నితరాలవరకు యూరపులోని పల్లె, బస్తీ, నగరం అన్న విచక్షణ లేకుండా అన్నిప్రాంతాల ప్రజలు వేలాదిమంది అమెరికాను స్వర్గసీమగా భావించి అక్కడికివెళ్ళి స్థిరపడే అవకాశం తమ జీవితంలో ఎప్పుడు కలుగుతుందా అని ఎదురుతెన్నులు చూస్తూవుండేవారు. ధైర్యంగలవారు తమ కుటుంబాలతో కొన్ని వేల మైళ్ళు సముద్రంపై ప్రయాణంచేసి అమెరికాలో అడుగుపెట్టి తమకు అనుకూలమైన ప్రదేశంలో స్థిరపడ్డారు. వారు సమర్థులు, శక్తివంతులు, సంకల్పబలం గలవారు.

అలావచ్చి ఒకతరమో, రెండుతరాలపాటో, లేదా మూడుతరాలపాటో ఇక్కడ నివసించినవారు అమెరికాదేశ ఆర్థిక, సాంఘిక, రాజకీయ వ్యవస్థలకు అనేకవిధాల పాటుపడ్డారు. అమెరికాదేశానికి చెందిన ప్రాచీన కుటుంబాలవారు వారి ఉజ్జ్వలగతాన్ని స్మరించుకొంటూ ప్రజాస్వామ్యం స్థిరపడిపోయింది, తమకేమీ పరవాలేదు అన్న భరవసాతో వుంటే వున్నారేమో. కాని కొత్తగా ఇతరదేశాల నుంచి ఇక్కడికి వలసవచ్చినవారు అమెరికన్ సమాజానికి నూత్నజీవం పోశారు. నూత్నజవం ఇచ్చారు.

ఆరోగ్యం, నడవడి, సామర్థ్యం మున్నగు గుణాల ప్రాతిపదికలపై ప్రతి సంవత్సరం కొంతమంది విదేశీయులను జాగ్రత్తగా ఎంపికచేసి అమెరికాకు రానిచ్చి స్థిరపడనిస్తే అమెరికాజాతి మరింత సంపన్నమవుతుంది. దేశంలో నైపుణ్యం, ఉత్పాదనలు, సామర్థ్యం పెరుగుతాయి. ఈ కొత్త పౌరులను వారి జాతీయతతో, మతంతో నిమిత్తంలేకుండా రానిచ్చారుకాబట్టి అమెరికాలో వెనుకటివలెనే ఇప్పుడు కూడా ప్రజాస్వామ్యమనేది కేవలం నినాదంమాత్రమే కాదనీ, ప్రజల జీవితవిధానమే అదనీ వారు సర్వప్రపంచానికి చాటుతారు.

ఇక కమ్యూనిస్టులు, ఫాసిస్టులు, ఇతర అవాంఛనీయవ్యక్తుల విషయంలో అమెరికా సంయుక్తరాష్ట్రముల వలస-అనుమతి విధానాన్ని అమలుజరిపే ఉద్యోగులు తమ నేర్పుతో వ్యవహరించి అట్టివారిని పరిహారవేస్తున్నారు. స్థానభ్రష్టులైన వ్యక్తుల చట్టంప్రకారం 1951 జనవరి 1 వ తేదీ వరకు అమెరికాదేశానికి రానిచ్చిన వారిలో ముగ్గురిని మాత్రమే అవాంఛనీయ వ్యక్తులుగా పరిగణించి అమెరికాదేశం నుంచి వెళ్ళగొట్టడం జరిగింది.

మన వలస-అనుమతి శాసనాల నిర్బంధాలను, వివక్షణలను పునఃపరిశీలన చేసి వాటిని తొలగించాలి. అసలు ఈ పని ఎప్పుడో జరగవలసింది.

# 13

## అమెరికాలో ఒక బస్తీవర్ణన:
## కనెక్టికట్ రాష్ట్రంలో ఎస్సెక్స్

1952 లో భారతీయ సంఘసేవా కార్యకర్తల సమావేశంలో శ్రీ బౌల్స్ ప్రసంగిస్తూ అమెరికాలో ఒక చిన్న బస్తీ ఎలా వుండేదీ వర్ణించారు. ఈ ఉపన్యాసం వివిధ భారతీయభాషలలోకి అనువదింపబడి, ముద్రింపబడి అనేకులకు పంచిపెట్టబడింది.

ఒక దేశ ప్రజలు మరొకదేశానికి పోయి అక్కడి ప్రజలు ఎలా జీవిస్తున్నారో, ఏమని ఆలోచిస్తున్నారో, వారి భావాలేమిటో, ఆశయాలేమిటో తెలుసుకుంటే తప్ప లేకపోతే దేశాలు ఒకదానినొకటి అర్థంచేసుకోవడం పడదని నా విశ్వాసం.

నేను భారతదేశంలో వున్నన్నిరోజులలోనూ, గ్రామాలలో బస్తీలలో పట్టణాలలో పర్యటిస్తూ ప్రజల జీవితం ఎలావుందో, వారు ఏమనుకుంటున్నారో, వారి సంతానాన్ని ఎలా పోషించి పెద్దవారిని చేస్తున్నారో స్వయంగా తెలుసుకున్న సందర్భాలు మిక్కిలి స్మరణీయమైనవి. నాకు ఎంతో ప్రయోజనకరమైనవీ.

మీరు నా దేశాన్నిగూర్చి తెలుసుకోవలెనని అభిలషిస్తున్నాను గనుక నా నివాసస్థానమైన ఎస్సెక్స్‌ను గూర్చిన విశేషాలు చెబుతాను. ఈ బస్తీ కనెక్టికట్ రాష్ట్రంలో వుంది.

కనెక్టికట్ చిన్నరాష్ట్రం. ఇది అమెరికాలో ఈశాన్యదిశన వుంది. దీని జనాభా 20 లక్షలు. చాలా ప్రాచీనరాష్ట్రాలలో ఇది ఒకటి. 1635 లో నెలకొన్నది. 1635 అంటే మీ కిది కొత్తరాష్ట్రంగానే కన్పించవచ్చు. కాని మా దేశంలో ఇది చాలా పాతది.

ఇంగ్లండునుంచి వచ్చిన ప్రజలు కనెక్టికట్ రాష్ట్రంలో స్థిరపడి దానివి జనావాసంగా చేశారు. స్వదేశంలో మతపీడనను తప్పించుకొనడానికై వారు అమెరికా చేరుకొని కనెక్టికట్ ప్రాంతంలో ఆవాస మేర్పరచుకున్నారు. వీరిలో ఎక్కువమంది రైతులే. తమ ఇష్టప్రకారం దైవారాధన చేసుకోవడానికీ, నిరంకుశత్వం, నియంతృత్వం మొదలైనవాటినుండి విముక్తులై తమ ఇచ్ఛప్రకారం జీవించడానికీ ఇలా పరదేశానికి వచ్చారు.

కనెక్టికట్‌లో వారు సాగుచేసిన భూమి నాసిరకపుది. రాతినేల. చలికాలం భరించరాని చలి. పంధొమ్మిదవశతాబ్ది మధ్యభాగంలో అద్భుతదేశమైన అమెరికాను గూర్చి విన్నారు. ఏ దిక్కుగానైనా మైలుదూరం దున్నుకుపొయ్యే సారవంతమైన భూమి లభిస్తుందని తెలిపింది. మంచి శీతోష్ణస్థితి అని తెలిపింది. వూళ్ళకు వూళ్ళు ఖాళీచేసి పాశ్చాత్యసీమకు ప్రయాణం కట్టారు.

పందొమ్మిదవశతాబ్ది ఉత్తరార్ధభాగంలో కొత్తగా యూరోపియనులు కనెక్టికట్‌కు వలస వచ్చారు. ఈనాడు కనెక్టికట్ రాష్ట్రంలో రెండవ పెద్దనగరమైన న్యూహావెన్ జనాభాలో నూటికి 65 శాతం ఇటాలియనులు, అంటే 65 శాతం ప్రజలు ఇటలీలో పుట్టినవారో, లేదా వారి తల్లిదండ్రులు, తాతలు ఇటలీకి చెందినవారో అయివున్నారు. న్యూబ్రిటన్‌లో 60 శాతం ప్రజలు పోలిష్ ప్రజలు. రాష్ట్ర రాజధానియైన హార్ట్‌ఫర్డులో 40 మొదలు 50 శాతం ప్రజలు ఐర్లెండు దేశీయులు.

కనెక్టికట్‌కు ప్రకృతిసంపద లేదు. ప్రజలే దాని ప్రకృతిసంపద. గనులు లేవు. నూనె లేదు. అయినా ప్రజలు నేర్పరులుకాబట్టి అమెరికా మొత్తంలో హెచ్చు తలసరి ఆదాయం కనెక్టికట్ వారిదే. వందలకొలది ఫ్యాక్టరీలలో, ఇతర వస్తు ఉత్పత్తి సంస్థలలో ప్రజలు నిర్మాణాత్మకకృషికి తమ ప్రావీణ్యమును వినియోగించి పెద్ద వేతనాలు సంపాదించుకొంటూ వుంటారు.

నూరేండ్లక్రితం కనెక్టికట్ రాష్ట్రంలో 15 శాతం భూమి అటవీప్రదేశం. తక్కినది సాగుభూమి. ఈ రాష్ట్రంలో జనసాంద్రత హెచ్చే అయినప్పటికీ, పెద్ద పట్టణాలెన్నో వున్నప్పటికీ 70 శాతం భూమి మళ్ళీ అడవిగా మారింది. పూర్వం వ్యవసాయక్షేత్రాలుగా వున్న భూములు వనములయ్యాయి.

ఈ రాష్ట్రంలో రెండు పెద్ద విశ్వవిద్యాలయా లున్నవి. ఒకటి యేల్ విశ్వవిద్యాలయం. రెండవది కనెక్టికట్ విశ్వవిద్యాలయం. ఈ రెంటిలో కలిపి పన్నెండు

వేలమంది విద్యార్థులు చదువుతూ వుంటారు. ఏడు చిన్న కాలేజీ లున్నవి. ఉపాధ్యాయుల శిక్షణకై నాలుగు ప్రత్యేక కళాశాలలున్నవి.

కనెక్టికట్ రాష్ట్రంలో పబ్లిక్ స్కూలువిధానం మంచిది. దీనిని ఇంకా వృద్ధిచేయాలని ప్రయత్నాలు జరుగుతున్నవి. హెచ్చుమందికి కాలేజీలలో ప్రవేశమివ్వాలని కృషిచేస్తున్నాము. మా నిబంధనలప్రకారం ప్రతి బాలుడు, ప్రతి బాలిక పదహారవయేడు వచ్చేవరకూ స్కూలులో చదవాలి. వీరిలో దాదాపు 30 శాతం మంది సెకండరీ, లేదా హైస్కూళ్ళనుంచి పట్టభద్రులై విశ్వవిద్యాలయాలలో చేరుతారు.

గృహవసతిని, ఆసుపత్రులను అభివృద్ధిపరిచేయత్నం చేస్తున్నాము. ప్రజలకు ఉత్తమ జీవనంకోసం పాటుపడుతున్నాము.

నా నివాసస్థానమైన ఎస్సెక్స్ జనాభా 3500. ఇది సుందరమైన కనెక్టికట్ నదీతీరాన వుంది. ఎస్సెక్స్ ప్రజలు బహు వృత్తులు గలవారు. ఇక్కడ ఐదు చిన్నఫ్యాక్టరీలున్నవి. వీటిలో పెద్దదానిలో రెండువందలమంది పనిచేస్తూవుంటారు. కొందరు ఏడాదిలో రెండుమొదలు ఆరునెల్లవరకు మాత్రమే ఫ్యాక్టరీలలో పని చేస్తారు. ఆపిమ్మట నాలుగైదునెలల్లో పొలాలలో పనిచూచుకుంటారు. మరొక నెల చేపలు పట్టుతారు. కనెక్టికట్ నదిలో ప్రతి వసంతఋతువులో చేపలు విస్తారంగా వుంటాయి. చేపలకు మంచి ధరకూడా లభిస్తుంది.

ఎస్సెక్స్‌లో పెద్ద ధనికులూ లేరు. నిరుపేదలూ లేరు. మొత్తం 700 కుటుంబాలుంటాయి. వాటిలో 15 లేక 20 కుటుంబాలకు మాత్రమే నౌకర్లు వున్నారు. అదీ ఒక్కొక్క నౌకరుమాత్రమే. నాకు తెలిసినంతవరకు ఒక కుటుంబానికి మాత్రమే.

అమెరికాలో నౌకర్లు పెద్ద జీతాలు పుచ్చుకుంటారు. కాబట్టే చాలామంది నౌకర్లను పెట్టుకోలేరు. అందుచేతే మాకు చాలా పనులు సులభంగా కావడానికి విద్యుత్తుతో పనిచేసే పరికరాలుంటాయి. నౌకర్లకు బదులుగా ఉపయోగపడేందుకై ఉపకరణములు కనిపెట్టాము. వాటి విషయంలో తరచు నా భారతీయమిత్రులు నన్ను వేధిస్తూ వుంటారు.

మా చిన్న బస్తీని పాలించే వ్యవస్థను "ప్రత్యక్ష ప్రజాస్వామ్యం" అని చెప్పవచ్చు. కొత్త అగ్నిమాపకయంత్రమో, లేక కొత్తవీధి, లేదా కొత్తస్కూలు

అవసరమవుతాయనుకోండి. వాటిని గూర్చి చర్చించడానికై ఫలానాతేదీరాత్రి సమావేశం జరుగగలదని పురమందిరంలో నోటీసు అంటిస్తారు.

ఓటు వేయదగిన వయస్సులో వుండి ఆవిషయంపై ఆసక్తిగలవారంతా సమావేశానికి హాజరు అవుతారు. ఒక పెద్దమనిషిని సమావేశానికి అధ్యక్షుడుగా ఎన్నుకొంటారు. తక్కినవారంతా సభాసదులు. ఒక వ్యక్తికి ఒక్క ఓటే. అంతా కలిపి ఒక నిర్ణయంచేసి ఎవరిండ్లకు వాళ్ళు వెళ్ళిపోతారు.

ఎస్సెక్స్ పురపాలనకై పురసభవుంటుంది. ముగ్గురు ప్రధాన పురఉద్యోగులుంటారు. వారిని సెలెక్ట్‌మెన్ అంటారు. వారు ప్రజలచే ఎన్నుకోబడ్డవారు. మొదటి ఇద్దరు సెలెక్ట్‌మెనులు అధికసంఖ్యాక పక్షానికి చెందినవారు. మూడవ అతను అల్పసంఖ్యాకపక్షానికి చెందినవాడు. ఇతను అధికసంఖ్యాకులను ఒకకంట కనిపెడుతూ పట్టణ అవసరాలు తీరేట్టుచూస్తాడు. ప్రజాశ్రేయస్సును ప్రధానంగా పెట్టుకుంటాడు.

మా బస్తీలో హెచ్చుమంది తమ కుటుంబం విషయంలోను, చర్చీచుట్టూ వుండే జీవితం విషయంలోను శ్రద్ధవహిస్తారు. కేతలిక్, ప్రొటెస్టెంట్, యూదు మతాలకు చెందిన వేర్వేరుచర్చీలు 12 వున్నాయి. ఇల్లు, చర్చి-ఈరెండే ముఖ్యం.

విదేశీయులెవరైనా వచ్చి మా అమెరికాలో చిన్న బస్తీలను చూస్తే ఇచటి పౌరులు పరిమితదృక్పథం గలవారని అనుకుంటారేమో! అవును, మాలో చాలా మంది స్వంతసమస్యలతో సతమతమవుతుంటారు. ప్రపంచసమస్యలను ఆలోచించే వ్యవధివుండదు. కాని ఇప్పుడు మార్పువస్తోంది. ఎస్సెక్స్ ప్రజలు పరస్పర సంబంధంగల ఈ ప్రపంచస్థితిని ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నారు. మీవలెనే మా ప్రజలుకూడా సమస్యలకు తగుపరిష్కారాలు వెదుకుతున్నారు.

భారతదేశంనుంచి నేను ఇంటికి తిరిగివెళ్ళినప్పుడల్లా భారతదేశాన్నిగూర్చి ప్రసంగించమని కనీసం ఆరు ఆహ్వానాలు వస్తూవుంటాయి. భారతీయులు ఎలా వుంటారు, వారి భావాలేమిటి, వారి జీవితం ఎలావుంటుంది, మొదలగు అంశాలను గూర్చి చెప్పమంటారు. ఎస్సెక్స్‌లో ఇప్పుడు ప్రతివారం సభలు జరుగుతున్నాయి. అనేక విషయాలు చర్చింపబడుతాయి. పది పదిహేనేళ్ళక్రితం ఇలా లేదు.

ఎస్సెక్స్ ప్రజలు లోకంలో అన్నిటికన్న దేనిని అధికంగా కోరుతారని ప్రశ్నిస్తే—ప్రపంచశాంతి అని జవాబు చెప్పవలసివుంటుంది. కార్పణ్యాలు, ద్వేషాలు, స్పర్థలు లేని భవిష్యత్తుకోసం ఎదురుతెన్నులు చూస్తారు.

ఎస్సెక్స్‌లో వున్న చర్చీలకు ఆదివారం వెళ్ళిచూడండి. సర్వజాతులమధ్య, సర్వమతాలమధ్య సామరస్యం వుండవలెననీ, శాంతి నెలకొనవలెననీ మతాచార్యులు

ఉపన్యాసాలు చెబుతూవుంటారు. ప్రపంచశాంతికోసం ప్రజలు అవనతశిరస్కులై ప్రార్థనలు చేస్తూ వుంటారు.

వీరంతా నా ఇరుగుపొరుగు. సవబుతెలిసిన మనుష్యులు. ప్రతిమనిషీ సవబుగా వ్యవహరి స్తే, ఎదుటివ్య క్తిని సరిగా అర్థంచేసుకొంటే, దేశాలమధ్య ఇనుప తెరలు లేకుంటే ప్రపంచశాంతి ఏర్పడటం తథ్యమని భావిస్తారు.

మా బస్తీ ప్రజలకు ఎవరిపైనా ద్వేషంలేదు. ఇక్కడ మీ భారతదేశంలో మీరెలా ఆలోచిస్తారో, ఎలా మాట్లాడుతారో మా ప్రజలూ అంతే. ప్రపంచ ప్రజలు పరస్పరము అవగాహనచేసుకోకుండా అడ్డుగోడలుగా వున్నవాటిని ఎప్పుడో ఒకప్పుడు పడగొట్టాలని వారి అభిమతం. అది వీలవుతుందనే వారి విశ్వాసం.

భారతదేశంనుంచి అనేకులు అమెరికావెళ్ళి ఎస్సెక్స్‌వంటి దేశవాళీ బస్తీలను, ఎస్సెక్స్ ప్రజలవంటి దేశవాళీ అమెరికనులను చూడాలని నాకోర్కె.

అలాగే చాలామంది అమెరికనులు భారతదేశానికి వచ్చి ఇచటి ప్రజలను చూడాలి. ఇచటి కుటుంబజీవితాన్నీ, గ్రామజీవితాన్నీ చూచి భారతీయులను అర్థం చేసుకొన ప్రయత్నించాలి. నేను మిమ్మల్ని తెలుసుకొనయత్నిస్తున్నట్లే మీరు ప్రపంచానికి బోధించగల అంశాలను తెలుసుకొనే ప్రయత్నం అమెరికనులు చేయాలి.

అవసరమవుతాయనుకోండి. వాటిని గూర్చి చర్చించడానికై ఫలానాతేదీరాత్రి సమావేశం జరుగగలదని పురమందిరంలో నోటీసు అంటిస్తారు.

ఓటు వేయదగిన వయస్సులో వుండి ఆవిషయంపై ఆసక్తిగలవారంతా సమావేశానికి హాజరు అవుతారు. ఒక పెద్దమనిషిని సమావేశానికి అధ్యక్షుడుగా ఎన్నుకొంటారు. తక్కినవారంతా సభాసదులు. ఒక వ్యక్తికి ఒక్క ఓటే. అంతా కలిసి ఒక నిర్ణయంచేసి ఎవరిండ్లకు వాళ్ళు వెళ్ళిపోతారు.

ఎస్సెక్స్ పురపాలనకై పురసభవుంటుంది. ముగ్గురు ప్రధాన పురఉద్యోగులుంటారు. వారిని సెలెక్ట్‌మెన్ అంటారు. వారు ప్రజలచే ఎన్నుకోబడ్డవారు. మొదటి ఇద్దరు సెలెక్ట్‌మెనులు అధికసంఖ్యాక పక్షానికి చెందినవారు. మూడవ అతను అల్పసంఖ్యాకపక్షానికి చెందినవాడు. ఇతను అధికసంఖ్యాకులను ఒకకంట కనిపెడుతూ పట్టణ అవసరాలు తీరేట్టుచూస్తాడు. ప్రజాశ్రేయస్సును ప్రధానంగా పెట్టుకుంటాడు.

మా బస్తీలో హెచ్చుమంది తమ కుటుంబం విషయంలోను, చర్చీచుట్టూ వుండే జీవితం విషయంలోను శ్రద్ధవహిస్తారు. కేతలిక్, ప్రాటెస్టెంట్, యూదు మతాలకు చెందిన వేర్వేరుచర్చీలు 12 వున్నాయి. ఇల్లు, చర్చి-ఈరెండే ముఖ్యం.

విదేశీయులెవరైనా వచ్చి మా అమెరికాలో చిన్న బస్తీలను చూస్తే ఇచటి పౌరులు పరిమితదృక్పథం గలవారని అనుకుంటారేమో! అవును, మాలో చాలామంది స్వంతసమస్యలతో సతమతమవుతుంటారు. ప్రపంచసమస్యలను ఆలోచించే వ్యవధివుండదు. కాని ఇప్పుడు మార్పువస్తోంది. ఎస్సెక్స్ ప్రజలు పరస్పర సంబంధంగల ఈ ప్రపంచస్థితిని ఇప్పుడిప్పుడే తెలుసుకుంటున్నారు. మీవలెనే మా ప్రజలుకూడా సమస్యలకు తగుపరిష్కారాలు వెదుకుతున్నారు.

భారతదేశంనుంచి నేను ఇంటికి తిరిగివెళ్ళినప్పుడల్లా భారతదేశాన్నిగూర్చి ప్రసంగించమని కనీసం ఆరు ఆహ్వానాలు వస్తూవుంటాయి. భారతీయులు ఎలా వుంటారు, వారి భావాలేమిటి, వారి జీవితం ఎలావుంటుంది, మొదలగు అంశాలను గూర్చి చెప్పమంటారు. ఎస్సెక్స్‌లో ఇప్పుడు ప్రతివారం సభలు జరుగుతున్నాయి. అనేక విషయాలు చర్చింపబడుతాయి. పది పదిహేనేళ్ళక్రితం ఇలా లేదు.

ఎస్సెక్స్ ప్రజలు లోకంలో అన్నిటికన్న దేనిని అధికంగా కోరుతారని ప్రశ్నిస్తే—ప్రపంచశాంతి అని జవాబు చెప్పవలసివుంటుంది. కార్పణ్యాలు, ద్వేషాలు, స్పర్థలు లేని భవిష్యత్తుకోసం ఎదురుతెన్నులు చూస్తారు.

ఎస్సెక్స్‌లో వున్న చర్చీలకు ఆదివారం వెళ్ళిచూడండి. సర్వజాతులమధ్య, సర్వమతాలమధ్య సామరస్యం వుండవలెననీ, శాంతి నెలకొనవలెననీ మతాచార్యులు

బామా రాష్ట్రంలోని మాంట్‌గోమరీ పట్టణానికిచెందిన 42,000 మంది నీగ్రోలు బస్సులలో తెల్లజాతి వారితోపాటు తామూ కూర్చొని ప్రయాణం చేసే హక్కును నిలబెట్టుకున్నారు.

వచ్చే పనిరోజునుంచీ బస్సుల నిబంధనలు కొత్తవి అమలులోకి వస్తాయి. ఇప్పుడు వారు ఓర్పుతో చర్చిలలో ప్రదర్శనాలు చేస్తున్నారు. కుర్చీ పీటలనే బస్సు సీట్లుగా భావిస్తున్నారు. మానవసంబంధాలలో అత్యంతక్లిష్టమైన ఈ సమస్యను పరిష్కరించడానికి క్రైస్తవ నీతిసూత్రాలను ఎలా వర్తింపజేయడమా అని వితర్కించుకొంటున్నారు.

మతాచార్యులు "కేకలు పెట్టొద్దు. శ్వేతజాతివారిపై కార్పణ్యంవద్దు. ఓరిమి వహించండి. గౌరవంచూపండి. మీతో వారు ఎలా ప్రవర్తించాలని మీరు ఆశిస్తారో మీరు వారితో అలా ప్రవర్తించండి" అని బోధచేశారు.

ఆ తర్వాత కొన్నివారాలకు తెల్లజాతివారిలో మరీ మూర్ఖులైన వారు తుపాకీలు పేల్చారు. బాంబులువేశారు. నీగ్రోలను, వారి నాయకులను అవమానించారు. బెదిరించారు. కాని నీగ్రోలు కోపంగాని, అహంభావంగాని చూపక హుందాగా, దృఢంగా నిలబడ్డారు.

చివరకు వారికి విజయం లభించేసరికి బస్సులలో నీగ్రోలు కూడా ప్రయాణం చేయడానికి వీలులేదని వాదించిన తెల్లజాతివారు కొందరు సణుగుకొని "ఇంతపని చేయగల తాహతు నీగ్రోలకుందని మేము అనుకోలేదు. ఎంత పనిచేశారు! నీగ్రోలను మేము గౌరవించవలసినరోజు వస్తుందని ఎన్నడూ అనుకోలేదు. ఆరోజు వచ్చేసింది" అంటూ వాపోయ్యారు.

దీనిని నీగ్రోలు ఎలా సాధించారు? వారు అవలంబించిన పద్ధతులేమిటి?

మాంట్‌గోమరీ కార్యక్రమానికి గాఢమైన ఆధ్యాత్మిక ప్రాతిపదిక వుంది. ఒక్క క్రైస్తవమతమేగాక ఆసియాలోని ప్రాచీనమతాలు కూడా దానికి ప్రాతిపదికలు. నీగ్రోల ఉద్యమం విజయవంతం కావడానికి వారి నాయకుడు మార్టిన్‌లూథర్ కింగ్ బాధ్యుడు. అతని వయస్సు 27 ఏండ్లు. అతనే అన్నాడు తాను గాంధీజీ పద్ధతులను అనుసరించినట్లు. గాంధీజీ భారతీయులకు స్వాతంత్ర్యం తెచ్చిన మహనీయుడు కదా!

గాంధీజీని ఉత్తేజపరచినవారు రష్యా రచయిత టాల్‌స్టాయ్, అమెరికా

ప్రముఖుడు థోరియో. థోరియో బానిసత్వపు చట్టానికి వ్యతిరేకంగా శాంతియుత మైన నిరసన తెల్పినందుకుగాను ఆయనను మెసాచుసెట్స్ కారాగారంలో బంధించారు. థోరియో వ్రాసిన "శాసనోల్లంఘనం" అనే వ్యాసాన్ని చదివి గాంధీజీ తన కార్యక్రమానికి కూడా ఆపేరే పెట్టాడు.

"మేము తలబిరుసుతనం గలవాళ్ళం" అని చెప్పుకొనే అమెరికనులు మాంట్‌గోమరీలో కొన్ని ప్రత్యేక పరిస్థితులదృష్ట్యా అలా జరిగిందని అనవచ్చు. అంతేగాక జాతివిచక్షణ విధానాన్ని సమర్థించనూ వచ్చు. కాని ఒకటి మాత్రం నిజం. గాంధీజీ భారతస్వాతంత్ర్యోద్యమాన్ని నిర్వహిస్తున్నప్పుడు ఆయన సమకాలికులు కొందరు ఆయన కార్యక్రమాన్ని అపహసించారు. మంత్రాలకు చింతకాయలు రాలతాయా అన్నారు. కాని గాంధీజీ విజయం సాధించాడు. అమెరికాలోనూ అంతే అవుతుంది. అది తథ్యం.

మాంట్‌గోమరీలో నీగ్రోలు బస్సులను బహిష్కరించడానికీ, భారతదేశంలో గాంధీజీ జరిపిన పోరాటానికీ చాలా సామ్యంవుంది. మాంట్‌గోమరీ ఉద్యమం ఒక చిన్న సంఘటనతో ఆరంభమై మహోద్యమమైంది.

శ్రీమతి రోసా పార్క్స్ నీగ్రో స్త్రీ. కుట్టుపనిచేసి జీవించే మనిషి. శాంత స్వభావురాలు. ఆమె బస్సులలో ప్రయాణం చేసినప్పుడల్లా ఆమె కూర్చున్న సీటులోనుంచి లేచి ఆసీటును ఒక తెల్లజాతి వ్యక్తికి ఇవ్వమని ఆమెను వత్తిడి చేస్తూ వుండేవారు. పాపం, ఆమె అలాగే లేచి సీటు ఇంకొకరికిచ్చేది. ఒకరోజు ఏమనుకుందో ఏమో సీటులోనుంచి లేవనన్నది. బస్సు డ్రైవరు పోలీసులను పిలుస్తానని బెదిరించాడు. "పో, పిలుచుకో పో" అంది ఆమె.

శ్రీమతి పార్క్స్‌ను అరెస్టు చేశారు. నీగ్రో మతనాయకులంతా గుమిగూడి నగరంలోవున్న బస్సులన్నిటినీ ఒకరోజు బహిష్కరించాలన్న పిలుపు నిచ్చారు. తెల్లజాతివారిలో తీవ్రవాదులైనవారు కోపోద్రిక్తులు కావడంతో మాంట్‌గోమరీలో వున్న ప్రతి నీగ్రో కుటుంబం నగరంలోని బస్సులలో ప్రయాణం చేయడం మానుకున్నారు.

భారతదేశాన్ని విదేశీపాలననుండి విముక్తంచేసిన గాంధీజీ ఉద్యమంకూడా అలాగే ఆరంభమైంది. 1893 లో గాంధీజీ దక్షిణాఫ్రికాలో మారుమూలప్రాంతంలో రైలులో ప్రయాణం చేస్తూవుండగా జాతివిచక్షణ చూపే శ్వేతజాతి అధికార్లు ఆయన ప్రయాణానికి అభ్యంతరం చెప్పారు. దానితో ఆయన ఉద్యమనేత అయ్యాడు.

అప్పుడు గాంధీవయస్సు 23 ఏండ్లు. యువకుడు. లాయరు. ఒక కోర్టు కేసులో భారతీయ పౌరుని తరపు న్యాయవాదిగా పనిచేయడానికి ఆయన దక్షిణాఫ్రికాకు వచ్చాడు. మొట్టమొదటిసారిగా అక్కడ ఒకరాత్రి రైలుప్రయాణం చేస్తూ వుండగా తెల్లజాతివారికొరకు రిజర్వుచేయబడ్డ రైలుపెట్టెను ఖాళీచేసి వెళ్ళమని ఆయన్ను అధికారులు ఆదేశించారు. గాంధీ దిగనన్నాడు. అవతలి స్టేషనులో రైలు ఆగగానే ఆయన్ను రైలులోనుంచి బైటికి గెంటారు.

అది చలిరాత్రి. ఆయన వణుకుతూ ప్లాటుఫారంపై నిల్చొని వున్నాడు. ఆయన పైకోటు, సామాను రైలుపెట్టెలోనే వున్నాయి. రైలు కదిలిపోయింది. అప్పుడు గాంధీ తన్నుతానే ప్రశ్నించుకున్నాడు: "నేను ఈ దక్షిణాఫ్రికాలోనే వుండిపోయి నా హక్కులకోసం, అణచబడ్డవారి హక్కులకోసం పోరాడాలా? లేక నాకెందుకులే అని మూటాముల్లె సర్దుకొని భారతదేశానికి తిరిగి వెళ్లాలా?

"భారతదేశానికి తిరిగివెళ్ళడం పిరికితనమవుతుంది. ఎన్ని కష్టనష్టాలు వచ్చినాసరే, న్యాయమైనపనిని చేసితీరాలి అన్న నిర్ణయానికొచ్చాను" అని గాంధీ తర్వాత తన అనుభవాన్నిగూర్చి వ్రాసుకున్నాడు.

తర్వాత ఆయన తపాలుబండిలో ప్రిటోరియా వెళ్ళాడు. అక్కడ ఆయన కేవో పేర్లు పెట్టారు. బైట మురికి గోనెపై కూర్చోమన్నారు. స్థూలకాయుడైన శ్వేతజాతీయుడొకడు ఆయన్ను కొట్టాడు. ప్రిటోరియాలోని హోటళ్ళు ఆయన వుండేందుకు గదిఇవ్వ నిరాకరించాయి. చివరకు ఒక అమెరికన్ నీగ్రో ఆయన్ను పలుకరించి, వుండేందుకు తావుచూపాడు.

మరుసటిరోజు గాంధీ ప్రిటోరియాలోని భారతీయులను సమావేశపరచి వారిపై చూపబడే జాతివిచక్షణకు వ్యతిరేకంగా పోరాటం జరపవలసిందని ఉద్బోధించి ఆ పోరాటం వినూత్న నిర్మాణాత్మక పద్ధతిప్రకారం జరగాలని సూచించాడు.

వారి లక్ష్యం ఇరుగుపొరుగువారి మధ్యవుండే సౌభ్రాత్రమని గాంధీ చెప్పాడు. కనుక అందుకు అవలంబించే సాధనాలు ఎదటి వ్యక్తిని సమ్మతింపజేసేవిగా వుండాలికాని హింస పనికిరాదన్నాడు. భారతీయులు ద్వేషం విడనాడాలని హితవు చెప్పాడు. శ్వేతజాతీయులను సాటిమానవులుగా గౌరవిస్తూనే అక్రమమైన వారి జాతివిచక్షణ విధానాన్ని వ్యతిరేకించమన్నాడు.

లాఠీదెబ్బలు తినడానికీ, జైళ్ళకు వెళ్ళడానికీ సిద్ధంగా వుండాలన్నాడు. అవతలివారిని తిరిగి కొట్టవద్దన్నాడు. అవమానపరచకూడదని హెచ్చరించాడు.

వాక్కుద్వారానేగాక నడతద్వారా, జీవితవైఖరి ద్వారా ఎదిరిపక్షంవారిని లోబరుచుకోవాలన్నాడు. మాట వజ్రాయుధం కావాలన్నాడు.

"శ్వేతజాతివారికి మనవల్ల కలిగే ఇబ్బందులను మొదట ఆలోచిద్దాము. మనపట్ల విచక్షణచూపడానికి వారు చెప్పే కారణాలు సబబైనవో కావో పరిశీలిద్దాము" అన్నాడు గాంధీ.

ఆయన ప్రసంగాన్ని వినడానికి వచ్చినవారిలో చాలామంది వర్తకులున్నారు. లావాదేవీలలో పేరెన్నికగన్నవారు. వారంతా సత్యానికి కట్టుబడివుండాలనీ, సమాజంపట్ల కొత్తబాధ్యత చూపాలనీ గాంధీ ఉద్బోధించాడు.

"మన కష్టాలవిషయంలో తెల్లవారిని నిందించకూడదు. మన ప్రజల దారిద్ర్యాన్ని నిర్మూలించడం అమెరికా ఒక్కళ్ళవల్లేకాదు. అయితే అలా అని ఏమీచేయకుండా వుండకూడదు. ఇళ్ళను శుభ్రపరచుకుందాము. భారతీయ వయోజనులకు చదువు నేర్పుదాం. పేదవారి పిల్లలకు ఉచిత పాఠశాలలు పెడదాం" అని ప్రబోధించాడు గాంధీ.

ప్రయోగాలుచేస్తూ, తప్పులు సవరించుకొంటూ గాంధీ ఒక కొత్త రాజకీయ కార్యక్రమాన్ని ఆచరించాడు. కేవలం శాసనాన్నిమాత్రమే పట్టుకువ్రేలాడక, విచక్షణచట్టాన్ని తుదముట్టించండని పార్లమెంటుకు విజ్ఞప్తిచేస్తూ, న్యాయస్థానాల ద్వారా న్యాయంపొంద ప్రయత్నిస్తూ ఎన్నికలలో గెలుస్తూ అంతటితోనే సరిపెట్టుకొనక, భారతీయులు నిర్మాణాత్మక ప్రజాసేవ ద్వారా విచక్షణవిధానంపట్ల శాంతియుత పోరాటం జరపవలెనన్నాడు.

గాంధీనాయకత్వాన వేలాది భారతీయులు శాంతియుతంగా జాతివిచక్షణ శాసనాన్ని ఉల్లంఘిస్తూ తరలివెళ్లారు. పోలీసులు వారిని కొట్టారు. కారాగారాలలో బంధించారు.

చివరకు ప్రధానమంత్రి స్మట్స్ లాభంలేదని గ్రహించి గాంధీతో ఒడంబడిక చేసుకోవడం మంచిదని భావించాడు. "ఇరవై వేలమంది భారతీయులను జైళ్లలో పెట్టడం అసాధ్యమైన పని" అన్నాడు స్మట్స్.

* * *

1915 లో గాంధీ భారతదేశానికి తిరిగి వచ్చాడు. తన శక్తియుక్తులను, అహింసాత్మకమైన తన నూత్నపద్ధతిని భారత స్వాతంత్ర్యపోరాటానికి వినియో

గించాలనుకున్నాడు. ఆఫ్రికాలో వలెనే భారతదేశంలో కూడా ఆయన కార్యక్రమం బ్రిటిషుపాలనపై పోరాటాన్ని అధిగమించిపోయింది. తన్నుతాను పాలించుకోగల నవభారతాన్ని నిర్మించడం ఆయన లక్ష్యం. కాబట్టే జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించడానికి ఎంత కృషిచేశాడో గ్రామాలలో నిర్మాణాత్మకకార్యక్రమాన్ని కొనసాగించడానికై దేశీయులకు తగు శిక్షణ ఇవ్వడానికి కూడా అంతే పాటు పడ్డాడు.

భారతదేశాన్ని ఉద్ధరించడానికై పదమూడుఅంశముల కార్యక్రమాన్ని ప్రతిపాదించాడు. వాటిలో హిందువులలో అస్పృశ్యతా నిర్మూలన ఒకటి. హిందూ ముస్లిం ఐకమత్యం మరొకటి. భారతదేశంలోని 5 లక్షల గ్రామాలలో వ్యవసాయాన్ని వృద్ధిచేయాలన్నాడు. ప్రజలకు మంచి తిండికావాలన్నాడు. విద్యా, వైద్య సౌకర్యాలు అమరవలెనన్నాడు.

గాంధీ రాజకీయాలు బాగా ఎరిగినవాడు. ద్రష్ట. కాబట్టే ప్రజాసమస్యలను చక్కగా వెలుగులోకి తేగలిగాడు. ప్రజలు కూడా ఆయన వైఖరిని సులభంగా అర్థంచేసుకోగలిగేవారు. 1930 లో ఆయన ఉప్పుసత్యాగ్రహం చేశాడు. దానితో భారత గ్రామీణుని సాధారణ కోర్కె ఖండాంతరాలకు కూడా తెలిసివచ్చింది. ఏమిటా కోర్కె? ఉప్పుపై బ్రిటిషువారు విధించే పన్నును తీసివేయాలన్నకోర్కె. ప్రజలు ఉప్పు తయారుచేయకూడదన్న ఆంక్షను తొలగించడం. దీనితో భారత స్వాతంత్ర్యోద్యమం దీప్తివంతమైంది.

కాలినడకన రెండువందలమైళ్లు వెళ్లి అరేబియా సముద్రతీరంపై భగవంతుడిచ్చిన సముద్రపు నీటితో ఉప్పు తయారుచేసి మానవుడు నిర్మించిన మహాసామ్రాజ్యపు శాసనాన్ని ఉల్లంఘిస్తానని గాంధీ ప్రకటించగానే భారతదేశం ఒక్కుమ్మడిగా కదిలింది. దేశమంతటా విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఆయన చకచకా నడచి వెళ్లుతూవుంటే లక్షలాది రైతులు ఆ దారిప్రక్కన గుమికూడి ఆయన్ను గౌరవ భావంతో చూచారు.

ఏప్రిలు 5 వ తేదీ రాత్రి ఆయన సముద్రతీరానికి చేరుకున్నాడు. "దైవం అనుగ్రహిస్తే రేపు ఉదయం 6-30 గంటలకు మేము శాసనోల్లంఘనం ఆరంభిస్తాము" అన్నాడు. సూర్యోదయవేళ మామూలు ప్రకారం ప్రార్థన పూర్తిచేసుకొని అన్నవేళకు ఉప్పుబీచినుంచి పిడికెడు ఉప్పు తీయడానికి వెళ్లాడు.

ఈవార్త దేశమంతటా ప్రాకేసరికి ప్రజలు ఉద్రిక్తులయ్యారు. మారుమూల పల్లెలకు కూడా ఈ సంగతి తెలిసింది. నెహ్రూ అరెస్టు అయ్యాడు. మరొకలక్ష మంది కార్యకర్తలు కారాగారాలకు వెళ్ళారు.

అంతట గాంధీ ప్రభుత్వ ఉప్పు డిపోవద్ద నిరసనప్రదర్శనం చేస్తానని ప్రకటించాడు. ఆయన్ని వెంటనే అరెస్టుచేశారు. 2,500 మంది భారతీయులు ప్రదర్శనం జరిపారు. కాని వారు పోలీసులపై చేయి చేసుకోలేదు.

వందలకొలది కార్యకర్తలను కొట్టారు. అరెస్టుచేశారు. కాని అందుకు ప్రతిగా హింస జరుగలేదు. పశ్చిమోత్తర సరిహద్దులో నివసించే పఠానులు కూడా సంయమనం పాటించారన్న వార్త జైలులో వున్న గాంధీజీకి తెలిసేసరికి ఆయన పరమానందభరితుడయ్యాడు. భారతీయులంతా-వారెక్కడవున్నా సరే-తలయెత్తుకొని సగర్వంగా తిరగగల్గిగారు. తమకూ వ్యక్తిత్వం కలదనీ, తమకూ హక్కులు, బాధ్యతలు, భవిష్యత్తు వున్నాయనీ మొదటిసారిగా వారికి తెలిసి వచ్చింది.

గాంధీ ముప్పైయేండ్లు పోరాటం సలిపాడు. ఏ ఉద్యమాన్ని ఎప్పుడు ఆరంభించాలో, ఎప్పుడు ఆపాలో బాగా ఎరిగినవాడు. చివరకు విజయం తనదేనని ఆయనకు సంపూర్ణ విశ్వాసం వుండేది. విప్లవాత్మకమైన తన నూత్న పద్ధతులను శాంతియుతమైన రాజకీయ కార్యక్రమానికి వినియోగించాడు. తద్వారా స్వతంత్ర, ప్రబుద్ధభారతావని అవతరణకు కారకుడయ్యాడు.

1947 ఆగస్టు 15 వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. వలస వాదంపై జరిగిన పోరాటం ఎంత చక్కగా ముగిసింది! 40 కోట్ల ప్రజలకు స్వయం పరిపాలనాధికారం లభించింది. రక్తపాతంగాని, ద్వేషభావంగాని లేకుండా పోరాడి స్వాతంత్ర్యం సంపాదించడం గొప్ప అద్భుతం. అది ఎలా సాధ్యమైంది? బ్రిటిషు వారు మర్యాదగా ఉపసంహరించుకున్నారు. దానితో బ్రిటిషు కామన్వెల్తులో సమానత్వం, పరస్పరగౌరవం ప్రాతిపదికగా నూత్న సంబంధాలు ఏర్పడ్డాయి.

భారతదేశంలో గాంధీ అవలంబించిన విధానము, అలబామాలోని మాంట్‌గోమరీలో నీగ్రోలు అనుసరించిన పద్ధతి ప్రయోజనకరమైనవి కావని విజ్ఞులవ గలరా?

కాని అట్టి విధానం లిటిల్‌రాక్‌లో, షికాగోలో, లెవిట్టౌన్‌లో, న్యూ ఆర్లియన్స్‌లో ఫలప్రదమవుతుందా? అమెరికాలోని ఉత్తర దక్షిణ తూర్పు పడమర ప్రాంతాలలో వుండే అమెరికనులలో జాతి విచక్షణతత్వం లేకుండా చేయగలుగ్గుతుందా? మూడువందల ఏండ్లనుండి వారితో పాదుకొని పోయివున్న భయాన్ని

పోగొట్టగలుగుతుందా? ఈమూడువందల ఏండ్లూ అమెరికనులు తమకు తెలియ కుండానే క్రైస్తవ నీతిసూత్రాలతో సమాధానపడి వున్నారే!

గాంధీజీ అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడాడు. విజయం సాధించాడు. ఆయనవిధానం విజయవంతమైందంటే అందుకు ముఖ్యకారణం అది ప్రజా స్వామ్యతత్వంపై విశ్వాసం కలిగివుండి అధికంగా వాక్స్వాతంత్ర్యాన్నీ, పత్రికా స్వాతంత్ర్యాన్నీ అనుమతించినవారి పాలనలో అమలుజరగడమే.

పైగా గాంధీ సుశిక్షితుడైన న్యాయవాది. శాసనంయొక్క మహత్వం గుర్తించినవా డాయన. శాసనాలనుచేసి వాటిని అమలుజరిపే అధికారం, హక్కు రాజ్యానికి వున్నాయని అంగీకరించాలన్నాడు. అయితే ప్రజాస్వామ్య సూత్రాలను అతిక్రమించే శాసనాలను మార్చేదాకా ఆయన నిద్రపోలేదు. వాటికి నిరసనతెలిపే వాడు. అవసరమైతే తన స్వాతంత్ర్యాన్ని గోల్పోయి జైలుశిక్షకూడా అనుభవించే వాడు. మానవుడు ప్రవేశపెట్టిన పక్షపాతపూరితశాసనాలు విలువలేనివనీ, వాటికన్న ఉన్నతమైన నైతికశాసనాలను మానవుడు పాటింపవలెననీ ఆయన ప్రబోధించాడు.

సరిగ్గా ఈ విధానం ప్రకారమే మాంట్‌గోమరీలోని నీగ్రో పౌరులు సిటీ బస్సులలో జాతివిచక్షణను వ్యతిరేకిస్తూ చక్కని ఉద్యమం లేవదీశారు. రెవరెండ్ మార్టిన్ లూథర్‌కింగ్ నాయకత్వాన పెద్ద బహిరంగసభలు జరిపారు. ఆ సభల కార్య క్రమం "మమ్మల్ని వ్యతిరేకించే వారిని భగవంతుడు చల్లగా చూచుగాక" అన్న ప్రార్థనతో ఆరంభమయ్యేది. "ప్రేమ, అహింస వంటి ఆయుధాలతో మాత్రమే ప్రతికక్షులను ఎదిరిస్తాము'' అని ప్రతిజ్ఞ గైకొన్నారు. "దేవునివెంట మేము నడుస్తున్నాం" అని అన్నారు. తమ ఉద్యమానికి "మాంట్‌గోమరీ అభివృద్ధి సంఘం" అని పేరు పెట్టారు.

గాంధీవలెనే డా.కింగ్ కూడా తాను, తన సహచరులు మాంట్‌గోమరీలోని శ్వేతజాతివారి పురోగతికీ, రంగు జాతులవారి అభ్యున్నతికీ పాటుపడుతున్నట్లు చెప్పుకున్నాడు.

"నీగ్రోలను వెలివేసి కేటాయించడానికి తెల్లవారుచెప్పే కారణాలను పరిశీ లిద్దాము. ఏ పరిస్థితుల విషయంలో మనం ఎంతో కొంత చర్యతీసుకోగలమో ఆలోచిద్దాము" అని డా. కింగ్ అన్నాడు.

వెంటనే నీగ్రోలు చేసే పొడుపనులను నిర్భయంగా, నిష్కపటంగా బైట

పెట్టాడు. నీగ్రోలలో జారత్వాన్నీ, అక్రమసంతానాన్నీ పేర్కొన్నాడు. వారు చేసే నేరాల సంఖ్య ఎలా పెరిగిపోతున్నదీ వివరించాడు, ఆర్థికస్తోమత లేకపోయినా నీగ్రోలు కార్లు కొంటున్నారనీ, ఆ డబ్బు ఎక్కడిదనీ నిగ్గదీసి అడిగాడు. నానాటికీ క్షీణిస్తూవున్న వారి ఆరోగ్యప్రమాణాల మాటేమిటి అని ప్రశ్నించాడు. ఇవన్నీ బానిసత్వంవల్ల, కేటాయింపువల్ల, రెండవతరగతి పౌరసత్వంవల్ల సంక్రమించా యని ఆయన విశ్వాసం. వీటిని నిర్మూలించడానికి మాంట్‌గోమరీ అభివృద్ధిసంఘం అహోరాత్రాలు కృషిచేస్తున్నది.

అప్పుడే మాంట్‌గోమరీ పరిస్థితిలో మార్పుగోచరిస్తున్నది. నీగ్రోలలో మద్యపానం తగ్గింది. బాలనేరాలు తగ్గాయి. విడాకుల సంఖ్య తగ్గింది.

అహింసాత్మకమైన ఈ నీగ్రోఉద్యమం మాంట్‌గోమరీ పొలిమేరలు దాటిం దంటే ఎలావుంటుందో చెప్పడం కష్టం. అక్కడినుంచి దారి కంటకావృతం. అన్నీ రాళ్లూ బండలూ! సమస్తమానవులకూ సమాన గౌరవ మన్న క్రైస్తవ లక్ష్యాన్ని సాధించాలంటే సులభమార్గ మేదీ లేదని గాంధీ నిరూపించాడు.

బ్రిటిషువారికి భారతీయులు రెండోచెంప కూడా చూపి వారిని ఆగ్రహోదగ్రు లను చేశారు మొదట. నెహ్రూను సైనికులు ఇనుపపొన్నులువేసిన కర్రలతో కొడుతూవుంటే ఆయన వ్రేలైనా మెదపకుండా నిశ్చలంగా నిల్చున్నాడట. తాను అలా నిల్చోవడం చూసి వారు మరీ కోపోద్రిక్తులయ్యారనీ, వారి కళ్లలో ద్వేషం మరీ రెచ్చిపొయ్యేదనీ నెహ్రూ ఒకమారు అన్నాడు. తన అంతరాత్మను ఇటువంటి కఠినపరీక్షకు గురిచేయడాన్ని యే మానవుడూ సహించలేడు.

ఆవులు మలిపినవాడు అర్జునుడన్నట్లు చివరకి దక్కిన ఫలితం ముఖ్యం. తాము సాత్వికప్రతిఘటన జరుపగల సమర్థతగలవారమని భారతీయులు నిరూపించు కొనేసరికి బ్రిటిషువారికి భారతీయులపట్ల గౌరవం కలిగింది. అంతేకాదు, వారిపై వారికే గౌరవం పుట్టుకొచ్చింది. "మేము భయాన్ని తుంగలో తొక్కి మనుషుల వలె ఠీవిగా నడిచాము" అని నెహ్రూ అన్నాడు.

అట్టికార్యక్రమం అమెరికాలో దేశవ్యాప్తంగా అమలుజరిపితే ఫలితమెలా వుంటుందో చెప్పడం కష్టం. గాంధీ ఆధ్యాత్మికప్రభావంగల నాయకుడు. లోతు పాతులు తెలిసినవాడు. దీక్ష గలవాడు. ధైర్యశాలి. అంతేకాదు. రాజకీయ వ్యవ హారాలలో మేధావి. నీగ్రో నాయకులు కూడా గాంధీకున్నటువంటి ప్రగాఢ

విశ్వాసం, నేర్పు అలవరుచుకుంటే అమెరికాలో వారి ఉద్యమం సఫలం కావచ్చు. అంతకంటే ముఖ్యం వారి అనుచరులసంఖ్య, వారి సాహసం, దీక్ష మొదలైనవి.

ఒకటి మాత్రం తథ్యం. అమెరికాలో జాతులమధ్య సఖ్యత సామరస్యాన్ని సాధించాలంటే అమెరికాదేశీయుల అంతరాత్మలను జాగృతంచేయగల గొప్ప నైతికశక్తి నొకదానిని సృష్టించాలి.

ఎప్పుడో ఒకప్పుడు అమెరికాలోని ఉత్తర దక్షిణ తూర్పు పడమర ప్రాంతాలు క్రైస్తవులకు సహజమైన సమాధానం చెప్పవలసిన సమయం వస్తుంది. దేవుని పితృత్వాన్ని, మానవ సౌభ్రాత్రాన్ని నిరూపించడానికే క్రీస్తు అవతరించాడు. ఆ మహనీయునికి యూదులు కాని వారు, యూదులు, గ్రీకులు, కిరాతకులు, నల్ల వారు, తెల్లవారు అనే విచక్షణ భేదభావం లేవు.

# 15

# నీగ్రోల హక్కులు: కర్తవ్య నిర్వహణ కిది సమయం

**అ**మెరికాలో ఉత్తరాన, దక్షిణాన శ్వేతజాతివారికీ నీగ్రోలకూ మధ్య తరచు స్పర్థలు, ఉద్రిక్తతలు పెరుగుతూ వున్నవి. అమెరికా సమాజంలో ఇదొక "నైతికవ్రణం." దీన్ని మరొకమారు బాగా ఆలోచించాలంటూ శ్రీ బౌల్స్ 1960 జనవరి 17 తేదీ 'న్యూయార్కు టైమ్సు'లోనూ, 1959 జులై 6 వ తేదీ 'న్యూ రిపబ్లిక్'లోనూ వ్యాసాలు వ్రాశారు.

**అ**మెరికాలో జాతివిచక్షణవిధానం అంతంకావాలని అంటున్నామంటే కమ్యూనిస్టు బెడదకు భయపడికాదు. విదేశాల ప్రజలను ఈవిధంగా ఆకర్షించి వారిని మిత్రులుగా చేసుకోవాలనీకాదు. ముఖ్యకారణమేమిటంటే—జాతివిచక్షణ విధానం తప్పు అని అమెరికన్లు గ్రహించారు.

అమెరికా సమాజంలో జాతివిచక్షణ విధానం ఒక నైతికవ్రణంవంటిది. మతంపై, ప్రజాస్వామ్యంపై అమెరికన్లకుగల విశ్వాసాన్ని తృణీకరించడం వంటిది. అమెరికా జాతీయ అంతరాత్మపై కుంపటివంటిది. దీనివల్ల అమెరికాకు నిజంగా మనశ్శాంతి వుండదు.

ఈ సమస్య తక్కిన మానవాళితో శాంతియుతంగా జీవించడానికి సంబంధించినది మాత్రమే కాదు. అమెరికాజాతి అంతరాత్మపైగల ఈ మచ్చను మాపకపోతే అమెరికన్లతో అమెరికన్లే శాంతియుతంగా జీవించలేరు.

మాంట్‌గోమరీలో, లిటిల్‌రాక్‌లో లెవిట్టౌన్‌లో, షికాగోలో, ఎక్కడైనా

సరే, అమెరికాదేశంలో జాతులమధ్య ఏవిధమైన గొడవజరిగినా అది అమెరికన్లకు సంబంధించినది. అమెరికా జీవితంలో అదొక భాగం. అమెరికన్లుగా అమెరికను లందరూ దానిని పంచుకోవాలి.

ఏ ప్రాంతంవారైనా అమెరికాలో యావన్మందిప్రజలు తమ అంతరాత్మలను శోధించుకొని తాము కళంకరహితులమా కాదా ఆలోచించుకోవాలి.

అమెరికన్లు రోజూ కొన్ని పేటలమీదుగా, స్కూళ్ళప్రక్కగా, వినోదశాలల ముందుగా తరచు పోతూవుంటారు. వాటిల్లో రంగుజాతులవారికి ప్రవేశంవుండదు. తెలియకనే ఆర్థికవిచక్షణలో కూడా పాల్గొంటున్నారన్నమాట. అది మిక్కిలి విషాదకరం.

అమెరికన్ నీగ్రోలు ఇప్పుడు ఉత్తరప్రాంతంలో వున్నారన్నసంగతి అమెరికన్లు మరచిపోకూడదు. న్యూఆర్లియన్సుకన్న ఐదురెట్లమంది డెట్రాయిట్‌లో వున్నారు. మియామీకంటె ఆరురెట్లమంది లాస్‌ఏంజెల్సులో వున్నారు.

కాని ఉత్తరాదివారిలో చాలామంది జాతివిచక్షణను ఒక ప్రాంతీయ సమస్యగా మాత్రమే పరిగణిస్తున్నారు. దక్షిణాదిన శ్వేత, వర్ణజాతుల విలీనం అతి మందకొడిగా జరుగుతున్నదని వీరు విమర్శిస్తారు. కాని తమ చుట్టుప్రక్కలవున్న జాతివిచక్షణ పట్టించుకోరు. ఉపేక్ష వహిస్తారు.

దక్షిణాదికి వెలుపలగల 39 రాష్ట్రాలలో 19 రాష్ట్రాలు మాత్రమే న్యాయ విహిత ఉద్యోగపద్ధతుల సంఘాలను నెలకొల్పాయి. వీటిలో మూడింటికి అమలు జరిపించే అధికారాలు లేవు.

ఇరవై దక్షిణేతరరాష్ట్రాలలో ఉద్యోగవిచక్షణవిషయంలో శాసనాలే ఆమోదింపబడలేదు. దక్షిణాదికి అవతల తొమ్మిదిరాష్ట్రాలు మాత్రమే విచక్షణ వ్యతిరేక శాసనాలను చేశాయి. ఆ శాసనాలు ప్రభుత్వసహాయం పొందే గృహనిర్మాణానికి వర్తించేవి. ముప్పై దక్షిణేతర రాష్ట్రాలలో గృహవసతి విచక్షణను తుదముట్టించడానికి అధికారపూర్వక చర్యలు గైకొనబడలేదు.

న్యూహావెన్, పిట్టిస్‌బర్గువంటి రాష్ట్రాలు జాతిసంబంధమైన ఉద్రిక్తతను సడలించడానికవసరమైన పునర్నిర్మాణ కార్యక్రమాలు చేపట్టాయి. మురికిపేటలను నిర్మూలించడం, మానవులకు పునరావాసం కల్పించడంవంటి పనులు అచ్చట జరుగుతున్నాయి. కాని ఉత్తరాది పట్టణాలు చాలావాటిలో అందరికీ సమానంగా న్యాయశాసనాల రక్షణ కల్పించబడాలని పైకి చెప్పడమేగాని క్రియలో ఏమీ జరగడంలేదు. పైగా రంగుజాతుల కేటాయింపును మరుగుపరుస్తున్నారు. రంగు

జాతులవారి నివాసాలను వేరుచేస్తున్నారు. ఉత్తరాది పట్టణాలలో చాలా తక్కువ వాటిలో 20 శాతానికి మించిన నీగ్రో విద్యార్థులు తెల్లజాతివారి పిల్లలతో కలిసి చదువుకోవడం జరుగుతున్నది.

ఉత్తరాదిన ఏ పట్టణమైనా తాను పైకిచెప్పే ఆదర్శాలను తామ అమలు జరుపుతున్నదీ లేనిదీ నిజాయతీతో ఆత్మపరీక్ష చేసుకోవాలి. ఎంతమేరకు అమలు జరుపుతున్నదీ తెలుసుకొంటే సత్యం బోధపడుతుంది. అమెరికా పట్టణాలలో, అమెరికా రాష్ట్రాలలో ఏది మృగ్యమైందో గ్రహిస్తే మేసన్-డిక్సన్ శ్రేణికి దక్షిణాన శ్వేతమూర్ఖుల అవివేకపు చర్యలను ఖండించడంతో అమెరికన్ల కర్తవ్యం పూర్తి అయిందని అనుకోరు. జాతివిచక్షణను అంత హుటాహుటిగా విమర్శించే ఉత్తరాదివారు మొదట తాము ఆదర్శప్రాయులుగా తయారైతే ఆ తర్వాత దక్షిణాది వారికి హితవు చెప్పగలుగుతారు.

అదృష్టవశాత్తూ అమెరికన్లందరికీ రాజ్యాంగం సమానమైంది. అమెరికా రాజ్యాంగం పౌరుల శరీరవర్ణంసంగతి పట్టించుకోదు. రాజ్యాంగానికి చేయబడ్డ 14 వ సవరణ అమెరికా ప్రజాజీవితంలో అన్నిరంగాలలో జాతివిచక్షణను తుద ముట్టించవలెనని ఉద్ఘాటించింది. ప్రపంచప్రజలు అధికసంఖ్యాకులు ఆమోదించిన మానవహక్కుల సార్వజనీనప్రకటనలో ఇది ప్రపంచవ్యవస్థ సూత్రాలలో కెల్ల మొదటి సూత్రంగా భాసిస్తున్నది.

నీగ్రోలను కేటాయించడం తగదనీ, ఆ విధానాన్ని త్వరగా తుదముట్టించ వలెననీ సుప్రీంకోర్టు ఆదేశించింది. ఇది అమలుజరగాలని నీగ్రో వ్యాజ్యదారులు పట్టుబట్టుతారు. దక్షిణాదిన, ఇతర ప్రాంతాలలో మేల్కొన్న నీగ్రోలు ఎంతవత్తిడి నైనా ఎదిరించి నీగ్రో వ్యాజ్యదారులకు తోడ్పడుతారు. ఏ పార్టీ అధికారంలో వున్నా, పౌరులు శాసనాన్ని పాటించడం ముఖ్యవిషయంగా ఎంచబడుతుంది.

శాసనమే అందరికీ గురువు. గొప్ప గురువువంటిది. సైనికదళాలలో, దేశ రాజధానిలో, అంతర్రాష్ట్రీయ రైలుబండ్లలో నీగ్రోల కేటాయింపును తుదముట్టిం చడంవల్ల ఈ ప్రాంతాలలో విలీన విధానానికి ఒక అర్థం పర్థం ఏర్పడింది. ఆ సంగతి విమర్శకులుకూడా తెలుసుకున్నారు. వట్టిమాటలవల్ల ప్రయోజనమేమిటి?

మరికొందరు న్యాయవాదులపైన, న్యాయమూర్తులపైన ఆధారపడి ఈజాతి విచక్షణ వ్యవహారమంతా కేవలం శాంతిభద్రతలకు సంబంధించినదని అనుకుంటు న్నారు. అధ్యక్షుడు ఐసెన్‌హోవర్‌కు కూడా ఇలాంటి అభిప్రాయమే వుండేదేమో నని అనిపిస్తున్నది. ఎలాగంటే—కేటాయింపును తిరస్కరిస్తూ సుప్రీంకోర్టు

ఇచ్చిన తీర్పు తప్పా ఒప్పా అన్న విషయంలో తన అభిప్రాయాన్ని ఎవరికీ, చివరకు తన భార్యకు కూడా చెప్పలేదని ఆయన ఒకమారు అన్నాడు.

అయితే కోర్టు ఉత్తర్వులు మాత్రమే ప్రజల బుద్ధినీ, హృదయాలనూ మార్చలేవు. శాసనాన్ని సణుగుతూ గొణుగుకుంటూ ఆమోదించకూడదు. ఏదో మనస్సులో పెట్టుకొని శాసనబద్ధులుకావడం అమెరికన్ల లక్ష్యంకాదు. చారిత్రక ఆవశ్యకతను గుర్తిస్తే సమాజంలోని వివిధ వర్గాలమధ్య సామరస్యం సాధించ వచ్చునని అమెరికన్లు విశ్వసిస్తున్నారు.

పాఠశాలల్లో నీగ్రోలకూ, శ్వేతజాతివారికీ విద్యాభ్యాసానికి అవకాశం వుండట మనేది శాసనం గౌరవాన్ని విలబెట్టాలనుకొనేవారికీ, శాసనాన్ని తప్పించుకోవా లనుకొనేవారికీ మధ్యగల న్యాయసంబంధమైన సమస్య అయినట్లుంటే 1954 లో సుప్రీంకోర్టువారు చర్యగై కొనేవరకూ అసలు సమస్యే వుండేదికాదు. అయితే ఇది సమస్యను తలక్రిందులు చేసి చూపడమే. కోర్టు ఎందుకు చర్య గైకొన్నది? ఎందు కంటే సమానత్వం విషయంలో రాజ్యాంగం ఇచ్చిన గ్యారంటీ అమెరికాదేశానికి పెద్ద రాజకీయ సూత్రం వంటిది. ఆ సూత్రంపై అమెరికన్లకు అచంచల విశ్వాస ముంది. అంతేగాక ఒక నైతిక సమస్య కూడా కోర్టువారి ముందు వుంచబడింది. ఆ నైతిక సమస్య అమెరికా హక్కుల బిల్లుకూ, అమెరికా క్రైస్తవ నాగరికతకూ సన్నిహితమైంది.

ఏ శాసనమైనా అది శాసనంకాబట్టి చెలామణి అవుతుందని అనుకోరాదు. అది సమాజ నైతికప్రయోజనానికి ఒక రూపమిస్తుంది గనుకనే దానికి విలువ, మన్నన, అధికారము ఏర్పడుతాయి. ఇక రాజకీయ నాయకులైనవారు, సమాన హక్కులు నెలకొల్పదలచేవారు చేయవలసిన పని ఏమిటంటే—కోర్టువారి నిర్ణయా లను వేడుకోవడం, ఆ నిర్ణయాలను అమలుజరిపించడం. అంతే కాదు, కోర్టువారి నిర్ణయాలు సరియైనవని ప్రజలకు నచ్చజెప్పడం.

కాబట్టి అమెరికన్ సమస్య నైతికసమస్య. జాతీయసమస్య. ఈవిషయంలో ప్రపంచ అభిప్రాయాన్ని ఎరిగివుంటే అమెరికన్లు చేయవలసిన పనులు చేయగలుగు తారు. ఇంతకంటె ప్రపంచానుభవం అమెరికన్లకు మూడు విధాల హెచ్చు సహాయ కారి కాగలుగుతుంది.

మొదటిది—అది ఈ సమస్య విషయంలో అమెరికన్లు అధికంగా సతమతం కావడాన్ని తగ్గింపజేస్తుంది. జాతిదురభిమానం అమెరికన్లకొక్కళ్ళకే కాదు, చాలా

మందికి వుంది. కనుక అమెరికన్లొక్కళ్ళే పాపులేమోనని వగచే అవకాశం సన్నగిల్లుతుంది. ఇది అంతటా వున్న పాపం. అందరు మానవులలో, అన్ని నాగరి కతలలో, అన్ని సంస్కృతులలో ఈ కళంకం వుంది.

రెండవది—స్కూళ్ళ విషయంలో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పుమ అమలు జరిపించడానికై నీగ్రో న్యాయవాదులు, శ్వేతజాతి న్యాయవాదులు నిర్విరామంగా కృషిచేస్తూ వచ్చారు. దాన్ని అవగాహనచేసుకొని ఆనందించి ఆసియావాసులు, ఆఫ్రికావారు నీగ్రోల లక్ష్యాన్ని సమర్థించారు. వారిని చూచి అమెరికన్లు కూడా ధైర్యం తెచ్చుకోవచ్చు.

మూడవది—అభివృద్ధి అనేది కేవలం శాసనాలవల్ల మాత్రమే సాధ్యం కాదనీ, మానవుల హృదయాలు కూడా ముఖ్యమనీ లోకానుభవం చాటుతున్నది. తమ లోపాలను తాము తెలుసుకొనే వినయం అమెరికన్లకుంటే, ఇతరుల సహాయం పొందవలెనన్న అభిలాషవుంటే ఇతర ప్రజల ప్రత్యక్షానుభవం నుండి తెల్లవారు, నీగ్రోలు నేర్చుకోవలసిన గుణపాఠాలెన్నయినా వుంటాయి.

అమెరికా ఇరుగుపొరుగులోనే, అమెరికా సాటిపౌరులతో అనుదిన సంబంధాల విషయంలో నిర్మాణాత్మక కృషికి ఎంతైనా అవకాశముంది.

విచక్షణ విషయంలో అమెరికన్లకు గల చింతను దేశం మొత్తంపై సామాజికాభివృద్ధి కార్యక్రమాలకు మళ్ళిస్తే అద్భుతమైన ప్రగతిని సాధించవచ్చు.

మేసన్-డిక్సన్ శ్రేణికి ఉత్తరాన, దక్షిణాన గల పౌరుల జాబితా తయారు చేసేటప్పుడు ఈక్రింది అంశాలను కూడా చేర్చుకోవచ్చు.

పోలీసుదళంలో ఎంతమంది నీగ్రోలున్నారు? అగ్నిమాపకశాఖలో, సిటీ హాల్‌లో ఎంతమంది? స్కూళ్ళ విధానం ఏమిటి?

అట్టి ఉద్యోగాలు పొందడానికి నీగ్రోలకు పూర్తి అవకాశాలు వున్నాయా? వుంటే యోగ్యతనుబట్టి, సర్వీసులనుబట్టి వారికి ప్రమోషనులు లభిస్తున్నవా?

నీగ్రోలకు ప్రభుత్వంనుంచి, ప్రైవేటు సంస్థలనుంచి ఎట్టి గృహవసతి లభిస్తున్నది? ఎటువంటి వైద్యసహాయం, ఆసుపత్రి సేవలు లభిస్తున్నవి?

ప్రభుత్వ గృహవసతి విషయంలో, వినోద సౌకర్యాల విషయంలో ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని విచక్షణ చూపబడుతున్నదా?

ప్రైవేటు సంస్థలలో ఉద్యోగాల మాటేమిటి? నీగ్రో కార్మికులు వారి పూర్తి ప్రావీణ్యాన్ని చూపేందుకు అవకాశమిచ్చే ఉద్యోగాలు, పనులు లభ్యమవుతున్నవా?

నీగ్రోలకు వృత్తి విద్యలలో శిక్షణ ధారాళంగా లభ్యమవుతున్నదా?

పోలీసులు, కోర్టులు ఇతరులపట్ల వ్యవహరించినట్లే నీగ్రోలపట్ల కూడా న్యాయంగా వ్యవహరించడం వుందా?

ప్రతి పట్టణంలో మేయర్ నాయకత్వాన ప్రముఖపౌరులతో ఏర్పడే ప్రభుత్వే తరబృందాలు వాస్తవ విషయసేకరణోద్దేశంతో పరిశీలన జరిపితే పై ప్రశ్నలకు సమాధానాల విషయంలో సామాజికుల సమ్మతిని పొందవచ్చు. యథార్థాలు తేలిస్తే నిర్మాణాత్మకమైన ప్రజాస్వామిక కృషికి వీ లేర్పడుతుంది.

అట్టి కృషికి గున్నార్‌మిర్డల్ రచించిన "అమెరికన్ సమస్య" అనే గ్రంథం బాగా తోడ్పడుతుంది. ఏ హక్కులను తెల్లజాతివారు ఇవ్వడానికి సంసిద్ధులై వున్నారో ఆహక్కులనే నీగ్రోలు సాధించడానికి సంకల్పించి వుండడం ఆశాజనక మైన విశేషం. ఆ హక్కులు ఇవి: ఉద్యోగాలలో సమానావకాశం; సమానసాంఘిక భద్రత; గృహవసతి తగినంత లభ్యంకావడం; శాసనం అందరికీ సమంగా వర్తింపు కావడం.

ఈ పని చేయడానికి అమెరికన్ల కింకా వ్యవధివుందంటే నీగ్రో సోదర పౌరుల సహనశీలమును, ఓర్పును ప్రశంసించాలి. సర్వమానవులు స్వతంత్రులుగా, సమానులుగా సృజింపబడ్డారని అమెరికా స్వాతంత్ర్య ప్రకటనలో అమెరికన్లు ఉద్ఘాటించి 185 యేండ్లు అవుతున్నవి. ఆ తర్వాత 90 ఏండ్లకు బానిసలకు అమెరికన్లు స్వేచ్ఛ ఇచ్చారు. మరొక 90 ఏండ్లకు అమెరికా పాఠశాలల్లో నీగ్రో పిల్లలు, తెల్లజాతివారి పిల్లలు కలిసి చదువుకోకుండా నిర్బంధపు కేటాయింపు అమలు జరపడం రాజ్యాంగ విరుద్ధమని తీర్మానించారు.

ఇక వివరణలకూ, సంజాయిషీలకూ సమయం దాటిపోయిందన్న సంగతి ప్రతి అమెరికన్‌కూ తెలుసు. ఇప్పుడు కావలసింది క్రియ. అన్ని మతాలవారికీ, అన్ని జాతులవారికీ సమానావకాశాలు వుండాలి. వీటిని ఎవరికీ నిరాకరించలేరు. కాబట్టి అమెరికా న్యాయస్థానాలు తీర్పుచెప్పిన ప్రకారం, అమెరికన్ల అంతరాత్మలు ఉద్ఘోషించిన ప్రకారం కర్తవ్యోన్ముఖులు కావాలి.

# 16

## నైతికపాతము

ఆధునిక అమెరికన్ సమాజానికి తగు నైతిక చట్రం సమకూర్చ లేకపోవడం ఈతరం వారి లోపమేనని శ్రీ బౌల్స్ స్మిత్ కాలేజీ పట్టభద్రుల తరగతి సమావేశంలో ప్రసంగిస్తూ హెచ్చరించారు. ఆ తరగతిలో శ్రీ బౌల్స్ కుమార్తె కూడా విద్యార్థిని. ఇది స్మిత్ కాలేజీ ప్రారంభోపన్యాసం—1960 జూన్ 5 వ తేదీన.

చరిత్ర అనేది మీ తల్లిదండ్రుల తరంపట్ల కొంత ఓర్పు వహిస్తుందేమో కాని మీపట్ల వహించదు. మాకు ఎట్టి శిక్షణలేదు. మాకు అంటే మీ తల్లిదండ్రులకూ నాకూ. అయినా మేము ఎట్టి ప్రపంచంలో నివసించవలసి వచ్చిందో, ఎలా నిర్వహించుకుపోవలసిన అగత్యం వచ్చిందో అవి అన్నీ శిక్షణలేకుండానే గ్రహించి సర్దుకుపోయాము. ఆ పరీక్షలో నెగ్గాము.

ఉదాహరణకు మాతరం ప్రపంచ వ్యవహారాలలో అమెరికా వేరుపాటు ధోరణిని అంతమొందించింది. మరి అధోరణి 130 ఏండ్ల సంప్రదాయం గలది: మా తరం ఆర్థికసాంఘిక దురవస్థను గమనించి అమెరికా జాతీయైక్యతకు ఒకకొత్త అర్థాన్నీ, ఒకకొత్త గాఢత్వాన్నీ కలుగజేసింది. ప్రపంచయుద్ధానంతరం మాతరం ధైర్యంచేసి మార్షల్ పథకం, ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక, పాయింట్‌ఫోర్ కార్యక్రమం, పరస్పరభద్రతా కార్యక్రమం మొదలగు నిర్మాణాత్మక పథకాలు ప్రవేశపెట్టింది.

సాంకేతికంగా అమెరికన్లు సాధించిన విశేషాలను తలచుకొని అమెరికన్లలో

కొందరు పిరికివారు ఆందోళన చెందుతారు. మన ఆవులు ఎక్కువ పాలిస్తున్నాయట! మన కొత్తయంత్రాలు మరీ ఎక్కువ ఉక్కును ఉత్పత్తి చేస్తున్నాయట!

నిజం చెప్పాలంటే అమెరికన్లింకా సాధించవలసిన వాటిని సాధించలేక పోయారు. ప్రపంచంలో ఆకలిగొన్న శిశువులకు పాలు అందజెయ్యగలుగుతున్నారా?

ఏమైనా మీరు మమ్మల్ని మరీ కఠినంగా విమర్శించవద్దని మీ తల్లిదండ్రుల తరపున, మాతరంవారి తరపున నేను మిమ్మల్ని కోరుతున్నాను. మేము లేచి నిల్చోవడంలో వంకరలున్నాయేమో కాని నిలబడ్డాము. చారిత్రకమహాకార్యాలు సాధించాము. ముందు ముందు అదనంగా ఇంకేమైనా చేయవలసివుంటే వాటిని కూడా సాధించే స్తోమత, సంకల్పం భగవంతుడు మాకిచ్చుగాక.

అయినా అరమరలులేకుండా విశ్లేషణచేసుకోవలసిన సమయమిది. అమెరికనుఃఌ ఇన్నేండ్లనుంచీ చేస్తూవచ్చిన దానిలో అసలు ముఖ్యమైనది బలహీనంగా వుందేమో. అమెరికన్లకు సరిగాతెలియని అనేక కొత్తసమస్యల పరిష్కారంలో పడి అమెరికన్ సమాజ ఆరోగ్యానికీ, దార్ఢ్యతకూ ముఖ్యమైన మానవధర్మాలను నిర్లక్ష్యం చేశామేమో.

సంగనాచులనూ, కాలాంతకులనూ, దేవాంతకులనూ అమెరికనులు క్షమించారు. కొన్నిసందర్భాలలో వారిని నెత్తినకూడా పెట్టుకున్నారేమో. అమెరికనులు చేసిన ప్రశంసనీయ కార్యాలను వివరించడానికి పదజాలాన్ని ప్రయోగించారు. అమెరికా చర్యలకు అసలు కారణాలు పైకి ఎంత సభ్యమైనవిగా కన్పిస్తాయో నిజానికి అంత సభ్యమైనవికావని నిరూపించడానికి సభ్యతను సమర్థింప ప్రయత్నించడం అవసరమని భావించారు.

ఉదాహరణకు నీగ్రో పౌరులకు మొదటితరగతి పౌరసత్వం ఇవ్వడానికి సమయమాసన్నమైనదని అంటున్నారు. ఎందుకు? "సర్వమానవులు సమానులుగా సృష్టింపబడ్డారు" అని అమెరికా స్వాతంత్ర్య ప్రకటనపత్రం ఉద్ఘాటించిన 180 ఏండ్ల వరకూ నీగ్రోలు వేచివున్నారనికాదు, మానవజాతిలో అధికసంఖ్యాకులైన ఆసియా ఆఫ్రికా రంగుజాతులవారు అమెరికా మెడలుపట్టి వంచుతున్నారు కాబట్టి.

అమెరికా కాలేజీలకు, విశ్వవిద్యాలయాలకు అత్యవసరంగా కావలసిన స్కాలర్‌షిప్పులకు ప్రజల మద్దతు పొందడానికై అమెరికన్లు అమెరికా శాసనానికి

"జాతీయరక్షణ విద్యాచట్టం" అని పేరుపెట్టారు. పైగా కమ్యూనిస్టు వ్యతిరేకతకూ దానికీ సంబంధంలేదని చెబుతారు. విధేయతాప్రతిజ్ఞలు చేర్చారు.

అమెరికా విదేశీసహాయ కార్యక్రమం కొత్తదేశాలలో దారిద్ర్యాన్నీ, అవిద్యనూ, అనారోగ్యాన్నీ నిర్మూలించడానికి ఉద్దేశింపబడింది కదా. అలా జరిగినప్పుడు ఆ దేశాలు వాటివాటి సంస్కృతులను పాటిస్తూనే స్వేచ్ఛగా మనవచ్చు. కాని దీనిని అమెరికన్లు సగర్వంగా చెప్పుకోరు. పైగా అమెరికన్లు చేసే సహాయం ముఖ్యోద్దేశం ఐక్యరాజ్యసమితిలో మిత్రులను, అనుచరులను సంపాదించుకోవడమేననీ, వ్యాకులం చెందేవారు లేనిపోని ప్రశ్నలు అడగకుండా చేయడానికనీ, ఖాళీ పొట్టలను నింపడానికనీ చెబుతారు. పొట్టలు నిండితే వారు తాము నివసించే మధ్యయుగపు ఫ్యూడల్‌వ్యవస్థలనూ, వాటి అన్యాయాలనూ, పీడనలనూ సహించగలరని అమెరికన్ల వెర్రినమ్మకం. అలా సహించి అమెరికన్లతోపాటు యథాస్థితిని బలపరుస్తారని అనుకుంటారు.

ప్రపంచవ్యవహారాలలో తప్పులు చేసినప్పుడు కూడా "జాతీయరక్షణ" కోసం వాటిని చేశామని చెప్పి అమెరికన్లను అమెరికన్లు సమర్థించుకుంటారు. ఉదాహరణకు బ్రిటిషు సైకిళ్ళపైన, విదేశీవస్త్రములపైన సుంకాలను హెచ్చించడం వంటివి.

అస్తవ్యస్తంగావున్న ఈ నూత్నప్రపంచాన్ని చూచి అమెరికనులు భయపడుతూ నిరాశ చెందుతూ అమెరికా జాతీయ ముఖ్యలక్ష్యం మానవ ప్రతిపత్తిని కాపాడటమేనన్న అంశాన్ని మరచిపోయి, రష్యావారు ఏమిచేసినా దానికి ఎదురుదెబ్బ తీయడమే అమెరికా గమ్య మన్న భ్రమలో పడ్డారు.

విదేశాలలో కమ్యూనిస్టులను మించిపోవాలని ప్రయత్నిస్తూ స్వదేశంలో అందుకు భిన్నంగా వ్యవహరిస్తారు. రాజకీయవాదులు, పత్రికారచయితలు, వ్యాపారులు, చివరకు కాలేజీ ప్రొఫెసర్లు సైతం వారి ఉదార కార్యకలాపాలకు ఏవో వెర్రిమొర్రి కారణాలు చెబుతూ వుంటారు.

ఉన్నతపదవులలో వున్నవారి విషయంలో పుకార్లు, వదంతులు బయలుదేరినప్పుడూ, అధికార దుర్వినియోగం జరిగిన సందర్భాలు వినవచ్చినప్పుడూ అమెరికన్లు తాపీగా, ఏముందిలే, అంతా రాజకీయాలు అని నవ్వి, అసలు విషయాన్ని దాటవేస్తారు.

తమ ప్రాంతంలో కేవలం రాజకీయపు వత్తిడులవల్లనే తాము నీగ్రో హక్కులకు అనుకూలంగా ఓటువేస్తూవుంటామని ఉత్తరాది పదవీవ్యామోహపరులు దక్షిణాదినివున్న తమ సహచరులతో అంటూవుంటారు.

బాలుర వేసవిశిబిరాల నిధులకూ, ఆసుపత్రుల భవన నిధులకూ విరాళాలిచ్చే వణిక్ప్రముఖులు తమ వితరణలోగల ఆదర్శాన్ని మరుగుపరచి, అలా ఇస్తే తమ కంపెనీకి ప్రచారం జరుగుతుందని అంటారు. విరాళాలిస్తే పన్నుల మినహాయింపు వుంటుందికదా అని తేల్చివేస్తారు.

ఇదంతా చూస్తే నాకు నా ముఖ్యాంశం స్ఫురిస్తున్నది. ప్రపంచ సంఘర్షణలోని నిజస్థితి ప్రస్ఫుటమవుతున్న ఈ దశలో అమెరికన్లు మానవధర్మ విషమస్థితిని ఎదుర్కొంటున్నారు. ఒకవంక నైతికప్రమాణాలలో అమెరికన్లకు విశ్వాసముందని చెబుతారు. మరొకవంక పన్నుల ఎగవేత, దొంగలెక్కలు వ్రాయడం, మోసపు ప్రకటనలు చేయడం, పదార్థాల కల్తీ, తూకాలలో మోసం, హింసించి వినోదించడం వంటి అవినీతి కార్యాలను సహిస్తూ వాటిని జరగనిస్తూ వుంటారు.

ప్రపంచదృష్టిలో వెర్రివెంగళప్పలనిపించుకోకుండా వుండాలని అమెరికా తాపత్రయం. ఒకరి విమర్శకు ఎడమివ్వకూడదని అమెరికా పట్టుదల. వాదోపవాదాలను, తర్జనభర్జనలను నివారించాలని అమెరికా ప్రయత్నం. అమెరికనులు యథార్థవాదులమనీ, స్వప్నలోకాలలో సంచరించేవారు కారనీ నిరూపించుకోవాలన్న తహతహ. కాబట్టే అమెరికా విశ్వాసాలకూ, అమెరికా ఆచరణకూ మధ్య నైతికపాత మేర్పడింది. ఇది స్వేచ్ఛా సమాజంగా అమెరికా ఉనికికి అపాయకరమైనది కావచ్చు.

అసలుప్రశ్న మరొకటివుంది : ఇరవయ్యోశతాబ్ది అణ్వస్త్ర బీభత్సాని కవసరమైన సైనిక, సాంకేతిక, మానసిక భారాలను స్వేచ్ఛాసమాజం నిరవధికంగా ఓర్చగలదా ?

అమెరికాలో కొంతమందికి అణ్వస్త్ర ప్రతిష్టంభనలోనే ఏదో రక్షణ గోచరిస్తున్నది. ఆ ప్రతిష్టంభన కొనసాగితేనే తమకు భద్రత అనుకుంటారు. ఉద్రిక్తత పడలేటట్టుంటే ఉక్కిరిబిక్కిర వుతారు. పోయిపోయి చివరకు మారణహోమంలో చిక్కుకున్నాసరే, తమ ముక్కుకు సూటిగానే పోతామనీ, మంచిచెడులు చూడమనీ ఈ ప్రబుద్ధులంటారు.

ఈ మహాశయులు విలియంబట్లర్ ఈట్సు చెప్పిన జోస్యాన్ని రుజువుచేయడానికి కంకణం కట్టుకున్నవారు : "ఉత్తములకు విశ్వాసం, కృతనిశ్చయం వుండవు. అధములకు ఎక్కడలేని ఉత్సాహోద్వేగాలు" అని ఈట్సు అన్నాడు. ఈ ప్రబుద్ధులకు చిక్కులు, ముందువెనుకలు, మంచిచెడ్డలు, యుక్తాయుక్తాలు ఏమీ పట్టవు. ప్రత్యామ్నాయవిధానాలను ఆలోచించరు. ఆధునిక ప్రపంచంలో సమస్థితిని నిలబెట్టడానికి అవసరమైన నిపుణతను గూర్చి ఆలోచించరు.

మీటనొక్కితే ప్రపంచయుద్ధం ఆరంభంకాగల ఈ రోజులలో అట్టి ప్రబుద్ధులు కంట్రోలు రూములకు వెలుపలవుంటే ప్రపంచానికి మంచిది. ఐయోనెట్లు, మరతుపాకీల కాలంలోనే వీరు ప్రమాదకారులు. నేటి అణ్వస్త్రప్రపంచంలో వీరు సర్వనాశనానికీ కారకులవుతారు.

అమెరికా నిర్మాణాత్మక నాయకత్వం ఇప్పుడు పెద్ద సవాలు ఎదుర్కొంటున్నది. రష్యావారితో పోటీగా నిలబడటం పెద్ద సవాలుకాదు. నేటి విప్లవాత్మక ప్రపంచ స్వభావాన్ని గ్రహించడం, కమ్యూనిస్టుదేశాలలో ఏ యే శక్తులు పనిచేస్తున్నాయో తెలుసుకోవడం, మధ్యనవున్న ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజల ఆశలను ఆశయాలను బోధపరచుకోవడం అమెరికా కొక పెద్ద సవాలుగా వుంది. ఈ ప్రజలంతా ఈ ప్రపంచం వినాశకరమైన సోవియట్—అమెరికన్ సంఘర్షణలో చిక్కుకోకూడదని అనుకుంటున్నారు. అంతకన్న మంచిపరమార్థం ఈలోకాని కొకటి వుందని భావిస్తున్నారు.

ఈ సవాలును ఎదుర్కొబొయ్యే ఈ సమయాన అన్నా పోలిస్‌లో పట్టభద్రుల సమావేశంలో వుడ్రోవిల్సన్ అన్నమాటలు జ్ఞాపకమొస్తాయి:

అమెరికా వలె సుసంపన్నదేశాలు, శక్తివంతమైన దేశాలు, ఉత్సాహం ఆదర్శం గల దేశాలు వున్నాయి. కాని ఈ దేశాన్ని అమెరికన్లు నిర్మించింది అమెరికాకోసం అమెరికన్లు తాపత్రయపడటానికి కాదనీ, మానవజాతికి సేవ చేయడానికనీ అమెరికన్లు ఎన్నటికీ మరచిపోరాదు....తనకుతాను ఎంతగా సేవ చేసుకుంటుందో తక్కిన ప్రపంచానికి కూడా అంతే సేవచేయడానికి అమెరికా వలె మరేదేశమూ ఈ ప్రపంచంలో నిర్మితం కాలేదు."

ఈ ఆదర్శాన్ని అమెరికన్ సమాజంలో అన్నిస్థాయిలలో దృష్టియందుంచుకొని ముందంజవేశామంటే 5:3—4 అనే సంఖ్యల రూపంలో కొన్ని యుగాలనుండి అమెరికన్లకు అందిన ప్రాచీన మతవివేకాన్ని తిరిగి పొందగలుగుతారు: "కష్టాలలోనే అమెరికా కీర్తిప్రతిష్ఠలు. కష్టాలవల్ల ఓరిమి వస్తుంది. ఓరిమితో అనుభవం లభిస్తుంది. అనుభవమే ఆశాజ్యోతి."

———

# తా జా క ల ము

"ఒక్క ప్రజాస్వామిక ప్రభుత్వం మాత్రమే బహిరంగంగా గాని, లేక రహస్యంగా గాని మానవాళి హక్కులతో పోరాటం జరుపదు. వాటిని వ్యతిరేకించదు" అని థామస్ జెఫర్సన్ ఒక పర్యాయం అన్నాడు. అయినప్పటికీ ఇప్పుడు ప్రజాస్వామికం ఎదుర్కొంటున్న సవాలు మరెన్నడూ దాని నెదుర్కోలేదు.

ఏమి టాసవాలు? ఒకటి ప్రజాస్వామ్యవ్యతిరేక ఆదర్శం. ఇది ఒక బెదిరింపువలె వుంది. రెండవది సాంప్రదాయికమైన అమెరికా ఆదర్శం, మనోదృష్టి, వ్యక్తిగత బాధ్యతా భావం మొదలైనవి సన్నగిలిపోవడం.

అమెరికా సార్వజనీనలక్ష్యాన్ని సాధించాలంటే తిరిగి అమెరికా సూత్రాలకు అమెరికన్లు బద్ధులు కావాలి. అమెరికా స్వాతంత్ర్య ప్రకటన పత్రంలోని సత్యాలు నిత్యమైనవి. సర్వకాలాలకూ గొప్ప సత్యాలవి: "సర్వ మానవులు సమానులుగా సృజింపబడ్డారు. సృష్టికర్తయే మానవులకు పరులెవరూ సంక్రమింపజేసుకోలేనట్టి హక్కులను ఇచ్చాడు. అట్టి హక్కులలో జీవించేహక్కు, స్వేచ్ఛగా వుండేహక్కు, ఆనందసాధన ముఖ్యమైనవి" అని అందులో చెప్పబడి వుందంటే అది ఎంత మహత్తరమైనదో వేరే చెప్పనక్కరలేదు.

ఈ తరంవారు నేటి నవప్రపంచంలో ఈ సార్వజనీన సత్యాలను సాధించడానికి పూనుకోవాలి. అమెరికన్ల తాతముత్తాతలు వాటిని సిద్ధింపజేసుకోవడానికి ఎంత ఉత్సాహంతో, దీక్షతో సాధనచేశారో నేటి అమెరికన్లూ అలాగే కృషిచేయాలి. తుది ఫలితం సాధించడంలో అమెరికన్లకందరికీ వ్యక్తిగత బాధ్యతవుంది.

ఇంటా బైటా, స్వదేశంలో విదేశాలలో అమెరికన్లు ధర్మగుణంతో ప్రవర్తించాలి. స్వార్థం చూపకూడదు. కరుణచూపాలి. హింస పనికిరాదు. ప్రేమతో అందరినీ తమకు మిత్రులుగా చేసుకోవాలి. ద్వేషం కూడదు. అమెరికన్లపట్ల, అమెరికన్లకు, అమెరికన్ల భవిష్యత్తుపై అమెరికన్లకు, సర్వజనసౌభ్రాత్రంపై అమెరికన్లకు గల కృతవిశ్వాసాన్ని పునరుద్ఘాటించాలి.

ఆవిధంగా ప్రవర్తిస్తే అమెరికా తన సర్వరక్షణకు అవసరమైన భౌతికశక్తి విషయంలోనేగాక, శాశ్వతశాంతికి ప్రాతిపదికను సమకూర్చగలిగే మానవహక్కులపట్ల, మానవ గౌరవంపట్ల తనకుగల నైతిక బాధ్యతను నిర్వర్తించడంలో కూడా సాఫల్యం పొందగలుగుతుంది.

వాషింగ్టన్, డి. సి.
ఆగస్టు 17, 1962.

